# శ్రీకృష్ణభాగవతము

## ద్వితీయ భాగము

(అష్టమస్కంధము నుండి ద్వాదశస్కంధము వఱకు)

రచన:

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి



ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1997

**SRI KRISHNA BHAGAVATHAMU - Vol. II**

by

**Sripada Krishna Murthy Sastry**



T.T.D. Religious Publications Series No. 497

T.T.D. First Edition : 1997

Copies : 1000

Price : Rs. 58-00




Published by:
M.K.R. Vinayak, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati – 517 507.




Printed at:
Gayathri Art Printers,
Hyderabad - 500 029.

# ముందుమాట

భారతీయ సంస్కృతికి రామాయణ, భారత, భాగవతాలు ప్రమాణ గ్రంథాలు. వీటిలో ఒకటి కావ్యం, రెండవది ఇతిహాసం, మూడవది పురాణం. సంస్కృత భాషలో ఉన్న ఈ గొప్పగ్రంథాలను తరతరాలుగా తెలుగువారు వేర్వేరు సాహితీరూపాలలో అనువదింప చేసికొన్నారు; నేటికీ చేసికొంటూనే వున్నారు. ఈ పవిత్ర గ్రంథాల ప్రయోజనమూ, విశిష్టతా అలాంటివి! అయితే ఈ మూడు గ్రంథాలను ఒకే చేతిమీదుగా తెనిగించిన ఖ్యాతి 'కవిసార్వభౌమ' శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి ఒక్కరికే దక్కింది. ఇది ఒక విశేషం!.

ఆంధ్రదేశంలో భాగవత మహాపురాణానికి ఉన్నంతటి ప్రశస్తీ, ప్రచారమూ మరే గ్రంథానికీ లేదంటే అతిశయోక్తి కాదు. ఇందుకు రెండు కారణాలు: (1) శ్రీ కృష్ణుని అవతార గాథ విపులంగా వర్ణింపబడివుండటం, (2) బమ్మెర పోతన భక్తికవితా మాధుర్యం. ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షం, రుక్మిణీ కల్యాణం -- వంటి ఘట్టాలు, ఆ యా ప్రార్థన పద్యాలు ఇంటింటా తెలుగువారిచే ప్రతిదినమూ ఈ నాటికీ పారాయణ చెయ్యబడుతూ వస్తున్నాయి. దీనిని బట్టి, భాగవతం ఆంధ్ర ప్రజాజీవితంలో మమేకంగా కలిసిమెలిసి పోయిందని చెప్పవచ్చు.

అయితే, పోతనామాత్యుడు వ్యాసుని రచనను ఆంధ్రీకరించడంలో అక్కడక్కడ మూలాన్ని అతిక్రమించాడనీ, అందువల్ల, -- ఆదినుండి ఆఖరుదాకా సంస్కృతమూలానికి మిగుల విధేయమైన అనువాదాన్ని తెనుగు ప్రజానీకానికి అందించాలి -- అనే పూనికతో శ్రీపాదవారు ఈ శ్రీకృష్ణభాగవతాన్ని రచించినట్లు ఇందులో పేర్కొనబడింది. ఇక, ఈ గ్రంథనామధేయం కూడా ఇందలి విషయాన్నిబట్టీ, ఈ రచయిత పేరునుబట్టీ -- ఉభయరీతులా సార్థకమై వుంది. ఈ గ్రంథం క్రీ.శ. 1952లో మెజస్టిక్ ముద్రాశాల, రాజమహేంద్రవరం వారిచే ముద్రిత

మైంది. ప్రస్తుతం ఆ ముద్రితప్రతినే యథాతథంగా ప్రచురించడం జరుగుతోంది. ఇపుడు మీ ముందున్న ఈ సంపుటం శ్రీ కృష్ణభాగవతంలోని మలి ఐదు స్కంధాల ద్వితీయభాగం.

మొదటినుండీ ఆధ్యాత్మిక, ధార్మిక సారస్వతాన్ని ప్రజానీకం అందుబాటు లోకి తీసికొని రావటానికి నిరంతర కృషిచేస్తూవున్న తిరుమల తిరుపతి దేవస్థానములు ఇంతకుమునుపు పోతనభాగవతాన్ని సంపుటాలుగా ప్రచురించడం జరిగింది. అదే ఉద్దేశంతోనే, ప్రతులు అలభ్యమైపోయిన ఈ భాగవతాన్ని -- ఆంధ్రరాష్ట్ర తొలి ఆస్థానకవి, శతాధిక గ్రంథకర్త, అభినవ శ్రీనాథుడూ అయిన ఈ మహాకవి తదేక దీక్షగా నాలుగే నాలుగు మాసాల్లో రచించిన ఈ "మోక్షగ్రంథాన్ని" తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణగా పాఠకలోకానికి సమర్పిస్తున్నాం.

ఈ రెండు భాగాలు ఆర్ష ధర్మజిజ్ఞాసువులకు, సాహితీ విమర్శకులకు సహాయకారులుగా ఉండగలవని మా విశ్వాసం.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# విషయసూచిక


1 స్వారోచిషాదిమనుచరిత్రము
4 గజేంద్రమోక్షణకథ
10 గజేంద్రుఁడు భగవంతునిఁ బ్రార్థించుట
14 శ్రీహరి ప్రత్యక్షమై గజేంద్రుని రక్షించుట
15 రైవతమన్వాదుల చరిత్రము
17 క్షీరసాగరమథన కథాక్రమము
18 దేవత లజితరూపుఁడగుహరినిఁ బ్రార్థించుట
21 అమృతోత్పాదనక్రమము
23 కూర్మావతారఘట్టము
24 హరుఁడు హాలాహలము పానముచేయుట
26 పాలకడలినైరావణాదులతో నమృతము పుట్టుట
29 మహావిష్ణువు మోహినీరూపమెత్తుట
30 దేవదానవులు మహాయుద్ధము చేయుట
34 శివుఁడు మోహినిం జూచి మోహావివశుఁ డగుట
36 మఱికొందఱు మన్వాదుల వృత్తాంతము
40 బలిచక్రవర్తి చరిత్రము
42 బలిచక్రవర్తి స్వర్గంబుఁ గైవసంబుచేసికొనుట
45 అదితి యింద్రజయంబు గోరి పయోవ్రత మొనర్చుట
48 వామనావతారఘట్టము
49 వామనమూర్తి బలికడకు వచ్చుట
52 వామనుఁడు బలిని మెచ్చి యాచించుట
58 వామనుని విశ్వరూపావిర్భావము
64 మత్స్యావతారకథాప్రారంభము
70 వైవస్వతమనువంశవృత్తాంతము
73 సుద్యుమ్నుఁ డిళ యనస్త్రీయై పురూరవుం గనుట
74 వైవస్వతునిపుత్రపౌత్రాదులు
77 తృణబిందుని పుత్రపౌత్రవర్గము
78 సుకన్యాచ్యవనుల చరిత్రము
80 సుకన్యకడకు నశ్వినీదేవతలు వచ్చుట
83 చ్యవనుఁ డశ్వినీదేవతలకు హవిర్భాగము కల్పించుట

85 రైవతుఁడు రేవతిని బలరామున కిచ్చి పెండ్లిచేయుట
86 నాభాగుని చరిత్రము
88 అంబరీష చరిత్రము
98 ఇక్ష్వాకువంశానుక్రమణిక
99 పురంజయోపాఖ్యానము
101 మాంధాతపుత్రికలం బెండ్లియాడిన సౌభరి వృత్తాంతము
104 పురుకుత్సుని చరిత్రము
105 హరిశ్చంద్రుని చరిత్రము
118 సౌదాసుని శాపప్రకారము
121 శ్రీరామచరిత్రము
129 ఇక్ష్వాకుసుతుఁడైన నిమి చరిత్రము
132 చంద్రవంశావతారము
133 పురూరవుని చరిత్రము
138 పరశురాముని చరిత్రము
146 యయాతి చరిత్రము
150 యయాతి దేవయానిం బెండ్లియాడుట
154 పూరువంశానుక్రమణిక
155 దుష్యంతుని చరిత్రము
156 భరతోపాఖ్యానము
157 భరద్వాజుని జన్మవృత్తాంతము
158 రంతిదేవుని చరిత్రము
161 చంద్రవంశాభివర్ణనము
167 యదువంశచరిత్రము
177 వసుదేవుఁడు పెండ్లియాడి భార్యతో బయలుదేరి వచ్చుట
179 వసుదేవుఁడు కంసు ననునయించుట
181 వసుదేవుఁడు మొదటికొడుకును గంసునకు జంప నిచ్చుట
182 కంసుఁడు దేవకీవసుదేవులఁ గారాగారంబునం బెట్టుట
183 విష్ణుదేవుఁడు యోగమాయ నిలం బుట్టఁ బుచ్చుట
184 శ్రీకృష్ణావతారఘట్టము
185 బ్రహ్మరుద్రాదులు గర్భస్థుఁడైన హరిం బ్రస్తుతించుట
187 శ్రీకృష్ణుఁడు దేవకీదేవికిం బుట్టుట
188 వసుదేవుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట

190 దేవకీదేవి స్వామిని స్తుతించుట
191 దేవకీవసుదేవుల పూర్వజన్మవృత్తాంతము
192 వసుదేవుఁడు వ్రేపల్లెఁ గృష్ణు నిడి యోగమాయం దెచ్చుట
193 దేవకీదేవి కూఁతుం జంపవలదని కంసుం బ్రార్థించుట
194 యోగమాయావిధానము
196 కంసుఁడు దేవకీవసుదేవుల విడిచిపుచ్చుట
198 నందుఁడు కుమారునకు జాతకర్మాదు లొనరించుట
201 నందుఁడు మధురాపురంబున కరిగి వసుదేవుం గాంచుట
203 కంసుని పంపున పూతకి వ్రేపల్లెకు వచ్చుట
208 నందాదులు మధురనుండి వచ్చుట
210 శకటాసురసంహారము
211 తృణావర్త సంహారము
213 యశోద కృష్ణునినోటిలోఁ బ్రపంచముం జూచుట
214 గర్గుఁడు వచ్చి రామ కృష్ణులకు జాతకర్మాదు లొనరించుట
216 రామకృష్ణుల బాలక్రీడలు
218 గోపికలు యశోదతోఁ గృష్ణుని కొంటెపనులం జెప్పుట
219 మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాదికము
222 యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము
223 కవ్వపుపాట—మోహనరాగము
224 ఉలూఖలబంధనము—యమళార్జునుల భంజనము
230 ఉపనందునిపంపున నందాదులు బృందావనంబుఁ జేరుట
232 వత్సాసుర బకాసుర సంహారము
240 గోపబాలురు కృష్ణునితోఁ జల్దు లారగించుట
241 వత్సాపహరణఘట్టము
243 శ్రీకృష్ణుండు గోవత్సంబులు గోపబాలురునై నటించుట
245 గోవత్సాదుల హరించిన బ్రహ్మ వచ్చి కృష్ణుని స్తుతించుట
246 బ్రహ్మదేవుఁడు శ్రీకృష్ణుని స్తుతించుట
250 శ్రీకృష్ణుఁడు బ్రహ్మ హరించిన గోపాలాదులం దెచ్చుట
254 శ్రీకృష్ణుఁడు బృందావనం బభివర్ణించి విహరించుట
255 ధేనుకాసురవధఘట్టము
257 కాళీయమర్దన కథాఘట్టము
259 మడుగునం దుమికిన కృష్ణుని గాళియాహి పట్టుకొనుట

261 అపశకునంబులం జడిసి వ్రజమువారెల్ల వచ్చి దుఃఖించుట

262 యశోదానందులు కొడుకుం గాంచి పరితపించుట

264 శ్రీకృష్ణుండు కాళియాహిపడగలపైఁ దాండవమాడుట

266 నాగకాంతలు కృష్ణునిఁ బ్రార్థించుట

268 కాళియుండు శ్రీకృష్ణుని స్తుతించుట

271 కాళియుని పూర్వకథ

273 దవాగ్ని వర్ణనము

274 గ్రీష్మర్తు వర్ణనము

276 బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట

279 శ్రీకృష్ణుండు కారుచిచ్చు మ్రింగి గోపాలురం గాపాడుట

280 వర్షర్తు వర్ణనము

284 శరత్కాలము

287 శ్రీకృష్ణుండు వేణుగానము గావించుట

288 గోపికలు వేణుగానము విని చని మెచ్చుట

290 హేమంతఋతు వర్ణనము

291 గోపికావస్త్రాపహరణము

295 శ్రీకృష్ణుండు మునిసతుల నన్నంబు వేఁడఁబుచ్చుట

297 మునిసతు లన్నంబు తెచ్చి కృష్ణునకు నివేదించుట

300 శ్రీకృష్ణున కన్నమిడ నిరాకరించిన విప్రులు చింతించుట

302 శ్రీకృష్ణుఁ డింద్రయాగము మాన్పించుట

305 నందాదు లింద్రయాగము మాని పర్వతయాగము చేయుట

309 శ్రీకృష్ణుండు గోవర్ధనపర్వతం బెత్తుట

313 ఇంద్రుండు గోదేవితో వచ్చి కృష్ణుని శరణువేఁడుట

315 శ్రీకృష్ణుండు వరుణలోకమునుండి నందునిం దెచ్చుట

317 శరద్రాత్రి గానమొనర్చు కృష్ణునికడకు గోపికలు వచ్చుట

319 శ్రీకృష్ణుండు వ్రేతలతో విరసోక్తులాడుట

321 వ్రేత లప్రియవాక్యములు విని వగచుచుం బ్రార్థించుట

324 శ్రీకృష్ణుండు వ్రేతల నాదరించుచు నంతర్ధానముగుట

325 వ్రేతలు కృష్ణుం గానక వనంబు నలుగడ నన్వేషించుట

326 శ్రీకృష్ణలీలాప్రదర్శనము

330 గోపికాగీతలు

332 శ్రీకృష్ణుండు వ్రేతలకు దర్శనమిచ్చి లాలించుట

335 రాసక్రీడాభివర్ణనము
338 జలక్రీడాభివర్ణనము
342 అడవిలో శయనించిన నందుని కొండచిలువ మ్రింగుట
343 నందుని మ్రింగు సర్పమును కృష్ణుఁడు సంహరించుట
345 శంఖచూడుఁ డనుగుహ్యకుని సంహరించుట
346 శ్రీకృష్ణలీలాపరిభ్రమణాదికము
348 శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట
350 నారదుఁడు వచ్చి కంసునకు రామ కృష్ణుల నెఱింగించుట
352 రామకృష్ణులం దేర నక్రూరుం బుచ్చుట
354 శ్రీకృష్ణుండు హయరూపుఁడగు కేశిం జంపుట
356 నారదాగమనము
358 వ్యోమాసురసంహారము
359 అక్రూరుఁడు వ్రజంబునకు వచ్చుట
361 అక్రూరుఁడు రామ కృష్ణ దర్శనంబు చేయుట
365 గోపికలు కృష్ణప్రయాణము విని పరితపించుట
367 అక్రూరుఁడు యమునలో రామ కృష్ణుల దర్శించుట
369 అక్రూరస్తవరాజము
374 రామ కృష్ణులు మధురానగరవీథి విహరించుట
377 బలరామ కృష్ణులు వాయకాదుల ననుగ్రహించుట
379 శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట
380 శ్రీకృష్ణుండు యాగధనుర్భంగము గావించుట
381 కంసునకు దుర్నిమిత్తము లగుట
383 శ్రీకృష్ణుఁడు కువలయాపీడమనుగజమును సంహరించుట
385 బలరామ కృష్ణుల రంగస్థలప్రవేశము
387 బలరామ కృష్ణులు చాణూరముష్టికుల సంహరించుట
390 శ్రీకృష్ణుండు కంసునిం బట్టి వధించుట
393 రామ కృష్ణులు దేవకీవసుదేవుల చెఱ మాన్పుట
,, ఉగ్రసేనుని మాధురంబుల కధిపతిం జేయుట
395 రామకృష్ణులు నందయశోదల నంపిపుచ్చుట
396 రామ కృష్ణులు కృతోపనీతులై సాందీపనికడ విద్యలు నేర్చుట
397 రామ కృష్ణులు మృతుండైనసుతుం దెచ్చి గురుదక్షిణగా నిచ్చుట
399 శ్రీకృష్ణుఁ డుద్ధవుని గోకులంబునకుఁ బుచ్చుట

400 నందోద్ధవసంవాదము

405 వ్రేత లుద్ధవుని గని సంభాషించుట

407 భ్రమరగీతలు

410 వ్రజకాంత లుద్ధవునితోఁ దమపరితాపంబు చెప్పుకొనుట

414 శ్రీకృష్ణుఁ డుద్ధవునితోఁ గుబ్జాగృహంబునకుం జనుట

415 శ్రీకృష్ణుఁడు రామోద్ధవులతో నక్రూరునింటి కరుగుట

416 శ్రీకృష్ణుఁ డక్రూరు నభినందించుచుఁ గరిపురికిం బుచ్చుట

419 అక్రూరుఁడు ధృతరాష్ట్రాదులతోఁ బ్రసంగించి వచ్చుట

,, జరాసంధుఁడు మధురమీఁదికి దండెత్తి వచ్చుట

426 సముద్రమున ద్వారకాపట్టణము నిర్మించుట

427 శ్రీకృష్ణుఁడు కాలయవనుఁడు వెంటనంటఁ బరువెత్తుట

429 ముచుకుందుని వృత్తాంతము

431 ముచుకుందుఁ డెఱింగి శ్రీకృష్ణుని స్తుతించుట

435 జరాసంధుఁడు ప్రవర్షణగిరిని దహించుట

436 రుక్మిణీకళ్యాణ కథాఘట్టము

438 రుక్మిణీసందేశము

441 శ్రీకృష్ణుఁడు విదర్భాపురికిం జని రుక్మిణిం దెచ్చుట

443 పెండ్లికూఁతు రగు రుక్మిణి కృష్ణునిరాకకై ప్రతీక్షించుట

447 భవానిం గొలిచివచ్చు రుక్మిణిని శ్రీకృష్ణుం డపహరించుట

449 రుక్మి కృష్ణు నెదిరించి పరాజితుఁ డగుట

453 శ్రీకృష్ణుఁడు రుక్మిణిం బెండ్లియాడుట

454 ప్రద్యుమ్నోపాఖ్యానఘట్టము

455 ప్రద్యుమ్న జననము

456 శంబరుఁడుశిశువగుప్రద్యుమ్నునిందెచ్చి సముద్రములోఁబడవేయుట

458 మాయావతి మత్స్యగర్భమునఁ బ్రద్యుమ్నునిం గాంచుట

459 మాయావతి ప్రద్యుమ్ను నెఱిఁగి పెంచుట

461 మాయావతి ప్రద్యుమ్నునకుఁ దన్నెఱింగించుట

463 ప్రద్యుమ్నుఁడు శంబరుని సంహరించుట

466 మాయావతి ప్రద్యుమ్నునితో ద్వారకకు వచ్చుట

470 సత్రాజిత్తు – శ్యమంతకమణి

471 శ్రీకృష్ణునకు నీలాపనింద వచ్చుట

473 శ్రీకృష్ణుండు జాంబవంతు నోడించి శ్యమంతకమును దెచ్చుట

475 శ్రీకృష్ణుఁడు జాంబవతీ సత్యభామలం బెండ్లియాడుట
477 శ్రీకృష్ణుండు శతధన్వుని శిరంబు గోయుట
481 శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట
482 శ్రీకృష్ణుఁడు కాళిందిఁ బరిగ్రహించుట
483 శ్రీకృష్ణుఁడు మిత్రవిందా నాగ్నజిత్యాదులం బెండ్లియాడుట
486 నరకాసురసంహారాదికము
488 మురాసురసంహారము
489 నరకాసుర సంహారము
490 శ్రీకృష్ణుఁడు పదియాఱువేల కన్యలం బెండ్లియాడుట
492 శ్రీకృష్ణుఁడు రుక్మిణితో విరసోక్తులాడుట
496 శ్రీకృష్ణుని పుత్ర పౌత్ర ప్రపౌత్ర వర్గము
498 ప్రద్యుమ్ముని వివాహఘట్టము
501 బాణాసురుని వృత్తాంతము
502 ఉషాకన్య స్వప్నవృత్తాంతము
504 చిత్రరేఖ చిత్రంబులం జూపి యనిరుద్ధుం దెచ్చి యిచ్చుట
506 బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధుం జేయుట
507 నారదోపదేశమునఁ గృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తుట
508 వామదేవ వాసుదేవుల యుద్ధము
510 శైవజ్వరము వైష్ణవంబునకోడి కృష్ణునిఁ బ్రస్తుతించుట
512 బాణుని రక్షింపుమని శివుఁడు హరిం బ్రార్థించుట
513 శ్రీకృష్ణుఁడు బాణు ననుగ్రహించుట
514 శ్రీకృష్ణుఁడు నూతంబడిన తొండ నుద్ధరించుట
515 నృగమహారాజు చరిత్రము
518 బలభద్రుండు ద్రేపల్లెకుం జనుట
521 శ్రీకృష్ణుఁడు పౌండ్రక వాసుదేవుని సంహరించుట
524 పౌండ్రకుని సుతుఁడు శ్రీకృష్ణునిచే మృతుఁడగుట
525 బలరాముఁడు ద్వివిదుఁడనువానరుని సంహరించుట
527 సాంబుఁడు స్వయంవరమున దుర్యోధనుని కన్యకం గొనుట
530 బలరాముఁడు హస్తినాపురము గంగలోఁ ద్రోయఁబోవుట
533 నారదుఁడు శ్రీకృష్ణప్రభావ మెఱుంగఁగోరి సంచరించుట
539 నారదుఁడు ధర్మరాజురాజసూయము నెఱవేర్పుమని చెప్పుట

541 శ్రీకృష్ణుండు సపరివారంబుగా నింద్రప్రస్థంబున కరుగుట
540 ధర్మరాజు తమ్ముల దిగ్విజయంబు సేయఁ బంపుట
545 శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని జయింపఁజనుట
546 భీముఁడు జరాసంధునిఁ జీల్చిచంపుట
548 శ్రీకృష్ణుఁడు జరాసంధబాధితులగు రాజుల విడిచిపుచ్చుట
549 ధర్మరాజు రాజసూయాధ్వరము
551 ధర్మరాజు రాజసూయంబునఁ గృష్ణు నర్చించుట
553 శ్రీకృష్ణుండు శిశుపాలునిఁ జక్రంబున నుక్కడంచుట
555 దుర్యోధనుఁడు మయసభం జూచుచుఁ బరిభావితుండగుట
556 సాళ్వుఁడు విమానంబెక్కి ద్వారకపై నెండెత్తుట
561 శ్రీకృష్ణుఁడు సాళ్వునితోఁబోరి తెగ సేయుట
563 శ్రీకృష్ణుండు దంతవక్త్ర విదూరథాదుల సంహరించుట
565 బలరాముండు తీర్థయాత్రికుఁ జనుట
568 కుచేలోపాఖ్యానము
577 కుచేలుని మహాదైశ్వర్యము
,, శ్రీకృష్ణుఁడు సపరివారముగా గ్రహణస్నానమునకుఁ బోవుట
582 బంధుజను లన్యోన్యకుశలప్రశ్నములు చేసికొనుట
584 కృష్ణపత్నులు ద్రౌపదికిఁ దమతమ పెండ్లితెఱంగెఱింగించుట
587 నారదాదిమహర్షులు శ్రీకృష్ణుని దర్శనము చేయుట
589 వసుదేవుఁడు యజ్ఞము చేయింపుఁడని ఋషులంగోరుట
590 నారదాదులు వసుదేవునిచే యజ్ఞము చేయించుట
593 వసుదేవుఁడు రామ కృష్ణుల నభినందించుట
595 రామ కృష్ణులు మృతులైన సోదరులం దెచ్చుట
598 సుభద్రాపరిణయ వృత్తాంతము
603 శ్రీకృష్ణుండు ఋషులతో మిథిల కరుగుట
608 శ్రుతిగీతాసారము
612 పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవాప్రాశస్త్యముం దెలుపుట
614 వృకాసురుని వృత్తాంతము
616 భృగుమహర్షి త్రిమూర్తులం బరీక్షించుట
617 శ్రీకృష్ణుఁడు మృతులైన విప్రసుతుల బ్రదికించుట
625 నారదవసిష్ఠాది మహర్షులు పిండారకతీర్థమునకు వచ్చుట

627 మునిశాపంబున సాంబునకు ముసలంబుపుట్టుట
628 వసుదేవునికడకు నారదుండు వచ్చుట
629 నారదుండు వసుదేవునకు విదేహార్షభసంవాదము చెప్పుట
630 కవ్యాదులు విదేహునకుఁ జేయు పరమార్థోపదేశము
632 భాగవతస్వరూప నిరూపణము
634 విష్ణుమాయాపరిభావము
637 ప్రబుద్ధుండు చేసిన పరమార్థోపదేశము
638 భక్తిలక్షణములు
639 పిప్పలాయనుండు చెప్పిన బ్రహ్మస్వరూపము
640 కర్మయోగనిర్వచనము
641 ఈశ్వరపూజావిధివిధానము
642 ద్రమిళుండుచెప్పిన భగవదవతార విశేషములు
644 భగవంతుని దివ్యావతారములు
648 యుగభేదముల భగవంతునిరూపభేదములు
649 బ్రహ్మాదులు కృష్ణదర్శనముచేసి ప్రార్థించుట
652 శ్రీకృష్ణుండు దుర్నిమిత్తంబులు యాదవుల కెఱింగించుట
653 ఉద్ధవుండు శ్రీకృష్ణునితో సంభాషించుట
655 శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బరమార్థోపదేశము చేయుట
656 అవధూత యదు సంవాదము
657 అవధూత చెప్పిన గువ్వలకథ
660 అవధూత చెప్పిన పింగళ యనువేశ్య కథ
665 శ్రీకృష్ణుం డుద్ధవున కెఱింగించిన బంధమోక్షతత్త్వము
674 శ్రీకృష్ణుండు చేసిన తత్త్వోపదేశము
676 శ్రీకృష్ణుఁ డెఱింగించిన హంసోపాఖ్యానఘట్టము
681 ఈశ్వరధ్యానలక్షణము
684 శ్రీకృష్ణుఁ డణిమాదిసిద్ధు లెఱింగించుట
693 ఆశ్రమవిధిప్రసంగము
697 భక్తియోగముఖ్యకారణములు
698 యమనియమాదినిర్వచనము
702 తత్త్వనిర్ణయముచేయుట

713 సాంఖ్యయోగోపదేశము
718 ఈశ్వరారాధనవిధానము
721 యోగసాధనసంపత్తి
726 ఉద్ధవుఁడు కృష్ణుని వీడ్కొనిపోవుట
729 యాదవులు ప్రభాసతీర్థమున నొండొరులు పోరి చచ్చుట
730 బలరామ కృష్ణులు వైకుంఠమున కరుగుట
736 భవిష్యద్రాజాదుల వృత్తాంతము
739 కలికాలధర్మప్రకాశిక
741 కల్క్యవతారము
744 కృతాది యుగధర్మనిర్వచనము
748 యుగాది ప్రమాణకథనము
749 శుకుఁడు రాజునకుఁ జావులేమి నెఱింగించుట
753 పరీక్షిత్తు తక్షకదష్టుఁడై మృతినొందుట
754 జనమేజయుఁడు సర్పయాగము చేయుట
757 సూతుఁడు శౌనకాదులకు జెప్పిన వేదభాగక్రమము
759 యాజ్ఞవల్క్యునిచరిత్రము
762 పురాణనామసంఖ్యాపరిగణనము
764 మార్కండేయమహాముని చరిత్రము
767 మార్కండేయునకు నరనారాయణులు దర్శన మిచ్చుట
769 మార్కండేయుండు ప్రళయార్ణవంబున విహరించుట
772 మార్కండేయునకుఁ బార్వతీపరమేశ్వరులు దర్శన మిచ్చుట
774 సూతుఁడు పంచరాత్రాగమాదిక మెఱింగించుట
775 ఆదిత్యాధిదేవతాప్రత్యధిదేవతాకథనము
778 భాగవతకథానుక్రమణిక
779 భాగవతఫలశ్రుతి

—:o:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## అష్టమస్కంధము

—:0:—

క. శ్రీమత్సాగి కులార్ణవ
సోముఁడవై సూర్యనామశోభితుఁ డగుచున్
హేమించురాజచంద్రుఁడు
శ్రీమంతుం డగుచుఁ గళలఁ జెన్నలరారున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు భగవద్ధ్యానా
సక్తచిత్తుం డగువిష్ణురాతుండు బ్రహ్మరాతునిం గాంచి యి ట్లనియె.

మ. ప్రణుతంబై తగునట్లు నీవు వినుపన్ స్వాయంభువాదంత మా
తనివంశంబు మరీచిముఖ్యులమహోద్యత్సర్గమున్ వర్ణధ
ర్మనిబద్ధోన్నతకర్మసంచయము సర్వంబున్ వచింపంగ విం
టిని మర్యాద లవెల్ల నామనమునన్ దీపించెడిన్ వెండియున్. 3

చ. మనువులు తక్కునుం గలుగుమాన్యులు వారలకాలమందు వి
ష్ణునియవతారముల్ క్రియలు శోభనచర్యలు రాఁగ నున్నభూ
జనవరవార్తలున్ వినఁగ స్వాంత మగుం దయచేసి సర్వమున్
వినుచు మటంచు వేఁడుటయు విన్నను వొప్ప నతండు వెండియున్. 4

క. ఏతత్కల్పమునందు న
తీతము మనుషట్క మందు దీపితధర్మ
వ్రాతం బంతయుఁ దెలిపితి
నీతఱిఁ దెలిపెదను మఱియు నేర్పడ వినుమా. 5

— స్వారోచిషాదిమనుచరిత్రము —

సీ. ఆద్యమను వగుస్వాయంభువాఖ్యునకు నా
కూతియునున్ దేవహూతి యనఁగ

కూఁతు లిర్వురు వారు కోర శ్రీహరి వారి
కిం బుత్రితం బొందె నింబుమీఱఁ
గపిలయజ్ఞాఖ్యలం గైకొని వారిలోఁ
గపిలునిఁ దెలిపితి నిపుడు యజ్ఞ
వృత్తాంత మెఱిఁగింతు వినుము స్వాయంభువ
మనువు కామాదుల మమత విడిచి
తే. తనదుశతరూప యను సతి తవిలిరాగ
రాజ్యమును వీడి వనికి విరక్తుఁ డగుచుఁ
జని సునందానదీతీరమునఁ దపంబు
సలిపెఁ బాదైకమున నిల్చి సమలు నూఱు. 6
తే. ఇటు తపించుచు మను వప్డు హృదయమందు
వేరికిం గాన రాకుండ వివిధదేహ
ములను శ్రీవాసుదేవుఁడు వెలయుచుండు
ననుచుఁ దెలియుచు నుండు నాఘనభుజుండు. 7
సీ. విశ్వ మెవ్వనిచేత వెలయుచుండునో వాని
నది వెలయింపఁ జేయనిద యగును
జగ మెల్ల నిద్రింప జాగరూకుం డయి
యెవ్వఁడు సకలంబు నెఱుఁగుచుండు
నాత్మచే సంవ్యాప్యమగు విశ్వ మంతయు
స్వార్థముగా నెంచు టయితి గాదు
కాన రాకుండును గాంచుచు నంతయుఁ
దా నుండు సర్వభూతానుగుఁ డయి
తే. ఎవని కాద్యంతమధ్యము లెనఁగ కుండ
వెలుపలను లోపలను దాన వెలయుచుండు
నట్టివిశ్వకాయుని గోప్త నజుఁ బురాణు
నవ్యయుని సంస్మరించెద నహరహంబు. 8

వ. అని యనేకవిధంబుల నుపనిషదర్థగోచరుం డగుసర్వేశ్వరు సర్వ
భావంబుల సంస్మరించుచున్న సమయంబున. 9

ఉ. వానినిఁ బట్టి మ్రింగుటకు వాంఛ పొనర్చుచు యాతుధాను లా
యానరభోజులం గలిగినట్టిరయై చనుదెంచి యున్నచో
నానలినాయతాక్షునివరాంశమునన్ జనియించినట్టియ
జ్ఞానఘమూర్తి దేవవృతుఁడై పరతెంచి హరించె దైత్యులన్. 10

వ. ఇట్లు సర్వరాక్షసుల సంహరించి తాన దేవేంద్రుండై త్రివిష్టపంబులం
బరిపాలించె నిది ప్రథమమనువృత్తాంత మింక ద్వితీయమనువు
స్వారోచిషుండు. 11

సీ. స్వారోచిషుం డగ్నిసంభవుం డతనికు
మారులు ఘనులు ద్యుమత్సుషేణ
రోచిష్మదాదులు రూఢికెక్కిరి రోచ
నుం డింద్రుఁడై యేలె మండలముల
నమరులు తుషితాదు లనఘు లూర్జస్తంబ
ముఖ్యులు సప్తర్షిముఖ్యు లరయ
వేదశిరస్కుఁ డన్ విఖ్యాతుఁ డగుఋషి
వరునకుఁ దుషిత యన్ గరితయందు

తే. విభు వనెడుపేర శ్రీమహావిష్ణు వెసఁగి
యెనుబదియు నెన్మిదియు వేల ఋషులు తన్నుఁ
బరిచరింపఁ గుమారకబ్రహ్మచారి
యయి ధృతవ్రతుఁడై వ్రత మాచరించె. 12

వ. తృతీయమనువు ప్రియవ్రతునిసుతుం డగునుత్తముం డతనికిఁ బావన
సృంజయ యజ్ఞహోత్రాదులు పుట్టిరి వసిష్ఠపుత్రు లగుప్రమథాదులు
సప్తర్షులు సత్యులు దేవశ్రుతులు భద్రులు లోనగువారు దేవతలు
సత్యజి త్తిందు్రిండు ధర్మునకు సూనృతయందుఁ బురుషోత్తముండు
సత్యసేననామంబునం బ్రఖ్యాతుండై సత్యవ్రతాదులతోడం బుట్టి సత్య

జన్మించెను తుండై దుష్టులగు యక్ష రాక్షసాదిభూతదోహభూతగణంబుల
సంహరించె నంత. 13

—◆ గజేంద్ర మోక్షణ కథ ◆—

సీ. ఉత్తమభ్రాతయై యొప్పు తామసుఁడు నా
ల్గవమను వయ్యె నక్కాలమందు
పదుగు రాతనిపుత్రవరులు వృషాఖ్యాతి
నర కేతుముఖ్యులు ధరణివిభులు
హరివీరసత్యకుల్ సురలు త్రిశిఖుఁడు వి
భుండు జ్యోతిర్వ్యోమముఖులు మునులు
వైధృతుల్ పాలించుపట్ల వేదంబులు
నష్టము లయ్యె నానాఁడు మఱియు
తే. హరి హరిణియందు హరిమేధుఁ డనఁగ నొప్పు.
ననఘునకుఁ బుట్టి గ్రహబద్ధుఁ డైనభద్ర
గజము విడిపించి కాచె ముక్తి కరుణఁ జేసి
యనిన శుకయోగిఁ గాంచి యి ట్లనియె నృపతి. 14

శా. గ్రాహం బేటికిఁ బట్టి గిట్టెఁ గరి నే ప్రాప్తిన్ మహావిష్ణు వా
గ్రాహంబున్ వధియించి ప్రోచెను గజేంద్రంబున్ మునీంద్రోత్తమా!
యూహం జేయుమనంబు దాని విన నా కింపొప్పఁగాఁ జెప్పవే
హాహా పుట్ట గజేంద్రమోక్షణకథన్ వ్యాఖ్యానముం జేయుచున్. 15

వ. అనిన శుకుం డి ట్లనియె. 16

మ. కల దద్రీంద్రము దుగ్ధవార్ధినడుమన్ గన్గొం దిక్కూటాఖ్యకై
కలధౌతాయస రౌప్య శృంగములఁ బ్రఖ్యాతంబునై రత్నధా
తులసత్ప్రస్తరమై మహాద్రుమలతాస్తోమావృతంబై ఝరీ
జలపాతాంచితమై సుపర్వతరుణీసంసేవ్యమై భవ్యమై. 17

తే. అప్సరోజుష్టకందరమై విచిత్ర
యోజితం బయి పదివేలయోజనముల

నిడుపు వెడలుపు గలిగి నిర్నిద్రపక్షి
మృగరవాక్రాంతమై యమ్మహీధ్ర మొప్పు. 18

వ. మఱియు మందార పారిజాత చూత కేతకీ క్రముక నారికేళ ఖర్జూ
రాదినానాభూరుహసమావృతంబును నానావిధమృగపక్షిసమూహ
సమంచితంబును కుంద కురవ కాశోక శిరీష పుష్పపరిమళమిళితమా
రుతపోతవిహారసంశోషకరంబును గీచకవేణునాదమేదురకందరముఖ
విహారద్విద్యాధర కిన్నరగరుడగంధర్వాభిశోభితంబునై కరంబు
డంబుమీఱు. 19

ఉ. కిన్నరగానశబ్దమును గీచకరంధ్రసముద్భవానిలా
త్యున్నతనాదముం గుహల నుండి జనించెడు సింహగర్జనం
బన్నిప్రదేశముల్ కలయు నట్లుగ నిండి మహోన్నతస్థితిం
మిన్నులు ముట్టి బిట్టడరి మీఁదను గ్రిందను భీప్రదం బగుం. 20

సీ. చిత్రచిత్రోన్నత ధాత్రీరుహాంచిత
దేవతోద్యాన సందీపితంబు
మృదుమధురస్వర విదితనానావిధ
విహగకూజిత శబ్ద విశ్రుతంబు
స్వర్ణమణీగణ సైకతకూల స
రోవరశతసహస్రావృతంబు
నాకసరోజాననా స్నానసంజాత
పరిమళమిళితాతి పవనగతము

తే. దేవతావారసంచార దివ్యభూత
లాతిరమణీయభాగము చూతకేత
కీపనససాలవర నారికేళ ముఖ్య
బహువిధద్రుమ కలిత మప్పర్వతంబు. 21

చ. అలగిరి కింతచెంతన మహావన మొక్కఁడు పెక్కులై కడుం
గలయిక నుండువృక్షములు గాం డ్రనువ్యాఘ్రముఖోగ్రజంతువుల్

గలిగి జగత్ప్రసిద్ధ మయి గ్రాలుచునుండెడు నందు నాడయే
న్గలు శతముల్ సహస్రములు గొల్వఁ గరీంద్రుఁ డొకం డెసంగెడున్.

సీ. వజ్రాహతికిఁ గాక వనులలో నడయాడు
పెనుగొండతండమో యనఁగ నొప్పి
కొండలు పగులంగఁ గొండముల్ పయి కెత్తి
మితిలేనిగతుల ఘీంకృతు లొనర్చి
పాదవిన్యాసముల్ పచరించుపట్టెల్ల
బరి గానవచ్చెడుపగిదిఁ దోఁప
మదధార లొలికి నల్పదములఁ బ్రవహింపఁ
గొండయే ళ్ళని జంతుకోటి భ్రమయ
తే. లేళ్లును వరాహములును దోడేళ్ళు కాఱు
దున్నలును మర్కటంబు లేదులును బెదఱఁ
జొచ్చె నన నేల మొల్లమై వచ్చువానిఁ
జూచి సింహాదులును బాఱఁ జొచ్చె నపుడు. 23

మ. కరిణీవారపరీవృతుం డగుచు వేడ్కం గాట మట్టాడునా
ద్విరదేంద్రుండు మధువ్రతంబులు కడుం దృప్తిన్ వహింపంగ న
ష్టరసస్థానములన్ మదద్రవము నిచ్చం బెట్టి యాతిథ్యమున్
వరుసల్ దీరగ నిల్పి చేసెఁ ద్రిజగద్వర్ణ్యంబుగా నత్తఱిన్. 24

ఆ. పట్టపగట వనుల నట్టిట్టు మెట్టుట
బెట్టిదంపుటెండ వేఁడిమిఁ బడి
దాహభరమువలనఁ దపియించి గజరాజు
జలము లరయుపొంటెఁ దిరిగెఁ గడల. 25

సీ. జలములపై నాడి జలజగంధముతోడఁ
గనవచ్చు చల్లనిగాలివలన
కమలకాండవినూత్న సముపేతపరిమళ
సహకారిజనసమాసంబువలన

భంగరంగచ్చక్రవాక కారండవ
హంసాదిపక్షిశబ్దాళివలన
నిరతకల్లోలవినిర్గత శీకర
సందోహసంస్పర్శసంధివలన
తే. కలదు కాసార మిం దని తెలిసి మదిని
మదకరేణువులుం దాను ముదము పొదల
ఘీంకృతులు చేసికొనుచును గ్రేళ్ళుదాటు
కొనుచు గజరాజు కాసారమునను జొచ్చె. 26
ఉ. చొచ్చి జలంబులన్ మునుఁగుచున్ వడి లేచుచు నీళ్ళు ద్రావుచున్
హెచ్చినతాపభారము నొకింతటిలోఁ దెగిపోవ నీళ్ళలన్
గ్రచ్చుటఁ బీల్చి తుండమునఁ గాయము నిండఁగఁ జల్లుకొంచు నిం
పెచ్చఁ గరేణువుల్ తనపయిన్ వడిఁ జల్లగ సంతసిల్లుచున్. 27
శా. ఘూత్కారధ్వని భూనభోంతరము సంపూర్ణస్థితి న్నిండుకోఁ
దత్కాలంబునఁ బద్మగంధజల మత్యంతంబుగా బీల్చి సం
పత్కాముం డయి మీఁది కెత్తి కరముం బైపైఁ బడం జల్లవేల్
సత్కాండమ్ములు పర్వినట్లు నభ మెంచ న్వచ్చె నిం పెచ్చఁగన్. 28
తే. అట్లు గజరాజు జలకేళు లాడుకొనుచుఁ
తనదుతుండాగ్రమున జలంబును గ్రహించి
సతులు సుతులును దనియంగ స్నాన మాడ
సలుపుచును నీరు ద్రావించె సరసునఁ బడి. 29
శా. కాసారం బదియంతయుం గలఁగిపోఁ గాఁ వించుచున్ - నీటిలో
వాసంబుండెడుజంతుసంతతులకున్ వ్యాఘాతముం గూర్చుచున్
గాసం బైనను జంకు డొం కెఱుఁగ కుత్కంఠన్ గరీంద్రంబు సం
తోసం బేర్పడఁ జేర్పడన్ జలములందుం గ్రీడఁ గావించుచున్. 30
క. తనకుం దోయము వారికి
ఘనతర మగుపీడ గలుగుకై వడి వడి గై

కొనుచు నిరంకుశగతి జల
మున నొండెఱుఁగక గజేంద్రము మెలంగుతఱిన్. 31

శా. దైవప్రేరణఁ జేసి గ్రాహ మొకఁ డాదంతీంద్రునిం గాంచి దా
దావొక్కింతన దాఁటి వచ్చి మకరేంద్రం బొండు రౌద్రాకృతిన్
గ్రావం బట్టులు గానవచ్చి మిగులన్ గర్వించునద్దానికా
ల్లావేగంబునఁ బట్టి యట్టె తిగిచెన్ హాహాయనన్ లోకముల్. 32

ఉ. గ్రాహము పట్టుటం దెలిసి గంధగజేంద్రము కాళ్లు లాగికొ
నూహ మొనర్చి హు మ్మనుచు నుద్గతి చేసెను జేసినంత నా
గ్రాహము నోటిబింకమున గట్టిగఁ బట్టి గ్రసింపఁ జొచ్చె ను
త్సాహము తప్ప కయ్యిభము దంతహతిన్ విదళించె దానినిన్. 33

మత్త. చుట్టి తొండము దానిమేనికిఁ జొప్పు దప్పెడుచొప్పునన్
బట్టి లాగెను గాని సుంతయుఁ బట్టు వీడక యోడ కా
గట్టివాయి గలట్టినక్రము క్రౌర్యమున్ ఘనశౌర్యమున్
మట్టు మీఱఁగ లాఁగె లోనికి మాటికిం బుస కొట్టునన్. 34

సీ. ఇనుపఱోకళ్ళకు నెనవచ్చుకొమ్ములఁ
గొట్టి పైచిప్పలు గుండఁ జేసి
కాలపాశమునకు డీలుపడనిచండ
తుండాగ్రమున దానిగుండెఁ జఱచి
వెనుకటికాళ్ళతో వెలికిలఁ బడ మెట్టి
నెట్టనఁ బిండి యౌనట్టు చేసి
యీ ర్దీసివేసిన ట్లిట్టె పట్టి సడల్చి
వేయ హస్తము నట్టె వేసి వేసి

తే. చేయఁ గలయట్టిచేతలఁ జేసి చేసి
కరి మకరిపట్టు తప్పుకో వెఱవు తోఁప
నట్టిదై కాళ్ళఁ గొమ్ముల హస్తమునను
వీఁగి పోవక పోరాడె ద్విపవరంబు. 35

ఉ. స్థానబలంబు గల్గి జవసత్త్వము లంతకు నంత కగ్గలం
బైనకతంబునన్ విడువనట్టిదియై మకరంబు వాలసం
స్థానమహాభిఘాతముల దంతిశరీరము శీర్ణమై చెడం
గా నొనరించి చంపి కొనఁగాఁ గలదయ్యె విధిప్రసంగతిన్. 36

చ. తమగమికాఁడు నక్రిముఖదారుణగహ్వరలగ్నదేహుఁడై
క్రిను మఱి యుండఁ గాంచి గజకాంతలు కొంతనరానియట్లు తుం
డములను గాళ్ళ నక్రమును నల్గఁగఁ జేసియు భర్త కెట్టిసా
యమును బొనర్పఁ జాలక మహావ్యసనంబున కైనయంతటన్. 37

శా. పోరాటం బది నాఁడు నాఁటికిని బెంపుం జెందున ట్లయ్యె నా
నీరాటం బొగిఁ గ్రిందికిం దిగువ దంతిశ్రేష్ఠ మెల్లనియున్
దీరం బెక్కఁగ మీఁదికిం దిగుచు నీటీఁబోక వేయేండ్లు కా
సారాంతర్జలమందుఁ బొందుకొనె విశ్రాంతిం గొనం బోనిదై. 38

తే. కరియు మకరియు రెండును సరిబలంబు
గలిగినట్టివ యయ్యు నక్కలన నాళ్ళు
గడవ నైనకొలంది నగ్గజముబలము
సగ్గె గ్రాహ మెచ్చెను జలజంతు వగుట. 39

చ. తన కొకలోమమాత్రకును దాళగలేనిది గ్రాహ మన్న దీ
నిని నిమిషాంతరంబునన నేఁ గడతేర్చెద నంచు నెంచి చే
త నయినచెయ్వు లన్నియు మృథంబునఁ జేసెను గాని దంతి దే
వుని చెయిదిన్ గ్రిమంబునను బొ ల్లయిపోయినపౌరుషంబునన్. 40

ఆ. ఒడలిమీఁదియాస చెడినట్టిదై కరి
కరము వెగడుగుడిచి కన్నుతెప్ప
పాటులోని దనుచుఁ బ్రాలుమాలితి నయ్యొ
యేకు మేక యయ్యె నేమి గతియొ. 41

ఉ. ఇఁక నే దీనిని గెల్తు నన్నహృదయం బేగెన్ క్షణం బన్నది
ట్లోక వేయేం డ్లయి పోయె నింద్రియబలం బుత్సాహమున్ శక్తియున్

మకరీంద్రుండు హరించె నాదయినప్రాణం బేగుటల్ నిక్క మా
నకటా! దయ్యోము నెత్తికోలు వికృతంబై కానఁగాఁ వచ్చెడిన్. 42

తే. గ్రాహపాశబద్ధుని నన్నుఁ గాచువారు
పెర లెవరు లేరు మృత్యు వన్ విషధరంబు
వాతఁ బడువానినేని గావంగఁ జాలు
వాఁడు పరమేశ్వరుఁ డొకండు వఱలుఁ గాని. 43

వ. అని ధ్యాననిశ్చలమనస్కుండై గజేంద్రుండు పూర్వజన్మాభ్యస్తవిద్యా
ప్రభావంబున. 44

—◆ గజేంద్రుఁడు భగవంతునిఁ బ్రార్థించుట ◆—

శ్లో. ఓం నమో నమో దేవదేవ తే, దివ్యభవ్యహవ్యకవ్య భుక్స్వరూపిణే
లోకలోచనో యస్య లోచనం, సచ్చిదాత్మనే సమస్త లోకరక్షిణే
పూరుషోత్తమప్రస్తుతౌజసే, భూతభావనాయ సర్వ భూతవేధసే
మా మవ ప్రభో మృత్యుసన్నిభ, గ్రాహభీకరాస్యలగ్నమీశ్వరేశభోః

చ. ఎవఁడు తనంతఁ దాఁ బొడమి యెల్లజగంబు సృజించి పెంచి యు
త్సవమున దానిలోపలను దాఁ దనలో నది తానె యద్దియై
తవిలి మెలంగుచున్ దుదకుఁ దా నది యంతయు సంహరించువాఁ
డవు పరమేశ్వరుండు జగదాద్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

మ. పరమేష్ఠ్యాదుల కాదిహేతువు పరబ్రహ్మస్వరూపంబు భా
స్వరతేజోనిధి సర్వరక్షకుఁడు సర్వజ్ఞుండు విజ్ఞుండు శం
కరముఖ్యామరసేవ్యమానుఁడు జగత్కల్యాణసంధాత యా
పరమేశుండు పరాత్పరుండు పటుఁ డీపట్లన్ ననుం గాఁచుతన్. 47

సీ. ఎవఁడు సంవర్తమం దేకాకియై యుండు
నెవఁడు ప్రకృతికంటె నెన్నఁ బరుఁడు
చిదచిదాత్మకవిశ్వసృష్టి కెవ్వఁడు కర్త
యెవనిలో నీవిశ్వ మెసక మెసఁగు
నెవఁడు చిదానంద మవుమూర్తిఁ గలఁ డయి
నిజవశంబున నెల్ల నిలువరించు

నెవఁడు సంకోచ మొకింత యెఱుంగని
జ్ఞానస్వరూపుఁడై గ్రాలుచుండు

తే. అతఁడు సచ్చిదానందదివ్యప్రభావ
భాసమానమహామూర్తి పరమపురుషుఁ
డాదిమధ్యాంతశూన్యుఁ డనంతకీర్తి
నన్ను రక్షించుఁ గాక నాబన్న ముడిపి. 48

తే. సకలహేతువు లగుభూతసముదయంబు
భూతసముదయసంభూత భువనములును
భువనముల నేలుబ్రహ్మాదు లెవియు లేక
పొడవడఁగ నొప్పు దేవుఁడు ప్రోఁచు నన్ను. 49

ఉ. కానఁగ రానివస్తువులఁ గానఁగఁ జాలినయోగిపుంగవుల్
గానఁగ లేక యెవ్వనిప్రకాశము లేశము గాని విభ్రమ
స్థానమ యైన చిత్తమున సాల్పడి యుందురొ సర్వరూపస
మ్మానితుఁ డైనదేవుఁడు సమస్తము దానగువాఁడు ప్రోచుతన్. 50

తే. ఎవనిదివ్యస్వరూపము నెఱుఁగుపొంటె
సకలసంగములను బాసి సాధువు లయి
సకలభూతహితు లయి దుష్కరతపంబు
నాచరింతురొ ది క్కగు నతఁడు నాకు. 51

ఉ. ఎవ్వఁడు జన్మకర్మములు నెట్టివికారము నామరూపముల్
నివ్వటిలంగ లేక గుణనిశ్చలుఁ డైనను లోకధర్మముల్
ద్రెవ్వక యుండ నిల్పుటకు దివ్యమహాత్మ్యము నామరూపముల్
సవ్వడి గల్గి యుండు నలసర్వజగత్పతి నన్నుఁ బ్రోచుతన్ 52

ఆ. సర్వసాక్షి యగుచు స్వప్రకాశమ్మున
నెల్ల వెలుఁగఁ జేయు చెల్లవాని
లోన నడఁగి యుండులోకేశ్వరునకు నే
నేటికోళ్ళొనర్తు నిట్లు భక్తి. 53

సీ. విడిచి ప్రవృత్తి నివృత్తిధర్మంబునఁ
దనరువానికిఁ బొందఁ దగినవాఁడు
జ్ఞాన మానందమే స్వస్వరూపము గాఁగ
మోక్షాధిపతి యయి పొదలువాఁడు
సాధుప్రసన్నుఁ డసాధ్యప్రసన్నుఁడై
సత్త్వాదిగుణములఁ జనెడువాఁడు
జీవుఁడే దేహముగా వెలయుచు నంత
రాత్ముఁడై దీపించునట్టివాఁడు
తే. తనకుఁ దాన మెలంగుచుఁ దజ్జనాళి
నెపుడు విడనాఁడ కఖిలము నెఱిఁగికొనుచు
వేదవేదాంగగమ్యుఁడై వెలుగువాఁడు
నాదువందనశతము నందంగఁ గలఁడు. 54

సీ. అఖిలజగద్బహిరంతరాత్మం డగు
నాభగవంతు నే రరయఁ జాల
రతఁడు దేవతయు గాఁ డసురుండునుం గాడు
కాఁడు మనుష్యుఁడు కాఁడు పశువు
పక్ష్యాదులందు నేప్రాణియునుం గాడు
కాఁడు పూరుషుఁడును గాఁడు స్త్రీయు
గుణకర్మరహితుండు గుణనిధులకు నాశ్రి
యుఁడు జీవవర్గమం దుండువాఁడు
తే. అఖిలమునకును నాధార మైనవాఁడు
నాదుప్రతికూలదైవము నేది యైన
నడఁపఁగా నోపి నిజభక్తుఁ డైననాదు
కష్టములు వాపఁ బ్రార్థింతుఁ గరము భక్తి. 55

క. విశ్వమయు విశ్వవేద్యుని
విశ్వాత్ముని విశ్వయోని విశ్వు నవిశ్వుఁ

విశ్వేశు విశ్వసృట్టును
శాశ్వతభక్తిన్ భజింతుస్వాంతమునందున్. 56

శా. ఓసర్వేశ్వర! సర్వలోకవరదా! యోయోగిరాడ్వందితా!
యోసర్వజ్ఞ! సమస్తనిర్జరవరవ్యాహార్చితాంఘ్రిద్వయా!
యోసంతోషితభక్తలోకకలితా! యోదేవతావల్లభా!
ధీసంభావిత! భక్తమూర్త మవ మాం దీనం నమస్తే నమః. 57

శా. ఓకారుణ్యపయోబ్ధి దప్పి గొని నే నుర్వీస్థలిన్ మెట్టుకొం
చీకాసారముఁ జేరి వారిఁ గొనుచో నేదోషముల్ లేనిన
న్నీకాలంబునఁ బట్టె గ్రాహము మదీయాంగంబు సర్వాంగముల్
పాకార్యస్త్రముఁ బోనిపుచ్ఛమున నల్గం జొచ్చి నొచ్చెం గదున్. 58

మ. విడిపోయెన్ వెయిసోలు శీర్ణ మగుచున్ విర్గెన్ సమస్తాస్థులున్
గడిమిం దప్పెను సర్వసంధులను నాకాళ్లాడవాస్యంబునుం
గడికండల్ వడె రక్తమాంసములు వోకారెన్ క్షణార్ధంబులోఁ
బడు నీకాయము కావవే కరుణ నీభక్తుండ నన్నోమవే. 59

మ. తెగిపో నుంటి నిమేషమాత్రమున నాదేహంబు దేహంబు గా
దగమ ట్లయ్యెఁ జలింప దాత్మయు లయం బయ్యెన్ సమంతంబ కం
ఠగతప్రాణుఁడ నైతి శ్వాస మది యాడం బోవ దిప్పట్ల న
న్నుఁ గనుంగో నొకరుండు లేడు కరుణన్ జూడం గదే యీశ్వరా.

తే. అనుచుఁ బ్రార్థించిన గజేంద్రుఁ డాలకించి
తమ్ముఁ బ్రార్థించినట్లు ప్రార్థనమునందు
వాక్యములఁ జేసి తెలియనివార లగుచు
నూరకుండిరి బ్రహ్మాదు లొండు గాక. 61

---

ఈసందర్భమున పోతనభాగవతములో "అలవైకుంఠములో, సిరికిం జెప్పడు, తన వెంటన్ సిరి" ఇత్యాదు లుత్తమపద్యంబులు కలవు. సామాన్యముగా నవి తెలియనియాంధ్రు లుండరని తలంతును. అట్టిపద్యములం నేను వ్రాయలేకున్న మేనమామపోలిక గానైన వ్రాయఁగలను గాని మూలములో లేనికారణమున నాభాగవతములో వ్రాయలేదు. మూలములో లేకున్నను వైకుంఠమునుండి విష్ణువు వచ్చినప్పు డిట్లు వ్రాయుట సమంజసము

వ. ఇట్లు గజేంద్రుం డనేకవిధంబులఁ బ్రస్తుతించి మొఱ్ఱ వెట్టుటలు బ్రహ్మాదు లాలకించియుఁ దమ్ముఁ గా దనున ట్లూరకున్నంత జగన్నివాసుం డగు శ్రీహరి. 62

— ♦ శ్రీహరి ప్రత్యక్షమై గజేంద్రుని రక్షించుట ♦ —

మ. విని యొండొక్కఁడు వల్కఁ డెవ్వరికి దోర్వీర్యంబునం జక్రముం
గొని ఛందోమయుఁడైన తార్క్ష్యుని పయిం గూర్చుండి తద్దేశముం
జని దంతీంద్రుని డాయ వచ్చి తనపై స్వాంతంబు సంధించు నా
యన రక్షింపఁగ జెప్పి పుచ్చె బలశౌర్యావక్రముం జక్రముం. 63

మ. చని యాచక్ర మవక్రవిక్రమమునం సంరంభశుంభద్గతిన్
వనమధ్యంబున వారణేంద్రమును జేవం బట్టి వేధించు దా
నిని నక్రంబును సంహరించి త్రుటిలో నీరాకరంబందుఁ గ్రుం
గినదంతీంద్రు సముద్ధరించి హరికెంగే లెక్కె నొక్కింతలోన్ 64

వ. గజేంద్రుండును గ్రాహవిముక్తుండై హరిసన్నిధికిం జనుదెంచి నమస్కరించి వినమ్రుండై యుండె దేవతలు పుష్పవర్షంబు గురిసిరి దేవదుందుభులు మ్రోసె నప్సరోజననృత్యంబు దర్శనీయం బయ్యె. 65

క. హాహాహూహూ లన జగ
దాహూతాహ్వయులు దేవతాంశజు లందున్
హూహూ యనుగంధర్వుఁడు
గ్రాహంబై మౌనిశాపగతి న ట్లుండెన్. 66

వ. అప్పు డతండు శాపమోక్షంబు గాంచి గంధర్వుండై నారాయణునకు నమస్కరించి స్వర్గంబునకు నిర్గమించె. 67

---

మే యని యుందురేమో? గజేంద్రుని రక్షించినవాఁడు వైకుంఠమునుండివచ్చినవిష్ణువు కాఁడనియు "మానవాధీశ్వర" అనుపద్యములోఁ బోతన గజేంద్రమోక్షణకథ మొదటఁ జెప్పినట్లు హరిమేధునకు హరిణియందుఁ బుట్టినహరి యని తెలియుచున్నది. ఈయవతారము రామకృష్ణాద్యవతారములవంటిది. ఈతఁడు వైకుంఠమునుండి రాలేదు. అందుచే వ్యాసులు వ్రాయలేదేమో? నేను నాతలంపుచేతనే వ్రాయమానితిని. రసజ్ఞులు నన్ను మన్నింతురుగాక.

సీ. అట్లు గజేంద్రుఁడు హరిసన్నిధికి రాఁగ
హరి వానిస్పృశియించె హస్తమునను
నాల్గుభుజంబుల నల్లసిమేనిపైఁ
బీతాంబరము దాల్చి ప్రీతి నొప్పి
తాను పార్షదుఁ డయి తామరసాక్షుని
సేవించునట్టిఁడై చెన్నుమీఱె
నాతఁడు పాండ్యదేశాధినాథుఁడు తొల్లి
తనరునింద్రద్యుమ్నుఁ డనెడురాజు
తే. విష్ణుభక్తుఁడు హరిని సేవించుచుండు
నాతఁ డొకనాఁడు ధ్యానమునందు నుండ
నట కగస్త్యుఁడు చనుదెంచి యతనిచెంత
నిలిచె రాజు సమాధినిశ్చలుఁడుగాన. 68

వ. హరి వచ్చుట యెఱుంగమిం జేసి మాట్లాడకున్నంత నగస్త్యుం డలిగి నీవు గజంబ వగు మని శపించె దానంజేసి యాతం డిట్లు శాపం బను భవించి హరిప్రసాదంబునం జేసి ముక్తుండై పార్షదుం డయ్యె నట్లు గజేంద్రమోక్షంబు గావించి హరి గరుడవాహనారూఢుండై చనియె నీగజేంద్రమోక్షణకథ నాలకించువారి కఖిలైశ్వర్యంబులు గలుగుఁ బ్రాతఃకాలంబున నీకథం బఠించిరేని దుస్స్వప్నంబులు తొలంగు నని చెప్పి శుకుండు వెండియును. 69

—◆ రైవతమన్వాదులచరిత్రము ◆—

సీ. రైవతమన్వంతరమును జెప్పెద నిఁక
వినుము నిశ్చలచిత్తమున నరేంద్ర!
తామసునకు సహోదరుఁడు రైవతుఁ డను
నాతఁ డైదవమను వయ్యె నపుడు
ప్రతివింధ్యముఖులు తత్సుతు లర్జునాద్యులు
... విభుఁ, డనునాతఁడు విబుధవిభుఁడు

భూతదయాదులు ముఖ్యదేవతలు హి
రణ్యరోముఁడు తోట్టిరమ్యగుణులు
తే. బుధులు సప్తర్షు లయిరి శుభ్రునకు వాని
సతి వికుంఠకుఁ బుత్రుఁడై చక్రధరుఁడు
పుట్టి వైకుంఠుఁ డనుపేరఁ బొలుపు మిగిలె
సురలు వైకుంఠు లనుపేరఁ బరఁగి రపుడు. 70

శా. వైకుంఠుం డపు డాత్మపత్ని యగుచున్ వర్తించు శ్రీదేవికిన్
బ్రీకామ్యంబును గూర్ప నెంచి తదభిప్రాయానుసారంబుగా
లోకాలోకము మీఁదిభాగమున వేల్పుల్మెచ్చ నిర్మించె శ్రీ
వైకుంఠాఖ్యపురీవరంబుఁ ద్రిజగద్వర్ణ్యప్రభావంతమున్. 71

వ. ఆవైకుంఠుని ప్రభావం బప్రమేయం బనంతరంబు. 72

సీ. వినుము చాక్షుషుఁ డనువిఖ్యాతపురుషుఁ డా
రవమను వర్యో నయ్యవసరమునఁ
బురువు సుద్యుమ్నుఁడు పురుషుండు లోనగు
వార్మనుపుత్రులై వఱలి రపుడు
మంత్రద్రుముండు దేవేంద్రుఁ డాప్యాదులు
దేవగణంబులై తేజ గనిరి
వీరకాహ్వయుఁడు హవిష్మంతుఁడును లోని
వారు సప్తర్షులై వన్నె గనిరి
తే. అపుడు శ్రీహరి సంభూతి యనెడుసాధ్వి
యందు వైరాజునకుఁ బుత్రుఁడై జనించి
యజితుఁ డనునామమును దాల్చి యమృతమథన
కాలమున మేలు కూర్చె నవ్వేలుపులకు. 73

వ. మఱియు నతండు కూర్మరూపముఁ దాల్చి మందరము సముద్రమున
మునుంగకుండ వీఁపున మోచె నని చెప్పిన శౌనకునిం గాంచి రాజేం
ద్రుం డోమునిచంద్రా! క్షీరసాగరం బేటికి మథింపఁ బడియె నతులుండు

కూర్మమై మందరంబు నేమిటికి ధరించె నందు నేమేమి మహోన్నత పదార్థంబు లుత్పన్నంబు లయ్యె నాన తిమ్మనిన నమ్మనుజేంద్రున కమ్మునీంద్రుం డి ట్లనియె. 74

—♦ క్షీరసాగర మథనకథాక్రమము ♦—

తే. పూర్వ మొకకాలమున వేలుపులును దొంటి
వేలుపులు ఘోరయుద్ధము వెలయఁ జేసి
రందు వేల్పులు వైరిఘోరాయుధములఁ
గూలనై చేవ చెడి పోయి రాలమందు. 75

సీ. మఱియొకప్పుడు పుష్పమాలిక దుర్వాసుఁ
డిచ్చె గౌరవమున నింద్రున కతఁ
డద్ది ధరింపక యైరావతము కుంభ
మున నైచెఁ దీసి [illegible] గజంబు
కాలిచేఁ జూర్ణము గావించె నది చూచి
ముని కోపమున నీవు మూడులోక
ములను శోభ దొఱంగి మెలఁగుదు వని ఘోర
శాపము వెట్టె నాశాపమునను

తే. శోభ చెడె లోకములతోడ సురలు కుతిలఁ
గుడిచి రధ్వరములు పెంపు గూర్ప వయ్యె
నపుడు తత్ప్రతిక్రియఁ జేయునాసఁ జేసి
పలుదెఱంగులఁ బడి బ్రహ్మవలని కరిగి. 76

వ. తమప్రకారం బంతయు విన్నవించిన నతండు దైత్యోన్నత్యంబును దేవదైన్యంబును మనంబునం దలంచి బృందారకులం గాంచి సువర్వులారా! సమస్తంబునకును రక్షకుం డధోక్షజుం డతని కందఱు సమానులయినను సత్వగుణప్రధానుఁ డగుటం జేసి సత్వసంపన్ను లయినమీ యెడ ననుగ్రహించుం గావున మన మందర మాగోవిందుని సన్నిధికిం జని విన్నవింత మని దేవతలం గూడి యజితావతార మెత్తి యున్న

వాని నిలయంబునకుం జని నమస్కరించి సమాహితచిత్తులై యుప
నిషద్వాక్యంబుల నిట్లు ప్రస్తుతించిరి. 77

—♦ దేవత లజితరూపుఁడగుహరిని బ్రార్థించుట ♦—

ఉ. నీవు చరాచరంబులకు నేతవు త్రాతవు సంవిధాతవుర్వ్
నీవలనన్ సమస్తము జనించెను నీ కరుణాకటాక్షసం
భావితు లైన మే మిటు ప్రవర్తిలు చుంటిమి నీసమానుఁ డే
భూవలయంబునందుఁ గనఁ బోఁడు నిన్ను నెఱుంగ శక్యమే. 78

తే. వాఙ్మనంబుల కందనివాఁడ వీవు
ని న్నొకప్పుడు యోగులు నెమ్మనముల
గోచరుని గాఁగఁ బొనరించుకోఁ గలిగిన
నెఱుఁగఁ జాలరు నీశక్తి నింత నిజము. 79

సీ. అరయఁ గర్మాధీన మయినప్రాకృతశరీ
రము నీకు లేదు నిక్కముగ నీవు
మముబోఁటుల హృదంతరమున శయనింతువు
జీవు నట్లు భవత్స్వభావ మొప్పదు
మాఱదు నీకు నపారశక్తులు గల్గు
నాత్మ మనోమతిప్రాణములను
సాక్షాత్కరించుకోఁజాలుదు విషయేంద్రి
యములు ప్రకాశించున ట్లొనర్తు

తే. జాగరాద్యవస్థలు నీకు సంభవింప
వాకసము వోలె నీ వెల్ల నలుముకొనుచు
ననిశము దలిర్తు జ్ఞానాదు లాఱుగుణము
లావరింపఁగ నుందు వోయమలతేజ. 80

సీ. సంసార మన నొకచక్ర మయ్యాది మనో
వ్యాపారమునఁ బుట్టి వఱలుచుండు
జ్ఞానకర్మేంద్రియప్రాణము లనువదు
నే నరల్ సత్వాదు లైనమూఁడు

సాభులు గలిగి మాయ్యానుగుణం బయి
భూతపంచకమును బుద్ధి మన మ
హంకారము లనెడునష్టనేముల నొప్పి
విద్యుచ్ఛలం బయి వెలయుచుండు
తే. ఆమనోమయచక్రనే యనఘునాథి
పత్యమున నొప్పు నేది కేవలము శుద్ధ
సత్వమై రాగరహితమై సదమల మగు
నట్టిపరమాత్ముని భజింతు మనవరతము. 81
సీ. నాలుగువిధములం గ్రాలుప్రాణులకుఁ దా
నైనభూతల మేనియంఘ్రియుగమొ
అఖిలలోకాళి ప్రాణాధార మగుజల
మెవ్వానివీర్యమై యెసకమెసఁగు
నన్న మాయువు బలం బఖిలప్రజల కిచ్చు
చంద్రుఁ డెవ్వానిమనస్సంభవుండో
సకలదేహులలోన సంచరించుచు నన్న
మిడుహవ్యవాహనుం డెవనిముఖమొ
తే. అర్చిరాదిమార్గప్రదుం డగుచు ముక్తి
సాధనుం డయి యుదయ మస్తమయముఁ గొని
యాయువు క్షయింపఁ జేయునర్యముఁడు వేని
నేత్ర మావిరాణ్మూర్తి యేల్ నిరతము మము. 82
సీ. అఖిలజీవులకుఁ ప్రాణాధార మగునాశు
గం బేనియూర్పునఁ గలిగి నదియొ
దిక్కు లీరైదు నేదేవునిశ్రోత్రసం
భూతము లయ్యెనో ఖ్యాతము లయి
ప్రాణధారుల కెల్ల నాశ్రయం బగునాక
సం బేపురుషనాభిసంభవమ్మొ

యే దేవుకోపప్రసాదాదులఁ రుద్ర
పరమేష్ఠిముఖ్యులు ప్రభవ మైరొ
తే. తనుబిలంబులవలన ఛందములు ఋషులు
వక్షమునఁ జేసి వివిధసంపదలు నీడ
వలనఁ బితరులు స్తనములవలన ధర్మ
మయ్యె నావిరాట్టు ప్రసన్నుఁ డగుత మాకు. 83

వ. మఱియు నెవ్వనిముఖంబున బ్రహ్మము బ్రాహ్మణులును బుట్టిరో యెవ్వని బాహువుల క్షత్రకులంబును బలంబును జనించెనో యెవ్వని యూరువులవలన వైశ్యకులంబును నైపుణ్యం బుదయించెనో యెవ్వని పాదంబులవలన శూద్రకులంబును శుశ్రూషావృత్తియు నుత్పన్నం బయ్యెనో యెవ్వనియధరోష్ఠంబున లోభము నూర్ధ్వోష్ఠంబునఁ బ్రీతియు నాశికవలనఁ గాంతియుఁ గనుబొమలవలన మృత్యువు కనుఱెప్పలవలనఁ గాలము సంకల్పంబువలనఁ బంచమహాభూతమ్ములును గాలమును బుణ్యాపాపకర్మంబులును సత్త్వాదిగుణంబులును బ్రహ్మాండంబును సంభవంబు లగుచుండునో యట్టివిరాడ్విగ్రహంబు మాకుఁ బ్రసన్న మగుం గాక యని మఱియును. 84

క. నీమంగళవిగ్రహముఁ
మామకదృక్పథమునందు మది నిల్పుకొనం
గా మతిసేయుచు నుంటిమి
నీముఖపద్మమును మాకు నెఱిఁ జూపఁ గదే. 85

ఉ. ఇంచుక చేసి నీ కిడినయే నది భక్తివివేషయుక్తమై
నెంచఁగ నెంతయో యగుచు నిచ్చు ఫలం బది గాన మేము ని
న్నించుక లోన నించుకగ నిట్లు స్తుతించెదుమా స్తవంబునఁ
బెంచి కృపారసంబు మముఁ బ్రేముడిఁ జూడుము లోకరక్షకా. 86

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు సహస్రభానుప్రభా
భాసమానానూనదేహకాంతులు దిశావలయంబుల నిండి మెండుగ

దీపింపఁ గన్నులకు మిఱుమిట్లుగొలుపునట్లు పొడకట్టిన నట్టె కనుం
గొని బ్రహ్మాదు లాతనిపాదారవిందంబుల సాఁగిలి పడి మ్రొక్కి. 87

దండకం. నీలంపుఱాడాలు డీలింపఁగా జాలు నిద్దంపు నెమ్మేను పొందమ్ము
పూఁదేకులం బోలువాల్గన్నులున్ బైడినిగ్గుల్ పిసాళించుమేల్పట్టుపుట్టం
బు కన్నాకుసొన్నంబునన్ రత్నముల్ దాఁపఁగా నొకిరీటంబునుం గుం
డలంబుల్ భుజాలంకృతుల్ గల్గి ముత్యాలహారంబునుం గౌస్తుభం
బున్ రమాదేవియున్ వక్షమం దొప్పఁ జక్రాదిదివ్యాయుధంబుల్
దనుం గొల్చుచుండన్ జగన్మోహనాకారుఁడై కంటికిం గాన నొవ్వాని
లోకేశ్వరుల్ వేఁడియు న్వేఁడియున్ మ్రొక్కి స్తోత్రంబులం జేసియుం
జేసి మా కోర్కులం దీర్చి మన్నేలు మోదేవదేవా యనన్ దేవతా
సార్వభౌముండు భూమానుకంపామతిన్ మేఘగంభీరవాగుంభనన్
బ్రహ్మరుద్రాదులం గాంచి తా నిట్లనెన్. 88

—• అమృతోత్పాదనక్రమము •—

తరువోజ. దేవతలార మీ దేవురించుటలు
తెలిసితి నొకమాటఁ దెలిపెద మీకుఁ
జా వెన్నఁటికి గాని సమకుటఁ బోదు
సకలభద్రంబులు సంభవ మగుఁ
గావున మీ రిప్డు కార్పణ్యము విడి
ఘన మైనదైత్యసంఘంబుతో సంధి
గావించుకొనుఁ డంతఁ గాలవశమునఁ
గలసి వారును మీరు కడఁగితి రేని. 89



క. ఘనకార్యముసాధించిన
ఘను లగుదురు వెనుక నెల్ల కార్యములును మీ
కనుకూలగతికి వచ్చును
గినుకం దీఱుచుకొనంగఁ గికురింప నగున్. 90

చ. అమృత మొకండు మృత్యువు నహంకృతిఁ ద్రోలఁగఁ జాలి నట్టిది
వ్య మగుమహౌషధం బది మహార్ణవ మం దెసఁగు న్మహౌషధీ

సముదయ మజ్జలంబులఁ బొసంగఁగఁ జేసి వడిన్ సురాసురుల్
శ్రమ మన కెల్లరుం గలసి త్రిచ్చినచో లభియించు నెంతయున్. 91

వ. అని మఱియు నక్షీరార్ణవంబున మందరాచలంబు గవ్వంబుగ నమ
రించి దానికి వాసుకి యోక్త్రంబు సేయునది తత్కాలంబున మీకు
నాసాహాయ్యంబునుం గలుగు నట్లు కడలిం ద్రచ్చుచో మునుమున్న
కాలకూటంబు పుట్టు దానికి మీరు భయంపడకుఁడు రుద్రుండు దాని
మ్రింగివేయు నవ్వల నవ్వారిధిం బుట్టినవస్తువుల మీ రపేక్షింపకుఁడు
పూర్వదేవతల కెదురాడకుఁడు మీకు శ్రేయం బగుం బోయిరం డని
యమృతోత్పాదనక్రమం బంతయు నెఱింగించి తా నదృశ్యుం డయ్యె
నంత నింద్రాదు లాబలిచక్రవర్తి కడకుం జని సామం బభినయించుచు
సంధిం గావించుకొని పురుషోత్తమునియుపదేశప్రకారం బంతయు
నెఱింగించిన నతండు శంబరత్రిపురాసురాది దైత్యనాయకుల కెఱింగించి
వారియనుమతంబునఁ బరస్పరంబు సమయంబు నేర్పఱచుకొని రనంత
రంబ వా రొండొరు లేకగ్రీవంబు గలిగి పోయి. 92

తే. ఓషధీరత్నతతి నగ్ని యో యనంగ
వెలుఁగుచు విహాయసము రాయువివిధశృంగ
ములఁ దలిర్చెడుమందరంబును బెకల్ప
శక్తి చాలక యెంతయు జాలి నొంది. 93

మత్త. ఎట్టకేలకు దానిబాహుల నెత్తి నెత్తినిఁ బూని యె
ట్టెటులో యొకరీతి దవ్వుఁగ నేగి మోయఁగలేమి న
ప్పట్టునం దమపట్టు వీడగ వైచి రందున నెందఱో
గట్టుక్రిందను గూలి చచ్చిరి కష్టకాలము పట్టుటన్. 94

వ. అప్పుడు భగవంతుఁ డగునజితుండు వచ్చి చచ్చినవారిం బ్రదికించి
వా రందఱుం జూచుచుండ నక్కొండ బెండువోలె నొక్కకేల నెత్తి
గరుత్మంతునిపైఁ బెట్టి నీవు దీని సముద్రంబునం బెట్టి రమ్మనుటయును.

చ. అనఘుఁ డతండు నంతట ననంతగతిం బదునొండువేలయో
జనములలోఁతు నంతియ పొసంగినయెత్తును గల్గుమందరా

దిరిసి పెకలించి తే సుర లతిప్రమదంబున దాని నర్ణవం
బున నిడి త్రచ్చ నాజ్ఞఁ గొనఁ బోయి వచించిరి వానికంతయున్. 96

వ. అంత మూర్తీభవించి ప్రత్యక్షంబై సముద్రుండు వారి కిట్లనియె. 97

ఉ. త్రచ్చెడువేళ మందరభరంబు కరంబు వహించి మర్ద మే
నచ్చముగా సహింతు నమృతాంశము నాకును గల్గునేని నాఁ
బెచ్చినపేర్మి నా ననుచు వేల్పులు కవ్వపుఁగొండ క్రిందుగాఁ
బొచ్చెము లేని తావుగను బ్రోపుగ నిల్పిరి కూర్మవల్లభున్. 98

క. సకలౌషధీసంబులఁ
బరికలిత మగు పాలవెల్లిఁ బఱపిసమంథా
దిరికి యోక్త్రముగా నలవా
సుకిఁ జుట్టి మథించి రఖిలసురలు నసురులున్. 99

— కూర్మవతారఘట్టము —

ఉ. వాసుకిత్రాటఁ జుట్టి గిరి వారలు పట్టి మథించుచో భరం
బై సలిలంబులన్ మునిఁగె నాఁగ సురాసురులెంతప్రానికం
జేసినఁగాని లాభ మది చేకుఱ దయ్యెఁ దదంతరంబునం
దోసరసీరుహాక్ష! యెట నుంటివొ రాఁగదె మమ్ముఁ గావఁగన్. 100

ఆ. మందరంబు మేము మథియించుచో భార
మగుచు నాఁగి పట్టు నయితి గాక
మునిఁగె సాగరాంబుపూరంబునం దిప్పు
డేమిచేయు వార మేది దిక్కు. 101

వ. అని దీనదీనంబు లగుపలుకులు పలుకుచున్న సమయంబున. 102

ఉ. దీనదయాళుఁ డాప్రభువు దేవవరేణ్యుల మొఱ్ఱ లెంచి యో
హో నెగు లొందఁ బోకుఁ డిదిగో చనుఁదెంచెద నంచుఁ గూర్మమై
తా నలకొండక్రింద నయి దానిని వీఁపున నిల్పి మీఁదికిన్
గానఁగఁ దెచ్చె వ్రేల్మిడిన కన్గొని యెల్లరు సంతసింపఁగన్. 103

ఆ. లక్షయోజనముల లక్షింపనై పెద్ద
దీవియట్టు లున్న దేవదేవు

పృష్ఠభాగమందుఁ బృథ్వీధరం బది
గులను బాపునట్టికోలఁది కమ్మె. 104

వ. అంతఁ గొంతలోఁ బ్రకృతిధర్మంబు నొంది తొంటియట్లు మంథన
కార్యంబునకుం గడంగి. 106

చ. శిరముల నైపునన్ దనుజశేఖరులు న్మఱి తోఁక నైపునన్
సురలును మందరంబునకుఁ జుట్టినవాసుకిఁ బట్టి త్రచ్చుచో
నుఱుతరశబ్ద మెంతయు సముద్భవమై వియదంతరంబునం
దిర మయి నిండి మెండుకొనె దిక్కులు పిక్కటిలంగ మ్రోయుచున్.

తే. వృక్షపాషాణఘర్షజాతాక్షయాగ్ని
మోక్షభూత సరీసృపాస్యోద్భవవిష
వహ్నియును గూడి భయదమై ప్రజ్వలింప
నమరవిభుఁ డబ్ధవారిఁ జల్లార్చె నపుడు. 107

శా. ఆపాతాళనిమగ్నమందరమహీధ్రాతిభ్రమప్రస్థితిం
గూపారస్థితజంతుసంతతులునున్ క్షోణీరుహంబు ల్మహా
ద్వీపంబుల్ పృథివీధరంబులును నిష్పిష్టంబులై పోఁ బయో
రూపం బొందెను దజ్జలం బడరి వారు న్వారునుం ద్రచ్చుచోన్. 108

ఉ. ఏండ్లకొలంది గాఁగ నిటు లెంతయుఁ బంతముతో సురాసురుల్
వీం డ్లన కిండ్లు నాఁక కడువేసట నొందుచుఁ ద్రిచ్చఁ ద్రిచ్చ న
గ్గొండ్లి యడంగ ఘోర మయి గొబ్బున హాలహలంబు పుట్టె వా
రొండ్ల నెఱుంగ కంతమును నొందిరి నాఁబడి యుండి రయ్యెడన్. 109

— హరుఁడు హాలాహలము పానముచేయుట —

సీ. ప్రళయకాలాభీల పావకసాహస్ర
సదృశోష్ణమున ముంచి జగము లెల్ల
వ్రేల్మిడి దహియించు వేగముం గైకొని
నలుమూలలకుఁ బ్రాకి ఖలిత మగుచు
దుస్సహం బయి లేచుధూమ్రము సర్వత్ర
విస్ఫులింగములతో విస్తరిల్లి

నింగికి న్నేలకుఁ దిక్కులకుం జాల
నిండి మహాభీతి నెఱపి కొనుచు
తే. జంగమస్థావరంబు లౌ జంతువులను
మ్రింగి కొనఁ జాలి నట్టిదై పొంగి పొరలి
హాలహాలాఖ్యమహోక్ష్వేళ మట్టియెడల
మట్టుమీఱె మహాక్షయ మట్టు లగుచు. 110
వ. బ్రహ్మాదు లయ్యుపద్రవంబున కోడి పీడనిభయంబున సంభ్రమించుచు
భవునికడకుం జని వినయం బభినయించుచు నది యంతయు విన్నపంబు
గావించి. 111
సీ. దేవ! మహాదేవ! దివ్యప్రభావ! స
ర్వప్రపంచేశ్వర! సుప్రసన్న
హృదయ! నీవే జగత్సృష్టి స్థితి లయంబు
పొనరించుచుందు త్రిమూర్తు లగుచు
శబ్దయోనియు నీవ జగదాదియును నీవ
ప్రాణేంద్రియద్రవ్య పరగుణస్వ
భావుఁడ వీవ భాస్వర కాలరూపుఁడ
వాద్యంతశూన్యుఁడ వాదిదేవ!
తే. అగ్ని నీముఖ మాకాశ మాదల ధర
పదము కాలము గతి వాయు వది శ్వసనము
దిశలు నీదుకర్ణంబులు దివము నాభి
సూర్యుఁ డగు నీదుకన్నులు సోముఁడు మది. 112
తే. జలము తేజము జలధులు జఠర మోష
ధులు భవద్రోమములు ఛందములు త్వదీయ
సప్తధాతువుల్ వరధర్మసమితి హృదయ
మెన్న నీవు పరేశుఁడ విది నిజంబు. 113
క. లోకములు పదియు నాలుగుఁ
జీఁకాకుం బడియె సకలజీవేశ్వర నీ

వీకరణి నూరకుండక
మాకుం జూపింపు బ్రదుకుమార్గం బభవా. 114

వ. అని ప్రార్థించుటయుం బ్రసన్నుం డయి పరమేశ్వరుండు పార్వతికిం జెప్పి యొప్పించి. 115

క. త్రిజగత్సంహారక మై
గజిబిజిసేయంగ నున్న కాకోలంబున్
గజదానవారి చేకొని
నిజగళమున నిలుపుకొనియె నీలగళుండు గన్. 116

వ. అ ట్లీశ్వరుండు విషపానంబు చేయునప్పుడు జారి పడినవిషలేశంబులం గ్రిందనున్న సర్పంబులు వృశ్చికంబులు లోనగుజంతువులు స్వీకరించె ననంతరంబ దేవదానవులును సంకర్షణప్రదత్త బలపరాక్రమంబులం దనరి హర్షోత్కర్షంబున మఱియుం బొడంగి మహార్ణవంబు మథియింపం జొచ్చి రంత. 117

—♦ పాలకడలి నైరావణాదులతో నమృతము పుట్టుట ♦—

క. కడు నల్లనిరూపము నలు
గడఁ జీకటు లీన రత్నఖచితము లై పే
ర్వడినవిభూషణములతోఁ
వడి జ్యేష్ఠాదేవి పుట్టె వారిధి నపుడున్. 118

సీ. నలుగడఁ జలివెలుంగులు పర్వ జాబిల్లి
ధవళద్యుతులతోడ నవతరించె
వెలిపట్టుపుట్టంబు వలె వాటుగాఁ గొని
సవురొప్ప శ్రీదేవి సంభవించె
వెన్నెలల్ వెదజల్లి వెన్నలోపలినుం
రాణించి కౌస్తుభరత్న మొదవెఁ
గోరినకోరికల్ కొనసాఁగఁ జేసెడు
కామధేనువు గల్పకమును బొడమె

తే. మఱియు నాల్గుదంతంబుల మత్తగజము
నమలతురగంబు సురయును నప్సరసలు
నమృతకలశంబుతో సుందరాంగ మొప్ప
ఘనుఁడు ధన్వంతరియు నందుఁ గలిగి రపుడు. 119

ఉ. దుశ్శ్రవణంబు వో నటులు తోయధిఁ ద్రచ్చ సుధారసంబు ను
చ్చైశ్శ్రవ మచ్చరల్ రమయుఁ జంద్రుఁడు గోలె ననేకవస్తు లం
భశ్శ్రధనంబునుండి వెరవార వెలుంగుచు వెల్వడంగ నా
స్వశ్శ్రితు లందు నేఁటు లగువారు గ్రహించిరి వాని వానినిన్. 120

చ. సిరిదొరసాని పుట్టి యటు చెన్నలరారుచు నుండ నెల్ల ర
త్తరుణిమనోహరాకృతికిఁ దబ్బిబు నొందుచు నుండి రప్పు డా
సురపతి తెచ్చి పీఠమును సూరెల నిల్పిన నామె దానిపై
నిరవుగఁ గూరుచుండె సుర లెల్లరు నల్లనఁ గొల్చి రాయమన్. 121

సీ. గంగాదినదు లెల్లఁ గాయంబులం దాల్చి
స్వర్ణకుంభములతో జలము లిడిరి
భూదేవి యభిషేకమున కొప్పనోషధుల్
గొనివచ్చెఁ బా లిచ్చె గోచయంబు
మూర్తిమంతుం డయి మొనసి వసంతుఁడు
వివిధపుష్పంబుల వేడ్కఁ నొసఁగె
మునులు గంగాజలముల నభిషేకించి
రెలమి మంత్రంబులఁ బలికి కొనుచు

తే. మంగళముల గంధర్వులు పొంగి పాడి
రచ్చరలు నృత్య మొనరించి రబ్దచయము
తనువులను దాల్చి వచ్చి మృదంగములును
వేణువీణాది శబ్దముల్ విడక సలిపె. 122

వ. అనంతరంబ దిగ్గజంబులు పద్మహస్త యగులక్ష్మిని స్నానము చేయిం

యనుపుష్పమాల నామెనలంకరించె విశ్వకర్మ వివిధభూషణంబులును సరస్వతి ముత్యాలహారంబును బ్రహ్మగర్భుండు పద్మంబును గుండలీం ద్రుండు కుండలంబులునుదెచ్చియలంకరించి రిట్లలంకృత యగునమ్మహా లక్ష్మి పుష్పమాలఁ జేకొని మందస్మితసుందరవదనారవిందయై హేమ లతవలెం బ్రకాశించుచు నిట్టు నట్టు మెట్టుచు సురగరుడోరగాదుల నెవ్వరిం గానక సర్వలక్షణలక్షితుం డొక్కఁడయధోక్షజుం డని నిశ్చ యించి వానిచెంతకుం జని చే నున్నపుష్పదామం బాతనికంఠంబున వైచిన నతం డామెఁ బరిగ్రహించి నిజవక్షస్థలంబున నిలుపుకొనియె నట్టియవసరంబున. 123

సీ. భూతనాథునిశిరోభూషగా నెల యయ్యె
నమరులపాలైరి యప్సరసలు
శ్రీయుఁ గౌస్తుభము నారాయణునిం జేరెఁ
గామధేనువు స్వర్గగతికిఁ బోయె
నందనోద్యానమునందుఁ గల్పక ముండె
ధన్వంతరియు బుధాస్థాన మొందె
నిచ్చ నైరావణ ముచ్చైశ్శ్రవంబును
హరిహయునకును వాహనము లయ్యె

తే. జరయు మృతియును లేకుండఁ జలుపునట్టి
యమృతకలశంబు వేల్పులహస్తమందుఁ
జిక్కె నసురుల కొకశ్రమతక్క మఱియు
నన్య మేమియుఁ జిక్కలే దయ్యె నపుడు. 124

చ. అమృతము పుట్టినట్టిసమయంబున వేలుపులెల్ల వంచనా
క్రమమున సోఁకుమూఁకలను గన్నుమొఱంగి హరించి వారి కీ
కమృతముఁ దారె మెక్కుటకు నాయిత పఢాటఁ గ్రహించి సోఁకు లా
సమయమునందు దేవతలసఖ్యము వీడి పరాక్రమంబునన్. 125

వ. పైఁబడి ముష్టాముష్టింగచాకచిం బెనంగిపోరి యమృతకలశంబునుసము ద్రంబునం బొడమినసమస్తవస్తువులు సంగ్రహించి రంత వారిలోవారు.

సీ. నీవు కాదే ముందు (శ్రావేద నమృతంబు
తే తె మ్మని యొకండు తిగిచి కొనియె
నే నుండ నీవు కా దిటు తె మ్మని బలాఢ్యుఁ
డాతని న్నెట్టి తా నందుకొనియె
నంతలో వంశాఢ్యు లరుదెంచి పెద్ద లుం
డగ నిట్లు తగ దని తగిలి కొనిరి
నధిపతు లిది సత్రయాగము యజమాను
లకు బలె నెల్లవారి కని కొనియె
తే. అనుచుఁ బలుకుచు మచ్చర మతిశయిల్ల
వారిలో వారు కలహించువార యగుచు
వేరిమాటలు వేరును విననియట్లు
లగుచు వివదించుచుండి రయ్యవసరమున. 127

—♦ మహావిష్ణువు మోహినీరూప మెత్తుట ♦—

వ. పుండరీకాక్షుం డగునజితుండు రాక్షసుల కమృత మిడుట పాములకుం
బాలువోయుట యని నిశ్చయించి. 128

మ. తళుకుంబంగరుడాలు డీల్పడుగతిం దైవారు సన్మేనును
న్నెలనా ముద్దులు మూట గట్టె మిగుల న్వొల్గొందు నెమ్మోమును
న్గలుకుంగుబ్బలు వాలుఁగన్నులును విన్నం బోలులేఁగౌనునుం
గలనారీమణి యై రమాధవుఁ డటం గన్పట్టె నప్పట్టునన్. 129

తే. ఇట్లు మోహినియై విష్ణు వెసఁగి నల్ల
దాని(వుడుల నెల్ల వంచింపఁ దలఁచి వారి
కెలనఁ బ్రత్యక్ష మగుటయుఁ గెరలి వారు
మోహపరవశులై యుండి రూహము చెడ. 130

వ. ఇట్లు మేను మఱచి తన్నుం జూచుచున్న దానవుల చెంత కా దైత్యాంత
కుండు తక్కుచుం దారుచుం జని మీలో మీ రిట్లేల వాదు పెట్టు
కొనియెదరు నేను మీయిరుదెఱంగులవారికి నమృతంబు పంచి

యిచ్చెదం డెం డని తత్కాలశంబు పుచ్చుకొని సురాసురుల వేఱు వేఱ రెండుపంక్తులుగఁ గూరుచుండం బెట్టి సుధారసం బసురులకుం బోయక సురలకుం బోయుచుండె నపుడు నరుండు విల్లు గొని దైత్య దానవులం దఱిమి రా నీక నిలువరించె నాలో రాహు వక్కాలకం బెఱింగి దేవరూపంబున వారిబంతికి వచ్చి యమృతం బాస్వాదింపఁ బోవుటం దెలిసి పుష్పవంతు లెఱుంగం దెలుపుటయు నతిరయంబునఁ జక్రి చక్రాయుధంబున వానిశిరంబుఁ దెగ నఱికె నంతఁ గబంధంబు నేలఁ గూలి విలవిలఁ దన్నుకొనుచు సారణ్యాపర్వతం బగుభూతలం బెల్లఁ జలింపం జేసె నమృతస్పర్శంబునం జేసి తెగియును శిరం బక్షరంబై గగనంబున కెగసి భయంకరధ్వానంబుఁ గావించె నది మొదలు రాహుముఖమునకు సూర్యాచంద్రములతోడి వైరంబు శాశ్వతం బయ్యె నంత దైత్యేశ్వరు లొండొరు మంతనంబు చేసి. 131

మ. కలశాబ్ధి న్మథియింపఁ గల్గినసుధాకల్పాదు లన్యోన్యముం
దలగాఁ గొంద మటంచుఁ బల్కి మును నీదుర్మార్గు లమ్మార్గముం
దలఁపం బోక రమాసుధాదిసకలద్రవ్యంబులు న్వారిలో
పల వారే కొని రింతె కా కడిచి రోర్వం జాల కస్మజ్జనుల్. 132

—◆ దేవదానవులు మహాయుద్ధము చేయుట ◆—

వ. మన కింక నీగీర్వాణులతోడిపొత్తు చాలు ననికిం జొత్త మని మొత్తంబై రథాశ్వగజాధిసాధనంబులం గూర్చుకొని పేర్చి బెట్టూర్చుచుం గల్పానల్పగభీరభైరవాకారు లై యుద్ధంబునకుం గడంగి రపుడు దానవేశ్వరుఁ డయినబలి కామగమనంబును దుర్నిరీక్ష్యం బగు వైహాయసం బను విమానం బెక్కి ముందు నడువ సేనాధిపతు లగునముచి శంబర బాణ విప్రచిత్తి త్ర్యయోముఖ ద్విమూర్ధ కాలనాభ హేతి ప్రహేతి ల్వల శకుని భూతసంతాప వజ్రదంష్ట్ర విరోచన హయగ్రీవ శంకుశిర కపిల మేఘదుందుభి దార కోగ్రసేన శుంభ నిశుంభ జంభోత్కలారి ష్టారిష్టనేమి త్రిపుర పౌలోమ కాలకేయ నివాతకవ

పరిభృతు లైనదానవశ్రేష్ఠు లుక్కుమిగిలి దిక్కులు పిక్కటిల్ల మొక్కలీం డ్రయి సింహనాదంబులు సేయుచు శంఖంబు లొత్తుచు ధనుష్టంకారములు గావించుచు నుద్ధతులై సురసేనం గలిసి తోమర భిండివాల పరశు పట్టిస ముసల ముద్గర గదాసి కుంత ప్రముఖమహాస్త్రశస్త్రంబుల నొక్కపెట్టునం జుట్టుముట్టి తెట్టెలు గట్టినట్టు కొట్టుచు శౌర్యగాంభీర్యధైర్యస్థైర్యంబులం బొదలి పోలి నొకవీకం బోరాడుచుండి రప్పుడు దేవేంద్రుండు సాంద్రనిర్ఝరపరివృతం బైనపర్వతంబు వలె నున్న యైరావణంబు నెక్కి యెల్లదిక్కులం దానయై యుండె నయ్యెడ నానావిధాయుధంబులు దాల్చి వాయ్వగ్నివరుణాదిలోకపాలురును దక్కిన దేవతానికాయంబును పాకశాసనునకుం బాసటయై నడచుచు నక్తంచరులం దాఁకి రప్పుడు బలీంద్రులును దారక కుమారులును హేతివరుణులును ప్రహేతిమిత్రులును గాలనాభ కాలులును మయవిశ్వకర్మలును శంబరత్వష్టలును విరోచనవిభాకరులును నముచిపరాజితులును వృషపర్వాశ్విదేవతలును బాణాసుర పుత్రసూర్యులును రాహుచంద్రులును బులోమవాయువులును శుంభనిశుంభులతో భద్రకాళియు జంభునితో వృషాకపియు మహిషాసురునితో విభావసువును వాతాపిల్వలులతో బ్రహ్మపుత్రులును దుర్మర్షణునితోఁ గాముండును నుత్కలునితో బ్రాహ్మీప్రభృతి సప్తమాతృకలును శుక్రునితో బృహస్పతియు నరకునితో శనైశ్చరుఁడును నివాతకవచులతో మరుత్తులును గాలకేయులతో వసువులును బౌలోములతో విశ్వేదేవులును గ్రోధవశులతో రుద్రులు నెదుర్కొని తోమరభిండివాలాదిసాధనములం ఘోరయుద్ధంబు గావించి రాసమయంబున. 133

శా. దైత్యుల్ నిత్యపరాక్రమక్రమలసద్ధైర్యాతిశౌర్యంబునన్
బ్రత్యాలీఢపదస్థులై స్థగితరత్నవ్రాతహేతిచ్ఛటా

పరిత్యాహారవిహారభూరిసమర వ్యాపారులై ఘోర నా
దిత్యుల్ స్థైర్యము దక్కి ధైర్యము చెడన్ దిక్కుల్ విలోకించుచున్.

క. అతివయగురూపు విడి వడి
నతులితవిక్రమముతోడ హరి నిశితాస్త్ర
పరితతిఁ బరఁగించి భీకర
గతి దానవకోటి నడఁచెఁ గడువడి నంతన్. 135

మ. నరనారాయణు లిద్దఱుం గవిసి సన్నద్ధాసురశ్రేణులం
గరవాలంబులు భిండివాలములు చక్రప్రాసకుంతాదులన్
గరిమన్ వ్రేయుచు డాయుచున్ ఘనభయగ్రాంతాస్త్రులం జేయుచున్
దురిపిల్లన్ జమువీడుఁ జూపి రలపాథోరాశితీరంబునన్. 136

శా. జంభద్వేషియు భూరిభూమిధరపక్షచ్ఛేద దక్షోచ్చల
ద్దంభోళిం గరమం దమర్చి నిజదోర్దర్పంబు దీపింప న
కుంభీపాకమునందుఁ బాకరుచిఁ గన్గోఁ జేసి దైత్యాధమా
రంభంబుం బొలివోనొనర్చె నిజసంరంభంబు జృంభింపఁగన్. 137

శా. జ్యాఘోషంబున నాకసంబు వగులన్ సంధించి కోదండమున్
మాఘాదిత్యునిరీతిఁ దొల్త నయి గ్రీష్మగ్రబధ్నుండై యనంత బా
ణౌఘోసృంబుల దైత్యవాహినుల మాయంజేసె నుగ్రప్రచా
రాఘాటం బిసుమంత లేక నరుఁ డత్యంతప్రతాపంబునన్. 138

మహాస్ర. తనసేనల్ వజ్రిచేతం దఱుగుటఁ గని క్రోధ ధజ్వలద వహ్నిలోనస
జనియింపన్ మండుచున్ రాక్షసపతి నముచి స్థాణుఁ డాస్థానమందున్
ఘనుఁడై శూలంబు కేలం గయికొని వృషునిం గాంచి రోరారినాతో
నని సేయన్ రమ్ము నీపేరడఁగెదు నిలు మం చొదలన్ వైచె దానిన్.

తే. మండుచు మహోల్కవలె వచ్చుచుండుశూల
మును సమీక్షించి వజ్రి దానిని సహస్ర
ఖండములు చేసి దంభోళిఁ గరమునం ద
మర్చి తచ్ఛిరమున వైచెఁ బేర్చి కినుక. 140

సీ. కొండలఁ బిండిగాఁ గొట్టుసామర్థ్యము
కలిగి వృత్రుని జంపి వెలయువజ్ర
మల్లనముచిలోమ మైనను గదలింప
లేనిదై యుండుట కానిపింప
పతిదైన్యమును బొంది మతిఁ గుందుచు నలంతి
నముచిఁ ద్రుంచెదుశక్తి నాదుపవికి
లేకపోయె నిఁ కేది నాకు దిక్కగు దధీ
చిమహాత్మ్యమున కింతచే టగు నయొ

తే. అని వగచుచున్నతఱి శుష్క మార్ద్రము నగు
నేవియు న్నీనిఁ జంపలే విది వరంబు
శుష్క మగునీదువజ్రము చూచి మెలఁగు
మనెడువినువాకు వినవచ్చె నమరపతికి. 141

తే. శుష్క మార్ద్రము గానివస్తు వెది యనుచుఁ
వెదకి ఫేనము గొనివచ్చి భిదురమునకుఁ
బులిమి బలిమిమై వైచె నముచిపయి నది
త్రుంచె నాతనిశీర్షము త్రుటిన పోయి. 142

మ. అని నారాయణుఁ డుగ్రుఁడై తగి ప్రవర్గ్యాగ్నిప్రభా భీమద
ర్శనమై మండుసుదర్శనం బది కరాగ్రింబందుఁ గైసేఁత గాఁ
గొని నాకద్విషులం దెరల్చుచు మహాఘోరక్రియం బోరెఁ బెం
పున సారణ్యసముద్రభూధ్ర మగునీభూభాగ మల్లాడఁగన్. 143

ఉ. అత్తఱి దేవదానవుల కైనమహాద్భుతయుద్ధమం దొగిం
దుత్తము లైనశస్త్రములు దొప్పలు దోరలు కుప్పఁగూర లై
మొత్తములై కనంబడియె మొత్తెదువేల్పులకత్తిపోట్లఁ బె
న్నెత్తురు గ్రక్కుకొం చసురనేతలు గూలిరి నేల కెంతయున్. 144

వ. అట్టిమహోగ్రయుద్ధంబునం బరాజితులై హతశేషు లగురక్కసు
లుక్కడంగి సముద్రంబునం జొచ్చిన విజయంబు నొంది వియచ్చరులు

విచ్చలవిడిఁ జెచ్చు పెఱిగినముచ్చటం బడుచు నందఱుం గూడి మంద
రంబు ముందఱిచో నిడి యమృతం బిందుకొఱకు సురలకును రక్షింప
నిచ్చి స్వర్గంబునకు నిర్గమించి సుఖంబుండె రనంతరంబ. 145

—♦ శివుఁడు మోహినిం జూచి మోహవివశుఁడగుట ♦—

సీ. హరి మోహినీరూప మందుట విని హరుం
డాఁబోతుపై నెక్కి యతివతోడ
హరిసన్నిధికి నేగి యభ్యర్చితుం డయి
మందహాసముఖారవిందుఁ డగుచు
దేవ! నీమాయను దెలియ లే రెవ్వరు
దేవాదిదేవుఁడ వీవె కావె
యీవ కారణభూతుఁ డీసమస్తమునకుఁ
బ్రత్యగాత్మయె నీదుసత్యమూర్తి
తే. ఈవు పరమాత్మ వెల్లెడ నీవ నిండి
యుందు నీ కెట్టిమార్పులు నుండఁ బోవు
నీవ నీకు నధిష్ఠాత వీవ పతివి
ని న్నెఱుంగ నశక్య మోసన్నుతాత్మ. 146
సీ. నిన్ను బ్రహ్మముగా గణింత్రు వేదాంతులు
మీమాంసకులు ధర్మ మే యటంద్రు
ప్రకృతిపూరుషులకుఁ బరు డంద్రు సాంఖ్యులు
కొందఱు శక్తులం గూడు నంద్రు
నిను వికారవిహీనునిగ స్వతంత్రుఁగ మహా
పురుషునిగఁ దలంతురు పరమపురుష
నేను బ్రహ్మాదులు నీమాయఁ దెలియని
వారమ యని విన్నపము నొనర్చ
తే. నీవు వాయువుమాడ్కిని నిఖిలమందు
నంతరాత్ముఁడవై యుందు వధిప నీదు

మోహినీరూపమును జూడ మోహముపడి
వచ్చినాఁడను బ్రార్థించువాఁడ నగుచు. 1

ఉ. నావుడు విష్ణు విట్లనియె నాఁ డటు మోహినిరూపుఁ దాల్చి నే
దేవవిరోధివర్గమును దిగ్భ్రమ నొందఁగఁ జేసి తత్సుధన్
దేవుల కిచ్చినాఁడ నది దేవర చూడఁ దలంచి వచ్చితం
చీవు వచింప వింటి మది కెంతయు సంతస మయ్యె నియ్యెడన్. 1

వ. ఆమోహినీరూపం బెట్టివారి కైన మన్మథోద్రేకంబు పుట్టించు దా
జూపెదం జూడు మని పలుకుచు నంతర్ధానంబు నొందె నంతల
జెంత నగునుద్యానవనంబున విహరించునొక్కమించుబోఁడి లీలా
భ్రమణంబు గావించుచుఁ గపర్దికిం గాన వచ్చుటయు నతండు. 1

చ. పిఱుదులమీఁది చీఱపయి విన్ననువొప్పెడుపైడిగంటలన్
గఱగఱ లాడ మేల్‌రశన గల్లని మ్రోయఁగఁ దారహారముల్
గరములఁ గంకణంబులును గాళుల గజ్జెలు ఘల్లుఘల్లనన్
బఱపఁగ బంతియాడుచును బాడుచు నాడుచు నామె తోఁచుడు

తరళ. గమనవేగముచేత జాఱెడు కట్టుపుట్టముఁ గేశపా
శమును వామకరంబునం గొని జానుమీఁజాఱెడుబంతినిన్
క్షమఁ బడన్ గుడికేల మొత్తుచుఁ గన్బొమల్ గదలించుచున్
సమయకేళి పొనర్చుచుండెను జాన మోహము గొల్పుచున్.

తే. దానికడకంటిచూపులు దవ్వుల నగు
వామదేవునిపైఁ బడ వ్యథితచిత్తుఁ
డగుచుఁ దనవారినిం దన్ను నగజ మఱచి
పొలఁతిదిక్కునకుం బోవ మొగము వెట్టె.

సీ. మోహిని దూరమై పోయిన బంతికై
రయమునం బాఱుసమయమునందు
మొలతాఁ్రిటితోఁ గూడ వలిసము దిగఁజాఱి
దలఁప కొయ్యారంబు దులకరింపఁ

గడకంటిచూపులఁ గడలు కన్గొనుచు నం
తంతలో సిగ్గున నవయవములు
కుంచి యంచితగతిఁ గోపులు చూపెడు
మాయావతిం జూచి మతి చెడంగఁ
తే. గామ బాధకు నగ్గమై వామదేవుఁ
డగజ వీక్షించుచుండఁగ నట్టె శివుఁడు
పోలఁతిపై దృష్టి నిలిపి యవ్వాలని కరుగు
చుండగాఁ దేజ మది వీఁగి యుర్విఁ బడియె. 153

వ. అంతలో మోహినీరూపంబు చూచుచుండ మహావిష్ణునై మహేశ్వరునకుం బొడసూపుటయు నతండు సిగ్గునం దలవాంచియు జగద్రూపుం డయినపరమేశ్వరునిమహిమం దెలిసి వలుదెఱంగులం బ్రార్థించి తదాజ్ఞం బడసి ప్రమథగణంబుతోఁ బార్వతీసహితుండై కైలాసంబునకుం జనియె నిది క్షీరసాగరమథనవృత్తాంతంబు దీని నాకర్ణించిన వారి కఖిలైశ్వర్యంబు లగు నింక నితరమన్వంతరముల విశేషంబు లెఱింగించెద నాకర్ణింపు మని యట్లనియె. 154

—♦ మఱికొందఱు మన్వాదుల వృత్తాంతము ♦—

సీ. వినుము వైవస్వతమను విప్ర వర్తించు
నతఁడు వివస్వంతునాత్మజుండు
శ్రాద్ధదేవుం డను నిద్ధనామమువాఁడు
సప్తమమను వయి జగతిఁ బరఁగు
నతని కిక్ష్వాకుఁడు నవ్వల నభగుండు
ధృష్టుఁడు శర్యాతి దిష్టుఁడును గ
రూషకుండును బృషధ్రుండు నాభాగుఁడు
వసుమన్న రిష్యంతు లెసఁగిరి సుతు
తే. లపుడు వసువు లాదిత్యవిశ్వాము లెన్న
దేవతలు పురందరుఁ డనువాఁడు దేవవిభుఁడు

కశ్యపాత్రిభరద్వాజగౌతమజమ
దగ్నికౌశికవాసిష్ఠు లైరి మునులు. 155

క. ఈమన్వంతరమున నే
వామనుఁ డన నదితికశ్యపద్వయమునకుఁ
దామరసాక్షుం డుదితుం
డై మించె నతండు తమ్ముఁ డాదిత్యులకున్. 156

వ. అని చెప్పి తక్కినమన్వంతరములం జెప్పెద నాకర్ణింపు మావివస్వంతు నకు విశ్వకర్మపుత్రిక లగుఛాయా సంజ్ఞా బడబ లనువారు భార్య లందు సంజ్ఞకు యముఁడు యమున శ్రాద్ధదేవుఁడు ననుముగ్గురును దపతియనుమఱియొక్కకన్యయుం గలిగి రాతపతిని సంవరణుండువరించె బడబ యనునామెకు నశ్వినీదేవతలు పుట్టి రష్టమమన్వంతరమున సూర్యపుత్రుఁ డగుసావర్ణి మను వయ్యె నిర్మోహుఁడు విరజస్కుఁడు లోనగువారు మనుపుత్రులు సుతపస్కులు మొదలగువారు దేవ గణంబు లగుదురు బలిచక్రవర్తి దేవేంద్రుం డగు. 157

చ. అతఁడు మహాయశస్కుఁడు మహాత్ముఁడు వామనమూర్తియై విధుం డతనిఁ బదత్రయంబు మితమైనధరాస్థలి వేఁడి ముజ్జగం బతినికృతిన్ హరించియుఁ బ్రియంబున స్వర్గముకన్న మిన్నయై స్తుతులకు నై యధోభువన శోభ వహించినచోట నిల్పుచున్. 158

క. తా నాతనిరక్షకుఁడై
మానక యట నుండు నతఁ డమర్త్యశ్రీలన్
జానొందు నింద్రుఁడో యన
నానందముతోడిసౌఖ్య మావహిలంగన్. 159

వ. ఆమన్వంతరమునఁ గాలవుండు దీప్తిమంతుఁడు ద్రోణపుత్రుఁ డగునశ్వ త్థామ పరశురాముఁడు కృపాచార్యుఁడు ఋష్యశృంగుఁడు నాజనకుం డగువ్యాసభగవానుండును సప్తర్షు లగుదురు ప్రకృత మాగాలవాదులు తమతమయాశ్రమములయందే ప్రవర్తించుచున్నవా రాకాలంబున

శ్రీమహావిష్ణువు దేవగుహ్యుం డనువానికి సరస్వతి యనుసతియందు
సుతుండై పుట్టి సార్వభౌముండు నాఁబడి పురందరునివలన నింద్రపదవిం
గ్రహించి బలి కొసంగు నంత. 160

సీ. అప్పతికిం బుత్రుఁ డగుదక్షసావర్ణి
తొమ్మిదవమనువై నెమ్మిఁ గాంచుఁ
దెలియంగ ధృతకేతు దీప్తికేతులు మొద
లగువారు మనుపుత్రు లగుదు రపుడు
గర్గమరీచిముఖ్యప్రవరులు దేవ
తలు శ్రుతుఁ డింద్రుఁడై తనరుచుండు
ద్యుతిమంతుఁ డాదిగా వ్రతులు సప్తర్షు లా
యుష్మంతుఁ డనుపేర నొప్పుసుకృతి

తే. కంబుధారయనం జనునతివయందు
ఋషభుఁ డనునామమున జగదీశుఁ డెసక
మెసఁగి నిరపాయముగ విశ్వ మెల్ల నింద్రు
చేత నేలించు చుండుఁ బ్రఖ్యాతి మెఱయ. 161

వ. అంత నుపశ్లోకునిపుత్రుం డగుబ్రహ్మసావర్ణి దశమం బయినమను వగు
భూరిషేణుఁడు లోనగువారు మనుపుత్రులు హావిష్మంతుఁడు సుకృతి
సత్యుఁడు జటామూర్తి మొదలగువారు సప్తర్షులు సువాసనుఁడు
విబుద్ధుఁడు లోనగువారు దేవగణంబులు శంభుం డనువాఁ డింద్రుం
డగు నప్పుడు విష్ణుండు విశ్వజితుం డనువానివలన విషూచీసతియందు
విష్వక్సేనుం డన నవతరించి యింద్రసఖుం డగుఁ బిదప ధర్మసావర్ణి
యేకాదశమను వగు సత్యధర్మాదులు పదుగురు మనుపుత్రులు
విహంగమ కామగ నిర్వాణ రుచి ప్రభృతులు సురగణంబు ధ్రువుఁ
డనువాఁ డింద్రుం డగు నరుణాదులు సప్తర్షులు అపుడు హరి యర్య
కునకు వైధృతియందు జన్మించి ధర్మసేతునామంబునఁ బ్రస్తుతిం గాంచు
రుద్రసావర్ణి పండ్రెండవమను వగు నపుడు దేవవంతుఁడు నుపదేవుఁడు

దేవజ్యేష్ఠుఁడు లోనగువారు మనుపుత్త్రులు ఋతుధాముఁ డింద్రుం డగు హారితాదులు దేవత లగుదు రాగ్నీధ్రుఁడు తపోమూర్తి లోనగువారు సప్తర్షు లగుదు రక్కాలంబునఁ గమలాక్షుండు సత్యసహునకు సూనృత యను సతియందుఁ బుట్టి స్వధామనామంబునం బొలుపాఱు నవల దేవసావర్ణి పదమూఁడవమను వగు చిత్రసేనాదులు మనుపుత్రులు సుకర్ములు సుత్రాములు ననువారు దేవతలు దివస్పతి నాఁబడువాఁ డింద్రుండు నిర్మోకుఁడు తత్త్వదర్శి లోనగువారు సప్తర్షులగుదు రపుడు మాధవుండు దేవహోత్రునకును బృహతికిం బుత్రుఁడయి పుట్టి యోగీశ్వరనామంబున వ్యవహరింపఁ బడు నంత నింద్రసావర్ణి పదునాల్గవమను వగు నురువు గంభీరుఁడు వసువు లోనగువారు మనుపుత్రులు పవిత్రులు చాక్షుషు లనువారు దేవత లగుదురు శుచి యనువాఁ డింద్రుం డగు నగ్ని బాహువు శుచి శుక్రుఁడు మాగధుఁడు లోనగువారు సప్తర్షు లపుడు హరి వితాన యనుసతియందు సత్రాయణుడనువానికిం బుట్టి బృహద్భాను వనునామధేయంబున జగద్ధేయుండై యజ్ఞాదికర్మముల విస్తరిల్లం జేయు. ఇవి మన్వంతరములు మన్వంతర మొక్కండైన దైనందినకల్పం బగు నని చెప్పిన మునీంద్రుం గాంచి నరేంద్రుం డి ట్లనియె నో మహాత్మా! మన్వంతరకాలంబుల మనువులు మనుపుత్రులు ఋషులు లోనగువారు వేనిచేనియుక్తులై తత్తత్కార్యంబు లొనర్తు రనిన నతం డతని కి ట్లనియె.

క. మనువులు మనుపుత్రకులున్
మును లింద్రుఁడు దేవగణము పొలుపొందుటకున్
మనుకాలములం దగునా
జనార్దనునియాజ్ఞఁ జేసి సకలము నడచున్. 163

సీ. మన్వంతములందు మనువులు దీపింప
మునులు వేదముల సముద్ధరింత్రు
మనుపుత్రు లగువారు మనువులు స్థాపించు
ధర్మముల్ పాదలువిధం బొనర్తు

రాదేవగణము యజ్ఞాదుల ఋషులతో
యజ్ఞభాగంబుల ననుభవింత్రు
హరిప్రసాదమున నమరపతి సిరు లంది
భువనముల్ పాలించుమోద మెసఁగ
తే. అపుడు పరమేశ్వరుండు యజ్ఞాదులు కపి
లాదు లవతారముల నెత్తి యాయుగాను
సారముగ జ్ఞానబోధము సల్పు దుష్ట
శిక్షణము శిష్టరక్షణస్థితినిఁ దాల్చి. 164
తరువోజ. అనుడు రా జను శుకు నరసి మహాత్మ
హరి యెట్టికోర్కెలే నట్టివాఁ డయ్యె
ననఘుఁడు జగదీశుఁ డయ్యును దీను
నట్టులు బలిచెంత కరిగి యాచించు
పనియేటి కరుదెంచె భక్తునివాని
బంధించుటకుఁ దాను బ్రయతించు టేమి
విన నెంచితి ని దెల్ల విస్తరఫణితి
వినిపింపవే యని విన్నవించుటయు. 165
వ. అనిన రాజునకు మునిరా జి ట్లని యె. 166

—• బలిచక్రవర్తి చరిత్రము •—

సీ. మును దేవదానవ ఘనసమరంబున
నింద్రుచేతం బలి యీల్గి శుక్రు
మంత్రశక్తిం జేసి మఱియును జీవించి
సేవించె శుక్రాది దేవనిభుల
బలి భక్తి కెంతయు వారుసంతోషించి
వెలయించి రతనిచే విశ్వజిత్తు
నాయాగమునఁ దృప్తి నందినజ్వాలనుండు
దివ్యపరికర సందీప్తరథము

తే. జవనహయములు సింహధ్వజంబు నక్ష
యంబు తూణీరమును దృఢమైనకవచ
మిచ్చె బలి కాతఁ డందున హెచ్చె నపుడు
తాత ప్రహ్లాదుఁడును బద్మదామ మొసఁగె. 167

మ. బలిదైత్యేంద్రుఁడు బావకాదు లిడు దివ్యంబుల్ రథాదుల్ గలం
డలఘుప్రాభవుఁడై గురూత్తముల దివ్యాశీస్సులం బొంది వేల్
బలముల్ గొల్వఁగ దివ్యవైభవమునన్ భాసిల్లుచున్ యుద్ధభే
రి లసద్దీప్తిని మ్రోఁగుచుండ గదలెన్ ఋభీంద్రునిం గెల్వఁగన్. 168

వ. ఇట్లు కదలి కతిపయప్రయాణంబుల స్వర్గంబునకు నిర్గమించె నదియును.

సీ. పెట్టుచెట్టులతోడఁ బెర్మిఁ గాంచినమహో
ద్యానవనంబులఁ దనరుచుండు
నైరావణోచ్చైశ్శ్రవో రమ్యసంచార
సముచితభూముల నమరి యుండుఁ
జింతామణీ కల్ప సింహాసనాంచిత
దివ్యసభాస్థలదీపిత మగు
లావణ్యనిధు లైన దేవాంగనలవిలా
సముల దీపించెడుస్థలుల నెసఁగు

తే. విమలమందాకినీ జలవిశ్రుతంబు
స్వర్ణసాల సమంచితోచ్చస్థలంబు
హాక్త్రికవితానకల్పితమహీతలము
సురలకుం గాపురము స్వర్గపురవరంబు 170

వ. ఆబలిచక్రవర్తి వివిధపరివారపరివృతుండై యయ్యమరావతీపురంబు
దరియ నరిగి శుక్రదత్తంబగు శంఖం బొత్తుటయును. 171

శా. శంఖారావము నాలకించి దివిషత్సంఘాధినాథుం డెదన్
ఖేంఖాణంబుల హేషలున్ దిగులు గల్గింపన్ గురుం జేరి ది

క్రేంఖద్రింఖలశబ్దముల్ తెలిసితే ద్వేషించి యెవ్వాఁడో నక్ష
బుంఖాంచద్ఘనబాణఘాతములఁ బెంపుం డింప వచ్చెంగదే. 172

ఉ. వచ్చినవాఁడు నాదయినబాణపరంపర కోడి క్రేళ్లనై
చచ్చినవాఁడె ము న్నిపుడు సద్గురునక్కటికంబుకల్మినై
హెచ్చినశౌర్యధైర్యముల ని ట్లరుదెంచె బలీంద్రుఁ డోప్రభూ
పొచ్చెము లేనిశౌర్యమునఁ బొల్చుట లేమికతంబు చెప్పవే. 173

వ. అనిన దివస్పతికి బృహస్పతి యి ట్లనియె. 174

—♦ బలిచక్రవర్తి స్వర్గంబు స్వైవసంబు చేసికొనుట ♦—

సీ. తెలియ వచ్చెను విను తెలిపెద బ్రహ్మవా
దులు శుక్రముఖ్యు లీబలికి నిట్టి
యభ్యుదయము గల్గునట్లు గావించిరి
వీని నిప్పట్టున వేరు గాని
యోర్వఁ జాలరు లోన నొండు తలంపక
నీదుఃకోయమువారు నీవు నిప్పు
డీలోకమును వీడి యేగు టే యొప్పు న
వ్వలఁ జూచుకొంద మవ్వలివిచార

తే. మతఁడు బ్రహ్మప్రభావసమాహితుండు
కావునఁ దొలంగి పోవుట యే వరంబు
నాఁగ నింద్రుఁ డెల్లరతోడ నగరు విడిచి
కామరూపుఁడు గావునఁ గదలి పోయె. 175

వ. బలపరాక్రమసంపన్నుం డగుబలియు నిష్కంటకం బైనయమరావతీ
పురంబు నిరాతంకంబుగం బొందఁ గాంచి చింతామణీసింహాసనాసీనుం
డై ముల్లోకంబులు వశీకంజేసి పాలించె నంత శిష్యవత్సలు లగు
శుక్రాదిబ్రాహ్మణోత్తము లాతనియందుప్రపదంబు శాశ్వతం బగున
ట్లతనిచే నేనూ అశ్వమేధంబులు చేయించిరి బలియుఁ దత్ప్రభావంబున

ద్రిజగద్విశ్రాంతకీర్తివిశాలుండై రాకానిశాకరునిచందంబునం బ్రకా
శించుచు ననంతసంపదంచితుండై సుఖంబుండె నంత. 176

ఉ. ఇంద్రుఁడు స్వర్గమున్ విడిచి యెక్కడికో పడి పోయినట్లు దై
త్యేంద్రులు వానిసంపదల నెల్ల హరించిసురాలయంబునన్
సాంద్రవిభూతులం బడసి స్వామితఁ జూపుచు నున్నయట్లు దే
వేంద్రునితల్లి యానదితి యింతయును న్విని సంతపించుచున్. 177

తే. తినక కునుకక రేఁబవల్ దీర్ఘదుఃఖ
తాపభరమున వేఁగుచు నేపసికినిఁ
బూనుకొన కొక్కచోఁ బడి పొక్కుచుండె
నపుడు కశ్యపుఁ డరుదెంచెఁ దపము విడిచి. 178

వ. తేజోవిహీనమైనతనయాశ్రమంబు చూచి సందేహించుచు లోనికిం
జని యొక్కచో భూమిశయ్యం బడి యున్నప్రియురాలిం గాంచి. 179

చ. గరితరో! చిన్నబోయినముఖమ్మున సౌఖ్యము లేనిదానవై
కరము విచారముం గలిగి కాలముఁ ద్రోయుచు నున్నయట్లు నా
కరయఁగ వచ్చె నీసుతుల కందఱికుం గుశలంబె నీమెయిన్
గురుగద మెద్దియేని దొరకోదు గదా వచియింపు మింతయున్. 180

వ. అని యడుగుచున్నభర్తం గాంచి భార్య యి ట్లనియె. 181

మ. గృహకృత్యంబుల నేమఱిల్ల కతిభక్తిన్ వహ్నులం గొల్చుచ
న్వహమున్ వచ్చెడునర్థికోటికిని మృష్టాన్నంబు గల్పించుచున్
సహజప్రేమను భృత్యులం గనుచు నాస్వాంతంబున న్నీపయిన్
బహుభక్తిం గొని యుంటి నామయ మెదే నానేన లే దారయన్.

ఉ. వ్యాధులకన్న నాధులు భయప్రదముల్ మునినాథ యిప్డు నా
కాధి యొకండు చిత్తమునయం దయి కుందు జనింపఁ జేయు నో
నాథ! సమస్వభావుఁడ వనాథశరణ్యుఁడ వీవు నీకు నే
క్రోధము నేరిపై నెపుడుఁ గూడ జనింపదు నిక్క మింతయున్. 183

ఉ. సత్వరజ స్తమంబులను సంభవమందిరి నీకుఁ బుత్రకుల్
సత్వమె సత్య మైన దని సర్వజగంబు దలంచుచుండు నీ
సత్వమునన్ జనించినవిశాలయశస్కుల నీకొమాళ్ళ మి
త్రత్వము హెచ్చఁ జూచుటకుఁ దానకపాదము లాశ్రయించెదన్.
తే. దైత్యు లాదిత్యులను దోలి తత్త్రిదివము
నాక్రమించిరి దేవేంద్రుఁ డక్కటకట
సానుచరుఁ డయి నష్టుఁడై కానఁ బడఁడు
నాసుతుల నన్ను రక్షింప నాదుమనవి. 185
వ. అనిన నంతయు నెఱింగినమరీచిపుత్రుండు కళత్రమున కిట్లనియె. 186
ఉ. ఎక్కడిపుత్రసంపద ల వెక్కడిరత్నవిభూషణాదు లిం
కెక్కడివైభవంబు లవి యెక్కడి కెక్కడ యేది శాశ్వతం
బక్కట నీవు పుత్రులకు నార్తి వహింతువు నీకు వారి కిం
దెక్కడిబాంధవం బగు ని కేటికిఁ జింత వహింతు వోసతీ. 187
సీ. పంచభూతాత్మక మెంచ నీదేహము
ప్రకృతిభిన్నం బయి పరఁగు నాత్మ
యెవరి కెవ్వరు బంధు వెట్టిది బంధుత్వ
మెఱి పిదంతయును నీ వెఱుఁగ వొక్కొ
యంతయు నశియించు నాతఁ డొక్కఁడు గాక
నిత్యులై యుందు రే నీదుసుతులు
అజ్ఞానమూలక మగు నీదుస్నేహము
మోహము విడుము నీపుత్రులందు
తే. అనుచుఁ దత్వోపదేశము నాచరించి
ఫలము గానక కశ్యపుఁ డలఘుయశుఁడు
నీదువెత్తికి మం దిష్ట నే వచింతు
వాసుదేవుని సేవింపు మాస దీఱ. 188
వ. అనిన నదితి యోహోనాథా! జగన్నాథు నేచందంబున సేవింప
నొప్పుం దద్విధానంబు చెప్ప ననుగ్రహింపు మనిన నతండు వెండియుం.

—♦ అదితి యింద్రజయంబు గోరి పయోవ్రత మొనర్చుట ♦—

♦సీ. విను పయోవ్రతము ఫాల్గునశుక్లమునఁ బ్రతి
పద్దినం బాదిగాఁ బదియుమూఁడు
దినములు విష్ణుదేవుని ద్వాదశాక్షర
మంత్రమునం బూజ మానకుండఁ
జేసి కల్పోక్తవిశిష్టపద్ధతిమెయి
హోమతర్పణములు నీమ మొసఁగ
వ్రతము చేయుచు గుడపాయసమును పయ
స్సును దేవునకును నప్పన మొనర్చి
♦తే. వ్రతహవిశ్శేషమును బొంది బ్రహ్మచర్య
మున వ్రతసమాప్తి నొనరించి భూరిదక్షి
ణలను ఋత్విజులకును విప్రులకు నిచ్చి
శాంతి గావింప నగు నిది సద్వ్రతంబు. 190

---

♦ పయోవ్రతము :— అందు విష్ణ్వారాధనము ప్రధానము ఫాల్గునశుక్లపక్షప్రతిపద్దినంబు మొదలుకొని ద్వాదశివఱకుఁ బండ్రెండుదినంబులు నావ్రతంబు చేసి పదమూఁడవదినంబున శాంతిగావింపవలయు స్త్రీ గాని పురుషుఁడు గాని యిద్దఱుం గలసి కాని యీవ్రతము చేయ వచ్చును.

♦ వ్రతవిధానము:—చంద్రకళ గలిగినఅమావాస్య (సినీవాల్యమావాస్య) దినమున వ్రతము చేయువారు వరాహవిహితము (అడవిపందిత్రవ్వినమట్టి) తీసికొని వచ్చి యొకచో నుంచి దానిపై చేయి వేసి భూదేవిని "భూమిర్భూమ్నా" అనుమంత్రములచే నభిమంత్రణ ప్రార్థనాదులు జరుపవలెను. అట్లభిమంత్రించి యామృత్తికను దీసి దేహమునకు నలుగడ పూసికొని స్నానము చేయవలయును. అంత సంధ్యావందనాదికృత్యములు నిర్వర్తించుకొని నిశ్చలచిత్తుఁడై ముగ్గులచే నలంకరింపఁ బడినభూమియందును సూర్యునందును జలమందును వహ్నియందును గురువునందును హరిని భావించి పూజింపవలయును. స్వర్ణముచేతగాని రాగిచేతఁగాని విష్ణుప్రతిమను జేయించి పంచగవ్యాదులతో ప్రాణప్రతిష్ఠ గావించి స్థండిలమున దానిం బ్రతిష్ఠించి "ఓన్నమోభగవతే వాసుదేవాయ" ఇది ద్వాదశాక్షరి మంత్రము దీనిని జపించుచు నీమంత్రముచేత బురుషసూక్తవిధానమున అవాహనాసన పాద్యార్ఘ్యాదుల షోడశోపచారములఁ బూజించి "ఓవాసుదేవా ! నీవు సర్వసాక్షివి.

వ. అని కశ్యపుం డానతిచ్చిన మెచ్చుచు నదితి నియమవ్రతంబున
నప్పయోవ్రతంబు గావించినంత. 191

సీ. నీలంపుఱాలడా గ్లీలింపఁగాఁ జాలు
హొంబట్టురెంటెంబు డంబుమీఱ
ననుఁబోరఁ గౌస్తుభమను పేరు మొయిలఁ గ్రొ
క్కాఱుమెఱుంగునాఁ గరము దనరఁ
గెంగేలఁ దలకట్టుసింగాణి వలమురి
గుదుసువా ల్గుదెయును గొమరుమిగుల
నెలమి దేవేరులై కలిమి లేమయు నీల
యును నేలచామయుఁ దనరఁ గొలువ

తే. మొగి సనకసనందనముఖమునులు వొగడ
మేరువునుబోలు గరుడునిమీఁద నెక్కి
నిండు తేజెల్లజగముల నిండుకొనఁగ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. 192

---

మహాపురుషుఁడవు నీకు నమస్కారము నన్ను రక్షించి నాకోరికలం దీర్పు మని ప్రార్థించుచు గంధపుష్పమధుపర్కంబు లొసంగి పాలచే స్నానంబు చేయించి వస్త్రయుగ్మము యజ్ఞోపవీతము నాభరణములు సమర్పింప వలయును. ప్రత్యుపచారమందును ద్వాదశాక్షరి మంత్ర ముచ్చరింప వలెను. ఇట్లు షోడశోపచారపూజ గావించి నేతితో బెల్లముతోఁ గూడినపాయసాన్నమును శ్రీహరికి నివేదింప వలయును మూలమంత్రముతో స్మార్తాగ్నిలో హోమము చేయవలయును. పిమ్మట నివేదిత మగునాపాయసాన్నము తాను స్వయముగాఁ దినవలెను. లేకున్న మఱియొకబ్రాహ్మణునకుం బెట్టవచ్చును. పరమేశ్వరున కాచమన మొసంగి తాంబూల మర్పించి ద్వాదశాక్షరిమంత్రము 108 పర్యాయములు జపింపవలెను. పిదప ప్రదక్షిణనమస్కారదండప్రణామము లాచరించి నిర్మాల్యము శిరస్సున ధరించి యనంతర ముద్వాసనము 12 దినముల నియమంబున నుద్వాసనము చెప్పదగదు. పూజయైన పిమ్మట నిరువుర బ్రాహ్మణులకు బై నుదాహరించిన పాయసాన్నముచేఁ దృప్తి గావించి పూజించి వారి యనుమతి నాశేషమును బంధువులతో భుజింపవలెను. ఆదినములలో నధశ్శయన బ్రహ్మచర్యవ్రతము చేయవలెను. అట్లారాత్రిం బుచ్చి మఱునాఁడు వేఁకువనలేచి స్నానాదులు గావించి వెనుకటివలెనే పూజింపవలెను. ప్రతిదినమైనవాఁడు

వ. ఇట్లు సాక్షాత్కరించినపరమేశ్వరుం గాంచి పరమసాధ్వి యగు నయ్యదితి లేచి సాష్టాంగనమస్కారంబు గావించి వినయవినమితోత్తమాంగయై చేతులు జోడించుకొని. 193

సీ. యజ్ఞాధిపతి వీవ యజ్ఞభోక్తవు నీవ
యజ్ఞకర్తవు నీవ యజ్ఞ మీవ
నీపాదయుగమందు నిర్జరాపగ పుట్టె
భక్తుల రక్షించువాఁడ వీవ
విశ్వరూపుఁడ వీవ విశ్వేశుఁడవు నీవ
విశ్వ మీవ సమస్తవేద్యుఁ డీవ
సృష్టిస్థితిలయంబు లీవ చేయుదు నీకుఁ
గా కొకింతయు లేదు లోకములను
తే. ఆశ్రితులకష్టముల నెల్ల నపహరించు
నట్టివాఁడ వనంతుఁడ వాదిపురుష
నీకు నేటికొల్లు ప్రసన్నద నీరజాక్ష
నాపయి న్నీకటాక్షముఁ జూప వలయు. 194

---

పాలను మాత్రమే యాహారముగా గొనుచు నీవ్రతము సాగింపవలెను. ఆపాలుపాడ స్వామికి నైవేద్యము చేసినవియే కావలెను. ఇట్లు ప్రతిదినమును విష్ణుపూజ బ్రాహ్మణ భోజనము హోమము జరుగుచుండవలెను. ప్రతిదినము మూడుపూటలు స్నానము మూడుసారులు పూజయు నొకపక్షముగలదు (ఇది యుత్తమపక్షము) ఇట్లు శుక్లపక్షప్రతిపత్తు మొదలుకొని త్రయోదశివఱకు నీపయోవ్రత మాచరింప వలెను. 12 దినము లీవ్రతము 13 వ దినమునఁ బూజించి యుద్వాసనము చెప్పవలెను. ప్రతిపూజకు ద్వాదశాక్షర మంత్రపఠనమే ముఖ్యము. వ్రతదినములలో నేభోగములును గూడవు భూతహింస పనికిరాదు. ఈదినములలో సర్వదా బ్రాహ్మణులచే వేదఘోషము చేయించుచుండవలెను. పదమూడవదినంబున మాత్రము బ్రాహ్మణులు మంత్రములు చదువుచుండ పంచామృతస్నానమైనంత విష్ణుదేవతాకమైన చరువును జేసి వాసుదేవమంత్రములతో పురుషసూక్తముచే హోమము చేయవలెను. ఋత్విక్కులకు గురువులకు విప్రులకు వస్త్రములు ఆభరణములు గోవులు మొదలగునవి యిచ్చి తృప్తిగా భోజనము పెట్టవలెను. దక్షిణ లొసంగ వలెను. సర్వవర్ణములవారికి కుంటి గుడ్డి వారికి భోజనము పెట్టవలెను. ఇట్లు చేసి తాను బంధువులతో భుజింప వలెను. పూజాదినములలో వీణాగానము ముఖ్యము. హరి

—♦ వామనావతారఘట్టము ♦—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుం డో దేవమాతా! నీకోరికి నే నెఱింగికొంటిని నీపుత్రులు శత్రుపీడితులై వనాంతరంబులు వట్టియున్నవారు వారు మఱల వారిసంపత్తులం బొందుకాల మాసన్న మయ్యెడిని నీవు చింత దక్కి యుండుము శత్రువు లిప్పుడు శుక్రాభి రక్షితులై యున్నవారు వారి నిపుడు జయించుట కష్టసాధ్య మ ట్లయిన నీయొనర్చినవ్రతం బతిప్రభావంతము దానికిం దగ నే నొక్క యుపాయ మాలోచించితిఁ గశ్యపతపఃఫలమ్ముగ నేను నాయంశంబు నం జేసి నీకుఁ బుత్రుండనై పుట్టి నీపుత్రుల రక్షించెద నిది రహస్య మెవ్వరు విన నొప్పదు నీకు నీవ్రతఫలంబు శీఘ్రకాలమున ఫలించు నని వాసుదేవుం డంతర్ధానంబు నొందె నదితియు భగవంతుఁడు తనకుం గుమారుఁడుగాఁ బుట్టు ననుటకు సంతసించుచు భర్తను గొలుచు చుండెఁ గశ్యపుండును జిరకాలార్జితనిజతపఃఫలంబున పరమేశ్వరుండు తనకుం బుట్టఁ గలం డని దివ్యజ్ఞానంబున నెఱింగి తనతపస్తేజం బదితి గర్భంబునం బ్రవేశింపఁ జేసె నదితియుం గుర్విణియై నవమాసంబులు నీరు మోసి నవగ్రహంబు లేకాదశస్థానఫలంబు లొసంగుచుండ శ్రవణ నక్షత్రయుక్తభాద్రపదశుక్లద్వాదశీదినంబున నభిజిన్ముహూర్తమ్మున సూర్యుండు గగనమధ్యగతుండై యున్నసమయంబునఁ జతుర్భుజంబులు శంఖచక్రగదాద్యాయుధంబులు నీలమేఘంబుం బోలుదేహంబును శ్రీవత్సకౌస్తుభంబులును రత్నగిరీటంబును గలిగినకుమారుం గనియె సురలు విరులవానం గురిసిరి దేవదుందుభులు మ్రోసె నప్సరోనృత్యంబును గంధర్వగానంబును బ్రవర్తిల్లె నెల్లలోకంబులు సంతోషావహంబు లయ్యె నదితియు నిజగర్భజనితుం డగుపరమేశ్వరుం గాంచి విస్మయానందంబులం జూచు చుండె నంతలో నాభగవంతుఁ డెల్లరుం జూచుచుండ హస్తాయుధభూషణాదులం దొలంగి శిశువై వటురూపంబు దాల్చెఁ గశ్యపుండును జాతకర్మాదు లాచరించె నంత. 195

సీ. గర్భాష్టమంబునఁ గశ్యపుఁ డావామ
నున కుపనయనముఁ బొనరఁ జేసెఁ
దరణి సావిత్రినిఁ దగ నుపదేశించె
బ్రహ్మసూత్రము వైచె పరమగురుఁడు
మొలనూలు కశ్యపుఁ డెలమిఁ గట్టెను భూమి
కృష్ణాజినం బిడెఁ గీర్తి వెలయ
దండము చంద్రుండు తల్లి కౌపీనము
దివి గొడుగు నొసంగె దీప్తి గలుగ
తే. బ్రహ్మ మేల్కమండలువు సప్తర్షు లోరిమ
దర్భలును వాణి జపమాల ధనవిభుండు
పొదల భక్తి భిక్షాపాత్రమును భవాని
భవ్యభిక్షయు నొసఁగి రా వామనునకు. 196
ఆ. బ్రహ్మచారి యగుచు వామనమూర్తి బ్ర
హ్మర్షిగణముతోడ నలరుచున్న
వాఁడ యగుచుఁ దండ్రిపంపున నగ్నికా
ర్యం బొనర్చి గురుసహాయుఁ డగుచు. 197
మ. ఉపనీతుం డయినంత వామనుఁడు విద్యోపాసనాసక్తుఁడై
యుపదేశంబున మాత్ర నేర్చి కళ లత్యుత్సాహియై యున్నచో
నవు డందందుఁ బరిభ్రమించు ద్విజు లాప్రాంతంబుఁ జేరంగ నే
రుపునన్ వారల మైత్రిఁ జేసికొని ధాత్రిం డాతఁ డుద్యుక్తుఁడై. 198
శా. శుక్రాచార్యులయాజకత్వమున నీశుండై బలీంద్రుండు ని
ర్వక్రప్రక్రియ నశ్వమేధమఘముల్ వర్తింపఁగాఁ జేయుచున్
విక్రాంతిన్ విలసిల్లుచుండె ననుచున్ విప్రుల్ వచింపంగ నా
ప్రక్రాంతోద్యముఁ డావటుం డచోటు వోవం జేసె సంకల్పమున్. 199
వ. తల్లిదండ్రులకుం జెప్పి యొప్పించి. 200

—♦ వామనమూర్తి బలికడకు వచ్చుట ♦—

సీ. నీరాడి శుచియయి నీర్కావిరంగున
గొనబు మీఁదెడు నట్టి గోఁచి బెట్టి

నుదుటఁ భుజంబుల నుదరంబునందును
భస్మత్రిపుండముల్ పరఁగఁ దాల్చి
ముంజి నేణాజినమును గటి బిగియించి
పాలాశదండముఁ బట్టి కేల
నొంటిజందెపుపోఁగు లొండొంటి నొరయుచు
బుజముపై నుండి పెంపునను వ్రేలఁ
తే. బొరుటాకులగొడుగు పైఁ బరఁగఁ దొడిగి
పావలను జంక నొకపిడుపను ధరించి
జలము నక్షతలును బూలు గలుగు పాత్రి
మ్రోని వామనుఁ డాబలియొద్ద కేగె. 201
మంజులవృత్త. రేవానదీతీరరిక్తంబుసందున్
దేవాభుఁ డాపూర్వదేవుండు దీక్షన్
దా వాజిమేధం బొనర్పంగనై భూ
దేవాళి కర్పించె దివ్యార్థకోటుల్. 202
మహాస్ర. భృగువత్సక్షేత్రమం దావిధమునసవముద్వేలమై గ్రాలుచుండన్
భృగుముఖ్యుల్ సూచుచుండన్ వితరణఖనియై పీతిమేధాధ్వరంబున్
దగురీతిం జేయునా దైత్యపతియు నితరుల్ దవ్వులం జూచి రంతన్
మొగముల్ పైకెత్తి నేత్రంబుల కెడగఁ గరంబుల్ దగం జేర్చి వానిన్.
మ. వడుగో నాఁ గనవచ్చునీతఁడు లసద్వర్ష్మప్రభం జేసి సూ
ర్యుఁడో వైశ్వానరుఁడో యనం దెలియనై యొప్పాఱుఁ గాకున్న నీ
బుడుతం డల్ల సనత్కుమారుఁ డగునో పోలింప నీవేళ వి
ష్ణుఁడు మమ్ముం గరుణింప వచ్చెడినో యంచున్ గాంచి రయ్యర్భకున్.
సీ. అనుచు సదస్యమునం దగునందఱు
సందియం పడుచుండు సమయమందు
బుడుతఁడు బుడిబుడి యడుగులు వేయుచు
యజ్ఞశాలకుఁ జేర నగుచు నచటఁ

బాలాశదండము పావలుం గొడుగును
జలపూర్ణ మగు కమండలువు వెట్టి
కృష్ణాజినము మూంజిఁ గేల బిగించుచు
బ్రహ్మసూత్రము చక్కఁ బఱచుకొనుచు
తే. దరిదరికి వచ్చె లేచి యందఱును వాని
కెదురు వోయిరి బలి వానిపదము ముట్టి
కడిగి తోడితెచ్చి పూజించెఁ గాంచనాస
నమున నివసింపఁ గాఁ జేసి నతు లొసంగి. 205
మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు నీభవ్యాహ్వయం బెద్ది యె
క్కడకుం బోవుచు వచ్చి తిచ్చటికి నిక్క గన్గొంగ మానేత్రముల్
కడుధన్యమ్ములు మాహయాధ్వరగతుల్ మాన్యంబు లో దేవ! నీ
యడుగుల్ దాలుతు నాశిరంబునను నీ వావాసుదేవుండవే. 206
తే. మాకులంబు పవిత్రము మాపితరులు
తృప్తిఁ జెందిరి మాతపం బెంతయేని
సఫల మయ్యెను మాహయసవన మిపుడు
పూర్ణ మయ్యెను నీరాకఁ బుణ్యపురుష. 207
మ. భవదీయాంఘ్రిజలంబు నాశిరమునం బ్రాపించుటంజేసి నా
భవబంధంబు లడంగి పోయె విముక్తత్వం బందనై యుంటి మా
భవనం బెల్ల పవిత్ర మయ్యె వటురూపబ్రహ్మమా! నీ వెదో
శివ మర్థించెదు నట్లు దోచు మదికిన్ జెప్పు[illegible] 208
ఆ. మదిని సంశయంబు మసలంగ నీయక
నీదుకోర్కె దెలుపు మేదొ కాని
తప్ప కేను దాని యిప్పుడ యిచ్చెద
నెంత లద్దువడిన యేని కాని. 209




ఉ. గోవులొ భూమిఖండములొ గొప్పగృహంబులొ క్రొత్తగంటులో
శ్రీవిలసన్నికాయములొ చిత్రవిచిత్రవిభూషణంబులో

జీవమణీగణంబులో ప్రసిద్ధదుకూలములో సువర్ణమో
భావమునం దెలర్చెడు నవశ్య మొసంగెదఁ గోరు మిత్తఱిన్. 210

ఆ. మఱియు హరులు కరులు మాన్యంబులున్ మళ్లు
సస్యసంపదలకు స్థానము లగు
గ్రామములును మఱియుఁ గల వెన్ని యేనియు
నడుగు మిత్తు నొండు నుడులు లేక. 211

వ. అనిన వామనుం డతనిఁ బొగడుచు ని ట్లనియె. 212

—♦ వామనుఁడు బలిని మెచ్చి యాచించుట ♦—

ఆ. ధర్మనిష్ఠితంబు తలఁప నీవాక్యము
పరులు నిన్నుఁ బోలెఁ బలుక లేరు
వంశమునకుఁ బోలఁ బలికితి ప్రహ్లాదు
సంస్మరింప వలదె జగతిజనులు. 213

సీ. ఈనీకులంబున హీనజనుఁడు పుట్ట
లేదు పుట్టం డిఁక మీఁద నైన
నిచ్చెద నని బాస యిచ్చి లేదనియెడు
వాఁడు మందున కైనఁ జూడఁ బడఁడు
నీపితామహుఁ డయి నెఱిమీఱు ప్రహ్లాదు
కీర్తి చంద్రుండు నాఁ గ్రేళ్లువాఱు
పుడుకుననే కాదు పోరుల వెన్నిచ్చి
పఱచినపిఱికి చూపట్ట లేదు.

తే. మీఁహిరణ్యాక్షు శౌర్య మమేయ మతఁడు
తన్నెదురువానిఁ గాన జగత్త్రయమునందు
గోసెఁ గాని యొకండును వాసి చూప
నోపఁ డయ్యె నే మనియందు నోబలీంద్ర. 214

వ. విష్ణువాసమయమ్మున వాని వరాహంబై సంహరించి తనపగ్గం బ్రక
టించుకొన్నవాఁ డతనిభ్రాత యగుహిరణ్యకశిపుండును గోపోద్దీపి

తుండై కసిమసంగ్రభ్రాతృహంత యగువానిం జంప శూలంబు కేలం గీలించి వైకుంఠంబునకుం జనినవానిం గాంచి మాయావి యగు మాధవుండు వీఁ డెందుఁ బోయిన నన్నందు మఱిందింపక పోవం డని భయంపడి వానిహృదయకుహరంబునం జొచ్చి వాయులీనుండై డాఁగి యుండె నట్టిమీతాతశౌర్యం బనివార్యంబు మీతండ్రి విరోచనుండు విష్ణుభక్తి గలవాఁడై దేవతలం బ్రేమించి వారికిఁ దనయాయువు నొసంగె నట్టివానిపట్టి వగునిన్నుఁ జెప్ప వలయునా ? నీవు సకలధర్మ స్వరూపుఁడవు వదాన్యశేఖరుండవు. 215

సీ. అట్టిని న్నొక్కఁడు యాచించుచుంటి నా
యడుగుతోఁ గొలిచి మూ డడుగు లైన
పుడమి నా కిడుము హెచ్చుడుగ వలసినంత
యడిగితిఁ గొండంత యయ్యెడు నది
నా మాణవకుఁడ వొండేమి యెఱుంగవు
దాతృశేఖరు నిట్లు తగు నె కోర
నాకు యాచకుఁ డైననరుఁడు వేఱొక్కని
యాచకుఁ డగుట కే ననుమతింపఁ

తే. గావున యథేష్టముగ నీదు జీవికకును
జాలినంతభూమినిఁ గోరు మేల యిట్లు
చిన్నచూపున ననుఁ జూతు వన్న నగుచు
వామనుండు బలిం గాంచి పలికె నిట్లు. 216

తరువోజ. పేరాస గలవాఁడు పృథివి యెల్ల నిడఁ
బ్రియుఁ డయి తృప్తి రూపింపఁ బోవండు
ప్రారబ్ధగతిఁ దృప్తిఁ బడసినవాఁడు
పరఁగు మూర్ఖ దృప్తినిఁ బడసినయట్లు
పూరుషునకు నెంత ముఖ్యమో దానిఁ
బొందఁగ నగుఁ గాని భూర్యర్థ మనుచు

మేఱ మీఱిన దాన మిగులఁ గష్టంబు
మెలిగొనఁగా వచ్చి మిసిమింతుఁ జేయు. 217

వ. అనిన హసన్ముఖుండై వైరోచనుండు వామనా! నీవాంఛితంబు దీర్చెద రమ్మనిభూమిని ధారాదత్తంబు సేయ జలపాత్రిం బూని యున్నసమయంబున శుక్రుండు బలిచక్రవర్తి కిట్లనియె. 218

ఉ. ఈతఁడు బ్రహ్మచారి యని యీవు దలంచుచు నుంటివేమొ కో
యీతలపోసినట్టివిధ మీతనియందు సుమంత దోఁపఁ బో
దీతఁడు వాసుదేవుఁ డసురేప్సితమున్ నెఱవేర్చుపొంటె నీ
భూతలమందుఁ గశ్యపునిపుత్రుఁడ వై ప్రభవించె నిగ్గతిన్. 219

క. ముం దరుదెంచునవర్థము
డెందంబునఁ దలఁప వైతి డెప్పరమున కై
పొందుపడు కార్యమందున్
ముందంజన్ వేసి తీవు మొఱకుఁడ వగుచున్. 220

చ. అడుగులు మూడు వేఁడె నిను నౌ నని నీ వవి యిత్తునంటి వీ
బుడుతఁడు మూడులోకములు ముంచెడురూపముఁ దాల్చి సర్వమున్
దొడికొని పోయి దేవదయితుం డగునింద్రున కిచ్చు దాన నీ
విడుమలు గుడ్చువాఁడ వయి యింతల నంతలఁ బట్టి పోదయో. 221

ఆ. ఇతఁడు విశ్వరూప మెత్తి యాకస మొక్క-
యడుగు పుడమి యొక్కయడుగు గాఁగ
నాక్రమించు నవలియడుగు గీ వెచటినుండి
తెత్తొ దత్తవాక్కు తెరల దొక్కొ. 222

ఉ. నీదుప్రతిజ్ఞఁ జెల్లునటు నీవు పొనర్పఁగ లేనివాఁడవై
పోదువు దాన లే దనుచు మున్న వచించుట పోలు యుక్తమా
నేదియు నే నగున్ మొదటికే మఱి మోసము దెచ్చుదానముల్
కా దని శాస్త్రముల్ దెలుపు గాదె తలంపుము దైత్యవల్లభా. 223

తే. ఘనుఁడు తనవిత్త మైదుభాగములు చేసి
ధర్మ మర్థము కీరితి తనదుభోగ

మాత్మజులభుక్తి పీనికై యగు నాసంగ
మొదలు చెడిపోవుబేరము పొసఁగ దెపుడు. 224

క. కీరితి కీతని కంతయు
ధారాదత్తంబు సేసి తనవారును దా
ధారుణిఁ గష్టము లొందుట
మేర యనం గలఁడె యెట్టిమేధావియు నేఁ. 25

సీ. సత్య మసత్య మేచక్కి వో ఘెప్పెద
వినుము వృక్షమునకు ననయుఁ బండు
వంటిదిసత్యంబు వర్ణంబునకుఁ; జెట్టు
జీవింపకుండిన లేవు పూలు
పం డ్లట్టిదేహము పడినచో సత్యంబు
సంతరించుటయు నసంభవంబు
మెయి కసత్యము మూల మయి యుండుఁ సలుపంగ
మొదలు తెగినఁ జెట్టు బ్రదుకు టెట్లు

ఆ. కాన నన్నృత మాడి యైనఁ గాయము నిల్పు
కొనుట లొప్పు యాచకునకు నిత్తు
ననినదానిలోన నర్ధ మిచ్చినయేని
యంత యిడినయట్టిఁ డగును దాత. 226

తే. నర్మవాక్యములందును నాతులయెడ
పరిణయములందు నిజవృత్తి పరఁగుపోంటఁ
బ్రాణసంకట మప్డు గోబ్రాహ్మణార్థ
మన్నృత మాడి జనుఁడు దోష మందఁ బోఁడు. 227

వ. అని యిట్లు శుక్రాచార్యుండు పలికిన బలీంద్రుండు వినియుం గొంచె ముసే పోండు పలుక కూరకుండి సావధానమనస్కుఁడై గురునిదిక్కు మొగంబై యి ట్లనియె. 228

సీ. నీవచించినదెల్ల నిక్క మా నరకా
మాదులకు విరోధమలర కుండ
వ్యవహరించుట గృహికగును ధర్మం బటు
ప్రహ్లాదవంశసంభవుల కద్ది
ధర్మము కా దందు ధరణీసురుని కిత్తు
నని పల్కి యిపుడు లే దనుట యెట్లు
కలుగ దసత్యముకంటె నధర్మము
మఱియొక్క డుండదనిమాట నిజము

తే. సప్తకులపర్వతంబుల సకలసాగ
రముల మోయుదు నే నసత్యమును బలుకు
నధమునొక్కని మోయలే ననుచుఁ దొల్లి
తెలియ హరితోడ భూదేవిపలుక దట్టె. 229

శా. ఆధివ్యాధుల కేను జంక నిరయం బౌనంచుఁ జింతింప నే
బాధల్ వచ్చిన నించుకే వగవ నాస్వారాజ్యముం బోయినన్
నాధిష్ణ్యంబును దేహముం దెగినఁ గుందన్ విప్రు వంచింప నా
గాధల్ వింటకు నెంతయేనియును దుఃఖం బందుదున్ భార్గవా. 230

చ. వివిధకళాప్రవీణు లతివిశ్రుతవైభవసాంద్రు లెందఱో
భువి మును పుట్టి గిట్టి రొకపూరుషు నైన నొకం డెఱుంగునే
కవివర! ప్రాణదానమును గా దన కిచ్చి దధీచియున్ శిబి
ప్రవరుఁడు లోనివా రదుగుపట్టి రటంచు వచింప నొప్పునే. 231

ఉ. ధైర్యము శౌర్యముం గలిగి దాతృశిఖామణులై తలిర్చులో
కార్యుల భాగ్యభోగ్యముల నట్టె హరింపఁగఁ జాలెఁ గాని స
త్కార్యసముద్భవం బయి ప్రకాశిలు కీర్తి హరింపఁ జాల దా
చార్యమ యయ్యెఁ గాల మని సాహసచిత్తముతో వచించెదన్. 232

చ. సరసకు వచ్చి యాచకుఁడు చాచి కరంబులు దేహి యన్న నే
పురుషుఁడు లేదు పొమ్మనఁగఁ బోవునొ వాఁడు పినుంగు బోలె నై

భర మగుఁ జైద్యవృక్షములు పర్వతముల్ గుడిగోపురాలు సా
గరములు కాననంబులును గావు భరంబులు భూమిదేవికిన్. 233

వ. ఇంతియుం గాక. 234

ఉ. వచ్చినవాఁడు విష్ణు నన వచ్చెడుఁ గాని వటుం డొకండు నా
వచ్చునె యంటి వట్లగుట నయ్యారె నాదునదృష్ట మెంతయున్
హెచ్చి నుతింప వచ్చు నని యే వచియించెద నద్ది వేయియేం
డ్లిచ్చ తపంబు సేయుమునులందెడుభాగ్యము కాదె భార్గవా. 235

ఉత్సాహ. ఇతఁడు నాకు వరదుఁ డైన నేమి శత్రు వైన నే
మితని కీర్తి కోరినట్టిదెల్లఁ జెల్ల నింతయున్
హేతుఁడు గా కితండు నన్ను నిరియఁ గట్టు నంటి వ
ఖ్యాతము డైన సంతసంబ బీటఁ బొంద దేనికిన్. 236

చ. సిరిదొరసాని యక్కునను జెన్నలరారఁగ సర్వలోకముల్
గరగరికం బొనర్చుటకు గాదిలి నేలుటకున్ సమర్థుఁ డై
దొర యయి బ్రహ్మముఖ్యులను దోఁపఁగఁ జేసినవాసుదేవునిన్
శరణము లంటి కొల్చి యిటు దానము సేయఁగ నుంటి ధన్యుఁడన్.

వ. అని మఱియు నోగురూత్తమా! నీ వి త్తఱి నెంతచెప్పినను నే నీమా
ణవకోత్తమునకు భూదానంబు సేయక మాన నని తన్ను నిరాకరిం
చినఁ గరం బలిగి శుక్రుండు నీ త్రైలోక్యసామ్రాజ్యంబు శీఘ్రకాలమున
నశించు నని శపించిన సరకుగొనక వైరోచనుండు వామనుం బూజింప
నెంచిన నెఱింగియు నిజనాథునను మతంబున భార్యయగువింధ్యావళి
సువర్ణకలశంబుతో జలంబులం దెచ్చి పయిం బోయుచుండ బలి పాద
ప్రక్షాళనంబు గావించి తీర్థంబు శిరంబులం జల్లుకొని. 238

శ్లో. శ్రీమద్వామనమూర్తయే త్రిభువనక్షేమంకరా యేశ్వర
బ్రహ్మేంద్రప్రభవాయ భావభవసంభావ్యాయ భవ్యాత్మనే
త్రైగుణ్యాంచితమూర్తయే మునిజనస్తుత్యాయ వేదాత్మనే
ధాత్రీం సంప్రదదే మ మాస్తి న ఫలం దేవాయ తుభ్యం నమః. 239

— ♦ వామనునివిశ్వరూపావిర్భావము ♦ —

వ. అని మంత్రిం బుచ్చరించుచుఁ బాణితలంబున ధారాదత్తంబు గావించె
దేవత లంతరిక్షంబునుండి బుష్పవర్షంబు గురిసి రంతలోన. 240

క. అంతక వామనుఁ డింతై
కొంతటిలో మఱియు నొక్కకొంతై మఱి కొం
డంతై యింతటిలో జగ
మంతయు నిండంగఁ బెఱిఁగె నచ్చెరు వెసఁగన్. 241

సీ. శీర్ష మాకాశము చివరకొమ్మలు దాఁకె
పాదముల్ పాతాళభాగ మందె
భూమి యంతయు నిండె భూరిశరీరము
చేతులు దిక్కులచివర లందెఁ
గుడికన్ను భాస్కరు నెడమకన్ జంద్రము
నంటి వెల్గించెడునట్టి వయ్యె
బ్రహ్మాండగోళంబు పగిలినయ ట్లాస్య
కుహరంబు భయదమై కొమరుమిగిలెఁ

తే. గుక్షి సాగర మట్లు ప్రత్యక్ష మయ్యె
సప్తమారుతములను శ్వాసంబు దోలెఁ
దలను బ్రహ్మాండము లవి చుక్క లన వెలింగ
వామనునివిశ్వరూపము వఱలె నపుడు. 242

వ. మఱియు వానిపిక్కలఁ బర్వతంబులును జానువులఁ బక్షులును వక్త్ర
మున సంధ్యలును గుహ్యమునఁ బ్రజాపతులును బుక్కిట నాకాశం
బును గుక్షి సాగరంబులును హృదయమున ధర్మ్మందును మనంబునఁ
జంద్రముండును వక్షమున లక్ష్మియుఁ గంధరమున సామవేదంబును
భుజముల నింద్రాదిదేవతాగణంబును గర్ణంబులఁ గాష్ఠలును శిరం
బున నంబరంబును గేశంబుల నభ్రంబులును నాశిక ననిలంబును
గన్నుల సూర్యుండును మొగంబున ననలంబును వ్యాహారంబున

వేదంబులును రసన వరుణుండునుగన్నుఁ జెప్పల రేయింబవళ్లును దేజంబున జలంబును బదన్యాసంబుల నధ్వరంబులును దేహచ్ఛాయ మృత్యువును నవ్వున మాయయు రోమముల నోషధులును నాడుల నదులును బుద్ధిని బ్రహ్మయు నింద్రియంబుల ఋషిగణంబును శరీరంబునఁ జరాచరాత్మకప్రపంచంబును బరికింప నయ్యె నిట్లెల్లలోకంబులు నిండిన భగవంతుఁ గాంచి దైత్యలోకంబు భయంపడియె నపుడు సుదర్శన చక్రంబును శార్ఙ్గచాపంబును బాంచజన్యశంఖంబును గౌమోదకీ గదయు విద్యాధరనందకనామంబుల నలువుమీఱుఖడ్గంబులును ధనుర్బాణతూణీరాదులును ధరించి సునందాదిపార్షదులును లోకపాలురును సేవింపఁ గిరీటాంగదకుండలశ్రీవత్సకౌస్తుభపీతాంబరాది దివ్యభూషణభూషితుండై త్రివిక్రమరూపుండై దీపించె నప్పుడు. 243

క. ఒకపాదంబున భూమిని వే
ఱొకపాదమున నభము నొయ్యనఁ గొని తా
నిఁక మూఁడవపాదం బిడ
నొకయింతయు చోఁటు లేక నొగి బలి కనియెన్. 244

మ. ఒకపాదంబున మీఁదిలోకములు వే ఱొం డైనపాదంబునన్
గకుబంతంబులతోడి క్రిందితలముల్ గైకొంటి నా కింక నె
ట్లు కనుంగొన్నను చోఁటు గానఁ బడకుండున్ మై పదం బెందు నాఁ
పికొనం జెప్పుము దాత వాడినటు కావింపంగఁ జెల్లుం గదా. 245

సీ. ఆసమయంబున నాసురసైన్యముల్
చెలరేఁగి వామనుచేత కలిగి
శూలాదులం బూని కీలిసా మందుచు
వామనునిం జంప వచ్చుటయును
గని విష్ణుపార్షదుల్ కనలి వచ్చెడువారి
నదలించి బెదరించి యాఁగి రపుడు
బలి తనవారినిఁ బరికించి మన కిది
కాలము గా దీర లాలమునకు

తే. సిద్ధపడరా దయో విప్రచిత్తి! యోయి
రాహు! వోహేతి! యోరణప్రవరులార!
భూతపతి కాలరూపుఁ డీరీతి మనకుఁ
జెడ్డకాలము గలిగించెఁ జెప్పనేల! 24

వ. అని తనవారి వారించె నంతలో నంద సునంద కుముద కుముదాక్ష
జయ విజయ ప్రబ లోర్బల విష్వక్సేన గరుత్మదాదులు శ్రుతదే
పుష్పదంత సాత్వత ప్రభృతులును దైత్యదానవవీరులఁ బాతాళంబ
నకుం బాఱఁ దోలి రప్పుడు గరుత్మంతుఁడు భగవదభిప్రాయం బను
రించి బలిని వారుణపాశంబుల బంధించె నప్పు డెల్లదిక్కులు హాహ
కారంబు గావించె నయ్యవసరంబునఁ ద్రివిక్రముం డాబలిం గాం
యి ట్లనియె. 24

ఆ. ఇత్తు నన్న దాని నీకున్న నరకంబు
గాక మాన దెట్టిఘనున కైనఁ
గాన నీదుప్రతిన గావింప నగు సత్య
మార్గమందుఁ బడెదుమాడ్కి మెఱయు. 24

వ. అప్పుడు ధైర్యహిమాద్రి యగుబలి చలింపక జంకక గంభీరస్వరంబుతో
త్రివిక్రమదేవుం దిలకించి యి ట్లనియె. 24

ఉ. ఆడినమాట తప్పి నరకాధుల నందెడువాఁడఁ గాను నే
మూ డడుగుల్ ధరాతలముఁ బోయుచు ధార యొసంగినాఁడ నో
ప్రోఁడ మఱొండువా కిపుడు మోముననుండి వెలార్ప నేతునే
మూడవకాలు నాదుతల మోపుము పాప మదెల్లఁ బాయఁగన్.25

ఆ. నరకభయము పడను బరరాజ్య మునకుఁ బో
నింత వగవ గురుల హేళనములు
సరకుగొనను జంక మరణమున కసత్య
మునకు జంకినట్లు వనజనాభ. 25

సీ. తల్లిదండ్రులు గోలెఁ దగ్గరచుట్టలో
నర్పనిదండము నాకు నీవు

ఘనుఁడ వౌనర్చితి కమలాక్ష. యిప్పు డీ
ఘనశిక్ష కింతలో గర్వపడుదు
నిది నాకు గురుఁడవై హితము గూర్చుట సూవె
పాశబద్ధుం డగుపగిదిఁ జేత
నిగ్రహ మన న న్ననుగ్రహించుట యందు
దీనఁ గీర్తి లభించు దానఁజేసి
తే. పవన మేనియుఁ గుడువక బహుళసమలు
వనులఁ దపియించుఋషులకుం గనఁగ రాని
నీదుసందర్శనమె కాక నీదుపాద
ముల భజించెడు భాగ్యము గలిగె నాకు. 252
శా. నాప్రహ్లాదునిపౌత్త్రుఁ డీతఁ డనుచుర్ నామీఁదఁ బ్రేమించి యెం
తే ప్రాకామ్యముఁ గూర్ప నెంచితివి గాదే దేవ! లేకున్నచో
నాప్రాణంబులు దీయకుండెదవె తన్మార్గంబు గా కిట్లు రి
ష్టప్రారంభ మొసంగఁ జేసితివహో సాక్షాత్కృపామూర్తివై. 253
తే. నీవు తనదైత్యవంశము నెగులు గుడువఁ
జేయువాఁడవ యైన లక్ష్మీకళత్ర!
సర్వరక్షకుఁ డని నిన్ను శరణుఁ జొచ్చె
తాత నే నట్టులే కొల్తు దైవత మని. 254
వ. అని బలి వలుకుచున్నసమయంబునఁ, బ్రహ్లాదుండు వచ్చి యెదుట నిల్చినం గని సిగ్గున మొగంబు కుంచి వరుణపాశబద్ధుండగుటంజేసి లేచి నమస్కరించుట కశక్తుండై శిరంబు వంచి నమస్కరించెఁ బ్రహ్లాదుం డును గరుణాతరంగితాంతరంగుడై సునందాదిపార్షదసేవితుం డగు త్రివిక్రముని సమీపించి దండప్రణామంబు గావించి యి ట్లని ప్రార్థించె.
సీ. విశ్వజిద్యాగమ్ము విశ్వవిశ్రుతముగా
సలుపుటఁ జేసి యీబలిని మెచ్చి
వీని కింద్రత్వ మీవే యిచ్చితివి దానిఁ
బుచ్చుకొంటివి నీవె పోలు నిట్లు

మోహబద్ధులఁ జేసి పురుషుల భంజించు
దుష్టసంపద లవి తొలఁగు టొప్పు
వీనిని సంపద్విహీనునిగాఁ జేత
నెంచి చూడ ననుగ్రహించుటె యగు

తే. ఇట్టియుపకర్తవును జగదీశ్వరుఁడవు
సర్వరక్షకుఁడవు నమస్కార మనెడు
నంతలో బ్రహ్మ యుద్యుక్తుఁ డయ్యెఁ బలుక
నపుడు బలీ ధర్మపత్ని వింధ్యావళియును. 256

వ. పాశబద్ధుండై యున్నభర్తం గాంచి భయంపడుచుఁ గన్నీరు కాలువలు
గట్టఁ జేతులు గట్టుకొని వామనమూర్తిం దరియవచ్చి యి ట్లనియె.

తరువోజ. ఈవిశ్వమంతయు నీవాడుకొనఁగ
నెంచి సృజించితి వీయాట వస్తు
వేవిధంబున వచ్చె నెఱుఁగక మూఁఢు
లేమె స్వతంత్రుల మేమె ప్రభుల
మేవాఁడు మముఁ బోలునే యంచు నుందు
రెఱుఁగరు మోహాంధు లీశ్వర! సర్వ
మీవె సర్వము నీదె యెవఁడు నీ కేమి
యిచ్చువాఁ డుండు నో యెఱుఁగ మోదేవ. 258

క. లోకత్రయ మిచ్చితి నేఁ
గైకొను మని నామగండు కానక పలికెన్
నీ కిచ్చు టేమి నీయది
యే కదె యీవెడఁగుఁ గావవే పరమేశా. 259

వ. అంతలో బ్రహ్మదేవుండు వామనున కభిముఖుండై దేవా! సర్వమును
భవదధీనంబు గావించినయీబలి దండనార్హుండు గా డనుగ్రహించి
పాపముక్తునిం జేయు మని పల్కిన నారాయణుం డి ట్లనియె. 260

తే. ఓయి కమలాసనా! విను ముల్లమం దె
వని ననుగ్రహింపఁగ నెంతు వానిసంప

దల హరింతుఁ గాకున్న నాతండు ధనమ
దాంధుఁ డగు నని చేసితి నయ్య యిట్లు. 261

సీ. బలి దైత్యదానవప్రముఖులలో శ్రేష్ఠుఁ
డితఁడు నామాయ జయించి మించె
నెంత లాపద లైన నేనేమి వచ్చినఁ
దనమనోనిశ్చయమును విడువక
సత్యము పాలించె సర్వజగం బెన్న
నీనిఁ బోలినవాఁడు వెదుక లేడు
దేహావసానమం దీహరిభక్తుఁడు
ముక్తుఁడై నాలోకమున సుఖించు

తే. అమరు సావర్ణిమన్వంతరమున నీతఁ
డీతనువృకోడ 'నిందుృఁడై యెసఁక మెసఁగు
నంతదనుక సుతలలోకమందుఁ బ్రభుతఁ
గాంచి దీపించు నాయనుగ్రహము కలిమి. 262

వ. మఱియు వీని కేయుపద్రవంబును లేక సర్వసౌఖ్యంబులును సమకూఱు
చుండు నని బలిం గాంచి యి ట్లనియె. 263

ఉ. మే లగుఁ గాక నీకుఁ గడు మిక్కిలివారును నిన్నుఁ బోలఁగాఁ
జాలరు దైత్యదానవు లజస్రము నిన్ భజియించుచుండ్రు పా
తాళమునందు నేఁటిసుత దర్పము పేర్పడ ధర్మమూర్తివై
పాలనముం బొనర్చుచుఁ బ్రభం జను మాప్తులఁ గూడి వేఁడుకన్.

ఉ. భక్తుఁడ వీవు భక్తునకు భావ మొసంగుదు నేను గాన నా
సక్తి మెయిన్ భవద్గృహము సంపదలన్ బొలుపొందఁ జేయుచున్
బ్రాక్తనపుణ్యమో యనఁగ ద్వారముఖంబునఁ జక్రపాణినై
రక్తుఁడనై మెలంగెద నిరంతరదర్శన మిచ్చుచుం గృపన్. 265

వ. అని పలికి ప్రసన్నహృదయుండై పజ్జ నున్నప్రహ్లాదునిపై దృష్టి నిగి
డించి పరమభక్తాగ్రేసరా ! భక్తానుగ్రహంబునం జేసినప్రార్థనంబుఁ

బాటించుచు నిట్లు కావించితి నింక నీవు నీమనుమనిం గూడి పాతాళలోకంబునకుం బోయి మెలంగుచు నందు నాదర్శనంబు సంతతంబు గావించుచుండుము నీకు శుభం బగుఁ గావుత మనియంపిపుచ్చిన బలిచక్రవర్తి ప్రహ్లాదునితో సకలపరివారపరివృతుండై యింద్రాదుల ననుమతించి రసాతలంబునకుం జనియె నట్లు బలిచక్రవర్తి వలనఁ ద్రైలోక్యరాజ్యంబు వడసి వామనుం డింద్రున కిచ్చి బ్రహ్మాదులు ప్రస్తుతింప నపుడు బలిచేయుచున్న యజ్ఞము శుక్రుని చేత సమాప్తి గావించి దేవర్షి బ్రహ్మర్షి సేవ్యమానుండై యదితికశ్యపుల నానంద వార్ధిం దేల్చి యింద్రాదులం గూడి స్వర్గంబునకు నిర్గమించెఁ గురునందనా! యిది వామనచరిత్రంబు దీనినిం జదివిన వినిన సకలార్థంబులు సిద్ధించు ననినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి.

క. వామనచరితము వినుటఁ
నామనమున సంతసంబు నలువై మీతోఁ
స్వామి! హరి మత్స్యరూపం
బేమిటికి ధరించె నెట్టికృత్య మొనర్చెఁ. 267

వ. వినుటకుం దివుటమై నాయుల్లంబు పల్లవించుచున్న దనవుడు శుకుం డిట్లనియె. 268

—♦ మత్స్యావతారకథాప్రారంభము ♦—

తే. చనినకల్పావసానమునను విరించి
సృష్టివ్యాపారమును మాని చేసె నిద్ర
నపుడు ప్రళయము సంభవ మయ్యె మూఁడు
భువనములు జొచ్చెను సముద్రభువనములను. 269

తే. స్రష్ట శయనించి యున్న యాసమయమందుఁ
వేదములు తన్ముఖంబున వెలికి వచ్చె
వచ్చినం గనియటనున్న వాఁడు రాక్ష
సుఁడు హయగ్రీవుఁ డవి గొని జడధిఁ జొచ్చె. 270

వ. అంత శ్రీహరిమత్స్యరూపం బెత్తి వాని సంహరించి వేదంబులం దెచ్చి విధి కిచ్చె నది యంతయు వివరించి చెప్పెద నాకర్ణింపు మని మఱియును. 271

సీ. గతకల్పమునయందుఁ గలఁడు సత్యవ్రతుం
డనెడు రాజర్షి క్షమాన్వితుండు
జలపానమాత్రము సలుపుచు హరి మన
మున నిల్పుకొని తప మును బొనర్చె
నతఁడె వైవస్వతుఁ డనుపేరు గొని యీమ
హాకల్పమున మను వయ్యె వినుము
సత్యవ్రతుం డొకసమయంబునందు మా
లానదికిం జని స్నానదాన

తే. తర్పణాదు లొనర్చెడుతఱుణమందు
వానిదోయిటనీళ్లలోఁ గానఁబడియె
మత్స్యశాబక మొక్కఁ డామాద్రి దాని
జలములం బడవేయఁగాఁ దలఁచె నతఁడు. 272

మ. అది రాజర్షినిఁ గాంచి యి ట్లను గృపాత్మా! యిం దనేకంబులై
పెదపెద్దల్ శకులంబు లుండె నలఁతిన్ వీక్షించి భక్షించెడిన్
మది భీతిల్లెడు నన్నుఁ గావు మన నామాన్యస్వభావుండు తా
నిది యా లెమ్మనుచుం గమండలువునం దచ్చేఁప రూపించుచున్. 273

వ. గృహంబునకుం గొనిపోయె నాచేఁప యేకరాత్రంబునన యేపుమీఱి సత్యవ్రతుం గాంచి యి ట్లనియె. 274

చ. ఇఱుకట మయ్యె నిందు వసియింపఁగఁ జాల మఱొక్కచోట నా
కిఱవు ఘటిల్లఁ జేయు మన నంతయు వింత నతండు దానినిన్
జెఱుకుపెనంబు నీట విడిచెన్ క్షణమాత్రములో ఝషంబు చె
చ్చెఱఁ బెనుగొండచందమునఁ జేసెను మే నతిభీతిదంబుగన్. 275

వ. అట్లు కాయంబు పెంచి మహామత్స్యంబు రాజర్షిం గని యి ట్లనియె.

సీ. అవనీంద్ర! యీకటాహము మొదలుటకును
గదలుటకు చోటు గలుగని దగు
గరుణించి న న్నొక్క కాసారమున నిల్పి
యొడ లోముకొనునట్టు లొనరుపఁ గదె
యనిన సత్యవ్రతుం డబ్బంబు పడి దానిఁ
గయికొని యొకతటాకమున నిలిపె
క్షణమాత్రిలో నది కనుఁగొనఁ జెఱువెల్లఁ
దానయై తిరుగాడ లేని దగుచు
తే. రాజఋషిఁ గాంచి యనె నీసరోజలంబు
నాకు సుఖమీయఁ జాల దోలోకవినుత
నన్ను రక్షించుతాత్పర్య మున్న నేని
పెద్దమడువున నెందు నే పెట్ట మనవి. 277

వ. అనిన నతం డట్లకా యని దానిం గొనిపోయి యొక్క పెద్దమడువునం జేర్చి యదియును దాని కాయసంచాలనంబునకుఁ జాలనికతంబున దాని నొకసముద్రంబునఁ జేర్చె నంతలో నాగండుమీ నామానవ నాథుం గాంచి యి ట్లనియె. 278

శా. ఈసంద్రంబున గ్రాహముల్ గలవు పెక్కిం దెందు నే నున్న నా
గ్రాసంబుం బొనరించుకోఁ దలఁచెడిం గారుణ్యాపాథోనిధీ!
నాసంరక్షణ మిట్లు చేసియును నీనాఁ డిట్లు గ్రాహాస్యమఁ
దేసందేహము లేక వేయుదువె తండ్రీ! నన్ను రక్షింపవే. 279

వ. అనిన సత్యవ్రతుం డావాక్యంబులు విని నివ్వెఱంపడి మత్స్యవల్లభుం గాంచి యి ట్లనియె. 280

మ. నను మోహింపగఁ జేయుచుంటి విటు నిక్క సామాన్యమత్స్యంబు నా
మనమం దెట్టులు విశ్వసింతును మహాత్మా! చేప కీరూప మీ
ఘనవాగ్గుంభన మెట్లు వచ్చెడిని యొక్కం డైననా ణ్ణాఱుయో
జనముల్ మేఱగ నేను వెంపఁ గలమత్స్యం బెందు నేఁ గందు మే. 281

ఉ. నీవు చరాచరంబులను నిర్మితి సేయఁగఁ బెంపఁ ద్రుంపఁ గా
నై వెలుఁగొందు దేవుఁడ వనంతపరాక్రమవిక్రముండ వో
దేవ! జగన్నివాస! నిను దివ్యమునీంద్రు లెఱుంగఁజాల రీ
భూవలయంబు నేలుటకుఁ బుట్టితి విట్టులు మత్స్యమూర్తివై. 282

వ. అని పల్కిన సత్యవ్రతునకు మత్స్యరూపుం డైనభగవంతుం డిట్లనియె.

ఉ. నేఁటికి నేడునాళ్ళపయి నీరజగర్భుఁడు నిద్ర నొందు నా
నాఁటన కల్ప మేర్పడి కనంబడుచుండెడు నెల్లలోకముల్
నీట మునింగిపోయెడి మునిప్రవరా! విను మప్పు డిట్లు నీ
రాటుఁడనై మదీయు లగునందరఁ గావఁగ నుంటి వింటివే. 284

చ. స్థలము జలంబు నేర్పడఁగఁ జాలని యప్పుడు సర్వలోకముల్
జలమయ మైనయ ప్థాకవిశాలతరం బగునావ వచ్చు నీ
కెలనకు నీవు దానిపయిఁ గేవలబీజము లెల్ల నింపి నీ
గలజనులన్ మునీంద్రులను గల్గి వసింపుము దానిపై వెసన్. 285

ఆ. అపుడు సూర్యరశ్మి యగపడమిన్ జిమ్మ
చీఁకటులు నలుగడఁ జిక్కనగుచుఁ
గ్రమ్మఁ బ్రళయవాయుగతి నావ తరగలఁ
గొట్టుకొనును భయముఁ గొనఁగ వలదు. 286

శా. నే నేనీరూపున నప్డు నీదుకడకున్ విచ్చేయుదుం బెద్దపా
మాన్నావం గనిపట్టు నప్పుడు మదీయంబైనశృంగంబునం
దానిం గట్టుము నేను ద్రిప్పుచు సముద్రింబందుఁ గల్పాంతమై
కాన న్వచ్చెడు దాఁక నిన్ను మనుపంగా నుందు నే ల్గూర్చుచున్.

వ. అని పలికి భగవంతుం డంతర్ధానంబు నొందినంత సత్యవ్రతుండు ప్రాగ
గ్రంబు లగుదర్భలపై నుత్తరాభిముఖుండై కూరుచుండి భగవంతుని
ధ్యానించుచుఁ గాలప్రతీక్షం గావించుచుండె నంత. 288

ఉ. చిక్కనిమేటికాటుకను [illegible]ము లేగఁగఁ బ్రామినట్లు లై
యెక్కడఁ జూచిన న్వారియనేర్పడి పేర్పడి కాఱుమబ్బు ల

మ్మేక యనంగ వర్షము సమంతయుగాఁ గురిసెఁ బ్రవాహ మై
దిక్కు లెఱుంగరానిపగిదిఁ జలపూరము ముంచె భూస్థలిన్. 289

వ. అమ్మహావర్షంబున సముద్రము వర్ధిల్లి హద్దుమీఱి భూతలం బావరింప నారంభించె నది యెఱింగి సత్యవ్రతుండు మత్స్యమూర్తిన్ ధ్యానించుచు నెదుట నొకమహానౌకం గని దానిపై బీజాది సంగ్రహణంబు గావించి సప్తర్షులతో నధిష్ఠించె నంతలో నమ్మహార్ణవంబున లక్షయోజనంబుల పొడవై సువర్ణమయం బగు నేకశృంగంబు గలమత్స్యంబు లోచనగోచరం బగుటయు నతం డానౌకయందలి సర్పంబుతో దాని నామత్స్యశృంగంబునకుం గట్టి సంతుష్టచిత్తుండై యి ట్లని స్తుతించె. 290

సీ. అజ్ఞానమునఁ బరమాత్మతత్త్వ మెఱుంగ
నట్టిరు నీయాశ్రయమునఁ జేసి
నీకృపాపాత్రులై నిర్వాణసౌఖ్యము
నొందువా రగుదు రోయిందిరేశ
నీ వుపదేష్టవు నీసేవ సర్వపా
పాపహమై పుణ్య మదుకఁ జేయు
నీసేవ సేయఁగా నేరనివాని నే
నిర్జరులును గావ నేర రరయ

తే. అఖిలలోకాంతరాత్మవు నవ్యయుఁడవు
ముక్తిదుండవు నే నీకు మ్రొక్కి శరణు
వేఁడుకొనుచుంటి నాయాత్మపీఠి నిలిచి
నీస్వరూపముఁ జూపవే నీరజాక్ష. 291

వ. అనిన రాజునకు సంతసించుచు మత్స్యమూర్తి సముద్రమధ్యంబున విహరించుచుఁ బ్రకృతివిలక్షణం బగు నాత్మజ్ఞానమును భక్తియోగంబును సత్యవ్రతున కుపదేశించె సత్యవ్రతుండును మునులతోడం గూడి పరమాత్మజ్ఞానవిరాజమానుండై యుండె నంతరంబ హరి

పరిశయావసానమున నిద్రనుండి లేచినబ్రహ్మకు నాలో హయగ్రీవునిం జంపి తెచ్చినవేదంబు లిచ్చిపుచ్చె సత్యవ్రతుండును శాస్త్రజన్య జ్ఞానంబున నొప్పుచు నప్పురుషోత్తమప్రసాదంబున నీకల్పంబున వైవస్వతమను మయ్యె నని శుకుండు వెండియు. 292

శా. మాయామత్స్యమహత్వతత్త్వమును సంమానించి భక్తిన్ జనుం
డీయుర్విం బఠియించుచున్ జనుల కెంతేఁ బ్రీతి బోధించుచున్
బాయం జాలక గొల్చుచున్ సకలసౌభాగ్యంబులం బొందియున్
స్థాయత్తేజమునం బ్రకాశిలుచు విశ్వశ్రేయముం గాంచెదున్. 293

వ. అని పరీక్షితునకు శుకుండు చెప్పెనని సూతుండు శౌనకాదులకుం చెప్పిన వా రవ్వలికథావృత్తాంతంబు చెప్పు మని యడుగుటయును.

అష్టమస్కంధాంతము.

ఉ. నాయెడఁ బ్రేమఁ జూపుచును నాదగుభాగవతప్రబంధమున్
మాయిలువేల్పు తాన నెడుమాడ్కి మదంకిత మాచరింపుమం
చేయెడ వేఁడుచున్ ధనము నెంతయు నిచ్చిన సాగిసూర్యనా
రాయణరాజు రాజసభలందుఁ బ్రకాశమునొందుఁగావుతన్. 295

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
అష్టమ స్కంధము.

శ్రీ శ్రీ శ్రీ

—:0:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## నవమస్కంధము

—:0:—

క. శ్రీవిద్యోపాసకసే
వావిష్కృతవివిధవైభవాస్పదుఁ డగుచుఁ గా
భావింపఁబడుచు స్తోత్రవ
చోవర్ణితుఁ డయినసాగిసూర్యుం డలరుఁ గా. 1

వ. అక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నట్లు మత్స్యావతారవృత్తాంతంబు వినిన విష్ణురాతుండు బ్రహ్మరాతుం గని మహాత్మా! నాకు మన్వంతరంబులు నాయాచరిత్రంబు లెఱింగించితి వానందించితిని ద్రవిడదేశాధిపతి యగుసత్యవ్రతుండు మను వగుటయు నాయా వృత్తాంతంబులు విన మనం బయ్యె నానతిమ్మనిన నతం డతని కిట్లనియె.

—♦ వైవస్వతమనువంశవృత్తాంతము ♦—

సీ. వినుము రాజేంద్ర! చెప్పెదను వైవస్వత
మనువంశ మంతయు వినినయట్లు
హరినాభిపద్మమునం దాదిఁ బ్రభవించెఁ
జతురాననుఁడు సృష్టి సలుపుపొంటె
నతనిమానసపుత్రుఁ డయ్యె మరీచి వా
నికిఁ గశ్యపాఖ్యపుత్రకుఁడు గలిగె
నతఁడు దక్షాత్మజ యైనయదితియందుఁ
గనె వివస్వంతుఁ డాతనయు నతఁడు
తే. సంజ్ఞ యనుదానిఁ బెండ్లాడి సంసృతిఁ దగఁ
దాల్చి పుత్రుని వైవస్వతమనువుఁ గనె
నతనిచరితము వివరింతు నవల నతఁడు
శ్రద్ధయనుసాధ్విఁ బెండ్లాడె సంతసమున. 2

వ. ఆశ్రద్ధాదేవియం దనుక్రమంబుగా నిక్ష్వాకుఁడు శర్యాతి నృగుఁడు దిష్టుఁడు ధృష్టుఁడు కరూశకుఁడు నరిష్యంతుఁడు పృషధ్రుఁడు నభగుఁడు కవి యనువారు పదుండ్రు పుత్రులు పుట్టిరి వీరు పుట్టకయున్న కాలంబున నతండు వసిష్ఠుం జేరనరిగి తనయపుత్రత నెఱింగించిన నతండు.

శా. ఆమన్వాశయముం గ్రహించి కృపమై నాచార్యుఁడై తాఁ గలం
డై మిత్రావరుణాధ్వరంబు నియమప్రారంభ మేపాఱఁ గాఁ
నామైఁ జేయఁగఁ జెప్పి పుచ్చె నపుఁ డాయామంత్రసందర్భముల్
రా మన్వంగన హోతఁ జేరి మిగులం బ్రార్థించితా నిట్లనున్. 5

శా. కన్యారత్నమునందుఁ గోర్కి యగు నోకారుణ్యపాథోనిధీ!
కన్యం గోరెడిమంత్రమే చదివి వేడ్కన్ యాజ్యగావించినన్
ధన్యత్వంబునఁ బోవఁ జేయుటకు నేఁదాత్పర్య మర్థింతు నా
నన్యం బేమియుఁ బల్కఁ గాతఁడును యాజ్యం జేసెఁ దార్శ్నాలుగన్.

ఆ. హోత యిట్లు చేసి హోమంబు గావించె
దాన మనువుతలఁపు గానియట్లు
వైపరీత్యమునను వసుధఁ బుత్రికఁ బుట్టె
నిళ యనంగ నొక్కయేటిలోన. 7

వ. అప్పుడు వైవస్వతుండును దాను గోరినట్లు పుత్రుండు గాక పుత్రిక పుట్టుటం జేసి సంతసింపక వసిష్ఠుం బిలువ నంచి. 8

శా. మీసంకల్ప మొకప్పుడేనియు నయో మిథ్యాత్వముం బొందునే
కాసంతేనియుఁ బుత్రుఁ గోరి సవముం గావింప నీరీతి వ్య
త్యాసం బయ్యెఁ గొమార్తె పుట్టె నిది నాయం దైనదోసంబొ యే
దోసంబో వచియింపవే యనుఁడు నాదోషజ్ఞుఁ డూరార్పుచున్. 9

మ. జననాథాగ్రణి హోత చేసినది యీచందంబు వ్యత్యాస మం
దున నీరీతిఫలంబు గల్గె మదియందుం జింత గావింప కిం
పున వర్తింపుము నాతపోమహిమ నీపుత్రీమణిం బుత్రుఁగాఁ
బొనరింతుం గనుచుండు మంచుఁ ద్విజగత్పూజ్యప్రభావోన్నతిన్. 10

వ. పరమేశ్వరారాధనంబు గావించుటయుఁ దత్ప్రభావమున నిలాదేవి పురుషుండై సుద్యుమ్నుం డనునామధేయంబు వడసి పితృప్రీతికరుండై పూజ్యసామ్రాజ్యంబు వహించి పాలించుచు నొక్కనాఁడు మంత్రిపరివారపరివేష్టితుండై గంధవాహబాంధవం బగునొక్కమహాసైంధవంబు నెక్కి ధనుర్బాణతూణీరపాణియై వివిధమృగవిహంగమవధం బాచరించుచు నుత్తరదిశాభిముఖంబుగాఁ బోయి పోయి. 11

ఉ. గౌరియు శంకరుండు కుతుకంబునఁ గాముని గెల్చు గొల్చు చం
దేరొరు లేగి డెంచిన నొకించుక లోపల స్త్రీత్వ మొందనై
పౌరుష ముజ్జగింతు రని పల్కినదాన నెవండు నచ్చొటన్
జేర దరణ్య మద్ది విలసిల్లుచునుండును గౌరిపేరితోన్. 12

వ. అట్టిగౌరీవనంబునం దడుగుపెట్టినంతలో నమ్మహీకశత్రునిగాత్రంబున.

సీ. పేరురంబునయందు నూరుమీఱగ నయి
లికుచకుచంబులు లేవఁ జొచ్చెఁ
బెడఁగొండెముడిగోడఁ గడునొప్పునొదల
వేణీభరంబది వ్రేల నయ్యెఁ
గాసెతోఁ గత్తి చేకట్టుతో నగుకొను
మిన్నుకన్నను గడు సన్న మయ్యె
సింగంబుతో నైనఁ జెంగలింపంజాలు
గమనంబు మందమై కాన వచ్చె

తే. జఘన మెంతయు ఘన మయి జగతి నిండెఁ
గనులఁ గాటుకకాంతులు వనుల నిండె
దొండపం డనఁ గెమ్మోవి తులకరించెఁ
జిలుకలకుఁ దోడు నూపెడుఁ బలుకుఁబలుకులు. 14

వ. అంతలో నతనిగుఱ్ఱంబును పరివారంబును స్త్రీత్వంబు నొందె నది యంతయు గనునాభూకాంతుండు నితాంతచింతాక్రాంతస్వాంతుండై 15

సీ. నాకీర్తి యంతయు నవ్వులపా లయ్యె
నాప్రతాపంబొక్కసటన మందె

నాఖడ్గవిభవ మంతయు జడగట్టెనా
సత్ప్రభుత మహాస్వనరణిఁ జేరె
నాకువలయశోభ నయనంబులను బడె
నాగభీరత యెల్ల నాభిఁ దూఱె
నాధనుఃప్రాజ్ఞత నలిగి కన్బొమ లంటె
నాగొప్పఁ జోవ్వెక్కి యూఁగులాడె
తే. నాసువర్ణసమృద్ధి యంతయుఁ దనుత్వ
మందెఁ బో మత్పురార్జిత మైనయట్టి
పౌరుషము చెడి స్త్రీత్వంబు వచ్చెనాకుఁ
గటకటా? స్వామి! యిదియేమి కర్మ మొక్కొ. 16

—♦ సుద్యుమ్నుఁ డిళయన స్త్రీ యై బుధునిఁగూడి పురూరవుం గనుట ♦—

వ. ఇట్లు విచారించుచు నొక్కనాఁడు తనప్రక్కకు వచ్చినచంద్రపుత్రుం
డగుబుధుం గాంచి మోహించి సర్వంబును విస్మరించి వాని కిట్లనియె.
మ. తరుణీరత్నమ నేను ని న్వలఁచితిన్ దథ్యంబుగా నింత కే
పురుషుంపట్ నను ముట్టఁ డీవు ద్విజరాట్పుత్రుండ వం చెంచెదన్
గరిత న్నన్ను వరించి మించినతమిం గైకొ మ్మనం గా బుధుం
డురరీకారముఁ దెల్పుచుం గలిసె నాయుష్మాంశుబింబాధరన్. 18
సీ. వారికిం బుట్టెఁ బురూరవుం డనుసుతుం
డవ్వలఁ గొన్నినా ళ్లరిగినపయి
సతి యైనసుద్యుమ్నుఁ డతులితచింతాకు
లాంతరంగుం డయి కొంతలోన
గురువసిష్ఠుని మదిఁ గరము దలంచిన
నతఁ డతనిసమక్షమందుఁ బొలిచి
వానిరూపముఁ జూచి వగచి జాలిం బడ
కిదె నీకుఁ బుంస్త్వము పొదలునట్లు
తే. సలుపుదు నటంచు శంకరుఁ గొలిచి వేఁడ
నతఁడు ప్రత్యక్షమై కరుణార్ద్రహృదయుఁ

డగుచు నొక నెలపుంస్త్వము నవల మఱియు
నొక్క నెల స్త్రీత్వమును బొంద నొసఁగె వరము. 19

వ. అట్లు వరంబు వడసి సుద్యుమ్నుం డొక్క నెల స్త్రీయై యుండియు నొక్క నెల పూరుషుండై రాజ్యపాలనంబు గావించుచుండె నతనికిఁ బురూరవుండు గాక యుత్కలుఁడు గయుఁడు విమలుఁడు ననుమఱి ముగ్గురు పుత్రులు పుట్టి ధర్మతత్పరులై యుత్తర దేశప్రభువు లైరి సుద్యుమ్నుండును వృద్ధుండై పురూరవుని రాజుఁ గావించి తాను దపోవనంబున కరిగె నంత వైవస్వతమనువు యమునాతీరంబున. 20

మత్త. పుత్రకాముఁడు నూఱువత్సరముల్ తపఃక్రియ నొప్పుచుఁ
బత్రముల్ ఫలముల్ భుజించుచు వారిఁ ద్రావుచు నిద్ర రా
ధాత్రిపై శయనించుచుం గడుఁ దద్వరత్వమునన్ హరిన్
బత్రపుష్పఫలాలిపూజలు భక్తిఁ జేసి పొనర్చుచున్. 21

—♦ వైవస్వతుని పుత్రపౌత్రాదులు ♦—

సీ. ఆ దేవునియనుగ్రహమున నాతఁడు తన
తోసమానులను బదుండ్రు సుతుల
నిక్ష్వాకు మొదలగునిద్ధచరిత్రులఁ
గనె నందునఁ బృషధ్రు వనెడుసుతుని
గోపాలనమ్మునకు న్నియమింప నం
గీకరించి యతండు లోక మెన్న
వీరాసనవ్రతావిష్టుఁడై రే లెల్ల
ఖడ్గహస్తుం డయికడలఁ దిరిగి

తే. పులి గిలి భయంబు లేక గోవులు సుఖముగ
మెలఁగఁగా నేలుచుండె నట్టులు చెలంగు
చుండునపు డొక్కరాత్రి మేఘోదయ మయి
క్రమ్ముకొని నింగికాఱుచీఁకటి ఘటించె. 22

శా. సూచీభేదన మాచరించుటకు నేఁ జో టింతయే లేనియ
ట్లాచీఁకట్లు సమస్తభాగముల సంవ్యాప్తంబులై బ్రహ్మ మ

నై చర్చింపఁగ వచ్చిసర్వమునుదామై దృష్టి భేదించుచున్
బ్రాచుర్యంబునఁ జెప్పనొప్పెఁ దనకుం బర్షంబు దోట్పాటుగన్. 23

ఆ. ఆలోఁ గోల్పులి యొక్కఁడు
కోలుమసఁగి వచ్చి యిచ్చ గోష్ఠముఁ జొచ్చెన్
గా లెఱిఁగి గోవు లన్నియు
వేళంబుగ లేచి పఱచువిధమున నయ్యెన్. 24

వ. అక్కోలాహలం బెఱింగి పృషధ్రుండు లేచి కారణం బెఱుంగఁ జాలక ఖడ్గహస్తుండై వడివడి గోష్ఠంబులోనికిం బోవునంతలో నా శార్దూలం బొక్కగోవుం బట్టుకొనిన నది బెట్టార్చె నతం డప్పరిస్థితిం బట్టి కోలుపులి వచ్చి గోవుం బట్టిన దని నిశ్చయించి చిమ్మచీఁకటిం దెలియక పులి యని యొక్కకపిల గోవుం దెగనేసెఁ బులియు నా ఖడ్గాగ్రంబు దాఁకుటం జేసి నిజశ్రవణంబు దెగిపడిన భయంబున నెత్రు గాఱ గోశాలనుండి వెడలి పాఱె నంత సూర్యోదయం బైనపదంపడి పృషధ్రుఁ డాదృశ్యంబుం గాంచి. 25

శా. పుల్లావుం దెగనేసినాఁడఁ బులి యీగాఁ బొమ్మంచు నేఁ జీఁకటిం
జెల్లంబో యని దుఃఖితాత్ముఁ డగుచున్ జింతించుచుండం జగ
ద్వాల్లభ్యంబున నావసిష్ఠముని యద్దారిం బ్రయాణించుచున్
నల్లం గాంచి పృషధ్రునిం దెలిసి సంతాపంబు సంధిల్లఁగన్. 26

తే. ఓరిదుష్టాత్మ యిట్లు నీ వురుఖరాసిఁ
గపిలఁ దెగ నేసితివి గాన క్షత్రియుండ
వగుచు నుండఁగ రాదు శూద్రాన్వయుండ
వగుచుఁ బొ మ్మని శపియించి యరిగె నవల. 27

వ. ప్రమాదవశంబున నైనదాని కట్లు శప్తుండై పృషధ్రుండు గురు శాపంబు శిరసావహించి యింద్రియంబుల జయించి భగవదారాధ నంబు గావించి ఫలాపేక్ష లేనిచిత్తంబునం బ్రవర్తించుచు సర్వభూత సముండై రాగద్వేషాదుల విడనాడి నిరాహారుండై నిరతిశయానంద

జ్ఞానంబున నిశ్చలుండై వెఱ్ఱివాఁడు గ్రుడ్డివాఁడు చెవిటివాఁడు నా సంచరించుచుఁ గొంతకాలంబున కొక్కనాఁ డడవికిం బోయి దావానలంబునం జొచ్చి దహింపంబడి పరబ్రహ్మసాయుజ్యంబు నొందె నంత.

సీ. కడపటివాఁ డైనకవి విషయసుఖంబు
లం దనురాగంబు నట్టె విడిచి
త్యజియించి రాజ్యము దాయాదివర్గము
పరమపురుషునందు భక్తి నిలిపి
పరమపదము నొందె బాల్యంబునంద య
వ్వలఁ గరూశకుఁ డనఁ బడెడువాఁడు
కనియె ముప్పురఁ బుత్త్రులను వార లుత్తర
దేశప్రభువు లయి తేజఁ గనిరి

తే. పిదప ధృష్టునకుఁ సూను లుదితు లైరి
పలువు రందఱు ధర్మతత్పరులు వారు
క్షత్త్రధర్మము విడనాడి శాంతి దాంతి
గలిగి ద్విజు లైరి హరియనుగ్రహము కలిమి. 29

వ. మనుపుత్త్రుం డగునృగునకు సుమతి యనుపుత్త్రుండు పుట్టె సుమతికి భూతజ్యోతి పుట్టె నతనికి వసువు జన్మించె వసువునకుఁ బ్రతీకుండు ప్రతీకున కోఘవంతుఁ డనుపుత్త్రుఁడు నోఘవతి యనుపుత్త్రికయుఁ బుట్టి రయ్యోఘవతిని సుదర్శనుం డనువాఁడు పెండ్లియాడె నవల నరిష్యంతుం డనుమనుపుత్త్రునకుఁ జిత్రసేనుం డుదయించె నతనికి దక్షుండు వానికి మీఢ్వుఁడు వానికి శర్వుఁడు వాని కింద్రసేనుఁడును జన్మించి రింద్రసేనునకు వీతిహోత్రుఁడు వీతిహోత్రునకు సత్యశ్రవుండు వానికిఁ గురుశ్రవుఁడు వానికి దేవదత్తుఁడు వానికి భగవంతుం డగునగ్నివేశుఁడు కుమారుండై పుట్టె కానీనుఁ డనుఋషి యయ్యె వానికి జాతుకర్ణుం డనునామాంతరము గలదు వానివలననే యాగ్నివేశ్యాయనబ్రాహ్మణకులంబు ప్రభవించె నింక దిష్టునివంశముం జెప్పెద

దిష్టునకు నాభాగుఁ డనుకుమారుఁ డతఁడు గోరక్షణాదివ్యాపారము చేయుచు వైశ్యుం డయ్యె నానాభాగునకు హలంధనుఁడు వానికి వత్సప్రీతి వానికిఁ బ్రాంశువు ప్రాంశువునకుఁ బ్రమితి ప్రమితికి ఖమిత్రుఁడు వానికిఁ జాక్షుషుఁడు వానికి వివింశతియు నుద్భవించిరి వివింశతికి రంభుఁడు వానికి ధార్మికుఁ డైనఖనినేత్రుఁడు వానికిఁ గరంధముఁడు వాని కవిక్షిత్తు వానికి మరుత్తుఁడును జన్మించిరి మరుత్తుఁడు సర్వభూచక్రం బాక్రమించి చక్రవర్తియై యంగిరసునిసుతుం డగు సంవర్తు నాచార్యునిగా వరించి పెక్కుయజ్ఞము లొనరించె నాతని యజ్ఞముల నుపకరణము లన్నియు సువర్ణమయంబులు వానియజ్ఞంబుల దేవతలును భూదేవతలును సంతృప్తి గాంచిరి. ఆమరుత్తునకు దముఁడు దమునకు రాజవర్ధనుఁడు వానికి సుధృతి సుధృతికి నరుండు నరునకుఁ గేవలుఁడు కేవలునకు బంధుమంతుఁడు బంధుమంతునకు వేదవంతుఁడు వేదవంతునకు బందువు బందువునకుఁ దృణబిందువు నుద్భవించిరి. 30

— తృణబిందుని పుత్రపౌత్రవర్గము —

అతఁడు మహారాజులందుఁ బ్రతిభగన్న
వాఁడు సద్గుణముల వఱలువాఁడు
వానిగుణంబుల కానందముఁ బొంది
వరియించె నతని నచ్చరవెలంది
యగునలంబుస యామెయందుఁ గొమారులు
గలిగినపదపడి నిలబిల యను
కూఁతురు పుట్టె నాకూఁతును విశ్రవ
సుఁడు పెండ్లియై కనెఁ గొడుకు నొకని

తే. అతఁడె కుబేరుఁ డుత్తరాశాధినాథుఁ
డగుచు ధని యయి పేర్పొందె నయ్యవలన
నోపి నేర్చె నంతర్ధానరూప విద్య
త్ర్యంబకసఖుండు విశ్రవస్తనయుఁ డతఁడు. 31

వ. తృణబిందుపుత్రులు విశాలుఁడు శూన్యబంధువు ధూమ్రకేతువు నాఁబడువా రందు విశాలుఁడు వంశకర్తయై వైశాలీపురంబు నిర్మించె విశాలునకు హేమచంద్రుఁడు వానికి ధూమ్రాక్షుఁడు వానికి సహదేవుఁడు వానికిఁ గృశాశ్వుఁడు వానికి సోమదత్తుఁ డతండు పెక్కశ్వమేధములు గావించి ముక్తిం గాంచె వానికి సుమతి జనమే జయులు జన్మించిరి కూటస్థుండగుతృణబిందునిసంబంధు లగునారాజులు వైశాలు రని విఖ్యాతిం గాంచి రవల నమ్మనుపుత్త్రుం డగుశర్యాతి వానివృత్తాంతంబుఁ జెప్పెద నాలకింపు మని మఱియును. 32

తే. ఘనుఁడు శర్యాతి వేదశాస్త్రనిపుణమతి
రాజ్య మేలుచుఁ బెక్కుర రాజముఖులఁ
బెండ్లియాడి సంసారము బెరిమ సలుపు
చును సుకన్య యనుకన్యను గనియె నొకత. 33

—♦ సుకన్యా చ్యవనుల చరిత్రము ♦—

వ. అతం డొక్కనాఁడు కాంతాజనంబుతోఁ గాంతారంబున విహరింప నిచ్చఁ జేసి సమీపంబున నున్నచ్యవనాశ్రమంబునకుం బోయి విశ్ర మించియుండె నయ్యవసరంబున. 34

మ. అలరాజేంద్రునికన్యకామణి సుకన్యానామకన్యాలలా
మ లలిన్ నెచ్చెలిపిండుతోఁ దిరుగుచున్ మానొప్పుచున్నట్టివృ
క్షలతామందిరకందరంబు లరయంగా మెట్టుచు న్వచ్చె న
ర్మిలిమై నాడుచుఁ బాడుచుం జ్యవనవల్మీకాంతికక్ష్మోణికిన్. 35

తే. దివ్యభూషణభూషితదేహ యగుచు
దెసలు వెలిఁగించుచును వచ్చుతెఱవఁ గాంచి
చలితమానసుఁడై ముని శ్యామకంఠ
మలరఁ బిల్చెఁ దపోబలకలితుఁ డగుచు. 36

వ. సుకన్యయు నాస్వరం బెద్దియో తెలియం జాలక వల్మీకంబుపై మెఱి యుచున్నచ్యవనచక్షుస్సులం జూచి యివి యేమియో యని విచారిం

చియుం గౌతుకంబునం జేసి కంటకాగ్రంబున వానిపైఁ బొడిచెఁ
బొడిచిన రక్తంబు స్రవించె దాన నతండు విగతనయనుండై కోపించి
శర్యాతి సైన్యంబునకు మూత్రపురీషనిరోధంబు గా శపించె నంత నది
యంతయు శర్యాతి విని యేమహాత్మునకున కెవ్వ రెట్టియపచారంబు
గావించిరో యని వారి వారి నడిగి కారణం బారయఁ జాలక జాలిం
బడి యున్నతఱి సుకన్య తండ్రికడకు వచ్చి యడఁకువం జూపి యి
ట్లనియె. 37

క. మిడుఁగుఱుఁ బుఱుఁగుల తెఱఁగునఁ
గడునడి నొకపుట్టమీఁదుగా మెఱయుఁడు నే
వడి నా మెఱుఁగులమీఁదం
బొడిచితి నపచార మిదియ పో తలపోయన్. 38

తే. అని వచించిన ధరణీంద్రుఁ డాక్షణమునఁ
బుట్టకడ కేగి భార్గవుం బోలఁ జూచి
యెఱిఁగి యెఱుఁగక నాకూఁతు రెగ్గు చేసె
సైఁచి రక్షింపవె మమ్ము సంయమీంద్ర. 39

మ. అని ప్రార్థించిన నమ్మునీంద్రుఁ డను శర్యాతి! భవత్పుత్రి యౌ
వనగర్వంబునఁ గన్ను గానకిటు నా నాసిం బ్రొలంగించెఁ గా
వున దీనిన్ సతిఁ గాఁగఁ గొన్నపుడ పోవున్ గోపమున్ శాపమున్
బొనరింపం గలవేఁ బొనర్పు మటు లేమో యంటివేఁ బొమ్మనన్.

వ. అని యడిగిన వయోవృద్ధుం డని విచారింపక శర్యాతి తనకూఁతు
నాతపస్వివరేణ్యున కిచ్చి నిజసేనానిరోధం బుడిగించుకొని పురంబు
నకుం జనియె నంత. 41

మ. చ్యవను న్మౌనిని జీవితేశ్వరునిఁగా స్వాంతంబునం దెంచుచున్
నరేంద్రాత్మజ భక్తితత్పరతమై నిత్యంబు నుపాసించుచున్.
సవినమ్రంబుగ నగ్నులం గొలుచుచున్ స్వాధ్యాయభృద్విప్రులన్
దివిషద్వర్యుల సన్నుతించుచుఁ గడున్ దీపించె నేప్రొద్దునన్ 42

ఆ. అంతఁ గొంతకాల మరిగినయప్పుడు
వేల్పువెజ్జు లటకు వేడ్కఁ వచ్చి
జలకమాడి పోవుజలజాక్షి నీక్షించి
రమరకన్యఁ బోనియట్టిదాని. 43

—♦ సుకన్యకడకు నశ్వినీదేవతలు వచ్చుట ♦—

ఉ. కాంచి తదంచితద్యుతికిఁ గౌతుక మందుచు మెచ్చి వచ్చి యో
చంచలనేత్రి గాత్రరుచి సర్వదిశల్ వెలిఁగించుచుంటి నీ
వెంచఁగ నేరిదాన వగు దెవ్వనిపంపుఁ బొనర్చుచుంటివో
కొంచక మాకు వాక్రువుము కోరిక లీరిక లెత్త నిత్తఱిన్. 44

తరు. అనిన సుకన్య యి ట్లనియె నోదివ్యు
లార! నే శర్యాతి యనురాజుపుత్త్రి
ననఘుఁడు భృగుపుత్త్రుఁ డగుచ్యవనునకు
ననుఁగుఁబత్ని సుకన్య యనుదాన ననుచుఁ
దనయుదంతము సవిస్తరముగాఁ దెల్పఁ
దగ నవ్వి దస్రులు త మ్మొఱంగించి
వనితాశిరోమణివలను మో మగుచు
వగఁ దోఁప ని ట్లని పలికిరి మఱియు. 45

ఉ. కాటికిఁ గాళ్లు సాఁచుకొని కాఱియ నొందుచు నున్నవాని కీ
వేటికి నాలుగో వలయు నిక్కము వచ్చెను గన్నతండ్రి తా
నేటికిఁ బేరివులందు దయ యింతయు నేనియు లేక యిచ్చె నో
బోఁటిరో నిన్ను విన్న వగ పుట్టక పోవునె యెట్టివారికిన్. 46

తే. మెఱపుఁదీవ తెఱంగున మెఱయుచుంటి
దేఁకలాడుచు నివ్వనిఁ దెఱవమిన్న
నిన్నుఁ బోలినదాని నే మెన్నఁడేని
కని యెఱుంగము దేవలోకముల నైన. 47

క. బంగారుబొమ్మ వగు దో
యంగన నీయంగకంబులందు విభూషల్
రంగార వనుచు నేమో
బంగారము ముట్ట కిట్లు భాసిలు దహహా. 48

మహాస్ర. మలపంకచ్ఛన్నమై నిర్మల మునఁ బడ కీమాద్రిఁ గైకోకభూషల్
వెలిఁగించు న్నిదుమే నో వెలఁదుక కడల న్వేనవే లేల పల్కన్
విలసద్రత్నంబ పీ విద్విధమున నడవి న్వెన్నెలం బోలి వృద్ధున్
బలితాంగుం జేకు భోగప్రతిహతమతినిం బట్టి యుండంగఁ జన్నే. 49

మ. అసమర్థుం డగువీనిఁ బాసి జలజాస్యా నీవు వే యొక్కనిన్
బ్రసమీక్షించి వరించి నీసొగసు నీప్రాయంబు నీకాయమున్
బ్రసవాస్త్రప్రతిపాదకంబు లగుచున్ భాసిల్లుచందంబునన్
బొసఁగం జేసికొనంగఁ జూడు మనుచున్ మోదంబునం బల్కుడున్.

ఆ. ఆసుకన్య కనల కనియె నోయయలార
చ్యవనునంద నాకుఁ దవిలెఁ బ్రీతి
మీర లిట్లు తలఁప నేరగా దనుడు నా
సత్యు లిట్టు లనిరి సతికి మఱియు. 51

సీ. వనితరో మేము దేవభిషగ్వరులము నీ
పతి నవరూపసంపన్నుఁ డగుచు
నలరఁ జేయుదు మేము నతఁడును మువ్వుర
మగుదు మం దొకని నీ కగును బొంద
ననుడు నాయమ చని వినిపించి పతికిఁ ద
దనుమతిఁ గొని వచ్చి యశ్విలఁ గని
మీనొడివినయట్లు గా నొనరింపుఁడు
నాఁ గవల్ వెండియు నాతిఁ గాంచి

తే. తరుణి నీమగఁ డీసరోవరమునందుఁ
జొచ్చునది యన్న రూపుపై నిచ్చఁ జేసి

చ్యవనుఁ డటు చేసె దస్రులుఁ జలములందుఁ
మునిఁగి తేలిరి మునితోడ మూర్తమునకు. 52

మ. పడుచుంబ్రాయము సోయగంబు గలుగన్ భాసిల్లి తుల్యాకృతిన్
జడజాతేక్షణ చెంతఁ జేరి ముగురు న్నాలోన నొండొక్కనిన్
దడయం బోక వరింపు మంచుఁ బలుకం దన్వంగి వొంగారుచున్
వడి నాభార్గవుని న్వరించెను మనోవాక్కాయకర్మంబులన్. 53

వ. ఇట్లు రూపయౌవనసంపన్నుం డైనచ్యవనుండు పరమహర్షంబున నాసత్యులం గని నే మీకతనఁ గన్నులు గలిగి రూపవంతుండ నైతిఁ గావున నోపినకొలంది మీకుఁ బ్రత్యుపకారంబు గావింపనుంటి నేఁటికిం బోయి రం డని యంపిపుచ్చె నంత శర్యాతి తా నొక్కయాగము సేయఁ దలంపునం జేసి చ్యవనాశ్రమంబునకు వచ్చి సుకన్యాపార్శ్వంబున సూర్యునివలెఁ బ్రకాశించుచున్నపురుషుం గాంచి పరపురుషుం డని నిశ్చయించి కూఁతుం గాంచి కోపపరీతస్వాంతుండై యి ట్లనియె.

స్రగ్ధర. ఓసీ దుష్కార్యమి ట్లీ వొకటియు గనుఁగోకుండఁ గావించి తట్టో
దోసం బద్దాన నీకుం దొరసెడు నదియై తోడుతో నాకులంబున్
గాసిల్లం జేయునాపైఁ గయికొనునతనిం గాఁటియం బెట్టినయ్యో
ప్రాసంగుంబోలువంశప్రతిభకు నయశఃప్రాప్తి చేకూర నయ్యెన్. 55

క. నీ విట్లుచేయుదానవ
వై వెలయుదు వనుచుఁ దెలియ నట్టేడ నగుచున్
నీవలన శుభము దలఁచితి
నీవిధి నశుభంబు గూర్చి తేమందు నినున్. 56

వ. అని గర్జించుచున్నతండ్రిం గాంచి సుకన్య మందహాససుందరవదనారవిందయై యి ట్లనియె. 57

మ. జనకా! తప్పు తలంప కీతఁడ భవజ్జామాత యాభార్గవుం
డని వ్రాఁకుచ్చుచునుంటి దశ్యులు దయాస్వాంతంబునన్ వీని కి
ట్లొనరం జేసిరి యౌవనాదికము సుశ్లోకస్తుల్ మదీయంబులున్
విని విశ్వాసమొనర్పు మన్నఁ జ్యవనోర్వీదేవుఁ డౌ నౌ ననెన్. 58

వ. శర్యాతియు రతిమన్మథులం బోనిసుకన్యాచ్యవనులం గాంచి ధన్యుండ
నైతి నని సంతసించుచుండె నపుడు మునీంద్రుండు రాజేంద్రుం
బూజించి యి ట్లనియె. 59

మ. నినుఁ జేయించెద నొక్కయజ్ఞ మిట మాని శ్రేష్ఠు లగ్గింపఁ ద
ద్ఘనసంభారము లెల్లఁ గూర్పు మనుడుం ధాత్రీతలాధీశ్వరుం
డనుమానింపక సర్వవస్తువులు నీహామాత్రి నిర్మించి య
ల్లునకుం జెప్పిన నాతఁ డౌననుచు నాలో యాజకుండై తగన్. 60

— చ్యవనుఁ డశ్వినీదేవతలకు హవిర్భాగము కల్పించుట —

క. సవనముఁ జేయించుడు నా
చ్యవనుం డశ్వులకు సోమ మర్పించెడుచో
దివిషన్నాథుఁడు పోడఁ గని
కవిసి గ్రహాగ్రహణ ముడిపి కడకం బలికెన్. 61

శా. ఈనాసత్యులు వైద్యులై వఱలుటన్ హీనక్రియారంభులై
గానం బొల్చిరి గాన సోమముఁ గొనంగా వీరు గా రర్హు ల
ద్దానం జెప్పుచునుంటి నాఁ జ్యవనుఁ డిందాఁ వెజ్జులై వేల్పులన్
జానొందం బొనరించునట్టిఘనుల్ లెన్న న్వీరు సామాన్యులే. 62

క. ఈవుం దేవత లెట్లో
భావింపఁగ వీరు నట్లె ప్రస్తుతి కెక్కం
గా వలయు నధ్వరంబులఁ
బావనసోమార్హు లగుచుఁ బాకవిరోధీ. 63

వ. అనిన నింద్రుండు వెండియును. 64

క. మందు లొసంగుచు వేల్పుల
కెందుం బనిసేయునట్టి రే కాని కవల్
పొందంగఁ దగరు సోమము
లందుం భాగంబు నాఁగ నాతఁడు మఱియున్. 65

క. చెప్పినద చెప్పుచుంటివి
తప్పిదు న న్నజరుఁ జేసి దయఁ జూచినయా

యొప్పులకుప్పలు సోమం
బిప్పుడ కొనఁ గల రటంచు నింద్రుఁ డెగడుచుఁన్. 66

తే. గ్రహము గ్రహియించి దనుజులఁ గడిమి సోమ
పీథులం జేయ నుండిన భిదురపాణి
వల దుడుగు మంచు నుడుగనివానిమీఁద
నైవ నుంకించె దంభోళి వడిగ వడిగ. 67

మ. తనపై వైవఁగ వజ్ర మెత్తినమరుత్స్వామిం బ్రతీక్షించి సం
జనితామర్షముఃతో భృగూద్వహుఁడు తజ్జంభారిదోస్తంభమున్
స్వనదంభోళియుతంబుగా నపుడు సంస్తంభించి కృత్యార్థియై
కనదగ్నిప్రభ వేల్చె మంత్రముల నాగర్వాంధునిం గూల్పఁగన్. 68

ఆ. అనలరాశినుండి మునితపోబలమునఁ
బొడమెఁ గృత్యవలన భూరిపర్వ
తోపమానకాయుఁ డుగ్రకర్ముఁడు మదుఁ
డనఁగ నసురుఁ డొకరుఁ డతిజవుండు. 69

సీ. వాని దేహం బింత యనా ననుచును సురా
సురుల కైన గణింపఁ దరము గాదు
వాని బాహువులు పర్వతసన్నిభంబులు
నయుతమహాయోజనాయతములు
వానిదంష్ట్రలు నాల్గు వజ్రనిభంబులై
శతయోజనోన్నతస్థితి వహించు
వానిదంతంబులు వాఁడియై దశయోజ
నాయామమున నొప్పునాయసములు

తే. వానివక్త్రము లయకాలవహ్నిసమము
వానికన్నులు విలయవివస్వదిందు
సదృశములు వానిమైచాయ సాంద్రతమము
వాఁడు కల్పాంతకుఁడు ఘోరవర్తనుండు. 70

ఇట్లతిశయించి రోదోంతరాళం బెల్ల నిండఁ బెఱిఁగి యొక్కహనువు భూమియందును వేఱొక్కహను వాకాశమందునునుంగాఁ దనవదన కుహరంబు తెఱచి కహకహధ్వని సేయుచు విద్యుల్లోలం బగునిజ జిహ్వాగ్రంబున వక్త్రంబు నాకికొనుచు వ్యాత్తాననుండును ఘోర దృష్టియునై జగంబు లెల్ల నొక్కపెట్ట మ్రింగుడునో యన బెట్టార్చు చుఁ దనపైకి లంఘించువానిం జూచి వెఱచఱచి సంస్తంభితభుజుం డగు దేవేంద్రుండు సంభ్రమించి చ్యవనుని చెంతకుం బఱచి వచ్చి గడ గడ వడంకుచు ని ట్లనియె. 71

నేఁడు మొదలుగ నశ్వులుం గూడ సోమ
పీథులగుదురు నీపేర్మి పృథ్విఁ దనరు
నీసుకన్యయుఁ దండ్రియు నెసఁగుచుందు
రీయుపద్రవ ముడిగింపవే మునీంద్ర. 72

అని ప్రార్థించినం బ్రసన్నుండై మునీంద్రుండు తనక్రోధం బుడిగి సురేంద్రుని విముక్తుం జేసి జగంబుల నిండియున్నమదుని స్త్రీపాన మృగయాక్షంబు లాశ్రయించి యుండ నియమించి నాసత్యుల కింద్రా దులతో సోమపానంబు లభించునట్లు చేసి సుకన్యాసహితుండై సుఖంబుండె నిది సుకన్యాచరిత్ర మల్లశర్యాతి కాసుకన్య యొక్క తయ శాక యుత్తానబర్హియు నానర్తుఁడు భూరిషేణుఁడు నను మువ్వురు పుత్రులునుం బుట్టి రందు నానర్తునకు రైవతుం డనువాఁడు జన్మించె. 73

—◆ రైవతుఁడు రేవతిని బలరామునికిచ్చి పెండ్లిచేయుట ◆—

సీ. ఆరైవతుఁడు సముద్రాంతస్థలమునఁ గు
శస్థలీనగర మొసంగఁ జేసిఁ
యందుఁ గాపురముండి యానర్త దేశము
లేలెఁ గుశస్థలియే పదపడి
ద్వారకాపుర మని పేరు గాంచెను వాని
కొకనూర్వురు కుమారు లుదయ మంది

రందులోనఁ గకుద్మి యనువాఁడు మొదటివాఁ
డవల రేవతి యనునాత్మజయును
తే. గలిగి రారాజు రేవతి కెలన మెలఁగ
నరిగె బ్రహ్మలోకమునకు వరుఁ డెవండొ
తెలియువాఁ డయి సమయము గలిగికొనుచు
బ్రహ్మ నడిగె రేవతి కేఁడు భర్త యనుచు. 74
వ. రైవతునిపలుకులు విని నవ్వి వాణీవల్లభుండు. 75
తే. ఒక్కక్షణకాల మిట నుంటి వోయిరాజ
యింతలో నాల్గుయుగములు నిరువదేడు
తడవ లుర్వీతలంబునఁ గడవ నయ్యె
నపుడు నీ వెఱింగినవార లిపుడు లేరు. 76
ఉ. వారలు వారిపౌత్రులును వారలగోత్రము లైన లేపు సం
హార మొనర్చెఁ గాల మటు లైనను నీ విపు డేగి భూమికిన్
శౌరివరాంశముం గలిగి సంభవ మంది బలుండు నా వచుం
డై రహి మీఱు వాని కిడు మంబురుహానన దీని నిచ్చమై. 77
వ. అనిన రైవతుండు సంతసించుచు బ్రహ్మదేవుని యథోచితంబుగ వీడు
కోలుచేసి భూలోకంబున యాదవులచేఁ బరిపాలింపంబడుకుశస్థలికిం
జని బలరామునకు రేవతి నిచ్చి పరిణయంబు గావించి తాను దపో
వనంబున కరిగె నిఁక మనుపుత్రుం డగునాభాగునిచరిత్రముం జెప్పెద
నాలకింపుము. 78

—♦ నాభాగునిచరిత్రము ♦—

సీ. నభగుండు పెక్కుర నందనులం గాంచె
నందు నాభాగుఁ డన్ నందనుండు
కడగొట్టువాఁ డయి కడగి విద్యలు నేర్చి
జ్ఞానవంతుం డయి కాన నయ్యె
నన్నలు పైతృకం బగునర్థమును బంచు
కొనునప్పు డాతనిఁ గొనక వారె

తమతమభాగముల్ తారయనుభవించి
రపుడు నాభాగుఁ డయ్యగ్రజులను
తే. దనదుభాగము తన కిండ యనుచు నడుగ
వార లప్పుడు మఱచితి మోరి నిన్ను
నిప్డు పంచుట కవకాశ మెదియు లేదు
కాని తండ్రికి జెప్పి తద్గతి నడుతము. 79

వ. అని పలికిన నాభాగుండు తండ్రికడకుం జని తనభాగంబు తన కిప్పింపు
మని యడిగిన నతండు నీయన్నలు నిన్ను వంచించిరి కానిమ్ము నీ
విపు డయ్యర్థంబున కాశింపకుము. 80

తరువోజ. ఆంగిరసులు సత్త్రయాగ మీచేంత
నాచరించుచునుండి రది పదిరెండ
నంగ నౌదినములు నలువొందు నందు
నాల్గురెం డయి యుండునాళ్ళ సూక్తముల
నాంగిరసు లెఱుంగ రవి నీవు సమయ
మందు వచించెదనట్టేఁడ వగుము
పొంగారి వారు నిక బోగడుచుఁ గర్మ
పూర్తిగా దివిఁ జేరఁ బోవుచు నీకు. 81

వ. యజ్ఞశిష్టార్థం బంతయు నిచ్చివేయుదు రది నీమనుగడకుం జాలుఁ
బొమ్మనిన నతండు తండ్రి చెప్పినచొప్పునం జేసి యాంగిరసు లిచ్చిన
యాగావశిష్టధనంబు స్వీకరింప నున్నసమయంబున. 82

ఉ. నల్లనిపూరుషుం డొకఁడు నవ్వుచు వచ్చి యి డెల్ల నాది నీ
వుల్లము సేయుచుంటి కొన నోరి యెవండవు నీవు నావుడుం
గల్ల యెఱుంగఁ డానభగుగాదిలి బిడ్డఁడు నాకు మౌను లీ
యెల్ల నొసంగి రేను గొన నెంచుచు నుంటిని నీ దెటా నొకో. 83

ఉత్సాహ. అనినఁ గాలపురుషుఁ డనియె నయ్య నాకు నీకు నీ
ఘనవివాద మేల నీవు కయికొనంగ నుండునీ

ధనము నాదో నీదో నీదుతండ్రి సెప్పు నతనికిన్
వినుచు మతఁడు చెప్పినట్లు వింద మీవు నేనునున్. 84

వ. అనిన నతం డోఁగాత మని తండ్రికడకుం జని తెలియఁ జెప్పిన నతం
డది యంతయు నంతరంగంబున నెఱింగి వత్సా! వచ్చినవాఁడు వామ
దేవుండు దక్షాధ్వరంబున ఋషు లందఱు నేకగ్రీవంబున యాగశిష్ట
ద్రవ్య మంతయు రుద్రాంశ మని నిర్ణయించిరి కావున నీకు నాంగిరసు
లిడినద్రవ్యము శర్వునది కాని నీది కా దనిన నాభాగుండు రుద్రుని
సమీపించి నమస్కరించి యి ట్లనియె. 85

మ. సవశేషార్థము సర్వమీశ్వరునకే సంధిల్ల నౌ నంచుఁ దొం
టివిధుల్ గల్గుట నాదుతండ్రి తెలిపెన్ దెల్లంబుగా నైన నే
భవదీయాంఘ్రియుగంబుపై శిరము మోవం జేసి ప్రార్థించెదన్
భవ! నిస్స్వుండను దీని నా కిడవె నీభక్తుండనై యుండెదన్. 86

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు నీతండ్రి ధర్మంబు
చెప్పె నీవును సత్యంబు వలికితివి సంతసించితిని మంత్రద్రష్ట వగునీకు
బ్రహ్మోపదేశంబు గావించెద నీవు నాకుఁ బ్రియుండ వైతి వని
యజ్ఞపరిశేషితద్రవ్యం బంతయు నిచ్చమెయి నిచ్చి శివుం డంతర్ధా
నంబు నొందె నీనాభాగచరిత్రంబు జ్ఞానప్రదం బనంతరంబ నాభాగు
నకు నంబరీషుండు పుట్టె నతఁడు పుణ్యాత్ముం డమోఘం బగు బ్రా
హ్మణశాపంబు నతనికడ మోఘం బయ్యె నతనిచరిత్రంబు చెప్పెద
విను మని శుకుండు వెండియును. 87

— ♦ అంబరీష చరిత్రము ♦ —

మత్త. అంబరీషున కేడుదీవుల నాధిపత్యము నెల్ల లో
కంబులం గనరానిసంపద గల్గు భాగ్యము భోగ్య మె
ప్పుం బొసంగుఁ గొఱంత యింతయు పుట్టఁ బోవదు వాని దే
శంబునం దటు లైన నాతఁ డజస్రమున్ సువిరక్తుఁడై. 88

వ. సంసారంబు నిస్సారం బనియు సమస్తవస్తుజాలంబునుం గలలోఁ గాన
వచ్చుపదార్థతుల్యం బనియు దేహంబు నశ్వరం బనియు విశ్వమంతయు
జలబుద్బుదం బనియుఁ దలంచుచుండు నని మఱియును. 89

సీ. అతనిచిత్తం బెప్డు హరిపాదపద్మము
లందు ధ్యానాసక్తి నందుచుండు
నతనివా కెపుడు శ్రీపతిగుణగణముల
వర్ణించునట్టిదై వఱలుచుండు
నతనిచేతులు హరి సతతము సేవించు
పనులందు లగ్నమై పరిఢవించు
నతనిశ్రోత్రము లెప్డు హరికథాశ్రవణంబు
సేయుచుండెడుపనిఁ బాయకుండు

తే. అతనికన్నులు హరివిగ్రహము నెఁ జూచు
నతనిత్వక్కును హరిభక్తు నంట నెంచు
నతనిజిహ్వా నైవేద్యము నారగించు
నతనిశిరము నిర్మాల్యము నవధరించు. 90

మ. భగవద్భక్తులతోడఁ గూడుకొని భూపాలాగ్రగణ్యుండు తా
భగవంతుం బరమేశ్వరున్ హరి రమాప్రాణేశ్వరుం గొల్చుచున్
సుగమం చెంచక సర్వకర్మములు విష్ణుం జేర నర్పించుచున్
సగుణారాధన మాచరించుచు నిశల్ సాఁగించె సద్భక్తిమై. 91

వ. మఱియు నతండు వసిష్ఠుండు నసితుండు గౌతముండు లోనగుమహా మునుల సాయంబున భూరిదక్షిణలతో ననేకాశ్వమేధంబులు గావించి సర్వవర్ణములవారి సంతృప్తులం గావించె నాతఁడులోకం బంతటను హరికథలు గానంబు చేయించుచు నాలకించుచుండు వానిప్రజలు స్వర్గసుఖంబులను మించినసర్వసుఖంబులు భూలోకమంద పొంది పరలోకం బపేక్షింప కుండు రని వినుచుండుము మఱియు నతండు సమస్తము బ్రహ్మస్వరూపం బని తలంచుచు నాత్మానంద మనుభవించుచుముకుందునిహృదయంబునదర్శించుచునిట్లు భక్తియోగముచేఁ బరమేశ్వరుం డగుహరి సంతసింపఁ జేయుచు సంతసించుచు నుత్తమ గజాశ్వరథగృహారామాయుధాంగనాదులు నశ్వరంబు లని తలంచుచు నిశ్చలభక్తియోగంబునం బ్రవర్తిల్లుచుండె నంత. 92

మ. హరి యారాధనభక్తి తత్పరత కత్యంతంబు సంప్రీతుఁడై
పరివర్తించుచు శత్రుసాధ్వసదమై భాసిల్లు చక్రంబు నీ
దురితంబుల్ దెగఁ గోయఁ జాలు నిది నీకున్ నుంచుకొ మ్మంచు స్నే
హరతిం జేసి యొసంగె సంతసమునన్ హార్దంబు సంధించుచున్. 93

సీ. సర్వధర్మంబుల సాఁటివచ్చెడు నిజ
భార్యతో నాతండు పరమనిష్ఠ
నొకసమయమ్మున నొకయేటిదీక్షగా
ద్వాదశీవ్రతము సల్పంగఁ బూని
కడపటిమాస మాకార్తికంబున మూఁడు
నాళ్ళు ఉపవాస మొనర్చి పిదప
నాల్గవదిన మయి నలువునీఁ టెడు మహా
ద్వాదశి యమునలోఁ దాన మాడి

తే. మధువనంబుఁ బ్రవేశించి మాధవు నట
నిలిపి సాహస్రఘటముల జలక మాడఁ
జేసి గంధపుష్పాదులఁ జేసి భక్తి
భరితుఁడై పూజ గావించె గరిమ మీఱ. 94

వ. మఱియు బ్రాహ్మణారాధనంబు గావించి సువర్ణశృంగంబులు నానా
విధాలంకారాలంకృతంబు లగునఱువదికోట్ల గోవులు సువర్ణదోహన
పాత్రములతోడ నెల్లవారికి దానంబులు గావించి మునుమున్న వారికి
షడ్రసోపేతభోజనంబు నెట్టి దక్షిణాతాంబూలంబు లొసంగి వారియనుజ్ఞను బడసి
తాను బారణ చేయ సంసిద్ధుండై యుండె నాసమయంబున. 95

శా. "సర్వం విష్ణుమయం జగ" త్తనుచు సుస్నానంబు గావించు నా
దుర్వాసుండు మహామహేంద్రుకడకున్ దోతెంచె దైవాదృతిన్
బర్వం బంచుఁ దలంచుచున్ నృపతి యారాధించెయుమిన్ దెచ్చి తా
నుర్విన్ దేవునిఁబోలి గొల్చె పరమోద్యోగంబు సంధిల్లఁగన్. 96

వ. ఇట్లర్ఘ్యపాద్యాద్యతిథిసత్కారంబులు గావించి వానిపాదంబులపైఁ
బడినాఁడు తనయింట భుజింపఁ బ్రార్థించుటయు దుర్వాసుండట్లయగుం

గావుత మని మాధ్యాహ్నికకృత్యంబు దీర్చుకొని వచ్చెద నని
యమునానదికిం బోయి స్నానసంధ్యాదికృత్యంబు లాచరించుచుం
దడయుటం జేసియు ద్వాదశి యప్పటి కరగడియమాత్రము శేషించి
యుండుటం జేసియు దాను బారణ చేసినఁగాని వ్రతఫలంబు సిద్ధింప
దని యెఱుంగుటం జేసియు రాజేంద్రుండు. 97

చ. అతిథి నిరాకరించి వ్రతి యాతఁడు పారణ సేయ నొప్ప దా
వ్రతమునఁ దాను బారణము ద్వాదశిలోపునఁ జేయ శాస్త్ర పం
నతేఁ డపు డిట్లు సేయఁ దగు నంచు మనంబునఁ జింత సేయుచున్
క్షితిసురవాక్యసంగతిని జెల్లెదునం చని త్రావె నీళ్ళులన్. 98

తే. అపుడువ్రతభంగమును లేక యతిథి నిరస
నమును లే దని తలఁచుచు నరవరుండు
ఎదురుచూచుచునుండె ఋషీంద్రు రాక
కతఁడు పోయినదెస దృష్టి యరుగఁజాచి. 99

మ. అలదుర్వాసుఁడు స్నానముఖ్యములు కృత్యంబుల్ ప్రవర్తిల్లఁగా
సలుపం గల్గి నరేంద్రు గేహముః కడన్ సాక్షాత్కరింపంగ నై
తెలియ న్వచ్చుట వారిపారణము దేదీప్యద్రుషామూర్తి యై
చలియింపం దను వెల్ల బొమ్మముడి యాస్యంబందు బింబింపఁగన్. 100

వ. అంబరీషునిదిక్కు మొగంబు వెట్టక ప్రక్కనున్న ప్రజలం జూచి యిట్లనియె.

ఉ. చూచితిరే వ్యతిక్రమము సూనృతవాదివలెన్ నటించు నీ
రాచకొలంబుమానికము రమ్మని భోజన మాచరింపఁ గా
వాచకముం బొనర్చి యిట బ్రాహ్మణునిం బహిర్వెట్టి నట్లు గాఁ
జూచుచుఁ ద్రోసిరా జనుచుఁ జుత్తి భుజించె నొకండ వింటిరే. 102

తే. విష్ణుభక్తుఁడ ననియెడు విఱ్ఱవీఁగు
వీని కెంతయుఁ గల దిట్లు విప్రుఁ బిలిచి
రాకయుండ భుజించె గర్వమునఁ జేసి
దీనికిం దగఁ బ్రతిఫల మే నొసఁగుదు. 103

వ. అని పలుకుచుం గాలాగ్నిరుద్రుండై మండిపడి దుర్వాసుం డొకజడం
బెఱికి దీనిచే నంబరీషుం జంపెద నని దానియం దొకశక్తిం గల్పించి
విడిచిపుచ్చె నాశక్తియు. 104

మ. కరవాలంబు గ్రహించి హస్తమున లోకం బెల్ల నల్లాడఁ గాఁ
జరణద్వంద్వము నేల మోపుచు భయోచ్చాట్టహాసంబు లం
బరభాగం బది నిండుకో నలుపుచున్ వహ్నిద్యుతుల్ గ్రక్కుచున్
నరదేవోత్తముమీఁదికిన్ జనియె నంతన్ జెంత హా పుట్టఁగన్. 105

ద్విపదము. అది చూచిభయ మంద కంబరీషుండు
హృదయంబునం జగదీశ్వరు నిలిపి
ధ్యానించుచుండె న త్తఱుణంబునందు
హానిహృద్వాసుండు మానివాసుండు
భక్తవత్సలుఁ డయి భక్తునిఁ బ్రోవ
శక్తిని దునుమాడఁ జక్రరాజమున
కాజ్ఞప్తి గావించె నంతలో నద్ది
ప్రజ్ఞాప్రభావము ప్రజ్వరిల్లంగ
ప్రేల్మిడిం జని శక్తి వీర్యంబు వోవ
నల్మొలలుం జుట్టి నాశరిల్లంగ
నలిపి దుర్వాసుని నమయింప నెంచి
వెలుఁగుచు దావాగ్నివిధమున మంట
లెగయ వానికి నెదు రేగి కాల్పంగఁ
దగులుకొనం గాంచి తత్తఱపడుచు
నుత్తలపా టందునుల్లంబుకోడ
మిత్తి కయ్యెద నని మిడుకుచు మేరు
గుహఁ డాగి యుండెద గోడువో ననుచుఁ
దహతహపడి పాఱెఁ దాపసేంద్రుండు. 106

సీ. తఱుముచుం జక్రము తా నెల్లకడలను
నిండి మండుచు హానిని న్వెనుకొని

గుహఁ జొచ్చిన నతండు కుదిరి యుండఁగ లేక
దిక్కులకుం బాఱె దిక్కు లేక
వెన్నంటఁ గని భీతి మిన్నంటె యతలాది
లోకముల్ గనుచు నీరాకరమునఁ
బడి డాగి యుండియు వడి స్వర్గమున కేగి
తల దాఁచుకొనుటకుఁ దావు లేక

తే. మ్రింగవచ్చెడుచక్రమునంగిటఁ బడ
నయి భయమ్మున వడకుచు నంతలోన
సత్యలోకమునకుఁ బోయి స్రష్టఁ గాంచి
దీనముగ నూర్చుచుం బల్కె దెసలు గనుచు. 107

తే. విష్ణుచక్రము ననుఁ గాల్ప వెన్నుఁ దన్ని
వచ్చుచున్నది యెందున్న వ్రచ్చునట్టి
దయ్యె నియ్యెడ నిను శరణంటి నన్నుఁ
గాచి రక్షింపవే కృపఁ గమలగర్భ. 108

వ. అనిన నంతయు నెఱింగి చతుర్ముఖుం డి ట్లనియె. 109

మ. భగవంతుం డగువాసుదేవుఁడు జగద్వర్గంబు కేళ్యర్థ మి
ట్లుగ నిర్మించెను సంహరించు నవలన్ లో నెంచి యెవ్వారి కెం
చగఁ గర్తృత్వము లేదు దేనికిని నాస్థానంబు నవ్వానివా
స్తగతం బెప్పుడు నే నొకండ నయి పో సంప్రాప్తమౌఁ గాలముల్.

ఆ. కాలరూపుఁ డైనకంజాక్షుచక్రము
బారిఁ బడిననిన్నుఁ బట్టి కావఁ
గలిగినట్టిశక్తి గలవాఁడఁ గా నేను
నిజము చెప్పుచుంటి నీవు వినుము. 111

వ. నేన కా దేకాదశరుద్రులు నింద్రాదిబృందారకబృందంబులు భృగువు
దక్షుఁడు లోనగువా రందఱు నీసందర్భమున నసమర్థులు మే మందఱ
మతనియాజ్ఞ శిరసావహించి మెలంగుచుంటి మే మతనిసేవకులము

నిన్ను రక్షింప మాతరంబు గాదు నీ వాపరమేశ్వరునే శరణంబు
వేఁడు మనినఁ బ్రత్యాఖ్యాతుండై దుర్వాసుండు సుదర్శనపీడితుండై
నిలువఁ జాలక కైలాసంబునకుం జని శూలిమఱువు సొచ్చి విష్ణు
చక్రము వెన్నుదన్ని వచ్చి కాల్చివేయు చున్న దాపన్నశరణ్యా!
నన్నుఁ గాచి రక్షింపు మనిన నీక్షించి పాలాక్షుం డి ట్లనియె. 112

తే. వత్స మావంటివారి కావాసు దేవుఁ
డేడుగడ మేము తత్కృప నిట్టు లుంటి
మెల్లరం జేసె నతఁడు సమిద్ధశక్తి
నెల్ల రాతని లెంక లోబుసిన రేణ్య. 113

వ. మఱియు సనత్కుమారుఁడు నారదుఁడు చతుర్ముఖుఁడు కపిలుఁడు
దేవలుఁడు ధర్ముఁడు నాసురి మరీచి లోనగువా రెల్లరును సర్వజ్ఞు
లగుసిద్ధులు సాధ్యులు యక్షరక్షోగంధర్వాదులును దక్కనుం
గలవారు మే మందఱము నతనిమాయచే నావృతులమై వానిమహిమ
మెఱుంగ నేర కున్నవార మిట్టిమే మాతనిచక్రమును మరలింప
శక్తి గలవారము కాము నీవాచక్రధరునే శరణంబు వేఁడు మనిన
నతం డాశాలతం ద్రెంచుకొని కించుని తెఱంగునం గుందుచు నమంద
గమనంబున వైకుంఠంబునకుం జని మంగళదేవతాంగసంగతి నెసంగు
శ్రీమన్నారాయణుంగాంచి నమస్కరించిభయకంపితుండై యి ట్లనియె.

మ. అపరాధం బొనరించిన నాఁడను మహాత్మా! మాధవా! నీవు భ
క్తపరాత్ముండవు నీమహత్వము జగత్కల్యాణదం బెన్న నీ
కుపమానం బొక డుండఁ బోఁడు విధిముఖ్యుల్ నీదులెంకల్ సమ
స్తపరిత్రాణము నీపయిం గలుగు నార్తత్రాణపారాయణా. 115

క. నీభక్తు నంబరీషుని
నే భంజింపం దలంచి యెగ్గు పొనర్పం
గా భయదశక్తి నంపితి
నాభయమున కదియ కారణం బయ్యె నయో. 116

వ. నాయపరాధంబు సైరించి న న్ననుగ్రహింపు మని ప్రార్థించినం బరమేశ్వరుం డి ట్లనియె. 117

సీ. నే నస్వతంత్రుఁడ నిరతము నాభక్త
లకు నధీనుఁడ వారలకును గూర్తు
వారిఁ గా దనుచు లవంబైనకార్యము
చేయనినియమంబు నాయెడ నగు
నాశ్రితవాత్సల్య మది విడు మని హేయ
మని తలంపకుము నీస్వాంతమందు
నాహృదయమ్మును నాభ క్తవరులు స్వా
ధీనము గావించుకో నయి రిల

తే. మనుజుఁ డెవ్వండు తనచిత్త మనుసరించు
వారు నాచి త్తమగుటచే వారి ననుస
రించి నేను బ్రివర్తింతు నించుకంత
భేదభావము లేకుండ వేదవిదుఁడ. 118

వ. మఱియు నాకర్థింపుము నాకు నాశరీరము గాని సర్వదా న న్ననుస
రించి యుండులక్ష్మి గాని భక్తులకంటెఁ బ్రియమ్ములు గాఁ జాలవు
దేహ మైన విడుతును-గాని భక్తుల విడువఁ జాలను వారు పుత్ర
మిత్రకళత్రధనధాన్యాదులు విడిచి నన్ను శరణు సొచ్చి యున్నవా
రట్టిభక్తుల నెట్లు విడువఁ గలను? నన్ను సేవించునాభక్తులు నన్నుఁ
గాక సాలోక్య సామీప్య సాయుజ్య సారూప్యముల నైన నొల్ల
కుందురు నేను దేని నైన సహింతును గాని భక్తుల కై నయపరాధము
సహింపఁ జాల నైన నీవు నన్ను శర ణంటివి గావున నీ వంబరీషుని
కడకు పోయి ప్రార్థింపుము నీవు తప్పుచేసినను ని న్నతఁడు క్షమించి
పుచ్చు నీవు గతార్థమునకు శంకింపక పోయిరమ్ము పొమ్ము నీకు
మేలు కలుగుఁ గాక యని భగవానుం డుపదేశింప దుర్వాసుండు
చేయునది లేక చక్రాగ్నితప్తుండై తత్తఱించుచు బోయి యంబరీషుని
పదంబు పట్టుకొని ప్రార్థించి యి ట్లనియె. 119

చ. ఎఱుఁగక తప్పుచేసితిని హీనమనస్కుఁడ నైతి నాపయిం
గరుణ దలిర్పఁ జేయుచును గర్కశమై పఱతెంచుచక్రిముర్
మరలిచి నాదుప్రాణముల మన్నుము మించినదాని కెట్టు లె
వ్వరు పొనరింప నేరుతురు వత్సలతం గను మేను దీనుఁడన్. 120

వ. అని యనేకవిధముల దీనాలాపంబు లాడుచు బ్రాహ్మణుండు పాదంబుఁ
బట్టి రక్షింపు మని ప్రార్థించిన నంబరీషుండు సిగ్గుపడుచు విష్ణు
చక్రముం దిలకించి యిట్లని ప్రార్థించె. 121

ఉ. నీవు సమస్తలోకములు నిర్మితి చేయఁగ బెంపఁ ద్రుంపఁగాఁ
జేవ నెసంగి యుండుదువు జిష్ణుఁడ వన్నను విష్ణు వన్నర్
నీవె దివాకరుండవు ను నీవె కృశానుఁడ వీవె చంద్రుఁడున్
నీవె సమస్తభూతములు నీవె పరాత్పరుఁ డీవె చక్రమా. 122

సీ. దుష్టుల శిక్షించి శిష్టుల రక్షింతు
నీవు శాశ్వతముగా నెగడుచుందు
నీవు ధర్మములను గావంగ వెలసితి
యజ్ఞపూరుషుఁడు ని న్ననుసరించు
దోషాచరుల కీవు ఘోరచక్కవు ధర్మ
మూర్తివి వర్తింతు ముజ్జగముల
నశియించు నీదర్శనమునఁ బాపంబులు
ద్యుమణిదర్శనమునఁ దమము లట్లు

తే. విశ్వమంతయు నీకంటె భిన్న మనఁగ
రాదు నారాయణాజ్ఞ నీ వాదుకొందు
నీవు శర ణన్న వారినిఁ గావ నుందు
వారియపరాధముల నెల్లఁ బాపికొందు. 123

మానిని. నీకు నమస్కృతి సేయుదు నీవు ప్రియంబవు విష్ణునకున్
నీకు నభేదము లోకము నీవలనన్ వెలుగొందెదు నో
లోకశరణ్యమ ! చక్రమ ! లోఁ గడునక్కటికంబు దగం
గైకొని బ్రాహ్మణవర్యునిఁ గావుము ప్రోవుము దేవుఁడవై. 124

వనమయూరవృత్తము.

ఈద్విజునిప్రాణముల నిచ్చి దయతోడన్
మద్వరకులంబునకు మచ్చ యయి పాపం
బుద్వహము యట్లగుచు నొడ్డగిలకుండన్
విద్వదధినాథ పొదలింపు మనుకంపన్. 125

వ. మఱియు నేఁ జేసినదానంబులు ధ్యానంబులు యాగములు యోగ
మ్ములు ధర్మములు కర్మములు పరమపురుషునకుఁ బ్రియంబు లగున
యేని నాకులంబు బ్రాహ్మణునే దైవంబుగా భావించునట్టిదయేని
పరమేశ్వరుఁడు నాచేయువ్రతంబులకు సంతుష్టుం డయ్యెనేని యీ
బ్రాహ్మణుండు బాధారహితుండై ప్రవర్తిల్లుఁ గాక యని ప్రస్తుతింపఁ
బ్రసన్నుండై చక్రరాజంబు శాంతించి యంబరీషానుమతంబున దుర్వా
సుని విడిచిపెట్టె దుర్వాసుండును జక్రతాపంబు దొలంగుటం జేసి
నిరామయుండునై రాజుం దీవించుచు ని ట్లనియె. 126

. తెలిసితి విష్ణుభక్తులమహాత్త్వం బిప్పు
నెఱిఁగయ్యె నోపృథివీతలేంద్ర
నీ కపకారము నేను జేసినఁ గాని
నా కుపకార మొనర్చితీవు
విష్ణుభక్తుల కిల విడరాని దేదుండు
వారు నిష్పాపులు వారె ఘనులు
వారిపాదము లోకపావన యగుగంగ
కరయ జన్మస్థాన మగును జూవె

. నీవు కరుణాళుఁడవు నాదుజీవనములఁ
జక్రదావాగ్ని పాలయి సడలకుండఁ
నలిపినాఁడవు నీకీర్తి సర్వలోక
కీర్తనీయమ యగు నోయి క్షితితలేంద్ర. 127

అని పొగడుచున్నదుర్వాసుం గాంచి యంబరీషుండు మునీంద్రా నీ
వానాఁటినుండియు నేఁటివఱకు నాహారము స్వీకరించి యుండవని

నే నూహించుచు నేను నాహారంబు స్వీకరింప కుండి సిప్పటి కొక్క
సంవత్సరకాలం బతిక్రమించె న న్ననుగ్రహించి నేఁడు నాయింట
భుజించి పొమ్మని పాదంబులపైఁ బడి ప్రార్థించి ప్రసన్నుం డైన
వానికి షడ్రసోపేతభోజనంబు వెట్టి తృప్తి గావించె మునీంద్రుండును
సంతుష్టాంతరంగుండై రాజేంద్రుం బ్రశంసించుచు నాకాశమార్గంబున
స్వర్గమునకు నిర్గమించె రాజేంద్రుండును సంవత్సరకాలంబునుండియు
భుజింపకుండినవాఁడు గావున దుర్వాసుండు చనినపిమ్మట నాభుక్త
శేషంబు భుజించె నిట్లు వ్రతపరాయణుండై పరాత్పరు నతిభక్తిం
భజించుచుఁ బెద్దకాలంబు జీవించి తనకుం దుల్యు లగుకుమారులం గని
వారికి రాజ్య మిచ్చి తపోవనంబునకుం జని ముక్తుం డయ్యె. 128

క. ఈయంబరీషచరితము
పాయకపఠియించుభక్తనరులకు సకల
శ్రేయోభివృద్ధు లగుఁ బర
మాయుర్దాయమును ముక్తి నందగ వచ్చున్. 129

వ. అయ్యంబరీషునకు విరూపుండు కేతుమంతుఁడు శంభుఁ డని ముగ్గురు
పుత్రులు పుట్టిరి వారిలో విరూపునికిఁ బృషదశ్వుండు వానికి రథీ
తరుఁడు పుట్టె రథీతరుండు సంతానంబు లేమిం జేసి విచారించుచు
నంగిరసు నాశ్రయించిన నతం డతనిభార్యయందు బ్రహ్మవర్చసో
పేతు లగుసుతులం బుట్టించె వారు రథీతరగోత్రు లనియు నాంగిరసు
లనియుఁ బేరు పొందిరి వారిప్రవరలో బ్రాహ్మణులును క్షత్రియులుం
గలసి యుండు నింక నిక్ష్వాకుని వంశంబువర్ణించెదవినుమని యి ట్లనియె.

—♦ ఇ క్ష్వా కు వం శా ను క్ర మ ణి క ♦—

సీ. వైవస్వతునితుమ్మువలన నిక్ష్వాకుఁ డన్
పుత్రుఁడు పుట్టె నాపుత్రునకును
నూర్వురు పుత్రకు లుర్వి జనించిరి
వారిలోపలఁ బెద్దవాఁ డ్వికుక్షి

నిమియు దండకుఁడును నెఱి మీఱి మున్గు రా
ర్యావర్తమునకును బ్రభువు లైరి
మిగిలినవారిలో నగునిరువదియైదు
గురు తూర్పుసంద్రమువఱకు ధరకు
తే. అధిపు లైరి పశ్చిమదిక్కునందు నుండు
నేల కిరువదియైదుగు రేలిక లయి
రొనర మిగిలినవా రుత్తరోత్తరోర్వి
భాగముల నేలఁ దొడఁగిరి ప్రభువు లగుచు. 131
తే. అందఱు కుమారులకు జ్యేష్ఠుఁ డగువికుక్షి
జనకుపంపున నష్టకశ్రాద్ధమునకు
మాంసమును దేర వని కేగి మసలుకొన్ని
మృగములం జంపి శ్రమఁ జెంది దగ వహించి. 132
వ. ఆఁకలియును వేప నోపిక చెడి శ్రాద్ధసంపాదితంబులగువానిలో నొక్క శశముం దిని తక్కినవానిం దెచ్చి తండ్రి కిచ్చిన నతండు వానిం బుచ్చుకొని వసిష్ఠుం బిలిచి దీని సంస్కరింపు మనిన నతం డిది యుచ్ఛిష్టంబు శ్రాద్ధంబునకుం దగ దనిన నిక్ష్వాకుండు కుమారకృతదుష్కర్మం బెఱింగి వాని దేశంబునుండి వెడలం గొట్టించి మాఱుమాంసంబున శ్రాద్ధంబు నిర్వర్తించి ధర్మకార్యతత్పరుండును విష్ణుభక్తుండు నై భూమండలం బేలుచుఁ బరమేశ్వరప్రీతిగా యజ్ఞంబు లొనరించుచు విరక్తుండై తపోవనంబున కరిగి భగవదారాధనంబు సేయుచుఁ బ్రారబ్ధావసానంబునఁ గళేబరంబు విడిచి ముక్తుం డయ్యె నంత శశమును భక్షించుటం జేసి శశాదుం డను పేరు వడసిన వికుక్షి మరలి చనుదెంచి ప్రభుండై రాజ్యపాలనంబు గావించె నావికుక్షికి బురంజయుం డను పుత్రుండు పుట్టె వానివృత్తాంతంబు చెప్పెద నాకర్ణింపుము. 133

—♦ పురంజయోపాఖ్యానము ♦—

సీ. మును దేవదానవముఖ్యులకుం బోరు
తీఱని దయ్యె నప్పోరునందుఁ

బరిబలులై రాక్షసుల్ కరితుభుజాలఁ బరాభ
వించిన విష్ణువావిధ మెఱింగి
పనిచెఁ దోడ్పడ సురవరులకు నప్పురం
జయు నంత వృషరూప మయిన నింద్రు
పై నెక్కి దేవతాప్రస్తుతుండై విష్ణు
తేజోభివర్ధితుండై జగమున

తే. రాక్షసపురంబులం జొచ్చి రాచివారి
పురములం గాల్చి విజయంబు పొందఁ గలిగి
వారిధన మెల్లఁ గొనివచ్చి వాసవునకు
నిచ్చి విఖ్యాతిఁ గాంచెఁ దా నెల్లకడల. 134

వ. అతండు పురంబులం జయించుటంజేసి పురంజయుం డనియు నింద్రుని వాహనముగాఁ గొనియెఁ గాన నింద్రవాహనుఁ డనియు వృషభకకుత్తునఁ గూరుచుండెఁ గానఁ గకుత్థ్సుం డనియు నామంబులం బ్రసిద్ధిఁ గాంచె నాపురంజయునకు ననేనసుండు పుట్టె వానికిఁ బృథువు పృథువునకు విశ్వగంధుం డతనికిఁ జంద్రుఁ డాచంద్రునకు యువనాశ్వుఁ డాతనికి శాబస్తియుఁ గలిగిరి. శాబస్తి తన పేరఁ బురంబు గట్టి ప్రసిద్ధిం గాంచె నాశాబస్తికి బృహదశ్వుఁడు వానికిఁ గువలయాశ్వుం డతండు బలవంతుండై యిరువదియొక్కవేగు రగుతనపుత్రులతోడం గూడి యుదంకమునికిఁ బ్రియముగా దుంధునితో ఘోరయుద్ధంబు గావించి వానిం జంపె దానంజేసి యతండు దుంధుమారుం డను పేరు గాంచె నాయుద్ధములో ముగ్గురు తక్కతక్కినవానికుమారు లందఱు నిహతులైరి వారు ముగ్గురును దృఢాశ్వ కపిలాశ్వ భద్రాశ్వు లను వారు వారిలో దృఢాశ్వునకు హర్యశ్వుఁడు హర్యశ్వునకు నికుంభుఁడు నికుంభునకు బర్హిణాశ్వుఁడు వానికిఁ గృశాశ్వుఁడు వానికి సేనజిత్తు వానికి యువనాశ్వుఁ డతండు సంతతి లేనికారణంబున మిగుల వగలం బొగలుచుఁ దననూర్వురుపత్నులతో వనంబునకుం జని మునుల

నాశ్రయించినంత వా రతనిచే నింద్రదేవతాక మగుపుత్రకామేష్టిం జేయించి రాయాగదినములలో నొకనాఁటిరాత్రి రాజు దప్పిగొని యాగశాలలో వాని భార్యలుఁ ద్రావఁ దగియున్న మంత్రోదకమును ద్రావె నావల మునులు లేచి మంత్రజలశూన్య మైనకలశముం గని కళవళంపడి రాజుం జీరి పుత్రోత్పత్తికారణం బగునిందలిజలం బెవ్వరు ద్రావి రనిన రాజు తనతప్పుం జెప్పిన వారు దైవము బలవంత మని శాంతించి రంతం గొంతకాలమునకు నాయువనాశ్వునిదక్షిణకుక్షి భేదించుకొని యొకపురుషుండు పుట్టి క్షుధాభరంబున నేడ్చుచుండ నింద్రుండు వచ్చి "నన్నుఁ ద్రావు" మని సుధామయం బగుచూపుడు వ్రేలి నాతనినోటం బెట్టి కుడిపె దానంజేసి యతండు మాంధాత యని పిలువం బడుచు రావణాసురాదిదస్యులకుఁ ద్రాసము పుట్టించినవాఁ డగుటంజేసి త్రసద్దస్యుం డనుబిరుదనామంబునుం బొంది సమర్థుఁడై చక్రవర్తియై సప్తద్వీపసముద్రముద్రితం బగుధరాచక్రంబెల్ల నిరంకుశంబుగఁ బరిపాలించుచు బహుదక్షిణాకంబు లగున నేకయజ్ఞంబులు చేసి నారాయణుని సంతసింపం జేసె నాతనికి శతబిందునిపుత్రిక యగుబిందుమతియందుఁ బురుకుత్సుఁడు లోనగుపుత్రులును నేబండ్రు పుత్రికలుం బుట్టి రాపుత్రిక లందఱు సౌభరియనుమహర్షినిఁ బెండ్లి యాడి రావృత్తాంతంబు జెప్పెద నవధరింపుము. 135

—♦ మాంధాతపుత్రికలం బెండ్లియాడినసౌభరి వృత్తాంతము ♦—

సీ. సౌభరి యొకనాఁడు స్నానార్థ మరిగి యా
మునజలంబునయందు మునిఁగి యందు
మత్స్యముల్ మైథునమతి నుండఁ గని తాను
నట్టిసుఖంబును ననుభవింప
నెడ నెంచి మాంధాతకడ కేగ రాజేంద్ర
నీకొమార్తెలలోన నా కొకర్తు

నిచ్చి పెండిలిసేయుదే యన నాతండు
వానిముసలిరూపు తాన రోసి

తే. కాదు పొమ్మన కాతనిఁ గాంచి యోయి
నాదుకన్యలకు స్వయంవరాదికోత్స
వం బొనర్పఁ దలంచితి వచ్చి నీవు
నాఁడు వరియింపఁ బడుము నీపోడిమిమెయి. 136

వ. అనిన సౌభరి తనలో నతండు నాముదుసలిరూపంబు గాంచి కాదని తాను నిరాకరింపక యిట్లు స్వయంవరవ్యాజంబు సంధానించెం గానిమ్ము నేను నాతపఃప్రభావంబున దేవాంగనలుం గూడఁ గోర నోపురూపంబు సంపాదించెద నని నిశ్చయించుకొని రాజాజ్ఞవడసి యంతఃపురంబుం బ్రవేశించె నంతలో నతండు. 137

మ. పదియార్వన్నెపసిండిఁ గా దనెడిమేన్ పద్మంబులం గేరుసం
పదలం బొల్చెడుకన్నుదోయి శశిబింబంబు న్విడంబించుమో
ముదుటుం జూపెడువక్షముల్ బొమలు నెంతో వింతకుం దానమై
గదలం జొచ్చెడునీలవాలములు గల్గం బొల్చె గోవాళ్లమై. 138

వ. ఇట్లతండు తనతపోయోగప్రభావంబున మహాసౌదర్యవంతుం డై చూపట్టుటయుం జూచి రాజకన్యలు. 139

మత్త. ఏనె వీని వరించియుండితి నీతఁడే నను నాలుగా
మానసంబున నెంచి పొందెడు మానఁ డెవ్వతె గాని లో
వీనినిన్ వరియింప నొప్పదు వేఱుదారులు చూచుకో
నొను మీ కని యొండొరొక ళ్లపు డాడఁ జొచ్చిరి వాదులన్. 140

వ. ఇట్లందఱు వాని వరించుటంజేసి వేరెనిం గాదనఁ జాలక మాంధాత వారి నందఱ సౌభరి కిచ్చి పెండ్లి గావించి యంపిపుచ్చె సౌభరియు వారితోడం గూడి నిజాశ్రమంబునకు నిర్గమించి తనతపఃప్రభావంబున నింతలో నొక్కొక్కదాని కొక్కొక్కదివ్యభవనంబు నిర్మాణంబు గావించె నవియును. 141

సీ. సాలమధ్యమున విశాలభూభాగము
నం దొక్కప్రాసాద మచట నొక్క
యుపవనంబును నిర్మలోదకకమలాక
రమును గ్రీడాపర్వతము నమూల్య
శయ్యలు మణిమయాసనములును దుకూల
వస్త్రాభరణములు పానవస్తు
వులు భోజనపదార్థములు దివ్యగంధముల్
పుష్పమాలలు స్త్రీలు పూరుషులును
తే. గలిగి దేదీప్యమానమై కనులపండు
వగుచు శుకశారికాదిపక్షిగమిపలుకు
బడుల నతిమనోహరములై పుడమిఱేండ్ల
వీండ్లకు న్మించి యుండె వేవేలరెట్లు. 142
శా. ఏడుం దీవుల నేలునట్టి ప్రభుఁడై యింపొందుమాంధాత స
మ్రాడైశ్వర్యము నొందువాఁ డయిన జామాత్రుత్తమాఖ్యాతముల్
క్రీడారామసమంచితంబు లగునాశ్రీధామముల్ గాంచి లో
వ్రీడాభారము నొందినట్టిఁ డగుచున్ విడ్చెన్ మనోగర్వమున్. 143
వ. ఆసౌభరి యట్లు గృహస్థాశ్రమంబున సాంద్రసుఖంబు లనుభవించుచు నొక్కనాఁ డొక్కచోఁ గూర్చుండి యమునానదీమత్స్యంబులం జేసి తనకుఁ గల్గినవిషయచాపల్యముం దెలిసికొని తనమనంబున. 144
ఆ. ఎంతహీనుఁ డయ్యె నీవెఱ్ఱిసౌభరి
చేఁపకారణమునఁ జెడి తపంబు
విడిచి విషయసుఖ మపేక్షించి యీరీతి
మోక్షపదము విడినమూఢుఁ డయ్యె. 145
తే. అకట మోక్షార్థి సంగము లవలఁ ద్రోచి
విషయసుఖముల కాశించి వెఱ్ఱి గాక
యొంటఱిగ నుండి తపియించు టొప్పుఁ గాని
నాకుబలె నిట్లు చెడకుఁ డో లోకులార. 146

వ. విషయలోలుండనై నేను నేఁబదిమంది భార్యలం బెండ్లియాడి వారి
యం దైదువేలమంది నందనులం గాంచి యుండియు నామది మోహా
వృతమై మిథునకర్మాసక్త మగుచున్న విషయములే పురుషార్థము లని
తలంచుచున్న దయ్యయో నాకర్మ మిట్లున్న దని తలంచుచుం గ్రొం
తలో విరక్తుండై కార్యాకర్మములం బరిత్యజించి వైరాగ్యంబ మహా
భాగ్య మని భార్యలకుం జెప్పి తపోవనంబునకుం జని పరమతపంబు
గావించుచు నాహవనీయాగ్నులతోడం గూడఁ బరమాత్మయం దను
సంధానంబు గావించి మోక్షసామ్రాజ్యసుఖం బనుభవించె సౌభరి
పత్నులును బతి ననుసరించి వనంబునకుం జని ముక్తిం గాంచి రిది
సౌభరివృత్తాంతం బింక మాంధాతృపుత్రు లైనపురుకుత్సాదులలో
నంబరీషుండు ఘనుం డయ్యె నాకర్ణింపుము. 147

తే. అంబరీషునిఁ బుత్రుఁ గా నతనితండ్రి
తండ్రి యువనాశ్వుఁడు గ్రహించె దాన నతని
సుతుఁడు యువనాశ్వుఁ డని జగన్నుతుల కయ్యె
నని యెఱుంగవలయు నో యవనినాథ. 148

వ. రెండవయువనాశ్వునకు హరిత మాంధాత్మలు ప్రవరకుం జేరినవా
రై రింకఁ బురుకుత్సుసంతతిం జెప్పెద వినుము. 149

— పురుకుత్సునిచరిత్రము —

సీ. నాగకన్యక యగునర్మద యనుదానిఁ
బురుకుత్సుఁ డుద్వాహమునను బొందె
భర్తృసాహాయ్యమును సంపాదించి నర్మద
తోఁబుట్టువులకోర్కె తోడ విభునిఁ
గొనిపోయెఁ బాతాళమున కట నాతండు
ఘన మైనగంధర్వగణముఁ దునిమి
వర మందె నాగులవలన భయము లేక
యుండెడుచందంబు లోనరునట్లు

తే. తనరుపురుకుత్సునకుఁ ద్రసదస్యు వయ్యె
నతని కనరణ్యుఁ డతఁడు హర్యశ్వుఁ గనియె
నాతనికి నరుణుఁడు పుత్రుఁ డాతనికిఁ ద్రి
బంధనుం డనుతనయుండు ప్రభవ మందె. 150

వ. ఆత్రిబంధనునకు సత్యవ్రతుండు వానికిఁ ద్రిశంకుండు పుట్టి వసిష్ఠుని శాపంబునఁ జండాలుండై పిదప విశ్వామిత్రునితపఃప్రభావంబున బొందితోఁ స్వర్గంబునకు నిర్గమించియుఁ జండాలుం డగుట స్వర్గంబునుండి త్రోయంబడి తలక్రిందై పడుచు శరణు వేఁడ విశ్వామిత్రుఁడు దయాళువై పడకు మని యాకసంబున స్వర్గంబునకుఁ బ్రతిస్వర్గంబు నిర్మించి యం దతని నుండ నియమించె నతనికుమారుండు హరిశ్చంద్రుండు.

— ♦ హరిశ్చంద్రుని చరిత్రము ♦ —

ఉ. ఆతనికారణంబునన యాకౌశికాత్మజుఁడు న్వసిష్ఠుఁడున్
బ్రీతి దొఱంగి పక్షు లయి రేఁబవలున్ విడకుండఁ బెక్కువే
ళ్యాతతయుద్ధమున్ సలుపునట్టిర యైరి మహీకళత్రుఁడున్
ఖ్యాతికి నయ్యె సత్యమున కాతఁడె తానక మన్న పేరికై. 152

వ. అతనిదర్శనంబున కొకనాఁడు పర్వతనారదులు వచ్చిన వారి కల్లంత దవ్వుల నెదురేగి తోడితెచ్చి యర్ఘ్యపాద్యంబు లొసంగి సుఖాసీనులైనవారికుశలం బడిగి సద్గోష్ఠీవిశేషంబులం బ్రొద్దుపుచ్చుచు వారి దిక్కుమొగం బై. 153

క. మునివరులారా! పుత్రులఁ
గన లోకంబెల్లఁ గోరుఁ గారణ మేమో
విన నిచ్చవచ్చె వారలఁ
గనినందుకుఁ ఫల మదేమి కల్గెడుఁ జెపుడా. 154

సీ. అల్లియ సాగరసంగమాదులుచన్నియైన
నోము లుపవసించి నోఁచి యైన

గడు మంత్రతంత్రము ల్నడపించి యైనను
మందుల మ్రాఁకుల నొంది యైనఁ
జెఱగుఁమాసిన నాడి చిఱుతలఁ గనియైనఁ
బరమపురుషులరతిఁ బరఁగియైన
సవసౌమ్యచరువులు సవరించి తిని యైన
నాభులు దొంగిలి నమలియైన

గీ. నింక నిది పుణ్య మిదిపాప మిది సుఖ మిది
కష్ట మన కెట్టిపా టైనఁ గడఁగి పూని
పూరుషులు వోలె నారులు నౌరసులను
గనఁగఁ గోరెద రది యేమికారణంబొ. 155

వ. అనుటయుం బ్రజ్ఞాసాంద్రు లగునమ్మునిచంద్రు లాహరిశ్చంద్రనరేంద్రున కిందుల కుత్తరంబు వర్తిలు నాదరాయత్తచిత్తుండవై విను మని యి ట్లనిరి. 256

క. జగతీప! కల దపుత్ర
స్య గతి ర్నాస్తి యనువాక్య మది గావున నీ
జగతి సుతులు లేనిజనుల
కు గతులు లే వనుచు వైదికులపలుకు లగుట. 157

గీ. తాతవలనఁ దండ్రి దండ్రివల్లనుఁ దనుఁ
దనదువలనఁ దనయుఁడునుఁ గ్రమమున
వంశములను జనన మొందెద రది గాన
సుతులు సేయుసేత పితరులదియు. 158

♦ స్త్రీలు సంతానాపేక్షఁ జేసి గంగాదినదులసాగరసంగము చేరినకడ స్నానము సేయుదురు. బహిష్టయి నాల్గవదినమున వాడి పరిగెడుపక్షితోఁ బరులశిశువుల దర్శింతురు. దానం జేసి వీరు గర్భవతులగుటయు, పైబిడ్డలు నోగులై బ్రతికించుటయుం గలుగును. యజ్ఞములలో సౌమ్యచరువును సంపాదించి భక్షింతురు. పురిటింటిలోని పిల్లలనాభి (కోసినతొడ్డు) సంపాదించి భక్షింతురు. దాన సంతతి కలుగునని పెద్దలవాక్యము.

క. పున్నామనరకమందలి
బన్నంబులఁ జివుక నీక వరతనయుం డై
త న్నుద్ధరించుఁ గావున
నెన్నంబడెఁ బుత్రుఁ డనుచు నిలలో నధిపా. 159

వ. అనిన విస్మిత మనస్కుండై హరిశ్చంద్రుం డయ్యతీంద్రుల కి ట్లనియె.

మ. అహహా! పుత్రకుఁ డట్టిడే! తలఁప నట్లైయున్న మే లోమహా
మహులారా! మిము వేఁడువాఁడఁ గరుణ న్మన్నించి నన్నుం దమో
పహశీలు న్సుగుణాలవాలు సుతునిం బ్రాపింపఁగాఁ జేసి త
ద్రహీతావాప్త మహాఘు మేగుపథముం దా రాడి రక్షింపరే. 161

వ. అనుడుం బుణ్యవర్ధనులగునయ్యతిపరార్థులు పుత్రార్థి యగునప్పార్థి
వోత్తముం జూచి. 162

శా. అంతర్దృష్టి నొకింతసే పరసి యి ట్లం చాడి రోత్తేడ మే
మాంతర్యం బగునంత తెల్పెదము నిర్వ్యాజానుకంపామతి
న్మంతవ్యంబని నమ్మ గంగకును దూర్ణం బొప్పఁ బో మ్మందులో
సంతోషంబున నాఢిభక్తి వరుణు న్మంత్రంబుల న్వేఁడుమా. 163

చ. అతఁడు కృపాతరంగితమనోంబుజుఁడు న్సకలుండు పూనికీ
ర్తితసుచరిత్రుఁ డాఢ్యుఁడు త్వదీయహృదీప్సిత మెల్ల దీర్చు నీ
నుతులకు నిచ్చు మెచ్చు సుగుణు న్సుకుమారుఁ గుమారు నిచ్చు నా
నతికుతుకంబునన్ ఋషుల కర్ఘ్యముఁ బాద్యము నిచ్చి పుచ్చుచున్.

వ. పదంపడి ముదంపడి యానృపపురందరుండు పరిమితపరివారుండై గంగా
తీరంబుఁ జేరి స్నానసంధ్యాద్యనుష్ఠానపూర్వకంబుగా వరుణు నావా
హనంబు జేసి ప్రార్థించిన నతండునుం బరితుష్టుండై పొడసూపి
యిష్టంబు వేఁడు మనుటయుం బ్రసాదం బని కుమారునిం గోరిన వరు
ణుండును. 165

చ. ఇనకులవార్ధిచంద్ర! భవదీప్సితమొప్పఁగ బుత్రు నిత్తు నా
తని మఖ మందు నా కొగి యథావిధి వేల్తువ యేని నాఁగ న

జనపతి పైనఁ గానఁ బుసంగతిఁ జాతము లేమికంబెనే
లని తలఁపోసి నెమ్మి నిడు మట్ల యజించెద నప్పతీ! యనెన్. 166

తే. అన నపాంపతి మెచ్చి యోమనుకులీన
తనయుఁ బడసెదు మత్ప్రసాదమున నేగు
మనుచు నిచ్చ నదృశ్యుఁడై చనియె నంత
నొడయుఁ డరసంతసంబున నూరుఁ జేరి. 167

వ. అయ్యుదంతంబంతయు నింతి కెఱింగించి సుఖం బున్నంతం గొంతకాలం
బునకు వరుణప్రసాదాసాదిత చరుభక్షణాతి విశేషంబున. 168

శా. చూలాలై తగ నీరుమోసి తఱిఁ గొంచుం బుణ్యాలగ్నంబున
న్వేలాయుత్వనుతింపఁ బుత్రుఁ గని నిర్నిద్రప్రభాగాత్రు న
వ్వాలుంగంటి ప్రమోదరాగమున నొప్పారెం ద్వితీయాతమిం
బ్రాలేయాంశునిరేఖఁ జెన్నలరు నాప్రత్యక్షుఁ రిత్ప్రక్రియన్. 169

వ. అయ్యవసరంబున నాహరిశ్చంద్రనరేంద్రుం డమందానందకందళిత
హృదయారవిందుండై పుత్రోత్సవంబున స్వస్తిపుణ్యాహవాచనపూర్వ
కంబుగా దేవఋషిపితారాధనంబు గావించి మించిన వేడ్కఁ భూసు
రాదులకుఁ దాంబూలజాంబూనదాంబరాభరణాది బహుమానంబు
లొసంగి పదునొకండవ దినంబున నామకరణోత్సవంబున లోహితా
స్యుం డని నామంబు వెట్టి పరమానంద భరితాంతరంగుండై యుండె
నట్టియెడ. 170

చ. పులివలెఁ బాశి యాసుమొగముం గొని వచ్చి ప్రతీచినుండి రా
ట్తిలకముఁ జేరి యోరి! చనుదెంచితిఁ పుత్రుని వేల్వుమా యనం
బళపళ మీఁద మిన్విఱిగి పడ్డటు లుండియు నయ్యొ యిట్టిపి
ల్లలపిడు గేడ వచ్చె నలలా యని బెట్టుగ నేడ్చి రెల్లరున్. 171

తే. అపు డతండుఁడై ధరణీంద్రుఁ డాదరమున
గొల్లుమనునట్టిచుట్టలగోల మాన్చి
ధైర్యసంపద లనువడఁ దలఁచి వెఱవు
వరుణుఁ బూజించి యి ట్లని పలికెఁ దనియ. 172

క. నెలపుడు దైనం గడువమిఁ
దలఁపఁగ నీశిశువు సప్తతంతుపశువు గా
నలుపఁగఁ దగునే దోష
జ్ఞులు వలుకరె కూడ దనుచు సుకృతనిధానా. 173

సీ. అన మంచి దనిపోయి యతఁ డిర్వదొకనాఁడు
మరల విచ్చేసి భూవరుని డాసి
మితి దీఱె సుతు వేల్వు మీ నాఁగ నరపతి
నిర్దంతపశువగునే నృమేధ
మున కన నతఁ డేపకో యని చని సప్తమ
మాసమున దఱుదెంచి మంచి దనియె
నావుడు జన్నాలు దాఁపుచోఁ దగ దని
పుడమిఱేఁ డడ్డుకో లిడియె నిడిన

తే. నలుక నప్పతి వీడ్కొని యఱిగి మరల
నదనుగా నట కేతెంచి యవనినేత
నడిగెఁ గొడుకు యజింపు నా కనుచు నంత
సంతసం బుడివోవ భూకాంతుఁ డనియె. 174

వ. మహాత్మా! యనుపనీతుం డగునిక్కుమారుం డధ్వరపశ్వర్థంబు సంజ్ఞపనంబు సేయం దగునే సర్వజ్ఞుల రగుమిముబోఁటిధర్మాత్ము లెఱుంగనిధర్మం బెద్దియుండు కించిజ్ఞుఁడ నగునేను మీకు బోధింప నెంతవాఁడ నని సవినయంబుగ వివరించిన విని విగతమనోరథుండై మెల్లన వల్లె యని యవ్వల్లెత్రాఁడుదాలు పల్లన తనయిల్లుఁ జేరం బోయి యదె యిదె యని పదియేడులు గడపి కడపటియేట రాసుతునిఁ గృహోపనయనుసేఁగా నెఱిఁగి యఱుగుదెంచి యజింపు మనుచు నోడయునకుం బొడసూపిన వినమ్రుం డగుచు నతండును ధనుర్వేదవేదియు యౌవరాజ్యాభిషిక్తుండునుం గామింజేసి యిక్కుమారుం డిక్కాలంబున సవనపశువిశసనంబున కర్హుండు గాఁడు ప్రాప్తయౌవనుండుగా

విజయుంచేయుండు యజింతు ననిన నొక్కింత సంతసించి స్వస్త్యస్త్వని
యప్పాశహస్తుండు నిజాపరదిగ్గతామలావతీపురంబునకు నిర్గమించెఁ
బదంపడి హరిశ్చంద్రుండును. 175

సీ. ఆత్మపురోహితు నాహ్వాన మొనరించి
సుకృతోపనీతుఁడు సుతున కతని
సరస నష్టాదశసంఖ్యాకవిద్యలఁ
గ్రమమునఁ గఱపించి ప్రాజ్ఞుఁ జేసి
పరఁగ ధనుర్వేదపారగుఁగాఁ దాన
యొనరించి మించి యౌవనము రాఁగ
నాతని యౌవరాజ్యధురంధరత్వంబు
నకు నభిషేకంబు నలువుపరచి

తే. సరవిఁ షోడశాబ్దముల్ జరిపె నప్పుడు
వారిపుఁడు గోర్కె లిగురొత్త వచ్చి యర్చ
లంది మితి దీఱె సుతు వేల్వు మనియె ననిన
విభుఁడు నో మ్మని యప్పుడు ఋత్విజులఁ బిలిచి. 176

వ. యజ్ఞసంభారంబు లెల్ల నుమకట్టి కట్టెదుర సింహాసనాసీనుండై రాజ
కీయంబులు నిర్వర్తించుచు హితపురోహితసహితుం డగు నాలోహిత
కుమారుం జూచి యాత్మగతంబున. 177

చ. అరుదుగ లేక లేక జని నందిననందను ముక్కుపచ్చలే
నరయఁగ నారనట్టితరుణాంగుని నీతనిఁ జేతులార నేఁ
బరపరఁ గోసి పాశి కెటు వాచవి చేసెద నక్కటక్కటా
కరకటీ! దైవమా! యనుచుఁ గన్నులఁ గ్రిన్నన నీరు నించుచున్.

వ. అంతరంగంబున నంతకంతకు నింతింతన రానిచింతాసాగరంబు పెల్లుగ
వెల్లివిఱియ నాఁపరాక వరుణప్రభృతులు వినుచుండ బహిర్గతంబుగాఁ
గొడుకు నుద్దేశించి. 179

సీ. అనిశంబు నీమీదఁ బ్రాణంబు లుంచిన
 తల్లిదండ్రులగోడు దఱుగ నైతి
సారెకు నీరాక కోరి కోరిక నుండు
 నత్తమామలనేలు నంద నైతి
పరఁగ దౌహిత్రలాభము గల్గె నని పొంగు
 మాతామహులఁ గోర్కె మనుప నైతి
తగ నెప్పు డల్లిబిల్లిగఁ జెల్లుసిల్లాలి
 దర్పకతాపంబు తీర్ప నైతి
తే. వింతలో నన మృత్యు వావంతకరుణ
లేక యిబ్బంగి వరుణుని కాఁక లుడుప
జన్మమున వేయఁ దలపెట్టి యున్న దకట
యేమిసేయుదు నెటఁ జొత్తు నేది దిక్కు. 180

వ. అని పలుదెఱంగులం విలపించు తండ్రివలన రోహితుం డంతయు నెఱింగి వెఱంగుపడుచు నొండు వలుకక వరుణాదుల నిరాకరించి ప్రాణభయంబున ధనుర్బాణపాణియై సవనశాలనుండి వడివడినడ వెలువడి వనమార్గంబు వట్టిపోయె నాలోవరుణుండు విగతాశుండై హరిశ్చంద్రుం గని కడుంగ్రుద్ధు నలిగి నీవు జలోదరుండ వగు దని శపించి చనియె నటరోహితుం డం[illegible]బరిభ్రమించుచుఁ దండ్రి కగు శాపంబు విని తల్లడిల్లుచు నింద్రుని పంపున నింటికిం జనక తీర్థానంబు సేయుచు నొక్కనాఁడు. 181

తే. అట నట మెలంగు చొక్కచో నధ్వమునను
గుడువఁ గట్టలేమినిఁ బెద్దబడుగు వోలెఁ
జిక్కి సుతసతీసహితుఁడై క్షీణవృత్తిఁ
జనునజీగర్తుఁ డనుఁ నొక్కమునినిఁ గనియె. 182

చ. కని మునివర్య! యేమి యిటు కస్తి వసించెదు లేమిచేత నో
యనుఁడుఁ గుటుంబవంతుఁడ రవంత యుపాధియు లేద యేమి సే

తను క్షుధ వేగి చత్తు నని శోఁకెడు నిందు కుపాయ మెద్దియే
మనమున నీకుఁ దోఁచిన కుమార! యెఱుంగఁగఁ జెప్పి పోవవే. 183

వ. అనిన లోహితాస్యుండును వీరిలో నెవ్వనినే నొక్కని నమ్మి
యాహారమ్మునం దక్కవారు యథాసుఖంబుగం జీవింప వచ్చు ననుడు
నజీగర్తుండును. 184

క. ఇదె పుత్రత్రయ మిదె మ
త్సదతీతిలక మిదె నేనుఁ జూతె కుమారా!
పొదలెడునిందఱిలో నీ
మది కెక్కినవానిఁ గొను సమర్థుఁడ వేనిన్. 185

వ. అనుడు లోహితాస్యుం డమ్మునీశ్వరున కి ట్లనియె. 186

క. ఒగి మూఁడుకాళ్ళముదుక
ళ్ళగుమిమ్ముం గొన్న నేమి యగుఫల మీనీ
ముగురు సుతులలో నొక్కనిఁ
దగ నమ్మినఁ గొనఁ గలాఁడఁ దాపసవర్యా. 187

వ. అనుటయుం బెద్దవానిం దండ్రియును జిన్నవానిం దల్లియునుం బాయఁ
జాల మనిన నిరువురకుం గానిమధ్యముకుమారుండు రాకుమారుం
జూచి కుమారా! తల్లిదండ్రులకుం గొఱమాలిననే నిట నుండిన
నేమిప్రయోజనంబు వీరికిం గోరినమూల్యం బిచ్చి నన్నుఁ గొని
పొమ్ము నేను నీచెప్పినచొప్పున నడువం గలవాఁడ ననిన లోహి
తాస్యుం డజీగర్తుదిక్కు మొగంబై యి ట్లనియె. 188

చ. మునికులవార్ధిచంద్ర! యొకపూరుషు నప్పతి కేము వేల్వఁగా
మునుఁ దలపెట్టినార మది పుణ్యాసవంబు తదర్థమై భవ
త్తనయుని నమ్మినం గొనెదఁ దత్క్రయమూల్య మ దేమొ తెల్పవే
యనుడు నొకింతయేని హృదయంబునఁ గొంకక పాని నిర్దయన్. 189

గీ. రాజపుత్ర! గోవృషసహస్రత్రయంబు
నిష్కశతము మూల్య మొసంగి నిష్కలంకు

నస్మదాత్మజమధ్యము నధికు నితనిఁ
దీసికొనిపోయి యిచ్చుమైఁ జేసికొనుము. 190

తే. అనిన నతఁ డతం డడిగినయున్నియు నిడి
వడుగుఁ గొనిపోయి తనపోయి వచ్చినట్టి
సంగతుల నెల్లఁ దండ్రి కెఱుంగఁ దెలిపి
మనుజమేధ మొనర్చు మూమయము దోలఁగ 191

వ. అనిన సంతసింపక హరిశ్చంద్రుం డిట్లనియె. 192

శా. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజనముల్ రారాజు లెల్లప్పు ని
ర్జిహ్మత్వంబునఁ దోక చుట్లు గని రక్షింపంగ నౌ నాఁగ నీ
బ్రహ్మేంద్రాత్మజు నెట్లు చీల్చి వపునుం భక్షింపఁగాఁ జేసి నే
బ్రహ్మణ్యుండ నటంచు నిల్వఁ గలనో రాష్ట్రంబునం బుత్రకా. 193

చ. బలు వగురోగ మేగు నని బ్రాహ్మణపుత్రుని పీనిఁ గోసి ని
ప్పులఁ బడవేసి లోకములఁ బుట్టినరట్టును మూటఁగట్టి ని
ర్మల మగుకీర్తికాంతముఖమధ్యమున న్మసిఁ బ్రామి పాపుకోఁ
దలఁపను గాన నీతని యథాగతమౌ గతి నంపి పుచ్చుమా. 194

గీ. ఎఢఁద నీవును సందియ మేది మెలఁగు
కర్మ మెటులుండు నట్లు కాఁగలదు నాకు
ననుచుఁ విలపించునంతలో నభ్రవాణి
పరఁగ నిట్లనె సభ్యు లెల్లరును వినఁగ. 195

తే. పురుషవర్య! గంగానదీపరిసరమున
నీశునశ్శేపుఁ బశువుగాఁ జేసి మనుజ
మేధయాగ మొనర్చు మనేయ దీక్షఁ
బశువుఁ బట్టకము న్నది ఫలద మగును. 196

వ. అనిన హరిశ్చంద్రనరేంద్రుం డమందానందమకరందనిష్యందమాన
హృదయారవిందుండై యజ్ఞసంభారంబు లెల్ల సమకట్టి వసిష్ఠవిశ్వా
మిత్రాదిమునినికురుంబంబులతోఁ గతిపయప్రయాణంబుల గంగకుం

జని తత్తీరంబునఁ జంద్రమతీపురంధ్రిరత్నంబు ధర్మపత్నిగా నధ్వర దీక్షితుండై శాస్త్రోపదిష్టప్రమాణలక్షణనిపుణశిల్పాచార్యవర్యవినిర్మి తంబును వేదీమంటపకుండయూపరజ్వాదియజ్ఞోపకరణానేకసంభారసం భృతంబును స్వస్వనియుక్తక్రియారంభసంభ్రమపరిభ్రమద్ధోత్రధ్వ ర్యూద్గాత్రాదిబుత్విగ్బ్రహ్మణనివహాలంకృతంబును బుత్విక్ప్రయుక్త ప్రశ్నప్రతివచనోద్దిష్టఋగ్యజుస్సామాథర్వణాది దివ్యమంత్రారావసంకీ ర్ణంబును దర్శనాగతబ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదిభూప్రజాకలకల రవకలితంబును ప్రభూతధనధాన్యజలతృణకాష్ఠసంపూర్ణంబు నయిన యజ్ఞాయతనంబున నుపద్రష్టయై వసిష్ఠుండు విధిదృష్టవిధానంబునఁ గ్రియాకలాపంబులు నిర్వర్తింపుచుండఁ బశుతంత్రారంభం బగు టయు భయం బంది శునశ్శేపుండు బుత్విగ్వర్యుం డగువిశ్వామిత్రు నకుం దనవృత్తాంతం బంతయు విన్నవించి యాపత్సముద్రమగ్నుని నన్నుం గాంచి రక్షించు మని కాళ్లం బడిన నతం డతనిం గరుణా రసంబు వెల్లివిఱియ భయంబు లేదు లె మ్మనుచు లేవ నెత్తి ప్రాణ సంరక్షకంబు లగురెండుమంత్రంబు లుపదేశించి గంగాసలిలనిమగ్నాం గుండవై యీమంత్రరాజంబులు సహస్రవారంబులు గఁ బఠియించి ర మ్మనిన మునికుమారుం డట్లు జేసి వచ్చి దేవయజనాసీనుం డయి యుండె నట్టియెడ నధ్వర్యుండు యూపపశుసంస్కారంబు లొనరించి పశురశన నప్పాపని యూపంబునఁ గట్టి సమంత్రప్రోక్షణాదికంబు గావించుచుండునపుడు వైశ్వామిత్రమంత్రప్రభావంబున నింద్రాగ్ని వరుణాదిదేవనికరంబు లాడకు వేడుకమెయి విజయం చేసి హరిశ్చంద్రుం జూచి రాజేంద్రా! యింతతోడన భవద్విమలాధ్వరంబు పరిపూర్ణం బయ్యె నే మెల్లరమును బరితుష్టాంతరంగుల మైతిమి శునశ్శేపపశు విశసనంబునఁ బ్రయోజనంబు లే దుడిగి యవభృథం బొనరింపు మని పల్కుటయు నట సభాసదు లెల్లను నుల్లంబులు పల్లవింప నవ్వేలు పుల వేదమంత్రంబులం బ్రస్తుతించి యాగశేషం బొనరించి రట్టియవస

రంబున వరుణుండును సవనంబు పూర్ణం బయ్యె నిర్గతామయుండవై నిజపురంబునకు నిర్గమించి సుఖంబుండు మని రాజునకుం జెప్పి పురందరాదిబృందారకబృందంబులతోఁ బొందుపడ్డునకుం జనియె వసుంధరాపురందరుండు నమందానందకందళితాంతరంగుండై సపరివారంబుగాఁ బురప్రవేశంబు సేసి వసిష్ఠవిశ్వామిత్రశునశ్శేఫాదుల యథార్హంబుగఁ బూజించి వీడుకొలిపి వేడుకమెయిం బ్రవర్తించె నాహరిశ్చంద్రుని యనంతరంబ. 197

సీ. అతనిపుత్త్రుఁడు లోహితాస్యుఁడు రోహితుం
డతనికి హారితుండు సుతుఁ డతనికిఁ
జంపుండు తనయుఁ డాచంపునిచేత జం
పాపురి నిర్మింపం బడియెఁ జంపు
నకు సుదేవుండు వానికి విజయుఁడు పుట్టె
నతనికి భేరుకుం డాత్మజుండు
వానికి వృకుఁ డయ్యె వానికి బాహుకుం
డతఁడు గోల్పోయి రాజ్యము సభార్యుఁ
తే. డగుచు వని కేగి మరణించె నతనిసతియుఁ
జావ నున్నప్పు డౌర్వుఁ డక్కసంయమీంద్రుఁ
డరుగుదెంచి గుర్విణి వమ్మ నీవు
చావ రా దని వారించె దేవుఁ డగుచు. 198

క. ఆపె సపత్నులు దానికి
సైపక విష మన్నమందు సంధించి మదిన్
బాపంబు నాఁక పెట్టిరి
శ్రీపతికృప విషము మృతినిఁ జేయని దయ్యెన్. 199

వ. కొంతకాలంబునకు బాలుం డుదయించి గరముతోడం బుట్టినవాఁడు గావున సగరుండు నాఁ బేరంది భూమండలంబు నేకచ్ఛత్రాధికారంబుతోడం బాలించె. 200

తరువోజ. అతఁడు బర్బరశకయవనాదు లైన
యరుల నిర్జించి శౌర్యమ్మున మించె
శ్రుతిసమ్మతంబుగా స్తోమముల్ పెక్కు
సుర లెన్నఁగాఁ జేసి స్తోత్రార్హుఁ డయ్యె
సుతు లరువదివేలు చూపట్టి రల్ల
క్షోణీపతికి సర్వశుభము లెసంగ
సతతంబు బ్రాహ్మణసంఘముల్ వాని
సన్నుతించుచునుండ్రు సవనంబులందు. 201

ఉ. నూఱవవాజిమేధము ననూనగతిం బొనరించునప్పు డా
వారువముం హరించి సురవల్లభుఁ డుర్వికిఁ గ్రిందిలోకమం
దారయ రానియట్లు కపిలాంతికమందు నిలంగఁ జేసి యి
చ్ఛారతి నుండె నందునను జన్నము సాఁగని దయ్యె నయ్యెడన్. 202

తే. దానఁ దలఁకుచు సర్వభూదారుఁ డతఁడు
తనకు సుమతికిఁ బుట్టినసుతుల నర్వ
దు లగువేలను హరిఁ దేర వెలలఁ బుచ్చె
వసుధఁ గాలించి కానక వారువంబు. 203

వ. సాగరులు భూమిం ద్రవ్వి రసాతలంబునకుంజని యట నొకచోఁ దపంబు సేయుచున్నకపిలునిచెంత మఖాశ్వముం గాంచి వీఁడె గుఱ్ఱపు దొంగ యని తలంచి పట్టుఁడు కొట్టుఁ డని పైఁబడ నున్నంత నతండు కన్ను విచ్చి వారిం గాంచెదానంజేసివా రెల్లభస్మావశేషులయిరంతనక్కడ.

చ. సగరుఁడు వాజిమేధ మది సాఁగనిదౌటకుఁ జింత సేయుచున్
జగముల నశ్వమున్ వెదకఁ జాలినపుత్రులు! జాడ గాన కే
మగునొకొ కారణంబు తెలియంబడ దంచుఁ దలంచు చెంతయే
వగ దగులంగఁ జిత్తమున వందురు నట్టిఁడ యయ్యె నయ్యెడన్. 205

వ. తనరెండవభార్య యగుకేశినికిం బుట్టినయసమంజసుం డసమంజసుం డగుటఁ దనచేఁ బహిష్కృతుం డైనకతంబున నాతనివలనఁ బ్రయో

జనంబు గానం జాలక వానిపుత్రుం డగునంశుమంతుం బిలిచి కార్యం బెఱింగించిన నతండు తనతండ్రులు వోయినమార్గంబు పట్టి పోయి పాతాళలోకంబునం దపంబున్న కపిలునిసమీపంబున నవసప్తింగాంచి సమీపించి ప్రార్థించుటయుఁ గపిలుండు కన్ను విచ్చికుమారుఁ దిల కించి యి ట్లనియె. 206

శా. నీతండ్రుల్ కనుఁగానరట్టి రగుచుర్ నెమ్మేనులం బాయ నై
రోతాతా! గుణవంతుఁడీ విదె మఖాశ్వోత్తంస మిద్దాని నీ
వేతత్కాలమునందు గొంచుఁ జనుమా యీబూది ప్రోవుల్ భవ
త్తాతల్ గాలినభస్మరాసు లని చిత్తంబందు నూహింపుమా. 207

వ. ఇట్టి నీతండ్రులం బునీతులం జేయ గంగోదకంబు తక్క మఱి యొ క్కటి లే దని చెప్పిన నతం డతనికి నమస్కరించి తదనుజ్ఞాతుండై సవనాశ్వంబు దోడికొని పోయి తాత కిచ్చి నిచ్చిన నతండు సంత సించుచు నధ్వరంబు సమాప్తి గావించి యనంతర కాలంబున నతండు తనరాజ్యం బంశుమంతున కిడి తాను దపోవనంబున కరిగె నంత నంశుమంతుండును. 208

తే. గంగఁ గైకొనివచ్చి యక్కరణి నైన
తండ్రులఁ దరింపఁగాఁ జేయఁ దలఁచి తపము
సలిపెఁ గాని తదర్థము సఫలమగుట
కాదినే కాలధర్మము నంద నయ్యె. 209

తే. వానిసుతుఁడు దిలీపుఁడు పూని గంగఁ
దేర యత్నించె నది నెఱవేఱక మును
గాలధర్మము నొందుటఁ గాని దయ్యె
ధీసుఁ డాతనిసుతుఁడు భగీరథుండు. 210

శా. గంగం గూర్చి తపించెఁ బెక్కు లగుచుం గన్పట్టువర్షంబు లు
త్తుంగం బైనహిమాలయాచలమునం దాత్పర్య మేపాఱగా
గంగాదేవియు వానికట్టెదుట సాక్షాత్కారముం జేసి నా
కంగీకారమ నీదువెంటఁ జనుదే నట్టైన నాలింపుమా. 211

ఆ. నింగినుండి నేను నేలకు దిగునప్డు
నాదు వేగభర మనారతంబు
సైఁచువాఁడు లేడు శంకరుఁ డొక్కరుం
డుండె నతని వేఁడు టొప్పు నీకు. 212

వ. అనిన భగీరథుండు వేయివత్సరంబులు శివునిం గూర్చి తపించి పరమ తపంబు గావించి తదనుగ్రహంబు వడసి యతనిజటామార్గంబున గంగాదేవి నిలకుం దింపి తనవెంటం బెట్టుకొని పోయి పాతాళలోకంబున నున్న పితృభస్మరాసులపైఁ బాఱించి వారికిఁ బుణ్యగతు లొసంగె నిది గంగావతరణప్రకారంబా భగీరథునకు శ్రుతుఁడనుసుతుం డతనికి నాభావరుఁ డతనికి సింధుద్వీపుఁ డతని కయుతాయు వతనికి ఋతుపర్ణుం డతఁడే నలున కక్షవిద్యం జెప్పి యశ్వవిద్యం గ్రహించె నా ఋతుపర్ణునకు సర్వకాముఁ డాతనికి సుదాసుఁ డాతనికి మదయంతీపతి పుట్టె వానినే మిత్రసహుఁ డనియుఁ గల్మాషపాదుం డనియుం బిలుతురు సౌదాసుం డగుకల్మాషపాదుఁడే వసిష్ఠుని శాపంబున రాక్షసుండై సంతానరహితుం డయ్యె ననిన రాజు మహాత్ముం డగుసౌదాసునకు శాపమేల సంభవించెం జెప్పు మనిన శుకుం డి ట్లనియె. 213

—♦ సౌదాసుని శాపప్రకారము ♦—

శా. సౌదాసుం డొకనాఁడు వేట కటవీస్థానంబునుం బొంది నా
నాదిక్కుల్ దిరుగాడు చొక్కదనుజున్ ఖండించియు న్వానికిన్
సోదర్యుం డగునన్యునిన్ విడిచె రక్షోవల్లభుం డాతఁ డా
సౌదాసుం బగబట్టి వేఁచుటకు నిచ్చం జేసి తా నంతటన్. 214

ఉ. వంటలవానివేషమున వానిగృహంబున కేగి నిచ్చలున్
వంటక మాచరించుచుఁ బ్రవర్తిలుచుండ నొకానొకప్పు డా
వంటవలంతిసామిఁ గన వచ్చె వసిష్ఠుఁడు వానిఁ బున్నెపుం
బంట యటంచు నెంచుచును భక్తి భజించుచు రాజు వానికిన్. 215

వ. తనగృహంబున భోజనంబు వెట్టించుటయు నప్పుడు బానసీఁడై యుండు
క్రవ్యాదుండు మనుష్యమాంసంబు వండి పెట్టినం గని వసిష్ఠుండు
కోపఘూర్ణితనేత్రుండై సుదాసపుత్రుం గాంచి. 216

మ. నరమాంసం బిది నాకుఁ బెట్టితివి గానన్ నీవు దైత్యుండవై
పరివర్తింపు మటంచు శాప మొనరింపన్ రాజు నాతప్పు గా
దరయన్ వంటలవానితప్పనుచు సంప్రార్థింపఁ బండ్రెండు వ
త్సరముల్ శాపఫలంబు నొందు దని యాతం డేగె నిచ్ఛాగతిన్. 217

వ. సౌదాసుండును దన్ను నిష్కారణముగా శపించినవసిష్ఠునకు మాఱు
శాపంబు వెట్టం దలంచి కరతలంబున జలంబు గ్రహించి యున్నంత
నతనిసతి యగుమదయంతి వల దని వారించుటం జేసి యతం డాయుద్య
మంబు విరమించి నిజహస్తజలంబు భూమ్యాకాశంబుల నెట విడిచి
నను బ్రాణికోటి కసాయంబు వాటిల్లు నని వానిఁ దనపాదంబులపైఁ
బోసికొనియె నయ్యుదకసంస్పర్శనంబునఁ బదంబులు నల్లఁబడి కల్మా
షంబు నొందె దానం జేసి యతండు కల్మాషపాదుండు నాఁబడె నంత
నతండు రాక్షసుండై యరణ్యంబులం దిరుగుచు నొక్కచో నివసించి
యున్నమునిదంపతులు వానరరూపంబు లొంది క్రీడించుచుండం గాంచి
పరవంజి పట్టుకొని పురుషునిం దినం దలంచె నంతలో నామునిపత్ని
వానిం గని యి ట్లనియె. 218

శా. నీ విక్ష్వాకుకులోద్భవుండ వగుచు న్వెల్గొందుభూజానివై
సేవింపన్ మదయంతి కాంత యగుచున్ జెల్వొందు యోగ్యుండ వో
దేవా ! నీ విటు విప్రునిన్ న్మెసవ నుద్రేకించుటల్ పోలునే
నావాక్యంబుల నాదరించి విను మా న్యాయ్యంబు పాలింపుమా. 219

సీ. సంతానకాంక్షమై సంభోగ మొనరించు
చుంటిమి మముఁ జంప నొప్ప దిపుడు
చదివిన బ్రాహ్మణుఁ జంపుట కంటెను
బాప మొండొక్కఁడు పరఁగఁ బోదు

బ్రహ్మర్షి యీతండు రాజర్షి వీ విట్లు
చంపుట పిత పుత్రుఁ జంపి నట్లు
కాన విడుము వీనిఁ గాదంటివేని మున్
నను మ్రింగి మ్రింగు మీయనఘు వెనుక

తే. అని. మిగులఁ బట్టువఱచుచుండినను వినక
శాపహతుఁ డాతనిం బట్టి చంపి తినియె
నవల నాయమ కామార్త నైననన్ను
నిట్లుచేసితి కావున నీవు నోరి. 220

వ. స్త్రీసంభోగంబు గావించితేని మృతుండ వగు దని శపించి చితిం బేర్చి పతిశల్యంబులతో సహగమనంబు గావించి పతితోఁ బరంధామంబు నొందె సౌదాసుండు నట్లు పదిరెండేండ్లు గడచ నీది శాపవిముక్తుండై పురంబుఁ జేరి మదయంతితో నొకనాఁడు క్రీడింప నెంచిన నామె శాపం బెఱింగినదాన వాని వారించె నతండును బ్రాణభయంబునఁ బ్రాణేశ్వరీవాక్యంబు విశ్వసించి సంగమపరాఙ్ముఖుం డయ్యె దానం జేసి సంతానంబు లేనివాఁడై యతం డొక్కనాఁడు వసిష్ఠుం జేర నరగి తనభార్యకు సంతాన మిమ్మని ప్రార్థింప నతం డట్లకా యని వాని మనోరథంబు దీర్చె మదయంతియు గర్భము దాల్చి యేడువత్సరంబులు నీదుమోసి ప్రసవంబు గామిం జేసి ఱాతితో గడుపు మోదికొన నాగర్భంబునుండి యొకపుత్రుండు పుట్టె నశ్మఘాతంబునఁ బుట్టెఁ గావున నాతం డశ్మకుండు నాఁబడె నాయశ్మకునకు మూలకుం డను నొక కొడుకు పుట్టి పరశురామునిసంచారసమయంబున నాండ్రచే రక్షింపంబడి క్షత్రియవంశమూలభూతుండై మూలకుండు నాఁబడె మఱియు నారీమణులచే రక్షింపంబడుటం జేసి నారీకవచుం డని వ్యవహరింపం బడియె నానారీకవచునకు దశరథుండు వానికి నైలబిలుఁడు వానికి విశ్వసహుండు వానికి ఖట్వాంగుండును బుట్టిరి. 221

ఉ. ఆతఁడు చక్రవర్తి యయి యార్యులు మెచ్చఁగ నిచ్చ పెంపునన్
భూతల మేలి యొక్కపు డపూర్వవిధమ్మున దేవతార్థితుం

డై తనసేనతోఁ జని మహాప్రధనంబున దైత్యసంతతి
న్పాతము నొందఁ జేసె భువనప్రథితప్రతిభాప్రభావుఁడై. 222

ఆ. సురలు సంతసించి వరము వేఁడు మనంగ
నతఁడు తనదు నాయు వడిగి రెండు
గడియ లం చెఱింగి పుడమియు రాజ్యము
విడిచి సంగడములు వివిధములును. 223

వ. విరక్తుండై బ్రాహ్మణభక్తిం జేసి ధర్మమార్గ మనుష్ఠించి సర్వహృద యంబుల నంతరాత్మరూపముగా నున్న పరమేశ్వరు సర్వోత్తమవస్తువుగా భావించి విషయసుఖంబులం బరిత్యజించి భగవదారాధనంబు గావించుచుఁ గాయంబు విడిచి గుణాష్టకరూపం బగుస్వస్వరూపంబు నొందె నాఖట్వాంగునకు దీర్ఘబాహువు దీర్ఘబాహువునకు మహా కీర్తిమంతుం డగురఘుమహారాజు రఘుమహారాజున కజమహారా జజమహారాజునకు దశరథమహారాజు వానికిఁ గౌసల్య సుమిత్రి కైకేయి యనుముమ్వురు భార్య లందుఁ గౌసల్యకు శ్రీరాముఁడు కైకకు భరతుండు సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులుం బుట్టి రారాముని చరిత్రము వాల్మీక్యాదులు సంస్కృతంబున నభివర్ణించిరి మఱియు నాంధ్రాదిభాషలయందు భాస్కరరామాయణ శ్రీకృష్ణరామా యణాదులు పెక్కులు రామాయణములు కలవు నీవారామాయణ కథ ననేకవారంబులు వినియుంటి వైన నిప్పుడు మఱియుం జెప్పెద నాకర్ణింపుము. 224

—♦ శ్రీరామచరిత్రము ♦—

క. నలువురు కొడుకులు ముగ్గురు
మెలఁతలునుం దన్నుఁ గొలిచి మెలఁగుచు నుండన్
బలువైభవ మెసఁగ ధరా
తల మేలుచు దశరథుండు తనరుచునుండెన్. 225

సీ. అప్పుడు కౌశికుఁ డధ్వరావనార్థము వేఁడి

త్మ్యాపానుమతి సులక్షణుల రామ
లక్ష్మణులను గొని లలిఁ జను చధ్వమ
ధ్యమున మహావిద్య లన్నియుఁ గృప
నుపదేశమొనరించె నొగి రాముఁ డుటజోప
కంఠముఁ జని తాటకను వధించి
మఱి సుబాహుని ద్రుంచి మారీచుఁ దోలి ని
రంతరాయమ్ముగ యజ్ఞ మరసి

తే. సానుజుఁడు రాముఁ డంత నమ్మౌనివెంట
మిథిల కరుదెంచి సీతకై ప్రథిత మైన
యీశుచాపము వేగురు నెత్తరాని
దాని నవలీలఁ గొని సభలోన విఱిచె. 226

శా. రారాజుల్ వినుతించుచుండ శుభతూర్యంబుల్ సెలంగన్ విదే
హారాధ్యేశుఁడు కాళులం గడిగి కన్యాదానముం జేయఁ గా
శ్రీరాముండు పరిగ్రహించి శుభదృష్టిం బెండ్లియాడె న్వరా
కారోపేత మఖోర్విజాత సుగుణౌఘస్ఫీత సీతం దగన్. 227

వ. అంత సపరివారుండై రాముం డయోధ్యం జేరుటయును. 228

ఉ. రాముఁడు శౌర్యలబ్ధగుణరాముఁడు సువ్రతకాముఁడై ప్రజా
స్తోమసమంచితం బగువిశుద్ధచరిత్రము గల్గి తండ్రికిం
బ్రేమకుఁ దావలం బగుచుఁ బేర్మిని మించి కుమారశేఖరుం
డై మహిమోన్నతిం గనియె నయ్యెడ నెయ్యము తియ్య మేర్పడన్.

తే. వయసు మీఱినదశరథవసుమతీశుఁ
డాత్మజుని రామచంద్రుఁ బట్టాభిషిక్తుఁ
జేయ మది నెంచి మంత్రులచెలిమి వే వఁ
బురము గైసేసి సుముహూర్త మరయుచుండె. 230

సీ. అపుడు మంథర కైక కది యెల్లఁ దెలిపిన
నాయమ యటుకానియట్లు మగనిఁ

దనవరద్వయము నిమ్మని వేఁడి వనులకు
రామునిఁ బంపి భరతున కవని
నిడఁ జేసె రాముఁడు వడఁతితో లక్ష్మణు
తోడఁ బం(డెండేండ్లు తోడరి వనుల
నుండువాఁ డయి పోయి దండిరాక్షసులను
ఖండించి మునికోటిఁ గాచిపుచ్చె
తే. అంత రావణుతోడు కామార్త యగుచు
ముట్టరా దానిచెవులును ముక్కుఁ గోసె
దాన రావణు డలిగి క్రోధమునఁ జేసి
యర్థివేషమునన్ సీత నపహరించె. 231
వ. అప్పుడు సీతాదేవియు. 232
ఉ. హారఘురామ ! హా త్రిజగదంచితసువ్రతకామ ! హామహో
దారగుణాభిరామ ! యిదె దైత్యకులాధముఁ డొక్కఁడుండు నీ
దార నన్ గ్రహించుకొని దక్షిణమార్గము పట్టి పోయెడిన్
గారుణికత్వ మేర్పడఁ గఁ గ్రన్నన నన్ విడిపింప రాఁగదే. 233
సీ. వేల్పులారా ! నేలదాల్పులారా ! మీరు
నావెతల్ దెల్పరే నావిభునకు
సిద్ధులారా ! సుప్రసిద్ధులారా ! మీరు
నావెతల్ దెల్పరే నావిభునకు
యక్షులారా ! కార్యదక్షులారా ! మీరు
నావెతల్ దెల్పరే నావిభునకు
సాధ్యులారా ! పరాసాధ్యులారా ! మీరు
నావెతల్ దెల్పరే నావిభునకు
తే. తుషితులారా ! జగత్త్రియమ్రాషితులార !
విశ్వులారా ! సురక్షితవిశ్వులార !
వసువులారా ! మహాతపోవసువులార !
నావెతల్ మీరు దెల్పరే నావిభునకు. 234

సీ. అని యిట్టు లార్తులై యడలు గుడుచుచుండ
దారి జటాయువు తారసిల్లి
ఘోరయుద్ధము సేయఁ గ్రూరుఁ డాతనిఁ ద్రుంచి
కొనిపోయి లంకలో నునిచె సీత
రామలక్ష్మణులు సీతామహాలక్ష్మిని
గానక వనులెల్లఁ గలయఁ దిరిగి
గృధ్రరాజువలన నించుక విని వాని
కుత్తరక్రియ లెల్ల నొనరఁ జేసి
తే. వానరులమైత్రి వాలినిఁ జా నొనర్చి
రవిజునకు నిచ్చి వానరరాజ్య మవల
హనుమచే సీతజాడల నరసి వెనుకఁ
బ్లవగసేనాసమేతుఁడై వనధిఁ జేరి. 235
మత్త. దారి యిమ్మని వేడ వారిధి తన్నుఁ గా దను నట్లు గా
నూరకుండిన నల్గి రాఘవుఁ డుగ్రబాణము లేయఁ బో
భీరుఁడై చనుదెంచి కాళులఁ బెట్టి శీర్షము ప్రోవవే
యోరఘూద్వహ తప్పు సైచి సముద్ధరింపవె న న్నిటన్. 236
ఆ. నలుఁడు విశ్వకర్మనందనుం డతనిచే
సేతు బంధ మీవు చేసి దాని
నుండి లంకఁ జేరి గండుమీఱినరావ
ణాదిఖలులఁ జంపు మాహవమున. 237
చ. అనవుడు నట్లు చేసి మిహిరాన్వయభూషణుఁ డెల్లసేనతో
వననిధి దాఁటుచున్నతఱి వచ్చి విభీషణుఁ డార్తమూర్తియై
దనుజకులాధినాథునకుఁ దమ్ముఁడ నీదుమఱుంగుఁ జేరుకో
మన మొనరించి వచ్చితి రమారమణాంశభవా! రఘూద్వహా. 238
తరువోజ. అనినరాముఁడు వాని నంగీకరించి
యఖిలవానరులతో నట మున్న వాయు

తనయుని చే వహ్ని దరికొల్పఁబడిన
తత్పురంబునఁ జొచ్చి దైత్యవీరులను
ఘనుల ధూమ్రాక్షాదిఖలులఁ దున్మాడి
ఖడ్గరోమ నరాంతకప్రభృతులను
మొనసినయింద్రజి న్ముఖ్యుల నెల్ల
భూరిసైనికులతోఁ బుర మెల్లఁ గాల్చి. 239

సీ. రావణకుంభకర్ణప్రధానుల నెల్ల
రణనిహతులఁ జేసి రాఘవుండు
రావణానుజునకు రాజ్యపట్టము గట్టి
సీతామహాదేవిఁ బ్రీతిఁ దేర్చి
సకలవానరులతో సతిఁగూడ పుష్పక
దేవయానం బెక్కి దేశమునకు
మరలివచ్చుచు మార్గమధ్యమున విశేష
ములనెల్ల సీతకుఁ దెలుపుకొనుచు

తే. సరగ సాకేతపురమున కరుగుదెంచి
యెల్లవారల కానంద మెసకమెసంగ
భరతుఁ డర్పింప సామ్రాజ్యభరము నొందెఁ
దపసు లొసఁగినశుభముహూర్తంబునందు. 240

సీ. ఉభయపార్శ్వములం దుండి తమ్ములు భక్తి
భరితులై ఛత్రచామరము లిడఁగ
వామభాగమునందు వైభవం బెసలారఁ
గనుల నవ్వుచు సీత గరిమ మెఱయఁ
బ్లవగాసురేశ్వరుల్ పరివారయుక్తులై
ముద మొప్ప నిటు నటు మూఁగి కొలువఁ
బవమానసూనుఁడు భయభక్తియుక్తుఁడై
పాదపీఠముకడఁ బాదు కొనఁగఁ

తే. గడలఁ బౌరులు బందుగుల్ గనుచునుండ
రమణ మెఱయఁగ వివిధతూర్యములు మొరయ
వామదేవవసిష్ఠులు వలుక శ్రుతులు
రాముఁ డప్పుడు పట్టాభిరాముఁ డయ్యె. 241

వ. ఇట్లు పట్టాభిషిక్తుం డైనరామచంద్రుండు విభీషణసుగ్రీవాదిసుహృజ్జనంబులం దగినవిధంబునం దనిపి సత్కరించి వారివారిపొందుపట్లకుం బుచ్చి విభీషణునకు రంగనాథపుష్పకం బర్పించి గోమతీతీరంబున ననేకయాగంబులు గావించి నానావిధభోగంబు లనుభవించుచుఁ బెక్కేండ్లు రాజ్యపాలనంబు చేసె నారామరాజ్యంబున నాధివ్యాధులు క్షామడాంబరాదులు నామమాత్రావశిష్టంబు లయ్యె నది త్రేతాయుగం బైనను గృతయుగధర్మంబు ప్రవర్తించె వనులు నదులు పర్వతంబులు వర్షంబులు ద్వీపంబులు సముద్రంబులు ప్రజలు కోరినసమస్తవస్తుసముదాయం బొసంగుచుండె నపుడు వేరికిని ముసలితనంబు లేని దయ్యె నాఁకొన్నవాఁడును దప్పిగొన్నవాఁడును దుఃఖితుండును భీరుండును గష్టవంతుండును మచ్చునకయినఁ గానవచ్చుట లేదయ్యె మృత్యువు తనంతఁ దా వచ్చి వేనినిం గొనిపోవ నెంచకుండె నేకపత్నీవ్రతుం డగురాముండు రాగద్వేషాదులు లేక లోకకళ్యాణధర్మపరుండై పదివేలవర్షంబులు ప్రజాపాలనంబు గావించె నారామునకు సీతామహాదేవి యందుఁ గుశలవు లనునిద్దఱు కొమారులును లక్ష్మణునకు నంగదచంద్రకేతులును భరతునకుఁ దక్షపుష్కలులును శత్రుఘ్నునకు సుబాహు శ్రుతసేనులును బుత్రులు పుట్టిరి. భరతుండు దిగ్విజయంబు చేసి గంధర్వుల జయించి కోటానకోట్లధనంబు దెచ్చి రామున కిచ్చె శత్రుఘ్నుండును మధురాక్షసపుత్రుం డగులవణాసురుం జంపి మధువనంబున మధురాపురంబు నిర్మించె. 241

సీ. శ్రీరామచంద్రుఁడు సిరి గలసాకేత
పురము వైకుంఠాఖ్యపురము గాఁగ

సీతామహాదేవి శ్రీమహాలక్ష్మిగా
వెలుగొందుతా మహావిష్ణువు గను
నెల్లలోకులకును డెల్లమా నట్లు స
ల్పుచుఁ జిరకాలము పుడమి యెల్ల
సుపవిత్రముగఁ జేసి సురుచిరకీర్తినై
సర్వబంధుప్రజాసమితితోడ

తే. భక్తబృందముతోడను భ్రాతృసుతుల
తోడ సీతామహాదేవితోడఁ గూడి
దేవతాప్రార్థనంబునఁ దేజరిల్లి
పరమపదమందె నెంతయుఁ బ్రాభవమున. 242

క. ఇది శ్రీరామచరిత్రము
సదమల మతు లెవ్వరేని చదివిన వినినన్
ముదమున నెంచినవారికి
బొదలెడు వైభవము లెల్ల భూతలమందున్. 244

వ. శ్రీరామపుత్రుం డైనకుశున కతిథి యతిథికి నిషధుఁడు నిషధునకు నభుఁడు నభునకుఁ బుండరీకుండు పుండరీకునకు క్షేమధన్వుఁడు క్షేమధన్వునకు దేవానీకుఁడు దేవానీకునకు నహీనుఁ డహీనునకుఁ బారియాత్రుఁడు పారియాత్రునకు బలుండు బలునకుఁ జలుండు చలునకు వజ్రనాభుఁ డావజ్రనాభుఁడు సూర్యాంశమువలన నుద్భవించె వానికి శంఖణుండు వానికి విధృతి వానికి హిరణ్యనాభుఁ డతండు యోగాచార్యుం డైనజైమిని కంతేవాసియగు యాజ్ఞవల్క్యునికడ యోగశాస్త్రం బభ్యసించి ఘనుఁడయ్యె నాహిరణ్యనాభునకుఁ బుష్యుఁ డాతనికి ధ్రువసంధి యతనికి సుదర్శనుం డతని కగ్నివర్ణుఁ డతనికి శీఘ్రుం డతనికి మరుత్తును జనించిరి. 245

తే. ఆమరుత్తు కలాపక మనెడుగ్రామ
మాశ్రయించి యోగముచే నిత్తి నడఁచి నైచి

కలియుగాంతమున నశింపఁ గలుగుసూర్య
వంశము సముద్ధరించెడు వాఁడ యగుచు. 246

వ. ఆమరుత్తునకుఁ బ్రసుశ్రుతుండు వానికి సంధి వానికి మర్షణుండు వానికి సుమహత్తు వానికి విశ్వసాహ్వుఁడు వానికి బృహద్బలుం డతండే నీ జనకుం డగు నభిమన్యుచే హతుం డయ్యె. 247

క. ఈ రిక్ష్వాకుకులంబున
నై రహిఁ దనరారి పోయినట్టిగు మఱియుక్
ధారుణిఁ జనియింపం గల
వారిని వివరింతు వినుము వసుధాధీశా. 248

సీ. ఆబృహద్బలునకు నగుబృహ్రద్రణుండు వా
నికి నురుక్షతుండు వానికి సుతుండు
తనరువత్సప్రీతుఁ డనువాఁడు వానికి
నయ్యెఁ బ్రతివ్యోముఁ డనుతనయుండు
వానికి భానుండు వానికి దేవాంకు
డతఁడె వాహినిపతి యనఁ దలిర్చు
వానికిఁ సహదేవుఁ డాన రేంద్రునకును
బృహదశ్వుఁ డనుసుతుం డెసక మెసఁగు

తే. వానికిఁ భానుమంతుఁడు వఱలు వాని
కలరుఁ బ్రతీకాశ్వుఁ డన నతనికి
సుప్రతీకుఁడు వానికి సుతుఁ డగు మరు
దేవుఁ డతఁడు సురక్షత్రుఁ దివిరి కాంచు. 249

వ. సురక్షత్రునకు ఋక్షకుండు ఋక్షకునకు నంతరిక్షకుఁ డంతరిక్షకునకు సుతపుఁడు సుతపునకు నమిత్రజిత్తమిత్రజిత్తునకు బృహద్వాజుఁడు బృహద్వాజునకు బర్హి బర్హికి ధనంజయుండు ధనంజయునకు రణంజయుండు రణంజయునకు సృంజయుఁడు సృంజయునకు శౌక్యుఁడు శౌక్యునకు శుద్ధోదుఁడు శుద్ధోదునకు లాంగలుండు లాంగునకుఁ

ప్రసేనజిత్తు ప్రసేనజిత్తునకు క్షుద్రకుండు క్షుద్రకునకుఁ గుణకుఁడు కుణకునకు సురథుఁడు సురథునకు సుమిత్రుఁడు సుమిత్రుఁడే యీ వంశంబునకుం గడపటివాఁ డగు నీ రందఱు బృహద్బలునివంశంబున నన్వాల జనించువా రిక్ష్వాకువంశము కలియుగంబున సుమిత్రునివఱకు వచ్చి వానితో నంతరించు నింక నిమివంశంబు వివరింతు నాకర్ణింపుము.

— ఇక్ష్వాకు సుతుండైన నిమి చరిత్రము —

మ. ఘనుఁ డిక్ష్వాకుకుమారుఁ డైననిమి యాగంబుం బొనర్పంగ నె
మ్మనమందుం దలపోసి యొజ్జ కెఱిఁగింపన్ ఋత్విగర్థంబు నేఁ
జను దేఁ జెప్పితిఁ బాకశాసనున కైక్ష్వాకా! తదీయాధ్వరం
బొనరం జేసి సమీఁద నీదయిన యుద్యోగంబు చెల్లించెదన్. 251

వ. అంత దనుక వేఁచి యుండు మని గురువసిష్ఠుం డింద్రుని యాగంబుఁ జేయింప నేగె నిమియు జీవితంబు చంచలంబు తలంచినపనికంతరాయంబు గలుగకుండ నెఱవేర్పవలయు నని నిశ్చయించి వసిష్ఠాగమనంబు ప్రతీక్షింపక యితరఋత్విజుల నాహ్వానించి సత్రయాగంబు చేయ నారంభించె నంతలో వసిష్ఠుం డింద్రయాగము నిర్వర్తించి వచ్చి శిష్యునివ్యతిక్రమం బెఱింగి క్రోధఘూర్ణితనేత్రయుగళుండై. 252

ఉ. పండితమాని వీ వెడఁదఁ బాడిఁ దలంపక ఋత్విజు న్ననున్
బెండుగఁ జేసి రోసి యిటు వీసరవోవనిమోహమూర్తివై
యొండులచేత సత్రము నహో యనఁ జేయుచు నుంటె విట్టినీ
వుండిన లాభ ముండ దిఁక నుండవు పొమ్మని తిట్టెఁ దిట్టినన్. 253

ఆ. నిమి వసిష్ఠు నరసి నీవు ధనాశమై
ధర్మ మరయనట్టిదారి పట్టి
నిరపరాధి నన్నుఁ దెఱలఁ దిట్టితి కాన
మేను విడువు మీవు నేను బోలె. 254

వ. అని ప్రతిశాపంబు వెట్టి మేను విడిచె వసిష్ఠుండును నిమిశాపంబున మేను విడిచి యూర్వశీదర్శనమోహితు లైనమిత్రావరుణులకుం

గుమారుండై పుట్టె నిట మృతుం డైననిమి దేహంబు బుత్త్విజులు పరిమళద్రవ్యంబులం దుంచి కాపాడుచు సత్రయాగంబు సాగించుచు నాలో వచ్చిన దేవతలం గాంచి నిమిని బ్రదికింపుం డని కోర వారు ప్రాణప్రతిష్ఠం జేయుచుండ వచ్చి నిమి తన దేహంబునం జొరక వారి కి ట్లనియె. 255

ఉత్సాహ. ఓమహాత్ములార! నాకు నొడలిఁ గోడి సంగమం
బేమిలాభ మొసఁగు దుఃఖహేతువే కదయ్యా నే
నీమెయిన్ విదేహమునన యీశ్వరుల్ భజించుచున్
నామనోరథంబు దీర నడవ నుంటి నిం కిటన్. 256

వ. అన విని దేవతలు నీమాటలు సత్యంబులు దేహధారుల కెప్పటికి కప్పుడు జలచరంబులకు వోలె మృత్యు వాసన్నం బైయుండు నీమాట కాదన మ ట్లయిన నీవు ప్రాణికోటులనేత్రంబుల నిమేషోన్మేషంబులఁ జూడఁ బడుచు స్వేచ్ఛాసంచారము గావించుచుండు వని పలికి యంపి పుచ్చి రప్పుడు మునీశ్వరులు. 257

ఉ. దేశ మరాజకం బయిన దిన్వసనంబులు దేహధర్మముల్
లేశము గాని సాఁగ విల లేవడి వేఁగఁగ నై ప్రజాళికిన్
నాశము సంభవించు నని న్యాయపథంబు సమాశ్రయించి సం
దేశము చేసి కొంచు నిమిదేహము దెచ్చిరి మంత్రసంగతిన్. 258

తే. దాన జనియించెఁ బుత్రుఁ డాతం డనన్య
సాధ్యజననంబు నొందుట జనకుఁ డనియు
దేహిరహిత దేహజుఁడై విదేహుఁ డనియు
మథనమున మిథిలుఁడనియు బ్రథితుఁ డయ్యె. 259

వ. ఆమిథిలుండు తనపేర మిథిలాపురంబు నిర్మించె వాని కుదావసు వుద యించె వానికి నందివర్ధనుఁడు నందనుం డయ్యె వానికి సుకేతుండు గలిగె సుకేతునకు దేవరాతుం డుదయించె వానికి. బృహద్రథుండు జన్మించె వానికి మహావీరుండు పుట్టె వానికి సుధృతి యొడమె

వానికి ధృష్టకేతువు వానికి హర్యశ్వుఁడు వానికి మరుఁడు వానికిఁ బ్రతిబంధకుండు వానికిఁ గృతరథుఁడు వానికి దేవమీఢుఁడు వానికి విధృతి వానికి మహాధృతి వానికిఁ గృతరాతుఁడు వానికి మహారోముడు వానికి స్వర్ణరోముఁడు వానికి హ్రస్వరోముఁడు నుదయించిరి. 260

మత్త. హ్రస్వరోముఁడు యజ్ఞభూమిని హాళి దున్నుచునుండఁ గా
భాస్వదగ్రహలాగ్రమం దలపద్మ సీత యనంగ నే
లాస్వదించుచు సంభవించె నహో యనన్ జగ మెల్ల నా
సుస్వభావను రామచంద్రుఁడు శోభనాంగిగఁ గైకొనెన్. 261

వ. ఆస్వర్ణరోమునకు జనకుం డనియు సీరధ్వజుం డనియు నామంబు లయ్యె నాసీరధ్వజునకుఁ గుశధ్వజుండు వానికి ధర్మధ్వజుండు వానికిఁ గృతధ్వజుండు మితధ్వజుండు ననునిద్దరు కుమారు లందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుండు మితధ్వజునకు ఖాండిక్యుండు నుద్భవించిరి. కేశిధ్వజుండు బ్రహ్మవిద్యానిపుణుండు ఖాండిక్యుఁడు కర్మయోగవిజ్ఞుండతండు కేశిధ్వజునిభయంబున నిల్లు విడిచి పాఱిపోయె నాకేశిధ్వజునకు భానుమంతుండు వానికి శతద్యుమ్నుండు వానికి శుచి వానికి సనద్వాజుఁడు వాని కూర్ధ్వకేతుఁడు వాని కజుఁడు వానికిఁ బురుజిత్తు వాని కరిష్టనేమి వానికి శ్రుతాయువు వానికిఁ బార్శ్వకుఁడు వానికిఁ జిత్రరథుఁడు వానికి క్షేమాద్రి వానికి హేమరథుడు వానికిఁ గృత్యరథుఁడు వాని కుపగురువు వాని కగ్న్యంశ సంభూతుఁ డగునుపగుప్తుఁడు వానికి విసనుండు వానికి సువర్చనుండు వానికి సుభాషణుఁడు వానికి శ్రుతుఁడు వానికి జయుఁడు వానికి విజయుండు వానికి ధృతుఁడు వానికి శునకుఁడు వానికి వీతిహవ్యుఁడు వానికి ధృతి వానికి విపులాశ్వుఁడు వానికిఁ గృతి వానికి మహావశియు నుద్భవించిరి వీ రందఱు మిథిలునిసంతతి యని తెలియంబడు వారు నాత్మవిద్యయం దాఱితేరినవారు గృహస్థులై యుండియు సుఖదుఃఖాదులం

బొందక జ్ఞానులై ముక్తిం గాంచి రింకఁ బురూరవాదులకు జనకం
బయినచంద్రవంశముం జెప్పెద నవధరింపుము. 262

—♦ చంద్రవంశావతారము ♦—

సీ. అనిరుద్ధరూపుఁ డౌహరి జలంబులయందు
శయనించి యున్నతత్సమయమందు
నతనినాభీపద్మమందుఁ జతుర్ముఖుఁ
డభ్యుదితుం డయ్యె నతని కత్రి
నలువొందె నతనియానందబాష్పములను
జాబిల్లి పొడమె నాజననగరిమ
నమృతమయుం డయ్యె నతఁడు బ్రాహ్మణులకుఁ
గలువలకును నోషధులకు విభుత

తే. క్రాలఁ ద్రిభువనముల గెల్చి రాజసూయ
యాగ మొనరించె గురుభార్య నపహరించె
దేవదానవులకు దానఁ దెగనియుద్ధ
మమరె దైత్యులు చంద్రపక్షమున నైరి. 263

వ. అప్పుడు భూతగణంబులతో భూతేశుండును దేవగణంబులతో దేవే
ద్రుండును బృహస్పతికి బాసటయై రిట్లిరువాగునకు నుదారమై ఘోర
సంగ్రామంబు ప్రవర్తిల్లె నక్కాలంబున సురాచార్యునిజనకుం డగు
నంగిరసుండు ప్రార్థింప బ్రహ్మదేవుండు వచ్చి చంద్రునిం గాదని
నిందించిన నతండు బ్రహ్మకు భయంపడి నీరు మోసినతారం దెచ్చి
గీష్పతి కర్పించె నంతఁ గొంతకాలంబునకుఁ దార చంద్రప్రతిమానుం
డగుసుతునిం గనియె వానిం గని బృహస్పతి తనతనయుం డనియు నట్లే
చంద్రుఁడు తనతనయుం డనియు వారిలో వారు వాదులాడం జొచ్చి
రప్పుడు దేవతలు మునులును దారవలన వానిఁ జంద్రుని వాఁ డని
నిశ్చయించి చంద్రున కిప్పించి చని రాతారాసుతుండు బుధుండు
నాఁ బేరువడసి కారణాంతరంబున స్త్రీరూపము దాల్చినసుద్యుమ్నుని

యందుఁ బురూరవుం గాంచె నాతఁ డూర్వశిం జేపట్టి యాయువు లోనగుసూనులం బడసె నావృత్తాంతము చెప్పెద నాలకింపు మని మఱియును. 264

—♦ పురూరవుని చరిత్రము ♦—

మ. దివిషల్లోకముఁ జేరి నారదుఁ డటన్ దేవేంద్రుఁ డెన్నం బురూ
రవు సౌందర్యము సద్గుణంబులును శౌర్యంబు న్మహాధైర్యమున్
వివరింపన్ విని యూర్వశీరమణి యావిన్నాణినిం బొంద ను
త్సవముం జేసె మనంబునం దపుడు కందర్పజ్వరాన్వీతయై. 265

తే. తనకు మిత్రావరుణశాపమున మనుష్య
భావ మొందినదై ధరిత్రీవలయముఁ
జేరి నవమన్మథుని వలె సొరుమీఱి
యొసక మెసఁగుపురూరవు నెదుటఁ జూచె. 266

పంచ. పురూరవుండు దానిఁ జూచి పొంగి మే నెసంగఁగాఁ
గరంబు కన్నుఁదామరల్ వికాస మొందఁ బుల్కలున్
శరీరమందుఁ దేర దానిచక్కిఁ కేగి సుందరీ !
సురాళిమందు నుండి నీవు క్ష్మోణిఁ జేర నైతినో. 267

వ. నీరాక మాకు రాక నీకు నే లగుం గాక కూరుచుండుము. నేను నీదాసుండను నీకుఁ గావలసినకార్యంబులం దీర్చువాఁడ నాతో సఖ్యంబు గావింపుము. మన మిందు నందనాదుల నానందంబుగఁ గాలంబు పుత్త మనిన నయ్యూర్వశి వానిం జూచి యి ట్లనియె. 268

మ. అవురా ! నీదుమనోహరాంగకము లేయజ్జాక్షికందో యికిన్
దవులన్ గామశరాహతిం బడక యేదారిం బ్రవర్తిల్లఁగా
నవు నీవక్షము నొందఁ గల్గినది మోహావేశయుక్తాత్మయై
నవయం బోవక యుండు నిన్ గలియ నే వాంఛించియే వచ్చితిన్.

క. నే నీనేమ్మములను నెం
తో నెనరునఁ బెంచుచుంటిఁ దోడ్పాటువడం
గా నీవు వీనిఁ బ్రోవం
గా నుండినయంతదనుకఁ గలయిక మనకున్. 270

ఆ. ఏను ఘృతము దక్క నింకొక్క దాని నా
హారముగ గ్రహింప నర్హమిల్లు
నవుడు గాక మఱియు నెపుడైన దిసమొల
నుంటివేని నిన్ను నంట కుందు.. 271

వ. ఈనాసమయంబులకు సమ్మతించితివేని నీయభిలాషమ్ము నెఱవేర్తు
ననినఁ బురూరవుండు దాని కొడంబడి పద్మగంధబంధురం బగు నామె
దేహంబు నంటి దానితో చైత్రరథాద్యుద్యానంబుల విహరించుచుఁ
బవలు నాఁక రేయి నాఁక యామెతోడం గ్రీడించుచు వర్షంబులై
పెక్కుహాయనంబు లానందించె నంతలో సురలోకంబున. 272

మ. అమరేంద్రుం డొకనాఁటి యోలగమునం దయ్యూర్వశిం జూడక య్యా
మరీరత్నము కాన రాదెటకు నే మర్థించి తా నేగనో
సముదాయించుచు దానిఁ దెచ్చుటకు నిచ్చం జూపి గంధర్వులన్
బ్రిముదం బేర్పడఁ జెప్పి పుచ్చె సకలప్రాంతంబులున్ రోయఁగన్.

వ. వారెల్ల కడ లరయుచు నటకు వచ్చి మధ్యరాత్రింబునం గటికచీఁక
టిలో నల్లనం బోయి రాజరక్షితంబులై యున్న మేషంబుల హరించి
రవ్వుడా మేకలయఱపులను విని మేలుకొని యూరాయూర్వశి యగు
నయ్యచ్చర చెచ్చెఱ లేచి. 274

శా. హాహా చచ్చితిఁ జచ్చిన ట్లిచట దేహజ్ఞానమున్ లేక ని
ద్రాసక్త మ్మది గప్పఁ బండితివె నీ వా వీరమాన్యుండ వో
ద్రోహీ! బిడ్డలవంటి మేషముల నీదోశ్శక్తి నిన్ నమ్మి నే
మోహావేశత జ్ఞానహీన నగుచుం బోఁ గొట్టుకొంటిం గటా. 275

తే. బాహుపాశములన్ నామవర్ష్మ మిట్లు
పెనచి కట్టితి విదుము పొమ్మనుచుఁ ద్రోయ
నతఁడు మేల్కని ఖడ్గము నంది వడిగ
నొడలి వస్త్ర మెఱుంగక వెడలి చనియె. 276

వ. గంధర్వులును బురూరవుని రాకం దెలిసి తమకార్యంబు ఫలించు నని
మేషంబులన్ విడిచి పాఱిరి రాజు వానిం దెచ్చుచుండఁగా దిగంబరుం

డగుటం దెలిసి సమయభంగం బగుటంజేసి వానికిం గానరాక కదలి పోయెఁ బురూరవుండును దల్పంబున నూర్వశిం గానం జాలక వెఱ్ఱి యెత్తినవానిచందంబునం బరిభ్రమించుచుఁ గురుక్షేత్రంబు నందలి సరస్వతీతీరంబునఁ బంచాప్సరసలతోడం గ్రీడించునూర్వశిం జూచి ప్రబదికి నట్టై యిట్లనియె. 277

చ. నిలు నిలు నేఁ బురూరవుఁడ నీరజలోచన నీకుఁ గా నిటుల్
పొలములు నరణ్యముల్ గిరులు పుంతలు గంతలు ద్రోసి క్రొంచు ని
ట్టులు తిరుగాడుచుంటిని గడుంగడు వేసట నైతి నక్కటా
నిలుపుము నాపయిం గరుణ నీదుననుగ్రహ మాసచేసితిన్. 278

తే. నన్నుఁ గరుణింపకుంటివే నన్ను దాంగి
యింతలోపలఁ బ్రాణము లింద విడుతు
నాశరీరము తోడేళ్ళు నక్కలుఁ దినఁ
జూడఁ గల వీవు నీకంటితోడ నిపుడ. 279

వ. అని దీనాతిదీనంబుగాఁ బలుకుచున్న వానింగాంచి యూర్వశియిట్లనియె.

తే. ప్రతిన వ్యర్థసేయ కీవు ధీరత్వమునను
నిలుము మరణింపఁ బోకుము నీవు నేను
నక్కలును గుక్కలుం దిన నాయ మగునె
వినుము స్త్రీసఖ్య మది దిరం బని తలఁతునె. 281

ఉ. స్త్రీహృదయంబు క్రూర మని చెప్పుదు వారిస్వభావ మెప్పుడున్
ద్రోహమునంద యుండెడిని దోయరుహాక్షుల కెంతయేనియున్
మోహము కాని వారిమది మోజుక మక్కటికంబు వారికే
దేహమునందు నుండ దని తెల్పుచునుంటి మహీమహేశ్వరా. 282

తే. మఱియు విను స్త్రీలు విశ్వాస మరయఁ బోరు
స్వల్పకార్యమునకు వారు భర్త నైన
భ్రాత నైనను జంపుదు రాతతాయి
నులని నమ్మ మవ్వారిసంకెలలఁ బడక. 283

తే. అందులో నేము జారిణు లైనవార
మెవనిపై నెప్డు ప్రేముడి యవ్వనో వాసి
వలచి వలపించి వారితోఁ గలియుచుందు
మేటికీ పాటిదాని కీయిడుమ లకట 284

వ. అయినం జెప్పుచుంటి నీ విప్పటి కొక్క సంవత్సరం బయిన పదంపడి విచ్చేయుము నాతో నొక్క రాత్రి వర్తింపఁ గల వప్పుడు నీకు మఱికొందఱు పుత్రులు పుట్టఁ గలరు పొమ్ము రమ్మనిన నమ్మను జేశ్వరుఁ డది యప్పుడు గర్భవతి యని యెఱింగి నిజపురంబునకు నిర్గమించె నంత సంవత్సరాంతమునఁ గంధర్వులతోడఁ గూడఁ దనయింటికి వచ్చిన యూర్వశి నాతండు చూచి యానందించి దానితో నా రాత్రి క్రీడించె నిశాంతమునఁ దనవిరహము సహింపనివానిం దిలకించి యుచ్చరమచ్చెకంటి యిట్లనియె నో రాజా! నీ వీ గంధర్వులం బ్రార్థింపుము వారు నీకు నన్నొసంగెద రనిన నతం డట్లు కావించిన నంత గంధర్వులు సంతుష్టులై వాని కొక్క యగ్నిస్థాలి నిచ్చి రతండు దాని నూర్వశి గా భావించుచు వనంబున విహరించుచు స్థాలి నటం బెట్టి గృహంబునకుం జని రాత్రి దానిం దలంచుచుండె నంత నతని మనంబున వేదంబు యజ్ఞంబును గోచరింప మఱునాఁడు స్థాలిం బెట్టిన చోటికిం జని యట శమీగర్భం బైన యశ్వత్థంబునుండి యరణిద్వయంబు సేకరించి యూర్వశీలోకముం గోరుచు నధరారణి నూర్వశిఁగా నుత్తరారణిం దన్నుఁ గా నెన్నుకొనుచు వానినడుమ నుత్పన్నుం బగునగ్ని పుత్రుఁ డని మథింప నందు విభావసుండను జాతవేదసుండు సంభవించె. 285

క. వానిం ద్రేతాగ్నులుగా
మానసమున నెంచి రాజు మఘ మొ డచటన్
మానిలయుఁ గూర్చి చేసెన్
దా నూర్వశి నొందునట్టి తాత్పర్యమునన్. 286

వ. ఆపురూరవునకు నూర్వశియందు నాయువు శ్రుతాయువు సత్యాయువు
రయుఁడు విజయుఁడు జయుఁడు ననునార్వురు కొమారులు పుట్టి
రందు శ్రుతాయువునకు వసుమంతుఁడు సత్యాయువునకు శ్రుతం
జయుండు రయునకు నేకుఁడు జయునకు నమితుఁడు విజయునకు
భీముండు నుద్భవించి రాభీమునకుఁ గాంచనుఁ డతనికి హోత్రకుఁ
డతనికి జహ్నువు పుట్టె నీతఁడు గంగానదిం బుక్కిటం బట్టి
విడుచుటం జేసి గంగ జాహ్నవి నాఁబడె నాజహ్నుఁడు పూరునిం
గనియెఁ బూరుండు బాలకునిం గనియె బాలకుఁ డజకునిం గనియె
నజకుఁడు కుశునిం గనియెఁ గుశుఁడు గుశాంబుండు ధూర్తయుఁడు
వసువు కుశనాభుఁడు ననునల్వురం గనియె నందుఁ గుశాంబునకు గాధి
వానికి సత్యవతియనుకూఁతు రుదయించె దానిం దన కీయవలయు
నని భృగువంశజాతుం డగుఋచీకుం డను బ్రాహ్మణుం డడుగఁ
దనకన్య కాతఁడుతగఁ డని గాధి వానికి ట్లనియె. 287

చ. ఒకచెవి మాత్రమే నలుపు నొందియుఁ దక్కిన దేహ మంతయుం
సుకలునికీర్తి నా ధవళశోభ వహించియు నుత్తమంబులై
ప్రకటితమైనసుళ్ళు గలవార్వము లొక్కసహస్ర మీవు క
న్యకకును శుల్కమిచ్చినఁ బ్రియంబున నిచ్చెద విప్రవంశజా. 288

వ. అనిన రుచీకుండు వానియభిప్రాయం బెఱింగి తఱుగనికోరికిం జేసి
వరుణునిపాలికిం జని వాని నర్థించి చెప్పినచొప్పున గుఱ్ఱంబులం దెచ్చి
గాధి కొసంగి సత్యవతిం బెండ్లియాడె ననంతరంబ. 289

తరువోజ. తనభార్యయును నత్త తనయులు గల్గు
దారి చెప్పవె యనఁ దగు చరువులన్
బొనరించె రెండవి భూదేవతలకు
భూపతులకు వేఱ భూరిమంత్రములఁ
జను వానిఁ దనయయు జననియు మార్చి
సాపడి రందున క్షాత్రము బ్రాహ్మ్య

మును గడు వ్యత్యస్తమును బొందె దానఁ
బుట్టిరి శ్రుతులకుఁ బోలినరీతి. 290

సీ. తనతప్పు మన్నింపు మని సత్యవతి రుచీ
కుని వేఁడ నాతఁ డో యనుచు నామె
మనుమఁడు క్షాత్రధర్మమున నౌ నని కృపఁ
జేసె నందున శాంతచిత్తుఁ డగుచు
జమదగ్ని యనునేటి జనియించె గాధిప
త్నికి బ్రాహ్మ్యధర్మము నెగడునట్లు
లావిర్భవించె విశ్వామిత్రుఁ డనియెడు
పుత్రుఁడు జమదగ్ని పొలుపుమిగిలి

తే. రేణుకం బెండ్లియాడె నా రేణుకకును
వసుమనుఁడు లోనిపుత్రకు లెసఁగి రందుఁ
బరశురాముఁడు కడపటివాఁడు క్షత్రి
ధర్మమునఁ జేసి జనియించె ధాత్రియందు. 291

వ. రుచీకపత్ని యగుసత్యవతి కౌశికి యన నదియై లోకపావని యయ్యె.

— పరశురాముని చరిత్రము —

తరళ. పరశురాముఁడు హైహయాదులఁ బట్టి నెట్టనఁ గూల్చి తా
నిరువదొక్కఁడు మాఱు లుర్విపయిం జలంగెడురాజులన్
దురములందు వధించె గొడ్డలితో భుజాబల మేర్పడన్
హరివరాంశము గల్గినట్టిఁడ యై మహామహిమంబునన్. 293

వ. అనిన దేవరాతి బ్రహ్మరాతిం గాంచి పరశురాముం డేమికారణంబునం
జేసి రాజుల నెల్ల సంహరించెం జెప్పు మనిన శుకుం డిట్లనియె.

సీ. కలఁడు హైహయవంశకలితుండు కార్తవీ
ర్యార్జునుం డనునృపుఁ డల్లనాఁడు
ఘనుని దత్తాత్రేయముని నాశ్రయించి మఱి
బాహుసహస్రముఁ బడయఁ గలిగి
యహితదుస్సహవిక్రమాఢ్యుఁడై ధర యేలు
చతఁ డొకనాఁడు భార్యాసమేతుఁ

డయి నర్మదానదియందు జలక్రీడ
సలుపుచు భుజసహస్రమున వఱ్ఱు
తే. వాఱకుండగ బంధించె వారి పొంగి
తీరమున నున్న రావణవీరుశిబిర
మెల్ల ముంప నతండు సహింప కద్ది
కార్తవీర్యుఁ డొనర్చినకర్జ మనుచు. 295

తెలిసి సరభసంబున జలకేలిదేలునర్జునుపాలికిం జనిన నతండు వానిఁ
బట్టిబంధించి కారాగారంబునం బెట్టి గర్వం బుడిగినపదంపడి విడిచిపెట్టె
ననంతరంబ. 296

కార్తవీర్యుం డొకకాలంబునఁ మృగ
యావిహారము సేయ నరిగి యందు
జమదగ్ని యాశ్రమస్థలికి రాఁగ నతండు
సపరివారముగ నాక్ష్మాపతికి స
ముచితమర్యాదల నొనరింపఁ గామగ
విం దెచ్చి వారల కందఱకును
నతిథి సత్కారము లాచరించెం గాంచి
యర్జునుం డతవిసామర్థ్యమునకు
సైపఁ జాలక ధేనువు నోపి కట్టి
తేర భటుల కాజ్ఞాపించె వారు శౌర్య
మడర దీనదీనంబుగా నఱచుధేను
వును సవత్సముగాఁ బట్టి పొగ రెసంగ. 297

మాహిష్మతికిం గొనిపోయి రంతఁ గొంతసేపటికి పరశురాముండు
వనినుండి వచ్చి. 298

రాజదౌర్జన్య మంతయు రాముఁ డెఱిఁగి
దండతాడితభుజగంబు దారి రోషి
చును ధనుర్బాణతూణీరశోభితుఁ డయి
గండ్రగొడ్డలి చేఁ గొని గండుమిగిలి. 299

వ. కాలయముండు నాఁ బోలం దోఁచి కార్తవీర్యునికట్టెయుటం గాన వచ్చిన నతండు వాని నుక్కడంపఁ దనపదునే డక్షౌహిణులబలంబున్ నియోగించుటయు. 300

శా. సైన్యం బంతయు దైన్యమున్ విడిచి పెల్చం బోల్చి పెల్లేఁచి య
ష్టన్యాసాధ్యము లైనకత్తులు కటా ర్లాగ్నేయశస్త్రాస్త్రముల్
జన్యాభీలశతఘ్నులున్ గదలు దోస్సామర్థ్య మేపారఁ గా
వన్యాహారవిహారముల్ సలుపు బాపం డంచు లో నెంచుచున్. 301

వ. ఉక్కుమిలిగి యొక్కపెట్ట తెట్టెలుగట్టె బాణంబులు ప్రయోగించుచుఁ బరశురాము నెదిరించిన నతం డవక్రవిక్రమంబున గండ్రగొడ్డలిం ద్రిప్పుచు శాత్రవులగాత్రంబులు కాళ్ళుం జేతులు తొడలు మెడలు డొక్కలు ముక్కలై పడుచుండ రథహస్తిహయముల దేహంబులు దెగి కుప్పగూరలై కూలి సంగరాంగణంబు గప్పవడం జేయుచు రక్త ప్రవాహంబు సువ్యక్తంబై ప్రవహించుచుండఁ గార్తవీర్యుండు క్రౌర్యం బవార్యంబుగా నడుదెంచి తనసహస్రబాహువులతో మాటి కే నూఱునేటి బాణములు ప్రయోగించుచుండ భార్గవుం డొక్కకార్ముకంబునన వాని సెల్లం జెక్కి చెక్కుచెదరనిపరాక్రమంబున మొక్కలీఁడై పీడపనైరంబునం దనకుఠారంబున వాని వేయిచేతులున్ ఛేదించి మోదించుచుఁ బర్వతశృంగంబును బోనివానియుత్తమాంగంబు సంగరరంబునం బడి పొరలాడం జేసినం దెలిసి వానిపుత్రులు పదివేవురు డేప్రుసుపడి సవత్సం బగుహోమధేనువుం దెచ్చి రాముని కిచ్చిరి రాముండును గోవుం గొని వచ్చి తండ్రి కర్పించిన నతండు చింతించుచు నతని కిట్లనియె. 302

శా. రామా! రా జన సర్వదేవమయుఁడై రాజిల్లువాఁ డీవు దీ
ర్ఘామర్షంబున వానిఁ జంపితివి పాపాచార మయ్యెం గటా
యేమందున్ మన ముగ్రకర్మమునకై యోగంగరా దెప్పుడున్
భూమిన్ విప్రుల వేల్పు లంద్రు శమముం బోషించుటం జేసియే. 303

మ. శమమునుం జేసియె బ్రహ్మదేవుఁడు మహోచ్చస్థానమును బొంద నై
సముదాచారము గల్గి ముజ్జగములన్ జాఁగిల్లుఁ దేజంబునన్
శమనే భూషణ మార్యసంతతికి విష్ణుక్షేముఁ డెవ్వేళ నా
శమినిం బ్రోచెదు దర్శనం బిడి కృపాస్వాంతంబునం బుత్రికా. 304

వ. మూర్ధాభిషిక్తుండైన రాజుం జంపుటఁ బ్రహ్మహత్యకంటెం బాపంబు గావున నీవు గంగాదిపుణ్యతీర్థంబులు సేవించి పాపంబుం బాపికొ మ్మనిన నతండు తండ్రిపంపున నొక్కసంవత్సరంబు తీర్థంబు లెల్లఁ దిరిగి వచ్చె నంతఁ గొంతకాలంబునకు. 305

తరళము. పరశురామునితల్లి రేణుక వారి దేరఁగ గంగకున్
దరలిపోయి యటన్ జలంబులఁ దత్పరత్వము మీఱ న
చ్చరలతో విహరించుసుందరజన్ముఁ జిత్రరథాఖ్యునిన్
బరిసరంబునఁ జూచుచున్ నిలువంబడెన్ బ్రియ మేర్పడన్. 306

వ. హోమకాలాతిక్రమ మగు టెఱుంగం జాలక మసలి యెట్టకేలకుం దెలిసి భయంపడుచు జలకుంభముం గొని పతిచెంతకుం జనినంత నతం డామెమనశ్చాంచల్య మెఱింగి కుమారులం బిలిచి మీతల్లినిం జంపు డనిన వారు మాతృవధకుం జంకి జనకాజ్ఞ నిరసించిన రాముం జూచి రామా! నీ వీసోదరులను నీతల్లినిం ద్రెళ్ళఁ జేయు మనిన నతం డతనిప్రభావం బెఱింగినవాఁడు గావున జంకక వారి నొక్కపెట్ట గిట్టించె జమదగ్ని కుమారునిచేతకు సంతసించుచుఁ గుమారా నీకు మెచ్చితి వరం బిచ్చెదఁ బుచ్చుకొ మ్మనిన నతండు తనచేఁ జంపఁ బడినజననీ సోదరులం బ్రదికింపు మనిన నతం డట్లన నవ్వుచు వారినెల్ల వారి సంప్రోక్షణంబునఁ దక్షణంబునఁ బునర్జీవితులం గావించె వారు నిద్రపోయినవారు లేచినట్లు లేచి రంతఁ గొంత కాలంబు చనినంత. 307

మత్త. కార్తవీర్యసుపుత్రు లెంతయుఁ గాదు గొన్నమనంబుతో
నార్తి నొందుచుఁ దండ్రిపోకకు నాపగం దుదముట్టఁగాఁ
దీర్తు మంచుఁ దలంచి రేణుక దిక్కులార్వఁగ నేడ్చుచోఁ
గర్తరించి మునీంద్రశీర్షము కైకొనం గలరై రొగిన్. 308

వ. రేణుకయు నురస్తాడనంబు చేసికొనుచు హాహాకారం బొనర్చుచు.

ద్విపదము. ఓరామ యోరామ యోపుత్రులార
రా రండు మీతండ్రి రాక్షసుల్ వీరు
కార్తవీర్యార్జును కన్నకొమాళ్లు
కర్తరించి శిరంబు గైకొని చనిరి. 180

వ. అయ్యార్తస్వరంబు విని రాముండు వడివడిం బఱచి వచ్చి మరణించిన తండ్రిం జూచి దుఃఖించుచుఁ దల్లివలన సర్వంబు నెఱింగి క్రోధతామ్రాక్షుండై కేలం బరశువుఁ గీలించి పరవళ్ళు ద్రొక్కుకొనుచు మాహిష్మతీపురంబునకుం జని బ్రహ్మహంతకు లగు నెల్ల హైహయులం జంపి వారిశిరంబులు గొండలపొడుగుగం బ్రోవులు వెట్టి మఱియు వారికిం దోడ్పడినదుష్టరాజుల నెల్ల నిరువదియొక్కమాఱులు తిరిగి తిరిగి సంహరించి వారిరక్తంబున శమంతకపంచకం బనఁ గురుక్షేత్రంబున నేను హ్రదంబులు గావించి పితృప్రీతికరంబుగా నారక్తంబునఁ దర్పణంబులు గావించి తండ్రిశీర్షంబు దెచ్చి కళేబరంబునం దదికి పరమేశ్వరప్రీతిగా నొక్కమహాయజ్ఞంబు గావించి యజ్ఞదక్షిణగాఁ బ్రాగ్దిశాభాగంబు హోతకును దక్షిణదిశావలయంబు బ్రహ్మకును బశ్చిమభూభాగం బధ్వర్యునకును నుత్తరం బుద్గాతకు నొసంగి విదిక్కులు దక్కినవారి కర్పించి మధ్యభాగం బంతయుఁ గాశ్యపున కిచ్చి యవభృథస్నానంబు చేసి పాపంబుఁ బోకార్చుకొని మబ్బు విడిచిన మార్తాండునిచందంబున నుండుచుఁ దండ్రిం బూజించెఁ దండ్రియు నక్షత్రరూప మొంది సప్తర్షులందుఁ గడపటివాఁడై వియత్తలంబున విరాజిల్లె రాముండును రామచంద్రునకుఁ దనవైష్ణవతేజం బర్పించి తాను మహేంద్రపర్వతంబున నిపుడు తపోనిష్ఠితుండై యుండె నింక విశ్వామిత్రునిచరిత్రశేషంబు చెప్పెద నాకర్ణింపుము. 311

సీ. గాధిపత్నియు బ్రహ్మకలితమంత్రములను
సంస్కృతం బయియున్నచరువుఁ గొనుట

గాశికుఁ బ్రోహ్మర్షిఁ గని నగ్నివలె నతం
డత్యంత తేజంబు నందఁ గలిగె
నతనికి నూర్వురు సుతు లందు మధ్యముఁ
డలరె మధుచ్ఛందుఁ డనెడు పేర
నప్పు డజీగర్తుఁ డనువిప్రునకు శున
శ్శేఫుఁడు పుత్త్రుఁడై చెన్నుమీఱి

తే. ఆతఁ డాహరిశ్చంద్రునియాగమునకుఁ
బశువుగా నమ్ముఁబడి కౌశికాదృతిమెయి
బ్రతికె నపుడు కౌశికుఁ డాత్మసుతుల
మ్లేచ్ఛులుగ శాపమును బెట్టె మిసిమి చెడఁగ. 312

వ. శునశ్శేఫుఁడు వరుణాధ్వరంబున దేవదత్తప్రాణములుఁ గలవాఁ డయ్యెఁ గావున దేవరాతుం డని పేరు వడసి కౌశికుఁడు పుత్త్రుఁడుగా స్వీకరించెం గావున నతండు కౌశికగోత్రంబునం జేరినవాఁ డయ్యెని యిఁకఁ బురూరవునిపుత్త్రులలో మొదటివాఁ డగునాయువు వంశం బభివర్ణించెద నాకర్ణింపు మాయువునకు నహుషుఁడు క్షత్రవృద్ధుఁడు రజియు రంభుఁడు వీర్యవంతుఁడు నను నేవురు కుమారులు వారిలో క్షత్రవృద్ధునకు సుహోత్రుఁడు సుహోత్రునకుఁ గాశ్యుఁడు కుశుఁడు గృత్సమదుఁడను మువ్వురు పుట్టిరి వారిలోఁ గృత్సమదునకు శునకుఁడుదయించె వానికి శౌనకుండు పొడమె నాతఁడే బహ్వృచులలోఁ బ్రధానుండు కాశ్యునకుఁ గాశిరాజు గలిగెఁ గాశిరాజునకు దీర్ఘతముఁడు దీర్ఘతమునకు ధన్వంతరి సంభూతుం డయ్యె. 213

క. ఆతం డాయుర్వేదము
ప్రీతిఁ బ్రవర్తింపఁ జేసె విష్ణ్వంశమునన్
ఖ్యాతుఁ డయి జలధిఁ బొడమిన
యాతనికి విభిన్నుఁ డీత డని యెఱుఁగ నగున్ 314

వ. ఆధన్వంతరికిఁ గేతుమంతుఁడు కేతుమంతునకు భీమరథుఁడు భీమరథు
నకు ద్యుమంతుఁడు ద్యుమంతునకు దివోదాసుం డనునామాంతరము
గలదు వానికిఁ బ్రతర్దనుఁడు వానికి శత్రుజిత్తు వానికి ఋతుధ్వజుండు
వానికిఁ గువలయాశ్వుం డనుమఱియొకపేరు గలదు వానికి నలర్కుఁడు
లోనగువా రుదయించిరి వారిలోన. 315

తే. ఆయలర్కుఁడు యౌవనమంద యుండి
యఱువదియునాఱువేల వత్సరము లవని
యేలె నాతనివలె సంతకాల మేలి
నట్టిరాజు మఱొక్కఁడు పుట్టలేదు. 316

వ. ఆయలర్కునకు సన్నతి సన్నతికి సుకేతనుఁడు సుకేతనునకు ధర్మ
కేతువు ధర్మకేతువునకు సత్యకేతువు సత్యకేతువునకు ధృష్టకేతువు
ధృష్టకేతువునకు సుకుమారుఁడు సుకుమారునకు వీతిహోత్రుఁడు
వీతిహోత్రునకు భర్గుఁడు భర్గునకు భార్గభూమియుఁ బుట్టెరి. 317

ఆ. వీరలెల్ల క్షత్రవృద్ధునిసంతతి
వార లింక రంభువంశ మెల్లఁ
దేటతెల్లముగను దెలియంగఁ జెప్పెద
నాలకింపు మనుచు నతఁడు మఱియు. 318

ఆరంభునకు రభసుఁడు వానికి గంభీరుఁడు వానికిఁ గృతుఁడు వానికి
బ్రాహ్మణకుల ముద్భవించె నాయువుపుత్రులలోనం గడగొట్టువాఁ
డగు వీర్యనంతునకు ననేనసుఁడు వానికి శుద్ధుఁడు వానికి శుచి వానికి
బ్రహ్మసారథి యనునామాంతరము గలత్రికకుత్తు త్రికకుత్తునకు శాంతర
జుఁ డతండు జ్ఞానయోగ మవలంబించి యపుత్రకుండై ముక్తుం డయ్యె
నవల నాయువుకుమారుఁ డగురజికి నేనూర్గురు తనూజులు. 319

క. ఆరజి వేల్పులపంపున
ఘోరాజినిఁ ద్రుంచి దైత్యకోటుల నెల్లన్

వారు హరించినస్వర్గముఁ
గోరికమెయి మఱియు హరికిఁ గొమ్మని యిచ్చెన్. 320

సీ. అట్టైన నతఁడు ప్రహ్లాదునిభయమున
  రజికి వెండియును స్వర్గం బొసంగె
రజి పోవ నవల స్వర్గము వానిపుత్రులు
  పాలించుచును యజ్ఞభాగములను
గొనుచు నింద్రుఁడు కోరినను స్వర్గమును విడ
  కున్న బృహస్పతిహోమములను
మతి చెడియున్న నామనుజేంద్రుపుత్రుల
  నింద్రుఁడు మడియించి యేలె దివము

తే. రజికుమారులవంశ మీరమణ పోయె
మహితుఁ డగుక్షత్రధర్మునిమనుమఁ డైన
కుశుఁడు భూతల మేలుచుఁ గొమరుమిగిలి
ప్రీతి యనుపుత్రునిం గనెఁ బెరిమ మెఱయ. 321

వ. ఆప్రీతికి సంజయుండు వానికి జయుండు వానికిఁ గృతుండు వానికి హర్యశ్వుఁడు వానికి సహదేవుఁడు వానికి భీముండు వానికి జయసేనుఁడు వానికి సంకృతియు జనించిరి. 322

తే. క్షత్రధర్మపరుండు విజ్ఞాననిధియు
శూరవరుఁ డయి సంకృతి శోభ గాంచె
వీర లందఱు నాక్షత్రవృద్ధివంశ
జు లిఁక నహుషసంతతివారిఁ దెలియ వినుము. 323

వ. నహుషునకు యతి యయాతి సంయాతి యాయతి వియతి కృతి యను నార్వురు నందనులు వారిలో జ్యేష్ఠుఁ డగుయతి రాజ్యము దుఃఖకారణం బనియు దానిం జేసి పురుషుం డొడలెఱుంగక మత్తుండై చెడు ననియుం దెలిసి కొని జనకుండు రాజ్య మిచ్చెద నన్నను బుచ్చుకొనక విరక్తుం డయ్యె నాలో నహుషుండు. 324

ద్విపదము. ఇంద్రాధిపత్యము నింపుమై నొంది
సాంద్రగర్వంబున శచిఁ బొందఁ గోరి
తెలిపిన నాయమ ధిషణుబోధనము
గలిగినవై నీవు బ్రాహ్మణసురవాహ
నము నెక్కి రమ్మన నహుషుఁ డారీతి
సముపస్థితిం గాంచి చనుచుండ వాని
యపరాధమున వార లహి వవు మనుచు
శపియింప నాతఁడు సర్పమై నేలఁ
గూలినపదపడిఁ గొడుకు యయాతి
యేలికయై ధర యేలుచుఁ దనదు
తమ్ముల నల్వురఁ దగ నాల్గుకడల
నెమ్మమై నేలంగ నియమించి తాను
గవికూతురై పెంపుఁ గను దేవయాని
నవల నావృషపర్వునాత్మజ యగుచు
హరువొందుశర్మిష్ఠ యనుదానిఁ బ్రీతి
పరిణయంబై సౌఖ్యపరతఁ దా నుండె. 325

వ. అనిన విని రాజేంద్రుండు మునీంద్రా క్షత్రియవంశసంభూతుం డగు యయాతి బ్రహ్మవంశసంభూత యగు దేవయాని నేధర్మంబునం బెండ్లియాడె నిట్టివిపరీతవివాహ మెం దైనం గలదే చెప్పు మనిన నతం డాలకింపుము వృషపర్వునికూఁతురు శర్మిష్ఠ యొక్కనాఁడు. 326

—♦ యయాతిచరిత్రము ♦—

ఉత్సాహము. కన్యకాసహస్ర మంటఁ గదలి దేవయానితో
వన్యమహా సరోవరంబుపజ్జఁ జొచ్చి పట్టముల్
కన్య లాడి నీట వచ్చి గాలిఁ గలియువాని న
న్యోన్యవిస్మయంబు గాఁగ నవధరించి రత్తఱిన్. 327

వ. శర్మిష్ఠ దేవయానిపరిధానంబుగట్టిన దేవయాని దానిపుట్టంబుఁగట్టకోసి.

క. నీతాతకు నీతండ్రికి
నీతోయమువారి కెల్ల నెఱి నారాధ్యుం
డై తనరుదైత్యగురునకుఁ
గూఁతుర నేఁ బూజ్యురాలఁ గొమ లందఱకున్ 329

సీ. నాకట్టుపుట్టంబు నీ కేల కట్టంగ
నీమైలఁ గట్ట నాకేమి వచ్చె
నన మండి శర్మిష్ఠయను నేను రాక న్నె
నను నీవు గొలుచుట నాయ మగును
నీతండ్రి నాతండ్రి నిలిచినచో నిల్వ
రాదు భజించియే బ్రదుక వలయు
నందుపై మీవార లందఱు మాయిండ్ల
భిక్షాటనము చేసి పెఱిఁగినారు

ఆ. నీ కిదేటిగర్వ మే కట్టుపుట్టంబు
నీకుఁ గట్టరాదు గాక యేమి
యనుచు నెగ్గు లాడి యాదేవయానిని
బడఁగఁ ద్రోచి నూత వెడలె నంత. 330

వ. అంతలో యయాతి మృగయార్థ మరుదెంచి నూతిలోఁ బడియున్న
కన్యకామణిం గనియె. 331

మ. కని నీ వెవ్వరిదాన వెన్వతివి యీకాంతారమధ్యంబునం
జనుదే నేమి తృణాన్వృతంబును భయాస్థానంబు నిన్నూతిలో
వనటం గుందఁగ నేల చెప్పు మన నవ్వామాక్షి పెన్నిద్దురం
గనువారిన్ బ్రదికించుభార్గవున కేఁ గన్యం జగన్మాన్యకా. 332

వ. ప్రమాదవశంబున నిందుఁ బడి కుందుచున్నదాన నీ వార్తత్రాణ
పరాయణుండవుం గులీనుండ వని నే నెఱుంగుదు ననుగ్రహించి న
న్నుద్ధరింపు మని ప్రార్థించి తనదక్షిణహస్తం బెత్తుటయు నత్తాపస
శరణ్యుండును దత్తఱంబున దాసిం గ్రహించి నూయివెడలం దిగిచి

తోఁ గూడ నాపురోహితుని నామంత్రణంబు చేసి తాను దనరాజధానికిం జనియె నిట
దేవయాని శర్మిష్ఠ చేఁతకుఁ జేతంబున సంజాతజాతవేదోనిభంబగుకోప
తాపంబున ఘూర్ణిల్లుచుఁ దన్ను రోయవచ్చు ఘూర్ణిక యనుదాని
వలనఁ దనయవమానంబు తండ్రికిం జెప్పిపుచ్చి తా నవ్వనంబు సార
నొల్లకున్నంత శుక్రుండు నతిత్వరితగతి నట వచ్చి దేవయానిం గాంచి
కౌఁగిలించుకొని వగచుచు సాంత్వనవచనపూర్వంబుగా నిట్లనియె.

క. తనచేసినదోషంబున
జనునకుఁ గష్టంబు సుఖము జతపడుచుండున్
వనరుట కష్టం బయినను
బొనరుట సుఖ మయినఁ దగదు పూరుషున కిలన్. 334

క. ప్రతిమాసము నూఱేడులు
వ్రతముగఁ గ్రతువులను జేయువారలకంటెన్
క్షితి నక్రోధనుఁ డగుచున్
సతతము సత్యంబు నడపుజనుఁ డధికుఁ డగున్. 335

వ. ఇది యట్టిద కావున నో దేవయానీ! నీవు రాజపుత్త్రి యగుశర్మిష్ఠతో
వైరంబు వెట్టుకొనక దానితో నేమనికితము మాని రమ్మనిన దేవ
యాని తండ్రిదిక్కు మొగంబై. 336

ఉ. చాలు నీకత సుధర్మములు చాల వచించితి దైత్యవల్లభా
బాలను బేల నట్లయినఁ బండితపుత్త్రిని గాన నాకునుం
బోల నెఱుంగ నయ్యెడినిఁ బో భవదుక్తము లెల్ల ధర్మము
ల్మేలు ఘటించి దైత్యులకు లెంక వలె న్మన నెంచి తక్కటా. 337

క. అధికారదుర్విదగ్ధత
నధముఁడు వృషపర్వుకూఁతు రనుమాట గడున్
వ్యథఁ గూర్చి నామనమ్మున
న్మథియించుచు నుండె నరణి మంథని వోలెన్ 338

ఆ. ధనము లేమి జనుఁడు దఱుగనిదాయాదు
ధనము కాంక్షఁ జేసి తగిలి కొలిచి

తిరుగుచుంట కంటె మరణమే మంగళ
మనిరి కాదె తెలిసినట్టివారు. 339

క. కీర్తిం గాల్చినపుండును
గర్తిం దెగఁగోయుపుండుఁ గ్రమముగ మానుఁ
జిత్తము నేఁచెడుమాటల
హత్తినపుం డెపుడు మాన కది వేధించుఁ. 340

వ. ఏది యెట్లున్నం గానిమ్ము నే నింక వృషపర్వునిపురంబునం దడుగు
వెట్టుదానంగా నెటకేనియుంబోయి బ్రదికెద నని సంభాషించుచున్న
సమయంబున నది యంతయుం జారులవలన నెఱింగి వృషపర్వుం
డటకు వచ్చి గురునకు నమస్కరించి యడఁకువం జూపుచున్నంతం
గని గర్హించుచుఁ గావ్యుం డతని కిట్లనియె. 341

తే. తొల్లి నాశిష్యుఁ డగుకచు నెల్లదాన
వులును జంపఁగ నొంపఁగ దలఁచి రిపుడు
నాదుహిత దేవయానిని నీదుపుత్రి
చంప నీనూతఁ బడఁద్రోసి చనియె వింటె. 342

క. ఖలుల నుపేక్షించెదు నీ
చెలిమి యిఁక న్విడిచి యెందుసీమకు నేగం
దలఁచితి నన్నుఁ మిథ్యా
ప్రలాపిఁగఁ దలంప వీవు క్రవ్యాదపతీ. 343

వ. అనిన వృషపర్వుండు దేవయానిచెంతకుం జని ప్రార్థించుచుఁ దల్లీ!
నీ విప్పట్ల నా కేమిప్రాయశ్చిత్తము విధింతువు నీచెప్పినట్లు చేసెద ననిన
దేవయాని వాని కిట్లనియె. 344

క. కన్యాసహస్రయుత నీ
కన్యక నాదాసి యగుచుఁ గడుభక్తి నసా
మాన్యక్రియఁ గొలువఁగ నిడు
మన్యాయము గానిపగిది నమరవిరోధీ. 345

వ. అనిన నతండు దేవయాని కోరినట్లు కన్యాద్విసహస్రంబుతో శర్మిష్ఠం దెచ్చి దానికి దాసీత్వంబున నియోగించి శుక్రుండు మనఃప్రియం బాపాదించె శుక్రుండును దేవయానీసహితుండై పురప్రవేశంబు చేసి సుఖంబుండె నంత నొక్కనాఁడు దేవయాని చెలికత్తియలతో నుద్యానవనంబున విహరించుచుండ వెండియు యయాతి వచ్చి దేవయానికి దర్శనం బిచ్చిన నామెయు. 346

— యయాతి దేవయానిం బెండ్లియాడుట —

శా. నాపాలింటిశుభావహుండ వినుమా న్ప్రార్థనావాక్య మా
కూపంబు న్వెలలించునాఁడ గ్రహముఖ్యుం డక్కఁడే సాక్షిగా
నాపాణిగ్రహణం బొనర్చితివి గానన్ భర్త వీ వైతి దే
వా పెక్కేటికిఁ బెండ్లియాడి దయ దైవారం గటాక్షింపుమా. 347

వ. శర్మిష్ఠం దొట్టిపేరందఱును దేవకన్యలం బోనివారు నావెంటన వచ్చి నీకు దాస్యంబు సేయ నీవు దేవేంద్రవైభవం బనుభవింప వచ్చు ననిన నతండును. 348

క. క్షత్రియుఁడ నేను బ్రాహ్మణ
పుత్రిక వీ వెట్లు పెండ్లి పొసఁగెడు మనకున్
ధాత్రిన్ సంభృతధర్మ
క్షేత్రంబుగ నేలు నేన చెడు టుచితంబే. 349

వ. ఇది గాక నీతండ్రి ప్రళయాంతకప్రతిమానుం డీధర్మవ్యత్యయంబు విని నేని నన్ను నారాష్ట్రంబు భస్మావశేషంబు గావించెడు ననిన నామె యప్పుడ తండ్రి నటకుం దెప్పించి. 350

ఉ. నేర్పున దేవయాని గురునిం గని యిట్లను నాహుషుం డితం
డేర్పడ నాకరంబు గ్రహియించెను దొల్లిట దాన నీశుఁడై
పేర్పడె నట్టిపేని విడి వేనినిఁ గైకొనఁ బోవ నీతనిం
గూర్పవె నాకు ధర్మవిధిఁ గోరిక లీరిక లెత్త భర్తగన్. 351

వ. అనిన శుక్రాచార్యుండు నమస్కరించుచు నిల్చియున్న యయాతింగని.

ఉ. నాహుషరాజ నాసుతను నాఁ డలనూత వెలార్చునప్పుడే
బాహువు సాఁచి తత్కరముఁ బట్టితి కావున భర్త వైతి సం
దేహము లేదు ధర్మవిహతిం గలదోషము వో వరంబు హ్రా
ద్దాహము దీఱ నిచ్చితిని దన్వినిఁ గైకొను ధర్మపత్నిఁగన్. 353

వ. అని వాని నొప్పించి వా రిరువురకుం బాణిగ్రహణోత్సవంబు గావించి శర్మిష్ఠం జూపి యిది వృషపర్వునికూఁతురు దీనిని శయనమ్మునకుఁ దక్కఁ దక్కనుంగలసర్వవిషయంబులందు నాకూఁతుం బలెఁ జూచునది యని యంపి పుచ్చుటయు నతండు వారితో నిజపురంబున కరిగి దేవయాని నంతఃపురంబునందును శర్మిష్ఠ నాసన్నగృహంబునందు నునిచి దేవయానితో నిచ్ఛావిహారంబులం దేలుచు యదుతుర్వసులను నిర్వురు కొడుకులం గనె నంతం గొంతకాలంబునకు శర్మిష్ఠ ఋతుమతియై విరాళిం దురపిల్లుచు సమాగతుం డైనయయాతిం గని తన మనోరథం బెఱింగించిన నతండు ఋతువిఘాతంబు సేయ నొప్ప దని పాణిగ్రహణంబు చేసి దానితోడం గూడె ననంతరకాలంబున శర్మిష్ఠకు ద్రుహ్యుఁడు ననువు పూరుఁడు ననుమూవురుపుత్రులు పుట్టిరి. వారిం జూచి దేవయాని యయాతి చేసినచేఁతకు గర్హించుచుఁ దండ్రికడకుం బోయె యయాతియు నామె ననునయించుచు వెన్నంటి చనిన శుక్రుం డంతయు నెఱింగి కనలుచు రాజుం గాంచి. 354

తే. రాజ నీ వతిక్రాంతమర్యాదుఁ డై య
ధర్మ మాచరించితి కానఁ దడయ కిపుడు
పృథులఘోరజరాభారపీడితుండ
వగు మటంచును శపియించె నాగ్రహమున. 355

వ. అంత నయ్యయాతి నాకు విషయసుఖంబులం దనివి తీఱకున్నది జరాభారంబు భరింప నోప ననుగ్రహింపు మనినం గరుణించి కావ్యుండు నీజరాభారంబు నీకొడుకులం దెవ్వనియం దైనం బెట్టి వానియౌవనంబు గొని విషయతృప్తుండవై వెనుక వాని జవ్వనంబు వాని కిమ్మనిన నతం డౌ నని జ్యేష్ఠపుత్రుఁ డగుయదునిం బిలిచి. 356

క. నాయీవార్ధకముం గొని
నీయౌవన మిమ్ము నాకు నెఱి వేయేఁడుల్
పోయిన వెండియు నిచ్చెదఁ
బాయని విషయేచ్ఛ దీఱఁ బడ సుకుమారా. 357

ఆ. అనుడు యదువు నీకు నగునయ్య యిట్లాడ
ఘోరజర భరించు కొ మ్మంటివి
వాడలు చివుక వళులు వాడమ మీసా తెల్ల
బడఁగ వడఁకి బడలువడఁగ లేను. 358

తే. అనిన నతఁ డీవు నాహృదయంబు వలన
నయ్యు నాకోర్కి నెఱవేర్ప వైతి కాన
నవని నీవు నీసుతులు రాజ్యార్హు లగుచు
నసము గొనకుండెదరు గాత మని శపించి. 359

వ. తుర్వసుం బిలిచి యదువుం బోలె నడిగిన నతండును నట్లు చెప్పిన
నీవు మ్లేచ్ఛజాతిం బడు మని శపించి ద్రుహ్యుం బిలిచి తొంటి
వలె నడిగి వాఁడు నట్లు చెప్పిన నీవు గజాశ్వరథగర్దభాదులఁ బాలించు
వాఁడవై పోదు వని శపించి యనువుం బిలిచి యడిగిన నతం డట్లు
చెప్పిన నీవు నీవంశమువారును గర్మత్యాగులై జవ్వనంబునన చత్తు
రని శపించి కడగొట్టుపట్టి యగు పూరుం బిలిచి. 360

మ. ప్రియపుత్త్రుండవు నీవు మేటి వగుచుం బేరందె దోతండ్రి! కో
పయుతుండై శపియించెఁ గావ్యుఁడు జరాభారంబు పైఁ గప్పె వి
ప్రియమై తీఱదు భోగవాంఛ యది నావృద్ధత్వ మీ వూని నీ
ప్రియతారుణ్యము నాకు ని మ్మొసఁగెద న్వేయేండ్లకు న్వెండియున్

వ. అనినఁ బూరుం డి ట్లనియె. 361

ఉ. తల్లిని దండ్రినిం గొడుకు దైవసమానులఁ గాఁ దలంచి వా
ర్చెల్లినరీతిఁ జెప్పినటు చేయుట ధర్మము గాన నగ్నిలోఁ
దెళ్లు మనంగఁ ద్రెళ్లెద స్రుత్పతిఁ గూలు మనంగ గూలెదం
దెల్లము గా జరాభరము నేఁ గొను నెంతటి దయ్య భూవరా 362

తే. పాపసంయుక్త మగు నీదు వార్ధకంబు
నేను గొందు నాజన్వ్యాన మీవు గొనుము
హృదయసంజనితేష్టము లెల్లఁ దీఱ
విషయతృప్తుండ వగుము పృథ్వీతలేశ. 363

వ. అనిన యయాతి సంతసించుచు వానిం దనకౌఁగిటం గ్రుచ్చి యెత్తి కావ్యుం దలంచి తత్ప్రభావంబునఁ దనముదిమి వాని కిచ్చి వానితారుణ్యంబు తాను బుచ్చుకొని తరుణవయస్కుఁడై వేయేండ్లు యథేష్టంబుగాఁ గామోపభోగంబు లనుభవించుచుఁ బ్రజాపాలనంబు గావించుచు నొక్కనాఁడు తనయజ్ఞానము తాన తెలిసికొని విషయవైరాగ్యంబు గలఁడై దేవయానిం దరియ నరిగి తనవర్తనము ననుకరించు నొకయాఖ్యానముం జెప్పువాఁడై యి ట్లనియె. 364

సీ. మున్నొకకాననంబున మేష మొక్కఁడే
కాకిఁయై తిరుగుచు నాకడలను
పడి కర్మవశమునఁ బాడునూతఁ న్మేషి
కానవచ్చిన దానిఁ బూని యెత్తి
మేషి కూపమునుండి మీఁదికిఁ జనుదెంచి
వరియించె మేషముఁ బతిగ నెంచి
దానిఁ బత్నిగ మేష మూ నని చేకొనె
నపు డాదు మేక యొం డటకు వచ్చి

తే. మేషముం గాంచి పైకొని మిసిమిమెఱసి
మొదటి మేషి సహింపక ముదము దొఱఁగి
పోయె పురుషమేషము దాని పొందు గోరి
వెంటఁ బడిపోయె నెంతయు వేఁడుకొనుచు. 365

వ. అంతలో నొంకడు వచ్చి బస్తము వృషణంబులు భేదించి మగుడఁ దత్ప్రార్థనంబున నదికించుటం జేసి బస్తము ప్రకృతిధర్మము నొంది కూపలబ్ధమేషితోఁ గూడి చిరసుఖం బనుభవించి ప్రపంచమ్ముఁ మఱచి

సంచరించె దానికి శాంతి యింతయు లేక పోయె ధనధాన్యపశుపు త్రాదులు నశ్వరంబులు రాగద్వేషజనకంబులు విషయాభిలాష మిక్కిలి చెడ్డది దుర్మతులు దాని విడువఁ జాలరు వారికి శరీరము జీర్ణించినను దృష్ణజీర్ణింప దెప్పుడు ను సంగంబెవ్వారికి నొప్ప దింద్రియ గ్రామము బలవంత మెంతవాని నైన నాకర్షించును నేను నీతో వేయి సంవత్సరంబులు విషయసుఖం బనుభవించితి నింక నే నీతృష్ణ విడిచి ద్వంద్వంబులం దిరస్కరించి దేహాత్మభ్రాంతిం బెగఁద్రావి మృగములం గలసి వనంబులం జేరి బ్రహ్మోపాసనంబు సేయుచుఁ బరమాత్మ తత్త్వముం దెలిసి కొని పరంబు నొంద నెంచితి నని చెప్పి తనకప్పటికిం గలయౌవనంబు పూరున కిచ్చి తనముదిమి తాను బుచ్చుకొని పూరు నకు రాజ్యపట్టాభిషేకము గావించి తపోవనంబున కరిగి పరమతపంబు చేయుచుం గొంతకాలంబునకుఁ బరమపదంబు నొందె దేవయానియు యయాతి చెప్పినకథ వినియుంటం జేసి స్త్రీ పురుషస్నేహము చేనైన వికారంబు లన్నియు స్మరించుచు విజ్ఞానంబు వడసి భగవంతుని ధ్యానించుచు ముక్తిం గాంచె నని శుకయోగి వెండియును. 366

శా. ఏవంశమ్మున నీవుపుట్టితి గడ యా నేవంశమం దెందఱో
దేవాంశంబుల నుత్తమోత్తములు దేవీస్వత్ప్రభావంతులై
దేవర్షిత్వము గాంచి యుండిరో ధరిత్రీచక్రిమం దిప్పు డా
దేవాభుం డగుపూరునన్వయముఁ గీర్తింతుక విన(ం) జెల్లెడిక. 367

—♦ పూరువంశానుక్రమణిక ♦—

వ. ఆపూరునకు జనమేజయుండు వానికిఁ బ్రాచీన్వాంతుఁడు వానికిఁ బ్రవీరుఁడు వానికి నమస్యుఁడు వానికి జారుకుఁడు వానికి సుద్యువు వానికి బహుగవుఁడు వానికి శర్యాతి వానికి సంయాతి వానికి రౌద్రాశ్వతి వానికి ఘృతాచి యనునచ్చరయందు ఋతేపువు కక్షేపువు స్థలేపువు కృతేపువు జలేపువు సన్నతేపువు ధర్మేపువు సత్యేపువు వ్రతేపువు వనేపువు ననుపదుగురు పుత్రులు పుట్టిరి ఆఋతేపు

నకు నంతిసారుఁడు వానికి సుమతి ధ్రువుఁడు నప్రతిరథుఁడు నను ముగ్వురు కుమారులు వారిలో నప్రతిరథునకుఁ గణ్వుఁడు కణ్వునకు మేధాతిథి వానికిఁ బ్రస్కందుఁడు మొదలగు బ్రాహ్మణులుపుట్టిరి. అంతి సారసుతుఁడైన సుమతికి రైభ్యుఁడు వానికి దుష్యంతుఁడుం బుట్టిరి.

—♦ దు ష్యం తు ని చ రి త్ర ము ♦—

శా. ఆదుష్యంతుఁడు వేటలాడుట కరణ్యానిం బ్రవర్తించుచుణ్
మోదం బేర్పడఁ గణ్వుఁ డుండునటజంబుం జేరి యం దొక్కచో
నేదోకర్జమునందు నుండునవలా నీక్షించి మోహించి యో
హో దేవీ యెవ రీవు ని న్ననిన నెంతో సంతసం బయ్యెడిణ్. 369

తే. అన శకుంతల యనియె నోయవనినాథ
కౌశికునకు మేనకకును గలిగినట్టి
దానఁ గణ్వుఁడు ననుఁ బెంచె ధర శకుంత
లాఖ్య నైతి ననంగ నాయవనిజాని. 370

చ. దిరిసెనపుష్పమో యనుగతిణ్ మృదులం బగునీదుమేను దు
ర్భర మగుకాఱుకోనఁ బడి వాడి బడల్పడ నారఁ గట్టి పె
ల్లరుచిగఁ గూరలం దిని మృగాదులచెల్మిని డింద నేటి కో
తరుణి నను న్వరించి వితతంబుగ వైభవ మంద రాదొకో. 371

క. క్షత్రపరిగ్రహ వగుటణ్
క్షత్రియునకు నాకుఁ గూర్చు సతివై నిఖిల
క్షత్రియకాంతాంచితవై
ధాత్రిణ్ సామ్రాజ్యసుఖవితానము గొనుమా. 372

క. గాంధర్వంబున నిచ్చట
గంధద్విరదేంద్రగమన కలియుము నన్నుణ్
బాంధవ్య మదుక జంకకు
గాంధర్వము శ్రేష్ఠతమము గద పెండిలులణ్. 373

వ. అనిన సి గ్గభినయించుచు నంగీకారం బెఱింగించిన నతండు దాని గాం ధర్వవిధిం బరిగ్రహించి దానితోఁ దనయభీష్టంబు నెఱవేర్చుకొని

వెనుక నాయొద్దకు నిన్నుఁ దెప్పించుకొందు నని వీడ్కొని నిజపురంబు నకుం జనియె నంత శకుంతలయు దుష్యంతప్రసాదంబున గర్భవతియై మూఁడువర్షంబులు నీరు మోసి సూర్యాగ్నిసదృశదేహుం డగుసుకు మారుం గనియెఁ గణ్వుండు జాతకర్మాది సత్క్రియాకలాపంబులు నిర్వర్తించి భరతుం డని పేరు వెట్టె నంతఁ జక్రవర్తిలక్షణాలక్షితుం డగునక్కుమారుండు దినదినప్రవర్ధమానుండై సత్త్వంబులం దమియిం చుటం జేసి సత్త్వదమనుండు నా నామాంతరంబు వడసె నంత వానికి యౌవరాజ్యార్హం బగునీడు వచ్చినప్పుడు పుత్రసహిత యగుపుత్రికా మణి నత్తవారియింటికి నంపుటయు నాదుష్యంతుఁ డాశకుంతలను మునుమున్ను నిరాకరించియు వినువాకునం జేసి పరిగ్రహించి భరతుని యౌవరాజ్యపట్టభద్రునిం జేసి పెద్దకాలంబు సామ్రాజ్యసుఖం బనుభ వించి రాజర్షియై తపోవనంబున కరిగె నంత. 374

—♦ భరతోపాఖ్యానము ♦—

చ. భరతుఁ డిలాతలేశుఁ డయి బాహుబలంబున నెల్లఁ జేండ్లఁ బెం
పరుగ జయించి గోవితత మశ్వహాయమేధముఁ దొట్టి పెక్కు ల
ధ్వరము లొనర్చి కణ్వమునిపంపునఁ బెంపున సార్వభౌముఁడై
తిరుఁ డయి చక్రవర్తి యయి తేజరిలెన్ ధర వంశకర్తయై. 375

ఉ. భూరిధనంబు దక్షిణగ భూసురకోటి కొసంగి జన్నముల్
ధారుణి వేనవే ల్సలిపి ధన్యతఁ గాంచి యతండు కణ్వునిం
గోరి భజించి తత్కరుణకు న్నెలవై కులకర్తయై తగెన్
భారతు లైరి తత్కులమునం బ్రభవించినవార లెల్లరున్. 376

సీ. అతఁడు గంగాతీరమందు నిన్నూటయేఁ
బది యశ్వమేధముల్ పరఁగఁ జేసె
యమున గట్టున దీర్ఘతమునితో డెబ్బదె
న్మిది హయమేధముల్ పొదలఁ జేసె
సన్నుతింపఁగ నగ్నిచయనము గావించి
వేనవేల్ గోవుల దాన మిచ్చె

మష్కార మనుతీర్థమధ్యమునన్ నూట
ముప్పది హయమేధముల నొనర్చి
తే. మఱియుఁ బదునాలు గయుతముల్ మత్తకరుల
విప్రుల కొసంగె భరతుండు వెలయఁ జేయు
సిద్ధకర్మము లెవ్వరు నెపుడు గాని
చేసి యుండరు చేయరు క్షితితలమున. 377

వ. మఱియు హీనజాతు లైనభూపతులను మ్లేచ్ఛులను దిగ్విజయంబున సం హరించియు దేవతల జయించి పాతాళమున డాగి యున్నపూర్వ దేవులం బట్టి పాలార్చి యేర్చి వా రపహరించినదేవతాస్త్రీలను మనుష్యాదులను విడిపించుకొని వచ్చె వానిపాలనంబున ద్యావా భూములు సర్వసౌఖ్యప్రదంబు లయ్యెఁ దనయాజ్ఞ యప్రతిహతమై ప్రవర్తిల్లున ట్లిరువదియేడువేలసంవత్సరము లిలాతలము పాలించె నప్పుడు. 378

శా. ఆదౌష్యంతి నిజాంగనాత్రయమునం దత్యంతమోహంబుతో
నాదిం గాంచి కుమారులం దగరు నా కన్నంతఁ దన్మాత లా
మైఁ దొమ్మండ్రి యమక్షయంబునకు నంపం జాలి రాఁ జేఁడు నా
పైఁ దా నాత్మజహీనుఁడై కులము ద్రెవ్వం బోవునం చెంచుచున్.

మ. తనవంశంబు నశించిపోవు నని చింతాక్రాంతచిత్తంబునన్
ఘను లైనట్టిమరుత్తులం గురిచి యాగం బొందు గావింప నా
తనికిన్ వారు ప్రసన్ను లై యట భరద్వాజాహ్వయుం దెచ్చి కై
కొనుమం చిచ్చి రతం డెసంగె వితథాఖ్యుండు డంచు లోకంబునన్.

—♦ భరద్వాజుని జన్మవృత్తాంతము ♦—

వ. వితథుం డనుభరద్వాజునిజన్మవృత్తాంతము చెప్పెద నాకర్ణింపుము బృహస్పతి యుతథ్యుఁ డనుసోదరునిభార్య మమత యనునది గర్భ వతియై యుండ దానిన్ మోహించి బలాత్కారముగ సంభోగించు చుండ వల దని గర్భస్థుం డగునర్భకుండు వలుక వాని నంధుండవు

కమ్మని శపించి వీర్యంబు విడిచె గర్భస్థుండు దీర్ఘతముండు నాఁ బడి లోపలినుండి వీర్యము వెడలం దన్ని వేయ నది నేలం బడి బాలుం డయ్యె మమత భర్తృభయంబున వాని విడిచి పోవుచుండ బృహస్పతి మమతం గాంచి మూఢురాలా వీఁడు మన కిరువురకుం బుట్టినవాఁడు గావున ద్వాజుండు నాఁబడుఁ వీనిం భరింపు మనిన నది నీవే భరింపు మని విడిచి పోయె దాన నబ్బాలుండు భరద్వాజుండు నాఁబడె తల్లి దండ్రులకుం గానివాని దేవతలు తెచ్చి భరతున కిచ్చి రాతండు వితథ మైనభరతవంశమునకు దత్తుఁ డయ్యెఁ గావున వితథుం డను నామాంతరంబునుం బొందె నావితథునకు మన్యువు మన్యువునకు బృహత్క్షత్రుఁడు జయుఁడు మహావీర్యుఁడు నరుఁడు గర్గుఁడు నను నేవురు పుత్రులు పుట్టిరి వారిలో నరునకు సంకృతియు సంకృతికి గురు రంతిదేవు లనునిద్దఱు పుట్టిరి వారిలో రంతిదేవునికీర్తి త్రిలోకంబుల నావరించె. 381

—♦ రంతిదేవుని చరిత్రము ♦—

సీ. రంతిదేవుఁడు నిజార్థం బెల్ల నర్థుల
కిడి నిర్ధనుం డయి యెట్టు లెటులొ
కాలముఁ గడపుచు నాలుబిడ్డలతోడఁ
గృశియించి నలువదియెనిమిది యగు
నాళ్ళులు నీ ళ్లైన నమల కాకటఁ గుంగి
యామరునాఁ డుదయంబునందు
భాగధేయమున సంప్రాప్తింప ఘృతపాయ
సము నన్న పానముల్ సొపడుటకు
తే. సిద్ధుఁడై యుండునంతలోఁ జేర వచ్చి
దేహి యనుటయు నారంతిదేవుఁ డతిథి
నాదరించి పూజించి యాహారమందుఁ
గొంత పెట్టిన తిని యత డంతఁ జనియె. 382

శా. శేషాహారము దాఁ గుటుంబమును బ్రాశింపంగ నున్నంతలోఁ
భాషల్ సేయఁగ శక్తి లేమిఁ క్షుధాభారంబునం దోఁగుచున్
వైషమ్యంబున నోరుఁ జూపుచును నిల్వం జాలకుండంగ సం
తోషం బేర్పడ నన్నమందు సగ మార్యుం డంచిడెన్ రా జటన్. 383

ఉత్సాహ. ఉన్న దానిఁ దాను బ్రజలు నూఱడిల్ల క్షుద్భరం
బన్న మారగింప నున్న యప్డు కుక్కగములతోఁ
నెన్నఁ డేని చూడనట్టియింగితంబుతో జనుం
డన్న రేంద్రుకడకు వచ్చి యార్తిఁ బల్కె నిగ్గతిన్. 384

స్రగ్ధర. నాకుక్కల్ నే బుభుక్షన్ నకనకఁ బడుచున్నార మోరంతిదేవా!
మీకై యున్నట్టిదానిన్ మెసవికొనఁగ నిమ్మా ఫలం బెంతయేనిన్
నీకున్ సంప్రాప్తమౌ నా నృపతి ప్రియమునన్ శేష మన్నం బ దెల్లన్
గైకొమ్మం చిచ్చి వానిన్ఘనుఁ డని కొలిచెన్గాళ్ళకున్ మ్రొక్కికొంచున్.

చ. ప్రజలకు రంతిదేవునకుఁ ద్రావ జలం బొకయింతమాత్రమే
నిజకలశంబునం గలదు నిల్చి యొకండును గ్రోలఁ జాలఁ డ
ష్టజనముఁ దాల్చి మాలఁ డొకఁ డక్కడకుం జనుదెంచి మాలఁడన్
సుజనవరేణ్యా! నీ ళ్ళిడఁగఁ జూడుము ప్రాణము నిల్పు మియ్యెడన్.

తే. అనిన నాతఁడు దీనము లైనవాని
వాక్యముల జాలిఁ గలఁ డయి వాని కున్న
జలము లన్నియు నర్పించె సంతసమున
నంతలోన బ్రహ్మాదు లాయధిపుకడను. 387

వ. సాక్షాత్కరించి నిన్నుఁ బరీక్షింప విష్ణుమాయయే వృషలాదిరూపముల నిట్లు నిన్నన్నాదు లడిగికొనియె నీవు మహానుభావుండవు నీకుఁ బ్రకృతిపురుషవివేక మొసంగుచుంటి మనిన నతండు వారలకు నమస్కరించి దేహాదులందు మమత్వము విడిచి కేవలము వాసుదేవునియందు మనంబుఁ జేర్చి ముక్తుం డయ్యె నింక గర్గునివంశముం జెప్పెద విను మాగర్గునకు శిని శినికి గార్గ్యుం డతనివలన బ్రహ్మానంశం

బేర్పడియె నతండె మహావీర్యుం డతని కురుక్షయుం డురుక్షయునకుం ద్రియ్యారుణియుం గవియుం బుష్కరారుణియు ననుమూవురు కొమరులు గలిగి బ్రాహ్మణగతిం గలిగికొనిరి బృహత్క్షత్రునకు సుహోత్రుం డతనికి హస్తి యీహస్తియే తనపేర హస్తినపురంబు నిర్మించె హస్తికజమీఢుండు ద్విమీఢుండు పురుమీఢుం డనుమువ్వురు కొమారులు వారిలో నజమీఢునిసంతతివా రగుప్రియమేధాదులు బ్రాహ్మణులైరి. అజమీఢునకు బృహదిషుం డనుమతియొకపుత్రుండు గలం డా బృహదిషునకు బృహద్ధనువు వానికి బృహత్కాయుండు వానికి జయద్రథుండు వానికివిశ్వజిత్తు విశ్వజిత్తునకు సేనజిత్తు వానికిరుచిరాశ్వుండు దృఢహనువు కాశ్యుండు వత్సుండు ననునలువురు కొడుకులు వారిలో రుచిరాశ్వునకుం బ్రాజ్ఞుండు వానికిం బృథుసేనుండు వానికిం బారుండు పారునకు నీపుం డానీపునకు నూర్వురు పుత్రు లింతియె కాక నీపుండు శుకునిపుత్రిక యగుకృత్వినిం బెండ్లియాడి యామెవలన బ్రహ్మదత్తునిం గనియె బ్రహ్మదత్తుండు సరస్వతి యనుభార్యవలన విష్వక్సేనుం డనియెడు వానిం గనియె ఆవిష్వక్సేనుండే జైగిషవ్యోపదేశమున యోగశాస్త్రమును రచించె వానికి నుదక్సేనుండు వానికి బలాముండు సుతుం డయ్యె వీరు బార్హద్దీషవు లనురాజులైరి ద్విమీఢునకు యమీనరుండు వానికిం గృతిమంతుండు వానికి సత్యధృతి వానికి దృఢనేమి వానికి సుపార్శ్వుండు సుపార్శ్వునకు సుమతి సుమతికి సన్నతిమంతుడు వానికిం గృతి యాకృతియే హిరణ్యనాభునివలన యోగశాస్త్రమును షడ్విధంబు లగుసామసంహితలనుం బఠించి ప్రవర్తింపం జేసె నతని కుగ్రాయుధుండు వానికి క్షేమ్యుండు వానికి సువీరుండు వానికిం బురంజయుండు వానికి బహురథుండు పుట్టిరి హస్తికొడు కగు పురుమీఢునికి సంతతి లే దయ్యె నజమీఢుండు నళిని యనుపత్నియందు నీలునిం గనియె నీలునికి శాంతి శాంతికి సుశాంతి సుశాంతికిం బురుజుండువానికి నర్కుండువానికి భర్మ్యాశ్వుండువానికి ముద్గలుండు

యవీనరుఁడు బృహదిషువు కాంపిల్యుఁడు సృంజయుఁడు నను నేవురుకుమారుల నుదయించె. భర్మ్యాశ్వుఁడు కొడుకులం జూచి మీరు నా పంచదేశంబులం బాలింపఁ జాలుదు రనియె దానం జేసి వారు పాంచాలు రను పేరు వడసిరి ముద్గలునివలన మౌద్గల్యులయి బ్రాహ్మణులు ప్రబలిరి దాని సంగ్రహంబుగఁ జెప్పెద వినుము ముద్గలునకు దివోదాసుఁ డను కొడుకు నహల్య యను కూఁతురును జనించిరి. అహల్యను గౌతముఁడు పెండ్లియాడి శతానందునిం గనియె శతానందునకు సత్యధృతి పుట్టి ధనుర్వేదవిశారదుం డయ్యె వానికి శరద్వంతుఁ డుదయించె వాని కూర్వశీదర్శనమునఁ దేజస్స్ఖలనమై శరస్తంబమునం బడియె దాన నొక బాలుఁడు నొక బాలికయు జనించిరి శంతనుఁడు వేటకు వచ్చి వారిం గని కృపతో నింటికిం గొనిపోయి కృపుఁ డని కృపి యని నామకరణంబులు చేసె. 388

క. కృపుఁ డస్త్రంబునయందున్
నిపుణుండై గురుత గాంచి నెరిపె నచటన్
గురుసుతుల కస్త్రశాస్త్రము
కృపి ద్రోణునిభార్య యగుచుఁ గీర్తిం గాంచెన్. 389

—♦ చంద్రవంశాభివర్ణనము ♦—

వ. ఇంకఁ జంద్రవంశంబు చెప్పెద విను మా దివోదాసునకు మిత్రాయువు మిత్రాయువునకుఁ జ్యవనుఁడు సుదాసుఁడు సహదేవుఁడు సోమకుఁడు నను నలువురు కొడుకులు వారిలోఁ గనిష్ఠుఁ డగు సోమకునకు జంతుఁడు లోనగు నూర్వురు పుత్త్రులు పుట్టిరి వారిలోఁ బృషదుఁడు కనిష్ఠుఁడు వానికి ద్రుపదుఁడు వానికి ధృష్టద్యుమ్నాదిసుతులును ద్రౌపది యను సుతయుఁ గలిగి రందు ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు వీరు పాంచాలములో ముద్గలునిసంతతివా రగుటం జేసి పాంచాలురు నాఁబడిరి. అజమీఢునకు ఋక్షుఁ డను మఱియొక కుమారుండు గలడు వానికి సంవరణుఁడు వానికిఁ దపతియందుఁ గురురా జుదయించె వానిపేరనే కురుక్షేత్రము గలిగె కురువునకుఁ

బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుఁడు ననునలువురు పుట్టిరి. వారిలో సుధనువునకు సుహోత్రుఁడు సుహోత్రునకుఁ జ్యవనుఁడు వానికిఁ గృతి వాని కుపరిచరుఁ డనువసువు వానికి బృహద్రథుఁడు కుసుంభుఁడు మత్స్యుఁడు ప్రత్యగ్రుఁడు చేదిపుఁడు ననునేవురు పుట్టిరి. అందు బృహద్రథునకుఁ గుశాగ్రుఁడు వానికి ఋషభుఁడు వానికి సత్యహితుండు వానికిఁ బుష్పవంతుఁడు వానికి జహువు జనించిరి. 390

చ. అవల బృహద్రథాఖ్యునకు నన్యసతీమణియందు రెండుగా
నవు శిశుఖండముల్ గలిగె నాసతి వానినిఁ గందకంబులో
నవమతి వైచె వాని జరయన్ దనుజాంగన పట్టి రెంటినిన్
దవులగఁ గూర్చి పుత్త్రినిముదం బొనఁ గూరిచెఁ గన్నవారికిన్. 391

వ. ఆతండు జరాసంధుండు వానికి సహదేవుండు వానికి సోమాపి వానికి శ్రుతశ్రవుఁడు పుట్టెఁ గురుపుత్రుఁ డైనపరీక్షిత్తునకు సంతతి గలుగ కుండె వానితమ్ముఁ డగుజహ్నువునకు సురథుఁడు వానికి విదూరథుఁడు వానికి సార్వభౌముఁడు వానికి జయత్సేనుఁడు వానికి రాధికుఁడు వానికి నయుతాయువు వానికి గ్రోధనుఁడు వానికి దేవాతిథి వానికి ఋక్షుఁడు వానికి భీమసేనుఁడు వానికిఁ బ్రతీపుఁడు వానికి దేవాపి శంతనుఁడు బాహ్లీకుఁడనుముగ్గురు వారిలో దేవాపి రాజ్య మొల్లక తపోవనంబున కేగె శంతనుఁడు రా జయ్యె శంతనుఁడే తొంటిపుట్టువున మహాభీషుం డనంబడువాఁడు. ఆతఁ డేపుట్టువున వృద్ధులం జేతులం దాఁకివారికియౌవనంబును శాంతినిం గలిగించుటం జేసిశంతనుండయ్యె.

క. ద్వాదశవర్షత్క్షామం
బాదారఁ బొందుచుకాలమం దుదయించెన్
భూదేవులఁ బిలిచి యతం
డీదోషమ్మునకు హేతు వేమని యడిగెన్. 393

చ. అడిగిన వార లిట్లనిరి యన్న వివాహము చేసికొంచుఁ జే
ర్పడ సవనంబులన్ సలిపి పావకుఁ గొల్వక మున్న చిన్నత

మ్ముఁడు పరిణేతయై ధరణిఁ బూని నయేఁ బరివేత్త నాఁబడుఁ
పుడమి కనర్థమందునను బుట్టెడు నన్నను( బిల్వు మేలఁగన. 394

వ. అనిన శంతనుం డొకఁ గావుత మని దేవాపి యున్నకడకుం జని రాజ్య మేలు కొమ్మని ప్రార్థించెం గాని తత్పూర్వమ దేవాపి పాషండమత మవలంబించి వేదదూషకుండై పాపియై రాజ్యార్హుండు కాకుండె నట్టి యెడఁ దమ్ముం డర్హుండ కావున రాజ్యంబు మరల గ్రహించె దానం జేసి మేఘుండు వర్షించె భూమి సస్యసమేత యయ్యె. 395

తే. అల్ల దేవాపి యోగము నాశ్రయించి
చని కలాపము నాఁబడుస్థలమునందుఁ
జేరి కలియుగాంతమున నశించుచంద్ర
వంశము కృతాదిని న్వొండి వఱలఁ జేయు. 396

వ. బాహ్లికునకు సోమదత్తుఁడు వానికి భూరి భూరిశ్రవుఁడు శలుం డను ముగ్గురు తనయు లాశంతనుండు. 397

సీ. బ్రహ్మశాపంబునఁ బడఁతి యాగంగను
వరియించి భీష్ముఁడన వానిఁ గనియె
నతఁడు బ్రహ్మజ్ఞాని యతిపరాక్రమశాలి
పరశురామునిఁ గెల్చెఁ బవరమందు
నవల శంతనుఁడు సత్యవతినిఁ బెండ్లాడి
కనియెను జిత్రాంగదుని విచిత్ర
వీర్యు నందుం బెద్ద విగతజీవుం డయ్యె
గంధర్వనిహతుఁడై కయ్యమందు

తే. సత్యవతి కన్యయై నప్డు సత్యమూర్తి
యగుపరాశరువలన మాయయ్య పుట్టి
వ్యాసుఁ డనుపేర వేదము లచ్చుకట్టి
పైలముఖ్యుల శిష్యులఁ బడసి పొలిచె. 398

ఆ. అతఁడు పరమగుహ్యమైనయీభాగవ
తమ్ము నాకుఁ దెలిపె దానిమహిమ

మీవు వినఁగఁ గలిగి తేమందు నీపుణ్య
మింతి యనుచుఁ జెప్ప నేరి తరము. 399

వ. విక్రమంబునం జేసి భీష్ముండు స్వయంవరంబునఁ గాశీరాజపుత్రికలైన యంబికాంబాలికలం దెచ్చి విచిత్రవీర్యునకుం బెండ్లిచేసె నతండు స్త్రీలోలుండై క్షయరోగంబున నపుత్రకుండై మృతుం డయ్యె నప్పుడు సత్యవతి యుపదేశంబున వ్యాసుండు దేవరన్యాయంబున నంబికయందు ధృతరాష్ట్రు నంబాలికయందుఁ బాండురాజును దాసియందు విదురునిం బుట్టించె ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాదులు నూర్వురు పుత్రులు దుశ్శల యనునొక్క-కూఁతురుం బుట్టిరి పాండురాజు మునిశాపంబున సంతానంబు పుట్టింప నసమర్థుం డగుటం జేసి కుంతి వానియనుమతిఁ బడసి ధర్మానిలేంద్రుల నుపాసించి వారి యనుగ్రహంబున ధర్మరాజ భీమార్జునులం బడసె మాద్రి యశ్వినీదేవతలప్రసాదంబున నకులసహదేవులం గనియె ద్రౌపదియందుఁ బంచపాండవులకుం గ్రమముగాఁ బ్రతివింధ్య శ్రుతసేన శ్రుతకీర్తి శతానీక శ్రుతకర్ములను నేవురు పుట్టిరి వీ రందఱు నపుత్రకులై యుద్ధానంతర మశ్వత్థామచే హతులైరి మఱియు ధర్మరాజునకుఁ బౌరవియందు దేవకుఁడు భీమునకు హిడింబయందు ఘటోత్కచుఁడు కాళియందు సర్వగతుఁడును సహదేవునకు విజయయందు సుహోత్రుఁడు నకులునకుఁ గరేణుమతియందు నిరమిత్రుఁడునుం జనించిరి విజయున కులూపియందు నిరావంతుఁడు చిత్రాంగదయందు బభ్రువాహనుఁడు సుభద్రయందు నీతండ్రి యగు నభిమన్యుడుం బుట్టిరి మహాపరాక్రమశాలి యగు నభిమన్యునకు నీవు జన్మించితివి గురుశస్త్రాభిహతుఁడ వైననిన్ను గర్భంబునంద శ్రీకృష్ణుండు గాచి రక్షించె నిట్టినీకు జనమేజయుఁడు శ్రుతసేనుఁడు భీమసేనుఁడు నుగ్రసేనుఁ డనుసుతు లుదితులైరి వీరిలో జనమేజయుఁడు నీవు తక్షకునిచే మృతిఁ గాంచితి వని తెలిసికొని సర్పయాగ మొనర్చి సకలసర్పంబుల సంహరించు మఱియు నతండు

కాషవేయాధ్వర్యవంబున దిగ్విజయంబుచేసి బహుహయమేధము
లాచరించు వానిసుతుండు శతానీకుండు యాజ్ఞవల్క్యునివలన వేదం
బులును గృపాచార్యునివలన ధనుర్వేదంబును శౌనకునివలన నాత్మ
జ్ఞానంబు నభ్యసించి జగన్మాన్యుం డగు నాశతానీకునకు సహస్రా
నీకుండు వాని కశ్వమేధజుండు వాని కాసీమకృష్ణుండు వానికి నిచ
కుండు నుద్భవింతురు. హస్తినాపురము గంగానదిం జేరంగా నిచ
కుండు కౌశాంబిని రాజధానిగాం గొని రాజ్యంబు పాలించు నిచ
కునకు నుప్తుండు వానికిం జిత్రరథుండు వానికి శుచిరథుండు వానికి
వృష్టిమంతుండు వానికి సుషేణుండు వానికి సుకీథుండు వానికి నృచ
క్షువు వానికి సుఖాసిలుండు వానికిం బరిప్లవుండు వానికి సునయుండు
వానికి మేధావి వానికి నృపంజయుండు వానికి దూర్వుండు వానికి నిమి
వానికి బృహద్రథుండు వానికి సుదాసుం డాసుదాసునకు శతా
నీకుండు వానికి దుర్దమనుండు వానికి వహీనరుండు వానికి దండపాణి
వానికి మిత్రుండు వానికి క్షేమకుండు వానికి బ్రహ్మక్షత్రుండు
వాం డపుత్రికుండై దైవానుగ్రహంబున క్షేమకుం డనుసుతునిం గను.
అంతతో వానివంశ మంతరించును రాంబోవుమాగధరాజులం గూర్చి
చెప్పెద వినుము జరాసంధునకు సహదేవుండు వానికి మార్జారి
వానికి శ్రుతశ్రవుండు వాని కయుతాయువు వానికి నిరమిత్రుండు
వానికి సునక్షత్రుండు వానికి బృహత్సేనుండు వానికిం గర్మజిత్తు
వానికి శ్రుతంజయుండు వానికి విప్రుండు వానికి శుచి వానికి క్షేముండు
వానికి సువ్రతుండు వానికి ధర్మనేత్రుండు వానికి శ్రుతుండు వానికి
దృఢసేనుండు వానికి సుమతి సుమతికి సుబలుండు సుబలునకు సునీ
తుండు వానికి సత్యజిత్తు సత్యజిత్తునకు విశ్వజిత్తు విశ్వజిత్తునకుం
బురంజయుండు పుట్టి బార్హద్రథు లని ప్రసిద్ధి గాంతురు వీరివంశ
మొకవేయివత్సరంబు లుండి పిమ్మట నాశనం బగును. మఱియు
యయాతిచతుర్థసుతుం డగునను వునకు సభానరుండు చక్షువు పరోక్షుం

డనుముగ్గురు. సభానరునకుఁగాలనాదుఁడు వానికి సృంజయుఁడు వానికి పురంజయుఁడు వానికిజనమేజయుఁడు వానికిమహాశాలుఁడు వానికి మహామనసుఁడు వానికుశీనరుఁడ తితిక్షువనునిరువురుపుత్రులు. ఉశీనరునకు శిబి వనుఁడు క్రిమి దర్పుఁడు నను నలుగురు. వారిలో శిబికి వృషదర్పుఁడు సువీరుఁడు మద్రుఁడు కేకయుఁడు నను నలుగురు సుతులు ఉశీనరునిసోదరుఁ డగుతితిక్షువునకు రుశద్రథుఁడు వానికి హేముఁడు వానికి సుతపుఁడు వానికి బలి బలి కంగుఁడు వంగుఁడు కళింగుఁడు సింహుఁడు పుండ్రుఁడు ఆంధ్రుఁడు ననునార్వురు సుతులు వారు తమ తమ పేళ్ళతో దేశములు నిర్మించి పాలించిరి. వారిలో నంగునకు ననుమంతుఁడు వానికి హవిరథుఁడు వానికి ధర్మరతుఁడు వానికిఁ జిత్రరథుఁడు. ఆచిత్రరథునకే రోమపాదుఁ డనునామాంతరము గలుగు. అతనికి మిత్రుఁ డగుదశరథుఁడు శాంతయను తన కూఁతు సంతతిగా నిచ్చెను రోమపాదుఁడు శాంతను ఋష్యశృంగున కిచ్చి పెండ్లి చేసెఁ దదనుగ్రహమున రోమపాదుఁడును దశరథుఁడును పుత్రవంతు లైరి రోమపాదునకుఁ జతురంగుఁడు వానికిఁ బృథులాక్షుఁడు వానికి బృహద్రథుఁడు బృహత్కర్ముఁడు బృహద్భానుఁ డనుముగ్గురు జన్మించిరి. బృహద్రథునకు బృహన్మలుఁడు వానికి జయద్రథుఁడు వానికి సంభూతి యందు విజయుఁడు విజయునకు ధృతి ధృతికి ధృతవ్రతుఁడు వానికి సత్యకర్ముఁడు వాని కధిరథుఁడు అతఁ డనపత్యుఁ డై కన్య యైనకుంతి నదిలోఁ బడ వైచినవానిం దెచ్చి పెంచుకొనియె నతఁడు కర్ణుం డనం బరఁగె నతనికి వృషసేనుఁడు సంభవించె నిఁక యయాతితృతీయపుత్రుం డగుద్రుహ్యునిసంతతి వినుము. ద్రుహ్యునకు బభ్రువు వానికి సేతువు వాని కారబ్ధుఁడు వానికి గాంధారుఁడు వానికి ఘర్మ్ముఁడు వానికి ఘృతుఁడు వానికి దుర్మదుఁడు వానికిం బ్రచేతసుఁడు వానికి నూర్వురు సుతు లుద్భవించిరి వారందఱు నుత్తర దేశము నాశ్రయించి మ్లేచ్ఛాధిపతు లైరి

యయాతి ద్వితీయపుత్రుఁ డగుతుర్వసునకు వహ్ని వానికి భర్గుఁడు వానికి భానుమంతుఁడు వానికిఁ ద్రిసానుఁడు వానికిఁ గరంధముఁడు వానికి మరుత్తు పుట్టెరి మరు త్తపుత్రకుండై పూరువంశజుఁ డైనదుష్యంతునిఁ బుత్రునిఁగా స్వీకరించెను యయాతికిఁ జ్యేష్ఠపుత్రుఁడు యదువు. 400

—♦ య దు వం శ చ రి త్ర ము ♦—

మ. యదువంశంబున సర్వలోకవిభుఁడై హర్షోంది శ్రీకృష్ణుఁ డ
భ్యుదయం బందెను గాన లోకములలో నొప్పారువంశంబునన్
యదువంశంబె పవిత్రమై దురితసంహారంబు గావించు న
య్యది వర్ణించెద నాలకింపు మని వ్యాసాత్మోద్భవుం డి ట్లనన్. 401

వ. ఆకర్ణింపు మాయదువునకు సహస్రజిత్తు క్రోష్టువు నలుఁడు రిపుఁడు నను నలువు రుదయించిరి సహస్రజిత్తునకు శతజిత్తు వానికి మహాహయుఁడు వేణుహయుఁడు హేహయుఁడు నను మువ్వురు సుతులు జనించిరి హేహయునకు ధర్ముఁడు ధర్మునకుఁ గుంతి యను నామాంతరము గలనేత్రుఁడు వానికి సోభంజి సోభంజికి మహిష్మంతుఁడు మహిష్మంతునకు భద్రసేనుఁడు భద్రసేనునకు దుర్మదుఁడు ధనికుఁడు నను నిర్వురు గల్గి రందు ధనికునకుఁ గృతవీర్యుఁడు కృతాగ్ని కృతవర్మ కృతౌజసుఁడు నను కొడుకులు పుట్టిరి కృతవీర్యున కర్జునుండు జన్మించె నాకర్ణింపుము. 402

సీ. అతఁ డేడుదీవుల కధిపతియై ఘనుఁ
డైనదత్తాత్రేయు నాశ్రయించి
యణిమాదిసిద్ధుల నందినై యాగముల్
దానధర్మంబులు దవిలి నడిపి
తనసాటియై వేఱు ధరణి లే రనునట్టి
యశ మంది యప్రతిహతగతుఁ డయి
కార్తవీర్యుం డనుఘనత కై యెనుబది
యైదు వేలేడులు నవని యేలి

తే. సకలసంపదలను బొంది సుకులుఁ డగుచు
విషయసుఖముల నందుచు వేఁగురఁ గనె
నందులో నైదుగురు తిప్ప నవలివార
లందఱును భార్గవునిచేత నాజిఁ దెగిరి. 403

వ. జీవించినవారు జయధ్వజుఁడు శూరసేనుఁడు వృషణుఁడు మధుఁడు నూర్జితుఁడు ననువారు వారిలో జయధ్వజునకుఁ దాళజంఘుఁడు వానికి నూర్వురు కొమారు లుద్భవించి వారందఱు నౌర్వుఁ డను ముని తేజమున నశించిరి వారిలో జ్యేష్ఠుండు వీతిహోత్రుఁ డనువానికి మధువు మధువునకు వృష్ణుఁడు మొదలగు నూర్వురు సుతులు పుట్టిరి వారు మాధవు లనియు వృష్ణు లనియు యాదవు లనియు వాసి గాంచిరి యదుసుతుఁ డగుక్రోష్టువునకు వృజినవంతుఁడు వానికి శ్వాహితుఁడు వానికి భేరుశేకుఁడు వానికిఁ జిత్రరథుఁడు వానికి శశిబిందువు వానికిఁ బదివేగురు భార్యలు గలరు వారియం దాతనికిఁ బదివేలలక్షలపుత్రులు పుట్టి రందుఁ బృథుశ్రవుఁడు మొదలగు వా రార్వురు ప్రధానులు వారిలో ధర్ముఁడనువానికి నుశనుఁ డుదయించె. అతఁడు నూఱశ్వమేధములు చేసె వానికి రుచికుఁడు వానికిఁ బురుజిత్తు ద్రుముఁడు రుక్మేషుఁడు పృథుఁడు జ్యామఘుఁడు ననునేవురు పుత్రులు పుట్టిరి. 404

క. జ్యామఘుఁడు శైబ్య యనియెడు
చామం బెండ్లాడి తనకు సంతతి లేమిన్
గోమలి వేఱొకభార్యం
బ్రేమింపఁడు శైబ్య వలని భీతున వింటే. 405

గీ. అట్టు లుండినకాలమం దతఁ డొకప్డు
శత్రువుల గెల్చి వారింట సౌమునిఁాఱు
కన్యకం దెచ్చి పెండ్లాడఁ గాఁ దలంచె
దానిఁ గని శైబ్య కోపము తావ మెసఁగ. 406

శా. ఓరీ వంచక యెట్లు తెచ్చితివి నీయున్మత్త మత్తుండ వై
తీరెక్ నీఖుణ మింకఁ బొ మ్మనుచు నార్తిం బల్కఁగా జ్యామఘుం

డీరాజీవదళాక్షి కోడ లగు నీ కీ విట్లు ఘూర్ణించుచుం
దూరంగా దగునే జనించెడిని బుత్రుం డింతలో నీ కోర్కెన్. 407

వ. అని భార్య నోదార్చి ధరాకాంతుండు విశ్వేదేవతలయుఁ బితరులయు ననుగ్రహంబు గలిగికొని శైబ్యయందు పుత్రునిం గనియె నతండు విదర్భుఁ డనునామధేయంబు నొంది పితానీతకన్యం బెండ్లియాడె నావిదర్భున కాభార్యయందుఁ గుశుఁడు క్రథుఁడు రోమపాదుఁడు ననుమువ్వురు కొడుకులు పొడమిరి రోమపాదునకు బభ్రువు వానికిఁ గృతి వానికిఁ గుశికుఁడు వానికిఁ జేది వానికిఁ జైద్యుఁడు లోనగు వారు పెక్కు రుదయించిరి విదర్భకునికొడు కగుక్రథునకుఁ గుంతి వానికి ధృష్టి వానికి నిర్వృతి వానికి దశార్హుఁడు వానికి వ్యోముఁడు వానికి జీమూతుఁడు వానికి వికృతి వానికిఁ భీమరథుఁడు వానికి నవరథుఁడు వానికి దశరథుఁడు వానికి శకుని వానికిఁ గుంతి వానికి దేవరాతుఁడు వానికి దేవక్షత్రుఁడు వానికి మధువు వానికిఁ గురు వశుఁడు వానికిఁ ననుఁడు వానికిఁ బురుహోత్రుఁడు వానికి నంశుఁడు వానికి సాత్వతుఁడు సాత్వతునకు భజమానుఁడు భజి దివ్యుఁడు వృష్ణి దేవావృధుఁడు నంధకుఁడు మహాభోజుఁడు ననునేడ్వురు సుతులు పుట్టిరి వారిలో భజమానున కొక భార్యయందు నిమ్రోచి కంకణుఁడు వృష్ణి యనుమువ్వురు వేఱొకభార్యయందు శతజిత్తుసహస్రజిత్తు నయుతజిత్తు ననువారుమువ్వురు దేవావృధుఁడనువానికి బభ్రు వనుపుత్రుండు పుట్టె.

తే. జనకునియు బుత్రులయు మహిమను దెలుపుచు
ముజ్జగంబులవారలు పొగడుచుండ్రు
వారివంశమునం దైదవారు పదియు
నాల్గువే లర్వదేగులు నలువుపడిరి. 409

వ. సాత్వతికొడు కగుమహాభోజుఁ డతిధర్మాత్ముఁ డతనికి భోజు లను నృపులు పుట్టిరి. వృష్ణికి సుమిత్రి యుధాజిత్తు లనువారు జన్మించిరి. యుధాజిత్తునకు శిసియు ననమిత్రుఁడు ననువా రైరి వారిలో నన

మిత్రునకు నిమ్నుఁడు నిమ్నునకు సత్రాజిత్తు ప్రసేనుఁ డనువారు గల్గిరి. అనమిత్రునకు శినియను వేఱొకసుతుండు కలఁడు శినికి సత్యకుఁడు వానికి యుయుధానుఁడు వానికి జయుఁడు వానికిఁ గుణి వానికి యుగంధరుఁడు ప్రభవించిరి మఱియు ననమిత్రునకు పృశ్ని యను మఱియొకతనయుండు కలఁడు వానికి శ్వఫల్కుఁడు చిత్రకుఁడను నిద్దఱుపుత్రులు శ్వఫల్కునకు గాందిని యనుభార్యయందు నక్రూరుఁడు నసంగుఁడు సారమేయుఁడు మృదుకుఁడు మృదుపచ్ఛివుఁడు వర్మదృక్కు ధృష్టవర్ముఁడు క్షత్రోపేక్షుఁడు అరిమర్దనుఁడు శత్రుఘ్నుఁడు గంధమాదుఁడు ప్రతిబాహుఁడు ననుపన్నిద్దఱు పుత్రులు వారికి సుచార యనునొక్కతోఁడబుట్టువు కల దక్రూరునకు దేవలుఁడు ననుపదేవుఁడు ననుసుతు లిర్వురు ఉరుశంకునికుమారుఁ డగు చిత్రరథునకు పృథువు విదూరథుఁడు మొదలగువారు పెక్కురు సుతులు సాత్వతునిసుతుం డగువృష్ణికిఁ గుకురుఁడు భజమానుఁడు శుచి కంబళబర్హిషుఁడు ననువారు పుట్టిరి యందుఁ గుకురునకు వృష్ణి వానికి విలోముఁడు వానికిఁ గపోతరోముఁడు పుట్టిరి సాత్వతునిసుతుఁ డగు నంధకునకు దుందుభి వానికి దవిద్యోతుఁడు వానికిఁ బునర్వసుఁడు వానికాహుకుం డనుసుతుండును నాహుకి యనుసుతయు నుద్భవించిరి ఆహుకునకు దేవకుఁడు నుగ్రసేనుఁడు ననుతనయు లందు దేవకునకు దేవలుఁడు ననుపదేవుఁడు సుదేవుఁడు దేవవర్ధనుఁడు ననునల్గురుకుమారులు వారికి ధృతదేవ శాంతిదేవ ఉపదేవ శ్రీదేవ దేవరక్షిత సహదేవ దేవకి యనునేడ్వురు తోఁడంబుట్టువులు గలరు వారి నెల్ల వసుదేవుఁడు పరిగ్రహించె నుగ్రసేనునకుఁ గంసుఁడు సునాముఁడు న్యగ్రోధుఁడు కహ్వుఁడు శంకుఁడు సుభువు రాష్ట్రపాలుఁడు విసృష్టుఁడు తుష్టిమంతుఁడు ననుతొమ్మండ్రుకొడుకులును గంసయుఁ గంసవతియుఁ గంకయుఁ సురాభువు రాష్ట్రపాలిక యనునేవురుకూఁతులును బ్రభవించిరి. వారిని వసుదేవుసోదరులు దేవభాగాదులు వరించిరి భజమానుని

తనూజుఁ డగువిదూరథునకు శూరుండు పుట్టె శూరునకు శిని వానికి స్వయంభోజుఁడు వానికి హృదికుఁడు వానికి దేవమీఢుఁడు శతధనువు కృతవర్మ యను మువ్వురుసుతులు దేవమీఢునిసుతుఁ డగుశూరునకు మారిష యనుపత్నియందు వసుదేవుఁడు దేవభాగుఁడు దేవశ్రవుఁడు నానకుఁడు సృంజయుఁడు శ్యామకుఁడు గంకుఁడు నసీకుఁడు వత్సకుఁడు వృకుఁడు ననుపదుగురు పుత్రులును బృథ శ్రుతదేవ శ్రుతకీర్తి శ్రుతశ్రవస రాజాధిదేవి యనుపుత్రిక లేవురు పుట్టిరి వసుదేవుఁడు పుట్టినకాలంబున నానకదుందుభులు మింట మ్రోయుటం జేసి యతం డానకదుందుభి యని పిలువం బడె. 410

సీ. వసుదేవజనకుఁడై వఱలు శూరుఁడు తన
కుం జెలికాఁ డగుకుంతిభోజు
డనపత్యుఁ డగుట నాతనికిఁ బెంచుకొనఁగఁ బృ
థాదేవిఁ బుత్రిగాఁ దనరఁజేసె
దాన నాపృథకుఁ గుంతీనామ మలవడెఁ
గుంతి దుర్వాసుని కూర్మివలన
దేవహూతి యనఁగ దీపించునొకవిద్యఁ
బడసి పరీక్షింప నెడఁ దలంచి

తే. నర్కునిం బిల్చి యతఁడు ప్రత్యక్షమైన
నక్షతం జేసి పిలిచితి నాదరించి
నను క్షమింపు మటన్న నాథుఁడు కుంతి
భోజపుత్రికతో నసెఁ గోర్కెఁ జేసి. 411

ఉ. ఓవనితామతల్లి! నను నొయ్యనఁ బిల్చితి వచ్చి రిత్తగాఁ
బోవుట లెప్పుడుం గలుగఁ బో దిది దైవతకార్యమై తగుం
గావున దేవతుల్యుఁ డయిక్రాలెడుపుత్రుని నీ కొసంగెదన్
నావలనన్ బ్రవాద మగు నన్ భయమీఁగుము లోఁగ కీమెదన్.

వ. అని వివస్వంతుండు కుంతి నొడంబడం జేసి నామెతోడం గూడి పోయె
నంతలో నపరసూర్యుండు నా నుపమింపం దగుపుత్రుండు పుట్టినఁ

గుంతి లోకాపవాదభయంబున వాని నొక్కమంజసంబునం బెట్టి నదీ
ప్రవాహంబున విడిచె నాకుంతియే నీప్రపితామహుం డగుపాండు
రాజునకుం బత్ని యయ్యెం గుంతిసోదరి యగుశ్రుతదేవను గారూష
కుమారుం డగువృద్ధశర్మ పరిగ్రహించె నాదంపతులకు మునిశాపంబున
దంతవక్త్రుం డను దైత్యుండు జన్మించె శ్రుతదేవసోదరి యగుశ్రుతకీర్తి నిం
గేకయుం డగుధృష్టకేతుండు పెండ్లియాడి యామెయందుం బ్రతర్దనుండు
లోనగు నేవురసుతులం గనియె రాజాధిదేవిని జయత్సేనుండు వరించి
విందానువిందులం గనియె శ్రుతశ్రవసను దమఘోషుం డను చేదిరాజు
పరిణయమై శిశుపాలుం గనియె వసుదేవునిసోదరుం డగు దేవభాగునకుం
గంసయందుం జిత్రకేతు బృహద్బలులు పుట్టిరి దేవశ్రవునకుం గంస
వతియందు సువీరుండు నిషుమంతుండు నుదయించిరి వారిసోదరుం డైన
కంకునకుం గంక యనుభార్యయందు బకుండు సత్యజిత్తు పురుజిత్తుండు
పుట్టిరి వానితమ్ముం డగుసృంజయునకు రాష్ట్రపాలియందు వృష దుర్మ
ర్షణాదులు జనించిరి వానిసోదరుం డైనశ్యామకునకు సురభూమి
యను నాలియందు హరికేశుండు హిరణ్యాక్షుండునుం బుట్టిరి వత్స
నకు మిశ్రకేసి యను నచ్చరయందు వృకాదులు జనించిరి వానిసోదరుం
డగువృకునకు దూర్వాక్షి యనుపద్మాక్షియందుం దక్ష పుష్కర
శాల్వాదు లుద్భవించిరి వానియనుజుం డగు నసీకుండు సుదామనియందు
సుమిత్రానీక బాణ ప్రభృతు లగుపుత్రులం గనియె వానిసహజుం
డగు నానకుండు కర్ణిక యనుదానియందు ఋతధామ జయులం గనియె
వసుదేవునికిం బౌరవి రోహిణి భద్ర మదిర రోచన యిళ దేవకి యను
నేడ్వురు సహధర్మచారిణులు వారిలో రోహిణియందు బలరాముండు
గదుండు సారణుండు దుర్మదుండు విపులుండు ధ్రువుండు కృతుండు
నుద్భవించిరి పౌరవియందు సుభద్రుండు భద్రబాహుండు దుర్మదుండు
భద్రుండు భూతాదు లగుపన్నిద్దఱుం జనించిరి మదిరయందు నందుండు
నుపనందుండు కృతకుండు శూరుండు లోనగువారు పుట్టిరి కౌసల్యయను

భద్రయందుఁ గేశినుఁ డనువాఁ డుదయించె. రోచనయందు హస్తుఁడు హేమాంగదుఁడు లోనగువారు జనించిరి ఇలయం దురువల్కాదులు పుట్టిరి మఱియు వసుదేవునకు ధృతదేవ యను దేవియందుఁ ద్రిపృష్టుఁడు శాంతిదేవయందుఁ బ్రశముఁడు ప్రశ్రితుఁడు లోనగువారు నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదు లగువదుగురుకుమారులును శ్రీదేవయందు వసుఁడు హంసుఁడు సుధన్వుఁడు లోనగునార్వురు సుతులును దేవరక్షితయందు గదాదు లగు నెనమండ్రు పుత్రులును సహదేవయందు శ్రుతముఖాదు లగు నెనమండ్రు సుతులును దేవకియందుఁ దీప్తిమంతుండు సుషేణుఁడు భద్రసేనుఁడు ఋజువు సమదనుఁడు భద్రుండు సంకర్షణుండు జనించిరి మఱియు నాదేవకీదేవియందు నారాయణావతారం బగుశ్రీకృష్ణుండును సుభద్రయు నుద్భవించి రా సుభద్రయే నీకుఁ బితామహి యయ్యె. 413

ఉ. లోక మధర్మమార్గములలోఁ బడినప్పుడు విష్ణుమూర్తి ధ
ర్మైకపరాయణుం డగుచు నార్యులఁ బ్రోవగ నుద్భవించు న
వ్వాకునఁ జేసి కృష్ణుఁడు జనార్దనునంశముఁ గల్గి పాల్చె నీ
శ్రీకర మైనవంశమును జెప్పగఁ నేటికిఁ దన్మహాత్మ్యముల్ 414

సీ. రామకృష్ణాదు లీభూమి నవతరించు
టారయు లోకావనార్థ మగును
నరులకుఁ దద్దర్శనమునఁ బాపక్షయ
మగును దచ్చేష్టిత మరసి కొనఁగ
బ్రహ్మాదులకు నేని పలుక నశక్యంబు
భక్తులఁ బ్రోవ నిబ్బంగి నయిరి
పుణ్యతీర్థము లట్లు పూజ్యావతారల.
కీర్తి లోకమునందుఁ గ్రేళ్లుదాఁటు
గీ. రామకృష్ణు లొనర్చినరమ్యచేష్టి
తములు సర్వప్రపంచసంతతసుకీర్త

నీయము లమానుషంబులు వేయుఁ నేల
వాని స్మరియింప జనులకు నౌను ముక్తి. 415

వ. అందుఁ గృష్ణుండు పెక్కురం బెండ్లియాడి వారిలో నొక్కొక్కత
యందు నూర్వురేసి పుత్రులం బడసి లోకము నిజాజ్ఞానుసారమున
నడపి యెల్లవారిపూజలం బడసె నింతియ కాక యతండు కురుపాం
డవసంగరంబున దుష్టపార్థివులం గూల్చి భూభార ముడిగించి మీ
తాత యగువిజయునకు విజయ మిచ్చి యుద్ధవాదులకుఁ దత్త్వ ముప
దేశించి శేషావతారం బగుబలరామునితో వైకుంఠంబున కరిగె. 416

క. అని చెప్పె ననుచుఁ జెప్పిన
విని శౌనకముఖ్యు లవలివృత్తాంతంబుల్
వినిపింపు మనుచు నడిగిరి
వినువేడుక క్రేళ్లుమీఱ వినయముతోడన్. 417

నవమస్కంధాంతము.

ఉ. సాగికొలంపుమానికము సజ్జనశీర్షవిభూషణంబు భా
షాగుణగుంఫితంబు విలసన్నృపసాగరసంభవంబు ది
వ్యాగమవర్ణనీయము ననర్ఘము సూర్యకులాభిమాన్యయంబు తే
జోగరిమంబున న్వెలయుచుం జనసమ్మత మై తలిర్చుతన్. 418

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
నవమ స్కంధము.

శ్రీ శ్రీ శ్రీ

—:0:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## దశమస్కంధము

### ప్రథమాశ్వాసము

—:o:—

క. శ్రీకృష్ణభక్తుఁ డగుటన్
శ్రీకృష్ణునిభాగవతముఁ జేకొని కృతిగా
శ్రీకృష్ణభవనమందున్
శ్రీకృష్ణునిఁ గొలుచురాజశేఖరుఁ డలరున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు చెప్పినశుక
యోగీంద్రుం గని పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 2

ఉ. చెప్పితి సోమసూర్యకులశేఖరవంశసమృద్ధి యంతయున్
జెప్పినచొప్పునన్ నృపులచిత్రచరిత్రము లాలకించితిన్
జెప్పుము యాదవాన్వయ మశేషవిశేషము లుప్పతిల్ల నం
దప్పురుషోత్తమాంశమున నైనగదాగ్రజువీర్యచర్యలన్. 3

చ. విన మన మయ్యె నట్లు ప్రభవించినకృష్ణుఁడు భూతలంబునన్
బొనరిచినట్టి కార్యములు పోడిమిమై నెఱిఁగింపు మవ్వి స
జ్జనవరగీయమానములు సంసృతిభేషజముల్ శ్రుతీష్టధా
ర్థసిధు లెవండు కాదను ధరం బశుతుల్యుఁడు వాఁ డెఱుంగఁగన్. 4

చ. సురల కజయ్యు లైననదిసూనుముఖాతిరథుల్ తిమింగిలో
త్కర మయి యుండ దాఁటుటకుఁ గానిగురుధ్వజినీమహాంబుధిన్
దురమున మత్పితామహులు దూడపదంబును బోలె నేయదూ
త్తరుఁ డనునావ సాయమున దాఁటిరొ వానిచరిత్ర మొప్పెదున్. 5

చ. శరణము వేఁడ మాజనని చక్రము చేకొని బొజ్జలోపలన్
గురుతనయాస్త్రదగ్ధ మయి కూలినన్ గురుపాండవాన్వయాం

కురమును గాచె నెల్ల వ్రజకుల్ బహిరంతరవర్తియై మూర్తిన్
బరము నొసంగునాపరికృతిభావుని నే శరణంబు వేడెదన్. 6

సీ. మునినాథ! చెప్పితి మును రోహిణీసుతుం
డల్లసంకర్షణుం డని యతనికి
దేహాంతరము లేక దేవకీగర్భసం
బంధ మెట్లయ్యె నాపరమపురుషుం
డైనకృష్ణుండు పితృనావాసముననుండి
చనె నేకతమున వ్రజంబునకును
వ్రజమునందును మధురాపురంబున నుండి
యేమి చేసెను గంసు నేల చంపెఁ
తే. బుడమి నెన్నేండ్లు నివసించెఁ బొలఁతు లెంద
ఱవ్విభున కెల్లవిన నెంతు ననఘమూర్తి!
శ్రద్ధధానుఁడ నగునాకు సర్వ మిపుడు
తెలుపు మన నాతఁ డిట్లని తెలుపఁ దొడఁగె. 7

ఆ. సదమలాత్మ! నీకు సద్బుద్ధి జనియించె
విష్ణుదేవుకథలు వినుటఁ జేసి
గంగ వోలె విష్ణుకథ పునీతులఁ జేయు
నడుగఁ జెప్ప వినఁగ నైనవారి. 8

శా. మున్నీభూసతి దుష్టరాక్షసచయంబుల్ కోట్లునై మేటులై
యున్నన్ భారము సైప లేసిదయి యెంతో దుఃఖపూరంబునన్
గన్నీరొట్టుచు ధేనురూపమున నక్కంజోద్భవుం జేరి త
ద్దైన్యత్వం బది విన్నవించిన నతం డాలించి తత్సర్వముల్. 9

వ. భూదేవితోడ దేవతలం దోడఁ బెట్టుకొని సహసాలియై పాలవెల్లిగట్టు
నకుం జని పురుషసూక్తంబునం జేసి జగన్నాథుం డైనవాసుదేవుం బ్రస్తు
తించుచుం బరమసమాధినున్నంతనంతరిక్షంబునుండి నశరీరవాక్యొండు
విన వచ్చిన మెచ్చి వియచ్చరులం గాంచి విను మని యిట్లనియె. 10

క. మనవిజ్ఞాపనమునకున్
మునుమున్న రమాధవుండు భూసంతాపం
బు నెఱింగి భారహరణం
బునకై జతనించుచుండెఁ బుట్టి జగమునన్. 11

సీ. వసుదేవగృహమున వసుధాస్థలిన్ వాసు
దేవుఁ డవతరించు దేవవర్యు
లంశములం గొని యదువంశమునఁ బుట్టుఁ
డమరాంగనలును హర్యర్చపొంటె
జన్మింపుఁ డీశ్వరాంశజుఁ డనంతుండును
హరికి నగ్రజుఁడగు నంద యగుచు
జగము మోహింపఁ జేయఁగఁ జాలుహరిమాయ
ప్రభ్వాజ్ఞఁ బుట్టుఁ గార్యము లొనర్ప

తే. అనుచు నాదేశ మొనరించి యబ్జభవుఁడు
ధరణి నూరార్చి దేవళ్ళఁ దరలఁ బుచ్చి
తన్ను బ్రహ్మర్షిసంఘముల్ తవిలి కొలువఁ
దరలిపోయెను నిజసత్యధామమునకు. 12

వ. అనంతరకాలంబున. 13

ఆ. శూరసేనుఁ డనెడుశూరుండు యదుపతి
ధరణి మధుర యనెడుపురము రాజ
ధాని గాఁగ నుండి తగ నేలె మాధుర
ములును శూరసేనములును దొల్లి. 14

—♦ వసుదేవుఁడు పెండ్లియాడి భార్యతో బయలుదేరి వచ్చుట ♦—

ఉ. ఆపురి శూరసేనసుతుఁ డావసుదేవుఁడు దేవకీసతిన్
రూపవినిర్జితామరినిఁ గ్రొత్తగఁ బెండ్లియాడి యన్నవో
ఢాపతిదేవతం గొని స్ఫుటంబుగ వైభవ మేర్పడన్ నిజం
బౌపురముం జనంగ రథమందుఁ బ్రయాణ మొనర్చెఁ బేర్చుచున్.

♦ నవోఢ=క్రొత్తగాఁ బెండ్లాడినది; పతిదేవత=పతివ్రత; పేర్చు=అతిశయించు.

ఆ. ఉగ్రసేనతనయుఁ డుగ్రుఁడు కంసుండు
తనదుభగినిమీఁదఁ దనరుప్రీతి
రశ్ము లను వహించి రథ్యములం దోలు
నట్టిఁడయ్యె రథశతాన్వితుఁ డయి. 16

సీ. అపుడు దేవకితండ్రి యగు దేవకుఁడు కూఁతు
మీఁది ప్రేమం జేసి మిసిమి నొసఁగు
నన్నూరుగజములు నలువుమీఱెడుతురం
గములు పదేను వేల్ కొమరుమిగులు
నరదముల్ పదునెన్మి దగుశతంబులు సుకు
మారులౌ దాసు లిన్నూరుగురును
బారిబర్హము గాఁగఁ గోరికమెయి నిచ్చె
శంఖమృదంగముల్ సతము మొరయ

తే. వసుఁడువధు వప్డు పరమోత్సవంబు ప్రబలఁ
బయనమై పోవునప్పు డయ్యయనమందుఁ
బయలివాకయ్యెఁ గంసునిఁ బలుకరించి
దీనియష్టమగర్భము ద్రెంపు నిన్ను. 17

చ. అనుడు ఖలుండు పాపుఁ డగునాతఁడు భోజకులాధముం డెదన్
దనదుసహోదరిం దునుమఁ దాఁ దలపోయుచు ఖడ్గధారియై
కొనకొని కొప్పు వట్టుకొనఁ గ్రూరకిరాతుని వాని నట్టి క
న్గొని వసుదేవుఁ డిట్లనియె నూల్కొని సాంత్వనపూర్వకంబుగన్.

మ. అయయో నీ విటు లాచరించుటలు బావా! తప్పుగా నెంచవో
బయ లేమో వచియించె నన్న మిష నీభంగిన్ భవత్సోదరిన్
దయ లేకిట్లు వధింపఁ బూనెద వెదం దన్నామరూపంబు లే
వియు లేనట్టినుడుల్ నిజంబు లనుచున్ విశ్వాసమున్ జేయుచున్.

ఉ. చెల్లెలి కన్న యెల్లపుఁడు చీరల లిచ్చును మాడ లిచ్చు మేల్
మళ్ళను నిచ్చు ప్రేముడిని మన్నన లిచ్చును గాని నీవలెన్

ద్రెళ్ళఁగఁ జేయఁ జూచు నఁట తెంపరివై యిటు కాకు మన్న నీ
యుల్లములోన నక్కటిక యొప్పఁగఁ జేయఁ గదన్న మ్రొక్కెదన్.
వ. అని మఱియును. 21

—♦ వసుదేవుఁడు కంసు ననునయించుట ♦—

శా. నీతోఁ బుట్టువు ముద్దరా లెఱుఁగ దేనేరంబు నెల్లప్డు నిన్
జేతోమోదమునం దలంచుచును నీసేమంబె చింతించుచున్
బ్రీతిన్ నీపయి నిల్పుచున్ మెలఁగు నీనిర్దోషురాలిన్ నవో
ఢాతన్వంగిని దీని జంపినను గూడ న్వచ్చు దోషం బయో. 22
తే. క్రొత్తగాఁ బెండ్లియాడి యీకోమ్మ మిన్న
పసపుబట్టలతో నత్తవారియింటి
కుత్సవముతోడ నరుగుచు నున్నదన్న
దీనిఁ దెగనేయుటల్ పాడి యౌనె? ననుదువె. 23
ఉ. పుట్టుకతోడనే మృతియుఁ బుట్టినదే యగు దేహధారికిన్
బెట్టె విధాత యి ట్లిపుడో వేఱొకయప్పుడో నూఱునేండ్లకో
గిట్టక పోరు మానవులు గిట్టి స్వకర్మము పేర్మి వెండియున్
బుట్టుచునుండ్రు పూర్వతనువుం ద్యజియించిన వారలై ధరన్. 24
తే. కర్మచోదితుఁడై ప్రాణికాయము చెడ
నొండుకాయము గైకొను నొక్కనాఁడు
కర్మమును దాఁటి పోవఁగాఁ గలుగఁ డెపుడు
కర్మమే యెల్లవానికిఁ గారణంబు. 25
క. కావునఁ దనకర్మమునకు
నేవాఁడును దలఁక వలయునే కాని యొరుల్
కావత్తు రనుచు వారికిఁ
జావున్ గలిగింపఁ బూనఁ జనునే చెపుమా. 26
ఆ. ఓయి దీనవత్సలా! యీపె నీపిన
తండ్రికూఁతు రైనఁ దలఁప నీకుఁ

దోడఁబుట్టు వయ్యుఁ దోఁచుఁ బుత్రిక వోలెఁ
గనుచు గావు మన్న తునుమ కన్న. 27

వ. అని యనేకవిధంబుల సామభేదోపాయంబుల నొప్పఁ జెప్పినం జెవి యొగ్గి వినక పురుషాదానువ్రతుం డగుకంసుండు నిజోద్యమంబునుండి నివర్తింపమిం దెలిసి యతం డిప్పటి యియ్యుపాయంబున కుపాయం బె ట్లని తలంచి యె ట్లయినం జెప్పి యిప్పడంతికి మృత్యువుం దప్పింప నొప్పు నని. 28

క. పుట్టినపుత్రులు గిట్టని
యట్టిర యల్లైన మృత్యు వగు నీతని కీ
నిట్టియెడ బాస సేయుదు
నెట్టగునో యవలికాల మీక్షింప నగున్. 29

వ. అని నిశ్చయించి వసుదేవుండు దోలాయమానమానసుం డైనను మందహాససుందరవదనారవిందుం డై హింసకుం డగు కంసునిం గాంచి బహుమానపురస్సరంబుగ ననునయించుచు ని ట్లనియె. 30

ఉ. శ్యాలక! నీకు నింగినుడి సత్యమ యైన భయంబు గల్గుటల్
పోలఁగఁ జూడ నీగరితమూలము గాదు భవిష్యకాలమం
దీలలనాశిరోమణికి నేర్పడుసంతతి మూల మాట నే
పోలిచి నీ కొసంగెదను బుట్టినవారిని బుట్టినట్లు గన్. 31

తే. అని వచించిన కంసుఁ డయ్యర్థ మెఱిఁగి
చెలియలిం జంపుపని మాని తొలఁగి చనియెఁ
బ్రీతుఁ డై వసుదేవుఁ డారీతి కెంచి
తనదుగృహమునకుం బోయెఁ దరుణితోడ. 32

ఆ. అవలికాలమందు నాదేవకీదేవి
కేటి కొకఁడు గాఁగ నిరువలువురు
సుతులు మఱియు నొక్కసుతఁ గాంచెఁ దన కల్ల
దేవుఁడే గతి యని తెలిసికొనుచు. 33

క. ఆనకదుందుభి సత్యవ
చోనియతిం దలఁక కొడుకుం గంసునకుం
దా నిచ్చెఁ గీర్తిమంతుఁడు
నా నొప్పెడు వానిఁ గైకొనం దగు ననుచున్. 34

—♦ వసుదేవుఁడు మొదటికొడుకును గంసునకు జంపనిచ్చుట ♦—

తే. సాధులకు దుస్సహము లేదు జ్ఞానులకు న
పేక్షితము లేదు కృపణుల కిల నకార్య
మనునదియు లేదు లేదు ధృతాత్ములకును
విడువరానిది గావున విడిచె సుతుని. 35

వ. కంసుండు వానిసత్యసంధతకు మెచ్చి సంతసించుచు ని ట్లనియె. 36

సీ. మీయెన్మిదవగర్భమే నాకు మృత్యువు
నీతనివలన నా కింత భయము
తొడరఁ బోవదు గానఁ దోడికొని పొ మ్మన
నానకదుందుభి యట్లు చేసి
యవిజితాత్ముం డగు నాకంసునుదులకు
సంతసింపక యుండె స్వాంతమందు
నంతలో నారదుం డగుదెంచి యొక్కనాఁ
డాకంసుఁ డాలింప ననియె నిట్లు

తే. వ్రజమునందు నందాదులు వారిసతులు
యాదవులు వసుదేవుఁ డాది గాఁగఁ
గలుగువారును వారిభార్యలును దేవ
తాంశసంభూతు లని తెలియంగ వలయు. 37

తే. కంసుఁడును వానియాశ్రితుల్ జ్ఞాతులు సుహృ
దులును బందుగుల్ లోనైనదుష్టు లెల్ల
నసురు లవ్వారివధకుఁ బ్రయత్నములును
జరుగుచుండుట వచియించి చనియె మౌని. 38

—♦ కంసుఁడు దేవకీవసుదేవులఁ గారాగారంబునం బెట్టుట ♦—

వ. అంతఁ గంసుండును యాదవు లందఱు బృందారకాంశజు లనియుఁ
దన్నుఁ జంప దేవకీగర్భమం దుదయించువాఁడు వాసుదేవుం డనియు
నెఱింగి దేవకీవసుదేవులం బట్టి నిగళబంధనంబు గావించి కారాగారం
బునం బెట్టి పుట్టినబిడ్డల నెల్లఁ బుండరీకాక్షుండ యనుభయంబునఁ
బుట్టినప్పుడ గిట్టివైచె నవ్వేళ. 39

మ. తమప్రాణంబుల నోముకోఁ దలఁచి లుబ్ధత్వంబునం గొంద ఱు
త్తమతాహీనులు తల్లిదండ్రులను బుత్రభ్రాతృమిత్రాదులన్
సుమనస్తుత్యుల నైనఁ జంపుటకు నై స్తోకంబునన్ జంక కీ
క్షమ స్వార్థం బది యెంత లెంత లయినం గావించుకొం డ్రెప్పుడున్.

తే. పూర్వజన్మమునన్ విష్ణుమూర్తి చేత
మృతినిఁ గాంచిన కాలనేమిగను దన్నుఁ
దెలిసికొని కంసుఁ డెంతయుఁ దేజ మిగిలి
యాదవులతోడి వైరంబు పాదుకొలిపె. 41

ఆ. అబ్బ నుగ్రసేను యదువృష్ణిభోజాంధ
కాధినాథు నమ్మహాబలుండు
నిగ్రహించి తాన నేతయై శూరసే
నముల ననుభవించె నయము డించి. 42

వ. మఱియు నక్కంసుండు ప్రలంబబక చాణూరతృణావర్తాఘాసుర
ముష్టికారిష్ట ద్వివిద పూతనా కేశినీ ధేనుకాదులతోడను బాణ
భౌమాద్యసురభూపాలురతోడనుం గూడి మాగధుం డగుజరాసంధు
నాశ్రయంబు గలిగి యాదవులతోడం గలహంబు గావించుటయువారు
వాని బాఱిం బడ నోడి పీడితులై కురుపాంచాల కేకయ సాళ్వ విదర్భ
నిషధ విదేహ కోసలాది దేశంబులకు వలసలఁ బోయి రందుఁ
గొందఱు వాని ననుసరించి సేవించుచుండి రయ్యవసరంబున. 43

క. దేవకి కార్వురు బాలురు
వావిరి నేఁటేట బుట్టు వారిని గంసుం

డావేళఁ బట్టి చంపిన
పైవచ్చెఁ సతికి నేడవది గర్భ మొగిన్. 44

ద్విపదము. అది వైష్ణవం బగునంశ మనంత
పదము శేషాఖ్యము పరిభవింప నగుచు
మదిహర్ష దుఃఖముల్ మలయుచు నుండ
సుదతి దేవకి యొప్పె సొంపు వో నపుడు. 45

ఆ. భక్తులైనయాదవప్రజలకుఁ గంస
భయము దెలిసి విశ్వభావనుండు
యోగమాయఁ బిలిచి యోదేవి నీవిష్ట
భూతధాత్రి కేగఁ బోలు వినుము. 46

— ♦ విష్ణుదేవుఁడు యోగమాయ నిలం బుట్టఁ బుచ్చుట ♦ —

సీ. వసుదేవపత్నులు వ్రజమున రోహిణీ
ప్రభృతు లిప్పుడు కంసభయమువలనఁ
బరులు గానక యుండుపగిది డాగిరి నీవు
పోయి దేవకిగర్భమున నెసంగు
మామకం బైనధామమ్ము శేషాఖ్య నా
గర్భము గ్రిసియించి క్రన్న నేగి
పొదువుగా రోహిణిబొజ్జలోఁ జొనుపుము
నే నంశభాగము పూని పిదప
తే. దేవకీదేవిసుతుఁడనై తేజఁ గొందు
నందపత్ని యశోదకు నందన వయి
నీ వెసంగు మటంచును దేవదేవుఁ
డానతిచ్చెను యోగమాయకు మఱియును. 47

వ. మఱియు నోదేవీ! నిన్ను సర్వకామేశ్వరి వనియు సర్వకామప్రద వనియుం దలంచుచు నానోపహారంబుల మానవు లెల్లవేళ సేవింతురు నీవు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి

కన్యక మాయ నారాయణి యీశాని శారద యంబిక యను పేళ్ల నాయాస్థలంబులం నుండుము ప్రజలు నిన్నుం బూజించెదరు. రోహిణీ గర్భంబున నగుపుత్రుండు సంకర్షణంబునంజేసి సంకర్షణుం డనియు లోకరమణంబునంజేసి రాముం డనియు బలోచ్ఛ్రియంబునంజేసి బలభద్రుం డనియు వ్యవహరింపంబడు నని చెప్పి యంపిపుచ్చిన నయ్యోగనిద్ర భూతలంబునకుం జని పురుషోత్తముండు చెప్పిన చొప్పున దేవకీగర్భంబుం దిగిచి రోహిణిగర్భంబునం జొనిపె నప్పుడు లోకులు దేవకికి గర్భస్రావమైన దని చెప్పుకొని రనంతరంబ. 48

క. ఆనకదుందుభి హృది భగ
వానుఁడు విష్ణుండు స్వాంశభాగమున ధరి
త్రీనిభృతభూరిభారము
వో నడువఁగ వచ్చి చొచ్చెఁ బూర్ణప్రజ్ఞన్. 49

—◆ శ్రీకృష్ణావతారఘట్టము ◆—

చ. పురుషునిధామ మట్లు కొని పొల్చి దివాకరునట్లు వెల్గుచున్
బరులకు నంటరానిగతి భాసిలుచున్ వసుదేవుఁ డమ్మహో
త్తరము శివంకరం బయిన దానిని దేవకిలోనఁ జొన్పె న
త్తరుణి తలిర్చెఁ జంద్రముని దాల్చినతూరుపుదిక్కు చాడ్పునన్. 50

ఉ. దేవకి శ్రీనివాసుఁ డగుదేవున కట్లు నివాసభూతురా
లై విబుధారియింటఁ జెఱయం దరికట్టఁగ నోట నప్డు భాం
డావరణంబునం గలుగునగ్నిశిఖం బలె జ్ఞానహీనుఁ డౌ
కావరు నంటువిద్యవలెఁ గానఁగ వచ్చె వికాసహీనయై. 51

సీ. తనుకాంతిఁ జేసి భవనము వెల్గించునా
దేవకీదేవినిఁ దెలియ సరసి
కంసుండు మున్నెప్డు కలిగియుండదు తేజ
మిది వైష్ణవము నన్ను సదమదంబు
సేయునిశ్చయ మిప్డు చేయుదు నెట్లొ కో
లెనపూస్కఁ దలఁగఁ డీదనుజవైరి

స్త్రీ యనుటయె కాదు చెల్లె లింతియె కాక
గుర్విణి యై యుండెఁ గోమలాంగి
తే. ఈయమం జంపఁ బాపము నేల చెప్ప
నాదు నైశ్వర్యమును గీర్తి నాదునాయు
వింతలోపల నశియించు నిట్టి నేను
బ్రతికియుండియుఁ జచ్చినవాఁడ నగుదు. 52

వ. ఇట్లు ఘోరతమం బైననిజభావంబునుండి నివృత్తుం డై కంసుండు వైరానుబంధబంధురుం డై హరిజన్మముం బ్రతీక్షించుచు. 53

ఆ. కూరుచున్నఁ బండుకొన్నను నిలిచినఁ
దిరుగుచున్నఁ దిండిఁ దినుచునున్నఁ
ద్రాఁగుచున్న భీతి దైత్యారి నెంచి జ
గమ్ము విష్ణుమయము గాఁ దలంచె. 54

వ. అంత బ్రహ్మరుద్రేంద్రాదులు నారదాదులును దేవతలతో నచ్చటికి వచ్చి వాసుదేవు నిట్లని ప్రస్తుతించిరి. 55

—♦ బ్రహ్మరుద్రాదులు గర్భస్థుఁ డైనహరిం బ్రస్తుతించుట ♦—

తే. సత్యపరుఁడు త్రిసత్యుఁడు సత్యయోని
సత్యనిహితుఁడు సత్యాత్మ సత్యసువ్రి
తుండు సత్యుఁడు సత్యనేత్రుండు నైన
వాని శరణు వేఁడెదము ప్రపన్నుల మయి. 56

సీ. మూలప్రకృతి యొకం డాలవాలమ్మును
సుఖదుఃఖములు రెండు సుఫలము లగు
గుణములు మూఁడును గణియింపఁ బాదముల్
పురుషార్థములు నాల్గు వరరసములు
పంచేంద్రియంబులు పరికింప నూడ లా
఩ూర్ములు దానికి నొప్పునాత్మ
ధాతువు లేడునుఁ ద్వక్కు లష్టప్రకృ
తులు విటపంబులు తొమ్మి దైన

తే. ద్వారములు కోటరమ్ములు వాయుదశక
మాఁకు లగుజీవుఁడీశ్వరుఁ డనెడు రెండు
పక్షులును గల్గి సంసారవృక్ష మెసఁగు
దానికిఁ బ్రసూతియును సన్నిధాన మీవె. 57

ఆ. నీదుమాయచేత నిరతసంవృత మైన
మానసంబు గల్గుమర్త్యులు నిను
వేఱు గాఁ దలంత్రు విజ్ఞులు తమకంటె
వేఱుగాఁ దలంపఁ బోరు నిన్ను. 58

మ. తెలియన్ సర్వచరాచరాత్మకజగత్క్షేమంబు గావింప నై
విలసత్సర్వసమంచితంబులు సుహృద్విఖ్యాతసౌఖ్యప్రదం
బులు దుష్టాశుభదంబు లైనజననంబుల్ మాటికిన్ దాల్తు వీ
యిల నిన్నెన్నఁ దరంబె సర్వభువనాధీశా! హృషీకేశ్వరా. 59

తే. నిఖిలలోకాశ్రయుఁడ వైననిను సమాధి
వలన నొందినచిత్తము గలుగువారు
ఘనులు నీపాదపోతము గలిగి గోష్ప
దమ్ముచందమున భవాబ్ధి దాఁటఁ గలరు. 60

ఉ. ముక్తుల మైతి మే మనుచు బుద్ధిఁ దలంచు చసక్తభావు లై
భక్తి యొకింత లేక మలవన్మతిఁ గానక కృచ్ఛ్రసమా తపో
యుక్తిఁ బరంపదంబుఁ దగ నొందియు నీపద మందనట్టి వై
రక్తి చెడంగఁ గ్రిందికి నరంబుగఁ జేరుదు రోరమాధవా. 61

తే. నీదుభక్తులు వారలు నెఱి నిబద్ధ
సౌహృదు లొకప్పు డాచక్కిఁ జాఱి క్రిందఁ
బడరు నీగోపనమున నిర్భయత గలిగి
తిరుగుచుంద్రు వినాయకశిరము లెక్కి. 62

ఉ. నీదగుమూర్తి నామములు నేమముతో వినియున్ గ్రహించియున్
మోదముతో స్మరించియును బూరుషుఁ డెవ్వఁడు సత్క్రియాది నీ

పాదసరోజయుగ్మమున భావము గల్గి భజించుచుండు నో
కాదన కట్టిభక్తునకుఁ గల్గఁగఁ జేయుదు వీవు మోక్షముల్. 63

మ. వరమత్స్యంబు వరాహమున్ కమఠ మశ్వంబున్ మహీదేవుఁడున్
నరసింహుండు విభుండు విప్రుఁడు మొదల్ నానావతారంబు లీ
వరితిన్ దాలిచి యెట్లు కాచితివొ మున్న ట్లిప్డు ముల్లోకముల్
పరిరక్షింపుము భూభరం బుడుపు మో వైకుంఠ మా మ్రొక్కెదే. 64

వ. అని దేవకి నుద్దేశించి. 65

మ. భగవంతుండు పరాత్పరుం డగుమహాభాగుండు నీబొజ్జ దై
వగతిన్ జొచ్చె నిజాంశమున్ గలుగ నో వాగీశ్వరీమాత మృ
త్యుగుహం జేరెడుకంసుఁ డాతనిభయం బుండంగఁ బో దిం కిటన్
దగుపుత్రుం డితఁ డెల్లయాదవులకున్ సంరక్షకుం డయ్యెడిన్. 66

తే. ఇట్లసాధారణస్వరూపేద్యమానుఁ
డైనపురుషుని స్తుతియించి యమరవరులు
బ్రహ్మరుద్రుల మున్నొని ప్రముదితాత్ము
లగుచు దివమున కరిగిరి పొగడుకొనుచు. 67

—♦ శ్రీకృష్ణుఁడు దేవకీదేవికిం బుట్టుట ♦—

సీ. అమల గుణోపేత మతిశోభనం బయ్యెఁ
గాలము గ్రహతారకములు పొదల
దిశలు నిర్మలములై దివి నిర్మలోడుగ
ణోదయమై భూమి యొప్పుమిగుల
నదులు హ్రదమ్ములు పొదలఁ బ్రసన్నము
లై వనరాజి సమంచితము గ
వాయువుల్ శుభగంధబంధురముల్ సుఖ
స్పర్శములై వీవ సర్వదిశల

తే. అగ్ను లతిశాంతహోమధూమావృతములు
సాధుజనమానసములు ప్రసన్నములు గ

మొరయ దుందుభుల్ దివినిఁ గిన్నరులు పాడ
నాడ నచ్చర లెంతయు హర్షమునను. 68

చ. మునులును వేల్పులుం ముదము పొంపిరివోవఁగఁ బుష్పవర్షముల్
మొనసి వసుంధరం గుఱియ మోదము రా నురుమంగ మేఘముల్
జననము నొందె దేవకికి శౌరి నిశాసమయంబునందుఁ దూ
ర్పునఁ బరిపూర్ణచంద్రముఁడు పొల్చినపొల్పునఁ బొల్పుమీఱఁగన్.

సీ. శ్రీవత్సలక్ష్ముండు శ్రీమహావక్షుండు
శంఖగదాచక్రశార్ఙ్గధరుఁడు
పద్మేక్షణుఁడు చతుర్బాహులక్షణుఁడు కౌ
స్తుభమణీరాజసంశోభిగళుఁడు
పీతకౌశేయుఁడు స్ఫీతనీలపయోద
సౌభగుఁ డత్యంతవైభవుండు
మణికిరీటాంగదమహితకుండలకంక
ణాదిదివ్యాభరణాంచితుండు

తే. అగుచు బాలుఁడు చారుతరాంగుఁ డగుచు
నరయ వచ్చిన వసుదేవుఁ డచ్చెరుపడి
వికసితేక్షణుఁడై చూచి విష్ణుఁ డుదయ
మందె ననుచు సంతోషాబ్ధియందు మునిఁగె. 70

వ. అప్పు డంతరంగంబునందు భూమిబృందారకులకుం బదివేలగోవుల దానంబు గావించి కుశాగ్రబుద్ధి యగునతండు విష్ణుప్రభావం బెఱింగినవాఁడై భయంబు విడిచి కృతాంజలిపుటుండు నవనతాంగుండునై తనమేనివెలుంగున సూతికాగృహంబు వెలింగించుచున్న నిజాత్మజునిం బరమాత్మునిఁగా భావించి యి ట్లని ప్రస్తుతించె. 71

—♦ వసుదేవుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట ♦—

తే. నీవు ప్రకృతికిఁ బరుఁడవు కేవలంబ
యనుభవానందరూపుఁడ వైనవాఁడ

వెల్ల బుద్ధులకును సాక్షి వీవు పరమ
పురుషుఁడ వెఱుంగుదును నిన్నుఁ బోల్చ నేను. 72

తే. ప్రకృతిచేత నీవు త్రిగుణాత్మకజగంబు
మొదటఁ బుట్టించి దానితోఁ బొందు లేని
వాఁడ వయ్యు నుండినవానిపగిది జీవుఁ
డై తలంపఁగఁ బడుచుందు వాదిపురుష. 73

సీ. నీవు నిర్గుణుఁడవు నిజ మెన్నఁగ స్వమాయ
సగుణుండ వగుచుందు సర్వలోక
గతిపొంటె నాత్మకుఁ గలసత్త్వమయశుక్ల
వర్ణము సృష్టిసల్పఁగ రజోగు
ణం బైనరక్తవర్ణము ప్రళయార్థము
తమ మైనకృష్ణవర్ణము ధరింతు
వీత్రిగుణంబులే కృష్ణాజరుద్రాభి
ధానములఁ జగద్వ్యాప్తి నొందు

తే. ఈవు నాయింటఁ బుట్టితి విపుడు లోక
రక్షణముపొంటె లోకేశ్వరా! మహేశ!
వివిధరాజన్యసంజ్ఞచే విరిసి యున్న
యసురసేనలఁ జంపంగ నగుదు కాదె. 74

మ. ఖలుఁ డాకంసుఁడు వింటివాకువలనన్ గల్గున్ భవజ్జన్మ మి
ట్టులు నాయింట నటంచు జెఱింగి మము రట్టుం బుట్ట బంధించి య
వ్వల నీభ్రాతలఁ జంపె నార్వురను నీవార్తన్ భటుల్ దెల్ప ని
ష్ఠలుకన్ వచ్చు నుదాయుధుం డగుచు నీహత్యం బొనర్పం బ్రభూ.

వ. అనంతరంబ దేవకీదేవి మహాపురుషలక్షణలక్షితుం డగునిజాత్మజుం
జూచి శుచిస్మిత యయ్యును గంసభయంబునం గంపించుచు నిట్లని
స్తుతియించె. 76

—♦ దేవకీదేవి స్వామిని స్తుతించుట ♦—

తే. ఆద్య మవ్యక్త మవ్యయ మచ్యుతంబు
బ్రహ్మమును జూచి నిర్వికారంబు నిర్గు
ణము నిరీహము నిర్విశేషమును నీదు
రూప మూహారి వధ్యాత్మదీప మీవ. 77

సీ. జగము విలయము నొందగఁ మహాభూతము
లాదిభూతము నొంద వ్యక్తమెల్ల
నవ్యక్తమును బొంద నపుడు శేషాఖ్య నీ
వొక్కఁడవే నిల్చియుందు వరయ
నవ్యక్తబంధువ వైనయో దేవ! యే
కాలమునన్ విశ్వగతి దలిర్చు
నాకాల మెల్ల నీదయినలీలగఁ జెప్పు
నెల్ల వేదంబు లోయిందిరేశ

తే. ఈవు లయకర్త వైనలోకేశ్వరుఁడవు
కావున న్నిన్ను నభయంబు గాంక్షఁ జేసి
శరణుఁ జొచ్చితి మీవు గా కొరుఁడు మమ్ము
దీనులనుఁ బ్రోవఁ జాలఁ డో దేవదేవ. 78

శా. ఓసర్వేశ్వర! యుగ్రసేనసుతుఁ డత్యుగ్రుండు కంసుండు మ
మ్మాసందర్భమునన్ గిరాతుఁ డగుచున్ హింసించుచుండెన్ రవం
తే సేమం బనుమాట లేదు భవదీయేష్టాప్తులన్ భక్తులన్
ద్రాసం బందెడివారిఁ గావు మనుచున్ బ్రార్థింతు నే నర్థినై. 79

తే. ధ్యానగోచర మైశ్వర మైననీదు
దివ్య మగురూప మిది మాంసదృక్కు లైన
వారలకు గోచరించెడుపగిదిఁ గాక
యుండఁ గోరుచునుంటి నో యోగమూర్తి. 80

ఉ. ఓమధుసూదనా! నిను మహోగ్రతరుం డగుకంసుఁ డెట్టిచో
నేమిపొనర్చునో యనుచు నెంతయుఁ జింతిలుచుందు నాయెడన్

నీమహిమోదయం బెఱుగఁ నీక యలౌకిక మైనదీని నీ
వీమెయి సంహరింపు మని యే నిదె చేతులు మోడ్చి వేఁడుదున్.

ఆ. పరమపురుష నీవు ప్రళయావసానము
నందు నీదుదేహమందు విశ్వ
మును ధరింతు వట్లు కన నాదుకడుపున
నయితి వహహ యిది జనానుకృతియ. 82

— దేవకీవసుదేవుల పూర్వజన్మవృత్తాంతము —

సీ. అన భగవానుఁ డి ట్లను సతీ నీవు స్వా
యంభువమన్వంతరాంతరమునఁ
దొల్లింటిజన్మమందుం బృశ్ని యను పేరఁ
బరఁగినదాన వత్తఱిణమందు
వసుదేవుఁ డితఁడు పాపము లేనిసుతపుఁ డన్
వాఁడు ప్రజాపతి నాఁడు ప్రజల
సృష్టించుపనినుండి సృష్టికర్తాజ్ఞమై
నొనరించితిరి కడునుగ్రతపము

తే. వర్షవాతాతపసహులై శ్వాసరోధ
ధూతపాపులు విమలచిత్తులు మఱియును
బవనపర్ణాంబుభక్షులు పరమశాంతు
లగుచు నన్నుఁ గూర్చి తపియింతు రధికనిష్ఠ. 83

వ. ఇట్లు మీరు నాయందుఁ జిత్తంబుఁ జేసి పరమదుష్కరతపంబు గావించుచుండఁ బండ్రెండువేల ♦ దివ్యవర్షంబు లతిక్రమించె. అప్పుడు నేను మీయెడం బ్రసన్నుండనై యీదేహంబుతోడన దర్శన మిచ్చి వరంబు వేఁడుకొం డనిన మీరు మన్మాయామోహితులై ముక్తిం గోరక నీయట్టికొడుకు మాకుఁ బుట్టవలె నని కోరితి రేను నాఁ గాత మని నావంటివాఁడు నేన గాన మీకడుపున సుతుండనై పృశ్నిగర్భుండు నాఁబడితి ననంతరంబ. 84

---

♦ దివ్యవర్షములు 12 వేలకు మనుష్యమానమున 4320000 వర్షము లగును.

తే. అదితికశ్యపులై మీర లవతరించి
రవు డుపేంద్రుఁడనై మీకు నాత్మజుఁ డయి
వఱలి వామనుఁ డను గాన వామనాఖ్య
కైతి నప్డు తృతీయ మహాభవమునందు. 85

క. ఆమీకు నట్టినేనే
యీమాడ్కిఁ గుమారుఁ డగుచు నెసఁగితి సాధ్వీ!
నామాట సత్య మనుచును
నీమదిలో విశ్వసించి నెఱి మీఱ నగున్. 86

ఉ. తొల్లిటిజన్మకర్మములు తోడ్పడి వచ్చుట నైన సంస్మృతిన్
జెల్లను మత్స్వరూప మిది చెన్నుగఁ జూచుట లిట్లు గానిచోఁ
జెల్లదు మర్త్యలింగములు చేకొని యుండినవారి కీరు నా
తల్లియుఁ దండ్రియై ప్రకృతిధర్మమునన్ బచరించి పిమ్మటన్. 87

తే. పుత్రభావమునన్ జేసి ప్రోచి బ్రహ్మ
భావమునఁ జేసి కొల్చినవార లగుచుఁ
బరమపద మందెదరు కంసభయము వోని
నన్ను వ్రజమును జేర్పుఁడు క్రన్న నిపుడు. 88

క. నందసతి నన్నుఁ దనసుతుఁ
గం దెలిచెడు నామెసుతను గైకొని మన్మా
యం దటుకునఁ గొని రాఁ దగు
నిందలిద్వారములు వీడు నింకు యమునయున్. 89

వ. ఇట్లు పలికి భగవంతుం డూరకుండి తల్లిదండ్రులు సూచుచుండ నిమే
షాంతరంబులో నిజయోగశక్తిం జేసి ప్రాకృతశిశు వయ్యె నప్పుడు
వసుదేవుండు. 90

— ♦ వసుదేవుఁడు వ్రేపల్లెఁ గృష్ణునిడి యోగమాయం దెచ్చుట ♦ —

సీ. భగవత్ప్రచోదితుం డగుట పుత్త్రునిఁ గొని
వెలుపలికిన్ జను వేళ నచట
నందజాయ యశోద కం దనయ జనించె
యోగనిద్ర యనంగ నొప్పెడు నది

వాఁకిలికావలివారలు గాఢసు
షుప్తి మే నెఱుఁగక సుప్తిఁ బడిరి
తలుపు లాయసమహార్గళశృంఖలాసమ్ము
ద్ధములు వివృతములై దారి నొసఁగెఁ
తే. ప్రజలు నిద్రితులై యుండ వాన కురియ
నయ్యె నయ్యెడ డింభకు నఱకడఁ గొని
శౌరి నడవంగ శేషాహి సరగ వచ్చి
ఫణములఁ బట్టె చినుకు పైఁ బడక యుండ. 91

క. కొండలపాడనై తరగలు
మెండుకొనం బొంగిపొరలి మేదిని యెల్లన్
నిండుకొని యమున మార్గ మొ
కొం డిడె రాఘవున కప్పు డుదధి తెఱఁగునన్. 92

వ. అట్లొక్కనిమేషంబున నందవ్రజంబున కాశూరసేనాత్మజుండు చని యెల్లలోకులు నిద్రితులై యుండ నెవ్వరు నెఱుంగకుండ నిజనందను యశోదాశయనంబున నామెకుం దెలియనట్లు పెట్టి యశోదకుం బుట్టిన యోగమాయ నెత్తుకొని యెప్పటియట్లచని దేవకీశయనంబున దారికం జేరిచి కవాటంబు లెల్లఁ దమంత నవియ మూసికొనిపోవఁ దాన తనపదంబులకు శృంఖలములు దగిలించుకొని యుండె నప్పు డాగృహపాలకులు బాలరోదనంబు విని లేచి వచ్చి చూచి యేచినభయమ్మున జరిలునం జని కంసుం గాంచి యి ట్లనిరి. 93

— దేవకీదేవి కూఁతుం జంపవల దని కంసుం బ్రార్థించుట —

శా. స్వామీ! నీకతిభీతిదం బయినగర్భం బౌట నానాఁడునున్
నే మెప్పున్ విడనాడకుండఁ బురిటిల్ మేల్కాంచి వీక్షించుచున్
జేమం జేరఁగ నీనివార మయి వాసిన్ కాచి యున్నార మి
ట్లీమా పాయమ్ము వేదనన్ గొనఁగ నెంతే జాగరూకస్థితిన్. 94

ఉ. తెప్పలు విప్పకొం చచట దే పగునంతకు వేచి యుంటి మో
యప్ప కుమారుఁ గాంచె నిపు డావసు దేవసతీవతంస మా
చొప్పు వచింప వచ్చితిమి చూచి భవన్మన మైనరీతి గా
నొప్పు ఘటిల్లఁ జేయుటకు నోపు మటంచు వచింతు మో ప్రభూ. 95

వ. అని చెప్పిన నప్పుడు కల్పానల్పగభీర భైరవాకారుండై కంసుండు తల్పం
బునుండి లేచి భయవిహ్వలుండై తొట్రుపడుచుఁ గేశపాశంబు వీడి
యూడ సూతికాగృహంబునకుం జని పట్టిం బట్టి చంప నెంచుసమయం
బున దీనురాలై దేవకీదేవి పరిదేవనంబు సేయుచు సకరుణంబుగా
నన్నదిక్కు మొగంబై యి ట్లనియె. 96

ఉ. అల్లుఁడు గాఁడు కోడ లిది యయ్యెను జంపఁకు మాడుబిడ్డ నో
సల్లలితప్రకార విను చంపితి పెక్కుర నొక్కకన్నె నీఁ
జెల్లెలి నైననే నిటులు జేంద్రమునఁ బడి వేఁడుచుంటి నీ
చల్లనిచూపు నాపయి నెసంగఁగఁ జేయుచుఁ గాచి పుచ్చవే. 97

తే. అని తనూజాత నక్కునయందు నద్దు
కొని కడుఁ దీనవదన యై కనుల నీరు
గార నేడ్చుచు వేఁడ రా ఖలుఁడు గరిత
కరమునుండి బలాత్కృతిఁ గొందుఁ దిగిచి. 98

చ. కరుణ యొకింత లేక ఖలకంసుఁడు హింస పొనర్చువాఁడ యై
చరణములందుఁ బట్టుకొని చయ్యనఁ ద్రిప్పుచు జాతమాత్రయై
యరుణిమతోడి మేన నలరారెడుపాపను మీఁది కెత్తి ప్ర
స్తరమున బల్మిమై విసరె సర్వశరీరము శీర్ణమై చెడన్. 99

వ. అట్లు విసరి వైచినంత నమ్మాయాశిశువు నేలం బడ కెల్లరుం గన
నల్లన నాకాశంబున కెగసె నట్టియెడ. 100

— యోగమాయా విధానము —

సీ. అష్టాయుధములతో నష్టమహాభుజం
బులు మహాప్రతిభను దెలుపుచుండ

దంష్ట్రాకరాళవదనము మహాభీతి
గలిగింప శంఖచక్రములు మఱియుఁ
జర్మాసిగదలును చాపేషువులు దాల్చి
దివ్యస్రగంబరదీప్తి లెసఁగ
స్వర్ణరత్నాంచితసదమలభూషణ
భూషితాంగము జగద్భూషణముగ
తే. రుండమాల వహించి వేదండవైరి
వాహనారూఢయై పొల్చి వాసి కెక్కి
సిద్ధచారణగంధర్వసేవ్యమాన
యగుచు దుర్గామహాదేవి యరయ నయ్యె. 101

వ. అట్లు ప్రత్యక్షంబై సాక్షాద్రాక్షసుం డైనకంసునిం బిలిచి యి ట్లనియె.

శా. ఓరీ మందమతీ ననుం దునుమఁగా నూహింతు నీశక్యమే
క్రూరత్వంబున నట్లు చేసినను నీకుం గొంతయే లబ్ధి చే
కూరం గల్గునె నిన్నుఁ జంపుటకునై కొండొక్కచోఁ బుట్టి ది
వ్యారంభమ్ము లెసంగ నుండె నని నే వ్యాహారముం జేయుదున్.

తే. ఇ ట్లనేకవిధంబుల నీశ్వరేశ్వ
రి యగునావిష్ణుమాయ కారించి పలికి
కానఁ బడ కేగి ధరఁ బెక్కుతానములను
వివిధనామములన్ జగద్వినుతిఁ గాంచె. 104

వ. అట్లు పలికి తిరోధానంబు నొందినమహాశక్తిపలుకు లాకర్ణించి కంసుండు భయకంపితాంతరంగుండై విస్మయంబు నొందుచు దేవకీవసుదేవులసంకెలలం బాయం జేసి ప్రశ్రితుండు వినయవినమితాంగుండై వడంకుచు ని ట్లనియె. 105

మ. పురుషాదుం డగువాఁడు కన్నప్రజలన్ బోకాడఁగాఁ ద్రుంగిన
ట్లరయం జాల్నక పాపినై మెసవితిన్ హాహా భవత్పుత్రులన్
గరుణాహీనుఁడఁ ద్యక్తబంధుఁడఁ గృతఘ్నాక్రాంతుండ ని ట్లుండియున్
ధర లేనట్టిఁడ నైతి నెట్టిగతి కై తార్కొల్పునో దుర్గతుల్. 106

ఉ. కేవలమర్త్యవాక్యముల కీడు దలంచెడివాఁడ నౌదునే
దైవ మసత్య మాడె నటు దానినుమల్ మది నమ్మి నేను దు
ర్భావుఁడనై భవత్సుతులఁ బల్వురఁ బట్టి వధించినాఁడ నో
భావుక పుత్రశోకమునఁ బాడిఁ దొలంగక యుండ వేఁడుదున్. 107

—◆ కంసుఁడు దేవకీవసుదేవుల విడిచిపుచ్చుట ◆—

తే. ప్రాణు లాత్మకృతఫలంబు లనుభవింత్రు
భాగధేయానుసార మో ప్రాజ్ఞులార !
మీకొమాళ్ళట్లుఁ దెగుటకు మిసిమి చెడఁగ
శోకమును బొందకుం డనుచున్ వచింతు. 108

తే అని మఱియు నెంతయో చెప్పి యనఘులార
బంధువత్సలులార ! నాపాపకృతికి
మది క్షమింపుఁ డటంచు నమ్మాన్యులపద
పద్మముల వ్రాలెఁ గన్నీళ్ళు వఱ్ఱు వాఱ. 109

వ. అని కంసుండు స్వస్రుభావుకుల ననునయించి శాంతిం గలిగించి నిగళబంధవిముక్తులం జేసిన వారును నివృత్తవ్యసనులై నిజగృహంబునకుఁ జని రంతఁ గంసుండును స్వభవనంబునకుఁ బోయి తెల్లవారినపదంపడి మంత్రులం బిలిచి సర్వంబు నెఱింగించిన నాదేవశత్రు లగుదైతేయులు భూభర్తృగదితవాక్యంబులు విని దేవతలపై నమర్షంబు పూని యి ట్లనిరి. 110

ఆ. అట్టు లైన మేము పట్టణగ్రామవ్ర
జాదు లెల్లఁ దిరిగి యందు నందుఁ
బదిదినములలోనిపాపలఁ బైఁ బడ్డ
పాపలను వధించి వైతు మీశ. 111

సీ. ◆నీవింటిమ్రోఁతలన్ విని వెఱ చఱచెడు
జేజలు వా రేమి సేయఁ గలరు
నిను వినినంతనె నిలిచినచో నిల్వఁ
బోక షోకీగి వా రొప్పెయి రెప్పుడో

---

◆ జేజలు=జేజ, జేజమ్మ. నింద్యార్థమందు గోదావరీమండలమున వ్యవహరింతురు.

కొందఱు భీతిమైఁ గొందల మందుచు
శరణు వేఁడిరి శస్త్రచయము విడిచి
శర ణన్నవారిని విరథుల విగతాయు
ధుల భీతులఁ నీవు దునుమఁ బోవు
తే. జలధి డాగినహరియు గుహల శయించు
హరుఁడు తపసి యాబ్రహ్మ యచ్చరలతోడ
గూడి మాడెడు వృషుఁడు నీనాఁడు మనలఁ
గనఁగ నైననుఁ జాలరు కన్నుఁ దెఱచి. 112
క. ఈపగిది నైనవారిఁ
సాపత్న్యం బగుటఁ జేసి స్వాంతమునందుఁ
బాపము దలఁపక త్రెంచుట
యే పాడి యటందు మాజ్ఞ యే మమరారీ 113
తరువోజ. ఒడలియందలిరోగ మూరక యున్న
నొగి నాటుకొని మాన్ప నోపని దగును
విడివడ్డ యింద్రియవిసరంబు నిలుపఁ
బెట్ట సాధ్యము గానివిధమున శత్రు
నెడ నుపేక్షించిన నెప్పటి కేని
యుద్ధబలుం డయి యేకు మే కగుచు
నిడు భయం బమరుల కెల్ల వైకుంఠు
జేమూల మని మన మెఱుగుదు మాట. 114
తే. హరి సనాతనధర్మమం దమరు నెడల
నుండు శ్రుతులును గోవులు నుర్విసురులు
జపతపంబులు యజ్ఞముల్ సత్క్రియలును
ధర్మగతులకు హేతుభూతములు తలఁప. 115
క. గోవులు విప్రులు క్రతువులు
నావేదము శమము దమము ననుకంపయు శ్ర

ధ్ధావిధులు తపము సత్యము
గోవిందుని మేను లనుచుఁ గోవిదుల నుడుల్. 116

ఆ. కాన బ్రహ్మవాదు లైన బ్రాహ్మణులను
దాపసులను యజ్ఞతత్పరులను
వేలిమికి హవిస్సుఁ బిదికెడుగోవులఁ
బట్టి చంప మొదలుపెట్టితి మెద. 117

మ. అసురద్వేషిగుహాశయుండు విబుధాధ్యక్షుండు బ్రహ్మాదులుల్
వసురుద్రాదులు వానిమూలముననే వర్తిల్లుచుం డెప్పుడున్
రుసులన్ శ్రీహరి ప్రేముడించు మిఫులన్ రూపించుచున్ వారలన్
వెస హింసించుటకున్ బ్రయత్నములు గావింపం దగున్ వల్లభా. 118

వ. ఇట్లు దుర్మంత్రిలమంతనంబునం జేసి దుర్మనుం డగుకంసాసురుండు కాలపాశవశుండై గోబ్రాహ్మణహింసాపరతంత్రుండై కామరూపధరు లగుదానవులఁ బిల్చి సాధుహింసం గావింపం జెప్పి పుచ్చి లోగృహంబునకుం జనియె. వారును రజస్తమోవృతచేతస్కులై మృత్యుదేవత నాహ్వానించుచు సజ్జనవైరంబునం బ్రవర్తిల్లుచుండిరంత నక్కడ.

—♦ నందుఁడు కుమారునకు జాతకర్మాదు లొనరించుట ♦—

సీ. నందనుం డుదయింప నందుఁ డానందమ
గ్నాత్ముఁడై వేదజ్ఞు లైనద్విజుల
నాహ్వాన మొనరించి యంబుసుస్నాతుఁ డై
కై సేసి బంధుసంకలితుఁ డగుచు
స్వస్తిపుణ్యాహవాచనమును సేయించి
జాతకర్మము యథాశాస్త్రముగను
బొనరించి పితృదేవపూజలు సాలంకృ
తములు గోవులు నియుతమును మఱియుఁ

తే. బొన్నసరిగంచుకోకల భూరిరత్న
సముదయంబున గప్పినసప్తతిలమ

నియుతము=రెండులక్షలు; సప్తతిలమహీధ్రములు=ఏడునువ్వులరాసులు.

హేమ(?)ధములు దాన మిచ్చె మహీసురులకు
వాసి మీఱఁగఁ బుత్రోత్సవంబునందు. 120

సీ. అపుడు భూసురులు స్వస్త్యయనంబు సలిపిరి
వందిమాగధులు కైవారములను
గాయకుల్ గానము గణికలు నృత్యముల్
గావించి రెపుడు నఖండగతుల
భేరులు దుందుభుల్ భూరినిధ్వానంబు
పొనరించె గోకులంబున సమస్త
భూములు సంమృష్టములును సిక్తంబులై
గోముఖశ్రీలచేఁ గొమరుమిగిలె

తే. ధ్వజములు పతాకలునుఁ బల్లవములు తోర
ణములు నల్గడ నలరారె నలువు మీఱ
నాలకు హరిద్రఁ దైలము నంటి నెమిలి
పింఛములు పూలదండలు వేసి రరుత. 121

తే. గోపకులు వస్త్రభూషణరూపితులును
గంచుకోష్ణీషభూషులై కరము లందుఁ
బలు తెఱంగులు కానుకల్ గలిగికొనుచు
నందునిం గాన వచ్చి రానందముగను. 122

మ. విని గోపీజన మయ్యశోద కపు డావిర్భూతుఁ డయ్యెన్ సుతుం
డని వించున్ జలకంబు లాడి వసనాద్యాకల్పముల్ దాల్చి క
న్గొనలం దోకలు దేర నంజనము గైకొంచుం జపాసూనదా
మనిబద్ధోన్నత కేశపాశముల శుంభత్కాంతి భాసిల్లుచున్. 123

మ. పసపుంబూఁతల భాసమాన మగుచున్ బంగారమో నాగ నై
మిసిమిం గాంచెడుమోములన్ మిగులఁ బేర్మిం గూర్చుకస్తూరిబొ
ట్లెసఁగం దాలిచి మారుదీములో యనన్ హేమించుచున్ శ్వేత లం
ఘ్రిసరోజంబులఁ బూజ సేయుచు ధరిత్రిన్ గాన్కలం బూనుచున్.

ఉ. కమ్మలు గాజులున్ మఱియుఁ గంకణముల్ మణికుండలాదులున్
గమ్మనిపూలదండలును గాసులపేర్లు వరాలపేర్లు నె
త్తమ్ములపెద్దమాలలును దాల్చి చలత్కుచభారలై ప్రమో
దమ్మున నందగోపవనితామణి పాలికి వచ్చి రిచ్చమై. 125

సీ. అంచనూలున నేయ నయిచంద్రధవళ మై
మృదులంబు లగుచీర లొదుగఁ గట్టి
నెమిలియీఁకలతోడ నెఱిమీఱి నల్లిన
నిగనిగ మనురైక లగు ననఁ దొడి
నునువుదేరియు మెత్తనను బొల్చుపులిగోలు
మిసిమి బొఱలుదేర మెడలఁ జుట్టి
గురివింజపూసల వరుసలో మగఱాలు
గూర్చినదండలు కొన్ని దాల్చి

తే. జున్ను మీఁగడ పాలును వెన్న నేయిఁ
గొనుచుఁ బల్లెలనుండి నందుని వెలంది
కన్నకొడుకును జూడంగఁ గౌతుకమున
వ్రజమునకుఁ గొల్ల భామలు వచ్చి రపుడు. 126

తే. పుట్టినప్పటిపండుగ పొసఁగునపుడు
చిత్రవాదిత్రములు మ్రోసెఁ జేర వచ్చి
శిశువు నాశీర్వదించుచు శివ మెసంగ
వెన్నరాసి చల్లిరి పాలు పెరుగు చిలికి. 127

ఉ. నందుఁడు పెద్దకాలము చనం జన పుట్టినవాఁడు గావునన్
నందనుఁ డెంతయేనియు మనంబునయందు మహోత్తరంబు నా
నందము నొందుచున్ సుతుఁ గనం జనుదెంచినయెల్ల వారికిన్
బొందుపడంగ వస్త్రములు భూషణముల్ ధన మిచ్చె ముచ్చటన్.

మ. బలరాముం గని నట్టిరోహిణియు గోపస్వామి పూజాదికం
బులఁ బెంపొందుచు దివ్యభూషణములుం బూఁదండలుం దాల్చి గో

కులమందుఁ బ్రభవించినట్టిశిశువుం గోర్కిం బ్రదర్శించి చే
తులు జోడించి నుతించి దీవన లిడఁ దోషంబు తోరంబుగన్. 129

క. ఆరోహిణికి యశోదకు
నారమణుల సుతులు పుట్టి నది మొదలు వ్రజం
బారయ సర్వసమృద్ధం
బై రాజిలెఁ బౌరు లంది రానందంబున్. 130

— నందుఁడు మధురాపురంబున కరిగి వసుదేవుం గాంచుట —

వ. అంత నందగోపుండు బ్రహ్మానందభరితుండై గోగోకులంబు నెల్లన్
గావ గోపాలురకుం జెప్పి తాను గతిపయజనంబులతోఁ గంసునకుఁ
గప్పంబుగట్టు వాఁడై మధురాపురంబునకుం జనియె నది విని వసు
దేవుండు ప్రాణమిత్ర మగునతనిం జూడ వానియున్నచోఁటికిం జనిన
నందుండు పోయినప్రాణంబు వెండియువచ్చినవాఁడుం బలె నానం
దించుచు నెదురేగి తోడితెచ్చి సుఖాసనాసీనుం గావించి పూజించెఁ
బదంపడి వసుదేవుండు తనకొమాళ్ళ క్షేమారోగ్యంబు లరయువాఁడై
యి ట్లని కుశలప్రశ్నంబు గావించె. 131

శా. నీదేశం బది క్షామడాంబరము లెందే లేనిదై యుండెనే
నీదాయాదులు నీవు నీసతులు నీనెయ్యుల్ సుఖంబుండిరే
నీదాగోగణ మొప్పునే రుజ లెవేనిఁ లేనిదై పంట లా
మోదం బిచ్చెడునట్టి వయ్యెడినె విప్రుల్నిన్ను దీవింతురే. 132

ఆ. కఱవుగలుగకుండఁ గురియుచుండునె వాన
వారితృణసమృద్ధి వసుధ చనునె
నీబృహద్వనంబు నెఱి నొప్పునే నీదు
సర్వలోకమునకు సౌఖ్యమ కద. 133

వ. అని మఱియును. 134

ఉ. తమ్ముఁడ! పెద్దకాలము గతం బయి పోవ నపుత్రకుండ వై
నెమ్మది నౌరసాశయును నీకు జనింపకయుండి నప్డు దై

వమ్మనఁజేసి నీ కిప్పుడు పట్టె నపత్యము గల్గుయోగ మే
మిమ్మెయి సంతసించెద మనేకవిధంబుల సన్నుతించుచున్. 135

తే. ఎన్నినాళుల నుండియో యేను నిన్నుఁ
బొడఁగనక యుండి వెండియుఁ బుట్టినట్లు
దైవమునఁ జేసి యిపుడు నీదర్శనంబు
చేసితిని ధన్యుఁ డైతి నోభాసురమతి. 136

తే. సంసృతిసముద్రమందు నెసంగుచుండు
సుహృదు లొకచోటనే యుంట చొప్పడనిద
యగును సంయోగము వియోగ మంబు పూర
మందుఁ బ్లవములకుం బోలె నగును జువ్వె. 137

మత్త. నాకుమారుఁడు వానితల్లియు నాదుప్రాపున నుంటకున్
గాక నీకడ నిల్వరించితిఁ గాదె మిత్రమ! వానినిన్
నీకుమారున కగ్రజుండుగ నెమ్మి నీవు దలంపు నే
నీకు నప్పన చేసినాఁడను నీదె భారము సర్వమున్. 138

ఆ. అనిన నందుఁ డనియె నకట! నీదేవకీ
సుతులు పెక్కుమంది హతులు కంసు
వలన మిగిలెఁ గన్నె తలఁప నొక్కత యది
దివికి నేగెఁ నేమి తెలుప నగును. 139

వ. సుహృద్వరా! నీవు దేసికిం బరిదేవనంబు సేయకుండుము సర్వమును గర్మానుబంధబంధురంబై యుండు నని యెఱింగికొని విగతవిషాదుం డవై కాలంబు గడపు మనిన వసుదేవుండు మిత్రవాక్యం బవశ్యకర్తవ్యం బని విశ్వసించి యుండెద నని నందునిం దిలకించి మఱియును. 140

మ. అరి కట్టంబడె వార్షికంబు పతి కాయుఃకార్యముల్ చెల్లె మ
మ్మరయం గంటివి పెద్దకాల మిట నీ వాలస్యముం జేయుచున్
బురముం జూచుచు నుండు టొప్పదు త్వరన్ బోవంగ నొ నింటికిన్
ధర నుత్పాతము లెన్నియేఁ గలుగ నౌ దారుల్ గన న్వచ్చెడిన్.

క. అష్టమగర్భము కన్నియ
కష్టముగాఁ బలికి చనియెఁ గడురయమున నే
సృష్టి యెప్పుడు గలుగునో యని
కష్టుఁడు కంసుండు కినుక గదిరినమదితోన్. 142

వ. ఎల్ల దేశంబులం గలశిశువులం జంపను గోబ్రాహ్మణహత్యలు గావిం
పను సత్క్రియలు సమయింపను వాఁ డాజ్ఞాపించె ననియు వివిధ
మాయావిదు లగు నక్తంచరులు సకలదేశంబుల సంచరించుచుండి
రనియు విన వచ్చెం గావున నిట్లు చెప్పుచుంటి నని చెప్పి వాని నంపి
పుచ్చి తాను దనగృహంబునకుం జనియె నందాదులును వసుదేవుని
వచనంబులు సత్యసంగ్రథితంబు లని తలంచుచుం దడయక యనడ్వాహ
శకటంబు లధిష్ఠించి గోకులంబునకుం జని రంతలోన. 143

—♦ కంసునిపంపున పూతకి వ్రేపల్లెకు వచ్చుట ♦—

తే. మాయలకుఁ బుట్టినిల్లు గ్రామమునఁ దిరుగఁ
జాలినది పూతన యనురాక్షసి యొకర్తు
కంసుపంపున నిల యెల్లఁ గలయఁ దిరుగు
నది వ్రజముఁ జేర నొక్కనాఁ డరుగుదెంచె. 144

వ. అట్లరుగుదెంచి నందగోకులసమీపంబున. 145

శా. నేమం బొప్పఁగ రాక్షసీత్వ మరుగ న్విప్రాంగనారూపముం
బ్రేమం దాల్చి బృహన్నితంబమునఁ బేర్మిం జిక్కి యొక్కింతయై
నామం బే యవశేషముం గలుగఁ గానన్ రాని కౌనేర్పడన్
శ్రీమంతం బగుకాంచికాంచనమణిశ్రేణుల్ కడున్ మ్రోయఁగన్.

ఉ. చందురునిగ్గు లీనుచుఁ బసం దగు నిద్దపు చీఱచెంగు లం
దందుఁ బరిభ్రమింప మణిహారసమంచితకంఠభాగ యై
సుందరకర్ణభూషణవిశుద్ధతరద్యుతి దీప్తకుండలా
నందకరాస్యపద్మ నయన భ్రమరద్వయభాసమాన యై. 147

ఉ. కొప్పున మల్లెలం దురిమి కొంచెము గాసివిలాస మేర్పడన్
జెప్పినమాపు చూపులను జేరఁగ వచ్చినవారిచిత్తముల్

తెప్పునఁ జూఱలాడుచును దియ్యగఁ బల్కుచు హస్తపద్మమిం
పొప్పగఁ ద్రిప్పుచు న్నగుచు నొయ్యన వచ్చె వ్రజంబులోనికిన్. 148

క. పతిఁ గృష్ణు నరయ వచ్చెడు
సతి నిందిరఁ బోలె రాక్షసవధూటిన్ గో
పతరుణు లెల్లఁ గనుంగొని
మతి నచ్చెరుపడిరి దానిమహితాకృతికిన్. 149

వ. ఇట్లతిమనోహరాకారంబునం జూపట్టి వచ్చుదానిం జూచి వల్ల
వాంగన లామెం జుట్టుకొని యి ట్లనిరి. 150

శా. అవ్వా! యెవ్వతె వీవి యేమిపనికై యస్మద్వ్రజస్థానమం
దివ్వాసిన్ విహరింతు చెప్పు మన నా హేమాంగి తా ని ట్లనున్
నన్వాం బోకుఁడు నేను బ్రాహ్మణసతిన్ నానాధుఁ డిష్టార్కుమం
దువ్విళ్ళూరుచు నిచ్చె దాన నిటు పాలువ్వెత్తుగా నూతెడిన్. 151

క. చన్నుఁగవ బిఱ్ఱబిగిసెను
గన్నకుమారుండు దాప్రిఁ గాఁ దరుగవు నా
కు న్నిటి దప్పెడుచొప్పున
నున్నది వేఁకియు జనించు నో యని తోఁచున్. 152

క. చనుబాలు గోప్రిలుబాలురు
గనుఁగొన వచ్చినను వారి గారవమునఁ గ
న్గొని చనుఁబాలఁ నొసంగెడు
పనిమీఁదన్ వ్రజముఁ జూడ వచ్చినవనితన్. 153

తరువోజ. అని వాడవాడకు నరుగుచుం గంట
నటునిటుం జూచుచు నం దెందునేని
విన వచ్చునేఁ జంటిపిల్లలయేడ్పు
విని లోనికిం జని పిలిచి తల్లులను
జనుఁబాల నొసఁగెద సతులార! యనుచు
సారెకుం బలుకుచు సకు లొల్ల కున్నఁ

జని యొందుచోటి కాచక్కిన పల్క
సరగున నందునిసతియింటి కేగి. 154

వ. ప్రాంగణంబునం గలపర్యంకంబునం బొత్తులలోన బూదెం గప్పబడిన నిప్పు పోలెఁ బ్రతిచ్ఛన్ననిజోరుతేజుండై యున్న బాలుం బ్రతిభావిశాలుం గాంచి సమీపించునంత. 145

ఉ. బాలుఁడు దుష్టరాక్షసనిబర్హణశీలుఁడు పాపతూలవా
తూలుఁడు లోకపాలుఁడు ప్రతుష్టమనస్సువిశాలుఁడున్ జగ
న్మూలుఁడు కాలకాలుఁడు సమున్నతశీలుఁడు సృష్టిచక్రసం
చాలనలోలుఁ డుక్తగుణజాలుఁడు సంభరితేంద్రజాలుఁడై. 156

ఉ. బాలకమారకగ్రహము వచ్చిన దంచు నెఱింగి పూతనన్
గీలితలోకయాతనను గించు తెఱంగునఁ గన్ను మూసి య
క్కాలమునం దొకండు నెఱుఁగం డను నట్లుగఁ బోల్చి చెప్పనై
బాలకులందుఁ దాను నొకబాలకు నట్లు నటించె నయ్యెడన్. 157

ఉ. పూతన దాదు లెవ్వరును బొంతను లేమి నెఱింగి బాలునిన్
జేతుల నెత్తి యంకమునఁ జేర్చి కొనెం దన కంతకుం డనం
తాతతదివ్యమూర్తి యని స్వాంతము సేయక రజ్జుబుద్ధిమై
భూతలమందు సుప్త మగుభూరిభుజంగముఁ బట్టు కైవడిన్. 158

ఉ. మెత్తనిచెయ్యి గల్గియును మెత్తన గానిమనఃప్రవృత్తియై
నత్తఱిఁ గోశసంవృతమహాసి తెఱంగున నున్న దానిఁ గ
న్నెత్తి యొకింతదూరముననే పొడఁగాంచియు నూఱకుండి ర
య్యొత్తులమాఱిమాయఁ జెలు లే మనఁ బోవక ధర్షితాత్మలై. 159

తే. పిదప నడ్డాలుగాఁ బట్టి మదవతి యగు
పూతనాసురి బాలునిఁ బొదివి కొనుచు
ఘోరవిషచర్చితం బగుగుబ్బచన్ను
గ్రన్ననన్ నోటిలోఁ బెట్టెఁ గన్నుఁ గప్పి. 160

చ. తటుకున రెండుచేతులను దారకుఁ డాతఁడు పట్టి చన్మొదల్
గుటుకు గుటుక్కు మం చులివు కొంచెము గానటు పుట్టఁ గ్రుక్కలన్

బటుగతి వేయుచున్ విషపుఁ బాలను గ్రోలెను దాని ప్రాణముల్
దిటచెడి పాలతో నుదరదేశముఁ జేరెడు నట్లు చేయుచున్. 161

వ. అయ్యవసరంబునఁ బూతన బిగువుచెడి. 162

మాలిని. విడుము విడుము చాలున్ విష్ణు మానాదుచన్నున్
వడి చెడి యొడలెల్లన్ వాడె నాప్రాణసంఘుల్
చెడియె నిలువఁ జాలన్ చిన్నినాయన్న! నన్నున్
మడియఁ జలుప కంచున్ మాటికిన్ వాఁగికొంచున్. 163

చ. విరవిర కాళ్ళుసేతులును వీసర వోవఁగఁ గొట్టుకొంచు నే
త్రతతి నిలువెల్లఁ జెమ్మటలు దేరి ప్రవాహము రీతిఁ గాఱుచో
దెఱచిననోట లాల కడుఁ దొట్టువ గట్టి పడంగఁ గ్రిందఁ బె
ల్లఱచుచుఁ గూలె నేలకుఁ దదారవ మెల్లెడ నిండె మొల్లమై. 164

సీ. దంభోళివినిహితధాత్రీధరంబు నా
రాక్షసాంగనదేహ మాక్షితిఁ బడెఁ
దత్పాతశబ్ద మత్యుత్పాతమును బోలి
కొండలఁ బగిలించుదండి నుండెఁ
బతనవేగంబున క్షితిరుహంబులు గూలెఁ
బిండిపిండిగ నయ్యెఁ బృథివి యెల్లఁ
బ్రళయకాలికవజ్రపాత మో యని ప్రజల్
చెట్టా కండుగఁ బాఱి రట్టియెడల

తే. లాలలో మున్గి కాళ్ళేతు లోలిఁ జాపి
కొఱడు దేరినవెండ్రుకల్ గ్రుచ్చ నేల
నాల్క మీఁదికి మూరెడై చిల్క నెత్రి
భీకరం బయ్యె రాకాసిపెద్దమేను. 165

సీ. మఱియు నీషామాత్రమహితోగ్రదంష్ట్రలు
గిరికందరంబు నాఁ గెరలు నాస
గండశైలంబులకరణిఁ వ్రాలెడు స్తనం
బులు ప్రకీర్ణారుణమూర్ధజములు

నంధకూప మనంగ నగుగభీరాక్షియు
గ్మము పులినారోహకమ్ము మఱియుఁ
జెఱువుకట్టలు వోలు చేతులుం గాళ్ళులు
నెండినహ్రదమట్టు లుండుకడుపు
తే. కలిగి రక్కసి దేహ మక్కరణి బీతుఁ
గొలువ గోపగోపీజనంబులు కనంగ
నోడి పఱచియు ధైర్యము నూని కొంత
చెంత కరుదెంచి పైనున్న చిఱుత నరసి. 166

ఉ. చేతులు గాళ్ళు ద్రిప్పుచును జిన్నెలు వన్నెలు కొన్ని చూపుచున్
పూతనమేనిపై నిలిచి పొంపిరివోయెడుపాపఁ జూచుచున్
వ్రేతలు గుండె కొట్టుకొన వేదన లొందెద రింతె కాని యే
నాఁటియుఁ బోయి వానిని గొనం గమకింపదు భీతిపెంపునన్. 167

ఉ. గుండెలు కొట్టుకొం చపుడు గొల్లున నేడ్చుచు నందపత్నియున్
గొండొకయింతలోపలన కూడినరోహిణియున్ రయంబునన్
గొండకు నెత్తువచ్చు నలకూళికళేబర మెక్కి వింతలన్
మెండుగఁ జూపుబాలకుని మేకొని తెచ్చిరి ద్రుచ్చి కౌఁగిటన్. 168

వ. అంతలో వృద్ధగోపికలు యశోదారోహిణులతో గోపబాలునకు గోపుచ్ఛభ్రమణాదుల రక్షావిధిం గావించి గోమూత్రంబున స్నానంబు చేయించి గోరజంబు మేనం బూసి ద్వాదశాంశంబులఁ గేశవాది ద్వాదశనామంబులతో గోమయంబున నపమృత్యుపరిహారతంత్రంబు నిర్వర్తించి శుచిస్నాతలై యంగన్యాసకరన్యాసంబులు గావించుకొని బాలదేహాంగంబులమంత్రాక్షతవిన్యాసంబుగావించికృష్ణునుద్దేశించి.

సీ. అజుఁడు రక్షించు నీయంఘ్రియుగ్మమ్మును
నణిమ నీజానువు నంటి ప్రోచు
యజ్ఞపూరుషుఁడు నీదగుయూరువుల నేలు
హరి నీదుకటితటు మరయుచుండు

హారివదనుఁడు నీజఠరముఁ గాపాడుఁ గే
శవుఁడు నీహృదయంబు సాఁకు నీశుఁ
డెపుడు నీయెదఁ బ్రోచు నినుఁడు నీకంఠముఁ
గాచు విష్ణువు నీదుఘనభుజములు
తే. ప్రోచెడుఁ ద్రివిక్రముఁడు నీదుముఖము నీశ్వ
రుండు నీశీర్షమును మన్ఁచుండు మఱియుఁ
జక్రి గదియును శార్ఙ్గియు శంఖ ఖడ్గి
వెనుక మునుఁ బ్రక్కలం దుండి మనుచుచుండు. 170

వ. మఱియు నీయింద్రియంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారా
యణుండును, జి తంబును శ్వేతద్వీపపతియు, నీమనంబును యోగీశ్వ
రేశ్వరుండును, నీబుద్ధిని బృశ్నిగర్భుండును నీయాత్మను భగవంతుం
డును గాపాడుచుండుదురుగాక నీవు పండుకొనునప్పుడు నాడుకొను
నప్పుడును నిదురించునప్పుడును నడచునప్పుడును భుజించుచున్నప్పు
డును నిన్ను జగన్నాథుండు లక్ష్మీపతి వైకుంఠుండు రక్షించుచుండుఁ
గాక యని ప్రణయబద్ధాంతరంగ లగుగోపాంగనలు శ్రీకృష్ణునకు
రక్షాలంత్రంబు గావించి రంత యశోద బాలునకుం బాలు గుడిపి
శయినింపం జేసె నాలో మధురాపురంబుననుండి నందాదులు చను
దెంచి పెనుఁగొండవోలెం గూలియున్న పూతనం గాంచి విస్మితులై
వసుదేవుండు చెప్పినచొప్పున నుత్పాతంబు లుత్పన్నంబు లగుటం జేసి
వసుదేవుండు త్రికాలజ్ఞుం డని పొగడి గండ్రగొడ్డళ్ళం బెట్టి పూతన
కళేబరంబు పగులం గొట్టించి గోకులంబునకు దూరదూరంబగుచోట
వేఱువేఱు చితులం బేరిపించి తదవయవంబులు దహింపం జొచ్చి
రప్పుడు. 171

—♦ నందాదులు మధురనుండి వచ్చుట ♦—

ఉ. కాలెడుపూతనాంగములు కమ్మనివాసన గల్గి ధూమముల్
నాలుగుమూలలన్ విరిసి నాటుకొనెన్ సకలాశ్రయంబులన్

రేలను మాలతీకుసుమరేఖలనుండి కుమారవాయుసం
చాలనమూలమై వెడలుసౌరభమో యన నొప్పెఁ జెప్పఁగన్. 172

తే. పిల్లలం జంపి తినియెడు నల్లద్రావుఁ
డైనను జిఘాంస చే నైన హరికి స్తన్య
మొసఁగె దానికిఁ బొందరా కుండుగతులు
గలనె తద్దేహమునఁ బాపమలము గలదె. 173

ఉ. భక్తులచిత్తపద్మముల భాసిలుచుండెడు కృష్ణపాదముల్
యుక్తనిశీర్ష మందు బలె నుద్ధతి నుండినదానిమేనిపై
సక్తము లయ్యెఁ గన్నతల్లి స్తన్యమునుం బలెఁ గ్రోలె స్తన్యమున్
ముక్తినిఁ బొందునామె మెయి మొల్చెనె దుర్భరపూతిగంధముల్.

తరువోజ. పాలిచ్చి పూతన పడసె మోక్షంబు
పాలిచ్చి తల్లులు పడఁతులు మఱియు
నాలును బొందెడునట్టిధామము మ
హాత్వ మింతని చెప్ప నగునె వారెల్ల
నేలోటునే లేక యెప్పుడు జన్మ
మృత్యువుల్ లేనట్టియిద్ధతేజంబు
గ్రాలవిష్ణునిఁ గూడి కైవల్యసుఖము
గాంచెద రెప్పుడున్ గదలిక లేక. 175

వ. అంత నందగోపుండు పూతనాగమనాదికం బంతయు నాకర్ణించి యపుడు తనపట్టి వెండియుం బుట్టినవానిగ నెంచుచు వాని నెత్తుకొని శిరంబు పుడుకుచు మూర్ధాఘ్రాణంబు గావించి లాలించె నిది గోప బాలకృతాద్భుతంబుల మొదటిలెక్కం బొంది యుండె ననినఁ బరీక్షిత్తుండు. 176

క. మానుషరూపము గైకొని
మానాథుఁ డొనర్చెఁ బో యమానుషచర్యల్
వానిని సాకల్యము గా
నానతియి మ్మాలకింప నభిమత మయ్యెన్: 177

వ. ఆకర్ణింపు మని శుకుం డి ట్లనియె నట్లు కొన్నినాళ్ళు చనినసిమ్మట.

సీ. బాలుండు బోరలఁ బడె నంచు జన్మర్క్ష
యోగమునందు మహోత్సవంబు
వాదిత్రములు మ్రోయ వేదవాదనములు
బోరుకలుగ గీతములు సెలంగఁ
బుణ్యాంగనలు చేరి ముచ్చటల్ దెలుపుచో
నందుసతి మహానందమునను
గృష్ణున కభిషేకకృత్యముల్ గావించి
స్వస్త్యయనంబును సలిపి నట్టి

తే. ద్విజులకుం దక్కవారికి వివిధదాన
ములు పొనర్చియు నెల్లరఁ బుచ్చి పిదప
నిదురమత్తునఁ గను మూయ నిజకుమారుఁ
బండుకొనఁ జేసి జోకొట్టెఁ బాట పాడి. 179

—♦ శ క టా సు ర సం హా ర ము ♦—

వ. ఆలో కంసప్రేరితుం డగుశకటాసురుం డనువాఁడు తనతిరస్కరిణీ విద్యాప్రభావంబున నట వచ్చి పాలు పెరుగు మీఁగడ వెన్న నెయ్యి లోనగుపదార్థంబులం బెట్టుకొనుశకటంబునం జొచ్చి యెవ్వరు లేనియప్పు డప్పాపపయిం బడి చంప నుండె నాసమయంబున. 180

ఉత్సాహము. నిదుర నొందెఁగొడు కటంచు నెలఁత లేగుచుంట నా
సుదతి వారి గౌరవించుచోప్పులందు నుండుటన్
నిదుర లేచి పాల కేడ్చె నెతి నెసంగు బాలుఁ డ
య్యది జనిత్రి వినమిఁ దన్నులాడె నతఁడు కాళ్ళతోన్. 181

సురుచిరవృత్తము. అతిమృదులము లగునాతనియంఘ్రిలతాపున దాఁకి వె
యతులితదధిఘృతకుప్యసమంచితమై చనుబండికిన్
జితికియు నిలఁ బడునట్లుగఁ జేసె ననంతరమందునన్
సుతుఁ గనుఁ గొనియెదునిచ్చ యశోద వెసం జనుదెంచెన్ 182

మత్త. అయ్యశోదపదంబుల న్బడి నట్టు నిట్టుగఁ గొట్టు చో
య్యొయ్య నేడ్చుచుఁ దొట్టెలోపల నున్న కన్నకుమారునిన్
బ్రియ్యనై యిరుసూడి చక్రము ముక్కలై పడు బండినిన్
జయ్యనం గని సంభ్రమించుచుఁ జాన లెల్లరు మూఁగఁగన్. 183

తే. అపుడు నందాదిగోపకు లరుగుదెంచి
బాలుఁ డేడ్చుచుఁ దన్నుట బండి విఱిగె
నని తలంచియుఁ గాదిది యబ్బురంబు
శిశువు తా నిట్లు చేయుట చెల్ల దనిరి. 184

వ. అంత యశోద రోదనంబుసేయు దామోదరు నెత్తుకొనియె నాలో శక
టాంగంబులనుండి రాక్షసుండు పడి చచ్చె నంత నందుండు స్వస్త్య
యనంబు నడిపించి గ్రహశాంతులు జరిపించి వివిధదానంబు లొనరించె
ననంతరకాలంబున నొక్కనాఁడు. 185

ఆ. నందగోపవనిత నందనునిం దన
తొడను నిల్పుకొనుచుఁ దోడుతోడ
ముద్దు లాడుచుండఁ బెద్దకొండ యనంగ
బుడుత భార మగుట మోయ లేక. 186

మ. వెగడుం గుడ్చుచు విస్మయంబునను గోపీలోకరత్నంబు య
త్నగతిం గ్రిందికి దింపి యీతఁడు జగద్రక్షాతిదక్షుం డిటుల్
జగతీభారము వాపఁ బుట్టె నని సుస్వాంతంబునం దెంచుచుం
బొగడం జొచ్చెను భక్తిసంభరితయై పూర్ణాబ్జబుద్ధిస్పృహన్ 187

వ. అయ్యవసరంబునఁ గంసప్రబోధితుం డయినతృణావర్తుం డను రాక్ష
సుండు నందగోకులంబుఁ దరియ వచ్చె నప్పుడు. 188

—• తృణావర్తసంహారము •—

సీ. విష్ణుపదం బెల్ల విఱిగి కూలెనో యన
హోర్మనుసంరావ మూర్విఁ నిండె
నిది దుర్దినం బేమొ యేదిక్కు నూచినం
గానఁ బడనియట్లు క్రమ్మె నిరులు

కనుల గోడలు పెట్టుకరణి శర్కరలతోఁ
బెనుదుమ్ము జగమెల్లఁ బెనఁగి కొనియెఁ
బెళపెళార్భటులతో విఱిగి పెన్వృక్షముల్
జగతి నంతయుఁ జాపచుట్టుఁ బడియెఁ

తే. జెత్తయుఁ జెదారమునుఁ గల్గి మొత్తమగుచు
సుడులు సుడులుగ నింగిపైఁ గడిమి మెఱసి
గుడుగుడుంగుంచములు తిర్గికొనుచుఁ బెద్ద
గాలి వీచెను బ్రళయంబువోలె నపుడు. 189

ఆ. ఒకముహూర్తకాల ముండె రజస్తమో
వృతమ యగుచు గోష్ఠ మెలమి దప్పె
శర్కరాభిహతము జన మెదిరిం దన్నుఁ
దెలియఁ జాలనట్టిస్థితికి వచ్చె. 190

మ. సుడిగాలిం బడి పాంసువర్షమునఁ గృష్ణుఁ పేద నాపాప నెం
దిడెనో మున్నది కానలేక కరుణాన్వితాత్మయై నేలపైఁ
బడి శోకించెను నందగోపసతి తత్పాంసూద్గతుల్ తగ్గి పో
యెడునంతం జనుదెంచి గోపికలు తా మెంతేని దుఃఖించుచున్. 191

భుజంగప్రయాతము. తృణావర్తుఁ డంతన్ దృణంబట్లు కృష్ణున్
గణించె న్మదిన్ మున్ గ్రమం బేర్పడంగన్
గుణాతీతుఁ డొటన్ గొనన్ శక్తి లేమిన్
గణేయుండ యయ్యెన్ గతప్రాణుఁ డంచున్. 192

శా. వాతాకారముతోడ మీఁదికిఁ దృణావర్తుండు తా నింత ద
వ్యాత్తాత్మీయశ్వాని గొంచుఁ బోఁ గలిగి పై నత్యంతభారంబునన్
స్ఫీతం బైనమహామహీంధ్ర మన నాశ్రీకృష్ణునిం బెట్టి పో
నాతం డెంచెను గాని కంధరగతుం డై వీడఁ డాడింభుఁడున్. 193

ఉ. ఆర్తనినాదమున్ సలుపు చట్టిటు వోవఁగ శక్తి వోఁ దృణా
వర్తుఁడు కంటిగుడ్డులవి పైపయి రాఁగ నిడూర్చుచున్ మహా

వర్తము లేర్పడం దెగినప్రాణము గల్గినదానఁ గ్రిందికిఁ
వర్తనిఁ దప్పఁ గూలఁబడె వత్సయుఁ దాను ధరాతలంబునన్. 194

తే. అంతరిక్షమునందుండి యట్లు నేల
బండరాతిపయిం బడి బ్రద్దలైన
మేనుగలదైత్యుగళమును బూని పడిన
డింభకునిఁ గాంచి వ్రేత లేడ్చిరి భయమున. 195

వ. మృత్యుముఖప్రముక్తుం డగువానివలెఁ దృణావర్తవిముక్తుండై రక్షో
వక్షస్థలలంబమానుం డగుకుమారు నెత్తుకొని పోయి వ్రేతలు మాత
కిచ్చిన నామెయు నందాదులు వానిం జచ్చి పుట్టినవానిగం దలంచి
శాంతికర్మంబు లాచరించి రనంతరంబ. 196

—♦ యశోద కృష్ణునినోటిలోఁ బ్రపంచముం జూచుట ♦—

సీ. ఒకనాఁడు బాలకు నొడిలోన నిడుకొని
నందభామిని మహానందమునను
జన్నుఁ గుడుపుచుండి కన్ను లాతనిముఖ
పద్మమునం జేరుపగిదిఁ జేసి
లాలించుచున్నచో లీలామనుష్యుఁ డా
తం డావులించె నత్తరుణమందుఁ
గనుచున్నయప్పు డాకసము రోదసియును
జ్యోతిర్గణంబును సూర్యుఁ డిందుఁ

తే. డగ్ని దిక్కులు గాలియు నంబుధులును
ద్వీపములు గోత్రములు నదుల్ విపినములును
జంగమస్థావరంబులు జంతువులును
గాన వచ్చె యశోద కయ్యాననమున. 197

ఆ. అట్లు విశ్వ మెల్ల నాస్యంబునం జూచి
కంప మొంద నొడలు కన్ను మూసి
విస్మయంబు నొందె వెలఁదుక తనలోనఁ
గొడుకుచందమునకుఁ గడు నడరుచు. 198

వ. అంత నక్కుమారుండును శుక్లపక్షక్షపాకరునిచందంబున దినదిన ప్రవర్ధమానుండై. 199

సీ. తల యెత్తి చూచుచు లలి నొత్తగిలుచును
గొన్ని నాళ్ళకుఁ దానె కూరుచుండె
నది యిది చే నూని పదిలంబుగా లేచి
క్రమముగాఁ దుదకు విద్దెములు చేసెఁ
బడుచు లేచుచు వేడ్కపడి తప్పటడుగులు
వైచుచు నేర్చి చివరకు నడిచె
నాఁ యంచు నూఁ యంచు నట్టిట్టు లాడుచు
నాఁటికి నాఁటికి మాట లాడె

తే. బొమ్మలను గూర్చుకొని చాల సమ్మతమునఁ
బొంగి యాడుచు నంతట నంగడింగ్లఁ
గూడి యాడుచుఁ బాడుచుఁ దోడివారి
వేడుకల కయ్యెను యశోదప్రియసుతుండు. 200

వ. ఇట్లున్న కాలంబున. 201

— ♦ గర్గుఁడువచ్చి రామకృష్ణులకు జాతకర్మాదు లొనర్చుట ♦ —

తరళము. యదుపురోహితు డైనగర్గుఁ డనంతరంబున నొక్కనాఁ
డుదయ మావసుదేవుపంపున నూర్జితం బగునందరాట్
పదముఁ జేరఁగ వచ్చె వచ్చినవానిఁ గన్గొని నందరా
జెదురు గాఁ జని తోడితెచ్చి యనేకభంగులఁ గొల్చుచున్. 202

వ. సుఖాసనాసీనుం గావించి యర్ఘ్యపాద్యాదుల నాతిథ్యం బొసంగి మహాత్మా! మీయట్టివారిదర్శనంబు గృహస్థుల మగుమాకు నిశ్శ్రేయసంబున కగుచున్నయది మఱియుఁ బ్రత్యక్షపరోక్షజ్ఞానదంబును సూర్యాదిగ్రహంబుల కయనంబు నతీంద్రియంబును వేదపరాయణంబు నగు మహాశాస్త్రము నీవు నిర్మించితివి నీవు మహానుభావుండవు బ్రహ్మవిదుత్తరుండవు మానందనులకు వైదికంబున జాతకర్మాది సంస్కారంబులు గావింపఁ గోరుచుంటి ననిన గర్గుం డి ట్లనియె. 203

ఆ. ఆదినుండి నేను యాదవులకుఁ బురో
హితుఁడ ననుచు లోక మెఱుఁగుఁ గాన
నీసుతునకు నేను జేసినజాతక
ర్మాదు లవని సంశయాత్మక మగు. 204

సీ. ఆనకదుందుభితో నీకు నెయ్యము
చిక్కన యని ప్రజల్ చెప్పుకొందు
దేవకి కష్టమ మై వెలసినగర్భ
మాఁడుది యగుటకు నయితి లేదు
దేవకీదారిక తెలిపినమాటల
నితఁడు నీసుతుఁడుగాఁ డెన్న దేవ
కీదేవిసుతుఁ డని కించు కంసుం డెంచు
దాన ననర్థము దాపుర మగు

ఆ. అనిన నందుఁ డనియె నగు నగు మావకుల్
కూడఁ జూడకుండ గోవ్రజమున
స్వస్తివాచనంబు సలిపి ద్విజాతిసం
స్కారమాచరింపఁ జను మునీంద్ర. 305

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై గర్గుండు నిజచికీర్షితంబు నట్టిది యగుం గావున నేకాంతస్థలంబున నుండి రోహిణీయశోదాపుత్రులకు రామకృష్ణు లని నామకరణంబు గావించె నందు రోహిణీపుత్రుండు సుహృదుల రమింపఁ జేయువాఁడు గావున రాముండు బలాతిశయంబున బలుండు సమ్యక్కర్షణంబున సంకర్షణుం డనియు యశోదాపుత్రుండు కృష్ణవర్ణంబు గలిగి యుండుటం జేసి కృష్ణుం డనియు వ్యవహరింపం బడుచుండు రని నందునిం గాంచి. 296

సీ. ఇపుడు నీసుతుఁ డగునితఁడు మున్నెప్పుడో
వసుదేవసుతుఁ డయి వన్నె గాంచి
వాసుదేవుం డయ్యె నోసాధుమతి! మఱి
యును గుణకర్మసముచితము లగు

నామముల్ రూపముల్ నలువొందు వాని నే
నెఱుఁగను బెరలైన నెఱుఁగ రెవరు
గోపబాలుం డగునీపూరుషుని మూల
మున మీరు శుభములఁ బొందఁ గలరు
తే. మున్ను దస్యుపీడితులు సత్పురుషు లితని
రక్షణంబున నొప్పి రీరక్షకు నెడఁ
బ్రీతి గావించుమానవుల్ భూతలమున
నెట్టిగోడలును బొందఁ రోయిద్ధ శేజ. 207

ఉ. ఓయి వ్రజాధినాథ! విను ముత్తముఁ డీభవదీయనందనుం
డీయనకీర్తి చేత సకలేడ్యసమర్థతచేతఁ దేజుచేఁ
బాయనిలక్ష్మిచే సుగుణపద్ధతిచేత బలంబుచేత నా
రాయణుఁ బోలు నీతని సమాహితచిత్తముఁ గోడఁ జూడుమా. 208

వ. అని యాదేశించి గర్గుండు నిజగృహంబునకు నిర్గమించె నంత నందుం
డానందకందళితాంతరంగుండై కృష్ణు నెఱింగి తన్నుఁ గృతార్థజన్ము
నిగా నెన్నుకొనుచుండె ననంతరంబ. 209

—• రామకృష్ణుల బాలక్రీడలు •—

మత్త. గోకులంబున రామకృష్ణులు గూడిమాడి చరించుచున్
రాకొమాళ్ల గుటం జనంబులు రాజసప్రతిపత్తిమై
వాకులం బచరించి గౌరవభావమున్ మదిఁ జేయుచున్
రాకపోకలు సల్పుచుండిరి రామకృష్ణులకోరికన్. 210

క. పాఁకుచు డేకుచు నాడుచు
లోకము తన్మోంచుచుండ లో మురియుచు నా
శ్రీకృష్ణుండును బలుఁడున్
వాకొనన్నై రప్పు డాటపాట లెసంగన్. 211

ఉ. గజ్జెలచప్పు డుప్పతిలఁ గాళ్లను ముందుకు కుంచి యిర్వురున్
బుజ్జవ మారఁ గట్టుకొని పోవుచు వచ్చుచు నచ్చటం గడున్

గుజ్జగురొంపిలోనఁ బడి కొట్టుదురో తమతల్లు లన్భయం
బజ్జగఁ బుట్టినట్లు చలితాంగకులై చరియించి రెంచఁగన్. 212

చ. అడు సనునంగరాగమున నావృత మైనశరీరలక్ష్మిచే
నడరెడుబిల్లలం దిగిచి హస్తయుగంబునఁ దల్లు లార్తలై
యొడి నిడికొంచు చన్గుడుపుచుండిన నుండక మిట్టి క్రిందికిన్
బడి వడి నేడ్చుచుండెదరు బాలకు లిద్దఱు ముద్దు లొల్కఁగన్. 213

క. ప్రాఁకుచుఁ జని చని లేఁగల
తోఁకలు గొని లాగి లాగి తోడిబడఁ బడుచున్
వీఁకమెయి నాడుబాలుర
పోఁకలు గనుచుండ్రు పనులఁ బోవక బోఁటుల్. 214

మత్త. రామకృష్ణులతల్లు లిద్దఱు రాతిరిం బవ లెప్డు నా
కోమలాంగకు లాట లాడఁగఁ గూడినప్పుడు నిప్పులున్
జీమ దోమలుఁ దేలు పాములుఁ జెఱ్ఱి గొఱ్ఱెలు నఱ్ఱి లే
మేమి చేసెడినో యటంచును నేమఱిల్లక యుం డ్రిటన్. 215

క. ఈలీల గోష్ఠమందున్
బాలురు వా రుండి కొలఁదివారమ్ములకే
కాళుల నడుగులు వేయఁగఁ
జాలినవా రైరి సర్వజనమోదముగన్. 216

ఉ. అన్నను వెంటఁ బెట్టుకొని యట్టిటు మెట్టుచుఁ దోడివారితో
వెన్నెలవత్తులున్ గోణియబిళ్ళలు కొక్కులు నుప్పుపట్టెలున్
మున్నగునాట లాడుచును బోయి వ్రజంబున గొల్లయిండ్లలో
వెన్నలు మీఁగడ ల్మెసవి వెన్నుఁడు గ్రన్ననఁ బాఱు చుండెడిన్.

మ. ఒకచో వ్రేతలు మండపం బొకఁ డ దెంతో వింతఁగాఁ గట్టి భ
క్తి కడుం బర్వఁగ రామవిగ్రహ మటం దీపింపఁగాఁ జేసి పూ
జకుఁ బూన న్వడి వచ్చి కృష్ణుఁ డటఁ బెల్చం జేసి కూర్చుండి మా
- మకపూజం బొనరింపుఁ డేన మిముఁ నోమం జాతు దేవుండ నై.

ఆ. గోపకాంత లెల్ల గోవిందుద్వాదశి
వ్రతము చేసి పంచభక్ష్యములును
బహువిధంబులైనపరమాన్నములు గూర్పఁ
గృష్ణుఁ డవి భుజించుఁ గెడపి వారి. 219

వ. ఇట్లు కొన్నినాళ్ళు నడచినంత. 220

— గోపికలు యశోదతోఁ గృష్ణునికొంటెపనులం జెప్పుట —

మ. అవలం గృష్ణుఁడు రాముతోఁ గలసి యందం దుండువారల్ సమా
నవయస్కుల్ జనుఁదేర నాడుకొనుచుండం గాంచి గోపాంగనల్
దవులన్ సంభ్రమ మెంతయేని మదికిన్ దన్మాత యానందగో
పవధూరత్నముఁ జేరి యిట్లనిరి తాత్పర్యంబు సంధించుచున్. 221

సీ. ఆలకై క్రేపుల నసమయమున విడ్చి
పిలుచు నవ్వుచు నింటఁ గలుగువారి
వారు రాఁ గని సందు నారసి చని లోని
కటఁ బాలు పెరుగుల నట్టె త్రావి
దొంగతనంబునన్ దొరకినవానినిఁ
గడుపారఁ దాఁ దిని కడ మెలంగు
క్రోఁతులకుం బెట్టుఁ గ్రోఁతులు లేకున్న
తిని తాను భాండముల్ తునుగఁ గొట్టు

తే. ఇంటఁ దినుబండ మేదియు నంట కున్నఁ
బిల్లలను గిల్లి యేడ్పించి వెస గమించు
నింటివారలు లేకుంట లెఱిఁగి కొనుచు
నెట్లొ పొరుగిండ్లలోఁ జొచ్చి కృష్ణుఁ డకట. 222

ఉ. ఎత్తగునుట్టిమీఁద గల దెట్లు భుజించెద నంచు నెంచి లో
హత్తినబుద్ధిపెంపున నొకంతటిలో నటఁ క్రింద ఱోటిపై
మెత్తలు పీటలున్ నిలిపి మీఁదికి నెక్కియు నందకున్న చో
నత్తఱి గుండక్రింద బిల మట్టె పొనర్చి భుజించు మీఁగడల్. 223

క. చీకటియిండులలోనన్
బోకకు రాకకును దీపములసాయం బీ
నీకొడుకున కక్కఱ లే
దేకడ మెయిఁ గలుగుమణులె యెల్లం దెలుపున్. 224

మ. దొరబిడ్డండ నటంచు దొంగపనులన్ దూఁబూచులన్ జేయుచున్
గరువం బేర్పడఁ జిన్నికృష్ణుఁ డెపుడున్ గ్రామంబునం గల్గు నె
ల్లరగేహంబుల కేగి నావి యివి యెల్లన్ నేన కైకొందు మీ
రరుగుం డెక్కడికే ననున్ గడిమిమై నత్యంతధార్ష్ట్యంబునన్. 225

ఉ. కన్ను మొఱంగి గోపికలఁ గ్రిన్నన వారలలోబవంతులం
దున్నపయోఘృతంబుల మహోత్సుకతం గొని త్రావు కృష్ణునిన్
గన్నులఁ గాంచి దొంగ యని కన్నియ యోర్తన నాతఁ డీగృహం
బెన్నఁగ నాది దొంగ వగు దీవని పాఱును గద్దరించుచున్. 226

తే. పదుగు రొకసారి తమయిండ్లఁ బాలు పెఱుగు
గొనెడుకృష్ణునిఁ గని యెత్తుకొని యశోద
కిదిగో నని చూపఁ బోఁ దమయెదల లేక
తల్లికడ నుంటఁ గని సిగ్గు దగులఁ జనిరి. 227

తే. ఇట్లు చెప్పినఁ దల్లియుఁ గృష్ణుమీఁటి
ప్రేముడిం జేసి వారల విశ్వసించి
తనయునకు బుద్ధిఁ జెప్పంగఁ దలఁప దయ్యెఁ
బలుకుబడిరీతిఁ దనబిడ్డ సలుపఁ డనుచు. 228

మ. నవనీతాంచితహస్తుఁ డైనఁగొడుకున్ గైకొంచు నందాంగనా
సవిధంబందుఁ దదాగముం దెలుపునాశం జేసి గోపాంగనల్
రవళిం జూపఁగ వేఱువేఱ చని వారక్షంబులం దుండుమా
ణవకుం గానక తల్లిచెంతఁ గని మందాక్షంబుఁ గైకొం డ్రెదన్. 229

—• మృద్భక్షణ విశ్వరూపప్రదర్శనాదికము •—

తే. గొల్లపిల్లలు రామాదు లెల్లఁ గూడి
వేడుకం జేసి యాటల నాడువేళ

మట్టి మెసవెఁ గృష్ణుం డని మాత యగుయ
శోదకుం బోయి చెప్పిరి చుట్టువారి. 230

వ. అనిన నామె కుమారునికరంబు వట్టుకొని వెఱపించుచున్ వెగడు
గుడుచుకృష్ణుం గాంచి యి ట్లనియె. 231

శా. అన్నా! నీయన యీకుమారులును నీ వామట్టినిం దింటి వం
చు న్నాకున్ వచియించి రేమిటికి నీచొ ప్పిట్లు గా నయ్యె నీ
కు న్నాలోఁగిట నేమి లేదు కొడుకా! యి ట్లేల మ న్మెక్కుటల్
చన్నె రోగము రాదె మ న్నమృతమే చౌలూరునే దారకా. 232

వ. అనినఁ గృష్ణుండు గడగడ వడంకుచు బుడిబుడి దీర్ఘములం దీయుచుఁ
దల్లి కల్లన ని ట్లనియె. 233

ఉ. ఆటలలోన నేను దమకందఱికంటెను మించియుంటచే
మాటికి నాపయిన్ గినిసి మాతకుఁ జెప్పెద మంచు నన్నయున్
బాటి యొకింత లేక యిటు పల్కిరి నీ విట నన్నుఁ గొట్ట స
య్యాటగఁ జూచి నవ్వుకొనునట్టిర వై రిది సత్య మమ్మరో. 234

మ. అకటా! నేను నిసుంగునే మను దిన న్స్వాంతంబునం దెంతునే
సకలం బుండెడునింట నాకినుటకున్ క్షామం బనం జెల్లునే
యిఁక నే నేమి వచింతు నీదుకడ వీ రెల్లన్ నిజం బాడ రే
టికిఁ బెక్కాడఁగ సత్యమున్ దెలియుమాడ్కిం గన్మ నామాటలన్.

క. అని నోరు తెఱచి తల్లీ!
కను మన్నె కలదొ మిన్ను కలదో యనుచున్
దనజనని దరియ వచ్చిన
వనితామణి తనదుమోము వంచిన దగుచున్. 236

మ. కనియె న్నందునిసుందరాంగి త్రిజగత్కల్యాణకృత్కృష్ణవ
ద్మనిభాస్యాంతరమందు సాబ్ధివనగోత్రిక్ష్మారుహాగ్రామప
త్తనహార్మ్యాంచితభూమిఖండ ముడురాట్సూరార్కముఖ్యప్రభా
పరిణుతాదిత్యపురందరాదిక మహాభాండమ్ము బ్రహ్మాండమున్. 237

తే. మఱియు దిక్కులు ద్వీపముల్ మధుర వ్రజము
దన్నుఁ దనవారిఁ బెరవారిఁ దక్కుమారు
వదనగహ్వరమునయందు వరుసఁ జూచి
నివ్వెరంపడి యి ట్లని నెమ్మిఁ దలఁచె. 238

మ. ఇది స్వప్నం బగు నేమొ కానియెడ నేదే మాయ కల్పించిరో
త్రిదశుల్ నామది మోహసంకలితమై తే జేదె నో కాదయే
నెదియో భూతవికారమో యిది యుఁ గా దే నాదునీపట్టికిన్
విదితం బైనమహాత్మ్యయోగ మనుచున్ వీక్షింపఁగా వచ్చునో. 239

చ. మనమునఁ బుద్ధిఁ గర్మమున మాట నెఱుంగ నగోచరార్థమై
కనఁబడు నీజగ త్తెవనికై వశమై యలరారునో నిజం
బనఁ బడి దుర్విభావ్యుఁడు తదాశ్రియుఁడై వెలుగొందుచుండునో
ఘనుఁ డగునమ్మహామహు జగద్గురు నే శరణంబు వేఁడెదన్. 240

ఉ. ఏను యశోద నీవ్రజము నీగృహరాజము నెల్ల నావి నే
నేనెఱి మీఱునందునకు నేలికసానిని నేన నేటి నా
కీనెఱకాఁడు పుత్త్రుఁ డని యెవ్వనిమాయను మోహితాత్మనై
మానఁతి యుంటినో యతని మానసవీథి భజింతు నీశ్వరున్. 241

వ. ఇట్లు విదితతత్త్వార్థబోధయై యశోదాదేవి దీపించుచుండఁ బరమే
శ్వరుండు పుత్రస్నేహమయం బగునీశ్వరమాయం గల్పించుటం జేసి
తదంతరంబున వినష్టవిజ్ఞానమతియై నందాంగన నందను నానందంబున
నంకంబునం గూరుచుండం బెట్టుకొని చిబుకంబు పుడుకుచు ముద్దు
వెట్టుకొని. 242

మ. అగు వేదంబులు వేదశీర్షములు సాంఖ్యంబు ల్మహాయోగముల్
తగ నెవ్వాని నుతింపఁ జాలనివియై తబ్బిబ్బులం బొందునో
భగవంతుం డగువాసుదేవు నతనిన్ స్వప్రేమపాత్రాత్మజుం
డగు నంచున్ మది నెంచె మోహవశతన్ హార్దంబు సంధించుచున్.

—♦ యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము ♦—

చ. అనుడుఁ బరీక్షితుం డనియె నాజగదేకపతిన్ రమాపతిన్
దనయునిఁ గాఁ దలంచుచును నందుఁడు నాతని పత్నియున్ బురా
తన మగుకాల మెం దెపుడు తారు పొనర్చిరొ పుణ్యకర్మ మె
ఫ్లను భజియించువా రగుచుఁ బొందఁగ నైరి ముదంబు బాపురే.

సీ. అనిన శుకుం డను నవనీశ వినుము మున్
వసువులలో నతిప్రవరుఁ డైన
ద్రోణుండు ధర యనునేణాక్షితో ధర
జనియించు నట్టు లాజ్ఞాపితుఁ డయి
పరమేష్ఠిఁ గని బల్కె ధర నైనమాకు నీ
శ్వరభక్తి బహుళమై వఱలు నట్లు
పొనరింపు మన స్వాయంభువు నీవు కోరిన
ట్లవు నని పుచ్చె ద్రోణాఖ్యు నతఁడు

తే. నందుఁడై పుట్టె ధరయును నందపత్ని
యగుయశోద యయ్యెను వారి కాకుమార
భూతుఁ డగుకృష్ణుపై భక్తి పొసఁగ నయ్యెఁ
గృష్ణుఁడును వారి కానంద మొసఁగఁ జేసె. 245

తే. ఒక్కనాఁడు దాసీజన మొండు పనికిఁ
జనినయప్డు యశోద తాస్వయము గా నె
పెరుగుఁ జిలుకుచుఁ గృష్ణుని పిన్న నాటి
లీలలఁ దలంచుచుం బాడె నోలి నపుడు. 246

చ. వడిఁ గుడి వైపుగా నెడమవైపుగఁ జేతులు త్రోమ్ము శీర్షమున్
మెడయును ద్రిప్పుచు న్నిలువునే నది యెల్లఁ జలింప గాజులున్
గడియములు న్మొలం గలుగుగజ్జెలు గల్గలుమంచు మ్రోయఁ జి
త్తడిగను జెమ్మటల్ మొలువఁ ద్రచ్చుచునుండె యశోద మేల్దధిన్.

—• కవ్వపుఁబాట — మోహనరాగము •—

క. రా నన్నుఁ గన్నతండ్రీ!
రా నాముద్దులకుమార రా చినికృష్ణా!
రా నాదునోముపంటా!
రా నాయన వెన్నఁ దినఁగ రా! రావేరా. 248

మ. కటిదేశంబున సూత్రినద్ధ మగునాక్షౌమాంబరంబుల్ బయః
స్ఫుటవక్షోజయుగంబుఁ గమ్మలునుఁ గొప్పుం గంకణంబుల్ మహో
త్కటరజ్యాంచితహస్తయుగ్మముఁ గుచుల్ గంపింపగాఁ జిల్కనం
తటఁ గృష్ణుం డరుదుంచి కవ్వమును చేతన్ బట్టి పాలి మ్మనెన్. 249

శా. కాలుం జేయియు నాడనీనికడిమిన్ గవ్వంబు కైఁ బట్టి చన్
బా లిమ్మంచునుఁ బోర్లు వెట్టుకొడుకున్ బాహుద్వయిం బట్టి కొం
చాలోఁ జన్గుడుపంగఁ జొచ్చెను యశోదాక్షి లక్షించి త
త్కాలంబం దటఁ గాఁగుపాలు పయి కెక్కన్ బొంగి పోఁ జొచ్చుడున్

తరళము. కడుపు నిండనివాని నందునికాంత వీడి చనంగ న
క్కొడుకు కోపము తాపమున్ మదిఁ గూడ నేడుపుమోమునన్
గడవ ఱాతిని గొట్టి భిన్నము గాఁగ లోనికిఁ బోయి య
క్కడ లభించినవెన్న మెక్కె నొకండ దండితనంబునన్. 251

వ. అంతలో యశోద వచ్చి భిన్నం బైనదధిభాండంబు గాంచి కొడుకుం
గాంచక లోనికిం జని యొక్కచోట. 252

తే. ఱోటిపై కెక్కి కూర్చుండి రోజుకొనుచు
బీతునం బోలె నటు నిటు వెడఁగుఁ జూపు
వెట్టుచున్ బిల్లులకు వెన్న వేయుచున్న
తనయుఁ గని తల్లి మెలమెల్లఁ జనియె నటకు. 253

మత్త. బాలకృష్ణుఁడు చేత బెత్తము పట్టి వచ్చుయశోదనున్
బోలఁజూచి భయంబు నొందినపోల్కి సత్వర మేర్పడన్
ఱోలు డిగ్గి గృహంబు వెల్వడ రోజుచుం బడువెత్తె నా
లో లతాంగియుఁ వాని బట్టఁగ లోఁ దలంచుచు వెన్కొనెన్. 254

చ. చనియెడు బాలుఁ డం జెయిది చట్టనఁ బట్టఁగ నై పిఱుందులన్
జనుఁగవ కొప్పును న్నగలు చాల భరం బగుటన్ జడత్వ మొం
దిననడ బిడ్డఁ జేరుకొన నేరనిదై కడు నొచ్చుచున్ మొగ
మ్మున నుదయించు చెమ్మటలఁ బోకడఁ జేయుచుఁ జేతివేళ్లతోన్.

ఆ. నిలిచి కొంతసేపు పిలిచి ని న్నేమి చే
సెదనొ చూడు మనుచుఁ జెలవు లదరఁ
బలుకుకొనుచు నడచె జలజల మని కొప్పు
పూలు నేల రాలి పొలుపుమిగుల. 256

ఆ. బాలకృష్ణుఁ డట్లు పఱచియు దోఁబూచు
లాడునట్లు భూరుహాళి వెనుక
మఱుఁగుఁ జేరి మఱియు మాతకుఁ గన వచ్చి
బాలలీల లెల్లఁ బోలఁజూపి. 257

పంచ. కృతాపరాధుఁ డౌటఁ జిన్నికృష్ణు డెంతయో భయా
వృతాత్ముఁడై మషీరసంబు వీగి పాఱఁ జేతులన్
దతంబు గాఁగఁ గన్నుఁదోయి నల్పుకొంచు నేడ్చునా
సుతున్ గ్రహించి పట్టికొట్టఁ జూచెఁ జుట్టు చుట్టునన్ 258

— ఉలూఖలబంధనము — యమళార్జునభంజనము —

సీ. అర్భకవత్సల యగుయశోదా దేవి
కరమునం గలయష్టి ధరను విడిచి
తనకొంటెకొడుకును ద్రాటఁ గట్టఁ దలంచె
బహిరంతరములు పూర్వమును పరము
నాద్యంతములు లేనియట్టిఁ డని యెఱుంగఁ
జాలనిదై కడు జాలి నొంది
ప్రాకృతుం డనుచును భావించి యొకత్రాడు
తెచ్చి ఱోటికిఁ గట్ట నిచ్చఁ జేసి

తే. త్రాడు రెండంగుళంబులు తక్కువైన
వేఱొకఁడు త్రాడు దానికిఁ జేరఁ గట్టి

యదియుఁ జాలక యుండిన నన్య మొకఁడు
త్రాడు కొని వచ్చి ముడివైచెఁ దానితోడ. 259

చ. అదియును దక్కువైన గృహమం దగుత్రాడుల నెల్లదానితో
నదుకఁగఁ జేసినన్ మొదటియట్టులు తక్కువ యయ్యె రజ్జు వ
య్యదనున విస్మయంపడుచు నాజనయిత్రి శ్రమంబు నొందుటల్
మదిఁ దలపోసి కృష్ణుఁడు క్రమంబున బద్ధుఁడ యయ్యె నమ్మురన్.

మ. అజరుద్రాదులు నింద్రముఖ్యులు తపస్స్వాధ్యాయసంపన్నులున్
నిజహృత్పద్మములందు నిల్పుకొనఁగా నేర్వక క్షణార్థంబు నే
నజితుం డవ్యయుఁ డప్రమత్తుఁ డగు లోకాధీశ్వరుం డాతనిన్
వ్రజకాంతామణి ఱోటఁ గట్టెఁ జలియింపంబోని చందంబునన్. 261

ఆ. అట్లు కట్టి తల్లి యంతలో గృహకృత్య
ములకుఁ జనినయంత ముద్దుకృష్ణుఁ
డెదుట మద్దిచెట్ల నీక్షించె రెంటినిఁ
గరుణ వానిమీఁదఁ గలిగి కొంత. 262

వ. వారు నలకూబరమణిగ్రీవు లనువారు కుబేరపుత్రులు నారదశాపంబున
నర్జునవృక్షంబులై యుండి రనినఁ బరీక్షిన్నరేంద్రుం డాశాప
కారణంబు చెప్పు మనుడు నతండు వెండియు. 263

సీ. రుద్రానుచరు లయి రూఢికెక్కు సుదృప్తు
లయినధనదుపుత్రు లల్లనాఁడు
కైలాసగిరిచెంతఁ గలయుపవనమున
వారుణీరసపానపారవశతఁ
గనుఁ గాన కప్సరోజనసమంచితు లయి
విహరించుచున్ మదవివశు లగుచుఁ
ద్రిదశగంగం జలక్రీడలఁ దేలుచు
వివసను లై యున్నవేళ దేవ

తే. మునివరుఁడు రాగ స్త్రీలు సిగ్గునను వస్త్ర
ములు ధరించిరి మత్తు లా పురుషు లట్టి

---

నిలిచి యుండిరి కని ముని నిభృతకోప
మునను వారలతో నిట్టు లనియె రోసి. 264

ఉ. మీరు తమోగుణంబునను మీఁదు తెలుంగక త్రాఁగి స్త్రీలతో
వేరికిఁ గాక కావరము పెంపునఁ దుంపెసలాడుచు న్నయిన్
జీర తెలుంగనట్టి రయి చెట్లన వచ్చితి రిట్లు గావునన్
ధారుణి మీరు చెట్లయి పృథన్ జెడిపోవఁగఁ బుట్టుఁ డీపయిన్.

వ. అని శపించి నారదుండు వారి ప్రార్థనంబునం జేసి మీరు వృక్షంబులై
పుట్టి శ్రీకృష్ణానుగ్రహంబున మరల దేవత్వంబు నొందఁ గల రని
వరం బొసంగి చనియె నంత నలకూబరమణిగ్రీవు లట్లు వ్రజంబున
వృక్షంబులై పుట్టి పెఱుగుచుండి రప్పుడు. 266

చ. కనుఁగొని మద్దిచెట్ల నటు కైటభమర్దనుఁ డాత్మభక్తులన్
ధనదుకుమారులన్ మనుపఁ దాఁ దలపోయుచు నల్ల నల్లనన్
దనమొల నున్నఱోలు వసుధం బడునట్టులు చేసి లాగుచున్
జనియెను రెండువృక్షములసందున నుండి శరీర మేగఁగన్. 267

క. ఱో లడ్డుపడుచు రెం డగు
సాలంబుల కవుల రాక జడనుపడ వడిన్
బాలుండు పట్టి లాగెను
గూలెను సాలములు రెండు ఘోరార్భటులన్. 268

ఉ. కూఁకటివ్రేళ్ళతో నటులు కూలినశబ్దము నాకదారణం
బై కనుపట్టె న ప్డరణు లందు ధనంజయు లట్లు కాంతిమైఁ
గైకొని చెట్లనుండి దివిఁ గన్పడి యక్షకుమారు లిద్దఱా
లోకవిభున్ భజించి రిటు లోనఁ గడుంగడుభక్తి పెంపునన్. 269

సీ. హా కృష్ణ కృష్ణ మహాయోగిఁ నీ వాద్యుఁ
డవు పరంధాముఁడ వఖిలజగము
నీరూప మగుఁ గాదె నీవె భూతములకుఁ
బ్రాణదేహాత్ముఁడవై తలిర్తు

నీవ కాలంబును నీవ మహాప్రకృ
తియు నీవె త్రిజగదధిపతి వీవె
భగవంతుఁ డవు నీవె ప్రత్యగాత్ముఁడ వీవె
క్షేత్రవికారకృత్స్థితియు నీవె
తే. ప్రాకృతము లగుగుణములవలన నింద్రి
యములవలనను దెలియంగ నైతి కాని
వాఁడవును బరబ్రహ్మవు వాసుదేవ
నీ కిదే మ్రొక్కుచుంటిమి నీరజాక్ష. 270

ఉ. దేహము లేనినీ విపుడు దేహులలో నొకదేహధారి వై
సాహస మేర్పడన్ భవనసంకటముల్ హరియించి క్షేమమున్
స్నేహముఁ జేసి చేసెదవు నీకు నమస్కృతు లాచరింతు మే
మాహరమిత్రకింకరుల మైతిమి నిన్ గన నారదాదృతిన్. 271

శా. మావాకుల్ భవదీయ గాన మొనరింప న్మాచెవుల్ నీకథల్
సేవింపంగను మాకరంబులు భవచ్ఛ్రీపాదపద్మార్చనన్
గావింపం మది నీపయిం దగుల మాకందోయి నీరూపునన్
బోవన్ మాకు ననుగ్రహింపఁ గదె వహా మొఱ్ఱల్ మదిం బెట్టుచున్.

వ. ఇట్లు నలకూబరమణిగ్రీవులు కీర్తించుచుండ నులూఖలబద్ధుం డగు
భగవంతుండు నవ్వుచు వారి కి ట్లనియె. 273

ఆ. ధనమదాంధు లగుటఁ గనుఁ గాన కున్నమి
మ్మమరముని కరుణ నరసె దాన
నాదుదర్శనం బొనర్పఁ గల్గితి రింక
భవము లేదు మీకు భక్తులార. 274

వ. మీ రింక మీ నికేతనంబునకుం బోయి సుఖముండుఁ డనిన వారు
నారాయణు నామంత్రించి మించినవేడ్క నుత్తరంబు వట్టి గగన
మార్గంబునం జని రంత. 275

సీ. నందాదిగోపాలబృంద మంతయు మహా
సాలముల్ గూలినశబ్దము విని

పిడుగు గూలెనో యంచు బిట్టడలెడుబుద్ధిఁ
జేసి యచ్చోటికిఁ జేర వచ్చి
ఱోటఁ గట్టఁ బడినమేటిబిడ్డం గని
చెట్లు గూలుటకు నచ్చెరువు పడుచు
నిది మహోత్పాత మి ట్లేల తటస్థించె
నెఱుఁగ రాకుండె నొక్కింతయు నని

తే. వెఱఁగు భయమును బడియెడువేళ నచట
నున్నబాలురు చనుదెంచి కన్నులారఁ
గాంచినారము ఱోలీడ్చుకొంచు వచ్చి
చెట్లనడుమను బడి లాగెఁ జెట్లు గూలె. 276

ఆ. చెట్లు కూలునపుడు చెట్లలోపలినుండి
వేల్పు లేమొ కాని వెలికి నిర్వు
రగుదెంచి బోలు నెఱిఁగి మింటికిఁ జని
రేమి చెప్ప వచ్చు నిది నిజంబు. 277

వ. ఇట్లు పలికినబాలకులపలుకులు విశ్వసింపక పలువురు పలువిధంబులఁ బలుకుకొనం జొచ్చి రప్పుడు నందుండు నవ్వుచు నందనునిబంధనంబు నుండి విముక్తిం గావించె నంత నతండును. 278

సీ. కరతాళములు వేయఁ గంజాతనేత్రిలు
నృత్యం బొనర్చు నొకింత సేపు
నుపగానమొనరింప నువిదలు గొంతెత్తి
కూనిరాగము దీయుఁ గొంత సేపు
వేత్రిలు రమ్మన్న వెస వచ్చుఁ బొమ్మన్నఁ
బాసి పోవును భక్తవశతఁ బోలె
వనిత లాజ్ఞాపింపఁ బనివడి వచ్చి పీ
టలు చేటలుం బట్టి మెలఁగు చుండుఁ

తే. గను వినర్గా నవ్వు నేమియో గాని పలుకు
బాలురం గూడుఁ బెద్దలపలుకు సలుపు

లోకవృత్త మెఱుంగనిలోలుని గతి
లీలఁ జరియించు నాగోపబాలకుండు. 279

శా. ఆలోఁ బండ్లివి బండ్లు కైకొనుఁడు ధాన్యం బిచ్చి మానంబుగన్
బాలాగ్రేసరులార! యంచు సడి రా బాలుండు పండ్లమ్మెనో
క్రాలుంగంటిరొ! రమ్ము ధాన్య మిదిగోఁ గైకొమ్ము పండ్లిమ్ము నా
కాలక్షింపు మటంచుఁ గొంచుఁ జనియెన్ హస్తంబులన్ ధాన్యమున్.

మ. కరిపోతం బన వచ్చునచ్యుతుని నక్కంజాక్షి వీక్షించి త
త్కరయుగ్మంబున నున్నధాన్యమును బాత్రం బట్టి పండ్లందు సం
భరితం బౌనటు పెట్టి నైజ మగునాభాండంబు రత్నంబులన్
బరిపూర్ణం బయి యుంటఁ గాంచి చనియెన్ బాఢంబు హర్షించుచున్.

తే. ఫలములం దెచ్చి కృష్ణుఁ డాప్రక్క నున్న
గొల్లపిల్లలకుం బెట్టి కొన్ని యున్న
బలునకుం బెట్టి తిని తాను వ్రజమునందుఁ
బడుచు లేచుచు నాటలఁ గడఁక నాడు. 282

సీ. ఇటు సరిత్తటమున నిచ్చఁ బలునితోడఁ
బాలురతో నాడు బాలకృష్ణు
నరసి యశోద కృష్ణా! నీవు రాముఁడు
రం డాటల న్మాని శ్రాంతు లట్లు
చూపట్టుచుంటిరి రేపకడం దింటి
రాఁకట నకనకలాడు కడుపు
వ్రజపతి భుజియించువాఁ డయి మీరాక
కెదురు సూచుచునుండె నేగుదెండు

తే. ధూళిధూసరితాంగులై బాలకేళిఁ
దేలుచుంటిరి మీకయి తింత్రిణీఫ
లాంచితం బగు తైల మాయత్తపఱిచి
యుంటి నీరాడఁ గా రండు వెంట వెంట. 283

ఆ. ముద్దుకృష్ణ ! నీవు పుట్టిననక్షత్ర
మగుట నేడు జలక మాడి సుపరి
శుద్ధుఁ డగుచు భూమిసురుల కడిగినన్ని
ధేనువుల నొసంగఁ దివురు మిపుడు. 284

వ. అని పలుకుచు యశోద కొడుకులం దోడికొనిపోయె నయ్యవసరంబున గోవ్రజంబునం గలగోపులెల్లరు నందుం బురస్కరించుకొనియొక్కచోఁ గూరుచుండి వ్రజంబునంగలుగు నుత్పాతంబులం దలంచుకొని విచారించుచు న్నంత నుపనందుం డనుగోపకుండు బలరామకృష్ణహితైషియై యెల్లరు విన ని ట్లనియె. 285

—♦ ఉపనందుని పంపున నందాదులు బృందావనంబుఁ జేరుట ♦—

క. గోకులహితముం గోరిన
మీ కిచ్చోటు వాసి పోక మే లని తోఁచున్
వాకొనఁగ నపూర్వము లె
న్నో కలిగెన్ గీడు లెట్లొకో యిఁక మనఁగన్. 286

మ. చనుఁబా లిచ్చి కుమారుఁ జంపుటకు రక్షఃకాంత యొం తేని చే
సెను బెంగాలి తెఱంగునన్ దనుజుఁ డుత్సేకించి యే తెంచి వ
త్సను మి న్నంటఁగఁ జేసి కూల వయిచెన్ ధాత్రీస్థలిన్ బండి రూ
పున దైత్యుండు వధింప నెంచె సుతునిన్ బుణ్యంబు గాచెం జుఁడీ. 287

వ. మఱియు నరిష్టంబు లెట్టి వగు దెంచెడినో యని భయం బగుచున్న యది గావున మన మింతలోన సకలపరివార పరివృతులమై బాల వృద్ధాదులం దోడుకొని మఱియొకచోఁటికిం బో నొప్పు నది బృందావనం బనునవకాననంబు. 288

క. తృణజలకాష్ఠసమృద్ధిన్
పరిణుతింపం బడుచు సకలఫలభరితమహా
ల్పణవృక్షపర్వతం బై
గుణపడి మన కింతలోన గొనవై యుండున్. 289

క. అది మనకు వాసయోగ్యము
పోదు డందు వసింత మెల్ల, బోలిన యేనిన్
గదుపులతో సుదతులతోఁ
బొదు పెల్లం గొంచు శకటముల నిడుకొనుచున్. 290

వ. అనిన నెల్లవారు నిది యౌ నౌ నని స్త్రీబాలవృద్ధహితపురోహిత గోధేనుబృందంబులతో సర్వోపకరణధనధాన్యాదులు శకటంబులం బెట్టుకొని ధనుర్బాణతూణీరపాణులై గోపాలురు ముందునడువఁ దూర్యంబు లవార్యంబులై మ్రోయ గోపికలు నానావిధాలంకారాలంకృతులై శకటంబు లధిష్ఠించి యశోదారోహిణు లిద్దఱు బలరామకృష్ణులతో నేకశకటాధిరోహణంబు చేసి శ్రవణపేయంబుగ వినం గృష్ణలీలలం బాడుచుండ ననుకూలవాయుప్రచారంబున కానందింపుచు బృందావనంబునకుం జని యచ్చట నర్ధచంద్రాకారంబుగ బండ్లు నిలువరించి నివాసంబు గావించుకొని రంత. 291

మ. బలుఁడుం గృష్ణుఁడు తత్ప్రదేశమున నావాసంబునన్ స్వాంతమం
దెలమిం గాంచిరి దివ్యభూధరలసద్బృందావనంబున్ శిలో
జ్జ్వలగోవర్ధనపర్వతంబు యమునాంచత్సైకతస్థానమున్
జెలికాండ్రుం దము రాటలాడుటకు మేల్ చేకూఱు నం చెంచుచున్

వ. అట్లానందాదులు బృందావనంబునకు వలసఁ బోయియున్నప్పుడు రామకృష్ణు లనేకవిధబాలచేష్టితంబుల వ్రజౌకసుల కానందం బాపాదించుచు గోపబాలురం గూడి గోవత్సములం గాయుచు నానావిధక్రీడలం దేలుచుండి రప్పుడు. 293

సీ. ఉప్పట్లు లాడుచునుందు రొక్కప్పు డొ
కప్పుడు గోణిబిళ్ల లాడుచుండ్రు
బంతులాడుదు రొక్కపట్టునం దొకపట్టు
నం దాగిఁ గొక్కుల నాడుచుండ్రు
చెడుగుళ్ళ లాడుదు రెడ నెడ నిం కొక్క
డగు నెడ జాటాట లాడు చుండ్రు

డాఁగురుమూఁత లాడఁ గడంగుదు రొక్కొ
కపుడు వెన్నెలవత్తు లాడుచుందు

తే. ఈతలాడుచుఁ జెట్లెక్కి యిలకు దుముకు
లాడుచుఁ బర్వులెత్తుచు హస్తయుగము
లానుచును గోఁతికొమ్మచ్చు లాడుకొనుచు
రామకృష్ణులు విహరింత్రు ప్రేముడి నట. 294

ఉ. పిల్లనగ్రోవి నూఁదుచును బిల్లలఁ గూడి పరిభ్రమించుచున్
గల్లనఁ గాళ్ళగజ్జియలు గంతులు వేయుచుఁ బండ్లు మీఁది క
ల్లల్లన వ్రేయుచున్ వృషభమట్టులు ఱంకెలు వేయ నేర్చుచున్
వల్లవబాలవేషమున వర్తిలుచుండెను గృష్ణుఁ డత్తఱిన్. 295

—♦ వత్సాసుర బకాసుర సంహారము ♦—

సీ. ఒకనాఁడు కాళిందియొడ్డున బలరామ
కృష్ణులు చెలికాండ్రు కెలన మెలఁగ
గోవత్సముల మేపుకొనుచుండ రాక్షసుం
డొకరుండు వారల నుక్కడంప
వత్సాకృతిం దాల్చి వచ్చి యూథమునందుఁ
జొచ్చి యున్నప్పు డాచొప్పు దెలిసి

♦ ఉప్పట్టులు=భూమిపై గదులుగాఁగీచి రెండుకక్షము లేర్పడి, 'ఉప్పు ఉప్పు' అని యఱచుచు నాడునది; గోణిబిళ్ళ=యవాకారమైన కఱ్ఱబిళ్ళను మూఁరెడుకఱ్ఱతోఁ గొట్టుచు నాడునది; కోతుక్క=కక్షము లేర్పడి యోడినవానిం గూరుచుండఁబెట్టి కొక్కొక్కొ యని లేవనెత్తుచు నాడునది; చెడుగుడు=రెండుకక్షములై యొక్కొక్కఁడు వారి వారి వైపులకేగి గుడిగుడి చెంగుడుగుడి యని కూయుచు నాడునది; జాఱాటు=నున్నని పలుక నేటవాలుగా నిడి పైకెక్కి దానిపైనుండి క్రిందికి జాఱుచు నాడునది; దాగురుమూఁతలు=కన్నులుమూసి యితరులు దాగియుండ వారు వారిని గుర్తించుచు నాడునాట; వెన్నెలవత్తులు=వెన్నెలలోఁ దెల్లనిగుడ్డవత్తి పడవేసి దాని నావలివారు కనుగొని పట్టి యాడు నాట; ఈతలాడుట=జలకేళి; కోతికొమ్మచ్చులు=చెట్లెక్కిదుముకుట; ఇవి మాయాంధ్ర దేశము బాలు రాడుకొను నాటలు.

బలరామునకుఁ జూపి పల్కెఁ గృష్ణుం డన్న
కంటివే వీని రాక్షసుఁడు వచ్చె
తే. అనుచు వానినిఁ దోఁకతోఁ వెనుక కాళ్ళు
రెండునుం బట్టి గిరగిరం ద్రిప్పి వెలఁగ
చెట్టునం బెట్టి కొట్టెను గొట్టినంతఁ
బ్రాణములు వాసి పడె నేల రాక్షసుఁ డయి. 296
మత్త. మేలు మే లని బాలు రెల్లరు మెచ్చి కౌఁగిటఁ జేర్చి రా
బాలకృష్ణుని వేల్పు లంబరభాగమందు మెలంగుచున్
బూలవర్షము హర్ష మేర్పడ భూమిపైఁ గురియించి గో
పాలునిం జగదేకపాలునిఁ బాడి రాడిరి పోడిమిన్. 297
వ. అంత మఱియొక్కదినంబున. 298
చ. చలుదులు మూట గట్టుకొని సాటివయస్యులు వెంట నంటి రా
వెలలి బలుండు కృష్ణుఁడును వేడుక లోడిక లెత్తఁ గ్రేపులన్
బొలముల మేఁపఁ దోలుకొనిపోయి జలాశయభూమిఁ జేరి రా
జిలముల ధ్యానమున్ సలుపుచందమునన్ బక ముందు కొండ నాన్.
మత్త. వెండికొండ యనంగ ఱెక్కలు విప్పి కప్పి తటాకమున్
దుండ మెత్తి నభంబు రాయుచు దొప్పముక్కులఁ బేర్చుచున్
గండు దేఱినకొక్కెరాయి యొకంతు మెండుగ నార్చుచున్
దండిశౌర్యము తోడ మీఁదికి దాఁటి గివ్వున వ్రాలుచున్. 300
తే. అట్టి కృష్ణుని ముక్కులఁ బట్టి నోటఁ
బెట్టుకొని మ్రింగె రామాదు లట్టియెడలఁ
జేతనము లేనివా రయి జీవములను
విడిన నింద్రియములు నాఁగ వెగడుపడిరి. 301
చ. గుటుకున మ్రింగుచున్నపుడు కుత్తుకలోపల నగ్నితూల మ
ట్లటు నిటు పోక కాల్చుచు భయంకరుఁ డైనజగద్గురున్ హరిన్
దటుకునఁ గ్రక్కి ముక్కులను దాచి వధించెద నంచుఁ జేర రాఁ
బటుతరసత్త్వ మేర్పడఁగ బాలకుఁ డాతఁడు దానిచంచువుల్. 302

తే. రెండుచేతులఁ బట్టి యుగ్రుగుండఁ డో నాఁగ
వీరణస్తంభమును జీల్చు విధముదోఁప
జీల్చె బాలకు లెల్లరు చేరి చూచు
చుండ నాకంససఖుఁ బకు నుక్కు మిగిలి. 3

తే. ఇటు బకాసురుఁ జీల్చిన నెల్లగొల్ల
పిల్ల లానందమునఁ బొంది వెండి పుట్టి
నట్టు లై రంత సుమవర్ష మంబరంబు
నుండి పడె దుందుభులు మ్రోసె మెండుకొనుచు. 3

వ. అంత రామాదు లాకృష్ణుం గుచ్చి కౌఁగిలించుకొని వత్సంబుఁ
దోలుకొని వ్రజంబునకుం జని నాఁటిచరిత్రం బంతయుం దమవారి
దెలియం జెప్పిన నెల్లవారు గోపాలకృష్ణుని వెండియుం బుట్టినవాని
దలంచి గారవించుచు. 3(

ఉ. ఎప్పటి కప్పుడే యెవియొ యెవ్వియొ కష్టము లేగుదెంచు మా
యప్పకు బాలకృష్ణునకు నక్కట! దైవము చెయ్యి సన్నియున్
దెప్పునఁ దెల్లవాటెడిని దెక్కలికాండ్రగువార లగ్గిలో
గుప్పునఁ బడ్డపుర్వు లనఁ గూలుచు నుండిరి కాలి వ్రేలుచున్. 3(

తే. అహహ పెద్దలవాకు లెప్డయినఁ గాని
సత్యదూరము లగుటలు సంభవింప
దపుడు గర్గుఁడు చెప్పినయట్టివాకు
లనుభవమునకు వచ్చెడి నచ్చెరువుగ. 30

వ. అని నందాదులు రామకృష్ణులకథలు చెప్పుకొనుచు నానందించుచు
నెట్టియిక్కట్టులు నెఱుంగకుండి రక్కెయెడ గోపబాలురును రామ
కృష్ణులును. 30

తే. ప్రత్యహంబును గోవత్సతతుల తోడ
వనములకు నేగి మర్కటప్లవనములును

---

వీరణస్తంభము=అవురు గడ్డికాడ; తెల్లవాటెడు=నశించెడు;

సేతుబంధములను బులినాతిఖేల
నములఁ గౌమారకేళుల నడపుచుండ్రు. 309

వ. ఇట్లుండ నొక్కనాఁ డుదయంబున న లేచి రామకృష్ణులు శృంగంబు
లూది యెల్ల గోపబాలురం బ్రబోధించిన వారును. 310

తే. చలిదికావళ్ళు మూపుల సంగ్రహించి
వేత్రదండవిషాణముల్ వేడ్కఁ బూని
వారి వారి గోవత్సముల్ బహుళము లయి
చనఁగ బలకృష్ణులం గూడి చనిరి వనికి. 311

ద్విపదము. శిక్యాన్నముల నొక్కచెట్టునఁ గట్టి
వాక్యముల్ పెక్కులు వార్వారు సలిపి
గురువిందపేరులు శిరములఁ దాల్చి
వరపింఛములు పూలు ఫలములుఁ బూని
గరిమమై నాడు చొకళ్ళు నొకళ్ళు
పరమాన్నములు గొని పఱచెద రడవి. 312

సీ. కొందఱు పిల్లనగ్రోవుల నూఁదిరి
కొంద ఱూత్తిరి నేటికొమ్ముగములు
కొందఱు తేంట్లతోఁగూడి పాడిరికొంద
రనుసరించిరి కోకిలారవంబు
కొంద ఱంచలతోడఁ బొందుగా నడిచిరి
కొంద ఱాడిరి నెమ్మికిం దులగను
గొందఱు బకములఁ గూడి కూర్చుండిరి
కొందఱు విచ్ఛాయ నొందఁ బఱచి

తే. రట్లు కొందఱు చెట్లపై నాడుకొ్ౕతి
మూఁకతోఁకలు చేతులం బూని లాగి
కొనుచు నాడిరి కొందఱు కొలకులందుఁ
గప్పలం బోలె దుమికిరి కౌతుకమున. 313

♦ విచ్ఛాయ=పక్షినీడ;

వ. ఇక్కారణంబె కాఁ తెలుంగులం గ్రీడించుచు. 314

శా. బ్రహ్మాణ్యాల్ సనకాదియోగివరు లేపద్మాక్షుఁ చిం దారక
బ్రహ్మం బంచు భజించి ముక్తు లయి విశ్వశ్రేయముం గాంతు రా
బ్రహ్మాత్ముఁ హరి నాత్మబంధు వనుచున్ భావించి గోపార్భకుల్
జిహ్వాత్వం బటి కూడఁ గల్గు టది వాకొంపంగ సామాన్యమే. 315

వ. అనంతరకాలంబున. 316

చ. అఘుఁడు బకీబకానుజుఁ డహంయువు కంసునిపంపు పెంపునన్
మఘములఁ గూల్చుచున్ జగతి మాన్యుల నొంచుచు మించి చుట్టలన్
లఘిమ వధించెఁ గృష్ణుఁ డని లావుపగం గొని నాఁడు వారలన్
విఘటితరోషుఁడై దునిమి వేయఁ దలంచి వనాంతరంబునన్. 317

సీ. కొండగుహం బోలియుండు నానన మొక
యోజనాయత మయి యొప్పు దేహ
మొక్కింనంటెడు నధరోష్ఠము సంగికి
నొత్తియాడుచునుండు నుత్తరోష్ఠ
మద్రిశృంగము లన నైనదంష్ట్రిలును జేఁ
కటుల నీ నెడుముఖగహ్వరంబు
వేఁడిగాలిం గ్రక్కు విమపునిట్టూర్పు ని
ప్పులకుండములఁ బోలు గొప్పకనులు

తే. గలిగి భీమణరూపమై కానఁబడుచుఁ
గాళరాత్రికి నెనవచ్చు నాలికలను
గ్రోయుచును బాలకులుపోవు కొండదారి
దండ దాసరిపా మయి యుండె నఘుఁడు. 318

క. గోపార్భకు లట్లుండిన
యాపాము మొగంబు వ్యాత్తమై భయదంబై
చూపట్టగ బృందావన
రూపశ్రీ యనుచు భ్రాంతిరూపితమతులై. 319

తే. అగును గాఁ దని తర్కించు చింతలోన
నిద్దిప్రాణము గలిగినమొద్దొ కాదొ
కాదనక మనలఁ మ్రింగఁ గలుగుపాము
తెఱచి కొనియున్ననో రేమొ తెలియఁ డెదియొ. 320

సీ. అరుణకరారక్త మగుమేఘ మల్లుత్త
రోష్ఠము తచ్ఛాయ నొంది యున్న
భూమియ ట్లధరోష్ఠమును గల్గుచెలవులు
కొండగుహాలఁ బోరుకొనఁగఁ గలుగు
నుత్తుంగశృంగము లో నా నగుం గోఱ
లూగిఁ గ్రోయునాలుక లున్నతములు
గుహాలోనితిమిర మొకో నాఁగ నోటిలో
గాఢాంధకారంబు గాన వచ్చు

తే. దావముననుండి వెలలెడుదారుణాని
లమ్ము నా దీనినిట్టూర్పు గ్రమ్ము వేఁడి
దగ్ధసత్వమద్గంధవిధమున వెలలు
నంతరామిషగంధ మోయను గులార. 321

ఆ. కొండచిలువ యిద్ది యుండని మ్రొమ్రొయెడ
మనలఁ బట్టి మ్రింగు ననుట తగదు
మ్రింగె నేని బకునిభంగిఁ జా కుండదు
కృష్ణుచేత నొక్కయింతలోన. 322

వ. అని యిట్లు పలికికొనుచుఁ గృష్ణునిదిక్కుమొగం బైనవ్వుచుం గర
తాళధ్వనులు గావించి రది చూచి భగవంతుం డగుశ్రీకృష్ణుండు
తనలో వీఁడు లోకాంతకుం డగురాక్షసుం డని తెలియంగకున్న వా రని
వారల వారింప నెంచు నంతలో వానివదనాంతరంబున వా రందఱును
గోవత్సబృందంబులోడం గూడం జొచ్చి రయ్యఘాసురుండును దన
వారిం జంపినకృష్ణునిప్రవేశముం బ్రతీక్షించుచు మ్రింగినవారి గ్రమింగి

నట్లు నమలకుండెఁ గృష్ణుండును వ్యాళవదనాంతర్గతు లగుతనవారిం బ్రదికించుటయు వాని వధించుటయు నె ట్లని తలంచుచు ఘృణార్ద్రి తుండై తెలిసి యించుకలోఁ దానును సర్పవదనాంతరంబునం జొచ్చె నంతలోన. 323

క. హాహాకారము చేసిరి
శ్రీహరి యప్పామునోటఁ జేరఁడు దేవ
శ్లోహో యనుచు న్మెచ్చిరి
ద్రోహులు కంసాదు లఘునితోయము వారల్. 324

మ. భగవంతుం డగువాసుదేవుఁ డపు డాపా మెల్లరన్ మ్రింగ నుం
డగఁ జేయం దలపోసి కంఠగతుఁడై డబ్బాట పె ల్లుబ్బె ను
బ్బగ వ్యాళాంతరవాయుసంచలన మేవంకన్ గనన్ రామి క
న్గుగ పైపై వెడలెన్ బిచండ మది యెంతో యయ్యో నయ్యెంతలోన్.

తే. ప్రాణవాయువు మూర్ధముఁ బగులఁ జేసి
కొనుచు నఘదేహమును బాసి చనియె మీఁది
కపుడు కరుణామృతంబున నాత్మజనుల
నరసి వారితో హరి మీఁది కరుగుదెంచె. 326

ఆ. అపుడు భోగిదేహమందుండి పెనుజ్యోతి
యొకఁడు బయలువెడలి యుండి మింట
నివలఁ బడినకృష్ణు నీక్షించి తద్దేహ
మందుఁ జొచ్చె వేల్పు లచ్చెరువడ. 327

మాలిని. సురలు విరులసోనల్ క్షోణిపైఁ గుప్పగూరన్
గురిసి రమరకాంతల్ గోపులం జూపి రాపైఁ
బరిపరి దివి మ్రోసెన్ వాద్యముల్ హృద్యముల్ భూ
సురులును జయపూర్వస్తోత్రముల్ చేసి రెన్నె. 328

ద్విపదము. ఆస్తోత్రవాద్యము లాగీతికలును
నిస్తులం బై దివి నిండి మోయుంగ

బ్రహ్మదేవుఁడు విని పరతెంచి భువికి
జిహ్మత్వమును విడి చెందె నబ్బురము. 329

తే. ఆజగరచర్మ మటఁ బడి యవని నెండి
వ్రజమునం దుండు నెల్లగోపాలబాలు
రకును బెక్కుదినమ్ము లబ్రిమ్ము గాఁగఁ
గేళికాగహ్వరం బయి క్రాల నయ్యె. 330

తే. అయిదు సమలలోపలఁ జేయునట్టికర్మ
మగును గౌమారకం బన నవ్వలఁ బది
సమలనగునది పౌగండక మని శ్రుతుల
వ్యవహరింపఁగఁ బడు జగద్వ్యక్త మగుచు. 331

తే. కృష్ణకౌమారకంబయి కీర్తిత మగు
నట్టికర్మము పౌగండకాఖ్య మైన
కర్మ మని గోపబాలకుల్ కరము విస్మి
తాత్మలై చెప్పి రావ్రజమందుఁ జాటి. 332

వ. అట్లఘాసురుండును శ్రీకృష్ణస్పర్శనంబునం జేసి ధూతపాతకుండై యసద్దుర్లభంబును సద్వేద్యంబును బ్రహ్మాదులకుఁ బరాయణంబు నగు పరంధామంబు నొందె. 333

ఉ. పుత్తళిబొమ్మ విష్ణు వని పూజ యొనర్పఁ దలంచినంతనే
గుత్తగొనుం జనుండు మునికుంజరు లొందెడు మోక్ష మం చనన్
సత్తమసేవ్యుఁడై జగతి జన్మము నొందినకృష్ణుఁ డేకృపా
యత్తమతిఁ స్పృశించి నఘుఁ డయ్యఘుఁ డున్నతి నొంద కుండునే.

వ. అని చెప్పినఁ బరీక్షన్నరేంద్రుండు శుకయోగీంద్రుదిక్కు మొగంబై గోపబాలు రాకృష్ణునికౌమారకృత్యమును బౌగండకం బని యెట్లు చెప్పి రది శ్రీకృష్ణు నైంద్రజాలికశక్తి యని తలంతు ననిన శుకుం డయ్యది కొండిక యగువాఁడు చేయఁ జాలనిదగుటం జేసి బాలకు లట్లు పలికి రమ్మహాత్మునిమహోన్నతకార్యంబులు మఱియుం జెప్పెద

నాకర్ణింపు మట్లఘాసురవదనం బనుమృత్యుముఖగహ్వరంబునుండి
వెడలించి కృష్ణుండు గోవత్సంబులతో గోపార్భకుల నెల్ల నల్లనం
బ్రదికించి వారిం దోడుకొని యించుకలో నున్నయమునాసరోవర
పులినప్రదేశంబునకుం బోయి వారి కి ట్లనియె. 335

—♦ గోపబాలురు కృష్ణునితోఁ జల్దు లారగించుట ♦—

చ. మిలమిలలాడుచుం మిగుల మెత్తనిదై తగువాలుకంబునం
బులినము చూడ నచ్చ మయి పొల్పెసలారెడు పట్టుపుట్టముం
దలిమము మీఁదఁ గప్పినవిధంబున నొప్పెడు నిండు చల్లనీ
డల నిడువృక్షపంక్తులు కడం బడకున్న వి కన్నుపండువై. 336

చ. సరసిజపద్మషండగతసౌరభసంభృతముల్ మధువ్రతో
త్కరములు జుమ్ము రంచు రొద గల్గగ నాడుచుఁ బాడుచుండె నీ
సురుచిరశాఖశాఖలను జూచితిరే సఖులార యిచ్చటం
భర మగుమేనితాప మిది వాయఁగ వీఁచెడుఁ గాలి చల్లఁగన్.

చ. పగ లరుదెంచె సా మగుచు బాలకులార! క్షుధార్దితాత్ము లీ
రగముల నీడలం నిలిచి యుందఱముం భుజియింత మింతలో
దగ సన నీసరోజలము ద్రావి తృణంబులు మేయుచుం జరిం
పగ నగువత్సముల్ గలవు పచ్చికప ట్లవె చూపుమేరలోన్. 338

సీ. అనిన నాఁ గావుత మని గోపబాలకుల్
వడిగ టుర్రోయిశబ్దములు పలికి
నలుమోములైన క్రేపుల నీరు ద్రావించి
మెదిపి శాద్వలముల మేయఁ దోలి
జలజకర్ణికచుట్టు దళములు పర్విన
పగిదిఁ గృష్ణునిచుట్టు బహుళపంక్తు
లయి కూరుచుండి కృష్ణాభిముఖంబుగా
ఫుల్లపద్మాక్షులై పులినమందు

---

టుర్రోయి=గోపాలురు పశువులను నీళ్ళకుఁదోలునప్పుడు గోదావరీమండలమున నిట్లుచ్చరింతురు.

తే. వృక్షములనీడల సమాశ్రయించి చలిది
చిక్కములు విప్పి పూవులఁ జివురులందుఁ
బత్రముల జాలఁ దృణముల ఫలములపయి
నిలుపుకొని భుజించిరి వారు చలిదిబువ్వ. 339

ఉ. వారలు వారిభోజ్యరుచి వారికి వారి కెఱుంగఁ జూపుచున్
వారును వారు నవ్వుచును నవ్వగఁ జేయుచు మేల మాడుచు
న్నారెకు నూఱుగాయ రసనం దగులించుచుఁ గృష్ణుతోఁ గడుం
గోఁక లూర నాడుచును గూడి భుజించిరి గోపబాలకుల్. 340

మ. మొలకుం జుట్టినదట్టిలోఁ దురిమి యుంపు న్నింపున వ్వేణువున్
గలశృంగంబును వేత్రదండమును జంకం బెట్టి మేల్మిగడల్
గలదధ్యన్నపుముద్దఁ బట్టి వలకేలన్ వేల్పు లీక్షింప స్ని
గ్ధుల నవ్వించుచు యజ్ఞభోక్త మెసవెన్ గోపాలుఁడై కేళిమై. 341

ఆ. అట్లు గోపబాలు రచ్యుతుం గూడి
చలుదు లారగించుసమయమందు
దూరదూర మరిగె దూడలు తృణలోలు
భంబు లగుటఁ గంటఁ బడని వగుచు. 342

శా. వానిం గానక భీతిమై వగచున వ్వారిం గనుంగొంచు లో
కానందుం డగునందనందనుఁడు మీ రన్నంబు భక్షించుటల్
మానం బోకుఁడు వత్సభీతి మదిఁ గొల్పం బోకుఁ డో నేస్తకా
రే నిప్డేగి గ్రహించి తెత్తు వనమం దెం దుండినన్ గ్రేపులన్. 343

క. అని పలికి దరుల గిరులన్
వనులన్ వనములను గుహల వత్సములగతుల్
గనుఁగొనువాఁడై శ్రీహరి
చనియెన్ విడఁబోక పాణిసక్తకబళమున్. 344

— ♦ వత్సాపహరణఘట్టము ♦ —

శా. ఆలోఁ బద్మభవుం డఘాసురవిమోక్షాత్తాద్భుతస్వాంతుఁడై
లీలామానుషవిగ్రహుం డతని కేళీమూలమాహాత్మ్యముం

♦ స్నిగ్ధులు=స్నేహితులు; నేస్తకారు=స్నేహితులు; కొంచంబోవు=సంకోచించు.

బోల న్వెండియు నారయం దలఁచి ముక్కు ముక్కు దూడలం దోడుతోఁ
జాలిం దూలెడుబాలురం దిగిచి కొంచంబోక దాఁచెన్ గుహన్.

తే. ఎందు వత్సములం గాన కీశ్వరుండు
వడిగఁ జనుదెంచి తొంటిచో వత్సపులను
గానఁ జాలక కృష్ణుండు మానసమున
నంతయు నిది విధికృతంబ యనుచుఁ దెలిసి. 346

వ. శాంబరీమాణవకుం డైనశ్రీకృష్ణభగవానుండు బ్రహ్మదేవునియు
గోపాలబాలగోవత్సంబులతల్లులయు డెందంబుల కానందం బాపాదిం
పం దలంచి. 347

శా. తానే క్రేపులు క్రేపుకాపరులు నై తద్రూపలావణ్యశో
భానూనాంగవిలాసవైఖరుల నిం తైన న్విభేదంబు గ
న్గో నేవానికిఁ దోప న ట్లగుచు విష్ణుం డే జగత్సర్వమున్
సానందాఖ్యుఁ డై చరించె వసుదేవాత్మోద్భవుం డయ్యెడన్. 348

తే. అవ్విధంబున నడచెడునట్టివాఁడు
నడుచువాఁడును దా నయి నాయకుఁ డయి
కర్తృకర్మక్రియలు నిజగతులు గాఁగ
నతఁడు సర్వాత్ముఁ డై నాట లాడె నపుడు. 349

వ. అట్లాయారూపంబులు ధరించి సాయంసమయంబగునంత నల్లన
వ్రజంబునకుంజనుదెంచి తమతమగృహంబుల గోష్ఠంబులం జొచ్చినంత.

సీ. ముంగిళ్ళ కరుదెంచి మునుమున్న పిల్లన
గ్రోవుల నూఁదినగొల్లభామ
లాత్మజు లరుదెంచి రంచు వడిన్ లేచి
వారల కెదురేగి బాహులతలఁ
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కొంచుఁ జేఁ పగుదేర
చనుఁబాలు ద్రావించి కనికరించి
జలకంబు లాడించి తిలకంబులం దిద్ది
గంధమాల్యాదులు గలుగఁ జేసి

తే. గోరువెచ్చనికూడునుం గూరల నిడి
హంసతూలికాతల్పము లందుఁ జేర్చి
జోలపాటలు పాడుచు లాలనములు
పొసఁగ జోకొట్టుచుఁ నిద్రపుచ్చి రపుడు. 351

సీ. అలఁతియార్పులతోడ నట్లు గోవత్సముల్
చిఱుతోక లెగురంగఁ బఱచి రాఁగ
దవుదవ్వులం గని తల్లు లంభారవం
బులతోడ నలుగాళ్ళు కలపి రెండు
కాళ్ళుగా నుఱుకుచుఁ గాఱ నుర్వులు నోళ్ళ
గోష్ఠంబులకు వచ్చి కొంతలోనఁ
దమతమవత్సముల్ దరియంగ వచ్చిన
ముట్టెలతో వాని నట్టె నదిమి

తే. మేను మూచూచి నాఁకుచు మెల్ల మెల్ల
పొదుగులకుఁ దార్చి పా లిచ్చి మోహవశత
మాటిమాటికి నార్చుచు మాతృహార్ద
మినుమడింపగ ధేనువు లెసక మెసఁగె. 352

వ. ఇట్లు గోపికలును గోవులును దమకన్నబిడ్డలపై నత్యంతవాత్సల్యంబు వెల్లివిఱియ మాతృప్రేమం జేసినదృశ్యంబు దర్శనీయం బయ్యె వ్రజౌకసులకును వానిపై నింతింతనరానిసంతోషంబు సందడించె నంద నందనుండును నెల్లవారి కల్లారుముద్దులబిడ్డండై యెందును భేద భావంబుగానరానీక తొల్లిప్రవర్తిల్లినచందంబులంబ్రవర్తిల్లుచుఁదన్నుఁ దాన పాలించుకొనుచుండె నిట్లయిదాఱు దినంబులు కొఱగా నొక్క వత్సరంబు కడచినప్పు డొక్కనాఁడు బలభద్రుండు తనమనంబున. 353

— శ్రీకృష్ణుండు గోవత్సంబులుగోపబాలురునై నటించుట —

ఉ. గోవులు గోపికల్ మఱియు గోవులు గోవృషముల్ వ్రజంబునన్
రేపులు మాపులుం గొలుపు ప్రేముడికన్నను వేయిరెట్లు గాఁ

జూపుచు నుండి రట్టియెడఁ జోద్యము పుట్టఁగఁ గన్నబిడ్డలం
దీపరిపాక మెన్నఁడు నొకింత యెఱుంగర యెట్టివారలున్. 354

ఆ. గోపబాలురందు గోవత్సములయందు
దొంటిభావ మిపుడు తోఁపకుండ
వారు నవియుఁ గంటఁ బడినప్పు డెల్ల శ్రీ
కృష్ణుఁ డనెడుభావ మే జనించు. 355

మ. అనుఁగుం దమ్మునిఁ జూచి నప్పు డెటు ప్రేమాయత్తమై చిత్త మొ
ప్పునొ నేఁ డీపసిబాలురం గనిన నేమో కాని శ్రీకృష్ణుఁడే
యని యింతింతనరాని ప్రేముడియు సౌహార్దంబు సంధిల్లెడిన్
గనుఁగో నిం దెదియేని కారణ మ దొక్కం డుంట నిక్కం బగున్.

శా. గోపాలార్భకుఁ డెప్పుడేని ననుఁ గన్గొన్నైన సౌభ్రాత్రమున్
జూపుం భక్తి నమస్కరించి భజియించున్ మించు వాత్సల్యమున్
జూపుల్ నాపయిఁ బెట్టిపోవు వలగొంచుం దోఁక లాడించుచున్
గ్రేపుల్ నాపరిపాలనంబునను భక్తిం జేయు చందంబునన్. 357

శా. సర్వవ్యాపియు సర్వసాక్షియు జగత్సర్వజ్ఞుఁడున్ విజ్ఞుఁడుం
సర్వేశుండును సర్వరక్షకుఁడు సాక్షాద్విష్ణుఁడే కృష్ణుఁ డీ
యుర్విం బుట్టెను లోకరక్షణము లో నూహించి చేయంగ నై
సర్వం విష్ణుమయం జగ త్తనుట నీచందంబునం బోల్చునో. 358

వ. అని డోలాందోళితమనస్కుం డై కొంతతడ వుండి యది యంతయు
నంతరంగంబునం దెఱింగియుఁ గృష్ణుం గని. 359

శా. గోవత్సంబులు గోపబాలురును నాకుం జూడఁ జూడంగ లో
నీవే యంచుఁ దలంప నయ్యెడిని దండ్రీ దీనియాథార్థ్యమున్
నే విన్నంతన గాని సుస్థితిఁ గొన న్నేరన్ దయం జేసి వా
కీవే నావుడు నవ్వుచుం దెలిపె శ్రీకృష్ణుండు తత్సర్వమున్. 360

వ. అంతలో నాసంవత్సరం బంతయుం దనకొక్కత్రుటిమాత్రం బైన
విధాతృండు తొంటివలె గోవత్సగోపబాలరూపంబున విహరించుచున్న
శ్రీహరిం గాంచి వెఱఁగుపడి తనమనంబున. 361

—♦ గోవత్సాదులహరించిన బ్రహ్మవచ్చి కృష్ణునిస్తుతించుట ♦—

శా. గోవత్సంబుల గోపబాలురను నేఁ గొంపోయితిన్ మాయచే
నావత్సంబులు బాలురున్ మఱియు నిండై గానఁగా వత్తు రే
నావేళం గొనిపోయినట్టిరు మదీయాధీను లావెన్కవా
రే వీరై విహరించుచుండి రిట నెంతే విస్మయం బేర్పడన్. 362

క. నామాయ మోహితాత్ముల
యేమహి నున్నట్టివార లితరులు గనరా
రీమెయిఁ జిత్రము గన మని
తా మది నొండె [illegible] తబ్బిబ్బుపడెన్. 363

ఆ. విధి విమోహుఁ డైన విశ్వమోహను విష్ణు
నిట్లు మోహపెట్ట నెంచి తా నె
తనదుమాయవలనఁ దగ మోహితాత్ముఁడై
వెగడు గుడిచె నపుడు తగవు విడిచి. 364

సీ. అతఁ డట్టు లుండినయంతలో నెల్లగో
వత్సముల్ గోపాలబాలకులును
గోమలశ్యామలాంగులు పీతకౌశేయ
వాసులు శ్రీవత్సవక్షులు మణి
కుండలకేయూరమండితుల్ శంఖచ
క్రగదాబ్జపాణులు కమలనాభు
లురుచతుర్భుజులు సమున్నతస్కంధులు
వనమాలికాధరుల్ వనజనేత్రు
తే. లగుచు వెన్నెలవలెఁ దెల్ల నైననవ్వు
లెల్ల నైనట్టిక్రీగంటివీక్షణములు
గలిగి దేవసంసేవ్యులై కలితభూతి
తత్త్వులై గాన వచ్చి రాధాత కపుడు. 365

వ. ఇట్లు వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులకును జూడశక్యము గాని తేఱంగున
మెఱుంగు లీనువారిం గాంచి కాంచనగర్భుండు తత్తేజఃప్రభావంబున

నిశ్చలైకాదశేంద్రియుండై బొమ్మవలె కదలక మెదల కుండె నంత నాశ్రీకృష్ణుం డిది యిట్టి దని తెలియ శక్యముకానిదియు స్వయం ప్రకాశనిత్యానందసుఖంబు గలదియుఁ బ్రకృతికంటెం బర మైనదియు నాత్మేతరానిత్యవస్తువులం బరిత్యజించుచునుపనిషత్తులచేఁ దెలియం దగి నదియు నగునిజరూపం బుపసంహరించి మాయావరణంబు గావించె నజుండును లబ్ధబహిరింద్రియవ్యాపారుండై చచ్చి వెండియుం బుట్టిన వాని వలె నై యల్లనల్లన కన్నులం దెఱచి నలుదిక్కులం గలయఁ బరికించి తనకట్టెదుట నానావిధద్రుమాకీర్ణంబును నిర్గతజాతివైరం బును గలబృందావనంబునందు. 366

మ. కనియెన్ నందునినందనుం బుడుతఁడై కానంగ నొవ్వానిఁ జే
తను ముల్లోకులఁ గట్టివానిఁ బశువత్సవ్రాతమున్ రోయువా
నిని సైఁదోడులఁ బిల్చువాని గుడిచే నెక్కొంగ నన్నంపుము
ద్ద నెఱిం గ్రాలెడువానిఁ గాంచి సలిపెన్ దండప్రణామంబులన్. 367

క. నాలుగుముకుటంబులు హరి
కాళులనుం దాఁక మ్రొక్కి కలితాశ్రువులన్
బోలఁగ నభిషేకించెన్
బాలుం డన కజుఁడు భక్తిభరితాత్ముండై. 368

వ. ఇట్లు శ్రీకృష్ణునిపాదయుగళంబునం బడి పడి లేచి లేచి వానిసామర్థ్య మును సంస్మరించుచు నల్లన లేచి కన్నులం దుడుచుకొని బుడుతం జూచి చూచి వినమ్రకంధరుండై వినయంబునం జేతులు జోడించు కొని శరీరంబుకంపింప సమాహితచిత్తుండై యిట్లని స్తుతింపందొడంగె.

— బ్రహ్మదేవుఁడు శ్రీకృష్ణుని స్తుతించుట —

సీ. అమలాభ్రదేహమునందు మెఱుఁగు నాఁగ
కౌశేయవస్త్రము కరము మెఱయ
గురివిందపూసలఁ గూర్చినకుండలాల్
కర్ణభూషణములై క్రాలుచుండ
నెమిలిపింఛములచే నెఱిమీఱఁ జేసిన
కలికితురాయి యాదలఁ దలిర్పఁ

బూలదండలు వనమాలలు మొత్తమై
కంఠభాగమునందుఁ గాంతు లీన

తే. బువ్వముద్దయు వేత్రము బూరగొమ్ము
పిలనగ్రోవియుఁ గంకణంబులును గటక
ములును దాలిచి మోహనమూర్తి యగుచు
నెసఁగుశ్రీహరి ! నీ కివే యేటికోళ్లు. 370

శా. నీసామర్థ్య మెఱుంగఁ జాల రెవరున్ నే నెంత బ్రహ్మత్వముం
భాసిల్లం గాని యున్న నించుకయు సంభావింపఁగా లేక లో
గాసిల్లం గలవాఁడ నైతిఁ ద్రిజగత్కళ్యాణకృన్మూర్తి ! నా
దోసంబుల్ సయిరించి నన్నుఁ గరుణన్ దోఁగాడఁ గాఁ జేయవే.

తే. జ్ఞానమునఁ జేసి యెవఁడు స్వస్థానమందుఁ
బొలుచునో వాఁడు సజ్జనముఖరితంబు
శ్రుతిగతం బగుభవదీయశుద్ధచరిత
విని భజించి జయించు నిన్ విశ్రుతముగ. 372

తే. ఎవరు శ్రేయఃపదంబయి యెనక మెసఁగు
నీదుభక్తిని విడనాడి యేదొ జ్ఞాన
మెఱుఁగ నాయాసపడువారు నెఱి చెడంగఁ
బొల్లు దంపెడువా రట్లు పోదు రురక. 373

సీ. యోగముచే యోగు లుత్తమగతి నొంద
నోఁపక నీభక్తి నొందఁ గలిగి
రీవు నిర్గుణుఁడవు గావున నీమహి
మము తెలియ నసాధ్య మమలినాంత
రంగములన్ జ్ఞానసంగతిమైఁ గాక
కా దొండువిధమునఁ గనఁగ దాని
జగదవనార్థ మి ట్లగునీగుణంబులు
లెక్కింప నెవరును లేరు చాలి

తే. త్రికరణంబుల నీదగుకృపను గోరి
నిను భజించుచు మ్రొక్కుచు నిలుచువాఁడు
మోక్షపదమున దాయాంశమునకుఁ బాత్ర
మగు ననుచు నెల్లవేదము లనువదించు. 374

ఆ. పరమపురుష నాదుగురుతరానార్యభా
వమును జూతె మాయ నమరువాని
మోహపెట్టఁ జాలుపురుషోత్తమా నిన్ను
మాయఁ జేసి చూడ మదిఁ దలఁచితి. 375

ఉ. నీదురజోగుణంబునను నేను జనించితి గాన నొం డొకం
డేది యెఱుంగఁ జాల కజుఁ డే ననుగర్వతమోబలంబునన్
నాదగుకన్ను మూఁతపడె నాథుఁడ వీ వయి నన్ గృపామతిన్
కాదన కీవు న న్నరసి కావఁగఁ బ్రోవఁగఁ నై క్షమింపుమా. 376

చ. కడుపున నున్నబిడ్డఁ డొగి కాళులఁ దన్నెడుఁ బొట్ట విచ్చున
ట్లిడ నెడ నద్ది తప్పనుచు నెంచి విధించునె శిక్ష వానికిన్
జడరుహనాభ! దృశ్య మగుసర్వము నీదగుకుక్షిలోనిదే
కడ వడి లే దొకింతయును గావున నాయది తప్పటందు వో. 377

చ. ప్రలయమునన్ సముద్రజలపాతమునన్ శయనించియున్ననీ
సలలితనాభిపద్మమున స్రష్ట జనించుట కా దసత్య మో
జలజదళాక్ష నీవలన సంభవమందినవాఁడ నొట నేఁ
దెలియఁగ నీసుతుండ నని తెల్పుచు నుంటిని దప్పు సైఁపవే. 378

తే. ఈవు కృష్ణుఁడవై పుట్టి యుప్పుడు తల్లి
కెల్ల బాహ్యలోకము నీదుహృదయగోళ
మందుఁ జూపితి వద్దాన వప్రమేయ!
నీదుమాయామయత్వము నెఱయ నమ్మో. 379

తరళ. అప్పుడు తల్లికె కాదు నా కిపు డబ్జనాభ! సమస్తమున్
సపరిశిష్టము గాఁగఁ జూపితి చాఁగురే! మును పాకఁడై

సుపరివర్తనముం బొనర్తువు చూడ నవ్వల సర్వమై
కపటనాటక మాడినాఁడవు గాదె గొల్లలచెంగటన్ 380

ఆ. ఎఱుఁగ కుండువారి కీ వొక్కరుండవే
మూడుమూర్తు లట్లు మొనసి సృష్టి
స్థితియు లయ మొనర్చి శేషించి యుందువు
విజ్ఞు లెఱిగి యుంద్రు విధము లెల్ల. 381

ఉ. పుట్టువు లేనినీవు ధరఁ బుట్టుచు నుందువు మత్స్య లాదియా
నట్టియనేకజన్మముల నంది సురారులఁ దున్మి ధర్మముల్
నెట్టన నిల్పునట్టిఁ డయి నీదుమహామహిమం బెఱుంగఁగా
నెట్టిమహామహుండు నొకయింత సమర్థుఁడు గాఁడు చూడఁగన్. 382

తే. సచ్చిదానందరూపుఁడు సర్వపూర్ణుఁ
డైననీవలనన్ స్వప్న మట్టిజగము
పుట్టు చావులు గల దయి పోలఁ దోఁచు
నీ వొకండవ నిత్యుఁడ వింత నిజము. 383

తే. ఇట్టిని న్నెఁడు స్వాత్మ గా నెఱిఁగికొనుచు
నాత్మవిజ్ఞానమునఁ జేసి యభినుతించు
వాఁడు నిరతంబు సంసారవార్ధి దాఁటి
శాశ్వతానందమును బొంది సౌఖ్య మందు. 384

తే. నీపదాంబుజభక్తుఁడు ని న్నెఱింగి
నీయనుగ్రహపాత్రుఁడై నెఱి నెసంగు
భక్తి లేకుండువాఁ డెట్టివాఁడ యైన
వెదకి వెదకి ని న్నెఱుఁగక వెగడు గుడుచు. 385

శా. నీపాలన్ సవనంబు లగ్నియును సంతృప్తిన్ గొనం జేయఁ గా
నోపం జాలని వయ్యె నోయదుపతీ యోలోకరక్షామతీ
వేపల్లెం గలగొల్లభామిను లటన్ వేంచేయునాగోపులున్
రేపు న్మాపును నీకు స్తన్య మిడి సంతృప్తిం బొసంగించుఁ బో. 386

తే. నందగోపకులంబునయందు నుండు
వారు ధన్యులు మాన్యులు పరమపురుషు
డైనశ్రీకృష్ణభగవాను నాత్మసఖుని
గా భజించుచు నుండినకారణమున. 387

ఆ. నీవు నిష్ప్రపంచుడై వెలుగొందెదు
వాడ వయ్యు భక్తవగుల సంత
సంబు పరిఢవిల్ల నలువుటపొందెదు బ్రీ
పంచధర్మ మిట్లు పడయు చుందు. 388

ఉ. నీవు సమస్తముం దెలియ నేర్చినవాడవు లోకకర్తవున్
దైవతసార్వభౌముడ వనంతుడ వింతయు నే నెఱుంగుదున్
దేవ మదీయదేహ మది నీకు సమర్పణ మాచరించితిన్
నావలనన్ బ్రసాదము నొనర్పఁగ నెంచి యనుగ్రహింపవే. 389

— శ్రీకృష్ణుడు బ్రహ్మహరించిన గోపాలాదులం దెచ్చుట —

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించి ప్రసన్నుం గావించుకొని పరమేష్ఠి పరమేశ్వరుని పాదారవిందంబులం బడి ప్రణమిల్లి వలగొనుచు ననుజ్ఞం గొని నిజధామంబునకు నిర్గమించె నంత భగవంతుం డగు కృష్ణుండు బ్రహ్మదేవు నంపిపుచ్చి తొంటివలెఁ దొల్లింటి గోవత్సంబులను గోపబాలురను దా నున్నపులినంబునం జేర్చె నంత. 390

సీ. కృష్ణునిం బెడఁ బాసి యేడాది యైనను
గోపార్భకులు మోహాకులితు లయి
యర్ధక్షణంబుగా నక్కాలము దలంచి
యరుగుదెంచెడికృష్ణు నట్టె చూచి
స్వాగతోక్తి వచించి లేఁగలకై పోతి
వాకకబళం బైన నొండ వైతి
వాఁకలి గొంటి రావయ్య సాపడుదము
కమ్మనిపచ్చళ్లు కలిపి బువ్వ

తే. ననుచు గృష్ణునిఁ బిలిచిన నతఁడు నగుచుఁ
జేరఁగా వచ్చి బాలురఁ జేరి చలిది
నారగించెను బిమ్మట వార లెల్లఁ
గుడిచి సంతోషభరితులై నడచి రపుడు. 391

వ. కృష్ణుండును నెమలిపింఛంబులును బుష్పహారంబులునుం దాల్చి ధాతువిచిత్రితాంగుండై వేణునాదంబు గావించుచు ననుంగులం గూడి గోవత్సంబులం దోలుకొని గోపికానయనోత్సవంబు గావించుచు గోష్ఠంబుఁ జేరె నంత గోపబాలకు లడవిలోనం దమ్ముఁ దాసరిపాము మ్రింగుటయుఁ గృష్ణుండు దానిఁ జంపి తమ్ము బ్రదికించుటయు లోనగువృత్తాంతం బెల్లరకును దెల్లంబు గావించి రని చెప్పినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి యి ట్లనియె. 392

సీ. కన్నబిడ్డలయందుఁ గలిగెడు ప్రేముడి
పెరబిడ్డలం దుండు టరిది తల్లి
కిట్టిచోఁ గృష్ణునం దేమిటి కారీతి
గోపాలపత్నులకుం జనించెఁ
జెప్పుము నావుడు క్షితినాథ! జీవుల
కుం దమయాత్మలయందుఁ గలుగు
హార్దము పుత్రాదులందును గలుగదు
ముదుకఁడైనను జావ నెదఁ దలఁపఁడు

ఆ. మేను తీపి యందు గాన నెల్లరకును
స్వాత్మయే ప్రియంబ యగును దాని
కొఱకె యెన్నొ యెన్నొ కోపాట్లు పడుటలు
గలుగుచుండు జంతువులకు నిలను. 393

క. కావున నాత్మప్రియ మై
జీవులకుం జెప్ప నొప్పు జీవాత్ముం డా
దేవుఁడు కృష్ణుం డగుటన్
భావింతురు ప్రేముడింతు నసురా... 394

ఆ. అఖిలమునకుఁ గృష్ణుఁ డగుఁ గారణము వాని
కన్న భిన్న మగుచుఁ గానఁ బడెడు
వస్తు వెదియు లేదు వసుధ వానిపదంబు
లాశ్రయించి ముక్తి నందు నరుఁడు. 395

సీ. అని చెప్పి బాదరాయణి యను వెండి రో
మను జేంద్ర శౌరి కౌమారమందుఁ
బౌగండమందుఁ బేర్పడఁగఁ జేసిన కృష్ణ
దేవులీల ల వెల్లఁ దెలిపి నాఁడ
నం దఘాసురవధ మల్లశాద్వలభోజ
నము వత్సబాలరూపమును మఱియు
విశ్వసృట్స్తోత్రము వినినవారికి స్మరి
యించు వారికిఁ బఠియించువారి

తే. కఖిలసంసిద్ధులును గల్గు నవల నచట
రామకృష్ణులు చేసినరమ్యకార్య
ములను వర్ణింతు విను మని మునివరుండు
భారతవంశజునకుఁ జెప్పె భాగవతము. 396

ఆశ్వాసాంతము.

మ. భగవద్భక్తుఁడు భక్తిసంభరితసుస్వాంతుండు శాంతుండు స
త్యగరిష్ఠుండు కృపాసముద్రుఁడు సుధీత్వస్తుత్య విజ్ఞానమూ
ర్తి గుణాలంకృతుఁడైన సాగికులవర్ధిష్ణుండు నారాయణుం
డగజాజాని యనుగ్రహంబునను బ్రహ్మానందముం గాంచుతన్. 397

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమ స్కంధమునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

—:o:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## దశమస్కంధము

### ద్వితీయాశ్వాసము

—:0:—

క. శ్రీపాదవేంకటాధ్వరి
పాపఁడు కృష్ణుం డొనర్చు భాగవతమునం
దీపగిది భక్తిఁ జేసిన
భూపతి నారాయణుండు పొల్పెసఁగు నిలన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు చెప్పి రాజర్షికి
శుకమహర్షి వెండియు నిట్లనియె. 2

సీ. అవలఁ బౌగండవయస్సమాశ్రితులైన
బలరామకృష్ణులు పసులఁ గాచు
పనులన్ సమర్థులై పనివడిసఖులతో
విపినమంతయును బవిత్రముగను
సలుపువారలై పశుసమితి వెంటం బడి
పసి కిత వొనరించు మిసిమి గలిగి
ప్రథితపుష్పలతాభిరామమై మత్తద్వి
రేఫనినాదపరీవృత మయి

తే. సన్మనము లట్లు నిర్మలజలము గలుగు
ఘనసరోవరములతోడఁ దనరి పద్మ
గంధబంధురమై జగత్కాంత మగుచు
నలరుబృందావనముఁ జేర నరిగి రిచ్చ. 3

వ. అట్లరిగి యప్పు డప్పుండరీకాక్షుండు పుష్పఫలపరిపూర్ణమ్ములగు తరు
గుల్మలతాదులం గాంచి సంతసించి హాసన్ముఖంబుతో నన్న కిట్లనియె.

—• శ్రీకృష్ణుఁడు బృందావనం బభివర్ణించి విహరించుట •—

మ. ఫలభారంబున నమ్రభావమునకై భాసిల్లునీవృక్షముల్
చిలుకల్ కూయుచునుండ మాజడత వో జేయంగదే దేవ యం
చు లలిం బల్కుచు దేవపూజితములై శోభిల్లుయుష్మత్పదం
బులు శాఖాగ్రములన్ స్పృశించి యిదిగో మ్రొక్కుంగనుంగొంటివే.

సీ. మధుకరంబులు నీదుమహిత మహాకీర్తినిఁ
బాడుచు నున్నవి ప్రతిపదమున
మత్తమయూరముల్ నృత్తంబు గావించు
ఘనుఁ డేగుదెంచె నన్ కౌతుకమున
లేళ్లు గోపిక లట్లు లేఁజూపుగములచే
వెంట నంటి ప్రియంబు విస్తరించు
నింటి కరుగుదెంచి తీ వని కోయిలల్
మృదులసూక్తులఁ జేసి ముదము పెంచు

తే. వనమునం దుండుజంతువుల్ మునివరులును
గూఢముగ నున్నని న్నిప్డు గుర్తు పట్టి
తమకు దైవత మీ వని తగ నెఱింగి
విడువక భజింత్రు చూచితివే మహాత్మ. 6

ఉ. ధన్యము లీవనంబులును ధన్యము లీధరణీధరంబులున్
ధన్యము లీలతావళులు ధన్యము లీవనపుష్పవాటికల్
ధన్యము లీసరస్సులును ధన్యము లీమృగపక్షిసంతతుల్
ధన్యము లీపరిదేశములు తావకపాదసరోజసంగతిన్. 7

వ. అని యిట్లు సంపత్సమృద్ధమైనబృందావనంబు చూచి సంతోషిం
చుచు శ్రీకృష్ణుండు పరివారపరివృతుండై పర్వతప్రాంతంబులందును
నదీనదంబులందును బశువుల మేపుచు నాటలాడుచు సంచారంబు
గావించుచు. 8

సీ. ఒకచో మదాంధాళు లొయ్యఁ బాడం దాను
బాడు సఖులతోడ బలునితోడ

నొకవంక కలహంస లొప్పుగఁ గూయంగ
దానును వానితోఁ దవిలి కూయు
నొకకడఁ మత్తమయూర మాడఁగ దాను
దనవారితోఁ గూడి తవిలి యాడు
నొకపక్షిఁ గేరము లుచితరీతిం బల్కఁ
దా నందఱిం గూడి తగిలి పల్కు

తే. ఇట్లు చేయుచు శ్రీకృష్ణుఁ డెల్లవారి
నవ్వఁ జేయుచు నవ్వుచు నాట్యములను
నేర్చి చేయుచుఁ బశువుల నేర్చి పేళ్ళ
వరుసఁ బిలుచుచు విహరించె వనమునందు. 9

వ. మఱియు రామకృష్ణు లవ్వనంబున వ్యాఘ్రసింహాదిసత్త్వంబులకు భయంపడినవారు వోలెఁ జకోరింగ క్రౌంచ చకోర భరద్వాజ మయూరాదులవలెం గూయుచు నాటలచే నలసి గోపోత్సంగంబులఁ దలలు సేర్చి పండుకొనువారును బాడుచుండువారు నాడుచుండు వారును గంతులు వేయువారు నొండొరులు విలాసంబుగం బోరు సేయువారును గోపాలహస్తంబులు పట్టుకొని పరిహాసించువారును బ్రశంసించువారును బల్లవతల్పంబులను వృక్షమూలంబులను శయనించువారును నై రిట్లు మాయానిగూఢాత్ము లగువారు గోపాలధర్మం బవధరించి సామాన్యులవలె సంచరించి రాసమయంబున వారికిం బరమమిత్రము లగు శ్రీదాముఁడు సుబలుఁడు స్తోకకృష్ణుఁడు లోనగు గోపాలురు రామకృష్ణులం దరియ వచ్చి యి ట్లనియె. 10

—♦ ధే ను కా సు ర వ ధ ఘ ట్ట ము ♦—

సీ. ఓరామ కృష్ణులు ! భూరిసత్త్వసమేతు
లిట కింతదవ్వున నెనక మొసఁగు
తాళవనంబందు రాలి కమ్మనిపండ్లు
నేలపైఁ బడి నిండి కాలుచుండు

ఘూర్ణితకర్ణములను గావించుచుండు న
ల్లదె ధేనుకాసురుఁ డండుఁ గలఁడు
గర్దభాకారము గలిగియుండును వాఁడు
బలపరాక్రమశాలి వానిచుట్టు

తే. లట్టివారేరు వారిభయంబువలన
సురభిళము లైనయాపండ్లు చూచుటకును
నోఁచకుండిరి వాని నోరార బిడ్డ
లార చవిచూచువాంఛ మా కారఁ గలిగె. 11

వ. అని బోధించిన విని సుహృత్ప్రియచికీర్షం జేసి శౌర్యవర్ధిష్ణు లగు బలరామకృష్ణులు గోపాలపరివృతులై కదలి తాటితోఁటం దరియం జని బాహుబలంబునం జేసి మదపుటేనుంగుగున్నలవలె నెదుట నున్న చెట్లం బట్టి కదలించి పండ్లు రాలం జేసి రాసమయంబున. 12

మ. ఫలముల్ రాలెడుశబ్దముల్ విని కడున్ బాధంబుగా మెట్టుచున్
ఖలుఁ డారాసభరాక్షసుండు తలముల్ కంపింపగాఁ జేయుచున్
బలురావంబు జనింప నార్చుచు వడిన్ బాటించి తా వచ్చి కా
ఖులరెంటన్ బలరాము వక్షమునఁ గోల్కోఁ దన్నె నోండ్రించుచున్.

ఆ. తన్ని పఱచి మఱియుఁ దన్న నెత్తిన వెన్క
కాళ్ళు రెండు పట్టి కామపాలుఁ
డట్టె పట్టి నింగి నట్టిట్టు పడఁ ద్రిప్పి
త్రిప్పి నేలవైచి త్రెళ్ళఁ జేసె. 14

ఆ. మృతకళేబరంబు హాతి తాడి గూలెను.
దాని తాఁకువలనఁ దాళ్ళు రెండు
మూఁడు గూలె నెల్లభూమియుఁ గంపించె
నెదిరి రంత రాము నెల్లరిపులు. 15

వ. అట్లు గర్దభాసురుని దాయాదు లెదిరించిన వారిం బట్టి రామకృష్ణులు గిట్టించి రది చూచి దేవతలు పుష్పవర్షంబు గురిసి వాదిత్రంబులు

మొరయించుచుఁ గరంబు నుతించి రంత గతరాక్షసోపద్రవం బగు నవ్వనంబునం గలఫలంబు లెల్ల వారికి నాహారం బయ్యె రామకృష్ణు లును స్తోత్రపాత్రులై గోపాలగోగణసమేతులై వ్రజంబునకుం జని రప్పుడు గోధూళిధూసరితకుంతలుండును బద్ధబర్హుండును వనమాలికా లంకృతుండును రుచిరేక్షణుండును జారుహాసుండు నై పిలనగ్రోవి నూఁదుచు వచ్చునాశ్రీకృష్ణునిం జూచి. 16

సీ. వ్రజభామినులు నిజాపాంగభృంగంబుల

మధువైరిముఖపద్మమధువుఁ గ్రోలి

పగటఁ విరహజమై పరఁగినతాపంబు

పోఁ గొట్టుకొని రప్పు ముంజకేశుఁ

డలఁతి నవ్వును సిగ్గు గలవినయంబునఁ

గ్రేగంటి చూపులఁ వ్రేత లిడిన

సత్కారమును గొని సంతసించుచు గోష్ఠ

మును జేర గోవులవెనుక నుండి

తే. అవల రామకృష్ణులతల్లు లాత్మజులకు

మజ్జన మొనర్చి శ్రమ వాపి మంచిమంచి

వస్త్రములు గట్ట నిచ్చిన వారు వానిఁ

బూని భుజియించి సుఖనిద్రఁ బొంది రెలమి. 17

వ. అంతఁ గొంతకాలంబునఁ నొక్కనాఁడు. 18

—• కాళియమర్దనకథాఘట్టము •—

మ. బలరాముం బెడబాసి యొక్కరుఁడు గోపవ్రాతముఁ గోగణం

బులు నేతేఁ జని వాసుదేవుఁడు జగంబుం ద్రోచునిచ్చఁ శుభం

బులు సంధిల్లఁగ నెల్లవారలకు నింపుఁ సొంపుఁ బెంపొంద ని

శ్చలచిత్తంబున రిత్తవోనిగతు లిచ్చం బొంది కాళిందికిన్. 19

ఉ. ఈచెవిగాడ్పు లాచెవికి నిట్టెటు గొట్టునిదాఘువేళ నెం

తో చని నీరువట్టునను దొట్రిలుచుఁ బశుసంచయంబుతో

నాచెలికాండ్రు వేండ్రమున నట్టిట్టులై పడి సర్పదుర్విషా
ఘూచితమై సుదుష్ట మగునానదినీటినిఁ ద్రావి రార్తులై. 20

ఆ. త్రావినంతలోనఁ దారు గోవులుఁదోడ
మూర్ఛ నొంది ప్రాణములను గోలు
పోయి పడిరి పుడమి భూతనాథుం డైన
వాసుదేవుఁ డెల్ల వారిఁ గాంచి. 21

ఆ. అమృతవర్షి యైనయాత్మేక్షణంబుల
నరసె నంత వారు నాలు నిదుర
నుండి లేచినట్టు లొక్కింతలో స్మృతి
నంది లేచి విస్మయంబుపడిరి. 22

క. ప్రాణములు వాసి వెండియుఁ
బ్రాణంబులు గలిగి గోపబాలునికతనన్
ద్రాణ గలవార మైతిమి
ప్రాణప్రదుఁ డతఁ డటంచు భావించి రెదన్. 23

క. వ్యాలవిషదూషితం బగు
కాళింది విశుద్ధి గోరి ఘనుఁ డాకృష్ణుం
డాలోఁ గాళియుఁ డనునా
కాలాహిన్ వెడలఁ జేసెఁ గదుకడిమి మెయిన్. 24

వ. అనిన విని మనుజేంద్రుండు యుగయుగాంతరములనుండి కాపురం
బున్నపన్నగేశ్వరు నయ్యగాధజలంబునుండి శ్రీకృష్ణుం డెట్లు వెడల
నడచె నది యంతయు సవిస్తరంబుగం జెప్పి భగవంతుం డగుగోపాల
బాలునిదివ్యాద్భుతచరిత్రామృతంబు తనివి దీరఁ ద్రావింపు మనిన
శుకమహర్షి యి ట్లనియె. 25

క. కాళిందీనదియందుం
గాళియవిషతప్యమానఘనరస మగుచున్

గ్రాలున్ హ్రద మొక్కం డా
భీలతరం బగుచు మృత్యువేశ్మ మనంగన్. 26

సీ. కాళియాహివిషాగ్నిఁ గ్రాఁగి జలంబులు
బుసబుస మని పొంగి పొరలుచుండు
నుపరిభాగమునుండి యుడువీథిఁ జనుపక్షి
తతి గూలు వేఁడికిఁ తాళ లేక
నీటితుంపురులపై నిలిచిన నునుగాలి
కడ నున్నమ్రాఁకులఁ గాల్చివైచుఁ
గాచినసీసంబు కైవడి నదినీరు
పడినఁ బెన్గొండయు బసుమ మగును

ఆ. అట్టిమడుగుఁ జూచి హరి దుష్టసంహార
దక్షుఁ డగుచుఁ జెంతఁ దనరుచున్న
కడిమిమ్రాఁకు నెక్కి కటిసూత్రము బిగించి
మల్ల చఱచి దుమికె మడుఁగునందు. 27

—♦ మడుగునందుదుమికినకృష్ణుని గాళియాహి పట్టుకొనుట ♦—

చ. అతిబలుఁ డైనకృష్ణుఁ డటు లంబుచయంబునఁ దూఁకి నంత ద
త్పతనరయంబునన్ క్షుభితదర్పభుజంగమకాలకూటమి
శ్రితజలపూరభంగముల రేఁగి హ్రదంబు ధనుశ్శతాంతర
క్షితితల మావరించె నతిశీకరకోటుల నింగి ముట్టుచున్. 28

చ. గజవరవిక్రముండు హరి గ్రన్నన నన్నది మున్గి తేలియున్
భుజబల మేర్పడంగ జలముం దరలించుచు నీఁదులాడుచో
గజిబిజి గాఁగ నేర్పడినగాటపుఁజప్పుడు లాలకించి యా
భుజగవరేణ్యుఁ డాగ్రహము మూర్తము నొందినచంద మేర్పడన్.

తరళము. భుజయుగంబున మాటికిన్ జలపూరమున్ వడిఁ గొట్టుచున్
గజము నాఁబడి యీఁదువానిని గంజలోచను సుందరా
స్యజితచంద్రుఁ గుమారశేఖరు నబ్దసన్నిభ దేహునిన్
భుజగనాథుఁడు గాంచెఁ గృష్ణుని భూరివైభవజిష్ణునిన్. 30

తే. కాంచి గోపపరీవృతగాత్రుఁ డగుచుఁ
గఱచి మర్మములందుఁ బెగ్గాట్లు వైచి
యేచి నిజదేహమునఁ జేసి కృష్ణుదేహ
మును నిఱియఁ జుట్టి పట్టె పీడనవిధమున. 31

మత్త. భోగిభోగపరీవృతుం డగుపూరుషోత్తము నత్తఱిన్
గోగణంబులతోడఁ గూడినగోపకుల్ గని దుఃఖసం
యోగభావితభావముల్ తమయుల్లమందు నెమర్కొనన్
యోగవాసన లెల్లఁ జెల్ల నయోరవంబులు పెల్లుగన్. 32

ఆ. ప్రాణసఖుఁడు గాన నాహరికిన్ వారి
ప్రాణ మాన ధనము లర్పణంబు
చేసి యున్నయట్టిచెలికాండ్రు గావున
నార్తు లగుచుఁ గుడిచి రధికభీతి. 33

క. గోవులు గోవృషభంబులు
గోవత్సము లల్లు పడినగోపకుమారున్
గ్రేవలఁ గనుచున్ దుఃఖిత
భావములన్ నిలిచెఁ గనులఁ బాష్పము లురలన్. 34

వ. అంత గోపాలురు మఱియును. 35

మ. వల దన్నన్ వినఁ డయ్యె నయ్యయొ కృపాపారీణుఁ డాకృష్ణుఁ డా
జలజాక్షుండు విషంబులం దుమికినన్ సైఁపంగ లే కల్లపా
ములతేఁ డక్కట పట్టి కాట్లు వయిచెన్ బోకంత మైఁ జుట్టి సం
చలనం బింతయు లేనియట్లు సలిపెన్ శౌర్యం బవార్యంబుగన్. 36

చ. మన మిపు డేమిసేసి మనమానధనున్ బ్రదికించుకొందు మే
ఘనుఁ డిట రక్షకుం డగుచుఁ గానఁగ వచ్చెదు లోకరక్షకుం
డనఁ దగుమిత్రరత్న మిటులై చనుచుండఁగఁ జూచుచుంటి మీ
తనువులు కాల్పనే సుగుణధాముఁడు కృష్ణుఁడు పోయె నేనియున్. 37

క. చచ్చినవారల మనలన్
గ్రచ్చఱ బ్రతికించె నతఁడు కరుణాళుండై

చచ్చినయే మన కపు డీ
వచ్చినదుఃఖంబు తెలియఁ బడఁ బోదు కదా. 38

వ. అని మిగుల వగలం బొగులుచున్నసమయంబున నట వ్రజంబునందు.

—♦ అపశకునంబులంజడిసి వ్రజమువా రెల్ల వచ్చి దుఃఖించుట ♦—

మ. భువి కంపించెను బాంసువుల్ దెసల సంభూతంబు లయ్యెన్ గడున్
దివి నుల్కల్ వడెనూసె సూర్యుఁడొదవెన్ దేహంబునన్ స్పందముల్
త్రివిధోత్పాతము లిట్లు దారుణములై తెల్లంబు లయ్యెన్ భయో
ద్భవముం జెప్పుచు నప్పు డెల్ల వ్రజులన్ బాధించె భీతుల్ కడున్.

వ. అప్పుడు నందాదిగోపకు లందఱును భయోద్విగ్నమానమానసులై యశుభంబు శంకించుచుఁ గృష్ణునిం గాన కతండు బలునిం బెట్టి తా నొక్కరుండ తక్కినవారిఁ గోడం గూడి వేఁడుకం జేసి గోవులం ద్రిప్పు కొని రాఁ బోయె నని తెలిసి యాదుర్నిమిత్తంబుల నతం ♦డొక్కం డయ్యె నని తన్మహిమం బెఱుంగఁ జాలక జాలింబడి తద్గతప్రాణులును దదేకమనస్కులును దుఃఖశోకభయాతురులునై యాబాలవృద్ధవని తంబుగా శ్రీకృష్ణదర్శనలాలసులై గోకులంబునుండి బయలు దేరిరప్పుడు.

తే. తమ్మునిప్రభావ మెఱిఁగినదంట గాన
నట్లు కాతరులై పోవునట్టివారిఁ
గాంచి రాముఁడు నగుచుండెఁ గాని యించు
కంత యైనను మాటాడఁ డయ్యె నపుడు. 42

ద్విపదము. కృష్ణుఁ నన్వేషించునిచ్ఛమై నట్లు
వృష్ణివల్లభు లెల్ల నెలఁదులతోడ
వెడలి వ్రజమునుండి వెలుపల కేగి
యడవిలో హలకులిశాదిచిహ్నముల
వెలయుకృష్ణునిపాద విన్యాసములను
బొలుచుగోగణచిహ్నముల నడిమూల
ములఁ గృష్ణు డరిగినపొలముల నెల్లఁ

♦ఒక్కండయ్యెఁ=మృతించె నని యర్థము.

గలయఁ జూచి కళిందకన్యకాతటముఁ
జేరి జలంబులఁ జేష్టలు దక్కి
క్రూరసర్పశరీరగోపితుఁ డైన
గోపబాలుని సరఃకూలంబునందు
వాపోవుగోవుల వదనంబు లెత్తి
కన్నీరు వడిఁ గారఁగా నార్చునాలఁ
గ న్నెత్తి చూచి యాక్రిందనధ్వనులు
గావించి రార్తులై కమలాక్షు భక్తి
భావించుగోపికల్ పాముచేఁ జిక్కి
చావ నుండినప్రియస్వామినిఁ గాంచి
చావనై జగ మెల్ల సర్వశూన్యముగఁ
దలఁచుచు నందునితన్వినిం బోదవి
విలపించుచుఁ గృష్ణువివిధవృత్తాంత
ములు వాకొనుచు వానిమోముపై దృష్టి
నిలుపుచు నుండిరి నిశ్చేష్టలగుచు. 43

వ. అప్పుడు యశోదానందు లొండొరుం గట్టుకొని బిట్టువాపోవుచుఁ
కొడుకుదిక్కు మొగం బై. 44

—♦ యశోదానందులు కొడుకుం గాంచి పరితపించుట ♦—

మ. నడికిఁ గాలము దాఁటి పోయినపయిన్ మా కైతి వో బిడ్డ! ని
న్నొడికం బేర్పడఁ బెంచుకొంటి మధికోద్యోగంబు సంధిల్ల మా
కిడు దం చిన్ని నివాపముల్ దలఁప నయ్యేల్లన్ వృథా యయ్యె మా
కిడుమల్ గూర్చితి చిచ్చువెట్టితివి నీ విట్లైతి కట్టా! కటా!. 45

మ. పుడిసెడు నీళ్ళు పోసి మనపున్నెపుదారికి మెట్లు గట్టు నీ
కొడు కని నీవు పుట్టినది గోటెఁ గడుంగడు సంతసంబునన్
బడియెద మింత కిప్పు డలపాపపుదైవము సైఁప తేక పా
పఁడ! నిను మమ్ముఁ బాపి యిటు పాములపా ల్పడఁ జేసెనయ్యయో.

ఉ. అన్నకుఁ జెప్ప కిట్లడవి నాలను గాయఁగ వచ్చి తొంటిమై
నెన్నఁడు నిట్లు సేయ విటు లేటికి సేసితి పాపదైవ మీ
వెన్నడి నంటి వచ్చినదొ వెన్నుఁడ నిన్నెడఁ బాసి మే మిటన్
బన్నము లొందుచున్ బ్రదుకువారము కా మనుమాట నిక్కమే.

ఉ. క్రూరభుజంగమంబునకుఁ గూటమ యైనది యీహ్రదంబు నిం
దేరికినేఁ బ్రవేశమున నేర్పడు హాని దవానలంబు నీ
దారుణరీతి నుండ దని తావకచిత్త మెఱుంగు నెగ్గి యీ
దారికి కేల వచ్చితివి తండ్రి! ఇఁకేమనవచ్చు దయ్యముల్.

మ. హ్రదవాతం బది తాఁకినంతటన కొండంతైనవాఁ డైన బూ
డిదయై పోవు నటం బెఱింగియును దండ్రీ! తల్లినిం దండ్రి నా
పద పా ల్సేయఁగ నేమొ హాలహాలముం బ్రాపించి తేమందు మి
ప్పదమం దెవ్వరు లేరు నిన్ను బ్రదికింపం జాలువా రీశ్వరుల్. 49

ఉ. అల్లరి సేయునాఁడు నను నమ్మయు నబ్బయుఁ గట్టి కొట్టి రే
నిల్లడ ముండఁ జాల నిటు లేటి కటంచును మమ్ము రోసి మా
కెల్లసుదుఃఖముల్ గుడుప నిట్టు పొనర్చితి వోటు మేము నీ
వెళ్ళెడిత్రోవఁ బట్టెదము వేసర మొందఁగ నోప మీపయిన్. 50

ఆ. కన్నవారి మమ్ముఁ గన్నెత్తి చూడవు
మాటలాడ వేమి నేటిపాము
మీఁదఁ బండి యుంటి మీఁదులు సూచుచు
నీశ్వరత్వదృష్టి యేమొ తండ్రి. 51

చ. కడుపునఁ గన్నబిడ్డఁడవు గాదె కుమారక ! నీ వి టున్నచో
బడుగుల మైనమ మ్మెవరు పట్టి భజింతురు పట్టె డన్న మే
కొడు కిడు వేరు మా కగుచుఁ గోరిక లీరిక లెత్త నాడుచున్
గడుకొని యాదరించెదరు గాదిలిబిడ్డఁడ దిక్కు చూపుమా. 52

వ. అని వా రిరువురును బుత్రవిరహవేదనానలసంతప్తచిత్తులై తత్తఱంపడి
చత్తు మని లేచి మడుగునం బడ నున్నసమయంబున బలరాముండు
కృష్ణానుభావం బెఱింగినవాఁడు గావున వారి వారించి యిట్లనియె. 53

ఉ. ప్రాకృతు లట్లు మీ రిటులు ప్రాణములన్ ద్యజియింప నెంచుటల్
శ్రీకర మైనకార్య మని చెప్పఁగ నొప్పదు లోకధర్మముల్
మీకు నెఱుంగ రానియవి లేవు వివేకనిధాను లెన్న నే
వాకొనఁ జాల దైవగతి వర్తిలుచుండును గాదె సర్వమున్. 54

తే. మీ రెఱుంగరు దైవమున్ గా దటనుచు
మనము చేయున దింతయేఁ గనఁగ రాదు
కాంచు చుండుఁడు ధైర్యము డించికొనక
కాఁ గలుగునట్టికార్యము కన్నులార. 55

మ. అనుచున్ రాముఁడు తల్లిదండ్రులను జ్ఞానానందబోధామృతం
బున వారించినయంత కొంతవడి కాప్తుల్ తల్లిదండ్రుల్ ప్రజల్
తనకై దుఃఖము నొందుటల్ దెలిసి మర్త్యత్వంబునం గొంతసే
పు నిదానించి యదూద్వహుండు ప్రబలెన్ బోఁ ద్రోలి తద్బంధముల్.

చ. పెఱిగినకృష్ణదేహమున పీసరవోయినవీర్యసంపదన్
విఱవిఱ బోయి భోగ మది బీటలు వాఱుట వెచ్చనూర్పుచున్
జొఱచొఱ నెత్రు ముక్కులను నోళ్ల స్రవింపఁగఁ గాళియాహి చె
చ్చెఱ విడి వాసుదేవు నెడఁ జేరి కనుంగొనుచుండె నంతలోన్. 57

మ. సమయము వేచి నాల్కల నజస్రము నాఁకుచుఁ గ్రూరదృష్టిమై
సముఖమునందు వ్రేలెడుభుజంగవరేణ్యుని వైనతేయుచం
దమునను పృక్వయుగ్మమున దైత్యవిరోధి గ్రసించి చేతులన్.
భ్రమణ మొనర్చుచున్ విసరివైచియు వెండియుఁ బట్టె నెట్టనన్. 58

— ♦ శ్రీకృష్ణుఁడు కాళియాహిపడగలపైఁ దాండవమాడుట ♦ —

ఆ. వానితలలమీఁద వడి నెక్కి తత్ప్రత్న
స్పర్శనమున నెఱ్ఱఁబడినపాద
పద్మయుగళి గలిగి భాసమానశళాది
గురువు నాట్య మాడెఁ గోర్కెతోడ. 59

చ. ఘనఘోషంబు మృదంగఘోషముగ భృంగవ్రాతగానంబు గా
యనగానంబుగ హంసశబ్దములు తాళానూనశబ్దాళి గా

గనుదేవళ్లు సభాసదుల్గ ఫణిరాట్కాంస్యోత్తమాంగంబు కాం
చనరంగంబుగ నాట్యమాడె యదువంశస్వామి తానట్టులై. 60

తే. అట్లు నర్తనమొనరించు హరినిఁ గాంచి
దేవగంధర్వసిద్ధాదిదివిజకాంత
లానకమృదంగపణవవాద్యము లెసంగఁ
గానమొనరించుచుం గొల్చి రానరహరి. 61

ఉ. అక్కట నూఱుశీర్షములయం దొకఁ డేనియుఁ దప్పకుండఁగా
నెక్కి యదూద్వహుండు కడు నిక్కటు పుట్టెడునట్టు లంఘ్రులన్
ద్రొక్కఁగ శీర్ణదేహుఁ డయి తొట్రిలి కాళియుఁ డెల్లకన్నులన్
ముక్కుల నోళ్ళ రక్తమది మొల్లముగాఁ బడఁ గ్రక్కెఁ గ్రక్కసన్.

ఆ. వేయితలలు భిన్నభిన్నములై పోవఁ
గాళియాహి మిగులఁ గస్తిపడుచు
బహులరక్తసిక్తవక్షుండై ప్రాణావ
శిష్టుఁడై తలంచెఁ జిత్తమందు. 63

ఉ. నామెయిగాలి సోకిన ఘనంబులు కొండలు పిండిపిండి యౌ
సోముఁడు నావిషం బసిన సోలెడు వ్రాలెడు నొడ్లఁ జెప్పఁగా
నేమిటి కీశిశూత్తముఁ డిదేమివిచిత్రమొ నావిషాగ్నికిన్
సోమము నొందుఁజాడయును జూడము నాకెస మృత్యువయ్యెడిన్.

క. తలలెల్లఁ జిదికెఁ గన్నుల
జలజల మని గారు నెత్రు సర్వాంగములన్
విలవిలపోయెడు నసురుల్
వెలలెడునో యనఁగఁ దోఁచె వివరింపంగన్. 65

చ. ఇతఁడు మనుష్యమాత్రుఁ డని యే నెటు నమ్మెద సర్వలోకసం
స్థితి కగు దేవదేవుఁడు వశీకృతభూతచయుండు విష్ణుఁ డీ
క్షితి నగుదుష్టులన్ దునుమఁ జేకొనె నిట్లు మనుష్యరూప మే
నతగుఁ డటంచు నెంచుచు నహా పొనరించితిఁ జెట్టకార్యమున్. 66

వ. అని చింతించుచు నతనిచరాచరగురుం డగుపరమపురుషునిగా నెఱింగి
భయభక్తియుక్తులం జేసి శరణంబు నొందె నప్పుడు గోపాలబాల
పార్ష్ణి ప్రహారంబులం జేసి చిదికిన సర్వావయవములుం గలిగి ప్రాణా
వశిష్టుండై కష్టదశం బడిఁయున్న భర్తం జూచి వానిభార్య లార్తలై. 67

—♦ నాగకాంతలు కృష్ణునిఁ బ్రార్థించుట ♦—

మ. అతిసంరంభమునన్ భయోద్ధతుల దేహంబుల్ ప్రకంపింప నం
చితభూషల్ పృథుకేశపాశములు సుశ్రీహారముల్ వస్త్రసం
తతులు న్వీడఁగఁ దొట్రుపాటు నడలం దర్శించుచున్ వచ్చి సం
స్తుతులం జేసిరి కృష్ణు జిష్ణుఁ బ్రభవిష్ణున్ విష్ణు రోచిష్ణునిన్. 68

తే. ♦గరిత లగువారు బిడ్డలఁ గలిగికొనుచు
శమలు పైనను బతివిమోక్షంబుఁ గోరి
శరణు వేఁడుచు భూతేశుసరస వ్రాలి
మ్రొక్కి యి ట్లనిప్రార్థించి రొక్కమొగిని. 69

సీ. ఖలనిగ్రహము సేయ వెలసిననీకుఁ నీ
యహినిగ్రహము న్యాయ్య మైనద యగుఁ
బా మగునీతనిపట్ల నాగ్రహము స
ర్వానుగ్రహము యన నౌను గాదె
సర్వజీవుఁడ వీవు సంతసించితి దీన
నితఁడు చేసినపుణ్య మెంత గలదొ
శ్రీ యెంతొ తపియించి చేకొన్న నీపద
రజ మీతనికిఁ దాల్ప ప్రతిభ గలిగె

తే. దేవ నీపదధూళి నందినజనుండు
స్వర్గమును సార్వభౌమత బ్రహ్మ పద ము
యోగసిద్ధులు తలపక యోగివంద్య
నిన్ను సేవించి సంపద లెన్నొ పొందు. 70

♦ శమలుఁడు=పాపుఁడు.

తే. తామసంబునఁ జేసి నిర్దయ యసూయ
కోపములు గల్గి క్రూరస్వరూపుఁ డైన
బ్రహ్మముఖ్యులకును దుర్లభంబు నీదు
పాదరేణువు నొందెడుభాగ్య మబ్బె. 71

వ. మఱియు షడ్గుణైశ్వర్యసంపన్నుండవును బరమపురుషుండవును బరమాత్ముండవును భూతావాసుండవును భూతరూపుండవును బరుండవును బరమాత్మ వగునీకు నమస్కారము జ్ఞానవిజ్ఞాననిధియు ననంతశక్తియు సగుణుండు నిర్గుణుండు నవికారుండు నైనపరబ్రహ్మ వగునీ కివే యేటికోళ్ళు కాలస్వరూపుండును గాలనాభుండును గాలావయవసాక్షియు విశ్వరూపుండును విశ్వోపద్రష్టయు విశ్వకర్తయు విశ్వహేతు వగునీ కిదే వందనంబు పృథివ్యాదిపంచమహాభూతంబులును శబ్దాదిపంచతన్మాత్రలును జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులును ప్రాణాదివాయుపంచకంబును మనోబుద్ధ్యాశయంబులు నాత్మ గాగలవాఁడవును సత్త్వరజస్తమోగుణరూపాభిమానంబున గూఢ మైనస్వాత్మానుభూతి గలిగిననీ కిదే సాష్టాంగంబు. అనంతుఁడవు సూక్ష్ముండవు కూటస్థుండవు సర్వము నెఱింగినవాఁడవును బ్రహ్మాదినానావిధభేదవాదములనుమతించినవాఁడవు వాచ్యవాచకశక్తులు కలవాఁడ వగునీ కిదే జోత మఱియుఁ బ్రమాణమూలుండవును గవియును శాస్త్రయోనియుఁ బ్రవృత్తినివృత్తిరూపుండవును నిగమాంతవేద్యుండవు నగునీ కిదే యభివాదనంబు కృష్ణుఁడు రాముఁడు వసుదేవసుతుండు ప్రద్యుమ్నుండు ననిరుద్ధుండు సాత్వతాంపతియు నగునీ కిదే నమోవాకంబు గుణప్రదీపుండును గుణాచ్ఛాదనుండును గుణవృత్త్యుపలక్ష్యుండును గుణద్రష్టయు నగునీ కిదే దండప్రణామంబు. అవ్యాకృతవిహారుండును సర్వవ్యాకృతిసిద్ధియు హృషీకేశుండును మునియు మౌనశీలి యగునీ కిదే సంప్రార్థనము పరావరగతిజ్ఞుండు నవిశ్వుండు విశ్వరూపుండును సర్వసాక్షియును హేతువు నగువాఁడ వగునీ కివే జోహారు లని విన్నవించి మఱియును. 72

తే. దేవ ! యేకోర్కియును లేనినీవు కాల
శక్తులు ధరించి గుణముల జగము సలిపి
స్థితియు నాశము గలిగించి తెలిపి తత్స్వ
భావముల విహరింతు సఫలతఁ గాంచి. 73

ఉ. స్వప్రజ చేసినట్టియపచార మొకప్పుడు కాచిపుచ్చెదుర్
భూప్రభు వల్లె మావిభుఁడు మూఢుఁ డెఱుంగక నిన్ను నీశ్వరుర్
స్వప్రతిభావిశేషమున సల్పినయీయపరాధ మిట్టిచో
విప్రతిపత్తి నెంచ కెదఁ బ్రేముడిఁ జూపుచు నాదరింపవే. 74

క. స్వామీ ప్రాణము వాసెడు
నీమావల్లభుఁడు దాన నే మెంతయు నే
గోమటి దుఃఖింపఁగ నౌ
మా మొఱ లాలించి ప్రోవుమా మానాథా. 75

క. పరిచారికలము మాకుర్
బరిచర్యారూప మైనపని చెప్పి మముర్
బరిముక్తులఁ జేయుము గురు
తరబంధము లెల్లఁ ద్రెళ్ళుదారిఁ దెలుపుచుర్. 76

వ. ఇట్లు నాగపత్నులచే నభిష్టుతుం డగుభగవానుండు భగ్నశిరస్కుండై
మూర్ఛ మునింగినకాళియు నంఘ్రికుట్టనంబుల వేధింపక విడిచి పుచ్చె
నంతఁ గొంతలో లబ్ధేంద్రియప్రాణుండై కాళియుం డతికష్టంబున
నిట్టూర్పు నిగుడ్చుచు దైన్యంబు దోపం గృతాంజలియై సకలసంకట
హరుం డగుహరిం గాంచి యి ట్లనియె. 77

—• కాళియుఁడు శ్రీకృష్ణుని స్తుతించుట •—

శా. స్వామీ మేము తమఃప్రధానులము మాజన్మంబు దుష్టంబు దీ
ర్ఘామర్షంబున నుందు మెప్పుడును బాపాచారపారాయణం
బే మాధర్మము జంతుసంతతుల కెఱుదేఁ గాని స్వాభావికం
బైమట్టాడుగుణంబు మానుట లశక్యం బంచు భాషించెదర్. 78

మ. వివిధాకారబలస్వభావగుణసంవీతంబుగా నీవ యీ
భువనంబుల్ సృజియించి తం దొకఁడనై పుట్టందితిఁ బాములై
భువనాధీశ్వర మన్న్య వెచ్చగును నామోర్లిఁ భవన్మాయలోఁ
దవు లొందం గలవాఁడ నైతి నెటు లే దాఁటం గలఁ దానినిఁ. 79

తే. నీవు సర్వజ్ఞుఁడవు సర్వనేత వీశ
యేను వచియింప నింకొక్కఁ డేమి కలదు
సీతలం పగునట్టులు నిగ్రహించు
యే ననుగ్రహాసేని నాయెడ నిలుపుము. 80

వ. అనిన విని భగవంతుం డగు వాసుదేవుండు కరుణారసతరంగితాంత
రంగుండై యి ట్లనియె. 81

మ. భుజగాధీశ్వర యీహ్రదంబుజలముల్ ము ప్రొద్దు గోమర్త్యులం
డజముల్ వన్యమృగంబులుఁ గొనుచు నుండం జెల్లుఁ గానన్ ద్వదీ
యజనుల్ పత్న్ను లపత్యముల్ గొలువ నీ వాలస్యముం జేయఁ బో
క జరీనన్ జను మిష్ట సాగరమువంకన్ దృష్టి సారించుచున్. 82

ఆ. మనుజుఁ డెవ్వఁ డిట్టు మదనుశాసనమును
సంస్మరించు నుభయసంధ్యలందు
వాఁడు నీదువలనిభయ మెన్నఁడుం గాని
పొందఁ బోడు విషము పొంత రాదు. 83

తే. మనుజుఁ డెవఁ డైనఁ గానియీమడుగునందు
జలకమాడి యుఁ బానము సలిపి దేవ
తాదితర్పణ మొనరించి నాదుపూజ
సంస్మరించుచు సలిపి కష్టముల నీఁగు. 84

తే. ♦విష్ణురథభీతి రమణకద్వీప మీఁగి
యీహ్రదము నాశ్రయించితి వీవు భుజగ !
నీశిరంబుల నాపాదనిహితచిహ్న
ములు గనుంగొని గరుడి నిన్ ముట్టఁ డింక. 85

♦ విష్ణురథభీతి=గరుడభయము; జరీనన్=శీఘ్రముగా.

వ. అని పలికి విడిచిపుచ్చిన నాగపతి పత్నీపరివృతుండై పరమాదరంబున
జాంబూనదాంబరాభరణదివ్యగంధానులేపనాదులతో నాదిదేవుండగు
వాసుదేవుం బూజించి తదనుగ్రహంబు వడసి వలగొని పుత్రమిత్ర
కళత్రపరివారసమేతంబుగాఁ గదలి సముద్రమధ్యంబునం దగుమణి
ద్వీపంబునకుం జనియె నది మొదలు భగవదనుగ్రహంబున నయ్యమునా
హ్రదంబు నిర్విషంబై యమృతప్రాయజలపూరితం బయ్యె ననినఁ
బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి కాళియుం డేకారణం
బున నాగాలయం బగురమణకంబును విడిచె నతండు వైనతేయున
కెట్టియపకారంబు గావించెం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 86

సీ. ప్రజలు సర్పభయంబువలన రమణకంబు
నం దుపహారముల్ పొందు పఱచి
ప్రతిమాసమును నాగపతులకు బలివిధా
నము చెట్లక్రింద నొనర్చుటకును
సమయంబు సలిపి తత్సరణి నడుపుచుండి
రా భాగములు నాగు లాదరించి
తమభాగములు గరుత్మంతున కిత్తురు
నిజరక్షణముపొంటె నియతముగను

తే. విషమదావిష్టుఁ డగుకాద్రవేయుఁ డైన
కాళియుఁడు గరుడుని గణన సేయ
కాత్మభాగము సర్వము నాహరించెఁ
దెలిసి గరుడి కాళియుఁ జంపఁ దలఁచి వచ్చె. 87

ఉ. వచ్చి మహోగ్రవేగమునఁ బై పయి వ్రాలుసువర్ణుఁ జూచి లో
హెచ్చినశౌర్యసంపదల నెంతయుఁ బంతము మీఱఁ గాళియుం
డుచ్చలితాంగుఁడై పడగ లొయ్యన నెత్తి విషాయుధంబునన్
బచ్చడిచేయుదున్ బతగవల్లభు నంచు నెదిర్చి పేర్చుచున్. 88

ఉ. నాల్కలు గ్రోయు చుగ్రనయనంబుల నిప్పుక లుప్పతిల్లఁ గా
నల్కమెయిన్ సువర్ణు దరియం జని నెంజిలిగాఁగఁ గోఱలన్

ములుకులు దూరఁగాఁ గొఱికి ముందఱ నిల్చినఁ బెల్చఁ దార్క్ష్యుఁడుర్
బుల్కనఁ జూచి వానిబలుపుం గెలు పెత్తఁగ మొత్తె ఱెక్కలన్. 89

వ. ఇట్లు సుపర్ణపక్షాభిహతుం డగుకాళియుం డత్యంతవిహ్వలుం డై నిట్టూర్పుచుం బాఱి గరు డాగమ్యంబును దురాసదనంబు నగునా కాళిందీహ్రదంబుఁ జేరి తీఱినభయంబున నాలుబిడ్డలతోడ నటఁ గాపురంబుండె. 90

—◆ కాళియుని పూర్వకథ ◆—

తరువోజ. గరుడి కయ్యది యగమ్యం బగుటకును
గలకారణము చెప్పఁ గల విను మీశ
గరుడుఁ డాఁకలిఁ గొని కదలిపోవుచటఁ
గని పెద్దచేప మ్రింగంగ లోఁదలఁప
దరి సౌభరి యనంగఁ దపసి కాదంచుఁ
దవిలి వారించిన దానిని వినక
వరభక్ష్య మని దానిఁ బట్టి భక్షించె
బలిమిమై నాతఁ డాప్యాయనంబుగను. 91

మత్త. మీనవల్లభుఁ డట్లు పోయిన మీనముల్ కడు దీనతన్
మౌనినాథునిచెంతకుం జని మాటి కేడ్వఁగ నాతఁ డా
మీనకోటులక్షేమ మెంచుచు మీఁద నెప్పుడు వచ్చినన్
వైనతేయుఁడు చచ్చు నంచును బల్కె శాపము నల్కమై. 92

వ. దానంజేసి వైనతేయుం డాహ్రదంబుపరిసరంబునకును రాఁ జాలఁ డయ్యె నయ్యుదంతం బెఱింగి కాళీయుం డందు నిత్యనివాసంబు గావించుకొనియె నట్లు కృష్ణుండు కాళీయు వెడల నడచి దివ్యగంధాంబరమణిగణజాంబూనదపరిష్కారపరిష్కృతుం డై హ్రదంబు వెడలి వచ్చుటయును. 93

ఉ. వచ్చినవానిఁ గాంచి యదువల్లభు లెల్లరు నెల్లగోపికల్
చచ్చినవారునుం బలెను సాళ్వడి యుండియు వెండి పుట్టిన

ట్లొచ్చట లేచి సంతసము నందుచు సందిటఁ జేర్చి పేర్చి మేల్
ముచ్చట లాడుచుండి విడక ముద్దుల సుద్దులఁ దేర్చి రాతనిన్. 94

వ. యశోదారోహిణీనందులును లబ్ధమనోరథులై కృష్ణుం గట్టుకొని వెండియుం బుట్టినట్టులైరి. రాముండును వానిలా వెఱింగినవాఁడు గావున నవ్వుచు నవ్వనజనాభుం గౌఁగిలించుకొనియె గోధేనువత్సం బులును దోఁక లెత్తుకొని పాఱుచు సంభారవంబులు సేయుచు సంత సించె నప్పుడటకు వచ్చియున్న వనవాసులైనవిప్రులు సకళత్రంబులుగా నానందించుచు నందుం బ్రశంసించిరి నందుడును వారికిఁ గోరికదీర గోదానాద్యఖిలదానంబులు గావించి యంపిపుచ్చె నంత యశోదయు.

మత్త. పుత్రు నంకమునందుఁ జేరిచి ముద్దులాడుచుఁ బ్రేముడిన్
నేత్రకోణమునుండి జారిననీరు శీర్షముపైఁ బడన్
గాత్ర మంతయు నానఁ జేయుచు గాదిలిం గనుగొంచు నో
పుత్ర! నన్ బ్రదికించి తిప్పుడు పుట్టె నిన్ గనిపట్టితిన్. 96

క. నాయన్న! నిన్నుఁ బన్నగ
మాయెడలనుఁ గఱచి చుట్టినప్పుడు నన్నున్
నీయన్నఁ దలఁచి యెటు వా
పోయితొ యెట్టెట్టు పడితివో నాపట్టీ. 97

ఉ. అంతట భానుఁ డస్తగతుఁ డౌట నెఱింగి బలుండు కృష్ణుఁడున్
శ్రాంతులు తల్లిదండ్రులు వ్రజంబున కిప్పుడు పోక యొప్ప దం
చెంతయు నాఁకటం బడియు నెల్లరతోడ నటన్ శయింపఁగా
స్వాంతము చేసి తత్తటమునందు నివాస మొనర్చి రుర్విపైన్. 98

ఉ. రాతిరి రెండుజా లగుచుఁ బ్రాణిసమూహము నిద్రవోవుచో
నాతత మై వనంబున దవానల ముద్భవ మంది భూరుహ
వ్రాతముఁ గాల్చి వైచుచు జవంబున నల్గడ లాక్రమించి దు
ర్వాతసహాయతం గొని దివంబును దాఁటినదై వెలుంగుచున్. 99

—• దవాగ్ని వర్ణనము •—

సీ. హోర్వాత్రవంబు మహోగ్రమై బ్రహ్మాండ
మంతఁ బగిల్చెదునట్లు తోఁచె
నంతంత సర్వదిశాంతరంబులు నిండఁ
జిటచిటార్భటిఁ బొగల్ పటిమ నడరె
నాకసంబును భూమి నేకముగా మ్రింగి
వేయుదు నన లేచె వేఁడిమంట
లంతలో నాల్క లల్లాడ్చుచు జ్వాలలు
నలుమూలలకుఁ బ్రాకి యలుముకొనియె
తే. ఏడుచేతులు మెలికలు మూడు గాఁగ
మూఁడుకాళ్ళను బొల సెల్ల ముట్టడించి
కొండలం బిండిసేయఁగ దండి కెక్కి
దావదహనంబు ప్రళయమై దాపరించె. 100

వ. అయ్యవసరంబున. 101

ఆ. ఆనిశీథమందు హ్రిదము పక్కం బండి
సొక్కి సొమ్మసిల్లి సోలి నిద్రి
పోవు వ్రిజముచుట్టు ముట్టి బిట్టేచి ద
హింపఁ జొచ్చె నప్పు డెల్లకడలు. 102

వ. అప్పు డెల్లవారును దందహ్యమానవస్త్రవాహనదేహాదులు గలవారై సంభ్రమించుచు లేచి మాయామనుష్యరూపు లైనరామకృష్ణులశరణంబు వేఁడుచు ని ట్లనిరి. 103

శా. అయ్యో ఘోరదవానలం బిదిగో భూమ్యాకాశముల్ నిండియున్
వ్రియ్య న్నాకపథంబు మండుచును దుర్వారోగ్రకీలావళిన్
బ్రుయ్యం జేయుచు వచ్చి పైఁ బడెడు మమ్ముం గాచి రక్షింప రే
మయ్యా రాముఁడ కృష్ణుఁడా యనుచు నార్తాలాపముల్ సేయుచున్
ఆ. ప్రళయకాలవహ్ని పగిదినై మృత్యువు
చెల్మిఁ గాంచి కాపుచిచ్చు వచ్చి

మంటఁ గలుప నుండె మమ్ము నీభక్తుల
నేలుఁ డయ్య రామకృష్ణులార. 105

వ. ఇట్లు ప్రార్థించినం బ్రసన్నుండై యనంతశక్తిమంతుండు ననంతుం డగు
శ్రీకృష్ణుండు తనవారి నైక్లబ్యంబు నిరీక్షించి నేఁ గల వెఱవకుం డని
వారి కభయం బొసంగి దావానలాభిముఖుండై. 106

మ. ఘనశాకోదరరాజ మాశుగము గ్రుక్కం గొన్న చందంబునన్
వనమెల్లన్ దహియించు దావదహనున్ వక్త్రంబునం బీల్చి ప్రిం
గెను గన్మూసినయంతలోపలన శ్రీకృష్ణుండు విష్ణుం డటం
చును హాలాహలపాయి ముఖ్యు లమరుల్ స్తోత్రంబు గావింపఁగన్.

వ. ఇట్లు కార్చిచ్చు చల్లార్చి పేర్చినసంతోషంబున సకలదాయాదపరివృ
తుండై పయనంబై శ్రీకృష్ణుండు గోపగోపీజనగీయమానుండై గోవుల
తోడం గూడి వేఁగునప్పటికిఁ గొల్లపల్లెం జేరి బలరామసహితుండై
స్వేచ్ఛావిహారంబులం దేలుచున్నంతఁ గొంతకాలంబునకు. 108

— గ్రీష్మర్తు వర్ణనము —

సీ. దేహధారుల కతితీక్ష్ణముం బ్రియమై
గ్రీష్మఋతువు వచ్చె భీష్మ మగుచు
బృందావనము రామకృష్ణసంగతిఁ జేసి
భవ్యవసంతము భాతి నొప్పె
సెలయేటిశీకరంబులు మాటి మాటికిఁ
దద్వనం బంతయుఁ దవులుచుండుఁ
బద్మాకరంబులపయినుండి వచ్చెడు
పయర నిదాఘతాపము వెలార్చు

తే. పళ్ళమీఁదికరళ్లు గ క్లెక్కి యచటి
పొలము లన్నియు శాద్వలములుగఁ జేయఁ
దీక్ష్ణచండాంశువేఁడిమి తెలియఁ బడక
చలువ లీనుచు నుండె నాస్థలము లెల్ల. 109

మ. పెలరేఁ డొక్కఁడు మీఁదినుండి దిగుచుం జెంతం బిసాళించుచున్
ఫలకంబందు గుభుల్లుమంచుఁబడి పోవం దత్ప్రదేశంబునన్
జలముల్ చిందఱవందమై యెగసి నల్వైపు ల్కడుం గ్రమ్ముకో
నిలపై ముత్యముల న్వెలార్చెడుగతి న్వీక్షింపఁగా నయ్యెడిన్. 110

చ. కలకలలాడుచున్ వనులుఁ గాచియుఁ బూచియు లేఁతగాలితోఁ
జిలుకలుఁ గోయిలంబులును జిందర రేఁగఁగఁ జేయుసద్దుతో
జలజలపూలవాన వడ సారెకు నాడుమయూరపంక్తితోఁ
దెలియఁగ వచ్చె నామనికి దీటయి మేటిసుఖంబు గూర్చుచున్. 111

వ. మఱియు నాగోపాలు రెల్లరుం గూడి రామకృష్ణు లధ్యక్షులుగా
నొకసభం గావించి యందు. 112

సీ. ఒకఁడు పాడినవెన్క నొక్కఁడు గా వేణు
నాదము సలిపిరి మోద మెసఁగఁ
గుప్పదాఁటులలోన గొప్పతనముఁ జూపి
రొక్కనివెనుక వేఱొక్కఁడు గను
గ్రుక్క త్రిప్పక చెడుగుళ్ళఁ గూయుచు నాడి
రొగి నేరి కందక నొక్కఁ డొకఁడు
నేళ్ళకీళ్ళలలోన నేను నే నని వేఱు
వేఱ నీఁదుటలోనఁ బేరుకొనిరి

తే. దంట దంటలుగాఁ గూడి దంట లగుచుఁ
గదిసి వారునియుద్ధము గాసిపించి
రొకఁడు చిత్తగుసంతకు నొకఁడు విడక
గోపబాలకులు విలాస మేపు మీఱ. 113

వ. అక్కాలంబున బలరామకృష్ణులు గోపులతోడను గోధనంబుతోడనుం
గూడి క్రీడించు వారై బృందావనంబుఁ జేరి యచ్చటఁ జిగురుటాఁకులు
నెమిలిపింఛములు పూలదండలు గైరికాదులున్ ధరించి పాడుచు
నాడుచు గంతులు వేయుచు నృత్యంబు చేయుచుఁ బిల్లనగ్రోవులు

శృంగములు నూఁదుచుఁ గర తాళధ్వనులు గావించుచు విలాసయుద్ధములు చేయుచు రామకృష్ణులం బొగడుచు నాటకంబు లాడుచు నానావిధభ్రమణములు సేయుచు లంఘనంబులచేతను పాదవిన్యాసములచేతను లాగుకొనుటలచేతను నియుద్ధంబులచేతనుం గ్రీడించుచుండి రప్పుడు. 114

సీ. ఒకవేళ గోపకు లొగి నాట్య మొనరింప
రామకృష్ణులు గాన రక్తు లగుదు
రొకతేప నాడుదు రుసిరిక కాయలు
మారేడుకాయలు మఱియు బూని
యొకమాఱు గనుఁగప్పుచుండుదాఁగురుమూఁత
లాడుచునుందురు వేడుక మెయి
నొకసారెఁ బదుగురై యుప్పుపట్టీలను
మెట్టుచు నాడుదు రట్టె దాఁటి

తే. ఒక్కొకప్పుడు మృగములనోజ పసువు
లట్లు చేష్టలఁ జేయుచు నాడుచుందు
రొక్కతఱి తీఁగయుయ్యాల లూఁగుచుందు
రొక్కమాటు రాణ్మంత్రులై యుందు రాట. 115

వ. ఇట్లు వా రవ్వనంబునం దలినదులు పొదలు సరోవరంబులు సెలయేళ్ళు లోనగు ప్రదేశంబుల సంచరించుచు జగత్ప్రసిద్ధంబు లగునాటల నాడుచుఁ బసువుల మేపుచు గోపాలు రున్నసమయంబున వారిం జంప నెంచి గోపాలరూపంబునఁ బ్రలంబుం డనురాక్షసుండు వచ్చిన దాశార్హుండు వాని నెఱింగినవాఁ డయ్యు వానితోడ సఖ్యంబు గావించి మించినవేడ్క గోపాలురం బిలిచి మన మెల్లరము వయోరూపానురూపంబుగా జంటలై తలపడి విహరింత మనుటయు వారును.

— బలభద్రుఁడు ప్రలంబాసురుని వధించుట —

సీ. బలరామకృష్ణులఁ బరివృఢులం జేసి
వరుసఁ గొందఱు రామపక్షముగను

జేరి కర్గంబుల దీరుపఁ గొంద ఱ
వ్వగిది శ్రీకృష్ణునిపక్షముగను
జేరి పోరున నోడువారు గెల్చినవారి
భుజములపైఁ గొని మోయునట్లు
సమయంబు సలిపి తత్సమయంబున న్వారు
భాండీరకం బనువటముఁ జేరి

తే. ఆట లాడంగ నారంభ మాచరించి
పూనికంజేసి ఖేలనమును బొనర్చి
రామపక్షమువారు శ్రీదామముఖులు
కృష్ణపక్షమువారిని గెలిచి రాట. 117

తే. తెలిసి రామాదు లాబలాదులను మోచి
రపుడు కృష్ణుఁడు శ్రీదాముఁ డవలభద్ర
సేనుఁ డావృషభుని మోయఁ బూనుకొనఁ బ్ర
లంబుఁ డాబలు మోసె బలంబు మెఱయ. 118

పంచ. ప్రలంబు డాయశోదపట్టిఁ బట్టి మోయఁ జాలమిన్
బలుం గ్రహించి పోవునట్టివాఁడు హద్దు మీఱి య
వ్వలం జనంగఁ జొచ్చె హెచ్చి పాఱుదారి యేర్పడన్.
బలుం డెఱింగి కొండవోలె భారమయ్యె నయ్యెడిన్. 119

చ. భర మగుటం బ్రలంబు డలవర్ష్మముతో భరియింప లేక స
త్వరముగ రాక్షసాకృతినిఁ దాల్చి సువర్ణమణీవిభూషణో
త్కరములతోడి రాముని శతహ్రదలున్ విధుఁడున్ వెలుంగఁగా
బరఁగెడు మేఘమో యనఁగ భాసిలుచుండె నొకింతలోపునన్. 120

మ. జ్వలదగ్నిప్రతిమాననేత్రములు బిభ్యద్భ్రూకుటుల్ భూరిదం
ష్ట్రలు భూమిధ్రగుహాసహోదరము లాభ్రూణోగ్రరోకంబులున్
బలభిచ్ఛస్త్రసదృక్షరూక్షనఖముల్ పర్వంగ నారాక్షసున్
బలుఁ డీక్షించె విహాయసంబున భయభ్రాంతాత్ముఁడై యంతలోన్.

తే. ధైర్యసాహసధుర్యుఁడై తక్షణమున
ముష్టిఘాతమునన్ వానిమూర్ధమందు

ప్రేసె నిందుఁడు దంభోళిఁ బృథ్వీధరము
నేయుచందమునన్ సురల్ సేయ నుతులు. 122

శా. ఆఘాతంబున శీర్ణశీర్షుఁ డయి హాహా యంచుఁ బెల్లార్చుచున్
వ్యాఘూర్ణద్ఘనవిగ్రహుం డగుచు సర్వాంగంబులం దుష్టర
క్తౌఘంబుల్ స్రవియింపఁగా నపగతప్రాణుండునై ప్రేతమై
మేఘద్వారమునుండి కూలఁబడె భూమీధ్రంబునా భూమిపై. 123

తే. నిహతుఁడై కూలినప్రలంబునిన్ విజపరి
జలు గనుంగొని విస్మయకలితు లగుచు
బలుని గౌఁగిటఁ గదియించి బహువిధముల
దీవన లొసంగి ప్రేముడిం దేల్చి రపుడు. 124

క. దేవారి కూలినంతట
భావంబులు మిగులహర్షభరితము లగుటన్
దేవళ్ళు పుష్పవర్షము
గావించిరి బలునిమీఁద గైవారములన్. 125

సీ. ఇట్లు ప్రలంబకుఁ డీల్గినంతట గోపు
లాటలలో నున్న యవసరమునఁ
దృణలోలుభంబులై దెస లంటి గోవులు
గహ్వరం బగుదూరకాననమున
కరిగినఁ గాపరు లరసి కానక విచే
తసులై ఖురన్యాసతతుల దారిఁ
నెఱిఁగి దానిం బట్టి యేగి ముంజాటవిఁ
దారి తెన్నెఱుఁగక దప్పిఁ దగిలి

తే. మరలి రంతఁ గృష్ణుఁడు తుంగతరువు నెక్కి
యొక్కచో గోవులం గాంచి యుచ్చగతిని
పేరులం బెట్టి వానిని బిలిచె నవియు
హరిరవము విని బదు లార్చె హర్షమునను. 126

— ♦ శ్రీకృష్ణుఁడు కారుచిచ్చు మ్రింగి గోపాలురం గాపాడుట ♦ —

తే. అంత వనధూమకేతువై యట్టు నిట్టు
వాయుసారథి యగునగ్ని వనచరాళి
నాఁకి వేయుచు నేచె నాభీకరాగ్నిఁ
దెలిసి గోపులు కృష్ణుని దెసకు నరిగి. 127

శా. నీవా రెల్లరు మ్రగ్గుకాల మదిగో నీరేజపత్రేక్షణా!
దావాగ్నిప్రతిరూపమై కనఁబడున్ దానిం దొలంగింపఁగా
నీవే కాని యొకానొకం డెవఁడు నేనిం లేఁడు లోకంబులన్
రావే మా మొఱ లాలకింపవె కృపన్ రక్షింపవే రక్షకా. 128

వ. దీనరక్షకుం డగు పుండరీకాక్షుండు వారి దీనాలాపంబు లాలించి మీరు భయంబు దక్కి కన్నులు మూసికొనుం డని యోగాధీశుం డగు భగవంతుండు నిజయోగబలంబున నగ్నిన్ బంధించి తొంటివలె మ్రింగి వైచి శాంతిం గలిగించి గోగోపగణంబుల నప్పటి భాండీరంబునకుం దెచ్చె నప్పుడు కన్నులు తెఱచి చూచి. 129

క. గోపకులు తమకుఁ గలిగిన
యాపద లన్నియును దెగినవై యుండుటకున్
గోపాలకృష్ణుఁడే యితఁ
డాపరమాత్ముఁడ యటంచు నలరి రెడందన్. 130

వ. ఇట్లు గోపగీయమానుండై సహరాముం డగు జనార్దనుండు గోవులను మరలించుకొని గోపాలురం గూడి వేణుగానంబు సేయుచు సాయాహ్నంబున గోష్ఠంబు సేరె ననంతరంబ. 131

చ. సుగుణగణాఢ్యునిన్ హరినిఁ జూడక యున్నక్షణార్ధకాలమే
యుగశత మట్లు గోపికల కుత్తలపా టిడుచుండునప్పు క
న్దగఁ గడఁ జేరు నాతని గనుంగొని వారలు వెండి పుట్టిన
ట్లుగ నయి సంతసంబున వెలుఁగుచు నుండిరి కృష్ణుఁ గొల్చుచున్.

---

♦ వాయుసారథి=అగ్ని; నాఁకివేయు=ఇటుఁగాల్చివేయునని.

ఉ. గోపకు లెల్ల గోపికలకున్ ముదమావహిలంగ నాఁ డర
ణ్యోపరిభూములం దలయదూద్వహు లాబలరామకృష్ణు లా
పాపి ప్రలంబరాక్షసునిఁ బట్టి వధించుట కారుచి చ్చొగిన్
బైపయి రాఁగ మ్రింగుటయు వారు వచించిరి విస్మయంపడన్. 133

వ. ఇట్లు చెప్పుకొనుచు వ్రజంబునం గలవా రెల్లరును రామకృష్ణుల విలా
సంబులకు నాశ్చర్యానందకందళితాంతరంగులై సుఖంబునఁ గాల
క్షేపంబు చేయుచుండిరి. 134

—◆ వర్షర్తు వర్ణనము ◆—

క. అంతటఁ బ్రావృట్కాలము
సంతతగర్జార్భటీప్రసంగితసాంద్రా
నంతాభ్రావృత సర్వది
శాంతరములఁ దోఁచె విరహు లట్టిట్టు పడన్. 135

మ. జలదధ్వానము మర్దలధ్వనులుగా శంపాలతల్ గుగ్గులూ
జ్జ్వలకీలమ్ములుగాఁ బ్రవర్షరుతి భాస్వద్వాద్యజాలమ్ముగా
నలిఝిల్లీకులనాద మున్నతగతిన్ వ్యాపించుగీతమ్ముగా
సలిపెన్ నృత్యము కేకిలోక మెపుడున్ షడ్జంబునం బాడుచున్. 136

ఉ. వేఁడివెలుంగురస్ములగు వేసఁగిఁ గ్రాఁగిననీళ్ళనుండి పై
కీడెడునావి యభ్రమున కేగి సదాగతిశక్తి నభ్రమ్మై
కూడి జలస్వరూపమును గొంచు ధరం బడు వెండి వర్షమై
వీడి పదంబు తుళ్ళిపడువీతిడికిం జనవే యధోగతుల్. 137

తే. సర్వసత్త్వసముద్భవసదమలార్క
చంద్రపరిధి బలాహకసంఘసంవృ
తాభ్రమండలప్రావృట్టు విభ్రమాఢ్య
మగుచు దీపించె సకలమోహనము గాఁగ. 138

తే. మెఱుము లురుములతో సాంద్రమేఘపటలి
కప్పువడుచంద్రసూర్యాదికళలు గలిగి

నింగి సత్వరజస్తమోనిభృత మైన
బ్రహ్మమో యన నొప్పె నావర్షయందు. 139

చ. ఎనిమిదిమాసముల్ మిహిరుఁ డెల్లధరాతలమందు నమ్మయం
బన! నగుసంపదన్ దనదుసంశువులం గొని రెండు నాల్గులై
చను నెలలందు నప్పు డలసంపదయంతయు వెండి భూతలం
బున కిడు సత్ప్రభుత్వ మిటు పొల్పెసలారుచునుండు నెల్లెడన్. 140

చ. ఘను లగువారు లోఁ గరుణ గల్గి మనోగతిఁ బ్రేరణన్ దరి
ద్రునిఁ గని జీవనంబును బ్రదోషముతో నిడునట్లు లప్పు డా
ఘనములు మెర్మ్మకన్నులను గన్గొని మారుతవేపితంబు లై
కనకనలాడుభూమి కధికం బగుతృప్తిగ జీవనం బిడున్. 141

ఆ. ఫలము గోరి తపము సలుపునాతని మేను
తత్ఫలంబు నొంది తనియునట్లు
మహి తపఃకృశ యయిమబ్బుల నెంతయుఁ
దడపఁ బడుచుఁ దృప్తి వడసె నపుడు. 142

క. కలియుగమునఁ బాషండులు
వెలుఁగుదు రఘమునను శ్రుతులు వెలుఁగ వటుల్ సం
జలఁ జీఁకటి మిడుగురుపురు
వులు వలె వెలుఁగ వపుడు ముఖ్యగ్రహముల్. 143

చ. తమనియమంబు దీరినపదంపడి నేర్పున విప్రశిష్యబృం
దము గురువుల్ వచించినవిధంబున వెన్క ద్వివార మాశురీతిన్
గ్రమమునఁ బల్కిన ట్లురక కాలము పుచ్చెడుకప్ప లబ్దశ
బ్దము విని వెన్క శబ్దము ముదంబునఁ జేయుచునుండు నయ్యెడన్.

సీ. ఎండిపోయినచిన్నవేళ్ళు స్వతంత్రుని
యింటిసంపద లట్లు హెచ్చిపాఱెఁ
బచ్చికచేఁ హరిద్వర్ణ మాముద్రపు
ష్పాలచే నెఱుపుగల్గుభూమి నేల

తాడిపూవులకాంతిఁ దనరి రాజులచేతు
　　　　ర్విధసేనయోయన వెలయ నయ్యె
క్షేత్రముల్ పైరులచే దైవగతు లెఱుం
　　　　గనికర్షకులకు దుఃఖము ముద మిడె
తే. స్థలజలస్థము లగుసస్యములు నవఘన
రసనిషేవణమున సుందరస్వరూప
మొందె హరినిషేవణమున నుత్తము లగు
భక్తజనులు సామీప్యముఁ బడసినట్లు. 145
తే. నదులతోఁ గూడి గాలిచేఁ గదలునలలు
గలుగుసంద్రము కామసంకలితుఁడు ద్రిగు
ణాంచితుఁ డపక్వయోగిచిత్తాబ్జ మట్లు
క్షోభపడుచుండు నప్పుడు చూడఁ జూడ. 146
సీ. వర్షధారలు గొట్ట వ్యధ నొంద వద్రులు
　　　　వ్యసనముల విష్ణుభక్తు లట్లు
నలగనిబాటలు పులుగప్పి నేర్వని
　　　　ద్విజులశ్రుతులటు సందిగ్ధము లగు
నఖిలాప్త లగు మొగులందు నిల్వవు చంచ
　　　　లలు సత్పురుషుకడఁ గులట లట్లు
గుణి యగునింగి నిర్గుణ మగుహరివిల్లు
　　　　జగమున బ్రహ్మంబుపగిది నొప్పు
తే. ♦ ఉడుపుఁడు స్వకాంతిచేఁ బూయఁ బడినమేఘ
తతులచేఁ గప్పఁబడి స్వచైతన్యమునను
భాసిలునహంకృతిం గప్పఁ బడినజీవుఁ
డట్లు తాను ప్రకాశింపఁ డయ్యె నప్పుడు. 147
తే. ఘనులు చనుదెంచునుత్సవమునఁ బ్రహృష్ట
ములు మయూరము లిండ్లలో మొగిఁ దపించు

♦ ఉడుపుఁడు=నక్షత్రేశ్వరుఁడు, చంద్రుఁడు;

పురుషు లీల్గినవారలు మరలి రాఁగ
సంతసించెడునట్టులు సంతసించె. 148

తే. పాదపంబులు ప్రేళ్ళచే వారి ద్రావి
యాఁకలికి డప్పి కోర్చి శాంతాత్ము లైన
పురుషు లిచ్చకుఁ దగ దేహములఁ గొనునటు
వివిధరూపము లెత్తినవవుచుఁ దనరె. 149

చ. బురదయు ముండ్లుఱాల్ గలిగి పోడిమి తప్పిన గట్లనొప్పునా
సరసులఁ జక్రవాకము లశాంతగుణక్రియ లంది యుండు దు
శ్చరణములందు దుష్టమతి పాల్పడియుండెడు గ్రామ్యు లట్టు ల
త్తరుణమునన్ వసించు సతతంబును బాయక సంతపించుచున్. 150

తే. వాసవుఁడు వాన గురియుట వాగు లుబ్బి
గట్లు దెగఁగొట్టు నిప్పు డీకలియుగమున
వేదబాహ్యులు దుర్వాక్యవిసరములను
వేదమార్గములను దెగ వేయునట్లు. 151

తే. అబ్దములు వాయునున్నము లగుచుఁ బ్రాణి
కోటికిం జీవన మొసంగుమేటినృపులు
కాలకాలములన్ విప్రకలితు లగుచు
నెల్లవారలకుం గోర్కు లిచ్చునట్లు. 152

శా. ఈరీతిం దగువానకాలమునను శ్రీకృష్ణుండు సంకర్షణ
ప్రారంభంబులు తోడుపాటు గలుగన్ బాటించి గోపాలకుల్
దోరా గోవులఁ దోలుకొంచు బాలమందుం గ్రీడలం గోరి ఖ
ర్జూరామ్రాదిఫలద్రుమాంచితవనిం జొచ్చెన్ గడున్ ముచ్చటన్.

శా. ఊధోభారమునన్ వనాధ్వమున నెంతో మందమందంబు గా
బోధింపం బడి పోవుగోవులు వడిం బొందంగ గోపాలకుల్
స్వాధీనస్థితిఁ జెప్పుకొంచు నదలింప న్నోట లేకున్నచో
నేధోహీసము గాఁగఁ బేళ్ళఁ బిలిచెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై. 154

క. పిలిచిన నంభారవములు
గలుగన్ స్తనములను బాలు గాలువఁ గట్టన్
జులుకనగఁ గమ్పుఁ జేరెన్
గలధేనువు లెల్లఁ గృష్ణకరుణాధృతిమై. 155

సీ. కడలఁ గృష్ణుఁడు వనౌకసులను సెలయేళ్ళ
గిరిగహ్వారంబులఁ దరులతలనుఁ
గురియుచుండ న్వాన గుహాలందుఁ గూర్చుండి
నములును గందమూలములు పండ్లు
సలిలముకడ శిలాతలముల దధ్యన్న
మన్నతో సఖులతో నారగించుఁ
బచ్చికపట్లను బండి నెమరు వేయు
గోధేనువులఁ జూచి కోర్కి-పడును
తే. అట్లు లీలావిహారణము లాచరించి
కృష్ణభగవానుఁ డట్టిప్రావృట్టు సర్వ
భూతసౌఖ్యావహం బయి పొదల నాత్మ
శక్తికిం దగునట్లు పూజనము సలిపె. 156

వ. ఇట్లు కృష్ణుండు రామసహితుండై వివిధవిలాసవిహారంబుల వర్షాకా
లంబు వెళ్ళఁబుచ్చె నంత. 157

—• శరత్కాలము •—

క. శరదాగమమ్ము గురుతర
పరితోషాగమము హంసవారమ్ములకున్
స్మరదివ్యాగమ మొప్పెను
బరివర్ధితస త్పవర్ణ భవ్యాగమ మై. 158

సీ. నదు లెల్ల నిర్మలానందకందము లయ్యె
నంచల కానంద మతిశయిల్లె

• ఏధస్సు=సమృద్ధి; ఊధస్సు=పశువులపొదుగు.

నాకసంబు వినిర్మలాకారమును గాంచె
దీరి నక్షత్రముల్ తేజరిల్లెఁ
బండువెన్నెల కాచె నిండి రేల్ కన్నుల
పండువై కమలముల్ పరిఢవిల్లెఁ
బొలము లెల్లను సస్యకలితమ్ములై యొప్పెఁ
గ్రపపనంటులు గడుఁ దలిర్చె
తే. నలినగర్భ మరందపానప్రమత్త
భృంగ సంగీతనాద మెసంగె దెసల
భూమిసతి క్రీడ నేటివింజామరములు
నాఁగఁ ధగె తెల్లుపూల్ శరదాగమమున. 159

చ. తెలతెల వోయె మేఘములు తేటి కృశత్వము నొందె వాకలుర్
గలకలలాడె హంసములు కాంతములై కమలంబు లొప్పెదుర్
జలజల రాలె మంచు మృగజాతికి సంతస మయ్యె నప్పుడిం
పలరఁగ రేలఁ బట్టపవలట్టులు దీరిచి కాచె వెన్నెలల్. 160

మ. ఎలమిన్ గార్తికమాధవుండు త్రిజగద్వీక్షాపరస్వాంతుఁడై
యిలపై మెట్టఁగ రాఁ దదీయు లప్డెంతే భక్తి భావించి ర
త్నులసీకాంత సహస్రదీపములతోఁ దోతెచ్చె నెత్తెమ్మి పూల్
సెలఁగం జల్లె ననంటి పండ్లిడె నహించెన్ తెల్లు వింజామరల్. 161

తే. తమకు నాకాశధర్మమ్ము దవిలి కొనఁగఁ
గలకఁ దేటి వినిర్మలగతులు గలిగి
సరసు లుల్లసిలెన్ శరత్సమయమునఁ బొ
నరుపరమహంసల కగుమానసము లట్లు. 162

ఆ. తనయు జన్మదినము దా పయి వచ్చునం
చెంచి సంతసమున మించు ననఁగ
శరవణంబు పూచె సంపూర్ణపూర్ణిమా
చంద్రకాంతి కెనయఁ జాలు కాంతి. 163

♦ తనయుజన్మదినము=మార్గశిరశుద్ధషష్ఠి.

మ. తమసర్వస్వము సంత్యజించి యుఁ దటిత్వాంతంబు లచ్ఛప్రభా
సముపేతంబులు త్యక్తకల్మషములై సంత్యక్తనిత్యేషణ
క్రిములై శాంతులు ముక్తకల్మషులునై కన్పట్టుమౌనీంద్రు ల
ట్లమితానందము గూర్చె లోకమున కత్యంత ప్రభావంబునన్. 164

తే. కృపణుఁడు కుటుంబి యవిజితేంద్రియుఁడు నగుద
రిద్రుఁడుం బలె గాధ వారిచరచయము
శరదహస్కర తాప మాసమయమందు
మడుగులఁ దటాకముల నొందు చిడుమ గుడిచె. 165

తే. బ్రహ్మవేత్త లాత్మేతరవస్తువులను
నేను నాదనుభావము నీడి నట్లు
పొదలుఁ కోమలతను మిట్టభూము లడుసు
విడిచిపెట్టె శరదృతు వడరునపుడు. 166

మ. ధరణిన్ దేహగతాభిమానమునఁ బ్రాప్తం బైనతాపంబు బ్ర
హ్మరతిజ్ఞానియుఁ బోలె గోపికలకుం బ్రాపింపఁగా నుండునా
విరహోంచద్ఘనతాప మీశుఁడు బలెన్ వెల్గొందుచంద్రుం డొగిన్
శరదర్కాంశుజతాప మెల్లఁ దొలఁగన్ సంధించునాత్మాంశులన్.

సీ. క్షితి వృష్ణివరులతో శ్రీకృష్ణుడుం బోలె
జదలఁ జుక్కలతోడ శశి దలిర్చె
మృగములుం గోవులు ఖగములున్ స్త్రీలును
సొరిది భర్తలఁ గూడి చూలు గొనిరి
రవి రాక కమలముల్ రంజిల్లి నట్టులు
చంద్రురాకన్ జనుల్ సంతసిలిరి
సస్యసమృద్ధిమై సకలపురగ్రామ
భూములు నిరతంబు పొలుపు మిగిలె

తే. *ఎల్లచోటుల నాగ్రయణేష్టిక్రతులు
క్రమ మెసఁగునవరాత్రోత్సవములు మఱియు

* అగ్రయణేష్టి=శరత్కాలములోఁ గ్రొత్తధాన్యములు వచ్చినప్పు డాధాన్యము లతోఁ జేయు నగ్న్యారాధనము; గాధము=స్వల్పము.

భగవదవతారములు రామవాసుదేవ
దర్శనమ్ములు నానందదమ్ము లయ్యె. 168

వ. ఇట్లు పరమానందకరం బైనశరత్సమయంబునందు గోవిందుండు గో
బృందంబులం గూడి గోపాలసందోహంబుతో బృందావనంబునకుం
జని యొక్కచో విశ్రమించి. 169

—♦ శ్రీకృష్ణుఁడు వేణుగానము గావించుట ♦—

సీ. పీతాంబరంబుపైఁ బింజలుదీర్చిన
హారంబట్టురెంబెంబు డంబుమీఱ
గజ్జెలందెలు కాళ్ళ గలుగల్లు మనుచుండ
నెమిలిపింఛము తల నెఱి నెసంగఁ
గర్ణికారద్యుతుల్ గండభాగంబుల
ధగధగ మెఱయుచుఁ దాండవింప
నెడమకుఁ దలవంచి కుడికా లెడమకాలి
పై నడ్డముగ నిల్పి పరఁగ నిల్చి
తే. వైజయంతి గళంబున వఱలుచుండ
వేణు వధరంబుపై మోపి రాణ లెసఁగ
భువనమోహనరాగంబు పొసఁగఁ జేసె
దేవదేవుఁడు శ్రీవాసుదేవుఁ డపుడు. 170

క. ఆవేణురవము గోపిక
లావల్లవపల్లియందు నాలించి మనో
భావముల మోహవశులై
యేవంవిధవాక్యరచన నెసఁగించి రటన్. 171

ఉ. కన్నులు గల్గినందులకుఁ గంజవిలోచనుదర్శనం బెటో
నెన్న ఫలం బటంచు వచియించెద నమ్మ నెలంతలార! వే
ణూన్నతనాదముల్ సలుపునుత్తమబింబఫలాధరోష్ఠముల్
గన్నులఁ జూచుభాగ్య మది గల్గుట దుర్లభ మెట్టివారికిన్. 172

— గోపికలు వేణుగానము విని చని మెచ్చుట —

వ. అని వా రొండొరులం బలికికొనుచు సర్వంబును మఱచినమనంబున నొండరయం జాలక జాలింబడి యున్నవా రున్నయట్టుల లేచి వేణు నాదంబు వచ్చినవంకకుఁ గొంకక వడి వడిం జని. 173

క. మామిడిచిగుళ్ళు కలువలు
తామరపువ్వులును బుష్పదామములు కడుం
బ్రేమ ముడినిఁ దాల్చి గోష్ఠము
లో మాధవుఁ డాడుకొంట లోఁ దోఁచు నహా. 174

శా. గోపీరత్నములార! కంటి రఁట రే గోపాలబాలాకృతిన్
గోపీభోగ్యము తద్వరాధరసుధన్ గ్రోల్లాడునా వేణు వా
రూపంబుం గొన నెట్టినోము మునుమున్ రూపింపగాఁ జేసెనో
చూపు న్మోదము తజ్జనితు లదిగో సొంపొప్పఁ గాఁ బాడుచున్. 175

మ. హరిపాదాంబుజలబ్ధలక్ష్మియును వంశాలాపనృత్యన్మయూ
రరవంబున్ హరిదగ్నినాస్థగితసర్వప్రాప్తసత్వంబునై
పెరిమం గాంచి జగత్ప్రసిద్ధ మగు నా బృందావనం బెంతయే
ధరణీదేవికిఁ గీర్తి దెచ్చినదియై తళ్కొత్తెడుం గంటిరే. 176

ఉ. జ్ఞానము లేనిలేళ్ళు నలసారసలోచను వేణుగానమున్
జానుగులందుఁ బెట్టుకొని సంతసమున్ బ్రియ మాదరంబునన్
మానసముం దగుల్కొనఁగ మాటికి [illegible] దృక్సుమపూజ సేయుచున్
మానక కొల్చుచున్నయవి మానినులార కనుంగొనుం డదే. 177

మ. అదె కన్గొంటిరె మింట నేగుచు విమానారూఢ లయ్యచ్చరల్
సుదతీమన్మథుఁడైనకృష్ణునితనూశోభన్ లసద్గానమున్
హృదయాకర్షక మాట మారవిశిఖాస్త్రిం గుంది కొప్పు ల్విడన్
మదిలోఁ బోకముడుల్ విడంగ వలపుల్ మట్టాడ నుం డ్రిట్టిచోన్.

ఉ. గోవులు కృష్ణగాన మను క్రొత్తచవుల్ గల వెల్లువువ్వ శ్రో
త్రావయవార్ఘ్యపాత్రముల నాని తృణంబులు మేయ కాహరిన్
భావన సేయుచున్ మెలఁగు బాష్పజలంబులు జాలువాఱఁగన్
బోవక యీవ లావలకు బొమ్మలచాడ్పునఁ జూడ నొప్పుచున్. 179

తే. గాన మొనరించుకృష్ణుఁడు గానవచ్చు
నట్లు పక్షులు చెట్లపై నధివసించి
వేణుగానామృతంబును వినుచు నితర
మును విడిచి మూసికొనె కనుల్ మునులవలెను. 180

చ. నదులును గృష్ణగానము ననారతము న్విని సుళ్లు నాఁగ నా
మదనుని బాణఘాతముల మందగతిం గొని భంగహస్తసం
పద మొగిఁ గౌఁగిలించుకొని పద్మచయం బది కాన్క వెట్టి త
త్పదములు ముట్టి శ్రీహరినిఁ దత్పరతన్ భజియించునట్లుగన్. 181

చ. వనముల సంచరించునలవారిజలోచనుఁ డెండ తాఁకునన్
గనఁ బరితప్తుఁ డయ్యె నని గాదిలిచుట్టము నాఁగఁ బ్రేముడిన్
గొనకొని శారదాభ్ర మదిగో జలశీకరపుష్పవర్షమున్
బొనరిచి నెత్తిపై నిలిచి పొల్చెను తెల్లనిఛత్రమో యనన్. 182

క. ఆగోవర్ధనపర్వత
మాగోపాలునిపదాంబుజాదృతివలనన్
దాఁ గుశాక మొంది దుంపలు
తేగలు వేళ్ళిచ్చి కొలుచుఁ దెగి భక్తుఁ డనన్. 183

తే. ♦ఆముకుందునివేణుగానామృతమున
జంగమము లైనజంతువుల్ స్థావరములు
స్థావరము లైనజంతువుల్ జంగమములు
నగుచు ధర్మవినిమయమ్మై యరయ నయ్యె. 184

వ. ఇట్లు బృందావనచారి యగుశౌరి విలాసంబుల నెల్లఁ దమలోఁ దారు ప్రసంగించుకొనుచుఁ గృష్ణానందపరవశులై తన్మయత్వము నొంది రనంతరంబ. 185

---

♦ గానము విని మనుష్యులులోనగువారు చలింపకుండి రనియు చెట్లు తాలు మొదలగునవి చిగిరించి స్రవించెనని యభిప్రాయము; మార్గము = మార్గశీర్షమాసము.

—♦ హేమంత ఋతు వర్ణనము ♦—

శా. హేమంతంబున కాదిమాస మగుచుర్ హేమించుమార్గంబు సు
శ్రీమంతంబుగ నందగోకులకుమారీరత్నముల్ భక్తిమై
నామాసంబున నన్నినాళ్ళులును గాత్యాయన్యభిఖ్యాంబికా
ప్రేమాంచద్వ్రతముం బొనర్చిరి హవిస్స్వీకారముం జేయుచుర్. 186

తే. నిచ్చ లరుణోదయంబున నియతి లేచి
వారు కాళిందికిం జని వారి నాడి,
మడుగులం గట్టి నీళులకడను సైక
తమునఁ గాత్యాయనీదేవిఁ దగ నొనర్చి. 187

వ. పాణిపత్రిష్ఠంగావించి గంధమాల్యధూపదీపనైవేద్యాదులు షోడశోప
చారంబులు గావించి యుచ్చావచంబు లగునుపహారంబులు ప్రవాళ
ఫలతండులంబులు సమర్పించి పూజించి లేచి యెల్లరు చేతులు
జోడించుకొని. 188

శా. ఓ కాత్యాయని! కామరూపిణి! మహాయోగిన్యధిష్ఠాత్రి! యో
లోకాధీశ్వరి! నీకు మ్రొక్కెదము నీలో మాపయిర్ గూరిమిర్
గైకో వేఁడుదు మమ్మ మాకుఁ బతిగాఁ గావింపు మాసర్వలో
కైకస్తుత్యుని నందనందనుని శ్రీకృష్ణుర్ మహావిష్ణునిర్. 189

క. ఈమంత్రము జపియించుచు
నామగువలు ప్రత్యహంబు నానదిచెంతర్
హైమవతిఁ బూజ సేయుచు
నేమంబున గడపి రట్లు నెలనాళు లొగిర్. 190

వ. ఇట్లేకమాసవ్రతంబుగఁ గాత్యాయనీవ్రతంబు ప్రవర్తిల్లుచున్నంత.

మ. వ్రజకన్యామణు లొక్కనాఁ డరుణబింబం బేగుదేకున్నయ
ప్డు జనుల్ మేల్కొనకున్నకాలమున నింపుర్ సొంపు పెంపొందఁ గా

---

♦ ఈవ్రతము చేసినవారును, వస్త్రము లపహరింపఁబడినవారును గోపికాగీతలలోఁ జెప్పినవారు కారు వీరు గోకులకుమారీరత్నములు. వీరు కృష్ణునిఁ బ్రేమించి వివాహము చేసికొనినారని గ్రహింపునది.

నజరుద్రాదుల మ్రొక్కులం గనెడులోకారాధ్యునిం గృష్ణునిన్
నిజనామంబులతో స్తుతుల్ సలుపుచున్ నిద్రన్ విసర్జించుచున్. 192

తే. పిలిచి యొండొరు చేతులు గలిపికొనుచు
నెప్పటివలెఁ గాళిందికి నేగి కట్టు
పుట్టములు విప్పి గట్టునఁ బెట్టి నీట
దిగి జలకమాడఁ గడఁగి రాదినమునందు. 193

—♦ గోపికావస్త్రాపహరణము ♦—

సీ. ఆయుదంత మెఱింగినట్టిఁడై యోగీశ్వ
రేశ్వరుం డగుకృష్ణుఁ డెల్లవారి
చేలంబులం గొనఁ జిత్తంబు గావించి
చెలికాండ్రతో నల్లఁ జేరి యటకుఁ
బిల్లివలెం బాదవిన్యాస మొనరించు
చును బోయి వస్త్రములను గ్రహించి
కడ నున్ననీపవృక్షము నెక్కి తనవాగు
నవ్విన మఱియును నవ్వి తాను

తే. వనితలం బిల్చి పరిహాసవాక్యములను
బలుకుచున్ మీరు వచ్చి మీవస్త్రములను
గైకొనుఁడు వేఱు వేఱుగాఁ గాసి కూడి
కాని యేతెండు నావుడుఁ గన్యకలును. 194

వ. కృష్ణాక్ష్వేళితంబు చూచి ప్రేమరసపరిప్లుతులై యొకరి నొకరు చూచుకొనుచు నవ్వుమోముల సిగ్గు నభినయించుచుం బోయి వస్త్రంబులు తెచ్చుకొనం జాలక కృష్ణునినర్మవచనంబుల నాకర్షింపఁబడియు నాకంఠదఘ్నంబు లగుజలంబుల మునింగి యుండి వడంకుచుఁ గృష్ణుని దిక్కు మొగంబై యి ట్లనిరి. 195

మ. నిను మే మెల్ల నెఱింగి యుంటిమి గదే నీ వల్లనందాత్మజుం
డనియున్ వల్లవసంస్తుతుండ వనియున్ స్వాంతంబునం దెగ్గి యే
నిను నీక్షించుచు నుంటి మోగుణనిధీ నీ కేము దాస్యంబు చే
యున యున్నారము మాపటంబు లిడి మ మ్మాలించి పాలింపవే.

శా. ఓనారాయణ నీ వజస్రమును మాయుల్లంబులం దుంటి మా
మానప్రాణధనంబు లెల్లను భవన్మాన్యంబు లో దేవ నీ
వీనీతిం బటముల్ హరించినఁ బ్రజల్ వీక్షించినన్ సిగ్గుగన్
గాన న్మా మొఱ లాలకించి కరుణన్ గావింపవే మాపయిన్. 197

క. ఇమ్మని వేఁడుచు నుంటిమి
సమ్మతిపడి యీయకున్న చని రాజునకున్
ముమ్మాటికి నెఱిఁగింతుము
సుమ్మా గోపాలబాల చూడుము మీఁదన్. 198

వ. అనిన గోవిందుండు మందహాససుందరవదనారవిందుండై యి ట్లనియె.

ఉ. కన్నియలార మీకు ననుఁ గన్గొని దాస్య మొనర్తు మంటి రే
నన్నటు మీరు చేయుటలు న్యాయ్యము గావున నాదు చెంతకున్
గ్రన్నన వచ్చి వస్త్రములు గైకొని పోవుట పోలు నట్లు గా
కున్న నొసంగఁ గాఁ దలఁప నొప్పను రాజభయంబు చెప్పఁగన్.

తే. నందరాజభయంబు నా డెందమందు
లేదు నామీఁదఁ బ్రేముడి పాదుకొలుపు
నతఁడు ముదుకండు తల్లియు నట్టియదియ
యిట్టిచో నాకు భయ మంట వట్టిమాట. 201

మ. అనినన్ దారిక లాజలాశయమునం దత్యంతశీతార్తలై
తనువుల్ బిట్టు వడంక లేచి యొకహస్తం బాత్మభూగేహమున్
స్తనయుగ్మంబు మఱొక్కహస్తమును బొంద న్నిల్పి తత్తీరధా
త్రిని జేరం జనుదెంచి రచ్యుతుఁడు వారిం జూచి ప్రీతాత్ముఁడై.

వ. వారిపరిశుద్ధస్వభావంబునకు సంతోషించుచు నిజభుజమూపురంబునఁ
గోకలమోపు పెట్టుకొని నవ్వుచు ని ట్లనియె. 203

చ. వివసన లై జలంబులఁ బ్రవేశ మొనర్చి రఁటన్న శాస్త్రముల్
తవు నన విద్ది తప్పగును దాని దొలంగఁగఁ జేసి కొంటకో
నవలలు మీర లౌఁదలల నాటగ నిల్పుచు హస్తయుగ్మమున్
ధవుఁ డగునాకు మ్రొక్కి వసనంబులు గైకొని పోవు టొప్పెదున్.

ఉత్సాహము. అనిన వారి ధర్మయుక్తమైనవానివాక్యముల్
విని యొకింత నాడుగుటేని వేడ్కఁ గప్పి యొంటఁ బ్రమో
క్కను బొనర్చి రతఁడు వారిఁ గోర్కెఁ గాంచి యొక్కచే
తను నమస్కరింప రాదు దైవతముల నెప్పుడున్. 205

క. ఒకఁ డైనచేత మ్రొక్కిన
సకలంకునిచేయి దనుమ శాస్త్రము చెప్పున్
దికమక లాడక మీరెం
డు కరంబుల నన్ను మ్రొక్కుఁడు ముదంపడుచున్. 206

వ. అట్లు నమస్కరించి మీవస్త్రంబులు మీరు గ్రహింపుఁ డనిన
వ్రజాంగనలు వివస్త్రాప్లవనంబు వ్రతభంగకరం బని తలంచి వ్రత
పూర్తిం జేసికొనం దలంపుచేసి ప్రత్యక్షఫలస్వరూపుం డగునాపురు
షోత్తముఁడు చెప్పినచొప్పునం జేసినం జూచి సంతసించి భగవంతుం
డగునతండు వారికి వారివస్త్రంబు లిచ్చినం బుచ్చుకొని తమ్మతం
డట్లు వంచించినను మందాక్షంబున ముంచినను పరిహాసించినను
క్రీడోపయోగవాక్యంబులు వలికినను వస్త్రంబు లపహరించినను
బ్రియసంగమనిర్వృతు లగుటం జేసి వానిఁ గోపింప నొల్లక తమతమ
వస్త్రంబులం గట్టుకొని కృష్ణాయత్తము లైనచిత్తవృత్తులు గలవారై
సిగ్గునం జేసి చలింప కుండిరంతభక్తపరతంత్రుం డగుభగవంతుండు నిజ
పాదసేవం జేయం దలంచునాగోపికలసంకల్పం బెఱింగి యి ట్లనియె.

శా. మీసంకల్పము నే నెఱింగితి నెదన్ మీకోర్కి సత్యం బగున్
నాసంకల్పము నట్టిదే యగుఁ జుఁడీ నారీమణుల్ మీర లా
ర్యాసర్వేశ్వరి పూజకున్ ఫలముగా నయ్యర్థముం బొందనై
భాసిల్లం గల రవ్వలన్ వ్రతము దీర్పం బొందు మీయిండ్లకున్. 208

వ. అని భగవంతుం డాజ్ఞాపించిన లబ్ధకామ లగునాగోపబాలికలు శ్రీకృ
ష్ణపాదపద్మధ్యానంబు గావించుచు నతికష్టంబుగ గొల్లపల్లెకుం జని
రనంతరంబ. 209

క. గోపాలపరివృతుం డై
శ్రీపతి బలరామునితోడి చెలికారమునన్
దీపించుచు గోవులతో
నాపొలమున నుండి చనియె నతిదూరముగన్. 210

వ. అవ్వనంబునం దవ్వనజనాభుండు నిదాఘాతపతప్యమానం బగు ప్రాణిసంఘంబునకు నాతపత్త్రాయితంబులై చల్లనినీడల నిచ్చువివిధవృక్షంబులం గని స్తోకకృష్ణుండు శ్రీదాముండు సుబలుండు నర్జునుండు విశాలుండు వృషభుండు తేజస్వి దేవప్రస్థుండు వరూథపుండు లోనగు వ్రజౌకసుల దిక్కు మొగంబై యి ట్లనియె. 211

మ. తమజన్మంబు పరోపకారమునకే తార్కాణముం జేయుచున్
క్షమ వాతాతపశీతబాధల నజస్రం బాత్మలన్ సైచుచున్
సుమనస్కుల్ బలె సర్వకాలము తపస్సున్ జేయుచున్నట్టివై
ద్రుమముల్ చెప్పఁగ నొప్పెడిం గనుఁడు సంతోషంబు సంధించుచున్.

శా. ఱాలన్ రువ్విన నెక్కి త్రొక్కినను దూఱన్ రెమ్మలం గొట్టినన్
జాలన్ బాధ యొనర్చినం బరులకున్ బర్ణంబులుం బండ్లునుం
బూలున్ దాన మొనర్చు మానవుల కీభూజంబు లల్పంబులే
వేళం బాళియు నాఁక యెల్లతఱులన్ బ్రీతిప్రదాతల్ గదా 213

తే. అఖిలజీవ్యుపజీవన మైనయట్టి
వీనిజన్మమె జన్మమై వినుతి గాంచు
సుజను నాశ్రయించినయాచకజను లట్లు
వీని నాశ్రయించినజనుల్ వితగఁ బోరు. 214

మ. ఫలముల్ పత్త్రములున్ జిగుళ్ళు సుమముల్ పట్టల్ సునిర్యాసముల్
విలసద్గంధములు న్మరందములు నే వేళన్ బ్రజాకోటికిన్
ఫలముం గోరక యిచ్చు నిచ్చలును సంపన్నుల్ బలెన్ సాలముల్
తలపోయంగఁ బరోపకారకులజన్మం బే యగున్ జన్మమై. 215

వ. అని యభివర్ణించుచుఁ గృష్ణుండు చివుళ్లుం బువుగుత్తులుం బండ్లుఁ బువ్వులు నాఁకులు లోనగువానిచే వంగినకొమ్మలు గలవనవృక్షంబుల

మధ్యంబునం దగుమార్గంబునుండి సర్వపరివారపరివృతుండై యమునా నదికిం జని గోవులకు నీరు ద్రావించి గోపకులతోఁ దానునుం ద్రావి సమీపోపవనంబున విశ్రమించియున్నయప్పుడు గోపకులు వచ్చి రామకృష్ణులం గాంచి మే మాఁకలిం గొంటిమి దానిఁ దీర్పు మని ప్రార్థించుటయుఁ గృష్ణుండు భక్తురాం డ్రగుమునిభార్యలుజ్ఞప్తికి వచ్చుటం జేసి యి ట్లనియె. 216

—♦ శ్రీకృష్ణుఁడు మునిసతుల నన్నం వేఁడఁ బుచ్చుట ♦—

సీ. గోపాలురార మీ రీపరిసరమున
బ్రహ్మవాదు లయిన బ్రాహ్మణు లట
నాంగిరసం బనునధ్వరం బొనరించు
చుండిరి స్వర్గంబు నొందుపొంటెఁ
జనుఁ డల్ల దేవయజనమున కచ్చట
మారాముపేరు నాపేరు సెప్పి
యాచింపుఁ డన్నము యజ్ఞకర్తలు పెట్టు
దురు నాఁగ వారలు త్వరితగతుల
తే. అచటికిం జని మ్రొక్కుచుఁ బ్రాంజలు లయి
రామకృష్ణచోదితులము మేము వచ్చి
నార మిట మీకు భద్ర మౌఁ గోరుచుంటి
మన్నమును మానుడిం జెవియందు నిడుఁడు. 217

మ. బలరాముండును గృష్ణుఁడున్ వనుల గోపాలవ్రజం గూడి గో
వుల మేపం జనుదెంచి రీదినమునం బ్రొద్దెక్కె నొక్కింతలో
పలఁ బోరాదు వ్రజంబు దవ్వులను జూపట్టున్ బరిశ్రాంతు లాఁ
కలికిం జిక్కి శయించి రొక్కకడ వృక్షచ్ఛాయ నాశించుచున్. 218

క. మీ కేయన్నము గలదో
మా కాయన్నంబె నేఁడు మధుర మటంచున్
వాకొనిరి వారియెడలన్
మీకున్ విశ్వాస మేని మే మన వినుఁడీ. 219

తే. అనఘులార పశ్వాలంభ మైన వెనుక
మఱియు సౌత్రామణికి మీఁద మఖమునందు
నన్నమును దిన్న వారికి నధ్వరికిని
తప్పు లే దని కృష్ణుండు చెప్పు మనియె. 220

మ. అనుచున్ వల్లవు లెల్లఁ దెల్లముగ సంప్రార్థించి సందేశమున్
వినిపింపన్ దమకంబె విజ్ఞు లెవరున్ లే రన్న మజ్ఞానమున్
గొని వర్తించెడువారు తుచ్ఛఫలముల్ గోరఁగన్న వారున్ శ్రమం
బునకై నట్టిరు విప్రు లాహరినుడుల్ పోలింప లేరై రెదన్. 221

తే. జ్ఞానమానులు యాజ్ఞికుల్ జానుగులను
వారిమాటలు వడినను బడనియట్టి
వార లై రామకృష్ణుల నారయంగఁ
లేక యన్నము గిన్నము లే దటనిరి. 222

సీ. దేశకాలములు నర్త్విజు లగ్ని ద్రవ్యము
మంత్రతంత్రములు ధర్మమును గ్రతువు
యజమానుఁడును దేవతాయతనంబులు
నెవ్వానిరూపులై యెసకమెసఁగు
నట్టిబ్రహ్మముఁ బరమాత్ముని భగవంతు
సాక్షాదధోక్షజుఁ డనుచు నెఱుఁగ
లేక దుష్ప్రజ్ఞులై లోకాభిమానము
కలవారమై యున్నశాస్త్రవిబుధులు

తే. కలదు లే దన్న మనఃకపం గాక మఱియు
ననుము మినుమును జెప్ప కుండిన నెఱింగి
విసిగి వేసారి గోపకుల్ వెడలి వచ్చి
కృష్ణునకుఁ జెప్పి రంతయు నింత విడక. 223

వ. అనిన భగవంతుం డగుకృష్ణుండు మందహాసంబు గావించి మఱియును
లోకధర్మంబు ననుసరించి గోపాలురం జూచి యి ట్లనియె. 224

ఉ. గోపకులార మీరు చని కొంతటిలోపల యజ్ఞవాటికిన్
గోపకుమారుఁ డాబలుని గూడి సమాగతుఁ డయ్యె నంచు నీ
నాపలుకుల్ వచింపు డలనారులు నాపయి భక్తిఁ జేసి మీ
కాపయి నిష్టమన్నముఁ బ్రియంబునఁ బెట్టెద రట్టిపట్టునన్. 225

వ. అని కృష్ణుండు చెప్పుటయును. 226

క. వారలు పత్నీశాలను
గోరిక లిగు రొత్తఁ బలుకు కొనియెడివారి
వారిజముఖులఁ గని నమ
స్కారము గావించి వినయసముచితమతులై. 227

ఉ. తల్లులు! మీకు వందనము దాసుల మేము వచించువాక్యమున్
దెల్లము గా గ్రహించుట కిదే వినయంబున వేఁడుచుంటి మా
వల్లవపత్తనంబునను వర్తిలుచుండెడువాసుదేవుఁ డో
చెల్ల చరించుచున్ వనులఁ జెప్పి మముం జనఁ బుచ్చె నీడకున్.

మ. బలరాముండును దోడునీడ యగుచుం బాటించి రా గోపకుల్
గొలువన్ గోవులవెంట నంటి యిటకుం గొంచెంబు దూరంబులో
పలఁ దానుం బరివార మాఁకలికి నై పాటాడుచున్నారు వా
రల కన్నం బిడఁ జెప్పవచ్చితిమి తద్రమ్యోక్తిపూర్వంబుగన్. 229

లలితవృత్తము. అని గోపాలకుఁ లనియెడిమాటల్
విని సోమాసులవెలఁదులు రాముం
డును గృష్ణుండు నిడుమలకు నై శా
ననమం దుండుట నలువురు వించున్. 230

—♦ మునిసతు లన్నంబు తెచ్చి కృష్ణునకు నివేదించుట ♦—

వ. భక్ష్యభోజ్యచోష్యలేహ్యంబు లనుచతుర్విధం బగునాహారంబు సం
సిద్ధంబు గావించుకొని దానిభాజనంబుల సంతరించుకొని బయలు
వెడలి రప్పుడు వారితల్లిదండ్రులు నన్నదమ్ములు నత్తమామలు
భర్తలు పుత్రులు లోనగువారు వారించినను వినక శ్రీకృష్ణదర్శన
లాలసలై యెందు విచారింపక చని చని యమునోపవనంబున. 231

సీ. తొలుకారుమబ్బునాఁ దళుకుఁబీ నెడునల్ల
నగు దేహకాంతుల నలరువానిఁ
బదియాఱువన్నె మేల్పసిడికి నెన వచ్చు
పట్టుపుట్టము మేనఁ జుట్టువాని
నెమిలికన్నులతోడ నెఱిమీఱి నల్లిన
బొమిడికంబుం దలఁ బూనువాని
వింతపుష్పములతో నెంతవింతగ నల్లు
మేలు తోమాలతో మెలఁగువానిఁ
తే. కర్ణములఁ గర్ణికారము గలుగువాని
వక్షమున వనమాలిక గ్రాలువాని
వేణునాదము సతము గావించువాని
బాలకృష్ణునిఁ గాంచి రాపడఁతు లెల్ల. 232
ఆ. కన్నవారు తొల్లి విన్నట్టు లున్నశ్రీ
కృష్ణునందు మరులు క్రేళ్ళువాఱ
వాని నక్షిరంధ్రవరమార్గమున లోన
నిలుపుకొని ముదంబు గలిగి రపుడు. 233
తే. అఖిల మెఱిఁగిన మేటి పరిహాసితముఖుఁడు
వాసుదేవుఁడు తనుఁ జూడ వచ్చినట్టి
వారిఁ ద్వ్యక్తాశలన్ మునిదారల నెదఁ
దెలిసికొని వారలం గాంచి పలికె నిట్లు. 234
ఉ. స్వాగత మమ్మ మీకు మునివల్లభలార! మహాత్మలార! మీ
రీగతి రాక మామదుల కెంతయు సంతస మయ్యె నిప్డు మీ
భాగవతాత్మతత్త్వ మనుభావ్యము భక్తజనాళి కెప్పుడున్
యోగిను లైనమీమదుల నుండెడుజ్ఞాన మనంత మారయన్. 235
క. ప్రాణము బుద్ధియు మనమున్
మాన మపత్యంబు ధనము మహిళామణులున్

వేనికి నాత్మాన్వితములో
వానికిఁ బరు డెవఁడు ప్రియుఁడు భగవంతునకున్. 236

క. కావున సాధ్వీమణులా
రా! వోవుఁడు దేవయజన మధిగమియింపన్
మీవలనన్ గృహమేధులు
మీవా రధ్వరసమాప్తి మెఱయుదు రవనిన్. 237

వ. అనిన విప్రపత్నులు వారు తెచ్చినచతుర్విధాన్నంబు లట సమర్పించి.

ఉ. అన్నలఁ దమ్ములం బ్రియుల నాప్తులఁ జుట్టల నెల్లవారలన్
గ్రన్ననఁ ద్రోసి వచ్చితిమి కన్గొన వేఁడుకఁ జేసి నిన్న యో
యెన్నఁడు నిట్లుపల్కెదని యేము దలంపము నీపదార్చనా
భ్యున్నతపుష్పముల్ తలలఁ బూనఁగ నెంచుచు నుంటి మెప్పుడున్.

శా. దేవా! మాపతు లిట్లు వచ్చినమమున్ దృష్టించి చేకొం రిఁకన్
గావం బోవఁగ నీవ దిక్కటన మాకాయంబులన్ వైచి మా
సేవల్ మీపదయుగ్మమందుఁ దగులం జేయంగఁ గన్నిగ్గతిన్
బోవన్ జెప్పకుమయ్య సంసృతిభరంబున్ మోయ లేమయ్య యో.

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 241

క. మదనుజ్ఞాతుల జనులం
ద్రిదశులు నంగీకరింతురు పృథివీజనులన్
జదువంగ నేల మీపతు
లెద మెత్తుర కాని దూఱ రిట వచ్చుమిమున్. 242

సీ. సతులార నాదుసంసర్గము సౌఖ్యాను
రాగములకుఁ గాదు త్యాగబుద్ధి
మన మెల్ల నాయందు నునిచినదాన మీ
రచిరకాలమున న న్నందఁ గలరు
శ్రవణసంకీర్తనస్మరణాదుల న్మది
నాయందు నిలిపిననరులకు బలె

సన్నికర్షస్థితిఁ సంభవింపదు ముక్తి
గాన మీరాయిండ్లకుఁ గదలి పొండు

తే. అని వచించి ముకుందుఁ డామునిసతులను
జెల్మి నొనరించి యంపి పుచ్చినను వార
లెట్టకేలకు జన్నంపుటిండ్ల కేగి
పతులసన్నిధి నిలిచి రప్పట్టునందు. 243

తే. వారు తమమాట విన కట్లు శౌరిఁ జూడఁ
బోయి వచ్చినవారిపైఁ బురుషు లలుగ
కాదరించుచు వారితో వధ్వరంబు
ముగియఁ జేసి రవభృథంబు తగ నొనర్చి. 244

ఉ. ఆమఖశాలయందు సతు లందఱతో నటఁ బోవ కుంటకున్
రామ యొకర్తు చింతిలుచు రామునిఁ గృష్ణుని నెమ్మనంబునన్
బ్రేముడిఁ జేసి నిల్పుకొని వేడుక గొల్చుచు దాను భర్తయున్
శ్రీమహిళామనోహరునిచెంతకు నేగిరి వీఁగి మేనులన్. 245

వ. అంత నక్కడ గోవిందుండు తాను నన్నయు గోపాలకులం గూడి మునిదారానీతంబు చతుర్విధాన్నంబు భుజియించి తృప్తిం గాంచె నిట్లు లీలామానుషవిగ్రహుం డగుకృష్ణుండు మనుష్యధర్మ మనుసరించి గోగోపగోపీజనంబుల రూపవాక్యకృతకృత్యంబులఁ గ్రీడింపఁ జేయుచుం గ్రీడించు చుండె నగ్గతి నట్లట సత్రంబున నిజసతులు చెప్పినంత వ్రతపరాయణు లగుసోమయాజులు ప్రపంచకేశ్వరు లగురామకృష్ణుల వృత్తాంతంబు విని విస్మయంబును బశ్చాత్తాపంబును బొందిన డెందంబుల. 246

—♦ శ్రీకృష్ణున కన్నమిడ నిరాకరించిన విప్రులు చింతించుట ♦—

చ. క్షుధితులమైనమాకు నొకకొంచెము భక్తము పెట్టుఁ డంచుఁ రా
నధములమై వ్రజప్రజల నట్లు నిరాకృతులం బొనర్చియున్
వ్యధ గలిగించినార మకటా యెటనో గలవారి కన్నమీ
విధిఁ గొనకొంచుఁ గానఁ బడి వేఁడిన వేల్పును జూడ మయ్యయో.

చ. మనవనితామతల్లులను మాన్పఁగ నెంచిన వారు మాన కా
మునిజనవంద్యుపాదములపొంతకుఁ బోయి నమస్కరించి నె
మ్మనములతోడ నన్నము సమర్పణముం బొనరించి భక్తిపెం
పున భజియించి వచ్చి రిది పూర్వభవాంచితపుణ్యగంధమే. 248

చ. హరివిముఖత్వముం గొనినయట్టిఖిలాత్ములమైతి మేము మా
హరిభజనంబు లేమిటికి నన్వయ మేటికి విద్య లేటికిన్
వరయజనంబు లేమిటికి వంశ మ దేటికి బుద్ధి యేటికిన్
ధరణిసురత్వ మేమిటికి ధర్మము లేటికిఁ గాల్చ పుచ్చనే. 249

ఆ. వానిమాయ దాఁట బ్రహ్మేంద్రరుద్రాదు
లైనఁ జాల రనిన నస్మదాది
జడులమాటఁ జెప్ప నేడ ముందునే మన
వనిత లెంతపుణ్యవతులు బళిర. 250

తే. భవ మనంబడుఖరమృత్యుపాశములను
ద్రెంచి వేయఁగఁ జాలిన దేవదేవు
భక్తి మనస్త్రీలమోహసంబంధ మెల్ల
ద్రెంచి వేసెను గంటిరే ధీనులార. 251

సీ. బళిరె పండితులార ! తలపోయ మనధర్మ
పత్నులకు ద్విజాతివనితము లగు
సంస్కారములు లేవు చదువుసంధ్యలు లేవు
గురుకులవాసంబు గొనఁగ లేదు
జపము తపంబును స్వాధ్యాయమును లేవు
కృచ్ఛ్రచాంద్రాయణక్రియలు లేవు
శుచియును శుభమును సువిచారమును లేవు
పరమాత్మసంధానపరత లేదు

తే లేక యుండిన నుత్తమశ్లోకు లైన
యోగు లొందఁగ నగుమహాయోగిభక్తి

మనసతుల కబ్బె లే దయ్యో మనకు నెంత
వ్రతము గల్గి మెలంగుతాపసుల మైన. 252

ఉ. దేశము కాలమున్ మనువు దేవుఁడు ద్రవ్యము తంత్రమున్ బురో
డాశము మంత్ర మగ్నియు దృఢవ్రతమున్ యజమానుఁడున్ సవం
బీశుఁడు సర్వ మారయ రమేశుఁడు కేశవుఁ డాతఁడే యదూ
ద్దేశము గాఁగఁ గృష్ణుఁ డయి దేజరిలుం ధరణీతలంబునన్. 253

చ. అని హృదయంబునన్ యదుకులాభరణున్ దగ నిల్పి కొంచు నో
సనకసనందనాదిమునిసన్నుత నిన్ను నెఱుంగ లేక మా
మనములు మోహమగ్న మయి మానరె మాదగుతప్పు సైఁపు మో
వనరుహనాభ నీదుపదపద్మములన్ భజియింతు మెప్పుడున్. 254

వ. అని యిట్లు కర్మమోహితులై కానం జాలనివా రయ్యు నిట్లాత్మ
వల్లభలకతన విజ్ఞానంబు వడసి వాసుదేవారాధనంబు గావించుచుండి
రనంతరం బా వ్రజంబున. 255

— ♦ శ్రీకృష్ణుఁ డింద్రయాగము మాన్పించుట ♦ —

తరువోజ. బలరాముతోఁ గూడి వాసుదేవుండు
వ్రజమునం దొకనాఁడు వాసించి యుండ
బలవైరి యాగం బుపక్రమించుటకు
వల్లవు లెల్లరు వచ్చి నందునకుఁ
దెలుపుచు నుండఁగాఁ దెలిసి కృష్ణుండు
దెలియనివాఁడునాఁ దెలియంగఁ గోరి
పలువురు సంభ్రమంపడుచుండి రిట్లు
ఫల మేమి పడయంగ వచ్చు నిద్దాన. 256

తే. తెలిసి చేసినకర్మముఫలము నిచ్చు
తెలియక పొనర్చినన్ దాన ఫలము నున్న
మీఁపొనర్చెడుసవనంబు రూప మెద్ది
వైదికమ లేక లౌకికమా దెలుపుఁడు. 257

సీ. అనుడు నందుఁడు కృష్ణు నరసి యోననుఁ గన్న
తండ్రి! చెప్పెద విను తాలిమిఁ గొని
భగవంతుఁ డింద్రుఁడు పర్జన్యుఁ డగు వాని
కాత్మమూర్తులు మబ్బు లవియు మనకు
జీవనదాతలై జీవనంబుల నభి
వర్షించుఁ గావున వారిదపతి
నింద్రు సేవించెద మేకేట మేఘోద
కములఁ దత్ద్రవ్యసముదయముల
తే. ఇది మహాక్రతు విలఁ గలయెల్లప్రజలు
వచ్చి పరమోత్సవంబును బడయుచుంద్రు
కనుఁగొనంగ నింద్రుఁడు త్రివర్గఫలసిద్ధి
దాయకుం డని ప్రాజ్ఞుఁడై తాను బలుకు. 258
తే. కామమునఁ గాని లోభంబు గలిగి కాని
భయమునఁ గాని ద్వేషంబువలనఁ గాని
వంశమునఁ బొంటినుండియు వచ్చుధర్మ
మును విసర్జించి క్షేమముం గొనఁడు జనుఁడు. 259
వ. అని నందుండు చెప్పిన విని గోవిందుం డింద్రుపై నలుక పుట్టించువాఁ
డగుచు వెండియుఁ దండ్రి కి ట్లనియె. 260
ఉ. కర్మమునన్ జనించెడిని గర్మమునన్ మరణంబు నొందెడిన్
గర్మమునన్ సుఖంబు మఱి కష్టము నొందెడి ప్రాణికోటికిం
గర్మమె కారణం బగును గాని మఱొక్కఁడు కాదు నిక్క మా
కర్మమె సర్వలోకముల కాదిమశక్తి యటంచుఁ దెల్పుదుర్. 261
తే. కర్త యీశ్వరుఁ డందునే కర్మఫలము
చేసి యుండినవారికిఁ జెందఁ జేయుఁ
జేయ కుండినవారికిఁ జేయ లేఁడు
తెలియ నింతటిలోఁ వాఁడె దేవవిభుఁడు. 262

శా. ఈజన్మంబునఁ దాను జేసినకృతిం బెంచ్చిల్లు కర్మంబు తా
నేజన్మంబున యందు నైన జనుఁ డెల్లే నొందుఁ గా కన్యథా
పోఁ జేయంగ నశక్య మెవ్వరికి నీపోల్కిం బ్రబర్తిల్లున
ప్రాజాల్మం డగునింద్రుఁ డేమియును జేయం జాలఁ డెం చెంచెదన్.

క. కర్మాధీనము లోకము
కర్మమునకు భిన్న మగుచుఁ గనఁబడ దొకఁడున్
గర్మ ఫల మనుభవింతురు
కర్మతు లగువారు కొలిలు గలుగక యుండన్. 264

ఆ. పూర్వజన్మకర్మమునజేసి మనుజుఁ డు
చ్చావచంబు లైన సంహననము
లంది కుడుచుఁ గర్మ మదిగానఁ గర్మమే
పగతుఁ డగును గురువు నగును దెలియ. 265

సీ. నాల్గుజాతులకును గల్గువృత్తులు కృషి
వాణిజ్యములు పశుపాలనమును
వైశ్యవృత్తులు నాఁగ వర్తిల్లు మన మిందుఁ
బాశుపాల్య మొనర్చి బ్రిదుకువార
మీవిశ్వము రజోగుణావృతమై యుండు
రజ మందు జనికిఁ గారణము సువ్వో
మొగు లారజోగుణములఁ జేసి జన్మించి
వర్షించు నలుఁగడ వానవలన

తే. సస్యములు పండు దాన భూజనులు బ్రదుకు
చున్నవారు దలంప నిట్లున్న దాని
కింద్రుకర్తృత్వ మెట్టిది? యేమి చేయు
శక్తి యాతని కెట్టి దెసంగుఁ జెపుడ. 266

మ. మనకుం బల్లెలు పట్టణంబులును గ్రామంబుల్ మహాదేశముల్
కనరా వెప్పు డరణ్యముల్ శరణముల్ గానన్ మహీ దేవులున్

---

* ఉచ్చావచంబులు=బహువిధములు; సంహననము=దేహము;

ఘనభూధ్రంబులు గోవులుం గొలువఁగాఁ గన్పట్టు నెప్పట్టునన్
జను లగ్గింప మఖం బొకండు సలుపన్ సంకల్పముం జేయుమా. 267

— నందాదు లింద్రయాగము మాని పర్వతయాగము చేయుట —

సీ. ✦ఇంద్రయాగార్థసంభృతములు సంభార
ములు చాలు నీమఖంబునకు నిపుడు
శాకపాకంబులు గాక సంయావము
లతిరస శష్కులు లతులితముగఁ
బాయసాన్నంబును బచనంబు గావించి
విప్రులచే నగ్ని వేల్వఁ జేసి
వారికి బహువిధాపారదక్షిణ లిచ్చి
ధేనుదానాదులు పూని సలిపి
తే. శ్వపచ చండాల పతితాది జనుల కుచిత
రీతి నన్నము పెట్టుఁడు రేపు మాపు
పసులకున్ గడ్డి గాదము నొసఁగుఁ డద్రి
పూజ గావింపుఁ డెల్లరు పొగడు కొనఁగ. 268

వ. మఱియు నవ్వల మీ రెల్లరు గంధపుష్పవస్త్రమాల్యాభరణాదులచే నలంకరించుకొని గోబ్రాహ్మణాగ్నిపర్వతంబులకుఁ బ్రదక్షిణంబులు గావింపుఁ డిట్లు చేసిన మనకు సర్వశ్రేయంబులును సమకూరు నిది నామతంబు నిష్టం బిట్లుపోలు నని నీకుం దోఁచినఁ దోఁచినట్లు చేయు మని కాలాత్మకుం డగు నాత్మజరూపగోపాలపరబ్రహ్మంబు చెప్పిన నిది యొప్పు నని నందగోపపరివృఢుం డోంకారంబు గావించి. 269

సీ. అచ్యుతుండు వచించిన ట్లింద్రయాగసం
పాదితద్రవ్యము పదిల పఱచి
స్వస్త్యయనము సల్పి సర్వము పర్వత
గోబ్రాహ్మణులఁ గొల్చి కొఱకుఁ గాఁగ

---

✦ సంయావము=ఒబ్బట్లు; అతిరసము = అరిసెలు; శష్కులిక = చక్కిలము; శ్వపచులు=కుక్కలవండుకొనువారు; గాదము=కసవు లేక యాఁకు.

బలులు సమర్పించి పసికిం గసవు వేసి
పిదప గోవులు ముందు కదలినడువ
నందగోపాదు లానందంబునఁ బర్వ
తమునకు వలగొని రమితభక్తి

తే. గోపకాంతలు కైసేసి కొంచు నెడ్ల
బండ్లపై నెక్కి షడ్జమస్వర మెసంగఁ
గృష్ణలీలలు పాడుచు గిరిప్రదక్షి
ణమును గావించి రాసమయమునయందు. 270

తే. అపుడు గొల్లలు నమ్మెడునట్లు కృష్ణు
డన్యతమరూపమును దాల్చి యందఱు విన
నేను గిరి నైతి ననుచు నెంతేని మేను
పెంచి యెంతేని బలిని భక్షించె మించి. 271

చ. పదపడి కృష్ణుఁ డావ్రజమువారలఁ గూడి మహోన్నతాకృతిన్
బొదలెడుపర్వతంబునకు మ్రొక్కి యనుగ్రహదృష్టిఁ జూచు ని
య్యది కనఁ గామరూపి మన కందఱకున్ సుఖ మిచ్చుఁ గావునన్
మనము భజింత మీశ్వరునిమాద్రిఁ దలంచుచు నిమ్మహాద్రినిన్. 272

వ. ఇట్లు వాసుదేవప్రబోధితు లగువల్లవు లెల్లరు నయ్యద్రి గోద్విజ మఖంబు విధివిధానంబునం బ్రవర్తిల్లం జేసి బలరామకృష్ణులం గూడి గొల్లపల్లెకుం జని రంత. 273

శా. ఈచందంబునఁ గృష్ణనాథ మగుచున్ హేరాళ మౌయాగ మా
భూచక్రంబున నందగోపకులు సంపూర్ణప్రభుత్వస్థితిన్
వాచింపం దగు నట్లు చేయుట లటన్ బర్హిర్ముఖాధీశ్వరుం
డాచక్కిన్ విని కోపఘూర్ణితదృశుండై స్వాత్మచిత్తంబునన్. 274

మ. ప్రతివర్షంబును నన్నుఁ గూర్చి వ్రజగోపవ్రాత మూర్వీస్థలిన్
స్తుతిపాత్రంబుగ యాగమున్ సలిపి నాకోఁ బొత్తు గావించు నీ
గతి నాజోలి యొకింత లేక గిరికిం గావించి రాయాగ మం
చతికార్పణ్యమునన్ దలంప కొకఁ డత్యామర్షముం జేయుచున్. 275

సీ. ప్రభుగర్వమునఁ జేసి యశుభము శుభంబును
దెలియనివాఁ డయి దేవవిభుఁడు
సంవర్తకాఖ్యనామ స్తనయిత్నుగణమును
బిలువంగ నంచి యిట్టులు వచించె
శ్రీమదాంధులు గొల్ల లామహీ మానవ
కుఁడు కృష్ణునాశ్రయం బుడుగ కంది
దేవహేళనమును గావించి నద్రోసి
రా జని గిరి కధ్వరము సలిపిరి
తే. బాలిశుండు వాచాలుఁడు పండితాభి
మాని స్తబ్ధుఁడు జ్ఞానము లేనివాఁడు
మనుజమాత్రుఁడు కృష్ణుఁ డాతనిసమాశ్ర
యించి నా కప్రియ మొనర్చె నెల్ల వ్రజము. 276

క. మీ రిపు డాశ్రీమత్తా
భీరులమైశ్వర్యమదము భేదింపుఁడు త
ద్ఘోరిపశుచయము నంతయుఁ
బారము ముట్టంగఁ జేయ వలయుం జుండీ. 277

తే. నేను నైరావణము నెక్కి దానవారి
కులములం గూడి నందగోకులముఁ జేర
నరిగి వ్రజ ము దంతయు నాశ మగు తెఱఁగున
సలిపి వచ్చెద మీ రేగ వలయు నటకు. 278

వ. అని ప్రళయభయబద్ధంబు లగుసంవర్తకంబుల బంధంబు తొలంగించి
యంపి పుచ్చుటయు నవియును. 279

సీ. కాటుకం బురుడించుకటికచీఁకటివిప్పు
కనుఁ గాన కుండఁగఁ గప్పుకొనఁగ
నురుములుం మెఱుములు నురతరద్యుతి శబ్ద
ములచేతఁ బ్రళయముం దెలుపుచుండ

నావహప్రవహాదు లగువాయువులు రేఁగి
యుర్వీధరముల నుఱ్ఱూఁతలూఁపఁ
బిడుగులంతోఁ బెద్దవడిగండ్లవర్షము
కుండ పగిలినట్లు కురియుచుండ

తే. నేన్గుతొండములం బోలు నేకధార
లెప్పుడు విడువక పడుచుండె నెల్లకడల
నేళ్లులై నీళ్లు ప్రవహించె నెందుఁ జూడ
సంద్రమే యనుభ్రాంతి పొసంగెఁ బ్రజకు. 280

వ. అయ్యవసరంబున, 281

శా. అత్యాసారజలాతిపాతమున శీతార్తుల్ ప్రజల్ ధేనువుల్
నృత్యం బట్లు వడంకుచున్ శిరము లెంతే మేనులం గప్పుచున్
బ్రిత్యూహంబుల కోర్చి వెల్లువ నడిన్ పన్న్యాసముల్ దూలి పోఁ
బ్రిత్యక్షం బగుకృష్ణునిం గదిసి తత్పాదంబులన్ గొల్చుచున్. 282

శా. "ఓగోపాలక యోకృపాజలనిధీ యోసింధుకన్యాపతీ"
మాగోధేనువు లేము మాప్రిజలు మామాతల్ పితల్ పత్నులున్
నీగుప్తిం బడియున్న నే మెపుడు గానీ యింతకష్టంబు రా
గాఁ గన్గో మిపు డిట్లు కల్ప మగుచున్ గన్పట్టు వీక్షించితే. 283

చ. ప్రళయము కానిచో నిటులు పట్టినపట్టది మాననట్టుగా
జలధరముల్ ప్రచండగతి సర్వనభంబును నిండి కుండపో
తలగతి వర్షముం గుఱియఁ దార్కొనెఁ గార్కొని కొండ గూలునో
యిల పయి నన్నయట్లు పడు నెల్లెడలన్ బిడుగుల్ కడున్ వడిన్.

♦చ. పిడుగులపాటునం బడియెఁ బృథ్విపయిన్ పడి పెద్దమేడలున్
గుడులును గోపురంబులును గొప్పమహీజములున్ నగంబులున్

---

♦ ఆవహము, ప్రవహము=ఇవిమహావాయువులు; ప్రళయకాలమునమాత్రమే బయటవచ్చును ఎప్పుడును స్వర్గమున బంధితములైయుండును. శ్రీమత్తాభీరులు=శ్రీచే మస్తులైనగొల్లలు; పన్న్యాసము=పాదన్యాసము; శిరము మేనులఁగప్పు=ముడుగునని;

కడువడి భూమిపైఁ బడిన కాండము లెల్లెడ వట్టు వాఱుచున్
కడలిని జేరె జంతుతతిఁ గైకొన వాకొన రానిపొంగునన్. 285

వ. అని చెప్పినఁ గృష్ణుం డది యంతయు నింద్రుండు చేసినక్రూరకృత్యం బని నిశ్చయించి. 286

—♦ శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతం బెత్తుట ♦—

మత్త. ఇంద్రియాగము చేయ లే దను నేడ్పునం గలుపించి దే
వేంద్రుఁ డిట్టు లకాలవర్షము పృథ్విపైఁ గుఱియంగ నీ
సాంద్రవారిదకోటిఁ బుచ్చెను సాళ్వదర్ప మనదేశ మీ
రుంద్రదుఃఖము వీడుఁ డేఁ గల రుర్విపై చెద సర్వమున్. 287

తే. వినుఁడు నారక్షకంబున వెలయుచున్న
గోష్ఠమును గాచుభారము గొంటి నిట్లు
కావున న్నేన గోగోపగణము నెల్ల
నుద్ధరించెద నాత్మయోగోద్ధతి మెయి. 288

మ. అని శ్రీకృష్ణుఁడు సర్వజిష్ణుఁ డగుటన్ నాకేశుపై నల్గి భూ
జనులం గోవులఁ బ్రోచువాఁ డగుచుఁ దత్సర్వప్రజాకోటినిన్
మనుపం జాలినదొండు లే దనుమతిన్ బాలుండు ఛత్రాకముం
గొనిన ట్లెత్తెను వృత్తసాంద్రము లసద్గోవర్ధనాంద్రీంద్రమున్. 289

వ. అ ట్లెత్తి పట్టుకొని యెల్లవారు విన నుచ్చస్వరమ్మున నిట్లనియె. 290

ఆ. నన్నుఁ గన్నతల్లి నాపాలిదైవమా
తాతపాద లోకపూతపాద
గోపులార ధూతపాపులారా! మీర
లన్నతోడఁ గూడి యరుగుదెండు. 291

క. గోపకులును గోపికలును
గోపాలార్భకులు నెల్ల గోధేనువులున్
నాపట్టినగిరిక్రిందన్
గోపాయితు లగుచు నుండఁ గోరుదు ననుచున్. 292

---

♦ కాండము=జలము; గుప్తి=రక్షకము; ఛత్రాకము=పుట్టగొడుగు;

చ. జడియకుఁ డీరు పర్వతము చాటున నుంటకు నొంటివ్రేలితోఁ
బదియును నాల్గులోకముల భారము పూనెద వామనుండు మున్
బదమునఁ బట్టుటల్ వినరె పర్వతరాజము క్రింద నున్నమీ
కొదవదు వర్షబాధ మది నూఱట నొందుచు రండు క్రిందికిన్. 293

ఉ. ఆఱు నొకండు వర్షములయర్భకుఁ డీతఁడు పెద్దకొండ యీ
తీఱున నెత్తి పట్టె నిది దెప్పర మైనది దీనిక్రిందికిం
జేరిన నెట్లు పోయి యెటు చేకుఱ వచ్చునొ లేఁతమాట యం
చీరు భయంపడంగ వల దేను వహించెద నెల్లలోకముల్. 294

వ. ఇట్లు కృష్ణాశ్వాసితు లగుగొల్ల లెల్లరును బుత్రమిత్రకళత్రభృత్య
పురోహితాదులతోడను ధనధాన్యపశువిసరంబులతోడను గోవర్ధనాద్రి
క్రిందిగర్తంబునం దాఁకలి దప్పికలు కష్టసుఖంబులు నెఱుంగక యథావ
కాశంబుగ విశ్రమించి రిట్లేడుదినంబు లతిక్రమించినప్పుడు. 295

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ వేడుకమెయి
నితఁడు హత్తి విరిగుత్తి బలెన్
గూడి గిరి నెత్తు టెక్కడ
చూడఁగ నిది యెల్ల మిగులచోద్యము గాదే. 296

సీ. ఇట్లేడువారము లేగినప్పుడు కృష్ణుఁ
డించు కేని చలింప కెల్లప్రజలఁ
గాచి ప్రోఁచుచునుంటఁ గని సునాశీరుఁడు
తనగర్వ మది దిగఁద్రావి కృష్ణ
సామర్థ్యమున కోడి సాధువై మబ్బుల
మరలించె నంత నామాధవుండు
గాలివాన యడంగి హేళిదర్శన మైన
పిదప గోపకులను బిలిచి యిపుడు

---

♦ ఛత్రాకము=పుట్టగొడుగు, కుక్కగొడుగు; ఇది వెంట నేల మొలుచు చిన్న తెల్లని మొక్క;

ఆ. గాలివాన యుడిగెఁ గాలువ లింకెను
పశుధనంబుతోడ బ్రజలు వెడలుఁ
డనుడు వారు స్వస్వధనమును గైకొని
యడుగునుండి మీఁది కరిగి రపుడు. 297

వ. అంతఁ గృష్ణుఁడు సర్వజనసమక్షంబున నాగోవర్ధనపర్వతంబు స్వస్థానం
బునం దొంటివలె నుండ నిలువం జేసె నయ్యవసరంబున. 298

సీ. ప్రేమాతిశయమునఁ బెద్దలు వల్లవుల్
పరిరంభణాదు లొసరించి రపుడు
దధ్యక్షత లొసంగి తన్వంగు లాహరిఁ
బూజించి రాశిషంబుల నొసంగి
దీవించి కౌఁగిళ్ళఁ దేర్చిరి రోహిణి
యును యశోదయు నందుఁడును బలుఁడును
దివి సిద్ధసాధ్యాది దివిజులు పొగడుచుఁ
నోలిమైఁ గురిసిరి పూలవాన

తే. శంఖదుందుభు లెన్నియోఁ జదల మ్రోసెఁ
బాడి రింపుగ దుంబురుప్రభుతు లెల్ల
నప్సరస లప్పు డొప్పుగా నాడి రెల్ల
యుత్సవంబులు సెల్లె నయ్యుర్వియందు. 299

క. అంతట రామునితో హరి
సంతసమున గోష్ఠమునకు జనియెన్ గోపీ
కాంతలు కృష్ణునిచర్యలు
వింతగఁ గీర్తించుకొనుచు వెడలి రునికికిన్. 300

వ. ఆసమయంబునఁ గృష్ణపరాక్రమక్రమం బెఱుంగని గోపకు లాతని
పరమాద్భుతకార్యంబులం గని యచ్చెరుపడి మెచ్చుచు నందు
నుద్దేశించి. 301

సీ. పసిపాపఁ డైనప్డు విసముపా లీవచ్చు
పూతనఁ జంపినబూమెలాఁడు

మూఁడునెలలయీఁడు పొలిచినప్పుడ బండిఁ
దన్ని విఱిచినట్టి వన్నెకాఁడు
ఏటిలోఁ దన్నెగ నెత్తుకొని చనుతృ
ణావర్తుఁ గూల్చినహాసుకాఁడు
తల్లి ఱోటం గట్ట దాని నీడ్చుచు మద్ది
చెట్లఁ గూల్చినయట్టిచిన్నెలాడు

తే. పసులలో మ్రింగ వచ్చినబకునిఁ జంపి
వత్సరూపునవచ్చినవత్సుఁ జంపి
రాసభాసురుఁ జుట్టాల రాసి చంపి
వాసి గాంచినవాఁడు మీవన్నెలాఁడు. 302

తే. బలునిచేతను జంపించె నల్ప్రలంబు
మీఁద వచ్చినవనవహ్ని మ్రింగివైచె
వెడల నడచెను గాళియు మడుఁగునుండి
యీకుమారుఁడు కేవలుఁడే వ్రజేంద్ర. 303

వ. అనిన నందుండు గోపాలబృందంబుం గని తొల్లి నాకు గర్గుండు చెప్పిన
వాక్యములు గలవు చెప్పెద నాకర్ణింపుఁడు. 304

ఆ. నందగోకులాధినాథ ! వినుము శుక్ల
రక్తపీతము లగురంగు లెన్న
మూఁడుయుగములందు మువ్వురుసం బొందె
నిపుడు నలుపురంగు నీతఁ డందె. 305

సీ. ఇపుడు నీసుతుఁ డగునితఁడు మున్నెప్పుడో
వసుదేవసుతుఁ డయి వన్నె గాంచి
వాసుదేవుం డయ్యె నోసాధుమతి ! మఱి
యును గుణకర్మసముచితము లగు
నామముల్ రూపముల్ నలువొందువాని నే
నెఱుఁగను బెరలైన నెఱుఁగ రెవరు

గోపబాలుం డగునీపురుషునిమూల
మున మీరు శుభములఁ బొందఁ గలరు

తే. మున్ను దస్యుపీడితులు సత్పురుషు లితని
రక్షణంబున నొప్పి రీరక్షకునెడఁ
బ్రీతి గావించు మానవుల్ భూతలమున
నెట్టిగొదలను బొంద రోయిద్ధతేజ. 306

ఉ. ఓయివ్రజాధినాథ ! విను ముత్తముఁ డీభవదీయనందనుం
డీయన కీర్తిచేత సకలేడ్యసమర్థతచేతఁ దేజుచేఁ
బాయనిలక్ష్మిచే సుగుణపద్ధతిచేత బలంబుచేత నా
రాయణుఁ బోలునీతని సమాహితచిత్తముతోడఁ జూడుమా. 307

వ. అని గర్గుండు చెప్పిపోయెం గావున నే నితని నారాయణాంశంబుగ నెంచుచుంటి ననిన నందునివచనంబు విని గతవిస్మయులై గొల్ల లెల్ల నందనందనుం బ్రశంసించుచుం జని రంతలో నింద్రుండు గోలోకమునం దుండు కామధేనువుం గూడి భూలోకంబునకు వచ్చి నిజకిరీటంబు కృష్ణభగవానునిపాదపద్మంబులకు సోఁక నమస్కరించి యి ట్లనియె.

— ఇంద్రుఁడు గోదేవితోవచ్చి కృష్ణుని శరణువేఁడుట —

సీ. మాయానుబంధముఁ బాయఁ గల్గిననీను
ధామము శుద్ధసత్వప్రచురము
నీకు లోభాదుబు లేకుండు భగవంతుఁ
డవు ధర్మగుప్తికై యవని నిట్లు
దండంబు ధరియింతు దండింప దుష్టుల
నీవు తండ్రివి జగన్నేత వీవ
భువనహితార్థము పుట్టితి నాబోఁటి
జగదీశమానుల జడత మాన్ప

తే. నభయహస్త మొసంగెద వనుచు నీదు
శరణమును వేఁడ వచ్చితి క్షమయ నీకు

భూష యాదవవంశవిభూషణంబ!
స్వామి నీ కిదె జోహారు సాత్వతీశ. 309

శా. నాయాగం బది మాన్చఁ జేసితనునజ్ఞానాగ్రహాత్యంధకా
రాయాసంబును బొంది నేను భవదీయం బైనగోష్ఠంబు గో
పీయుక్తంబుగ నాశనం బగుగతుల్ పెంపొందఁగాఁ జేసితిన్
నాయజ్ఞానము సైఁచి నన్నుఁ గరుణన్ రక్షింపవే రక్షకా. 310

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నుండై పన్నగతల్పుం డనల్పకౌతుకంబున నవ్వుచు నవ్వాస్తోష్పతిదిక్కు మొగంబై. 311

శా. దేవేంద్రత్వవిభూతిగర్వమతివై ధీసన్నివేశంబు వి
ద్యావైశద్యము లేమి మూఢత్వమునై దర్పించి యుంట నిన్నున్
గావంగా మది చేసి నీదయినయజ్ఞంబుం బెడంబాపి నే
నేవంరీతిఁ బొనర్చితిన్ సమసె నట్టే నీయహంభావముల్. 312

ఆ. కన్ను దెఱచి మెలఁగఁ గల్గుము పొమ్ము నా
యాజ్ఞఁ దల ధరింపు మప్రమత్తుఁ
డగుచు స్వాధికార మం దభియుక్తుండ
వగుము నీకు భద్ర మగు మహేంద్ర. 313

వ. అప్పుడు స్వీయసంతానసమన్వితయు మనస్వినియు నగుగోదేవి గోపాలరూపుం డై చూపట్టునానందునిపట్టికెట్టెదుటం బ్రత్యక్షం బై నమస్కరించి యి ట్లనియె. 314

సీ. కృష్ణ! హృషీకేశ! కేశవ! లోకేశ!
యేము ధన్యుల మైతి మీవె పరమ
దైవతంబును దైవ మీవ మా కీశుఁడ
వగుదు గోవిప్రదేవ దిసౌఖ్య
కారణ మవు భూమిభారాపనోదార్థ
మవతరించితి మహాత్మా మహేశ!
బ్రహ్మ నిన్ గోసురబ్రహ్మాధినాథుగా
నభిషేక మొనరింపుఁ డనుచుఁ బుచ్చె

తే. నీవు భూభార ముడుపంగ నీరజాక్షు
నంశమునఁ జేసి పుట్టితి వాదిపురుషుఁ
డవు సనాతనుఁడవు నాదు ప్రార్థనంబు
చేకొను మటంచు నింద్రు నీక్షించె నతఁడు. 315

తరువోజ. ఐరావణకరోద్ధృతామరనిమ్న
గామలాంబువులు నత్యంతప్రపూత
సౌరగోక్షీరముల్ సౌరమాతృకలు
సమ్మునీణ్మంత్రపుష్పంబు లక్షతలు
సారసగర్భనిశాసనంబునను
సముపస్థితంబులై సమకూఱి యుండ
శౌరికి గోవిందసంజ్ఞగా నెసఁగ
సదభిషేక మొనర్చె శతమన్యుఁ డపుడు. 316

ఉ. పాడిరి నారదాదిమునివర్యులుఁ గిన్నరకాంతలుం గరం
బాడిరి శాస్త్రపద్ధతుల నచ్చర లచ్చెరు వెచ్చఁ బూలజ
ల్లోడక నింగినుండి పడె నొయ్యన మ్రోసెను దేవదుందుభుల్
మూడుజగంబులున్ సుఖముఁ బొందెను బొందుగఁ నట్టిపట్టునన్.

తే. నదులు నిర్మలోదకముల నలువుమీఱెఁ
దరువు లధికఫలంబులఁ దనర నయ్యె
ధరణితల మెల్ల సస్యసంభరిత మయ్యె
నట్లు శ్రీకృష్ణుఁ డభిషిక్తుఁ డైనయపుడు. 318

వ. ఇట్లు పురందరుండు నందనందనున కానందాభిషేకంబు గావించి తదను
జ్ఞాతుండై గోదేవితోడం గూడి స్వర్గంబునకు నిర్గమించె ననంతర
కాలంబున. 319

— శ్రీకృష్ణుఁడు వరుణలోకమునుండి నందునిం దెచ్చుట —

సీ. నందుఁ డేకాదశియందు నిరాహారి
యై విష్ణు నర్చించినట్టి దగుచు

ద్వాదశి వేకువ దాన మొనర్పఁ గా
లిందికిం జని యున్నసందునందు
వరుణదూతుఁ డగునాశరుఁ డొక్కఁడు తెఱుఁగక
యసుర వేళన్ జలమాడునందుఁ
బట్టి యప్పతిచెంతఁ బెట్టె గోపీగోప
లానందుఁ గానమి నడలు గుడిచి
తే. వాసుదేవునికడ కేగి వార్త దెలుప
నతఁడు తనతండ్రి వరుణసమక్షమందుఁ
నధివసించుట పరికించి యధికశక్తి
నటకు వేంచేసె నేకాకి యగుచు నపుడు. 320
క. వరుణుం డాతనిఁ గనుగొని
కరమరుదుగఁ బూజ చేసి కరుణావార్ధీ!
పురుషార్థ మిపుడ పొందితి
నరయఁగ నాభవము నేడ సార్థం బయ్యెన్. 321
ఉ. ఎవ్వనియందు లోకము లనేకము లేర్పడి యుండునో యెవం
డెవ్వియు నేను గా దనుచు నెప్పుడుఁ జెప్పుచు నెల్ల దానయై
త్రెవ్వని వైభవంబులను దివ్యవిభావవిభాసితాత్ముఁడౌ
నవ్వరమూర్తి సర్వజగదంతరవర్తి భజింతు నెంతయున్. 322
చ. ఎఱుఁగక లెంక నీజనకు నిట్టులు తెచ్చెను దప్పు చేసె నీ
జరిగినదాని కే మిగుల సందియ మందుచు నుంటి నెట్టు లీ
దురితమునుండి దాఁటు టని దూరము చూచుచు నుంటి నింతలోఁ
బరమదయాసమగ్రుఁ డవు వచ్చితి విచ్చటి కేను ధన్యుఁడన్. 323
క. ఏ మొనరించినతప్పున్
నీమనమునయందు సైఁచి నీతండ్రిని నీ
భూమికిఁ దోడ్కొని పొమ్మా
స్వామీ! మావలనఁ గరుణ సలుపఁగ వలయున్. 324

వ. అని నందునిం దెచ్చి యిచ్చినం బుచ్చుకొని పుండరీకాక్షుండు తత్క్ష ణంబ బంధుసందోహానందకరంబుగ మందకుం జేరినంత నందుండు వరుణలోకమహోదయం బంతయు నెఱింగించుచుఁ దనకుమారుండు తన్నుఁ దెచ్చినవిధంబును వివరించె నెల్లవారు నాశ్రీకృష్ణుని భగవంతునిగా నెంచి పూజించి బ్రహ్మానంద మనుభవించుచుండి రప్పుడు.

క. వారలసంకల్పంబున్
వారిజలోచనుఁడు దెలిసి వారనికరుణా
పూరమున మునుగఁ జేయుచు
వారికిఁ బరమోన్నతంబు బ్రహ్మముఁ జూపెన్. 326

మ. మహదానందనిమగ్నులై వ్రజజనుల్ వర్తిల్లుచుండన్ యదూ
ద్వహుఁడా కృష్ణుఁడు వారికిం బరమమోదప్రాప్తికిన్ మూలమై
బహుతేజోంచితమై సనాతనమునై భాసిల్లు వైకుంఠమున్
సహజప్రేమగుణానుబంధమున నాస్థానంబునం జూపుడున్. 327

వ. ♦నందాదు లానాఁడక్రూరుండు చూచిన వైకుంఠలోకంబు చూచి పరమానందభరితాంతరంగులై సంస్తుతించుచుండి రనంతరంబ. 328

—♦ శరద్రాత్రి గానమొనర్చు కృష్ణునికడకు గోపికలు వచ్చుట ♦—

క. శరదుత్ఫుల్లములు మనో
హారములు మల్లికలు గలిగి యక్షిద్వయికిన్
పరమానంద మొసంగుచుఁ
బరిగింపఁగ నయ్యె రేలు భగవంతునకున్. 329

చ. ♦ప్రియుఁడు ప్రియాముఖం బరుణవేల్లితమై తనరార నెంతయోఁ
బ్రియమునఁ జూచి సంతసము బెంచినరీతిగఁ జందమామ పే
రయమున నేచి ప్రాచి నుదయారుణదీప్తులఁ గప్పె భూజనో
చ్ఛ్రయము సుఖంపడన్ సలిపె సంతతదుఃఖము శాంతి పొందఁగన్.

---

♦ ఇక్కడ నక్రూరునకు వైకుంఠమును జూపినకథ తరువాత జరుగనున్న దయినను బరీక్షిచ్ఛుకసంవాదము నాటికి జరిగియున్నదియే కాన భూతనిర్దేశము చేయఁబడెను.

చ. సిరిదొరసాని నెమ్మొగము చెన్నున నై నవకుంకుమాభమై
బరఁగెడుపూర్ణమండలము పర్విఁవెలింగెడునిందుచంద్రుఁ ద
త్కరముల భాసమాన మగుకాననముం గని వామదృఙ్మనో
హర మగునట్లు శౌరి ప్రియ మారఁగఁబాడెఁ గలస్వనంబునన్. 331

శా. గానం బయ్యది భూధ్రముల్ వనులు వృక్షంబుల్ నదుల్ నిండున
ట్లైనన్ సర్వము వింజ మాకిడినయట్లయ్యెన్ స్రవించెన్ శిలల్
జానొందెం జిగిరించి మోదులు ధరాచక్రంబునం దంతటన్
సానందం బగుసౌఖ్య మబ్బె నొగి నిశ్శబ్దంబు దీపించుచున్. 332

తే. మన్మథోద్దీపకం బైనమధురగీత
మాలకించి వ్రజస్త్రీలు ప్రాలుమాలి
మాధవగృహీతమానసలై ధృతి చెడ
నొడివి కొన కొక్కతి కొకతియును గడుఁ దమి. 333

క. అండజయానలు జవమునఁ
గండస్థలములను రత్నకాంతులు పర్వన్
గుండలములు చలియింపఁగ
నొం డరయక చనిరి కృష్ణుఁ డుండినకడకున్. 334

సీ. ఆలపాలం బిండునాంధ్రు కొందఱు మాని
గానమార్గము వట్టి కదలి చనిరి
చల్లఁ జేయుచుఁ గొంద ఱల్లగీతము విని
తత్తరాడు విడనాడి తరలి చనిరి
పతుల కన్నము పెట్టి సతులు కొందఱు పాత్ర
లెడఁ బెట్టి వచ్చిరి కృష్ణుకడకుఁ
గుడుచుచు నన్నము కుడుపెఱుంగక కొంద
ఱెంగిలిచేతనే యేగి రటకు

తే. జలక మాడుచుఁ గొంద ఱంజనము దిద్దు
కొనుచుఁ గొంద ఱాభరణముల్ కొనుచుఁ గొంద

రంశుకంబులు గట్టియు నట్టు నిట్టు
వైచికొని వచ్చి కాంచి రావాసుదేవు. 335

తే. పతులు తండ్రులు భ్రాతలు బంధువులును
వలదు వలదు మీ రిట్లేగ వలదు వలదు
నిలువుఁ డని యెంతనిర్బంధములు పొనర్చి
నను నిలువ రైరి గానలగ్నహృదయ లయి. 336

మ. ప్రతిబంధంబున లోనగళ్ళ నివసింపం గల్గువామాక్షు లే
గతినైనన్ హరిదర్శనం బొనరుపం గా భాగ్యముల్ పట్టమిన్
మతిలోఁ గృష్ణునిఁ జేరఁ దీసికొని ప్రేమం బేర్పడం గేళిసం
గతులం దేలి పరంబు గాంచిరి జగత్కల్యాణసంధాత్రులై. 337

ఆ. అనుడు జనవరేణ్యుఁ డనియెఁ బరబ్రహ్మ
బుద్ధి చేసి వాండ్రు పొంద లేదు
జారబుద్ధిజేసి శౌరి నొందిరి దాన
ముక్తి గలుగు టెట్టిబూమె యొ కద. 338

ఆ. అనుడు శుకమహర్షి యనియెఁ జైద్యుం డస్త్ర
పగతుఁ డగుచు నెట్లు పడసె ముక్తి
నటులె వాసుదేవునందలిభక్తిచేఁ
బూవుఁబోండ్లు ముక్తిఁ బొందిరధిప. 339

వ. మఱియుం గామక్రోధస్నేహసౌహృదాదులం దెద్దానవైనను భగవం తుం డగునాకృష్ణునందుఁ జిత్తంబు లగ్నంబు గావించినవానికి మోక్షంబు కరతలామలకంబు గావున నిటవిస్మయంబున కవకాశంబు లే దాకర్ణింపు మట్లు తనసమక్షంబునకు వచ్చినగోపకాంతలం జూచి వాసుదేవుండు వాగ్విలాసంబుల మోహింపఁ జేయుచు ని ట్లనియె. 340

—♦ శ్రీకృష్ణుఁడు వ్రేతలతో విరసోక్తు లాడుట ♦—

ఉ. స్వాగతముల్ వచించెదను వల్లవవల్లభలార! మీకు మీ
గోగణకోటికిన్ బ్రజలకుం గుశలంబకదా! భవత్పతుల్
రాగము గల్గియుండ్రు కద రాజభయం బది మీకు నెన్నఁడే
నోగుఘటిల్లఁ జేయుటకు నుండదుగా వ్రజమందు నెప్పుడున్. 341

ఉ. రాతిరి ఘోరరూప మగురాయిడి వెట్టెడుఁ గ్రూరసత్త్వముల్
పాతరలాడుచున్న యవి ప్రజల నజ్జెరె మీరు రాకకుఁ
హేతు వెఱుంగఁ జేయుఁ డిట నింతియు నింతుల కుండ నొప్ప దో
వ్రేతలు! మీగృహంబులకు వేగమ పొం డని పల్కి వెండియుఁ.

క. తల్లులు తండ్రులు పుత్రులు
వల్లభులును భ్రాత లీరు వ్రజమున లేమిఁ
దెల్లముగఁ దెలిసి మీకై
యెల్లెడలఁ భీతి వెదుక నెంచెద రకటా. 343

క. యమునానిలసంతతసం
భ్రమణంబున నూఁగుచెట్లు పల్లవములు పు
ష్పములం గలదై వెన్నెల
నమితద్యుతి నెసఁగువనము నరసితిరి గదా. 344

సీ. ఇఁక మీరు సతులార! యిట మసలక పొండు
విభులశుశ్రూష గావించుపొంటెఁ
బాలకై దూడలు బాలు రేడ్చెదరు వా
రలకుఁ బాలొప్పియంగ వలయుఁ బోయి
మీరు నాపైఁ బ్రేమఁ జేరితి రిట కందు
వలన నాకెంతయుఁ గలిగెఁ బ్రియము
సతులు మోసము లేక పతులకు శుశ్రూష
పరమధర్మం బని పలుకఁ బడియె

తే. భర్తృశుశ్రూష సకలసంపదలఁ గూర్చు
ముదుకఁ డైన దుష్టైనను మూర్ఖుఁ డైన
నిస్స్వుఁ డైనను బతిని నిందించి రోసి
విడువగా నొప్ప దెప్పుడు పడఁతులకును. 345

వ. మఱియును. 346

సీ. పడుగురిలో నగుఁబాట్లు వచ్చుఁ గా దూఁది
కన్నఁ దేలిక యయి కానఁ బడును
శుభశోభనాదులు చూపట్టునప్పుడు
బహిపెట్టుదురు దానిఁ బదరి పదిగ
వలపుకాఁడును దానివలను జూడఁడు కొన్ని
నాళ్ళులు గడచినంతటను విడుచుఁ
జింపి గంతియు లేక చివరకు రోగాల
పుట్టయై గతిలేక పుచ్చి చచ్చుఁ
తే. గొడుకు గలిగినవాఁడును గూడ రాడు
దిక్కుమాలిన ప్రేతయై తీఱవలసి
వచ్చుఁ దనకాపురమునకు వదలి నీళ్ళు
వెలిచవుల కాసఁ జేసినకులట జగతి. 347
మ. నను ధ్యానించియు లోనిచూపునను నన్ దర్శించియున్ నాకథల్
వినఁగా నెంచియు నాదుకీర్తనము గావింపంగనై యుండియున్
నను దూరంబున నుండి కొల్చి ఫలముల్ గైకొన్నరీతిన్ గడన్
మనుజం డుండి శుభంబు నొందఁ డది గానం బొందు మీ రిండ్లకున్.

—♦ ప్రేత ల ప్రియవాక్యములు విని వగచుచుం బ్రార్థించుట ♦—

వ. ఇట్లు గోవిందభాషితం బగు నప్రియవాక్యంబు లెల్లగోపికలు విని విషణ్ణహృదయలు భగ్నసంకల్పలునై నితాంతచింతాసాగరంబున మునింగి. 349
మ. వ్రజకాంతామణు లొల్లఁ బోయి కడునిశ్వాసంబు బింబాధరం
బు జగాని గ్గిడలంగ నెందునటు లేపుం జూపఁగా వక్త్రవా
రిజముల్ వ్రాలఁగ వైచి కాళ్ళుల ధరిత్రిన్ రాయుచున్ దుఃఖభా
వజ పూనశుప్రిలు కాల్వలై పఱవ నేద్వం జొచ్చి రప్పట్టునన్. 350
వ. కన్నులు తుడుచుకొని ప్రియేతకునిం బోలి భాషించుప్రియతముం గాంచి కోపసంరంభసంక్షుభితవాక్ప్రచారలై యి ట్లనిరి. 351

ఉ. ఆంద్రము వచ్చినార మిటు లారయుకోరిక లీరి కెత్త నే
వాండ్రను నిన్నువంటి జనవల్లభు లెవ్వరు లేరు మా వెతల్
గండ్రలు చేయు దీ వనుచు గంపెడుకోరికి వత్తు మిగ్గతిన్
వేడ్రము చూపువాడ వయి విప్రియముల్ పచరింప నొప్పునే. 352

తే. నీదు దురనుగ్రహము మాని నిన్నుఁ గొలువఁ
జెంత కరుదెంచినట్టి యీచిరుగుఁబోండ్ల
కాదు పొమ్మనఁ బోక నీపాదసేవ
మాకు దయచేసి ప్రోవవే మానసనాథ. 353

మ. తలవంపుల్ నగుబాట్లు వచ్చు ననుచున్ ధర్మంబు లెవ్వేవొ మా
కెలనన్ ధర్మపచఃప్రసంగమున నోకృష్ణా ! వచిం తెన్నియో
కులటాధర్మము లవ్వి మేము విన మాకుం జెప్పఁగా నొప్పునే
పలుకుల్ చేసితి భర్తృరాండ్రము మముం బాటింపవే వల్లభా. 354

చ. ప్రియులను దల్లిదండ్రులను బిడ్డల దొడ్డలఁ బాసి యుండుటల్
జయమును గోరునాగుల కసమ్మత మంటివి మేలు మేము నా
నయమును దెల్పుచుంటిమి జనార్దన ప్రాణుల కాత్మ వౌటచేఁ
బ్రియులును దల్లిదండ్రులును బిడ్డలు దొడ్డలు నీవె మా కిలన్. 355

క. కావున ధర్మగ్లానికి
నేవిధమునఁ గాని సం దొకింతయు నేనిం
దే వారు చూప నోఁవరు
దేవా మాపైఁ బ్రసన్నధీ నిడ వలయున్. 356

తే. భక్తుల ననుగ్రహింతు వోభక్తవరద
బ్రహ్మవేత్తలు నీయంద రతి యొనర్తు
రిట్టి నీ వుండ నార్తుల కిక్కలైన
పతిసుతాదులతో నేమిపని ముకుంద. 357

ఉ. చోరులు చాటు చాటు గను జొచ్చి హరింతురు సొమ్ము లెల్ల నీ
చోరుఁడు బూమెలాఁడు కడుసొక్కఁగ నూఁదియు మత్తుమం దెదో

పాఱఁగఁ జల్లి మామదులు భావము కాళ్లులు చేతు లన్నియున్
జూఱఁగొనెన్ వచింప నడఁ జూడ వినం జన నోప మచ్యుతా. 358

మ. భవదాలోకనహాససంజనితహృద్బాధాగ్ని మ మ్మేఁచె నీ
దవువాచామృతసంప్రసారమునఁ జల్లార్పం గటాక్షింపు మో
భువనాధార! పొనర్పవేని యటు లీమూర్తంబునం ద్రెళ్లి యో
గివరేణ్యుల్గానునీపదంబు గొని ముక్తింగాంతుము మొక్కుంతలోన్. 359

తరళము. అడవులం దిరుగాడుమా కొకయప్డు లచ్చికిఁ బోలె నీ
యడుగుఁదమ్ములు తాఁకి నార మనంతసౌఖ్యము చేరె నే
మిడుమ గా నది యంతయు న్విడి యెక్క డెక్కడ కేగఁ గా
నెడ యొనర్పఁగ నోప మో హృదయేశ! వేఁడుకఁ జూడవే. 360

చ. సురల కసాధ్యమై పరమశోభనమై తగులక్ష్మి నీదుపే
రురమున నెంతయేని సుఖముండియుఁ గా దని భృత్యజుష్టమై
వరతులసీసపత్ని నిలువం దగునీపదపద్మరేణువుల్
నిరతము గోరు మేము నటు నీపద మందితి మేలు మచ్యుతా. 361

తే. నీవు సుప్రసన్నుఁడ వయి నీదుసేవఁ
గోరి నెలవులు విడి వచ్చినార మిటకు
నీదుదయ గలచిఱునవ్వు నెఱపుచూపు
లను గని తపించుమాకు నీచనవు నిమ్ము. 362

మ. ఎలనవ్వుం గలనీదుచూపుగము లే మీక్షించి మాణిక్యకుం
డలగండస్థలకాంతులన్ గని మహానందంబు సంధించునీ
యలకభ్రాజిత మాస్యముం గనియు లక్ష్మ్యావాస మావక్షమున్
విలసద్బాహుయుగంబు గాంచి నిను సేవింపన్ మనం బయ్యెడిన్.

మ. పశువుల్ పక్షులు వృక్షముల్ మృగములున్ బద్మాక్ష! నిం జూచినం
త శతానందము నొందు నన్నఁ ద్రిజగత్కల్యాణదంబైననీ
దుశుభాకారము చూచి మోహాకరమై తోఁపంగ నా నీదుగా
నశుచిత్వంబును విన్న యేగరిత యెన్నం జాలెడిన్ ధర్మమున్. 364

ఆ. అమరలోకగోప్త యగునాదిపురుషుని
కరణి వ్రజజనార్తిహరుఁడ వగుచుఁ
బుట్టి తీవు దానఁ బురుషోత్తమా ! మమ్ము
ముట్టి తాప మార్పఁ బోలు నీకు. 365

—♦ శ్రీకృష్ణుఁడు వ్రేతల నాదరించుచు నంతర్ధాన మగుట ♦—

వ. అని భక్తిపారవశ్యప్రలపితంబు లగువారిపలుకులు విని భక్తపరతంత్రుం
డగు శ్రీకృష్ణపరబ్రహ్మంబు వారిం గాదనం జాలక వారితోడం గూడి
మాడి వేణునాదంబు గావించుచు నానావిధంబుల విహారంబు గావించె
నప్పుడు. 366

చ. వనులను జెట్ల నీడలను బచ్చికపట్టుల నాఁకుటిండ్ల వా
సనల వేలాప్సునీరములఁ జల్లనినీటి సమీపభూములన్
మనములు హర్షమగ్న మగుమాడ్కి నొనర్చుచు గోపికాంగనా
జనపరివేష్టితుం డగుచు సారసనాభుఁడు సల్పెఁ గ్రీడలన్. 367

శా. కాళిందీపులినంబునం దిటులు వేడ్కన్ గోపికాలోలుఁడై
కేళిం దేలెడు బాలకృష్ణుఁడు తదంగీకారగముంబొంద కా
వేళన్ వారలకన్నుఁ బ్రామి యెట కో వేంచేసె నిచ్ఛావిహా
రోల్లాసము. నుండి న ట్లచటఁ దా నప్పుండి యుం దండియై. 368

క. చూచుచు నుండఁగ లోచన
గోచరుఁడై కాక వేణుగోపాలుఁ డెటో
లేచి నటు లేచి పోయిన
నాచెలువునిఁ గాన కార్తలై రాచేడెల్. 369

వ. అంత నక్కాంతలు రమాకాంతునిగత్యనురాగస్మితవిభ్రమేక్షణాదుల
నాకర్షింపఁ బడినచిత్తవృత్తులు గలవా రగుటంజేసి. 370

సీ. వారు శ్రీకృష్ణవిహారవిభ్రమములఁ
బ్రీతిగూఢమూర్తులై ప్రతిపదంబు
నేనె కృష్ణుఁడ నని యెంచుచు నించుక
కానట్లు చేయుచుం గాన మపుడు

నీరిదు లట్టులై వెదకుచు వనమందుఁ
గలవనస్పతులను గలయఁ దిరిగి
ప్రాణనాథా యని పలుమాఱు పిలుచుచు
వెదకినచోటులే వెదకి కొనుచు
తే. అదిగో కలఁ డందుఁ గూర్చుండె ననుచు నేగి
కాన కాదారిఁ బాటెడు దానితోడ
ననుచు నందఱు నలుమూల లరసి యరసి
యలసి యును శ్రాంతి వహియింప కపుడు మఱియు. 371

—♦ గోపికలు కృష్ణుంగానక వనంబునలుగడ నన్వేషించుట ♦—

సీ. మాచిత్తచోరుఁడై మామనోనాథుఁడు
కనుఁగప్పి వనులార గాంచినారె
మాబహిఃప్రాణమై మన్నన లిచ్చిన
పతి చనం గనినారె పక్షులార
మధు వుట్టిపడఁ బల్కు మమ్మేలువల్లభుం
డరిగె నోగికులార యరసినారె
మాతోడ నాడుచు మరగించు ప్రియుఁ డెటో
చనియె నారసినారె సరసులార
తే. మాకు నెన్నెన్నియో ప్రియవాకు లొసఁగి
వేణుగానము మాచిత్తవీథి నెఱపి
మమ్ము నేలెద నని చెప్పి మావిభుండు
విడిచి పోయెను గంటిరే జడధులార. 372

చ. తొలకరిమబ్బుతోడఁ దులఁదూఁగెడునల్లనిమేనివాఁడు త
మ్మిల కెన వచ్చుకన్నుఁగవఁ బొంపెసలారెడువాఁడు నెమ్మిక
న్నుల నలరారుపింఛమున నూల్కొనువాఁడు మనోహరుండు మీ
వలనికి రాఁడుగా దెలియఁ బల్కుఁడు మల్లికలార మక్కువన్. 373

మ. నినుఁ బాదంబులఁ దాల్చి నీకుఁ బ్రియుఁడై నిత్యంబు నీసేవలం
గొను మావల్లభుఁ డెల్లలోకములకుం గోర్కుల్ ప్రసాదింపఁ జా

లినవాఁ డమ్మకచెల్ల మ మ్మిటువనాళిం దోఁ్రిసిరా జంచుఁ బో
యె నయో! యోతులసీ యె టేగెనొ గదే వీక్షించి తేఁ జెప్పవే.

మ. యమునాకూలనివాసభాసురములై హాయొందు చెల్లప్పుడుర్
బ్రిమనం బేర్పడ జంతుసంతతులకున్ బం ట్లిచ్చి పూ లిచ్చి ని
ర్మమతం బొల్చెదుమిమ్ము వేఁడెద మయో మాకందమా! కుందమా!
క్రముకంబా సుముఖంబ! చెప్పఁ గదరే కంజాక్షుఁ డెం దేగెనో

వ. భూదేవిం బోలం గాంచి. 376

శా. ఆహా! యేమి తపంబు చేసితివో కృష్ణాంఘ్రిద్వయీస్పర్శనో
త్సాహాంచత్పులకాంకితాంగరుహవై దర్పోన్నతిన్ దానాఁడు నీ
బాహుద్వంద్వమునన్ వరాహము వహింపం గల్గుపుణ్యంబొ సం
మోహం బేర్పడ వామనాంఘ్రి నిడ నోపుణ్యంబొ వా కీయవే.377

మ. అయయో యేమనువార మోసకియ యేణాబ్జాక్షి మీవంకకున్
బ్రియురాలిం గొనివచ్చినట్టిహరిని న్వీక్షించి యున్నార యే
దయ వాకిందు ప్రియాంగగంధయుతమై తత్కుందమాలాంచితం
బయి యింపొందెడుగాలి సోఁకునటులై హర్షంబు చేకూరెడిన్. 378

చ. తరువరముల్ వచింపుఁడు ముదంబునఁ బ్రేయసి యంసమందు శ్రీ
హరి భుజముం దగిల్చి విధృతాంబుజుఁడై తులసీగతాళులన్
దరుముచు వచ్చి మీకుఁ బ్రముదం బొనరించుటఁ జేసి మీర లి
వ్వాసఁ బ్రణామముల్ సలుపువా రయి రంచుఁ దలంతు మెంతయున్.

ఆ. ఇట్లు పిచ్చిమాట లెన్నియే నాడుచు
నాడ నాడఁ గృష్ణు నరసికొనుచు
వ్యగ్రహృదయ లైనవ్రజభామినులు కృష్ణ
లీల లను సరింపఁ జాలి రపుడు. 380

## శ్రీ కృ ష్ణ లీ లా ప్ర ద ర్శ న ము

సీ. ఏను బూతన నీవు కృష్ణుఁడ వని యొత్తు
కుడిపెఁ జ న్నొకతెకు వడి వడిఁ జని

శిశువు నే నని యొక్తె చేరి శకటమైతి
నను నాతి నేడ్చుచు నంఘ్రిఁ దన్నె
నొకత తృణావర్తుఁ డో యన నై బాల
కృష్ణుఁ డయిన నొక్తె నెగిచికొనియె
వత్సాసురుండ డయి వనిత యొక్కత వత్స
లైన గోపికలఁ దా నక్టె పట్టె

తే. ఒకతె హరి యయి బకుఁ డైన నొకతెఁ గొట్టె
నొకతె గోవులఁ బిలుచుచు నూఁది మురళి
నేను గృష్ణుఁడ గోపాలు రీర లెపుడు
చెప్పినట్టులు మెలగంగ నొప్పు ననియె. 381

తే. కృష్ణుఁ డను నేను గాచెద నిపుడు మిమ్ము
వాతవర్షభయంబు పోవంగఁ జేసి
కాచి రక్షింతు నని యొక్కగాంత చేత
వస్త్రమును బట్టి మీఁదికి వడిగ నెత్తె. 382

తే. ఒకత యొక్కత నెత్తిపై నొయ్య నెక్కి
నృత్య మొనరించుచును నొంచి నేను దుష్ట
జనుల దండింపఁ బుట్టితిఁ జనుము మడువు
విడిచి నీ వొండుచోటికిం చడరి నుడువు. 383

సీ. ఒకతె గోపకులార యుల్బణదావాగ్ని
యడఁచి మి మ్మేలెద నని వచించె
నొకతె నొక్కత నిన్ను నొగిఁ బట్టి ఱోటఁ గ
ట్టెద నన భీతిమై నది వడంకెఁ
గట్టుళ్ళఁ బడి యది యట్టె ప్రాఁకుచుఁ జని
గున్న మొక్కలు రెండు కూలఁ ద్రోచె
వరుణలోకముఁ జని వడి నేను నాతండ్రిఁ
దెచ్చెద నని యొక్తె చెచ్చెరఁ జనె

తే. ఇట్లు పలుతెఱంగులఁ బడి యింతు లెల్ల
తలములఁ మెట్టుకొనుచు బృందావనమున
నగపడినవాని నడుగుచు నందు నొక్క-
చక్కి- హరిపాదచిహ్నముల్ సరణి గనిరి. 384

వ. అట్లు కాంచి పద్మధ్వజవజ్రాంకుశాదిరేఖలం జేసి యవి హరిపాద
చిహ్నంబుల యని నిశ్చయించి యు వాని ననుసరించి యున్నవన్ని
లాడియడుగు జాడలం గని వ్యసనంబు నొందుచు. 385

తే. అకట వాసుదేవుం డొకయన్నుమిన్న
భుజముపైఁ జేయి నిడుకొని పొలము లెల్ల
విడక తిరుగాడు చుండినవిధము శోఁచు
నడుగుజాడల వైఖరి నరయ నరయ. 386

సీ. హరిపాదరజ మంద నోఁ గాని యిట నన్య
కామినీపదములు గలిగియుండె
నరయుఁ డిచ్చట దాని యడుగులు గన రావు
తృణముల నడ లేసి తెఱవమిన్న
నఱికడం గొని యుండు హరి గాన బరువున
దిగఁబడె నడుగులు తెలిసి కొనుఁడు
పూలకై యిచ్చటఁ బూఁబోడినిం దింపి
పూలు గోసినచొప్పు పోలఁ దోఁచు

తే. ఇచటఁ బాదాగ్రముల మెట్టి నిట్టు నట్టు
నిచటఁ గూర్చుండి ప్రియురాలి కెల్లపూలు
దురిమెఁ గొప్పునఁ గాముకుం డరసి నారె
కాంతలారా యని యొకర్తు చింతఁ దెలిపె. 387

క. తనుఁ దాన సంతసించుచు
తనలోఁ దాఁ గ్రీడసలుపుదనుజుల దైన్యం
బును దీర్చి వారి దుష్టతఁ
గొనకొని వాపంగఁ దివురుకొనుఁ గృష్ణుఁ డొగిన్. 388

వ. అని యిట్లొక్కత పలికె నిట్లెల్లను నెల్లవిధంబులం బలుకుకొనుచు మోహావశంబున నొడలు మఱచి విహరించుచుండి రప్పుడు శ్రీకృష్ణుండును. 389

చ. పెరవారిం గనఁబోవ కొక్కరిత సంప్రీతిన్ భజింపంగ నా
తరుణీరత్నము నేనె నేటిఁ బెరలన్ దర్శింప కెల్లప్పు డీ
హరి నన్నే శిరమందుఁ బెట్టుకొను నం చత్యంతగర్వంబునన్
బరివర్తించుచుఁ గృష్ణునిం గని వనిన్ బల్కెన్ గడుం గుల్కుచున్.

క. నడఁ జాల నింక నే నొక
యడు గైనన్ నీకు నెటకు నరుగ మనం బ
య్యెడి నటకు నన్ను నఱకడ
నిడికొని పొ మ్మనుచుఁ బలికె నెఱుగనిదానన్. 391

వ. అనినఁ గృష్ణుండు నోఁ గాత మనుచు నింతలో నంతర్ధానంబు నొందె నంత నక్కాంతయుం బరితపించుచు. 392

శా. స్వామీ! యే మిది నన్నుఁ బాసి యెట కేఁ జక్కన్ బరితాపించి నీ
పీమై పో మదిఁ జేసి తేను గృపణన్ హీనాతిహీనన్ నినున్
వేమా ఱెంచి భజింతు నాదురితము ల్నీ వర్మిలిన్ సైఁచి నీ
సామీప్యంబు నొసంగి నన్నుఁ గరుణన్ సాఁకంగదే వల్లభా. 393

వ. అలో శ్రీకృష్ణమార్గంబు నన్వేషించుచున్న గోపికలు వచ్చి ప్రియ విశ్లేషమోహితయై దుఃఖించు మోహనాంగిం గని దానివలననంతయు నెఱింగి పరమాశ్చర్యభరితాంతరంగలై వెన్నెల యున్నంతవఱకా వనంబు నలుగడ నెదకుచుండి చీఁకటి పడుచుండు టెఱింగి మరలి చనువా రయ్యును దదేకమనస్కలు తదాలాపలు తద్విచేష్టలు తదాత్మకులు నై తద్గుణగానంబు సేయుచుం దమగృహంబులం దలపెట్ట కెట్టకేలకుఁ గాళిందీపులినంబుఁ జేరి కృష్ణు నే ధ్యానించుచుఁ దదాగమనంబ కోరుచు నెల్లవారును గూడి యిట్లుగానంబు గావించిరి.

—♦ గోపికా గీతలు ♦—

ద్విపదము. ఈవు పుట్టుటఁజేసి యీగొల్లపల్లె
చేవమెయిం బొల్చు శ్రీదేవి యిచట
సేవింపఁ బడుచుండె శ్రీకృష్ణదేవ
నీవారు నీయందు నిలిపి ప్రాణములు
త్రావలయం బెల్ల గాలించుచుండి
రావారికన్నుల కగపడు మీశ. 395

తరళము. శరదుదాశయమందు నిర్మలశంబరంబులఁ బుట్టి సుం
దరము గా వికసించి మించెడుతమ్మిపువ్వులసంపదన్
బొరి హరించెడుదృష్టిచేఁ దలపోసి జీతము లేక దా
స్యరతులన్ మముఁ జంపునీ కఘ మంటి రాదె మురాంతకా. 396

సమ్మతావృత్తము. విషజలంబుచే విద్యుదగ్నిచే
వృషభదైత్యుచే విశ్వభీతిచే
విషధరాహిచే వీరు నీప్రజల్
విషమ మీఁగఁగా వించి తో ప్రభూ 397

సుగంధి. కావు నీవు నందగోపికాసుతుండ వెన్న నా
దేవదేవుఁ డైనవిష్ణు దేవుఁ డౌదు లోకసం
భావనార్థ మిట్లు యాదవప్రసిద్ధవంశమం
దీవిధిన్ జనించినాఁడ వెన్న బ్రహ్మపంపునన్. 398

మ. భవభీతిం గొని యున్నవారి నభయప్రాప్తిం బిసాలింపఁ జే
సి వరంబుల్ దయచేసినట్టియు సిరిం జేపట్టియున్నట్టియున్
భవదీయం బగుహస్తపద్మమును లిప్సంజేసి మాశీర్షమం
దు వెసం బెట్టుము తాప మాఱఁ గుణం దోడ్తోడఁ గావించుచున్. 

ఆ. నీకుఁ గింకరులము లోకైకరక్షకా
కరుణఁజేసి మాకుఁ గమలసదృశ
మగుచు సుషమ మైనయట్టినీముఖమును
జూపు మీశ లోనితాప మాఱ. 400

జలజవృత్తము. మ్రొక్కెడువారిపాపములఁ బో నడఁప
మిక్కిలి ప్రోడవై తృణము మేపఁపసులన్
మక్కువ వెంబడించుచును మా కిర వౌ
చక్కనినీపదంబు లెదఁ జల్పఁ గదే. 401

సువృత్తము. శ్రవణమంగళప్రదము తప్తజీవనం
బవిత యోగికం బమలసత్కవీడితం
బవుభవత్కథాత్యమృత మాదరంబునన్
స్తవ మొనర్చి ధన్యతము లౌదు లెల్లరున్. 402

విద్యున్మాల. నీచిర్నవ్వుల్ నీమేల్చూపుల్
నీచిన్నెల్ వన్నెల్ నీమాటల్
మాచిత్తాంతర్లక్ష్యప్రాప్తిన్
గ్రాచున్ మమ్మీకాలం బందున్. 403

శా. దేవా నీవు వనంబులం బసులతోఁ దే జేఁదఁగా మెట్టుచోఁ
ద్రోవన్ ఱాలును ఱప్పలున్ దృణములున్ దోదూయమానంబులై
నీవామాంఘ్రిద్వయిఁ గ్రుచ్చుకో వెతయగున్ నీకంచుమాచిత్తముల్
చేవం దక్కియుఁ దొక్కటంపడెడు నీచిత్తంబునం దోఁపదో. 404

మ. కడసంజన్ బసితోడ నీవు వ్రజమార్గం బంటి యేతెంచుచో
నడవిన్ మెట్టుట గోఖురోద్ధుతరజోవ్యాకీర్ణ శీర్ణాలకల్
దడమై కప్పిన నొప్పునీదుముఖపద్మం బేము వీక్షించి మా
యెడఁదల్ దేవున కప్పగించెదము నీ వే మందో మాచందముల్.

మ. పవ లెల్లన్ వనులందు మెట్టఁ జనుచోఁ బద్మాక్ష ! నీమోముఁ గ
న్గవలన్ బెట్టనిమాకు నానిముషముల్ కల్పంబులై పోవు రే
లవున న్డైనను నిన్నుఁ గన్నులను బాయం బోవ కీక్షింపకుం
డ విధాత్రం డొనరించె ఱెప్ప లది జాడ్యం బందు మత్తాతకున్. 406

మ. అకటా యేమని దూఱువారము హృదీశా ! మామగల్ బందుగుల్
సకులున్ భ్రాతలు బిడ్డ లడ్డుకొనినన్ లక్షింప కక్షీణమై

సుకముం గూర్చుచు నీదుగాన ముకుదేఁ జొక్కెంది బృందావనో
ర్వికి నేతెంచినమమ్ముఁ గొమ్మల నిటుల్ వీడ్కొంట ధర్మంబకో.407

తే. వ్రజవనౌకసులకు నెల్లఁ బాపహారము
దివ్యమంగళ మగునీదు దేహదీప్తి
స్వామి నిన్ను నమ్మి నయట్టిస్వజన మైన
మామనోరుజలను మాన్ప మందొసఁగుము. 408

మ. సుకుమారంబులు నీపదాంబుజము లోశోభావహాంగా! మదీ
యకఠోరోరము దాఁకె నే నొగులునం చారాటముం బొందు మే
మకటా ఘోరవనాంతరంబునను త్రా లత్యంతబాధం బొన
ర్పక పోవంచును దల్లడింతుము బహిఃప్రాణంబవై యుండుటన్. 409

మ. అనుచున్ గోపిక లెంతయేనియును భక్త్యావేశగానంబు పెం
పొనరం జేయుచు దర్శనం బిడవె యం చున్మత్తగా నేడ్చుచుం
డినయంతన్ యదువల్లభుండు పొలిచెన్ దివ్యాంగనామధ్యముం
దు నెఱింగ్రాలుచు మందహాసముఖుఁడై దువ్వల్వ దోఁగాడఁగన్.410

క. త్రిజగన్మోహనుఁడై యటు
వ్రజకాంతలమధ్యమందు వచ్చి నిలువ నీ
రజనేత్రలు వానిం గని
గజిబిజిపడి లేచి ప్రాణగతి గల్గినటుల్. 411

—♦ శ్రీకృష్ణుఁడు వెలఁతలకు దర్శనమిచ్చి లాలించుట ♦—

సీ. హరికరాంబుజ మొక్క తరుణి దోయిటఁ బట్టె
నొకతె తద్బాహువు నూనె మెడను
దమ్మముద్ద నొకర్తు తనచేతులం బట్టె
నొకత తత్పద మూనె నురమునందు
వాతెఱం గొఱుకుచుఁ బ్రణయకోపంబునం
గడకంటిచూఁపులం గాంచె నొకత
తెప్ప వాల్ప కొకర్తు నప్పతిఁ దిలకించె
విడువనిగతి బ్రహ్మవేత్రి వోలె

తే. ఒకతె నేత్రరంధ్రంబుల నుల్లమందుఁ
బొదివి కొని ప్రాణనాథుని మూసి కనులు
కౌఁగిలింత లొనర్చుచు యోగివరుని
చాడ్పునం బోలఁ దోఁచె నాసమయమందు. 412

వ. ఇట్లెల్లరు కేశవాలోకపరమోత్సవనిర్వృతలై ముముక్షువులుంబలె
బరమానంద మనుభవించి రంతఁ గృష్ణుండును శక్తులతోడం గూడిన
పురుషుండు బోలె వారిం గూడి సముచితసంభాషణంబులు గావించుచు
వారితో వికచకుందమందారసురభివాయుసంచారషట్పదంబును శర
చ్చంద్రచంద్రికాసందోహవిధ్వస్తాంధతమసంబును తుంగజలతరంగాంచిత
మృదువాలుకంబు నగు కాళిందీపులినంబునకుం జనియె నప్పుడు. 413

శా. వ్రేతల్ కృష్ణునిదర్శనంబునను హృద్వ్యధిగతోత్తాప ము
ద్ధూతంబై చనుటన్ శ్రుతుల్ బలెను సంతుష్టిం బ్రదర్శించుచున్
బ్రీతిన్ గుంకుమచిహ్నితంబు లగుచున్ బెంపొందువయ్యెంటలన్
జేతోబంధున కాసనం బిడుచుఁ బూజింపంగ నై రంతటన్. 414

తే. యోగులహృదంతరాసనభాగుఁ డైన
శౌరి యయ్యాసనంబునఁ గూరుచుండి
గోపకాంతలపూజలం గొనుచు నపుడు
త్రిజగదంచితశ్రీ గలదేహము గొనె. 415

వ. ఇట్లు గోపిక లనంగదీపనుం డగు నాపురుషోత్తముని బూజించుచుఁ
దమతమతొడలయందుం దిడుకొని హస్తపాదసంవాహనం బొనరించుచు
లీలేక్షణవిభ్రమంబుల నాలోకించుచు నించుక ప్రణయకోపపరివృత
స్వాంతలై యి ట్లనిరి. 416

క. సేవించిన సేవింతురు
సేవింపక యున్నఁ గాని సేవింతు రిలన్
సేవింప కున్నఁ గానీ
సేవించినఁ గాని జనులు సేవింప రొరున్. 417

మ. అని వారల్ తనుఁ దాకఁ బల్కిన నతం డన్యోన్యముల్ సేవలన్
బొనరింపం జనువారు స్వార్థపరతన్ బొల్పొందువా రట్టిభూ
జనులందుం దలపోయ సౌహృదము భాస్వద్ధర్మముల్ సున్న వా
రినిఁ జెప్పం బనిలేదు స్వార్థమునకై కేళ్లుబ్బ తద్ధర్మముల్. 418

సీ. పితరులవలె నేను హితము గోరుచును సే
వింపకుండినను సేవింతు రందు
నిర్దుష్టధర్మము స్నేహముఁ జెప్ప నోఁ
గోరి సేవించెడివారి నైన
సేవింప కుందురు చెప్ప నేమిటికి సే
వింపనివారి సేవింప కుండు
వారి వారలు నాల్గుతీరుల నుందురు
వారలఁ గ్రమముగాఁ బేరుకొందు

తే. వారిలో వారె సంతోషపడెడువారు (ఆత్మారాములు)
ననుభవించితిఁ గోర్కుల నెడువారు (ఆప్తకాములు)
పరు లొనర్చినయుపకృతి మఱచువారు (అకృతజ్ఞులు)
నుపకృతుల ద్రోహ మొనరింప నుండువారు. (గురుద్రోహులు)419

శా. నే నట్లుండనొ చెప్పెద న్వినుఁడు నన్ సేవించుచున్నట్టివాఁ
డైనన్ వానికి నెప్పుడు న్విడనినిధ్యానంబు సేకూర్ప నై
నే నెవ్వానికి దర్శనం బిడ నిలన్ నిస్స్వుండు ప్రాప్తార్థ మె
ట్లో నష్టంబుగఁ దద్గతాత్ముఁ డగు న ట్లుండుదున్ ననుం గొల్చుచున్.

మత్త. మీకు నాపయి నగ్గలం బయి మించ భక్తి పొనర్చితిన్
నాకుఁ గా నిటు సర్వము న్విడి నాలిమాట పడంగ నై
లోక మెంచక బంధుకోటులలో నెగుల్ పడ వేరికిన్
గాక వచ్చితి రిట్లు మీ కపకారముం బొనరింతు నే. 421

క. మీకుఁ దిరోహితుఁడై నే
యేకడకో చనినదాని కెంతయు నేనిన్

వాకొనక నప్రియంబులు
నైకొనఁ దగు నన్నుఁ బ్రియునిఁగాఁ నెంచు చెదర. 422

మ. నిరవద్యం బగుజ్ఞానముం గలుగు నోపీ రేజపత్రేక్షణల్
చిరకాలంబున నేని మీ కుపకృతిం జేయంగ నేఁ జాల దు
ర్జరగేహంబను శృంఖలంబు దెగి పో సంధించి నన్ గొల్చుటల్
పరమం బౌనుపకార మంచును దలంపం జెల్లు మీ రిత్తఱిన్. 423

తే. ఇట్లు పలికినభగవంతునిద్ధవచన
రచనలం జేసి గోపికల్ ప్రచుర మైన
విరహతాపముఁ బెడబాసి వివిధము లగు
శ్రేయములఁ బొందిన ట్లయి చెలఁగి రపుడు. 424

వ అనంతరం బా కాళిందీపులినంబునందు గోవిందుండు గోపికానందకం
దుండై స్త్రీరత్నపరివృతుండై రాసక్రీడం గావించె నదియును. 425

—• రా స క్రీ డా భి వ ర్ణ న ము •—

సీ. నాట్యప్రవీణ లౌనారీమణులు పెక్క
రన్యోన్యముం గట్టి హస్తములను
మండలాకృతి గాఁగ మహి నృత్యపద్ధతి
వలగొని తిరుగుచు వచ్చినదియు
రాసోత్సవం బిది రమ్యతరం బయి
వర్తిల్లె నాయుత్సవంబునందు
నంగనాద్వయమధ్యసంగతుఁడై శౌరి
ప్రతికాంతప్రక్కను బరిఢవిల్లె

తే. వేలకొలఁదిగఁ గృష్ణు లా వ్రేతలకుడి
మెడములం గల్గి విస్మయ మెసక మెసఁగ
నృత్య మొనరించుటలు చూచె నింగి నిలిచి
లభ్రయానసహస్రము లతిశయిల్ల. 426

క. దుందుభులు మ్రోసెఁ బుష్పము
లం దొత్తుగ రాలె నాడి రచ్చర లమరుల్

సందడిఁ బాడిరి తద్వశ
మందజ కానందజనక మయ్యెం దలఁపన్. 427

సీ. వివిధంబు లగుపాదవిన్యాసములచేత
నతులితహస్తవిధుతులచేతఁ
బొలసవ్యాతో ఁ గూడుభ్రూవిలాసములచేఁ
నసదు లైకదలుమధ్యములచేత
రుచిరంబుగఁ జలించుకుచపటంబులచేత
లలి నాడుమణికుండలములచేత
గల్లుగల్లున మ్రోయుకంకణాదులచేత
సముచితహావభావములచేతఁ
తే. జెమటచిత్తడి మోములఁ జిందులాడఁ
గబరు లవి వీడ మొలనూళ్ళు గంతు లిడఁగ
వ్రేతలాడుచుఁ బాడి రాకృష్ణవిభుని
మబ్బుకడ నుండుమెఱుముల మాడ్కి మెఱసి. 428

ఉ. వ్రేతలు రక్తకంఠ లయి విష్ణుశరీరకరాభిమర్శన
ప్రీతమనస్కలై మిగుల విన్నను వొప్పఁగ నాట లాడుచున్
భూతల మెల్ల వేణువునఁ బూరటిలం బొనరించు నాజగ
న్నేతను బాడి రుచ్చగతి నింగియు నేలయు నిండ మెండుగన్. 429

తే. ఒకతె కలియనిస్వరజాతు లున్నతగతి
నొందఁ జేయుటఁ గృష్ణుఁ డోహో యటంచు
మెచ్చె నంతట దానినే మేళవించి
ధ్రువమునకు మార్చి గౌరవాతిశయ మొందె. 430

తే. రాసమున శ్రాంతయై యొక్కరమణి మిన్న
ప్రసజము లెల్లను జారిపోఁ బ్రిక్క నున్న
వాసుదేవునిభుజముపై వైచి చేయి
సొక్కి సొక్కించె నెంతయు సొంపు మిగుల. 431

సీ. తనమీఁద వైచినవనజనాభునిచేయి
ముద్దు గొనియె వలపున నొకర్తు
కదలుపోగులు గలకలికిచెక్కు మొగంబు
దరిఁ జేర్పఁ గృష్ణుండు తమ్మ వెట్టె
నొకత పాడుచుఁ జెంత నున్నకృష్ణునిహస్త
మల్లనఁ దనవక్షమందుఁ జేర్చె
నాడుచొకత కృష్ణుహస్తద్వయము తన
తోమ్ముఁ జుట్టికొనట్టు గ్రమ్ముకొనియెఁ
తే. జెమట చిత్తడి నంటుటఁ గొమరుమిగులు
నెఱికురులతోడ మోములు గరిమ మీఱ
రవలయొడ్డాణములు మ్రోయ రమణు లెల్లు
రమణునిం గూడి సలిపిరి రాసకేళి. 432

సీ. ఈలీల హరి వ్రజస్త్రీలతో సర్వకుఁ
డన వివిధక్రీడ లనుభవించె
నతనిసంగతి చేత లవశలై తమమేని
వస్త్రాదు లెఱుఁగనివార లైరి
కృష్ణవిక్రీడిత మీక్షించి ఖేచర
స్త్రీలు మోహిత లయి ప్రాలుమాలి
రపుడు కృష్ణుఁడు వారికందఱ కందఱు
కృష్ణులవలె నయి క్రీడ సలిపె
తే. అప్పు డలసినసకులయాస్యములఁ జేత
నంటి తుడిచెను దయఁ జూపునట్టిఁ డగుచు
♦సుధితహాసనిరీక్షణస్ఫురణవలన
వారు నాతని మన్నించి రోరిమి మెయి. 433

వ. ఇట్లు రాసకేళిం దేలి గోపాలకృష్ణుండు గోపీజనపరివృతుండై కరిణీ వారపరివేష్టితుం డగునిభరాజునోజం దేజరిల్లుచు రాసంబునం జేసిన యాయాసంబు దీర వారిపూరంబునం జొచ్చి క్రీడింపఁ జొచ్చె నంత.

♦ సుధితము=అమృతప్రాయము.

—◆ జలక్రీడాభివర్ణనము ◆—

సీ. అతివ లెల్లను జల్లు లాట లాడుచు జల
    కేళి సల్పిరి తమిఁ గ్రొవ్వువాఱి
నపుడు కాలవలాహకాంబుపాతంబున
    మదకలం బట్లొప్పు మాధవుండు
ములిఁగి తేలెడునాట లలలలో సహకృష్ణు
    లగుకృష్ణవేణులు తగఁ బొనర్చి
రొకతె తమ్మికిఁ దనమొకము నీ డగు నని
    దానితో జత నిల్పెఁ దనదుమోము

తే. మఱి యొకర్తుక నీటిలో మసలు చొక్క-
మేటికల్హారమును గని మీఁదఁ జేయి
వేయ జుమ్మని తుమ్మెద వెడల బీతు
గుడిచి కృష్ణునికై దండఁ గోరి పఱచె. 435

చ. జలముల నోల లాటల నెసంగి మునింగినవారి ముట్టుకో
గలఁ డయి యిందు నందు నెమకం దిరుగాడుచుఁ దమ్మిపూవులం
గలయగ నంటిఁ గంటి నిదె కాంత మొగం బని పల్కు నంత న
మ్మెలఁతలు నవ్వి కా దనుచు మేలము సేయఁగఁ గృష్ణుఁ డొప్పెడున్

ఉ. ఒక్కొకచేడె మధ్యమున నొక్కొకమా ఱొక చక్కి నిల్చుచున్
మక్కువఁ బిల్చుచున్ మఱియు మాటలు సల్పుచు నీటు గొల్చుచున్
జక్కటి కేగుదె మ్మనుచు సందిటఁ బట్టి సడల్చుచున్ మదిన్
నిక్కము లేనిచెయ్వులను నిల్చుచుఁ బొల్చు నతండు దండియై. 437

వ. ఇట్లు సత్యకాముం డగుశ్రీకృష్ణుం డనురతాబలాగణపరివృతుండై జల
కేళిం దేరి తేలి వెడలి వచ్చి గంధమాల్యాంబరాద్యలంకారాలంకృ
తుండై సతీజనపరివృతుండై వెన్నెలబయళ్ళ విహరించె నని చెప్పిన
నప్పరీక్షిజ్జనపాలుండు. 438

మ. మహిమర్థ ధర్మము నిల్వరింపఁగ నధర్మం బుం దొలంగింప ని
మ్మహి జన్మించినవిష్ణుదేవుఁ డటు లామర్త్యాంగనాసంగతిఁ
రహి వోవఁ బరధర్మసేతువు తెగఁ బర్తించె నంచుఁ భవ
న్మహితోక్తిం దెలియంగ వచ్చె భగవన్మాహాత్మ్య మి ట్లుండునో. 439

తే. ఇది వినిందితకార్యమిం దిందిరేశ్వ
రునియభిప్రాయ మెట్టిదో మనము సంశ
యించుచున్నది నా కది యెల్లఁ దేట
తెల్లముగఁ జెప్పు మన శుకుం డల్లన నగి. 440

శా. నీకే కా దిది యెల్లవారికిని సందేహింప నౌ నంశనే
వాకొందు న్విను వీతిహోత్రునకు సర్వంబుం భుజింపఁగ దో
షాకల్పం బది లేనిచందమునఁ దేజోత్యంతదీప్తుల్ మహా
శాకారుల్ ఘను లట్టివారలకు నేయంహస్సు లే దారయన్. 441

తే. అరయ దేహాదిపరతంత్రు లైనవారు
స్వాంతమం దైన దోషము సలుప నొప్ప
దీశ్వరుఁడు కానివాఁ డబ్ధి నెసఁగువిషము
ద్రావినం జావకుండు నే ధరణినాథ. 442

తే. ఏ న నెడుభావ మేరికి లేనిదగునొ
వారు భగవంతు లగుదు రవ్వారు ధర్మ
మాచరించినచో నర్థ మరయ లేదు
వ్యత్యయ మొనర్పఁగ ననర్థ మది యు లేదు. 443

క. నరవర దిర్యఙ్మర్త్యా
మరరాక్షసముఖ్యజంతుమండలి కెల్లన్
బరఁగుఁ ధర్మాధర్మము
లరయఁగ నీశ్వరున కున్నవన లే రేరున్. 444

* అంహస్సు=పాపము;

మ. ♦మును లెవ్వానిపదాబ్జసేవవలనన్ ముక్తోక్తబంధంబులన్
ఘనులై స్వైరవిహారముల్ గలిగి యేకర్మంబునం గాక యుం
ద్రిన నిచ్ఛాజని నొందె విష్ణు వన నా నాశౌరిన్ గర్మబం
ధనముల్ గల్గు నటంచు నెంచుట లవిజ్ఞానాతిరేకార్థముల్. 445

క. గోపికలకుఁ దత్పతు లగు
గోపాలుర కెల్ల జంతుకోటుల కాల
క్ష్మీపతి జీవం బనఁ గా
నాపురుషోత్తమున కితరు లన నుండుదురే. 446

క. లీలామానుషవిగ్రహుఁ
డాలక్ష్మీశ్వరుఁడు తనదునాశ్రితులకు నే
లీలల భక్తి జనించెడు
నాలీలల వారిఁ దేల్చు నని యెఱుఁగ నగున్. 447

వ. మఱియు నొక్కవిశేషంబు గల దని మఱియును. 448

చ. వినుము నరేంద్ర చెప్పెదను విష్ణుఁడు రాఘవుఁడైన నాఁడు స
న్మునివరు లేగుదెంచి రఘుపుంగవ మమ్ముఁ బ్రియాప్రసంగతిన్
బ్రణయమునన్ గనుంగొన వరం బిడు మం చన నాఁతఁ డవ్వలన్
దనరెదు నంచుఁ బల్కి యిటు తాన జనించె యదూద్వహుండు నై.

తే. శౌరి యస్ఖలితబ్రహ్మచారి తొంటి
మునులె గోపికలై యట్లు జనన మంది
రెట్టి పరిణయమునన్ వారి నేల వలెనొ
తెలిపి క్రీడించె నని నీకుఁ దెలుపుచుంటి. 450

వ. మఱియు నాకర్ణింపు మట్లు భగవత్ప్రియురాండ్రగుగోపిక లుషః
కాలంబున వాసుదేవానుమోదితులై విడి పో నిచ్చ లేనివా రయ్యు
నెట్టకేలకు విడిచి నిజగృహంబులకుఁ జేరి రట్లు చేరిన నారీమణులం

---

♦ ముక్తోక్తబంధము=విడిపోయినకట్టు; ఇచ్ఛాజని=స్వేచ్ఛాజన్మము.

గాంచి గోపాలురు గోపాలకృష్ణమాయామోహితులై వారిఁ దమ తమప్రక్కలనున్నవారిఁ గాఁ దలంచుచు నొం డేమియు ననఁ జాల కుండి రని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 451

ఆశ్వాసాంతము.

మ. మదరాస్కాన్సిలెసంబిలీసభకు మెంబర్గాఁ బ్రజాసంఘస
పద పెంపొందఁగ నెన్నుకోఁ బడి జగత్ప్రఖ్యాతినిం గాంచి స
త్యదయాశౌచసమన్వితాత్ముఁడు ప్రభూతైశ్వర్యధుర్యుండు శ్రీ
పదసేవాపరతంత్రుఁడై తగువిరాడ్వంశప్రభుం డొప్పెడున్. 452

క. మాతాపితృభక్తియు దే
వాతతభక్తియును గలిగి యార్యుల నధిక
ప్రీతి భజించెడు సాగి
ఖ్యాతాన్వయసూర్యుఁ డొప్పు నతివిభవమునన్. 453

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమస్కంధమున ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

శ్రీ రస్తు

# శ్రీ కృష్ణ భాగవతము

## దశమ స్కంధము

### తృతీయాశ్వాసము

—:o:—

క. శ్రీమద్వేంకటనరసాం
బామానవతీలలామ మానసదయితుం
డై మించుసూర్యభూపతి
క్షేమైశ్వర్యాభివృద్ధిఁ జెన్నలరారున్. 1

వ. అక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నట్లు వ్రజౌకసు లెల్లరు నానం దకందళితాంతరంగులై యున్నయప్పు డొక్కనాఁడు వారందఱుం బం డ్లెక్కి యంబికావనంబునకుం జని. 2

—♦ అడవిలో శయనించిన నందుని కొండచిలువ మ్రింగుట ♦—

తరళము. అడవిదేవతలన్ భజింపఁగ నావ్రజౌకసులెల్లరున్
గొడుకుల న్సతి కొమ్మలం గొని గోపబాలకుఁ గృష్ణు ము
న్నిడుకొనం గల రైవనాళికి నేగి యక్కడ నొక్కచో
పడక చేసిరి సంజ దాపయి వచ్చి చీఁకటి హెచ్చుటన్. 3

ఉ. ఆసమయంబున న్నిదురకై శయనించి యొకానొకండుగా
భూసతిఁ గౌఁగిలించుకొని బుస్సలు కొట్టుచునున్న నందునిన్
దాసరిపాము కన్గొనుచు దవ్వులనుండియు వచ్చి రివ్వునన్
గ్రాసము గాఁగఁ జేసికొనఁ గ్రాలె క్షుధార్తి శమించునట్లుగన్. 4

తే. కొండగుహ కెత్తువచ్చెడి గొప్పనోటి
తోడఁ గాళ్ళకడం బట్టి తొడరి మ్రింగు
చుండ మేల్కాని నందు డోహోయి కృష్ణ!
కృష్ణ! ననుఁ బాము పట్టి మ్రింగెడిని రావె. 5

క. రావే వే వే నన్నుం
జావునకుం గాక యుండ సలుపవె తండ్రీ!
నావుడు నార్తధ్వని విని
గోవులలోఁ జెంత నున్న గోపాలు రటన్. 6

మ. కొండచిల్వల గొని వచ్చి చెచ్చెర వ్రజౌకోనాథునిన్ మ్రింగుచో
సరిపామును గని క్రోధశోకములు హెచ్చన్ బచ్చపై పోవ బా
దిరి కొట్టాయిలతోడ ధింధిమిరవోద్రేకంబు పాకంబుగన్
బరిమర్దించిరి గాని పాము విడ దానందున్ వ్రజానందునిన్. 7

ద్విపదము. పాబాలుగా మ్రింగి సన్న నానందు
పాబాలునున్ మ్రింగ సమకట్టి యుండు
నాబూచిపా మది సమయించు ననుచు
బాబూ! యనుచు వెండి పలవించె నతఁడు. 8

—♦ నందుని మ్రింగుసర్పమును కృష్ణుఁడు సంహరించుట ♦—

ఉ. నందుఁడు చచ్చెఁ జచ్చె నని నల్గడ మ్రోయఁగ శబ్ద మొక్కచో
నందినిఁ బోలుకుఱ్ఱి మెయి నాఁకగ నాకలు మెచ్చవేణు వా
నందముతోడ నూఁదుయదునందనుఁ డానుడి వించుఁ జెచ్చెరన్
సందడి యైనచోటుఁ జని సర్పము దర్పము చూచి క్రుద్ధుఁడై. 9

ఉ. మంటలమారిపాముఁ గని మండుచుఁ బైదుముకంగనై వడిన్
గంటెలకంకి మట్టినటు కాళుల రెంటను బట్టి మట్టినన్
గంటను నోట నెత్తురులు గారగ నందునిఁ గ్రక్కి గ్రుక్కలోఁ
గంట కసాధ్య మైనగతిగాఁ బొరలాడుచుఁ జచ్చె నచ్చటన్. 10

వ. ఇట్లు చచ్చి విద్యాధరుండై వచ్చి కృష్ణుని పాదంబులపై వ్రాలుటయు
నతం డతనిం గాంచి యి ట్లనియె. 11

ఉ. సుందరమూర్తి నీ వెవరు సాం పరుగన్ గిరిగహ్వరంబులన్
నిందిత మైనరూపమున నెంజిలి నొందుదు వేమి కర్మమో
విందుము చెప్పు మన్న యదువీరుని పాదము సంస్పృశించుచున్
ముందర నిల్చి యి ట్లనియె మోడుపు కేలు వహించి మోమునన్.

♦ కొట్టాయిలు = కొండచిలువలు; ఇట్లు నైజామదేశమున వ్యవహరింతురు; కుఱ్ఱి = ఆవు పెయ్య; బూచిపాము=దాసరిపాము, కొండచిలువ.

స్రగ్విణీవృత్తము. ఏను విద్యాధరుం డెల్లలోకంబులన్
మాని తైశ్వర్యమున్ మాన మింతిం తనం
గా నసాధ్యం బమై గానఁగా వచ్చెదన్
దాన గర్వం బెడం దాపరించెన్ బ్రభూ. 13

క. నాపేరు సుదర్శనుఁ డో
శ్రీపతి నే నొక్కనాఁడు చెలికత్తెలతో
నోపి విమానముమీఁదన్
రేపులు పో నొక్కచోట ఋషు లాంగిరసుల్. 14

వ. దర్శన మిచ్చిన సురూపదర్పితుండనగు నే వారి విరూపంబులం గాంచి నవ్వి పరిహాసించితి నంత వారును. 15

తరళము. కినిసి నన్ను శపించి రోరి యకించనా! యిటు మమ్ముఁ గ
న్గనక నవ్వి పరాభవించితి కాన నీవు భుజంగమై
వనుల నుండు మటంచు శాపము వల్కి రద్ది యనుగ్రహం
బునకె యయ్యెఁ ద్రిలోకవల్లభ పూజ్యపాదము దాఁకుటన్. 16

క. నీపాదరజము సోఁకుట
నాపాపము లెల్లఁ బాసె నారాయణ! నా
రూపము నా కయ్యె నిఁకన్
నీపం పగు నేని పోదు నిలయంబునకున్. 17

ఉ. అచ్యుత! నీసుదర్శనమహాత్మ్యము గల్గుట బ్రహ్మాదండ పా
పచ్యుతిఁ జేసి పూతుఁ డయి పర్విత నిన్ను స్మరించినంత నే
నైచ్యము వాయు నన్న నయనంబుల గాంచి భజించితి న్నినున్
శోచ్యము కానిజీవనము చొప్పడ నయ్యెను నేను ధన్యుఁడన్. 18

వ. అని సుదర్శనుండు దాశౌర్హున కభివందనం బొనరించి స్వర్గంబునకు నిర్గమించె నందుండును గృచ్ఛ్రవిముక్తుండై కొడుకు నభినందించి కవుంగిలించుకొనియె వ్రజౌకసు లాప్రభావంబు కని విని విస్మితులై దేవోత్సవంబు నిర్వర్తించి కృష్ణమహాత్మ్యముం జెప్పుకొనుచు మందకుం

జసి రంత నొకానొకనాఁటిరాత్రిసమయంబున నద్భుతవిక్రముం డగు
గోవిందుండును బలభద్రుండును గోపకులతోడం గూడి విహరించుచు.

సీ. గమగమ వలచెడుగంధంబు మైఁ బూసి
కొని పుష్పమాలలు తనరఁ దాల్చి
విరజోంబరంబులు వెలయంగ ధరియించి
నల్లగల్వలగాలి నలుగడలు గ
మల్లెపూవులనుండి మధుపముల్ మొఱయంగ
నుదితచంద్రుఁడు చాల నొప్పు మిగిలి
పండువెన్నెల గాయుచుండ నిశాముఖ
మున స్వరమండల మూర్ఛితములు

తే. కల్పనలు చేయుచును గోపికాజనంబు
మధ్యమున రామకృష్ణులు మాన్యు లగుచు
సర్వభూతహితంబుగా శ్రవణపేయ
సాధుగీతము పాడి రాసమయమందు. 20

వ. గోపిక లాబలరామకృష్ణులవేణుగానంబు విని మూర్ఛితలై యొడ
లెఱుంగ కుండి రయ్యవసరంబున. 21

—♦ శంఖచూడుఁ డనుగుహ్యకుని సంహరించుట ♦—

తే. శంఖచూడుఁడు నాఁబడుశత్రుఁ డొకండు
ధనదభటుఁ డాడ కరుదెంచి తత్సనాథ
లైనప్రమదలఁ గొని పోయె నరయుచుండ
బలిమిమై నుదీచికి శంక తొలఁగఁ ద్రోచి. 22

క. రామా! కృష్ణా! యనుచుఁ
వేమఱు మొఱ లిడెడుగొల్లనెలఁదుల నపు డా
రాముఁడు కృష్ణుఁడు పులివస
మై మలఁగెడుగోగణంబు మాడ్కిం గనుచుఁ. 23

చ. భయమము పడంగఁ బోకుఁ డిదె వచ్చుచునుంటిమి వేతలార మీ
యయమును గోయుచుంటి మని యచ్చట నుండినసాలవృక్షముల్

రయమునఁ గొంచు గుహ్యకుఁ డరంబుగఁ బోయెడుదారిఁ బట్టి బి
ట్టెయిది యెటేగ దోరి నిలు మిచ్చటికో సరి నీదుముచ్చటల్. 24

వ. శంఖచూడుండును గాలమృత్యువ్యాపము లగువారి నిద్దఱం గని భయం
బునం జేసి స్త్రీజనంబున్ విడనాడి బ్రదుకునాస గలాఁడు గావున
వడివడిం బాఱఁ జొచ్చె నప్పుడు స్త్రీలఁ గాపాడ బలరాము నట
నుండఁ జెప్పి శ్రీకృష్ణుండు వాఁడు పాఱినచోట్ల కెల్ల వెన్నుదన్ని
పాఱి పట్టి ముష్టిఘాతంబుల శంఖచూడునిశిరంబు ముక్కలు గావించి
వానిశిరోభూషణంబు గొని పోయి గోపికలు చూచుచుండ సంతసిం
చుచు నగ్రజున కొసంగె ననంతరంబ. 25

—♦ శ్రీకృష్ణలీలాపరిభ్రమణాదికము ♦—

ఉ. గోపిక లప్పవళ్ళు హరి కోనల కేగినఁ దద్వియోగమున్
సైఁపగ లేక తద్గతవిషాదవిశిష్టమనోంబుజాతలై
శ్రీపతి నెప్పుడున్ విడక చిత్తమునం గొని తద్గుణంబులన్
రూపగునట్లు పాడుచును ద్రోతురు నా ళ్ళతిదుఃఖభాగలై. 26

వ. ఇట్లు విరహతాపతప్యమానమానసాంబుజలగువారు తమలోనందారు.

చ. ఎడమభుజంబుపై నెడమదే యగుచెక్కిలిఁ జేర్చి కన్బొమల్
వడి నెగిరించుచున్ బెదవిపైఁ గడి పిల్లనగ్రోవి దాని చిల్లులన్
దెడపక వ్రేళ్ళు వైచుచును గృష్ణుఁడు గాన మొనర్ప నింగిఁ బో
యెడుసురకామినుల్ విని వహింతురు మోహము విస్మితాత్మలై. 28

మ. చెలులారా! వినుఁ డీవిచిత్రము యదుశ్రేష్ఠుండు దీనావనో
జ్జ్వలచిత్తుం డయి వేణు వూఁదెడుతఱిన్ సారంగముల్ గోవు ల
క్కలనాదంబున సొక్కి సిక్కగఁ జెవుల్ ఘాసంబు వ్రేలంగ నో
ళులఁ గన్మూయుచు బొమ్మలో యనఁగ మేలుం గూర్చెడిన్ గుంపులై.

సీ. నెమిలికన్నులతోడ నెఱిమీఱఁ గూర్చిన
మల్లెలదండల నల్లఁ దాల్చి
బలరామగోపాలపరివృతుఁ డయి కృష్ణుఁ
డెలమిఁ బాడుచు నాలఁ బిలుచునపుడు

వానిపాదరజంబు వాయువశంబున
వనమున నమలలోఁ బడుటఁజేసి
వడి తగ్గిపోవఁ బ్రేముడిఁ జలించుతరంగ
ములనుహస్తంబులు కలవియగుచు
తే. నిర్మలోదకములయి యీనెలఁత లట్లు
మోహితములయ్యె ననఁగ నొప్పెను లతలును
బువులతో వంగి హృష్టతనువులు గలిగి
మధువు వర్షించె హరిగానమహిమవలన. 30

చ. హరి యధరంబుపై మురళి నానిచి నప్పుడు గొప్ప మీఱ గా
సరసులయందు హంసములు సారసముల్ మొదలైనపక్షు లా
సరసమధుస్వరంబు విని చక్కటికిం జనుదెంచి మానముం
బరఁగఁగఁగన్ను మూసికొని సారసనాభుఁ గొల్చె నెమ్మదిన్. 31

మత్త. పూలమాలలు దాల్చి కృష్ణుఁడు భూధరోన్నతసానువున్
లీల నెక్కి ముదంబునన్ మురళిన్ ధ్వనింపఁగఁ జేయఁగాఁ
బోల వించు ఘనుండు దానికిఁ బోలున ట్లురుమంగ లే
కాళి మెల్లగ మ్రోయుచున్ గొడుగై విడెన్ సుమవర్షమున్. 32

తరళము. పిలనగ్రోవిని నూఁదునప్పుడు వేడ్క నేస్వరజాతులన్
గలయఁ గూరిచెనో ముకుందుఁడు గానపండితులైన బ్ర
హ్మలును రుద్రులు శక్రులాదిగ నైనవేల్పు లెఱుంగ లే
కొలసియు న్మదిఁ గశ్మలత్వము నొంది రెంతయు వింతఁగన్. 33

చ. మదగజ మల్లు మెట్టుచును మానుగ వేణువు నూఁదుచుండు నా
యదుపతిపాదపద్మముల నాలఖురంబుల నైనఖేదమున్
వదలగఁ జేసె గోష్ఠమున వానివిలాససమీక్షణంబులన్
మదవతు లెల్ల మ్రానుపడి మానటి పోయిరి మోహసంగతిన్. 34

ఉ. ఆవుల గాయుచోఁ జొక్కటఱి నక్కడ మక్కువ మీఱఁ బాడుచో
రావము నాలకించి మృగరామలు వచ్చి సుమోహితాత్మలై

శ్రీవనితామనోహరునిఁ జిత్తమునందు ధరించి యిండ్లకున్
బోవుట మాని పొమ్మనినఁ బోవక యున్నవి కంటిరే చెలుల్. 35

ఉ. రే యగుదెంచునప్పటికి వ్రేతలచిత్తము లుల్లసిల్లఁగా
నాయదువంశభూషణుఁ డహస్కరతాపము వాపి భూమికిన్
జేయఁగ శాంతి చంద్రముఁడు చేరఁగ వచ్చెడురీతి వచ్చెడిన్
మీయెడఁ దాప మార్చెడిని మే లొగిఁ గూర్చెడి మీకుఁ గోరికల్.

వ. పరిపరివిధంబులం బరితపించుచుఁ గృష్ణలీలలం గానంబు సేయుచుఁ దదేక
చిత్తంబున నుత్తలంపడుచు నిట్లు బగళ్లు గడవ నీఁదుచుండి రంత
నొక్కనాఁడు. 37

— శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట —

సీ. ఎవ్వానినిష్ఠురాహీననిర్హ్రాదంబు
గుండె లవియఁ జేయు గోనరాళి
కెవ్వానిమూపుర మీక్షించి మేఘముల్
పర్వత భ్రాంతియై వదలకుండు
నెవ్వానిశృంగము లీశ్వరశూలమున్
గాదు కా దనిపించుకరణి నుండు
నెవ్వానిఖురహతి నెంత లెంతలు భూధ్ర
ములు నైనఁ బిండియై పొడ వడంగు

తే. ఎవఁడు మునుగాళ్లఁ గొట్టి దుమ్మెగురఁ బోయు
భాస్కరుం గప్పి చీఁకట్లుఁ బర్వఁ జేయు
నెవఁడు ప్రళయానిలంబు గా నెగిచి రేఁగు
వాఁడువృషభాసురుం డనువాఁడు వచ్చె. 38

పంచ. అరిష్టనామధేయుఁ డైనయాతుధానుఁ డాతఁ డా
ధరాతలంబు బెగ్గడిల్ల దండి గోవృషంబయై
ఖురాహతిన్ రజంబు నేల గుప్పతిప్పలై పడన్
గిరీంద్రమో యనంగ వచ్చెఁ జేరి గోష్ఠభూమికిన్. 39

ఉ. కొమ్ములఁగోడ భూధ్రములఁ గొట్టుచు నెట్టుచు భూరుహంబులన్
దు మ్మెగురంగఁ బోయుచును దోఁక గదల్చుచు రివ్వు రివ్వునన్
ముమ్మర మైనశబ్ద మది ముట్టగ దిక్తటులందు నార్చుచున్
ముమ్మొనవాలుదాల్పునకుఁ బోనిపరాక్రమవిక్రమంబులన్. 40

వ. మాటి మాటి కించు కించుక శకృన్మూత్రంబుల విడుచుచు గోష్ఠంబు
నకు వచ్చినదానిం జూచి భయవిహ్వలులై గోపాలురు గోవుల న్విడ
నాడి కాలికొలఁదిం బాఱుచుఁ గృష్ణా! కృష్ణా! రక్షింపుము రక్షింపు
మని శరణుఁ జొచ్చుటయు నచ్యుతుండు భయవిహ్వలు లైనవారిం
జూచి యి ట్లనియె. 41

చ. భయపడఁ బోకుఁ డే గలను బట్టి వధించెద గోవృషాసురున్
రయ మెసఁగంగ నంచు నుడి గ్రాలఁగఁ జేయుచు నోరి మందుఁడా
భయపడి పాఱువారిపయిఁ బాఱెద వేటికి రమ్ము నే నిదే
ప్రియపశుమంటి నిన్నుఁ బలి వెట్టగ నుంటినిఁ గాళరాత్రికిన్. 42

వ. అని మల్ల చఱచి చెలికానిభుజంబుపై భుజంబు వైచుకొని నవ్వుచుం
జూచుచుండె నంతవృషభాసురుండును. 43

ద్విపదము. కుపితుఁడై నేలను ఖురములఁ గొట్టి
విపరీత మగునార్పు వినువీథి ముట్ట
నపు డొనర్చుచుఁ దోఁక నాడించి నింగిఁ
గృపణుఁడై పర తెంచెఁ గృష్ణునిం దాఁక. 44

మ. తనపైఁ గొండవలెన్ బడంగ నెదుటం దారాడువానిన్ ఖలున్
గని శృంగద్వయముం గ్రహించి వడి లోకస్వామి లోకాంతరం
బునకుం బుచ్చెద నంచు నైదు పదియున్ మూఁ డడ్గు లాపైఁ బడన్
బొనరించెన్ వడి లేచి వాఁడు ప్రతిఘాపూర్ణాత్ముఁడై యార్చుచున్.

తే. వాసుదేవునిపైఁ బడ నీసుఁ జేసి
వచ్చె వచ్చినఁ గని హరి వానికొమ్ము
దుగ మఱియుఁ బట్టి పదమునం ద్రొక్కి భూత
లమునఁ బడ వైచి యేచినలాఘవమున. 46

తే. ఆర్ద్రవస్త్రము పిండినయట్లు వాని
నులిమి వైచియు శృంగము వెలికి లాగి
దానఁ జా నేసి విడిచె నాదానవుండు
కొండ గూలినపోలికిఁ గూలె నేల. 47

ఉ. మూత్రపురీషముల్ రుధిరముల్ గడు విడ్చుచుఁ దన్ను కొంచుఁ బెల్
గాత్రము ధాత్రిఁ గొట్టుకొనఁ గన్నులు తెన్నులు దప్పి మీఁదు రా
నాత్రముతోడ నూర్చుకొను నవ్వృషకింతటిలోనఁ బ్రాణముల్
క్షేత్రము వీడి పోయె యమసీమను గాపుర ముండుకోరికన్. 48

వ. ఇట్లు వృషభాసురసంహారంబు గావించి గోవిందుండు బలరామగోపాల సహితుండై తమవారిచే స్తూయమానుండై వ్రజంబునకుం జని గోపికా నయనోత్సవంబు గావించె నంత నక్కడఁ ద్రికాలజ్ఞుం డగునారదుండు కంసునికడకుం జని యి ట్లనియె. 49

—♦ నారదుఁడు వచ్చి కంసునకు రామకృష్ణుల నెఱింగించుట ♦—

సీ. కంస ! నీపురుషులఁ గడ తేర్చినట్టి రి
ద్దఱు రామకృష్ణులు తనరుచుండ్రి
వారివృత్తాంతము వర్ణింతు వినుము నీ
భయమున వసుదేవుఁ డయము గోరి
నిజమిత్ర మగునందువ్రజమున వారిని
నిలిపి వచ్చెను రక్ష సలుపుపొంటె
దేవకిసుత యని తెలియంగ బడునది
నందయశోదకు నందన యగు

తే. అలయశోదకు నందనుం డనెడుకృష్ణుఁ
డరయ దేవకిసుతుఁడు రామాహ్వయుండు
దెలియ రోహిణిసుతుఁడును దేవకిసుతుండు
ననుచుఁ దెలియంగ వలయు రహస్య మిద్ది. 50

మ. విని కంసుం డతిరోషరూషితమతిన్ విత్రస్తుఁడై హస్తమం
దు నిశాతాసి ధరించి లేచి దహనుండుం బోలె దీపించుచున్

చని నే నావసుదేవుఁ జంపి పగ వో సంధింతు నం చేగఁ జూ
గని దేవర్షి నరేంద్ర నీకుఁ దగ దిక్కార్యం బనార్యం బగున్. 51

తరువోజ. వారింపఁ బడి యిట్లు వసుదేవసుతులు
బలరామకృష్ణులన్ వా రాత్మమృతికిఁ
గారకు లని యెంచి కని నారి నిట్లు
కనుగప్పి పుచ్చి రక్కడి కంసుఁ గన్న
వారిలోహమయోగ్రబంధనంబులను
బంధించి పుచ్చె యాబ్రహ్మపుత్రుండు
నారదుం డరుగ ననంతరమందు
నరపతి కేశి యన్వానినిఁ బిలిచి. 52

మత్త. రామకృష్ణుల నీ వెఱుంగుదె బ్రహ్మపుత్రుఁడు చెప్పెడున్
నామనంబు చలించుచుండెడి నాదుమిత్రమ! నీవు నీ
ధీమసంబునఁ జేసి వారలఁ ద్రుంపఁ జాలుదు వంచు నీ
సోమ మేనుగ్రహించి పుచ్చెదఁ జూచుచుంటిని మందరున్. 53

వ. అనిన నాతం డట్ల కాక నే నిప్పుడ పోయి రామకృష్ణులకు ముప్పు ఘటిల్లం జేసి వచ్చెద నని మురలఁ గొని చని యెం భోజపతియు నంతంబోక చాణూర ముష్టిక శల తోసల కా ద్యమాత్యవర్గంబును గొందఱ హస్తిపకులనుం బిలిచి. 54

శ్యామల. ఆనకదుందుభిపుత్రకు లావ్రజమందు మదీయా
నూనవిరోధము న న్నను నొంపగఁ జంపఁగ నుంటల్
వీనులకు న్వినవచ్చెను వీరులు మీరలు మీరున్
నే నన నేటికి మాటికి నే బ్రదుకం దలపైనన్. 55

వ. నాభారంబు మీఁద వా రిట కాహూతులై వచ్చిన వారితో మల్ల యుద్ధంబు చేసి మడియింపుం డీలో మల్లరంగంబును సింహాసనాలంకృతంబు గావించి పౌరజానపదులఁ బ్రేక్షకులంగావింపుఁడనియంపిపుచ్చి.

---

♦ సోమము=పరాక్రమము; అనార్యము=చెడ్డది; ధీమసము=ధైర్యము.

సీ. మతిమతుం డగునొక్కమావటీనిం బిల్చి
యోమహామాత్ర! నాయుల్లము విను
రంగస్థలంబు ద్వారమ్మునందుఁ బ్రభిన్న
కటకాముఖం బయి కాన వచ్చు
కువలయాపీడ మను కుంజరము న్నిల్పిఁ
డిచ్చి చేతికిఁ బెద్దయినుఁపదుష్టు
వసుదేవసుతు లప్డు వధియింప న్నప్పుల
యని మంత్రులం గని యనియె మఱియు

తే. నాదుకోరికఁ దీరిచినను బహూకృ
తులు కడుంగడు మీరు పొందుదురు మఱియు
శూరపథమం దధిష్ఠాతలై రహింతు
రనుచు వచియించి మఱియు ని ట్లనియె నతఁడు. 57

వ. మఱియు వసుదేవోగ్రసేనులును నందదేవకులును గోపాలకులు యాదవులు లోనగువారు మల్లరంగంబునం దుండి హాస్యమానులగు బలరామకృష్ణులఁ బ్రదర్శించునట్లు సంవిధానంబు గావింపుఁడు రేపటి చతుర్దశీదినంబున ధనుర్యాగసంకల్పంబు గావించి భూతరాజగు భేతాళునకుఁ బవిత్రము లగుపశువుల సమర్పింతురు గాక యని నియోగించి యదుపుంగవుం డగునక్రూరుం బిలిచి చేతం జేయి పట్టుకొని యి ట్లనియె. 58

—♦ రామకృష్ణులం దేర నక్రూరుం బుచ్చుట ♦—

మత్త. ఓజగత్ప్రియ! దాశవంశసముద్భవా! విను చెప్పెదన్
భోజవృష్ణికులంబులం దొకపూరుషుండును నిన్నుఁ బోల్
రాజగౌరవముం గలాఁడు విరాజమానమనస్కుఁడున్
వ్యాజ మింతయు లేనివాఁడును నాకుఁ దోఁపఁ డొకప్పుడున్. 59

సదాశివవృత్తము. నాపైఁ గలకూరిమి పెంపున నాకుఁ బొనర్పఁగ నైనది యై
రూపింపఁగ నయ్యెను గార్య మొకర్ పొనరింపఁగ నోపనిదై
నీపై నిడ నుంటిని భారము నీ వెటు చేయఁగ నుండెదవో
నాపల్కు లొకప్పుడు కా దని నాల్క వచింపకు మెఱుంగ విలన్. 60

క. ప్రభు వింద్రుఁడు లక్ష్మీవ
ల్లభునిన్ సేవించి విజయలక్ష్మిం గొను నే
ను భవన్మిత్రుఁడ నాఁదగు
శుభకార్య మొకండు నిన్నుఁ జొనుపుచుఁ గొందున్. 61

శా. అక్రూరుం డవు గాన ని న్నెవరునే నాడంగఁ బో రెచ్చి ని
న్నేక్రూరుండును ద్రోసిరా జనఁడు నీ వే మన్న నౌ నందు రో
యక్రూరా! యిది మిత్రకార్యము నినుం బ్రార్థింతు నే నర్థినై
ప్రక్రాంతం బగునాప్రయత్నమునకుం బా దీవ వై తియ్యెడన్. 62

ఉ. నందునిగొల్లపల్లియఁ గసం జను మందు నెసంగుచుందు రా
దుందుభిపుత్రు లంచునుడి తోఁపఁగ వచ్చెను వారి నిద్దఱన్
దుందుడు కేగఁ బల్కి యిటఁ దోడ్కొని రమ్ము మహాంబుపేర నా
నందము నొందఁ జేయుచును నానుడికార మటంచుఁ దెల్పుచున్. 63

సుగంధి. రామకృష్ణు లక్కుమారరత్నముల్ దలంపఁ గాఁ
దాము విష్ణునంశ మొంది దాయ నన్నుఁ జంప నీ
భూమిఁ బట్టి రంచు వింటిఁ బూతనాదిరాక్షస
స్తోమమున్ వధించినట్టిశూరు లన్న వార లే. 64

మ. సహదాయాదము గాఁగ వారి నిటకున్ సామంబునం దెమ్ము నే
నహహా నాఁగ మదీయనాగమున సంహారంబు గావించి నా
సహజద్వేషముఁ బాపుకొందు మఱియున్ సాక్షాద్యముల్ మల్లు ల
న్వహముం గొల్చుచు నుంద్రు నన్నితరు లేలా శత్రులం గూల్పఁగన్.

శా. వారిం జంపినపిమ్మటన్ గలరు తద్వంశీయులై యాదవుల్
వీరుల్ వృష్ణులు భోజముఖ్యు లగునావిద్వేషు లవ్వారి నా
భీరవాత్రితము శూరసేనసుతుతో వేధించి బాధించి నే
ఘోరాయోధనమందుఁ గూల్చి జయముం గొందున్ యదుగ్రామణీ.

ఆ. మఱియు నుగ్రసేను మాతండ్రి ముదుసలి
నాది రాజ్య మనుచు నన్నుఁ దెగడు

వాని వానితమ్ముఁ డైనదేవకుఁ జంపి
విగతకంటకుండ నగుదు జగతి. 67

వ. నాకు జరాసంధుండు గురుతుల్యుండు ద్వివిదుండు దయితుండు శంబర
నరక బాణాదులు ప్రాణప్రియులు వారలం గూడి నిష్కంటకం బగు
భూమిం బొంది ప్రభుండనై పూజ్యసామ్రాజ్యసుఖం బనుభవించెదం
గాక మిత్రమా! నీ విది యంతయు నెఱింగి పోయి ధనుర్యాగదర్శ
నార్థ మని చెప్పి బలరామకృష్ణుల నిటకుం దోడి తెమ్మనిన
నక్రూరుండు. 68

ఉ. ఎన్నఁడు చావు లేనియటు లీవు ప్రయత్నము లాచరించుటల్
చిన్నది కాదు కార్యములసిద్ధి యసిద్ధియు దైవనిర్మితిం
జెన్నగు మర్త్యుఁ డందు సమచిత్తము గల్గి మెలంగ నొప్పు నే
ని న్నది కాదు కూడ దన నేరను నీదగునాజ్ఞ నుండెదన్. 69

వ. పోయి వచ్చెద నా కనుజ్ఞ యొసంగు మని యక్రూరుండు మంత్రి
సామంతాదులతోడం గూడియున్న కంసు నామంత్రించి నిజాలయంబు
నకు నిర్గమించె నంత. 70

తే. నారదుం డట్లు చెప్పి చనంగఁ గంసుఁ
డాగ్రహంబునఁ దనకు సహాయుఁ డయిన
కేశి యనురాక్షసునిఁ బిల్చి కృత్య మెఱుఁగఁ
జేసి దీవించి పుచ్చె నాదోసకారి. 71

—• శ్రీకృష్ణుండు హయరూపుఁడగు కేశిం జంపుట •—

సీ. హేషారవంబుల భీషితమై లోక
మట్టిట్టు పడఁ జేయునట్టివాఁడు
ఖరఖురాగ్రములచే ఘనతరభూధ్రముల్
పగులఁ గొట్టం జాలుబలమువాఁడు
చటులసటాచ్ఛటా చలనంబులం జేసి
నింగిఁ బ్రద్దలుసేయ నేర్పువాఁడు

దంభోళి కై త్తయి కుంభినీరుహములఁ
గొట్టికి వేయఁగఁ జాలుకోఱవాఁడు
ఆ. కాలపాశ మట్టివాలము గలవాఁడు
భయదముఖము గలిగి పరఁగువాఁడు
మేటిగుహను బోలు నోటివాఁడు
రూక్షముగను దోఁచె రాక్షసుండు. 72

వ. మహోన్నతహయంబై కాటుకకొండం బోనికాయంబునఁగటికిచీఁకట్లం
గ్రక్కుచు నొక్కనాఁడు కేశి కాశ్యపిం గంపింపఁ జేయ నందగోకులంబు
నకుం జనుదెంచి మించినపరాక్రమంబున మృగేంద్రంబు వలె సాంద్రా
రవంబు నీరంధ్రం బై నిఖిలదిశలం బర్వ గర్వంబున నార్చుచు వాసు
దేవాభిముఖుండై వచ్చి గ్రచ్చర రెండుకాళ్ళ నెత్తిపై దన్నుటయు.

ఉ. ఆదశరూపభృత్తు నిమిషాంతరమంద కడంక వానిని
బాదములందుఁ బట్టుకొని బాహుబలంబునఁ ద్రిప్పి త్రిప్పి యా
మీఁద ధనుశ్శతాంతరము మేదినిపై వడిఁ గూల నేసెఁ గా
కోదరముం గ్రసించి విహగోద్వహుఁ డీడిచి వైచినట్లుగన్. 74

ఉ. పాటున మూర్ఛితుం డగుచు వాహసురారి యొకింత తేరి మేన్
తేటపడంగఁ గిన్కమెయిఁ దెప్పున నప్పతిపైఁ బడంగ నో
ర్వాటిగఁ జేసి యీసునను బైపయి రాఁ గని కృష్ణుఁ డప్పు డా
నోటను దోపె ముందు చెయి నుచ్చులు వచ్చెడునట్లు పెచ్చఁగన్.

వ. అంతలో హస్తంబు పెఱుగుటం జేసి వానిదంతంబు లూడి నేలం బడుట
కాక వాఁడు నిరుద్ధవాయుసంచారుండును బ్రస్విన్నగాత్రుండును బరి
వృత్తలోచనుండునై విలవిలం దన్నుకొనుచుం బడి చచ్చె నచ్యుతుం
డును దోసపండువలెం బగుల్లువారినవాని దేహంబునుండి తనహస్త
ముం దీసికొని దేదీప్యమానదేహుండై దీపించె దేవతల్లు పుష్పవర్షంబు
గురిసి రక్కాలంబున నొక్కనాఁడు. 76

—♦ నారదాగమనము ♦—

సీ. వేదోపనిషదర్థవేత్త పురాణేతి
హాసకల్పన్యాయభాసురమతి
ధర్మతత్త్వజ్ఞుండు ధర్మార్థకామమో
క్షవినిశ్చయజ్ఞానకలితచిత్తుఁ
డంగషట్కవిధిజ్ఞుఁ డైక్యసంయోగ నా
నాత్వాదిసమవాయనయవిదుండు
పంచావయయుక్త వాక్యదోషగుణజ్ఞుఁ
డుత్తరోత్తరవక్త సత్తపస్వి
తే. కవి ప్రగల్భుఁడు మేధావి భువనదర్శి
సర్వశాస్త్రప్రవీణుఁడు సంధివిగ్ర
హాదిషాడ్గుణ్యతత్త్వజ్ఞుఁ డనఘమూర్తి
నారదుం డఖిలకలావిశారదుండు. 77

వ. ఇట్లు వచ్చి నారదుండు కృష్ణు నేకాంతంబునం గలసి యిట్లనియె.

శ్లో. కృష్ణ కృష్ణ హృషీకేశ కేశవాచ్యుత మాధవ
వాసుదేవాఖిలావాస యోగీశ్వర రమేశ్వర. 79

సీ. కష్ఠైలలో నగ్ని కైవడి సర్వభూ
తాంతరాత్ముఁడ వయి సాక్షి వగుదు
నీ వీశ్వరుం డవు నిఖిలంబు నీయంద
లీనమై యుండు మహానుభావ
మాయ సత్త్వరజస్తమంబులు గల్పించి
తద్గుణత్రయముచేతఁ జగములు
సృజియించి రక్షించి శిక్షించు చుందువు
సత్యసంకల్పుఁడ వత్యమలుఁడ
తే. వజరుఁడవు గుహాశయుఁడ వాత్మాశ్రయుఁడవు
సర్వభూతహితుండవు శాశ్వతుఁడవు

సర్వసాక్షివి సర్వజ్ఞ ! సర్వవినుత !
నిన్నుఁ దెలిసి భజింపఁగా నేర్తు రెవరు. 80

తే. దుష్టసంహార మొనరించి శిష్టజనులఁ
గాచి రక్షింపఁ బుట్టితి కాదె దేవ
నిన్ను వర్ణింప శక్యమే నీరజాక్ష
యీ వృషేంద్రుఁడ వింద్రుఁడ వింత నిజము. 81

ఆ. వేలుపులకు నేని వెగడు గుడ్డ్పెడుహాయా
సురునిఁ జంపి తిపుడు చూచుచుండ
దాన లోకములకు నానంద మయ్యెడు
నింతె కాదు విను మొకింతలోన. 82

మ. విను మీనాఁటికి రెండునాళ్ళపయి దోర్వీర్యం బవార్యంబు గాఁ
గనిఁ జాణూరుని ముష్టికాసురుని మల్లాధీశులం దొట్టి వా
రిని మర్దించుట కాక కాకమెయి నార్వేరంబునం బట్టి కం
సుని హింసించి కలంచి త్రుంచెదు జగచ్ఛోభావహం బయ్యెడిన్. 83

వ. అనంతరంబ. 84

సీ. అవల నరక ముర యవన శంఖాదులు
హతు లగుదురు నీదునాహవమున
వీర్యశుల్కంబుగా వీగకన్యాపరి
గ్రహము చేసెదవు లోకంబు మెచ్చఁ
బొనరింతు నృగశాపమోక్షము వృషు నోర్చి
పారిజాతము దెత్తు ధారణికిని
బ్రాహ్మణపుత్రుల బ్రదికింతు నంతలో
ద్వారక నిర్మింతు వార్ధినడుమ

తే. అంతఁ బౌండ్రక శిశుపాల దంతవక్త్ర
ప్రభృతు లెల్లరు నీచేత రాలఁ గలరు
భూమిభర మెల్ల హరియింతు భూరి తేజ.
పోయి వచ్చెద నని చెప్పి పోయె దివికి. 85

ఉ. ఆగతి నారదుం డరిగినంతట గోపకు లొక్క రేపునన్
గోగణయుక్తులై వనులకుం జని శైలశిలాంతరంబునన్
దాఁగురుమూఁతలాడుటకుఁ దార్కొని రొండొరు నందుఁ గొంద ఱా
లో గడిదొంగలుం బ్రభువులుం గనుపట్టఁగ నైరి క్రీడఁగన్. 86

—♦ వ్యోమాసుర సంహారము ♦—

ఉ. కొందఱు మేషవేషములు గొంచు మెలంగ నిలాయనంబు నా
గం దగు నాటలోఁ దెరవకాం డ్రలగొల్లల దొంగిలింతు రీ
తొందరలో మయాసురసుతుం డగువ్యోముఁడు వచ్చి గోపుఁడై
కొందఱి దొంగ నే ననుచుఁ గొంచుఁ జనెన్ రయ మావహిల్లఁగన్.

ఆ. అట్లు వాఁడు నల్వు రైదుగు రొక్కర గాఁగ
నెల్ల నల్లవులను నెత్తికొంచుఁ
నరిగి యొక్కకొండ దరిఁ బెట్టి తన్ముఖ
మందు ఱాతిపలక నడ్డు పెట్టె. 88

వ. ఇట్లు మాటికిం జేయుచున్న వాని నెఱింగి శ్రీకృష్ణభగవానుండు మృగరాజంబు వృకంబునుం బోలె నెట్టనం బట్టెఁ బట్టినంత బలవంతుం డగు వాఁ డొక్కపర్వతంబువలెనై పట్టు దప్పించుకొనం బ్రయత్నించె నంతలోనఁ గృష్ణుండును. 89

ఉ. చేతులరెంట నాఖులునిఁ జిక్కఁగఁ బట్టియు నొక్కి నొక్కి పెన్
ఱాతను బెట్టి కొట్టెను శిరం బది డంబటి నూఱు వ్రయ్యలై
భూతలమందు నల్గడలు ముంచుచు మించిన నెత్తుటితోఁ బడెన్
బ్రీతి మెయిన్ దివిం గనుచు వేల్పులు మే లని మెచ్చుచుండఁగన్.

వ. అట్లు వ్యోమాసురుం బరిమార్చి గుహ నున్న గోపాలురం దెచ్చి వియచ్చరస్తూయమానుండై యెల్లరం గూడి గోకులంబునకుం జనియె నంత నక్కడ నక్రూరుండు నా రాత్రిం గడపి మఱునాఁ డరుణోదయంబున లేచి కాల్యకరణీయంబులు నిర్వర్తించుకొని స్యందనం బెక్కి నంద

♦ నిలాయనంబు=దాఁగుడుమూఁత.

గోకులంబునకు బయనంబై పోవుచు మార్గమధ్యంబున భగవద్భక్తిభరితుం డగుచుఁ దనమనంబున. 91

— అక్రూరుఁడు వ్రజంబునకు వచ్చుట —

శా. ఏజన్మంబున నెట్టిభద్రములు నే నీక్షించి యున్నాఁడ నో
యేజాడం దప మాచరించితినొ యేయేపుణ్యకార్యంబులన్
నేఁ జేయం గలవాఁడ నైతినొ కడు న్నిష్ఠాగరిష్ఠుండ నై
యీజన్మంబునఁ గృష్ణదర్శనము నా కీనాఁడు గా నుంటకున్. 92

మ. *విషయాసక్తుఁడ నై యజస్ర మధికావిద్యాప్రవాహంబునన్
వృషలుండై పడి పోవు నా కిపుడు సద్వేద్యంబు హృద్యం బు నై
వృష గా గొప్పెడుకృష్ణవిగ్రహము దర్శింపంగ నా కయ్యెఁ గ
ల్మష మెల్లం గడ తేఱె ధన్యుఁడను నే మాన్యుండఁ జర్చింపఁగన్. 93

ఉ. ద్రోహము సేయ నెంచి హరిఁ దోడ్కొని ర మ్మని నన్నుఁ బుచ్చె నా
మోహనిమగ్నుఁ డాదురితమూలుఁడు లోలుఁడు కంసుఁ డైన నా
శ్రీహరిపాదపద్మములసేవ లభింపఁగఁ జేసె నాకు సం
దేహము లేదు కంసుఁడు మదీయసఖుం డని చెప్ప నొప్పదే. 94

మ. సుకపోలంబు సునాశికంబు స్మితసంశోభ్యంబు నీలాలక
ప్రకరభ్రాజిత మభ్రుతప్రసమనేత్రంబై మనోజ్ఞంబు నై
సుకుమారం బగువాసుదేవముఖ మేఁ జూడం గల న్నాకు మేల్
శకునం బయ్యెఁ బ్రదక్షిణంబుగఁ గడన్ సారంగముల్ వాఱెడిన్. 95

చ. భువనమనోహరంబు బుధపుంగవపుణ్యపదంబు దర్శనో
త్సవజనకంబు లక్ష్మికి సతంబు నివాసము నై త్రిలోకసం
స్తవసదనంబు రూపమును దాల్చినశ్రీహరిఁ గొల్వఁ గల్గు నా
దవుజననంబు పావన మహా యిఁక నేను కృతార్థజన్ముఁడన్. 96

తే. రథము దిగినంత నే నేను రామకృష్ణ
దర్శనము చేసి పాదపద్మముల కెరగి
పిదపఁ దత్సఖు లగువారిపదము లంటి
మనమునన్ మహదానంద మనుభవింతు. 97

---

*వృషలుండు=పాపాత్ముఁడు; (ఇది మూలభిన్నము)

సీ. అరిగి నేఁ గృష్ణునియంఘ్రిమూలంబున
వ్రాలిన నతఁ గృపాస్వాంతమునను
హానుల కభయప్రదానం బొసంగెడు
హస్తము నిలువు నామస్తకమున
నే హస్తపద్మమం దెపు డర్ఘ్యం మొసర్ప
బలికి నిందుత్వకు సంపదలఁ గూర్చె
నది సాధుపూజల నఖిలంబునుం బొంది
నాపాపముల నెల్లఁ బాపఁ గలదు
తే. భువనభారాపనోదార్థ మవతరించి
సకలదేవాభివంద్యుఁడై సాత్వతేయుఁ
డైనశ్రీకృష్ణభగవానుఁ డస్మదీయ
వాంఛితము లెల్లఁ దీర్చెడు వాఁడ యగును. 98
శా. న న్నాకంసునిదూతగాఁ దెలిసినంతన్ శత్రుభావంబు భా
వౌన్నత్యంబునఁ దా వహించు నని నాస్వాంతంబు శంకింప దా
పన్నేష్టార్థహరుం డతండు సకలప్రాణ్యంతరాస్థానసం
పన్నుం డవ్యయుఁ డచ్యుతుండు కను నన్ బ్రజ్ఞానేత్రంబులన్. 99
ఆ. అంఘ్రిమూలమునఁ గృతాంజలినై యున్న
నన్ను సస్మితేక్షణములఁ గరుణఁ
జేసి చూచినప్డు నాసర్వకల్మష
ములు నశించు నంచుఁ దలఁచుచుంటి. 100
మ. తనవంశంబునఁ బుట్టి స్నేహితుఁడనై దైవంబు వేఱొండు లే
డనుచిత్తంబున నున్న న న్నెఱిఁగి గాఢాలింగనంబుం బొన
ర్చును శ్రీకృష్ణుఁడు దాన నేను జరితార్థుండై భవాధు ల్తెగన్
ఘనని ర్వాణపదంబు నొందుదును నిక్కంబు నిందు నియ్యంతయున్.
క. అతఁడు తాతా! యని సం
ప్రీతిన్ ననుఁ బిలిచి వినయవినమితగాత్రుం

డై తగిలియున్న నాపైఁ
జేతుల నిడి పలుకుఁ గరుణఁ జేసిన ఘనదీశున్. 102

తే. ఆతనికి లేడు ప్రియుఁడును నప్రియుండు
ద్వేషియును మిత్రుఁడును లేడు వేఁడుకొనిన
భక్తులకు నెల్ల కోర్కులు వరుసఁ దీర్చు
సర్వలోకశరణ్యుఁ డాసాత్వతుండు. 103

క. తనవంశసంభవుం డని
కని బలరాముండు నన్నుఁ గరుణామతియై
తనయింటఁ బెట్టుకొనుచున్
మన మలరం జేయఁ గలఁడు మాటలిఁ కేలా. 104

—◆ అక్రూరుఁడు రామకృష్ణదర్శనంబు చేయుట ◆—

వ. అని యిట్లు శ్వఫల్కతనయుం డగు నక్రూరుం డధ్వమధ్యంబునఁ దనలో
దాను బలుకుకొనుచు ననేకవిధంబుల నాలోచించుచున్నంతలోన
లోకబాంధవు నిరథం బస్తాద్రి దరియం జేర నక్రూరునిరథంబు గోకు
లంబుఁ దరియం జనియె నంత నాప్రాంతంబున. 105

చ. సలలితగోష్ఠభూనికట సన్నుతభాగసమాహితంబులున్
హలకులిశాదిరేఖల సమంచితముల్ హరిపాదచిహ్నముల్
ఫలకవినిర్మితంబు లయి భాసిలుచిత్రములో యనన్ ధరా
కలితవిభూషణంబు లయి కానఁగ వచ్చెను వాని కచ్చటన్. 106

క. కని రథము డిగ్గి సంభ్రమ
మున నక్రూరుండు రోమములు గఱుపొడువన్
గనుఁగొనలన్ హర్షాశ్రువు
లనవరతముఁ జాలువాఱ నానందమునన్. 107

క. చే మోడ్చి మోడ్చి వానికి
వేమాఱు నమస్కృతులఁ దడిపి వెస నద్దానిన్
మోమునఁ దాలిచి వెనుకం
బ్రేమాంచితభక్తి నెత్తి మ్రొక్కెను నొడల్. 108

వ. మఱియు నాస్థలంబుపైఁ దలవెట్టి వండుకొని పొరలి లేచి మఱియు నరదం బెక్కి సరయంబుగం జనుచు. 109

సీ. గోపాలురార! మీగోపతు లగువారు
బలకృష్ణు లెం దున్నవారొ చెపుడ
గోపికాజనులార! మీపాల నగువారు
బలకృష్ణు లెం దున్నవారొ చెపుడ
గోధేనుతతులార! మీధాత లగువారు
బలకృష్ణు లెం దున్నవారొ చెపుడ
గోష్ఠములార! మీకుం గూర్పు నగువారు
బలకృష్ణు లెం దున్నవారొ చెపుడ

తే. మార్గవృక్షములార యోమాన్యులార
నగరనిలయములార యోనగములార
పూతవాయువులార యోపుణ్యజలము
లార బలకృష్ణు లెం దున్నవారొ చెపుడ. 110

వ. అని యగపడినవాని నెల్ల నడిగికొనుచుం జనుచుండ నం దందుఁ గల చెట్లపైఁ గోతికొమ్మచ్చు లాడుకొనుచున్న గోపదారకు లీపాటికి వారు గోష్ఠముం జేరుకొందు రని చెప్పిన నప్పురుషుండు పురుషోత్తమ దర్శనాయత్తచిత్తుండై తత్తఱంపడి వడివడిం జని గోష్ఠంబునందు గోదోహనస్థానంబున. 111

సీ. నీలపీతాంబర నివహభృతదేహమువారి
ధృతిబర్హిపింఛదీధితులవారి
శ్వేతకృష్ణాకారచిరశోభ గలవారి
శరదంబుజేక్షణస్ఫూర్తివారిఁ
జిన్నారిపొన్నారిపిన్నవయసువారి
శ్రీనివాసము లైనచెవులవారి
నాజానుబాహువిరాజితు లగువారి
బాలేభవీర్యసంపదలవారిఁ

తే. కులిశవజ్రధ్వజాదిరేఖలఁ దలిర్చు
పదయుగంబులు గలవారి సదమలముఖ
కమలములవారి సుందరాంగములవారి
రామకృష్ణులఁ గాంచె నారాజసఖుఁడు. 112

ఉ. కాంచి రథంబు డిగ్గి వడిగా నడ సేయుచు రామకృష్ణపా
దాంచలమందు వ్రాలి పులకాంచితనేత్రుఁడు స్విన్నగాత్రుఁడై
యించుక మాటలాడుటకు నేని సమర్థత లేనివాఁడయై
కొంచెము సేపు కొయ్యవలె క్షోణిపయిం బడి యుండె నయ్యెడన్.

మణిమాలావృత్తము.
అక్రూరుని గృష్ణుం డాత్మం గొనియుంటన్
జక్రాంకితహస్తాబ్జం బాతనిపై ని
ర్వక్రక్రమ మొప్పన్ బర్వించి కృపాత్మన్
బక్రాంతపరీరంభం బేర్పడఁ జేసెన్. 114

వ. సంకర్షణుండును బ్రణతుం డగునక్రూరు నాలింగనమ్ము చేసికొని చేతితోఁ జేయి పట్టుకొని తమ్మునితోడం దనయింటికిం దోడుకొని పోయి స్వాగతంబు వలుకుచుఁ బాదప్రక్షాళనంబు గావించి వరాసనంబు నైచి మధుపర్కం బొసంగి పూజించె నచ్యుతుండు నతిథి గావున వానికి గోవును నివేదించి శ్రాంతుం డగుటం జేసి పాదసంవాహనంబు చేయుచు భోజనంబు పెట్టినంత రాముండు ముఖవాసనార్థంబు తాంబూలచర్వణంబు చేయించి గంధమాల్యాదిపరిమళద్రవ్యంబులు సమర్పించె నట్లు సమ్మానితుం డగునతనిం గని నందుం డిట్లనియె. 115

ఉ. క్రూరుఁడు కంసరాక్షసుఁడు కొంతయునం గృప లేనివాఁడ వై
హేతున నేమ్చు చెల్లెలిని నట్టిడుకం బొనరించి బావతో,
వారలబిడ్డలన్ నఱికి వైచినవాఁ డతఁ డుండ నోయి యక్రూరుఁడ మీకు సౌఖ్యమునకుం గుఱు రా! యని యెట్లు పల్కుదున్.

ఆ. కటికవాఁడు వాఁడు కంసుఁడు హింసకుం
డసువు లంది యుండు నంతవఱకు
మధుర నున్నవారు మఱి బ్రతికినట్టి కే
యే మనంగ వచ్చు నీశ్వరేచ్ఛ. 117

వ. ఇట్లు నందుని సూనృతవాక్యపరిప్రశ్నంబునను రామకృష్ణకృతసన్మానంబునను సభాజితుం డగునక్రూరుం డధ్వశ్రమంబు దీఱఁ బర్యంకంబున సుఖోపవిష్టుం డై యున్నంతఁ జెంతం జేరి కృష్ణుం డి ట్లనియె. 118

శా. ఆర్యా! కంసభయంబు మీ కగుట సౌఖ్యం బెంచ భద్రంబు మీ
కార్యావల్లభుఁ డిచ్చుఁ గాత మట దాయాదుల్ సఖుల్ బాంధవుల్
భార్యాపుత్రు లనామయుల్ కద యెటో ప్రాణంబులం దాల్చి యుం
డార్యుల్ నాతలిదండ్రు లే మనుచు నే వ్యాహారముం జేయుదున్.

క. నా మేనమామ యనియెడు
అమయయముకులమున. గంసుఁ డసనై యుండన్
క్షేమము మీకును మీ ప్రజ
కేమెయి లే దనఁగ నొప్పునే కద తండ్రీ! 120

మ. అకటా! నాతలిదండ్రు లిద్దఱును గారాగారమం దుంటకున్
సుకుమారుల్ సుతు లెల్లఁ గంసునసికిన్ జోఁకై మృతిం గొంటకున్
గకుబంతంబు లెఱుంగ నేనె కత మై కన్పట్టితిం జెట్ట నై
సకలాధుల్ సమకూఱుచుండుటకు నాసంభూతియే హేతువౌ. 121

తే. నిఖలసౌఖ్యములం బాసి నీచు లట్లు
కుతిల గుడుచుచు బందెలోఁ జితికి యుండఁ
గొడుకు నని చెప్పుకొనుచు నేఁ గూళ నగుచు
నిట్టు లుంటినిఁ జేతఁగా నట్టు లకట. 122

ఉ. కోరుచునున్న కోర్కి యొదవి కూడఁగ వచ్చినయట్లు నీ విటం
జేరఁగ వచ్చి తీశ్వరునిచే నిది మంచిది యౌట మిత్రమా
భూరికుతూహలం బిపుడు పొంపిరివోవుచు నుండె నిప్డు నీ
వీరహి నేఁగుదెంచుటకు హేతువు గల్గినఁ జెప్పఁ గోరెదన్. 123

వ. అని యడిగిన నక్రూరుండు నారదాగమనంబును బలరామకృష్ణజన్మ వృత్తాంతంబును యాదవవైరానుబంధంబు వసుదేవవధోద్యమంబును రామకృష్ణసంహారప్రయత్నంబును ధనుర్యాగమిషంబు జేసి దూతుండై తా నట వచ్చుటయు లోనగు నెల్ల వృత్తాంతం బున్న దున్నట్లు చెప్పిన విని మందహాసంబు గావించుచు రామకృష్ణులు తండ్రి యగు నందునిదిక్కు మొగంబై కంసాభిప్రాయం బంతయు నెఱింగించుటయు నందుండును గోపకులం గాంచి యిట్లనియె. 124

మ. మన మాకంసునియాగముం గనుటకున్ మాబిడ్డలం గూడి పో
వ నగుం గాన నుపాయనంబుల గ్రహింపం జెల్లు మీ రెల్లరున్
మన కున్నట్లుగ నేయి పాలు పెరుగున్ మండంబును న్వెన్నయున్
గొనిపో నొప్పును బండ్లతో ననుచు నాగోపాలురం బల్కుచున్. 125

వ. తాను దనకొడుకులం గూడి పోవం దలంచె నంత వ్రజంబునం గల గోపిక లెల్లరు మధురాపురంబునుండి రామకృష్ణులం గొనిపోవ నక్రూరుం డనువాఁడు వచ్చె ననియు వారు వానితోడం గూడి పోవ నుండిరనియు విని వాసుదేవవిరహంబు సహింపమిం జేసి వ్యథితహృదయలై రందుం గొందఱు. 126

—♦ గోపికలు కృష్ణప్రయాణము విని పరితపించుట ♦—

సీ. మిన్ను విఱిగి మీఁదఁ గ్రిన్నఁ బడినట్లు
నిట్టూర్పు పుచ్చుచు నిలువ నైరి
కొంద ఱనుధ్యానమం దప్రవృత్తులై
జగ మెఱుంగనియట్టి జడుల లైరి
మఱి కొంద ఱంగనామణులు ప్రియప్రేమ
వాకులు స్మరియించువార లైరి
కొందఱు గోపికల్ బృందావనమునందుఁ
వేణుగానము వినువిధికి నైరి
తే. కొందఱు నెలంత లాకృష్ణుసుందరగతి
చేష్టహావము భావము స్నిగ్ధహాస

మధికచరితము చింతించునట్టి రగుచు
విరహాతురలై దుఃఖవివశ లైరి. 127

వ. మఱియుం గొందఱు విధాతం దలంచుచు. 128

చ. ముదిమది లేనివాఁడ వయి పోతివి నీకు దయారసంబు లే
దదటునఁ జేర్చుచుం బ్రియుల నట్టె వియోగము గూర్చుచుందు నీ
ముదుసలిచేష్టితంబు లివి పొత్తుల బిడ్డలచేష్టితంబు ల
ట్లుదవద లయ్యెఁ గృష్ణు మొగ మారయకుండగఁ జేయుచుంటయో.

శా. ఓ రాజీవభవా! భవద్రచితమై యొప్పారు నీసృష్టిలో
సారం బైనప్రియాస్యముం గనుఁగొనన్ జక్షుస్సు లర్పించి మా
కీరీతిన్ హరియింప నుంటి వవి నీవెన్నంగఁ గ్రూరుండ వ
క్రూరాభిఖ్య వహించి వచ్చితివి మాగోపాలుఁ గొంపోవఁగన్. 130

వ. అని మఱియు వారు తమలోన. 131

ఉ. నందసుతుండు క్రొత్తలఁ గనం బ్రియ మందెను వానిసౌహృదం
బందదు కై క్షణార్ధమున నన్యగతం బగుచుండుఁ గావునన్
బందుగులన్ సుతాదులను బాసి స్వదాస్యము సేయుచున్నమ
మ్మందఱిఁ బ్రాణవల్లభుల నక్కట పీడఁ దలంచె వింటిరే. 132

మ. మధురాపత్తనవాసినుల్ సుదతు లస్మన్మానసేశానునిన్
మధుమంజూజ్జ్వలభాషితంబుల లసన్మందాక్షహాసంబులన్
బ్రధితాత్మప్రభవోక్తవిభ్రమములన్ స్వాధీనుఁ గాఁ జేసికో
విధుబింబాస్యుఁ డతండు గ్రామ్యుల మమున్ వీక్షింపఁగా వచ్చునే.

మ. విరహార్తిం గడు దుఃఖముం గుడుచుదేవీలోకముం దేర్ప కి
క్కరణిం బ్రాణముకంటెఁ బ్రాణ మగునీకంజాక్షునిం దూరగ
ద్వారికిం దోడ్కొనిపోవ వచ్చినయితం డక్రూరుఁడా క్రూరుఁడే
కరుణాహీనుఁడు నేతిబీర కెన యీశబ్దప్రాయం బారయన్. 134

మ. విగతార్ద్రాత్ముఁడు కృష్ణుఁ డారథముపై విచ్చేసె బంట్లక్కి పా
ర్శ్వగులై తొందరపెట్టుచుండిరి వ్రజావాసుల్ మునులైనఁ గా

దగు నం చాడరు వ్రేతలార మన కత్యంతంబు మార్పుంతనై
తెగ దెంపుల్ పొవరించునట్టి తెఱఁగుల్ దెల్లంబుగాఁ దోఁచెడిన్. 135

ఉత్సాహము. మనము పోయి కృష్ణురథము మాటి కడ్డగింత మా
తనిని విడిచి నిమిష మైనఁ దాళఁ జాల మమ్మరో
మనల భాగధేయ మెల్ల మాఱుపుంతఁ బెట్టెనన్
ఘనులు కులమువార లడ్డఁ గలిగి త్రిప్ప నుండినన్. 136

వ. ఇట్లు విరహాతుర లగు వ్రేతలు సిగ్గు విడిచి వలుకుచు నుచ్చస్వరంబున గోవింద దామోదర మాధవా యని రోదనంబు గావించుచుండ సూర్యోదయం బైనపిమ్మట. 137

— అక్రూరుఁడు యమునలో రామకృష్ణుల దర్శించుట —

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ తీర్చి య
క్రూరుఁడు మాధవుల్ కూరుచున్న
రథముసారథి యయి రథ్యపై నడపె నం
దాదిగోపకు లుపాయనములు గొని
శకటంబులం దెక్కి సరణిఁ బట్టిరి గోపి
కలు హరిచెంతకుఁ గదలి రాఁగ
ఘనుఁడు సేవకముఖమున నింతలో వత్తు
నని సాంత్వనోక్తుల నంపి పుచ్చె

తే. అతివ లరదంబు కేతన మగపడువఱ
కనఁగ నేటికి రథధూళి యరయవచ్చు
నంతవఱ కచ్చటన బొమ్మ లట్లు నిలిచి
మరలిరి నిరాశ లగుచు వీం డ్లరయుపొంటె. 138

తే. ప్రియతముం డగుకృష్ణుని ప్రేమపూర్వ
కోక్తులు స్మరించుచును వానియుచితకథలు
పాడుకొంచును దుఃఖము నాఁడు నాట
పాయ విడుచుచుఁ గాలముఁ ద్రోయు నైరి. 139

వ. అట్లు బలరామకృష్ణులు వాయువేగరథంబుతో నింతలోనఁ గాళిందీ నదిం బొంది జలోపస్పర్శనంబు చేసి పానీయంబు స్వీకరించి యట

నొక్క-చో శీతలవృక్షచ్ఛాయ నాశ్రయించి కూరుచుండి యక్రూరుం
డును వారి నామంత్రించి రథముమీఁదం గూరుచుండం జేసి తాను,
గాళిందీహ్రదంబునకుంజని యథాశాస్త్రంబుగస్నానమాచరించెనప్పుడు.

చ. మునిఁగి జలంబులన్ గనియె భూరికృపావితజిష్ణులన్ సనా
తనమునిముఖ్యరక్షణనితాంతసహిష్ణుల సర్వలోకపా
లనకరుణాతిరేకకుశలత్వచరిష్ణుల విక్రమప్రభా
వినమితజిష్ణులన్ వరభవిష్ణుల విష్ణుల రామకృష్ణులన్ 141

మ. కని యక్రూరుఁడు నివ్వెఱంపడుచు నీకంజాక్షు లాస్యందనం
బున నుండం గని యుంటి నిప్డు నదిలోఁ బొల్పొందఁగాఁ జూచుచుం
టి నటంచున్ వడి లేచి తేరిపయి సందీపింపగాఁ జూచి జీ
వనమం దుండుట భ్రాంతియో యనుచుఁ జేవన్ మున్గె నన్నీటిలోన్.

క. మఱియుం గన్గొనె నీటన్
సురలును గంధర్వవరు లసురులును సిద్ధుల్
శిరములు వంచి భజింపఁగఁ
బరఁగెడునీశ్వరునిఁ గృష్ణపరమాత్మ హరిన్. 143

వ. అంత మఱియును. 144

సీ. వేయిశిరంబులు వేయి పడగలు వేయి
మకుటంబులుం గల్గి మొనయువాఁడు
నీలాంబరము దాల్చి క్రాలెడువాఁడు తె
ల్లనిదేహకాంతులఁ దనరువాఁడు
చూపట్టె నాతనిచుట్లు వాఱినమేని
పైఁ బీతకౌశేయవసన మెసఁగ
ధరియించి నాలుగువరభుజంబులు గల్గి
చారుహాసముతోడి శాంతదృష్టి

తే. సుప్రసన్నసరోరుహసుందరాస్య
మును మనోహరనేత్రముల్ ఘనవిశాల

వక్షమును సుకపోలము పరిఢవిల్లఁ
గాంచెఁ గల్యాణమూర్తి సాక్షాత్కరించె. 145

మత్త. ముత్తియంబులపేర్లు కంకణముల్ కడెంబులు పోఁగులున్
నెత్తిపై ముకుటంబు చక్రము నీరజంబును దాల్చి చే
యెత్తి మ్రొక్కి సురేశ్వరుల్ భజియించుచుండఁగ లక్ష్మితో
నత్తమిల్లిన దేవదేవుని నక్రూరుఁ డట్టెఁడై. 146

వ. భక్తియుక్తుండై హృష్యత్తనూరుహుండును భావపరిక్లిన్నాత్మలోభ
నుండు నగుచు సాత్త్వికధర్మం బనుసరించి నిశ్చలచిత్తుండై శిరంబు వంచి
మ్రొక్కి కృతాంజలిపుటుండై గద్గదకంఠంబున ని ట్లని ప్రస్తుతించె. 147

—♦ అక్రూర స్తవ రాజము ♦—

శా. నీనాభీకమలప్రభూతుఁ డగుచు న్వాగ్గాంధులోకేశ్వరుం
డీనాల్గుం బడి లోకముల్ సలిపె నెంతే వింతమై నీసుతుం
డై నీ వెన్న సమస్తభూతతతి కత్యాధారభూతుండ వై
నానారూపుఁడవై చరింతువు జగన్నాథా! నినున్ మ్రొక్కెదన్. 148

తే. భూతపంచకాహంకారములు మహత్తు
మాయయు హిరణ్యగర్భుఁడు మనము నింద్రి
యములు నింద్రియార్థము లెల్ల సుమనసులును
గలిగినవి కావె నీమూర్తి వలన దేవ! 149

సీ. ఎవియు నెర్గవు గుణావృతుఁ డజుం డెఱుఁగఁడు
గుణరహితుని నిన్నుఁ గొంచె మేని
సాధిభూతంబును సాధ్యాత్ముఁ డగుమహా
పురుషు నెఱిఁగి యోగి పూజ సేయు
ద్విజులు కొందఱు నిను వివిధనామంబులఁ
దెలిసి యజింత్రు వేదులను దీర్చి
జ్ఞానులు శాంతులై సన్యసించియు నిన్ను
జ్ఞానయజ్ఞంబునఁ గాంచుచుంద్రు

తే. సంస్కృతాత్మలు కొందఱు శాస్త్రవిధుల
ననుసరించుచుఁ ద్వన్మనులై బహువిధ
రూపములనెల్ల భవదేకరూపము గను
మదిఁ దలంచి భజింతు రోహృదయనాథ. 150

క. శైవులు కొందఱు నిన్నుఁ
శైవాగమపద్ధతులను జర్చించి మదిఁ
దైవస్వరూపుఁ డంచున్
సేవించుచునుంద్రు భక్తిఁ జేసి ముకుందా. 151

ఆ. కొండయేళ్లు వాన నిండి నల్మూలల
నుండి చనియుఁ గడలి నొందు నట్లు
సరణు లెవ్వియైన స్వామి నిన్నంటఁగాఁ
జేయునట్టివ యని చెప్పు శ్రుతులు. 152

తే. నీదుప్రకృతిగుణంబయి నెగడఁ బడెడు
సత్వము రజస్తమంబు లాసరణిఁ జేర్ప
బడును బ్రహ్మాదిగాఁ జెట్లవఱకు నైన
జీవజాలము నిన్నవి చేర రావు. 153

దండకము. దేవాదిదేవా! మహాదేవ దేవా! భవద్రూప మెన్నంగలే
రెంతవారైన నీమోము దివ్యాగ్ని నీపాదముల్ భూమి నీచక్షువుల్
హేళి నీనాభి నాకంబు నీశ్రోత్రముల్ దిక్తతుల్ నీశరీరంబు దివ్యాంత
రిక్షంబు నీబాహుకోటుల్ సురేంద్రాదిదిక్పాలసంఘంబు నీకుక్షి
సంద్రంబు నీప్రాణముల్ వాయువుల్ నీలోకజాలంబు వృక్షౌషధుల్
నీవెండ్రుకల్ మేఘముల్ నీదుశల్యంబులుం గొప్ప లుర్వీధ్రముల్
నీనిమేషంబు లహ్నంబులుఁ రాత్రులుఁ నీదుపుంస్త్వంబు పంకే
జగర్భుండు నీవైనవీర్యంబు వర్షంబు సర్వంబు నీసుస్వరూపంబు
విశ్వాత్మ! విశ్వేశ! నీయందుఁ జంద్రేంద్రసూర్యాదిసర్వామరవ్రాత
ముల్ సర్వలోకంబులుఁ సర్వసత్వంబులుఁ నీటిలో నల్పజీవుల్

బలేక నిండి యుండుర విలాసార్థ మీలోకమం దీవు జన్మంబులం
బొంద లోకుల్ నినుం గొల్చి ధన్యాత్ములై మాన్యులై దుఃఖముల్
వాసి ముక్తిం గొనం గల్గుచున్నారు నిన్నేను సేవింపఁగా నేర
భావింపఁగా నోపఁ బూజింపఁగాఁ జాల నీచాతినీచాత్ముఁడన్ నన్నుఁ
బాలింపు మో దేవ! నీ కే నమస్కారముం జేసెదన్. 154

చ. నలువ దినాంతమందు శయనంబునకుం జని యున్నసంమునన్
జలములు పొంగి సర్వభువనంబుల ముంచుచు నుండ మత్స్యమై
ప్రళయపయోధిఁ జొచ్చి శ్రుతివర్గముఁ దెచ్చి ప్రపంచరక్షణం
బెలమినిఁ జేసినట్టి హరి కే నిదె చేతులు మోడ్చి మ్రొక్కెదన్. 155

తరళము. సురలు సంద్రము ద్రచ్చుచుండఁగఁ జొప్పు దప్పి మునుంగు మం
దరగిరీంద్రము నెత్తి వీపునఁ దాల్చి వేల్పులకున్ సుధా
వరరసం బిడి ప్రోచుకూర్మమువల్లభున్ శరణార్థినై
నిరతమున్ భజియింతు నెంతయు నీతి భూతియు రీతిగన్. 156

భుజంగప్రయాతము. హిరణ్యాక్షుఁ డెంతే యిలామండలంబున్
గరం బల్క మీఁజుం గయిం బట్టికొంచున్
సరస్వంతులోనన్ జనింపంగఁ బో సూ
కరం బైనవేల్పున్ గడుం భక్తిఁ గొల్తున్. 157

సుగంధి. క్రూరభీకరుండ డైయె సరోషుఁ డయ్యు భక్తునిన్
గోరి ప్రోవ స్తంభమందుఁ గొంతలోనె పుట్టి దు
ష్టారిశిక్షణంబు చేసినట్టి దేవదేవు శ్రీ
నారసింహమూర్తి యైననాదుతండ్రిఁ గొల్చెదన్. 158

మ. వడుగై యాచకుఁడై బలీంద్రుకడకున్ బాదత్రయిన్ వేఁడుచున్
వడిగా నింతటిలోన నింతయయి గ్రావంబంతయై వింత గాఁ
గడిమిన్ సర్వము నాక్రమించినజగత్కళ్యాణమూర్తిన్ శివం
బిడి రక్షింపు మటంచు వేఁడెదను నెంతే భక్తిభావంబునన్. 159

శ్యామలావృత్త.: ముయ్యేడు మాఱులు భూచక్రి మెల్ల
వెయ్యాఱు లెన్నఁగ వేధించి తేండ్ల

సయ్యాటగా నని సాఁగించి గెల్చు
కయ్యాలఁ గాంచిన కంజాక్షుఁ గొల్తు. 160

దోదకవృత్త. దేవత లెల్లరు దేవురు లాడన్
రావణుఁ జంపఁగ రాఘవుఁ డగుచున్
భూవలయంబునఁ బొల్పెసఁగెడు నా
దేవునిఁ గొల్చెదఁ దేరినమదిన్. 161

తే. ఖలుల వధియింప నైన సంకర్షణాని
రుద్ధ కందర్ప సాత్వతి రూపుఁ డగుచు
శిష్టరక్షణ మొనరింప క్షితిఁ దలిర్చు
కృష్ణభగవానునకు నిదే కేలు మోడ్తు. 162

క. దానవుల మోహపెట్టఁగ
మానవుఁడై పుట్టినట్టిమానాథునకున్
బూని కయిఁ గత్తి మ్లేచ్ఛులఁ
జానేసెడుకలికి కిడుదు సాష్టాంగంబుల్. 163

శా. నీమాయం బడి నేను నాది యనుచున్ దేహాభిమానంబునన్
భూమి న్మెట్టుచు మూఢబుద్ధి నగుచున్ మోహాంబునం జేసి ని
త్యామోదంబున నిర్వికల్పుఁ డగుచున్ స్వాత్మస్వరూపుండ వై
క్షేమం బిచ్చెడుని న్నెఱుంగ నయితిన్ జిత్త భ్రమల్ చేసుటన్.

ఉ. అట్టిఁడ నైననేను భవదంఘ్రిసరోజము నొందఁ గంటి నా
పట్టినదోష మైన నదిపాయఁగఁ జేయుచు భక్తకోటి లో
నట్టె పడంగఁ జేసి చరితార్థునిఁ జేయుము నేఁ బ్రపన్నుఁడన్
బట్టితి నీదుపాదమును బంకజలోచన! పాపమోచనా. 165

వ. అని యిట్లు పరిస్తుతించి ప్రార్థించు నక్రూరున కయ్యమునాజలంబున
నటుండు నాట్యమ్ము నంత బోలెఁ గృష్ణుండు స్వస్వరూపంబు చూపి
యంతలో నుపసంహరించె నంత శాంతాంతరంగుం డగు నక్రూరుండు
సత్వరంబుగ లేచి నిత్యకృత్యంబుల నిర్వర్తించుకొని విస్మయంపడుచు

వడి వడి రథంబుకడకుం జనుదెంచి జంకునం బోలెఁ గొంకుచు నిలిచి యున్నవానిం గాంచి కృష్ణుండు నవ్వుచు ని ట్లనియె. 166

క. నీట న్నేల న్నింగిన్
మేటివిచిత్రములు నీకు నేత్రద్వయికిన్
బాటింప నగుచుఁ దోచిన
వాటము నీయెడల నేను వగ నూహింతున్. 167

వ. చెప్పు మనిన న క్రూరుండు. 168

శా. ఎందేనిం గనవచ్చు చిత్రము ల వెన్నే నుండు నయ్యన్ని నీ
యందే చూడఁగ వచ్చె నా కిపుడు దేవా! నీకడన్ లేనివెం
దెందున్ లేవు నిజంబు చెప్పితిని నే నీక్షించుచున్నాఁడ నీ
యందే సర్వము నీవు విష్ణుఁడవు కృష్ణా! జిష్ణుసంసేవితా. 169

వ. అని పలుకుచు గాందినీసూనుం డగు నక్రూరుం డంతరంగంబున నభివందనంబు చేయుచు నొండాడ నేరక రథం బెక్కి రథ్యంబులపగ్గంబులు వట్టి చోదనంబు గావించె రథంబును నానాదేశంబు లతిక్రమించుచు సాయంసమయంబునకుమధుర బాహ్యోద్యానంబుకడకుం జేర నరిగినంత.

సీ. బలరామకృష్ణు లావనమార్గమునయందు
వివిధదృశ్యంబులు వేడ్కఁ జూచి
రట వారిరాక కుద్యానవనమునఁ బ్ర
తీక్షించునందాదు లెలమిఁ గనిరి
వీరు వారిం గూడి వేడుకం దేలి ర
క్రూరునిహస్తము శౌరిపట్టి
యీవు రథమ్ముతో నేగుము మునుమున్ను
మాపు మే మిట నుండి రేపకడన
తే. పురము చేరెద మనుటయుఁ బూజ్యుఁ డతఁడు
భక్తుని న్నన్ను విడిచి పోఁ బలుక నగు నె
యీవు నీయన్న తండ్రియు నెల్లరుమ మ
దీయ గేహమునకు రాఁగఁ జేయుదు నుడి. 171

సుగంధి. మాగృహంబునందు మీరు మాపు నిల్చి మీపదా
బ్జాగతోల్లసత్పరాగ మంటఁ బూతమై మహా
భాగధేయయుక్తమైనభాతి నాదువంశమున్
యోగయుక్తమైనయట్టు లోజ సల్ప వేఁడుదున్. 172

సుకలవృ. బలి మున్ నీదగుపాదము భక్తి మెయిం గడుగన్
బలభిత్సన్నుతవైభవ బంధుఁడు న్నిజభ
క్తులలో నుత్తమభక్తుఁడు కోవిదవర్యుఁడు నై
వెలిఁగెన్ న న్నటు సేయగ వేఁడుచునుంటి నెదన్. 173

కలికివృ. నీదు పాదజలము నిరతపూతమయ్యె
మీఁదఁ గ్రింద నగుచు మెఱయు లోకములన్
బ్రోదిగా విమలతఁ బొందఁల జేయుశివుం
డాదరమ్మునఁ గొను నవి శిరంబు పయిన్. 174

తే. అనుఁడు భగవంతుఁ డగుకృష్ణుఁ డనియె బలుని
తోడఁ జని నేను యదుకులద్రోహి యైన
కంసుఁ బరిమార్చి పయి నీనికాయమునకు
వత్తును సుహృత్ప్రియంబుఁ దీర్పఁగఁ దలంతు. 175

వ. అని యిట్లాదేశించిన నక్రూరుండు విమనస్కుండు వోలె ననుజ్ఞాతుండై కదలి పురప్రవేశంబు గావించి కృష్ణాగమనంబు కంసున కెఱింగించి స్వగృహంబునకుం జనియె నంత నటఁ గృష్ణుండును సంకర్షణాన్వితుండై గోపాలపరివారంబు పరివేష్టింప నపరాహ్ణంబున మధురాపురంబునం బ్రవేశించె నదియును. 176

— రామకృష్ణులు మధురానగరవీథి విహరించుట —

సీ. గోపురోన్నతకవాటోపశోభితమును
స్వర్ణతోరణమణిస్తంభకలిత
మారకూటవికారభూరిగోష్ఠంబును
గంభీరపరిఘాప్రకల్పితంబు

నున్నతోన్నతవప్రియోజిత ముద్యాన
వనవిరాజితము దివ్యధ్వజంబు
భర్మహర్మ్యావృతబహుళవీథిసమ
లంకృతము సువర్ణలాంఛనంబు
తే. కాంచనవికారబహులశృంగాటకంబు
సిక్తరథ్యాపణేతరచీర్ణరజము
వజ్రికాంతివిశాలచత్వరము భవ్య
దేవతాయతనాతిసందీపితంబు. 177

తే. దధియుఁ బన్నీరమును సుచందనము వీథు
లందు నిచ్చలు చల్లుదు రందు నందుఁ
బండ్లు పూవులు నమ్మువిపణులు మీఱి
నేపు మీఱెడు నామధురాపురంబు. 178

మత్త. రాజమార్గమునుండి కృష్ణుఁడు రాముఁడుం జనుచుండఁగా
రాజధాని వసించు కాంతలు రమ్యసౌధము లెక్కి నీ
రేజలోచనయుగ్మముల్ బహురీతులన్ విపులంబులై
తేజరిల్లఁగఁ జేయుచున్ వినుతించుచుం గని రత్తఱిన్. 179

సీ. మణివిభూషణవస్త్రసహితవస్తువులు కొం
దఱు విపర్యయముగాఁ దాల్చి మేన
నొకకాలికందియ యొకకంటికిం గాటు
కను గొందఱు ధరించి మన మెఱుఁగక
భుజియించుచును వీడి భోజనపాత్రి మొం
గిలిచేతనే యేగఁ గలిగి కొంద
ఱభ్యంగనస్నాన మాచరించుచు నీళ్ళు
గాఱెడు మేనులు గలుగఁ గొంద
తే. ఱాత్మగేహాంతికంబున కరుగుదెంచు
నట్టిశబ్దము చెవిఁ బడునంతలోన

లేచి చని చూచి రవ్వేటిలేమ లెల్ల
రామ కృష్ణుల నెంతయుఁ బ్రేమ మీఱ. 180

చ. దళదరవిందసుందరము ధాళధళంధళదీప్తిమత్ప్రభో
జ్జ్వల మగుమోముననే స్మితము జంపులు ద్రొక్కుచు నంద లేఁతచూ
పుల జలజాక్షుఁ డా చెలుల మోహసముద్రమునందు ముంచుచున్
బాలఁతు లోకం జెలుంగమిని బొమ్మలు గాఁ గను చుండి రత్తఱిన్.

చ. వినుకలిఁ జేసి మోహమును బెంచెడుమోహనమూర్తి నాతనిన్
గనుకలినప్పు డొం డరయఁ గానక మానసమందు నాహరిన్
గొనకొని నిల్పుకొంచుఁ గడుకోరిక లీరిక లెత్తఁ గౌఁగిటం
దనుపుచు నాథు లన్నియును దర్శి చనం బొలుపొంది రత్తఱిన్. 182

తే. మేడలన్ నిల్చి మోఁతలు మేదురముగఁ
రామకృష్ణులపైఁ బూలు రమణ మెఱయఁ
జల్లి రంతి ద్విజాళు లక్షతలు పూలు
పెరుగు చల్లి పూజించి రాపురుషవరుల. 183

వ. అంతఁ గొంతలోన. 184

చ. రజకుఁడు రాజ వస్త్రముల రంగులు వేసెడువాఁ డొకండుత
ద్విజపిముఖంబునందుఁ జనుదారిని గన్గొని చాకి యోరి నీ
రజములు వస్త్రముల్ దొడుగ రాగిలుఁ జిత్త మొసంగు మాకు నీ
భుజమున నుష్ణముల్లి నగుఁ బొమ్ము శుభమ్మగు నీకునావుడున్.

క. మదమత్తుఁ డైనచాకలి
మదిరాపానమున వివశమాననుఁ డగుచున్
మది నలిగి కంసభృత్యత
నదటున ని ట్లనుచుఁ బలికె సాక్షేపముగన్. 186

చ. అడవులఁ గొండలం దిరుగునట్టిరు మీ రెప్పు డేని యిట్టినేల్
తొడవులు చూచి యుండ రివి దోర్బలశాలి నరేంద్రువిత్తముల్
జడమతులై యొసంగు మని సాహసులైతిరి రాజభృత్యు లీ
నుడి విన మిమ్ము బట్టెదరు నొవ్వఁగఁ గొట్టెద రేఁగుఁ డీ రెటో

ఆ. అనినఁ గోపితాత్ముఁ డై హరి చాకలి
దరియ వచ్చి వానితలను వేఁ ని
నుండి వేఁ ఱు పడఁగ నొక్క వ్రేల్మిడి నొనర్చె
వాని యనుచరాళి పఱచె నపుడు. 188

—• బలరామకృష్ణులు వాయకాదుల ననుగ్రహించుట •—

వ. అంత బలరామకృష్ణు లాచాకలిమూట నుండి తమకుఁ గావలసిన వస్త్రంబులు దీసి కట్టుకొని తమవారికిం గట్ట నిచ్చి శేషవస్త్రంబుల నెల్ల పాఱవైచి పోవుచున్నప్పు డొక్క చో నొక్క వాయకుండు. 189

మ. బలరామాచ్యుతు లన్ని జాంతికమునం బాఱంగ నీక్షించి మ్రొ
క్కులు చెల్లించుచుఁ దోడుకొంచుఁ జని యోగోపాలురారా! ననుఁ
ఖలునిఁ ద్రోవఁగ వచ్చినా రనుచు నానాచిత్రవర్ణంబులన్
గలవస్త్రాభరణంబు లిచ్చి కొలిచెన్ గాఢానుమోదంబునన్. 190

ఆ. తెలుపు నలుపువర్ణముల నొప్పునవ్వస్త్ర
మాలికల ధరించి మాధవు లట
మదకలంబు లట్లు పొదలుచు నాతంతు
వాయు నెడలఁ గరుణ వఱలఁ జేసి. 191

క. వానికి సకలైశ్వర్యము
లీనరలోకమునఁ గలుగ నిచ్చియు వరమున్
మానుగ సాయుజ్యం బా
పైఁ నొనరెడునట్లు పలికి వా రలు పిదపన్. 192

మ. లలి వేంచేయుచు వారు సుదాముఁ డనుమాలాకారునిన్ జేర రాఁ
గలయం గన్గొని వాఁడు వారి కెమ్మరై కావించి చేమోడ్చి నా
యిలు పూతం బగునట్లు చేయుఁ డని యెంతే భక్తిఁ బ్రార్థించి వా
రలఁ దోతెచ్చి సపర్యలం బొనరిచెం బ్రత్యక్షదైవస్ఫురన్. 193

తే. అర్ఘ్యపాద్యాదివిధులతో నతఁడు వారి
కతివిచిత్రము లగుపుష్పహారముల నొ
సంగి గంధానులేపన మంగకముల
సలిపి తాంబూల మిడి యిట్లు సలిపె వినతి. 194

సీ. ఓహో హృషీకేశ ! యోస్వామి ! నాజన్మ
మిది సార్థకం బయ్యె నిందిరేశ
మీయాగమనమున నాయన్వయము పూత
మయ్యె నాపితరుల కబ్బె గతులు
దేవర్షు లానందభావు లై నను మెచ్చి
రీరె విశ్వమునకుఁ గారణంబు
లోకావనార్థమై యీకరణి జనించి
రోకృష్ణ బలరామ యోరమేశ

ఆ. మీరు సర్వసములు మీ కిష్టుఁడు ననిష్టుఁ
డనఁగ నొకఁడు లేఁడు కనుఁగొనంగ
నేను గింకరుండ నేమి యాజ్ఞాపింతు
రది ఘోనర్ప నెంతు నాత్మయందు. 195

వ. ఇట్లు వినుతించుచు సుదాముండు మఱియు ననేకవిధపుష్పదామంబు
లచే బలరామకృష్ణుల నలంకరించిన వారు వానిం గారవంబునం గాంచి
వరంబు లొసంగెద మర్థింపు మనిన నతండు కృతాంజలియై వారి
కి ట్లనియె. 196

క. మీపై స్థిర మగుభక్తియు
నాపై నీభక్తులందు నతిసౌహార్దం
బేపట్ల భూతదయయును
బ్రాపించెడునట్లు సేయఁ బ్రార్థింతు మిమ్ముల్. 197

వ. అనిన నట్ల కాక యని సుదాము ననుగ్రహించి మఱియు నాయురా
రోగ్యైశ్వర్యాభివృద్ధి యగునట్లును వరంబు ప్రసాదించి వానియింటి
నుండి వెడలి రాజపథంబున విహరించుచుం బోవువా రెదుట దివ్య
గంధానులేపనభాజనంబుం గొని వచ్చెడుదానిఁ గుబ్జయు వరాననయు
యువతియు నగుదానిం గని నవ్వుచుఁ గృష్ణుం డి ట్లనియె. 198

— ♦ శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట ♦ —

ఉ. ఎవ్వతె వీవు సుందరి యె కేఁగెదు నీకడ నున్న లేపనం
బెవ్వనికై గ్రహించికొని యేఁగుదు చెప్పుము మా కొకింత యీ
నెవ్విధ మైనసందియము నే నగు నే వచియింపు మిచ్చి తే
నవ్వల నీకు శ్రేయ మగు నంచు వచించినఁ గుబ్జ యి ట్లనున్. 199

తరువోజ. అనులేపకర్మము నందుఁ బ్రవీణ
నై కంసునకు దాసి నై యుంటి నన్ను
జనులు త్రివక్ర యన్ సార్థకం బైన
సంహూతిఁ బిలుతు రోసాత్వతనాథ!
కన మీరు గాకేరు గలరు నా చేతి
గంధలేపనమును గైకొంట కనుచుఁ
గనుల నవ్వుచును గ్రీగంటఁ గన్గొనుచుఁ
గైకొనుఁ డని యిచ్చె గంధలేపనము. 200

వ. ఇచ్చినం బుచ్చుకొని రామకృష్ణు లయ్యంగరాగంబు హృదయంబులం బూసికొని ప్రకాశించి రప్పుడు ప్రసన్నుం డై భగవానుం డగు శ్రీకృష్ణుండు కుబ్జ యను త్రివక్రను నిజదర్శనభాగ్యంబునం జేసి ఋజుదేహం గలదానిగం జేయ నెంచి దాని సమీపించి. 201

చ. ప్రపదములందుఁ బాదములు పై నిడి చక్కఁగఁ ద్రొక్కిపట్టి వ్రే
ళ్ళపుడు సమున్నతంబులుగ హస్తములం జుబుకంబు వట్టి యొ
క్కపరి రయంబునం బయికిఁ గా నెగ నెత్తి విడె న్విడంగ నా
విపులను జేసె మె ర్మనఁగ వేడుకఁ గూర్చెఁ ద్రివక్ర చక్కనై. 202

ఉ. చారుపయోధరంబులును సన్నసికొనును గొప్పకొప్పు రం
భోరువులున్ విశాలకటియున్ వరశంఖగళంబు సుందరా
కారము గల్గి లక్ష్మి యనఁగాఁ గన నై ధరణీతలంబు సు
స్మేరరుచిన్ వెలుంగునటు చేయుచుఁ గుబ్జ నతోత్తమాంగియై. 203

వ. రూపగుణౌదార్యసంపన్నయు నాసన్నయు నై చేలాంచలము చేతఁ బట్టుకొని కృష్ణునిదెస దృష్టి నిగిడించి నవ్వు మొగంబున ని ట్లనియె.

తే. రమ్ము నాయింటి కిచట ని ష్టమ్ము వైచి
పోవఁ జాల నోకరిత నోపురుషసింహ
కలఁచితివి నామనంబు నిక్కరణి నింక
నాయెడఁ బ్రిసన్నుఁడవు గమ్ము నతి యొనర్తు. 205

వ. ఇట్లు రామగోపాలురు వినుచుండం బలికినఁ త్రివక్రం గాంచి నవ్వుచు నవ్వనజనాభుండు శోభావతి నే నిట సాధితార్థుండ నై నీగృహంబునకు వచ్చి పోయెద నిప్పటికి నీవు పొమ్మని యంపిపుచ్చి రామసహితుండై రాజమార్గంబు వట్టి చనుచు వణిక్పథంబునఁ దాంబూలసగ్గంధాద్యుపాయనంబు లందుకొనుచు నందందుఁ గలవారి ధనుస్థానం బెక్కడ నున్న దని యడుగుచుం గొంత వడికి ధనుర్యాగశాలం బ్రవేశించి యం దింద్రధనుర్వరంబునుం బోలి బహుపురుషగుప్తంబును మహారాజార్చితంబు నగుయాగధనువుం గాంచి రక్షకభటులు వలదు వల దని వారించుచున్నను వినక బలాత్కారంబు గా. 206

—◆ శ్రీకృష్ణుండు యాగధనుర్భంగము గావించుట ◆—

ఉ. వామకరంబునం ధనువు వట్టి విలాసము వోలె నెత్తియుఁ
దీమస మేర్పడంగఁ బెర దిక్కులు జూచుచు నెక్కువెట్ట ఝుం
ఝూ మను నట్లు టంకృతిని సల్పుచు జానుగుఁ జేర లాగుచుఁ
భూమి ధరంబు వ్రీలునటు భూరిరవంబున విర్గె రెండుగన్. 207

క. ఖండేక్షుదండముం గరి
ఖండించినకరణి యజ్ఞ కార్ముకమును కృ
ష్ణుం డట్లు రెండు చేసిన
నిండెను శబ్దమ్ము నేల నింగియు మ్రోయన్. 208

ఉ. ఘాతుకు లైనరక్షకులు కార్ముక మట్లు హానర్చినందునన్
జేతములందుఁ గ్రోధ మది చెప్పఁగ రానటు లుప్పతిల్లఁ గా
నీతఁడె వీని నేఁడకు నేగఁగ నీయక పట్టి కొట్టుఁ డం
చాతతశౌర్య మేర్పడఁగ నందఱు చుట్టిరి రామకృష్ణులన్. 209

ఆ. కినిసి దాన రామకృష్ణులు తమవయిఁ
బడఁగ నున్నవారిఁ బాటఁ జూచి

ఖండింపఁబడిన ధనువు ఖండంబులం గొని
చెండి వైచి రెల్ల సేన నపుడు. 210

వ. ఇట్లు కంసప్రేషితం బగు సేన నంతయుం జానేసి శాలాముఖంబు నుండి వెలువడి పురసంపదం జూచి సంతసించుచు నిరర్గళప్రచారంబునం బౌరుల కచ్చెరుపాటు వాటిల్లం జేసి సూర్యుం డస్తమించుట నెఱింగి పురబాహ్యోద్యానంబునఁదమవారలున్న శకటస్థానంబునకుం జనిరంత.

చ. విరహముచేతఁ దొట్రుపడి వ్రేతలు తమ్మెడఁబాసిపోవు న
త్తరుణమునందు నచ్యుతుఁ దర్శనభాగ్యముకల్మి నేఁడు మా
ధురతరుణీజనంబులకుఁ దోఁచెడుఁ బబ్బ మటంచుఁ దద్వచో
గరిమము తారకాణ మయి కానఁగ వచ్చెను సత్యసంగతిన్. 212

వ. రామకృష్ణు లట్లు విడిదకుం జని పాదప్రక్షాళం బాచరించి క్షీరాన్నంబు భుజించి కంసచికీర్షితం బెఱింగి నాఁటిరేయి సుఖనిద్రం గావించి రంత నక్కడ కంసుండు రామకృష్ణులు వచ్చి ధనుర్భంగంబు చేయుటయు రక్షకసైన్యముఁ గాసి చంపుటయు విని రాత్రి పల్యంకంబున శయనించియు భయంబు పెంపున దీర్ఘప్రజాగరంబు చేయుచు మృత్యుదేవతకు దౌత్యంబు గావించు ననేకవిధదుర్నిమిత్తంబులం గనియె నవి యును. 213

—• కంసునకు దుర్నిమిత్తము లగుట •—

సీ. తనప్రతిరూపము నను దల లేనట్లు
గానవచ్చుట యొకం డైనచంద్ర
సూర్యాదిబింబముల్ చూడ రెం డయి యుంట
తననీడయందు ఛిద్రప్రతీతి
చెవులు మూసిన ప్రాణరవ మది వినరామి
స్వర్ణప్రతీతి వృక్షముల నగుట
స్వపదంబు లవి కానఁబడకుంటయును గలఁ
బ్రేతను గౌఁగింటఁ బ్రీతి నిడుట

తే. గర్దభము నెక్కుటయు తమ్మికాడఁ దినుట
దిసమొల మెలంగుటయు నూనెఁ దేలుటయును

నలదమాల బూని యొకండు వెలలు టాది
యైనబహుదుర్నిమిత్తంబు లతని కయ్యె. 214

తే. నిద్ర జాగ్రదవస్థ నీమూాద్రి యైన
దుర్నిమిత్తము లెన్నని శోచుచుండ
భోజకులపాంసనుఁడు చావు మూఁడు ననెడు
భయమునను నిద్ర నొందనివాఁడ యయ్యె. 215

వ. ఎట్టకేలకు సూర్యోదయం బయినపదంపడి కంసుండు మల్లక్రీడామహోత్సవంబు ప్రకటించె నప్పుడు. 216

మత్త. మల్లరంగ మలంకరించిరి మంచముల్ నలుమూలలన్
మొల్లమై నిలుపం బడెన్ ధ్వజముల్ సహస్రము లెల్లెడన్
దెల్ల పూానటు గ్రాలఁ గట్టిరి దివ్యపుష్పసుగంధముల్
ఫుల్లసారసమాలికాశతముల్ సమంతముగా నటన్. 217

సీ. వరుసలు తీరి చూపట్టుమంచంబులఁ
బౌరులున్ మఱి జానపదులు నిలిచి
రున్నతాసనముల నుండిరి రాజులు
కంసుఁ డమాత్యసంకలితుఁ డగుచు
మండలేశ్వరరాజమధ్యగతుం డయి
దివ్యాసనంబునఁ దేజరిల్లె
మల్లతాళధ్వను లెల్లెడ మ్రోయుచోఁ
దూర్యముల్ మొరసె నవార్యముగను

తే. అంతఁ జాణూరముష్టికు లాశలుండు
తోసలుండును లోనగుదొడ్డమల్లు
లెల్ల రంగస్థలంబున నేపుమీఱు
వల్లువాద్యధ్వనుల్ వినువార లైరి. 218

క. నందాదు లైనగోపకు
లందఱు దరిసెనము లిచ్చి యాతంగమునం

దుం దనరు నేకమంచము
నందుం గూర్చుండి రవ్వ డెంతయుఁ బ్రీతిన్. 219

— శ్రీకృష్ణుఁడు కువలాపీడ మనుగజమును సంహరించుట —

ఉ. అంతట రామకృష్ణులు కృతాహ్నికకృత్యులు మల్లరంగమం
దెంతయు మ్రోయుదుందుభుల నేర్పడుశబ్దము వించు నంతలోఁ
గొంతనరాసిసంతసము గొండఁగ రాఁ గనునిచ్చ పెంపునన్
స్వాంతము వేగిరించుటను వచ్చిరి ముచ్చట రంగభూమికిన్. 220

శా. రంగద్వారముఁ జేర వచ్చి యచటన్ రంహాస్థితిన్ ఘీంకృతుల్
పొంగం జేయుచు మావటీసకలిమిం బోరాములం బొల్చును
త్తుంగేభంబును గాంచి కాసె మొలకుం దోరంబుగాఁ గట్టి కృ
ష్ణాంగుం డై తగుకృష్ణు డిట్లనియె నయ్యంబష్ఠునిం జూచుచున్. 221

తే. ఓరి యంబష్ఠ! మాకుఁ బోదారి యిమ్ము
కడఁగ నోరసిల్లుము కానియెడల నిన్ను
నీగజముతోడ నిప్పుడే యేగునట్లు
చేసెదఁ గృతాంతపత్తనసీమ వట్టి. 222

తరువోజ. నాఁ గోపఘూర్ణితనయనుఁ డై వాఁడు
నయ మేది లయభవాంతకుని చందమున
నై గర్వమునను మట్టాడెడుకువల
యాపీడ మనుకుంజరాధీశ్వరమ్ము
వేగ నాకృష్ణుండు వెంచేయుకడకు
వెసఁ బ్రచోదనము గావించుచుఁ దోలె
నాగజేంద్రము భీకరారావ మెసఁగ
నాకృష్ణునిం బట్టె నట్టె హస్తమున. 223

తే. పట్టు విడిపించుకొని జగజెట్టి కృష్ణుఁ
డాగజేంద్రము నెత్తిపై నట్టె మొత్తి
యత్తమి లేదునట్టు లాహత్తి కాళ్ళ
సందునం డాగి యుండె నాసందునందు. 224

ఉ. వాసనఁ బట్టి కృష్ణభగవానుని వారణరాజ మంద్రఘుంలన్
భాసిలుచుంటఁ గాంచి యొకపట్టునఁ దొండము సాచి పట్టి పై
వ్రైసున నేసి చంపుటకు నెంచుచునుండ నతండు జల్మిమై
నాసమయంబునం గరము నట్టిట్టు గొట్టుచు వచ్చె మీఁదికిన్. 225

ఉ. నాగముఁశోక వట్టుకొని నాగమునుం గరుడుండు వోలె నా
నాగము శోకవట్టుకొని నాలుగుతట్టులు త్రిప్పి త్రిప్పి బా
హాగతశౌర్యసాగమున నాహరి యిర్వదియైమవింశ్లద
వ్వేగగ బల్మిమై విసరె నిట్టటు త్రిప్పుచు నట్టె నేలకున్. 226

సీ. కువలయాపీడము కుతలంబునం బడి
పడి నంతనే లేచి పఱచి కృష్ణుఁ
బడినవానిగ నెంచి ప్రతిఘమైఁ గొమ్ముల
నేలఁ గొట్టెడునట్టి కేళిఁ దేలి
యంబష్ఠచోదితమై ఘీంకరించుచుఁ
బఱచెఁ గృష్ణునిఁ బట్టినెఱి వహించి
తనమీఁది కరుదెంచుదంతావళముఁ జేరఁ
జని దానితొండముఁ గొనిరయమున

తే. త్రిప్పి నేలపయిం బడ ద్రొప్పె బలిమి
త్రొక్కి పట్టి పదంబునఁ గ్రక్కునఁ దన
కరమునం దానిదంతిము మెఱికి దాన
మొత్తి దానిని మావటిఁ మిత్తికిడియె. 227

వ. అట్లు కువలయాపీడంబును గూల నేసి కృష్ణుండు గజాసృబ్మదబిందుసందోహాంకితుండును విరూఢస్వేదకణికాంచితముఖుండునై నిజాంసన్యస్తగజవిషాణాయుధుండై విషాణంబు ధరించినబలరామసహితుండై కతిపయగోపాలురతో రంగస్థలంబునం బ్రవేశించె నప్పుడు. 228

ఉ. మల్లులకున్ బరేతపతి మానవజాతికి నేలుబంతి సం
ఫుల్లజలేజనేత్రలకు మూర్తి వహించినమన్మథుండు వి.

ద్వల్లత కాలవాలము ధృతవ్రతకోటికిఁ బట్టుగొమ్మ యై
తల్లికి దండ్రికిన్ శిశువు తా నయి కృష్ణుఁడు చెప్ప నొప్పెడున్.

క. శిష్టులకు రక్షకుండును
దుష్టులకున్ శిక్షకుండు ధీమజ్జనా
భీష్టు డయి భక్తకోటికి
దుష్టుండై కృష్ణు డన్నతో నొందె సభన్. 230

తే. వరసవనధనువుం బట్టి విఱుచుటయును
గువలయాపీడగజమును గూల్చుటయును
గంసహాతకుఁడు వినియున్న కారణమున
వారిఁ గని లోన మిక్కిలి భయము నొందె. 231

ఉ. ఉత్తమవేషధారు లయి యుండినవారల రామకృష్ణులన్
బత్తనవాసులున్ మఱియుఁ బల్లెలవారును గాంచి యెల్లరున్
మెత్తనిచిత్తముం గలిగి నేత్రయుగంబున వారిమోములన్
గుత్తగఁ గ్రోలి రత్తఱిని గొంచెము గానిప్రియంబు పేర్పడన్. 232

ఆ. కనులఁ ద్రావుచున్న కరణి నాలుక నాకు
చున్నపగిదిఁ గేల నొత్తుగతిని
ముక్కుపటముల వారి మూచూచుమాడ్కిని
రంగమందుఁ బ్రజ లెసంగి రపుడు. 233

—♦ బలరామకృష్ణుల రంగస్థలప్రవేశము ♦—

వ. రామకృష్ణప్రభావంబు కని విని యెఱింగినవారు తమలోన. 234

సీ. నారాయణాంశమునన్ వీరు వసుదేవు
నింటఁ బుట్టియు నందునింటఁ బెఱిగి
రీకృష్ణభగవానుఁడే చంపెఁ బూతనఁ
జక్రవాతాసురుఁ జక్కడంచె
మద్దిచెట్లను గూల్చె మఱి శంఖచూడాది
రాక్షసవీరుల రాసి చంపెఁ.

గార్చిచ్చుఁ గడ తేర్చెఁ గాళియు శిక్షించె
దేవేంద్రుగర్వంబు తేటలఁ జేసె
తే. వ్రేలితోడ గోవర్ధనాద్రిని ధరించె
గోపకులఁ బ్రోచె నందునికులము గాచె
నన్న బలరాముఁ డీరీతి నెన్నఁ దగిన
వాఁడె యనుచు సభాసదు లాడుకొనిరి. 235

వ. ఇ ట్లెల్లరు నెల్లవిధంబులం బ్రశంసించుచుండి రప్పుడు తూర్యమ్ములు మొఱయుచుండఁ జాణూరమల్లుండు రామకృష్ణులంబిలిచి యిట్లనియె.

సీ. ఓ వ్రజౌకసులార యో రామ యో కృష్ణ
మీ రతివీర్యసమేతు లనియు
బాహుయుద్ధమునందుఁ బ్రతిభ గాంచినవార
లని విని రాజు మి మ్మరయఁ బిలిచెఁ
ద్రికరణంబుల రాజు ప్రియము దీర్చెడువార
లిహపరసౌఖ్యము లెసఁగఁ గొందు
రట్లు చేయనివారి కత్యంతకష్టము
లనుభవింపఁగ వచ్చు నవనియందుఁ
తే. బసులకాపరు లై మీరు వనుల మెట్టు
పట్ల మల్లులవ ట్లెల్ల వలసినట్లు
నేర్చియుందురు గావున నేర్పరు లని
పలుక వచ్చును మిమ్ము గోపాలురార. 237

ఉ. కావున మీరు మే మిపుడు గాఢభుజాబల మేర్పడంగఁ గం
సావనినేతకుం బ్రియమద మావహిలంగ నియుద్ధ మీసభన్
జేవమెయిం బొనర్తు మన శ్రీహరి యి ట్లను మల్లయుద్ధమున్
శ్రీవెలయంగఁ జేయుటకుఁ జిత్తము గల్గియు లేనియట్లుగన్. 238

మత్త. మల్లరంగములందు మీ రతిమాత్రకీర్తినిఁ గాంచి శౌ
ర్యోల్లసద్ఘనమూర్తు లై తగి యున్నవారలు మే మికన్

గొల్లగూడెముల నెల్లం గెడు కోడెకాండ్రము మే మెట్టుల్
మల్లయుద్ధమునందు మి మ్మెట మార్కొనం గల మీయెడన్. 239

క. బాలురము నేము మాకుం
బోలిన బాలకులతోడఁ బో రొనరింపన్
జాలుదుము గాని మీతోఁ
జాలుదు మనఁ జాల మనినఁ జాణూరుఁ డనున్. 240

తే. మీరు బాలురు గారు కిశోరకులును
గారు వేయియేన్గులశక్తి గలిగినట్టి
కువలయాపీడమును లీలఁ గూల నేసి
నారు తగుదురు మాతోడఁ బోరు కొనఁగ. 241

క. కావున నాతో యుద్ధము
నీవును ముష్టికునితోడ నీయన్నయునున్
గావింత మిం దధర్మము
నేవారును బలుకఁ బూన రిది నిక్క మగున్. 242

వ. అనిన నట్లగుం గావుత మని నిశ్చితసంకల్పుం డగుకృష్ణుండు చాణూరుని బలుండు ముష్టికునిం దాఁకి పీకం బోర నిశ్చయించుకొన్న పదంబడి. 243

—♦ బలరామకృష్ణులు చాణూరముష్టికుల సంహరించుట ♦—

సీ. వార లొండొరులను బట్టి కాళులఁ గాళ్లు
చేతులం జేతులు చిక్కఁ గట్టి
మాటి కూరువుల నాస్ఫోటంబు గావించి
కొట్టియు నెట్టియుఁ బట్టువిడిచి
పట్టి కాల్సేతులఁ గట్టి వెండియు నెట్టి
ముష్టిఘాతంబులు మొనయఁ జేసి
మోకాళ్ళపోటుల పీకఁ జూపియుఁ దలల్
దలలతోఁ దాఁకించి ధ్వనులు పుట్ట

తే. ఱొమ్ము ఱొమ్మును దగిలించి క్రుమ్ములాడి
పట్టి గిరగిరఁ ద్రిప్పియుఁ బాఱవైచి
ముగ్ధ యగునట్లు చేతుల రుద్ది రుద్ది
జెట్టిమల్లులు పోరి రప్పట్టునందు. 244

చం. పురుషులు స్త్రీలు రంగమునఁ బొల్చినవారలు వారియుద్ధమున్
బోరిపోరిఁ జూచి మల్లు లనఁ బోటరు లీసుకుమారమూర్తు లి
క్కఠిని వారి నోర్చికొనఁ గల్గుదురో యిది ధర్మయుద్ధ మం
చరయఁగ రాదు రా జెటుల హో యనుచుండెనొ సమ్మతించుచున్.

ఆ. సభ్యదోషములను స్మరియించియుం జెప్ప
కున్న నిట్టు లట్టు లన్నఁ దెలిసి
నాకుఁ దెలియ దనుచు వాకొనినం గాని
ప్రాజ్ఞు డైనఁ బాపభాజి యగును. 246

చ. అరి కెదు రేగుకృష్ణునిముఖాంబుజమం దదె చెమ్మటల్ గదున్
దొరగెడు ముష్టికాసురునితో నెదిరించెడు రాము మోమునన్
దరుణిమతోడ హాసమును నాగ్రహముం వెలిజిమ్ము నేత్రముల్
గర మరయంగ నయ్యెడిని గన్గొనుచుంటిరె సభ్యు లెల్లరున్. 247

చ. హరి నరరూపముం బడసినట్టిఁడయై బలుతో నరణ్యమం
దరమర లేక వీఁకఁ దిరుగాడుచుఁ బిల్లనగ్రోవి నూఁదుచున్
నిరతము నాలఁ గాయుచు ననింద్యచరిత్రము గల్గి గోపికా
తరుణుల కింపు గూర్చు నట తత్సుకృతం బది యెంతయో కదా. 248

తరువోజ. అలగోపికలు కృష్ణునందు లగ్న మగు
స్వాంతము గల రయి యనురక్త లగుచు
నిలువాకిళులు శుద్ధి నెసగించునపుడు
నిరతంబు లగుపను లెలమితో గాక
సలిపెడునప్పును సకలకాలముల
శౌరినిం బాడుచు సంస్మరించుచును

గలవేణునాదము గతి నేగి పీనిఁ
గనుచుండు వా రెంతఘనురాండ్రొ తెలియ. 249

వ. ఇ ట్లెల్లరుం దమలోఁ దారు పలుకుకొనుచున్న వారిపలుకు లాలించుచు రామకృష్ణులబలంబు నెఱుంగఁ జాలనితల్లిదండ్రులు సంభ్రమంబు నొందుచుండి రయ్యవసరంబున రామకృష్ణు లాముష్టికచాణూరులతో నియుద్ధవిధుల ననుసరించి మించి పోరుచుండి రా సమయంబున. 250

మ. భగవద్వజ్రనిపాతనిష్ఠురకరోత్పాతంబులన్ బీడితుం
డగుచాణూరుఁడు భజ్యమానతనుఁ డాయాసంబునం డిందియున్
మొగిఁ బైపై కెగురంగనై కరయుగంబున్ ముష్టిగాఁ బట్టి పె
ళ్ళను శబ్దం బుదయింపఁ గృష్ణునురమున్ వ్యావిద్ధముం జేయుఁడున్.

తే. ముష్టిఘాతమునన్ హరి పూలదండ
వలనఁ బ్రహరింపఁబడుమదకరేణు
వట్లు కదలక చాణూరు నట్టె పట్టి
గిరగిరంద్రిప్పె నెన్నియోపరులు గిరులు. 252

ఆ. త్రిప్పి త్రిప్పి నేలఁ దెఱలంగఁ గొట్టినఁ
ద్యక్తజీవి యగుచుఁ దక్షణంబ
నీలరక్తపీతమాలి కల్గల వాఁడు
శక్రధనువు వోలె జగతిఁ గూలె 253

వ. సభాస్తారు లెల్లరు నల్లతల్లడం బడుచుండి రాసమయంబున. 254

ఆ. ముష్టికుండు మున్న ముష్టిఁ బొడిచిన
బలుఁడు బలముకలిమిఁ దలము చేత
శిరమునందు నొక్క చఱపు చఱచె దాన
నెత్రు గ్రక్కుకొనుచు నేలఁ గూలె. 255

సీ. చెట్టునా ముష్టికుఁ డట్టె కూలుడుఁ గూటుఁ
డాబలుపైఁ బడ నతఁడు వాని
వామముష్టిం బొడ్చి వడిఁ జంపె శలుఁ డప్డు
కృష్ణునిపదహతిం గ్రిందఁ ద్రెళ్ళెఁ

దోసలకుం డంతఁ దొడరినవానిని
రెండుగాఁ జీఱెఁ గృష్ణుండు కెరలి
చాణూరముఖ్యులు చచ్చినపదపడి
పాఱిరి మల్లులు ప్రాణభీతిఁ

తే. గాళ్ళగజ్జెలు మొఱయంగ గంతు లిడుచు
రామకృష్ణులు తమవారి రాఁగఁ బిలిచి
మదకలంబులమాడ్కి నమ్మధ్యమందు
నిచ్చవిహరించి రెల్లరు మెచ్చి రెచ్చ. 256

వ. అంత భోజభూవిభుండు చే యెత్తి తూర్యారవంబు నిలుపరించి తనవారి
దిక్కు మొగం బై యి ట్లనియె. 257

మ. వెడలం గొట్టుఁడు వీటినుండి యిచట న్విక్రాంతినిం జూపునీ
జడులన్ నందునిఁ బట్టి కట్టుఁ డిఁకఁ దత్సంఘార్థ మెల్లన్ హరిం
పుడు జానేయుఁడు దుష్టబుద్ధి వసుదేవున్ శత్రుపక్షుం బయై
చెడుబుద్ధిం గొనునుగ్రసేను వడి హింసింపుండు మీ రిత్తఱిన్. 258

—♦ శ్రీకృష్ణుండు కంసునిం బట్టి వధించుట ♦—

తే. ఇట్లు కంసుఁడు వలికెడునింతలోనఁ
గొంత గానట్టికోపము కొసలు దేర
హుంకృతు లెసఁగఁ గృష్ణుఁ డత్యున్నతాస
నంబు మీఁదికి నెగిరె ధైర్యంబు దనర. 259

చ. వచ్చెడువానిఁ జూచి తనపాలిటిమృత్యు వటంచు నెంచియున్
హెచ్చినధైర్యసాహసము లేర్పడ గంసుఁడు లేచి ఖడ్గమున్
గ్రచ్చర నూని డేగవలె గట్టెదుటం గనుపట్టఁ గృష్ణుఁడున్
బచ్చడి సేయునో యనఁగఁ బట్టెను దార్క్ష్యుఁడు సర్పముం బలెన్.

తే. పట్టువడ ద్రొబ్బి క్రింది కాబల్లిదుండు
కంసకాయము మీఁద నఖండశక్తి

కలితుఁడై యుర్కె సింహము కరిశరీర
మం దుఱికినట్లు చూపఱు హా యనఁగ. 261

ఉ. ఉఱికి సభాసదుల్ గనుచునుండఁగఁ గంసునిఁ బట్టి యీడ్చుచున్
విరవిర్గ దన్నుకొంచు నొక ప్రేల్మిడి లోన గతాసు వయ్యె న
త్తఱి సకలప్రజల్ గని ముదం బఱి రోదన మాచరించి రే
డ్తెఱఁ గనఁ జేయుకృష్ణుఁ గని డెప్పర మైనభయంబు పెంపునన్. 262

ఉ. భోజవిభుండు కృష్ణభయముం గలవాఁ డగుటన్ గమించుచున్
భోజన మాచరించుచును బొల్తులతో విహరించుచున్ మహా
రాజసభాస్థలంబున విరాజిలుచున్ నిదురించుచున్ సదా
యాజలజాక్షునిం దలఁచునట్టేఁడు గావున నొందె మోక్షమున్. 263

వ. అనంతరంబ కంసునన్నదమ్ము లగువారు కంకన్యగ్రోధాదు లెనమండ్రు
కనతి భ్రాతృఋణంబు దీర్చువారై కృష్ణునిపైఁ బడి రంత చెంత నున్న
సంకర్షణుండు వారిఁ బరిఘాయుధంబునం బరిమార్చి పేర్చి యార్చె
నాకసంబున దేవదుందుభులు మ్రోసెఁ బుష్పవర్షంబు గురిసె నప్స
రోనృత్యంబును గిన్నరగానంబునుం గాన నయ్యె నయ్యెడ. 264

మ. తలయున్ వక్షము మొత్తుకొంచుఁ గనులన్ ధారాసమూహంబు కా
ల్వలరీతిన్ బ్రవహింప నశ్రుజలముల్ కంసాంగనల్ రంగ భూ
తలమందుంబడి యున్నభర్త కడకున్ దా వచ్చి తద్దేహమం
దెలమిం దప్పఁగ వ్రాలి యేడ్చిరి కడున్ హేరాళశబ్దంబుగన్. 265

సీ. పతి లేమి నీపురివరము నేమునుఁ బోలెఁ
దేజోవిహీనమై తెలియ నయ్యె
నిరపరాధుల కీవు నెఱపితి వపకార
మందున నీ కిట్టు లయ్యె మరణ
మీకృష్ణభగవానుఁ డెల్లరకుం గోప్త
వాని సేవింపనివాని కెపుడు

సుఖ మనునది లేదు చూడఁ జూడఁగ నీవు
హరికి విద్వేషివై తకట కట్ట

తే. అనుచు విలపించుచుండెడు నాండ్రె నెల్ల
నూఱడం బల్కి ఖలుఁ డైన నుత్తమములు
లోకములు కంసు ఁ బొందెడు లోన మీరు
వగవకుం డని కృష్ణుఁడు దగ వచించి. 266

వ. కంసున కూర్ధ్వదైహికంబు నివర్తిల్లం జేసి బలరామసమేతుం డై కారాగారంబునకుం జని దేవకీవసుదేవుల బంధవిముక్తులం జేసి వారిపాదంబులపై శిరంబులు వెట్టి భజించె నపుడు తల్లిదండ్రులును తమపాదంబులం బడినవారు సాక్షాత్ భగవంతు లని తెలిసికొని పరీరంభణాదులు గావింప రై రప్పు డప్పురుషోత్తముండు తనతల్లిదండ్రుల నుపలబ్ధార్థుల నెఱింగి యటు కాకుండు గాక యని జనమోహిని యగు నిజమాయం బ్రసరింపఁ జేసి వారి నానందపెట్టు వాఁడై తల్లీ! తండ్రీ! యని పిలుచుచు నమస్కరించి యి ట్లనియె. 267

శా. మీకుం బుత్రులమై జనించితి మిలన్ మే మింతియే కాని మీ
రాకాంక్షించుచు నున్న మావయిన బాల్యక్రీడ లొక్కప్పుడే
మీకంటం బడకుండె మాకు నిచటన్ మీలాలనానందముల్
లే కుండెం జుడి దైవపుంజెయిదు లీలీలన్ బ్రవర్తిల్లుటన్. 268

మ. సకలార్థంబులు సంతరించుటకు నెంచ న్వచ్చు దేహంబుఁ గం
టకునం బెంచుట కైనవారిఋణముం దప్పుత్రు లైనట్టివా
రొకనూఱేండ్లకు నైనఁ దీర్చుటకుఁ దా రోపంగఁ బో రట్టివా
రికిఁ బ్రాప్తించెడుదుర్గతుల్ తెలియ పూరితుల్ కరం బట్టివే. 269

ఆ. చాలియుండి యెవఁడు జననీజనకులకు
ధనమునను శరీరమునను జీవి
కను బొనర్పఁ డట్టిమనుజాధముఁడు ప్రేత
మైన వానిఁ బట్టి యముఁడు గోయు. 270

—♦ రామకృష్ణులు దేవకీవసుదేవులచెఱ మాన్పుట ♦—

చ. ముదుసలి తల్లిదండ్రులను బుణ్యసతీమణిఁ బిన్న యానుతుఁ
సదమలచిత్తుఁ డైనగురు సద్మముఁ జేరిన బ్రాహ్మణోత్తముఁ
సదయతఁ గాంచి యేజనుఁడు సాఁకక యుండునొ వాఁడు భూమిపై
బ్రదికియుఁ జచ్చినట్టిఁ డని పల్కుచు నుండెడు వేదశాస్త్రముల్.

ఉ. కంసుఁడు దుష్టుఁ డయ్యు మిముఁ గాఱియ పుట్టఁగ బందిఁ బెట్టుచుఁ
హింస యొనర్చుచున్న విని యే మొకయింతయుఁ జేయలేనిదు
ర్మాంసలదేహముల్ గలకుమారుల మైతిమి పూజ్యులార వి
ధ్వంసకముల్ దినంబు లవిన్యర్థము లయ్యెను మాకుఁ జూడఁగన్. 272

శా. తాతా! మాత! ఖలుండు కంసునిమహోదగ్రప్రకారంబునన్
జాఁకొర్వి న్వడనాడి పోయి యితరస్థానంబునం దుండుటన్
జేతోమోదముతోడ మీపదములన్ సేవింప లేకుంటి నే
మాతప్పున్ క్షమియింప వేఁడుదుము సంప్రార్థించి సేవించుచున్.

తే. ఇట్లు మాయామనుష్యుఁ డౌకృష్ణునుడుల
మోహితాత్ములు వారలు పుత్రకులను
దొడలపైఁ బెట్టుకొని చుంచు దువ్వి శిరము
పుడుకుచును ముద మంది రప్పుడు నెడంద. 274

తే. మఱియు వారలు పుత్రులమస్తకముల
నశ్రుధారలచేఁ దడ్పునట్టి రగుచు
స్నేహపాశావృతులు బాష్పవిభృతకంఠు
లగుచు నొండాడ కుండి రయ్యవసరమున. 275

వ. ఇట్లు భగవంతుం డగువాసుదేవుండు తల్లిదండ్రుల నాశ్వాసించి మాతామహుం డగునుగ్రసేనుని మాధురంబుల కధిపతిం గావించి.

—♦ ఉగ్రసేనుని మాధురంబుల కధిపతిం జేయుట ♦—

సీ. రాజేంద్ర! మేము నీప్రజల మాజ్ఞాపింపఁ
జెల్లు నీకు యయాతి చేసినట్టి

శాపంబునం జేసి యోపరు యాదవుల్
సింహాసనం బెక్కఁ క్షితిని బ్రోవ
నేఁ జేయుటం జేసి నీ కొక్కనికి చెల్లు
వేల్పు లెల్లరు నీకు భృత్యు లగుచు
బలి నొసంగుదురు రాజులు వశవర్తులు
నీశాసనము చెల్లు నిఖిలధరణిఁ

తే. నని పలికి వాయుదేవునిఁ గని మదీయుఁ
డగ్రసేనున కింద్రుననుగ్రహమున
కయి సుధర్మ యనెడుసభ నస్మదీయ
వాకునంజేసి తెచ్చి యిమ్మాకృతి కన. 277

ఉ. వాయువు పోయి యింద్రునకు వాకొని నంతన కృష్ణశాసనం
బాయమరేశ్వరుండు విని నట్టిఁడమై సభ నిచ్చి పుచ్చె నా
వాయువు తెచ్చి కృష్ణునిప్రభావము చెప్పుచు నుగ్రసేనభ
దాప్యాయితమూర్తి కిచ్చె వసుధాతల మంతయుఁ బ్రీతి నొందఁగన్.

వ. అంతఁ గృష్ణుండును గంసభయంబునం జేసి వలసఁ బోయి విదేశా
వాసకృశు లగునట్టియు స్వజాతిసంబంధు లగునట్టియు యదు వృష్ణి
భోజాంధక మధు దాశార్హ కుకు రార్యకుల నందఱం బిలువ నంచి
తెచ్చి బహుమానపురస్సరంబుగ సమాశ్వాసించుచు ధనాదులం బరి
తృప్తులం జేయుచు వారి వారియిండ్ల నివసింపఁ జేసె వారు నిట్లు కృష్ణ
బలరామగుప్తులు లబ్ధమనోరథులునై వారిం బ్రశంసించుచు నిజ
గృహంబుల నిజదారపుత్రాదులతో నివశించి యానందించి రా
సమయంబున. 279

ఉ. వారలు కృష్ణదేవముఖవారిజభూరిసుధారసంబు వే
మాఱును నేత్రపాత్రముల మానక గ్రోలి ముసళ్ళు గోడెకాం
డ్రై రహిం మించి రెంచఁగ వరిష్ఠబలాతిశయంబు పెంపునన్
సారరసాయనంబుల ముసళ్ళు కుమారకు లౌట లబ్రమే. 280

వ. అనంతరంబ బలరామకృష్ణు లానందునికడకుం జని కౌఁగిలించుకొని
యి ట్లనిరి. 281

—♦ రామకృష్ణులు నందయశోదల నంపిపుచ్చుట ♦—

శా. ఓతండ్రీ! విను మీరు మ మ్మిరువురం బ్రోద్యత్కృపాదృష్టిమైఁ
బ్రీతిం జేయుచు స్వాత్మకంటె మిగులన్ వే త్తెల్లుగాఁ జూచుచున్
వాతం జేరగ నున్నదాని నిడుచున్ లాలించుచుం బెంచి యీ
రీతిం బెద్దలఁ గాఁగఁ జేసితిరి మీరే మా కిలన్ దైవముల్. 282

ఉ. తల్లియుఁ దండ్రియున్ సుతులఁ దార్ కని పెంపఁగ లేక పీడ నే
వల్లనొ జేరఁ దీయుచును వారినిఁ బెంచినయట్టివార లే
తల్లియుఁ దండ్రియై సకలధర్మములందును గన్నయట్టి య
త్తల్లికిఁ దండ్రి కెచ్చనుచుఁ దారు వచింతురు శాస్త్రవిద్వరుల్. 283

ఆ. తండ్రి మీరు వ్రజముఁ దరియంగ నేగుఁడు
మేము జ్ఞాతిబంధుమిత్రతతికి
సుఖముఁ గూర్చి మిమ్ముఁ జూడంగ వత్తు మొ
క్కింతలోన ననుచు నెంతొ చెప్పి. 284

వ. వ్రజవాసులతో నున్న నందుని సాంత్వనవచనంబుల సాదరపూర్వంబుగ
నాదరించి పలుకుచు వస్త్రాలంకారాదుల నలంకృతులం గావించి
యంపి పుచ్చుటయు. 285

తరళము. అనుడు నందుఁడు ప్రేమవిహ్వలుఁడై కుమారుల నిద్దఱిన్
దనదుకౌఁగిటఁ జేర్చి పేర్చినతత్పరత్వము పేర్పడన్
కనులునిండగ నశ్రుపూరము గ్రమ్మ నొక్కమాట యే
ననఁగ నోపక గోపకుల్ తను నంటి రాఁ జనె మందకున్. 286

మ. వసుదేవుండు కొమాళ్ళతో సతులతో వాసః ప్రదేశంబునం
దు సుఖంబుండి ద్విజాతిసంస్కృతులు పుత్రుల్ పొంద లో నెంచి వి
ప్రసమూహంబులతోడ గర్గమునిఁ బిల్వం బంచి విధ్యుక్తధ
ర్మసమేతంబుగఁ జేసెఁ బుత్రకులకున్ బ్రహ్మోపదేశం బొగిన్. 287

ఆ. వడుగు లైన వెనుక వసుదేవుఁ డావిప్ర
వరుల కిచ్చె క్షౌమవసనరత్న
మాలికాంచితముల నాలను బూజించి
వలసి నన్ని యెన్నఁ దలఁప కపుడు. 288

మ. బలకృష్ణుల్ జననంబు నొందినతఱిన్ బంధంబులం దుంట వి
ప్రులకున్ గోవుల నిత్తు నన్నమడి లోఁ బోలించి గోష్ఠంబునం
గలగోవ్రాతము దెచ్చి యిచ్చె కొలఁదిన్ గావించి దానంబులన్
విలసద్దక్షిణ లిచ్చె బ్రాహ్మణులకున్ విత్తంబు మొత్తంబుగన్. 289

—◆ రామకృష్ణులు కృతోపనీతులై సాందీపనుకడ విద్యలు నేర్చుట ◆—

సీ. బలరామకృష్ణులు ప్రాప్తసంస్కారులై
సువ్రతనిష్ఠులై సుభగు లైన
యదుకులాచార్యుఁడై పొదలుగర్గమునీంద్రు
వలనఁ గైకొని ద్విజత్వంబు పిదప
గాయత్రి మనువ్రతం బాయెడం బొందియు
సర్వజ్ఞులును సర్వజగదధీశు
లయ్యు మానవధర్మ మంది యుండిరి గాన
నైజాచ్ఛ విజ్ఞాన మేజనునకుఁ
తే. దెలియ నీయక వరగురుకులనివాస
మును నభిలషించి కాశికాపురమునందుఁ
గాపురం బున్న సాందీపకాశ్యపీశ
వర్యు నయ్యనికడ విద్య నేర్వఁ జనిరి. 290

ఉ. దేవునిఁ బోలెఁ వానిఁ గని దేశికుఁ గా వరియించి విద్యలన్
దేవ ! యనుగ్రహింపు మన దేవనిభుం డతఁ డక్కుమారులన్
బావనశీలురం దెలిసి వారికి సాంగము లైన వేదముల్
చేవలు దేరుశాస్త్రములు చెప్పెను దప్పనిరీతు లొప్పఁగన్. 291

సీ. మఱియును సరహస్యమంత్రధనుర్వేద
మును ధర్మశాస్త్రముల్ ఘనతర మగు

నన్వీక్షకీవిద్య నాఱువిధంబులై
తగురాజవిద్య లోనగుసమస్త
విద్యలు గురువు చెప్పినమాత్రన గ్రహించి
రంత నర్వదినాల్గునహము లందు
నఱువదినాల్గు విద్యలు గ్రహించి సుధీంద్రు
లై దక్షిణం గోరు మనిరి గురుని
తే. అతఁడు వారిప్రభావము నరసి యుంట
భార్యతోడ విచారించి వారిఁ గాంచి
మును బ్రభాసమునం దబ్ధి మునిఁగి పోయి
నట్టితనపుత్రుని మ్మని యడిగె నపుడు. 292

—♦ రామకృష్ణులు మృతుండైనసుతుందెచ్చి గురుదక్షిణగా నిచ్చుట ♦—

వ. అనిన వా రట్లగుం గావు త మని రథం బధిష్ఠించి ప్రభాసక్షేత్రంబు నకుం జని క్షణమాత్రి సముద్రతీరంబునం గూర్చుండి కార్యంబు దెసవా రగుచుండి రపు డది యంతయు నెఱింగి సముద్రుండు వారి కడం బొడసూపి పూజించె నంతఁ గృష్ణుండు సముద్రునిం జూచి. 293

చ. జలనిధి! నీతరంగములసందున మాగురుసూతి సొచ్చె ముం
బ్రలయము నొందెనో తెలియ రా దది నీవు హొనర్చినట్టిదై
తెలియఁగ వచ్చుఁ గావునను దె మ్మలబాలుఁ దేశ యున్న నీ
ప్రలయము సంభవించు నని పల్కెడు నల్కచుఁ గంధి యిట్లనున్.
తరువోజ. దేవ నే నెఱుఁగ మీ దేశికసుతునిఁ
దెలియఁ జెప్పెద విన్ము తెలిసిన దెల్ల
దేవారి యగువాఁడు తెగి పంచజనుఁడు
తిరుగుచుం జేఁపయై దిగి నాదు నీళ్ళ
సేవించుచున్న దేశికపుత్రు వాఁడు
చేకొనిపోయె నీక్షించుచు నుండ
నీ వేగ నీటిలో నెఱి మీఱియున్న
నీచుఁ జంపి కుమారునిం దెమ్ము పొమ్ము. 295

మ. అనిశం గృష్ణుఁడు నీటఁ జొచ్చి యొకచో నాదైత్యునిం జూచి వా
ని నొకింతేఁ గదియించి వానికడుపుఁ విచ్ఛేదముం జేసినన్
గనరాకుండెను దేశికాత్మజుఁడు తత్కాలంబున న్వాని మే
నను జన్మించినశంఖ మొక్కఁడచటన్ గానంగ రా దానినిన్. 296

వ. కైకొని వచ్చి బలభద్రునితో రథం బెక్కి రయంబున సంయమనీ
పురంబునకుం జని శంఖంబు పూరించుటయును. 297

శా. శంఖధ్వానము నాలకించి యముఁ డశ్రాంతంబు శాంతాత్ముఁడై
ప్రేంఖద్భక్త్యుపబృంహితం బగుమనోరేఖం బ్రదర్శించుచున్
బుంఖంబై చనుపూజ చేసె విలసత్పుష్పోపహారాదులన్
శంఖఖ్యాతసహస్రనామముల శశ్వత్ప్రీతిఁ గీర్తించుచున్. 298

వ. ఇట్లు పూజించి మీకు నావలనం గాఁ దగుకార్యం బెద్ది యనిన
సర్వసహిష్ణుం డగుకృష్ణుం డి ట్లనియె. 299

తే. స్వీయకర్మనిబంధనస్థితులఁ జేసి
మాగురూత్తము పుత్త్రుఁ డిమ్మాడ్కి నిటకుఁ
దెచ్చితివి వాని మాదగునిచ్చఁ జేసి
తోడుకొనిపోదు మి మ్మని వేఁడుటయును. 300

వ. అంతం బరేతరాట్టు కా నిమ్మని గురుపుత్త్రునిం దెచ్చి యిచ్చిన రామ
కృష్ణు లాతనిం గొనిపోయి గురునకు సమర్పించి మీ కిచ్చవచ్చిన
వరంబు మఱి యొకండు గోరుం డనిన నతండు మీయట్టివారికి
గురుండ నైన నా కిం కేమి కావలయు నంతయుం దీన సంపన్నం బయి
నది మీరు మీగురుఋణంబు దీర్చితిరి మీ రింక గృహంబునకుం
బొండు మీకు మహోన్నతకీర్తి యగుం గావుత మని యంపిపుచ్చిన
వారును గురుననుమతిం బడసి వాతరంహంబు లగుహయంబులం
బూన్చినరథం బెక్కి మధురాపురంబునకుం జని సర్వాదరపాత్రంబులై
రనంతరం బొకానొకదినంబున. 301

ఉ. కృష్ణుఁడు నైజమిత్రము సఖత్వము గాంచినవాఁడు మంత్రియున్
వృష్ణికులప్రవీణుఁడును వేలుపుఁబొజ్జకు శిష్యుఁ డుక్తిరో

చిష్ణుఁడు నైనయుద్ధవుని చేతిని చేత గ్రహించి జ్ఞానవ
రిష్ణుఁడ వీవు వి న్మనుచుఁ దెల్పె రహస్యమునందు నిగ్గతిన్. 302

—♦ శ్రీకృష్ణుఁ డుద్ధవుని గోకులంబునకుఁ బుచ్చుట ♦—

మత్త. ఈవు గోకులముం గనం జని యిప్డు తల్లికిఁ దండ్రికిన్
దేవురింతలు దీర్చి చిత్తము దేర్చి ప్రీతిని గూర్చి నా
కై విచారము తోరమై చనఁ గన్న అం పడువేఁతలన్
నావియోగమునన్ దపించెడు నారులం గని పల్కుమా. 303

మాలిని. వ్రేతలు నాపయిఁ జేతము నిల్పుచు
ప్రీతిని గొల్పుచుఁ బ్రాణములన్
నాతలఁ గట్టుచు నన్నె తలంచుచు
నాపయి సర్వముఁ బెట్టుచు న
న్నేతఱి నాత్మగ నెంచుచు మిక్కిలి
నిష్టత నుండిన హేతువునన్
నాతలఁ పారయ వారలమీఁదన
నాఁటిన దయ్యెడు నెయ్యెడలన్. 304

ఆ. అట్టివారిమీఁద హార్దమా నాకు స్త్రీ
లైనఁ గాని పురుషు లైనఁ గాని
యెల్లగతుల నన్నె యేప్రొద్దు ధ్యానించు
వారిఁ బ్రోవ నెంచుపనియె నాకు. 305

చ. మధురకుఁ బోయి వచ్చెదను మానినులార వియోగదుఃఖదు
ర్వ్యధితలు కాకుఁ డం చపుడు పల్కితి నిప్పుడు నాదురాక కే
విధమునఁ గోరుచుండెదరొ విన్నగ నేమిటి కెల్లలోకముల్
వృధ యని యెంటి ప్రాణమున వేగుచునుం డనుచుంటి నుద్ధవా.

వ. అని చెప్పిన నుద్ధవుండు ప్రభుసందేశంబు సంగ్రహించి రథం బధిష్ఠించి
సాయంసమయం బగునప్పటికి గోఖురరజోరంజితరథుండై నందగోకు
లంబునకుం జనియె నదియును. 307

సీ. వాసితార్థ మెదిర్చి వడిఁ బోరుమదవృషం
బులఅంకెలన్ మాఱు మ్రోఁత లోలయఁ

బోదుగులబరువుచే మెదలుచు వత్సంబు
కడకుఁ బఱచు నాలకదుపు లొప్ప
నెగిరి తల్లులవంక కేఁగ గంతులు వేయు
క్రేపులయార్పులు క్రేళ్ళువాఱ
గోదోహశబ్దాభిగుంఫితధ్వనితోడ
వేణునాదంబులు విస్తరిల్ల
తే. రామకృష్ణులకృతులను ప్రేమఁ బాడు
గోపగోపీజనము చేత నేపుమీఱి
దేవగోవిప్రపూజలఁ దేజరిల్లి
నందగోకుల మొప్పె నానంద మగుచు. 308

వ. అట్టిగోకులంబునకుఁ గృష్ణానుచరుండును బ్రియుండు నగునుద్ధవుండు వచ్చుట లాకర్ణించి నందుండు వానిం గలసి గాఢాలింగనంబు గావించి కృష్ణబుద్ధిం జేసి పూజించి పరమాన్నంబులు భుజింపం జేసి సుఖాసనాసీనుం గావించి పాదసంవాహనాదికంబుచే గతశ్రముం గావించి కుశలప్రశ్నపూర్వకంబుగా ని ట్లనియె. 309

—♦ నందోద్ధవసంవాదము ♦—

ఉ. నాకు నిరంతరప్రియుఁ డనంతనయుం డగుశూరనందనుం
డాకరణి న్విముక్తుఁ డయి యాత్మజనావళితోడఁ గూడి సౌ
ఖ్యాకలితస్వభావమున నాలియు దాను ననామయంబునన్
లోకపదానువర్తి యయి లోన ముదంపడుచుండెనే కదా. 310
తే. సాధుభూదేవజాతికి సంతతంబు
ద్వేషియై కష్టపెట్టెడుదోషకారి
యైనకంసుఁడు సానుగుఁడై స్వకీయ
పాపమున దైవమున మృతిం బడసెను గద. 311

మత్త. అన్న! యుద్ధవ! యొక్కమాట యథార్థరీతి వచింపుమా
చిన్నికృష్ణుఁడు తల్లిదండ్రుల స్నేహితాళిని నెయ్యురన్
దన్ను నాథునిఁ గా మనంబున దాల్చుగోపగణంబు దా
నెన్నఁ డేని స్మరించుచుండునె యేమి యేనియుఁ బల్కునే. 312

క. గోవత్సములందుఁ బృం
దావనమున మందయందుఁ దత్స్థలులన్
గోవర్ధనమున మునుపటి
భావము దా నెన్నఁడేని వలుకుట కలదే. 313

క. వ్రజమునకు వచ్చునట్టే
స్వజనముఁ జూచుటకు నొక్కపర్యాయంబే
నిజము వచింపుము నే నా
త్మజుఁ డాతనిమోముచూచి ధన్యుఁ డగుదు నే. 314

సీ. దావానలము మమ్ము దరియ వచ్చినయప్డు
వృషభాసురుఁడు మమ్ము వేఁచినపుడు
పుష్కలావర్తకంబులు ముంచినప్పుడు
ఖలుఁ డఘాసురునోట నిలిచినపుడు
కాళీయవిషవహ్నిఁ గ్రాఁగినయప్పుడు
దాసరిపాము నన్ మేసినపుడు
దాట నలవిగానినేటిమృత్యువు లప్డు
మమ్ము రక్షించినమాసుతుండు

తే. చిన్నికృష్ణుఁడు వానివిశేషవీర్య
చర్యలు విలాసములు నిరీక్షణము లుక్తు
లెల్ల స్మరణమునకు వచ్చె నేని మాకు
నెపుడు నానంద ముదయించు నేమి చెప్ప. 315

తే. కృష్ణపదభూషితంబులై కీర్తితమ్ము
లగుసరిచ్ఛైలవనభూము లరయ నరయ
మామనంబులు తాదాత్మ్యమహితము లయి
పొదలుచుండెడు నేమందు సదమలాత్మ. 316

తే. గర్గముని చెప్పినట్లు లోకమునయందు
దేవతాకార్యము ల వెల్లఁ దీర్చుపొంటె

నవతరించిననిర్జరప్రవరు లనుచు
రామకృష్ణులఁ దలఁచెద నో మహాత్మ. 317

సీ. పదివేలయేన్గులబలము గల్గినకంసుఁ
గూల్చెఁ జాణూరముఖ్యులను మల్ల
వరులఁ జా నేసెను గరిరాజుఁ దెగటార్చె
సింహ మల్పమృగంబుఁ జీల్చి నట్లు
తాళత్రయోన్నతధనువు ముక్కలుచేసె
గజవరేణ్యం బిక్షుఖండ మట్లు
గోవర్ధనాద్రినిఁ గొనగోటనే తీసి
యేడైనదివసంబు లెత్తి పట్టె

తే. బకతృణావర్త ధేనుకప్రభృతిదుష్ట
రాక్షసులఁ దున్మి లోకసంరక్షణంబు
సలిపె నని కృష్ణలీలల సంస్మరించి
సంస్మరించి నందుఁడు వల్కఁ జాలఁ డయ్యె. 318

తరువోజ. అపుడు కృష్ణునియందు ననురక్తమైన
స్వాంతము గలఁ డయి సాశ్రుకంఠుండు
విపులహర్షాంచితవిహ్వలుఁ డగుచు
వెడల నానందాశ్రువిసరంబు కనులఁ
గృపణుండు నాఁ బల్కఁ గింతియు లేక
యెదిరిఁ దన్నెఱుఁగక యీక్షించుచుండెఁ
గృప యశోదయు విని కృష్ణునికథలు
క్రేగంట నశ్రువుల్ క్రిందికి జార్చె 319

వ. ఉద్ధవుండు నాయశోదానందుల కానందనునిపైఁ గలపరమానురాగంబు
పరికించి పరమానందంబున నందునిదిక్కు మొగంబై. 320

ఆ. అఖిలగురువు లైనయారామకృష్ణుల
యందు మీకు నిట్టియతులిత మగు

రాగ మగుటఁ జేసి వ్రజనాథ! నీవు నీ
తన్వి ధన్యతిములు ధరణియందు. 321

తే. రామకృష్ణులు జగతికిఁ బ్రకృతిపురుష
లై నిమిత్తముగను నుపాదానకార
ణమ్ములై భూతములయందు నెమ్మిఁ బొల్చి
జ్ఞానదానసమర్థులై క్రాలుచుండ్రు. 322

ఉ. ప్రాణవియోగకాలమునయందు జనుం డిసుమంతఁ జిత్తమం
దేనిఁ దలంచి కర్మగతు లెల్లను ద్రెంచి రవిప్రకాశముం
బూని వరంబు నొందు ననఁ బూరుషసింహులు మీరు సర్వదా
ధ్యానము సేయుచుం డ్రితని ధన్యులు మాన్యులు ముక్తికాంతకున్.

వ. అని మఱియును. 324

ఉ. నంద! యశోద! మీకడ కనంతుఁడు నవ్వయుఁ డచ్యుతుండు మీ
నందనుఁ డింతలోపలఁ గనం జనుదెంచుఁ బ్రియంబుఁ గూర్చు గం
సుం దెగటార్చి నప్డు మిముఁ జూచి వచించినపల్కు సత్యముం
బొందెడునట్లు చేసెడినిఁ బో మది ఖేదము నొందకుం డిఁకన్. 325

క. భూతములహృదయమందున్
జ్యోతిర్మూర్తి యగునతఁడు చొప్పడియుండున్
బ్రీతి మెయిన్ దారువులన్
జ్యోతి తెఱంగునను దెలియఁ జూడుము నందా. 326

ఆ. ప్రియుఁడు నప్రియుండు పెరయును స్వీయుండు
మిత్రమును విరోధి ధాత్రి లేదు
సర్వసమున కెన్న సముఁడు నీచుండును
లేనిమాట నిజము గా నెఱుఁగుము. 327

చ. అతనికిఁ దల్లి దండ్రియును నన్నలు దమ్ములు భార్య బిడ్డలున్
హితులును బాంధవుల్ మఱియు నెవ్వరు లేరు గుణాగుణంబులున్
వృతియును జన్మకర్మములు మీఁదును గ్రిందును లే వ దైన నీ
క్షితి జనియించె సాధువుల సేమము పొంద విలాసవైఖరిన్. 328

సీ. భగవంతుఁ డగుణుఁడై సగుణునివలెఁ దోఁచుఁ
బొంది సత్త్వరజస్తమోగుణముల
నిచ్చ లేకుండియు నెపుడజుం డయ్యును
బుట్టించియుం బెంచి పొడ వడంచుఁ
దిరుగు కన్నుల కెల్ల ధర తిరిగెడునట్లు
కర్త చిత్తం బయి కానుచుండ
నం దహంభావము నంది జీవుఁడు తానె
కర్త నంచు భ్రమింపఁ గలుగుచుండుఁ
తే. గావునను మీకె పుత్త్రుఁడు గాఁడు కృష్ణుఁ
డందఱకు నాత్మయుం దుండునట్టిఁ డగుచుఁ
దల్లియును దండ్రియై యవిద్యావశమున
జీవసంజ్ఞ గలాఁ డయి చెలఁగు నతఁడు. 329

చ. శ్రుతములు దృష్టముల్ త్రిగుణశోభలు భూతభవద్భవిష్యముల్
క్షితియు నభంబు గట్టులును జెట్టులు స్థావరజంగమాదు లం
చితగతిఁ జూడ నాహరియె చెప్పెడి దే మిఁక వానికంటె భి
న్నత గొనియున్న దేదియుఁ గనంబడ దంచు నెఱుంగు మాత్మలోన్.

వ. ఇట్లు నందోద్ధవులు ప్రసంగించుకొనుచున్నంత నిశాంతం బగుటయు గోపికలు కొక్కొరో యనుకోడికూఁతలం జేసి మేలుకొని లేచి దీపంబులు వెలిఁగించి కడపలు ముంగిళ్ళు లోనగు ప్రదేశంబుల రంగవల్లులం దీర్చి దధి మథింపం జొచ్చి రపుడు. 331

ఉ. కవ్వపుఁ ద్రాడు లాగుటను గంగణముల్ గలుగల్లుమంచుఁ బెం
పవ్వడి గాఁగ మ్రోయ విలసన్మణికుండలహారముల్ గదుర్
మొవ్వము గాఁ జలింపఁగఁ గపోలములన్ మణిభూషణద్యుతుల్
కవ్వఁగ దీపకాంతులను గన్గొనవై రలకాంత లెంతయున్ 332
తే. వ్రజసతులు వాఁడుకృష్ణునిపాటలందు
మొలిచి పొలిచినతియ్యనియులివు లలిగఁ

తొఱఁగుచిలికెడునులివ్రుఁ గో సరిగఁ గలసి
కడల దోషము బెడఁ బాపి కప్పె దివిని. 333

ఉ. అంతట సూర్యదేవుఁ డరుణాంచితుఁడై రథమెక్కి తూర్పునం
గొంతటిలోనఁ దోఁచుటయు గోష్ఠముఖంబున శాతకుంభసం
కాంతము స్యందనం బెదుటఁ గన్గొని వేనిది యిద్ది యు న్నొకో
పొంతనముల్ వచించి హరి ముచ్చిలిపోయినవాఁడు వచ్చెనో. 334

ఉ. భోజపతిన్ వధించి కడుమోదము నొందెడుశౌరి కిప్డు నీ
రేజదళాయతాక్షుల వరింపగఁ జెప్పుచుఁ బాపనిష్కృతిన్
దాఁ జలుపంగ వచ్చెనొకొ తత్పతికిన్ మనలన్ వధించి మాం
సాజిరపిండదానమున నప్పరలోకము గూర్ప వచ్చెనో 335

వ. వేఁత లిట్లు రథదర్శనంబున వేవేవిధంబులం బలుకుకొనుచుండ నుద్ధ
వుండు కృతాహ్నికకృత్యుండై యచ్చటికి వచ్చుటయును. 336

తే. వ్రజపురంధ్రులు ప్రలంబబాహుయుగళుఁ
నబ్జలోచనుఁ బీతాంబరాంచితాంసుఁ
బద్మమాలికాలంకృతుఁ బద్మవదనుఁ
గృష్ణమిత్రుని నుద్ధవుం గెలనఁ గనిరి. 337

— * వేఁత లుద్ధవుని కని సంభాషించుట * —

ఉ. సుందరదర్శనుండు మధుసూదనుఁ బోలినవేషభాషలం
బొందినవాఁ డెవండొకొ సముత్సుకుఁడై చనుదెంచె మంద కి
ప్డెందుల కేగుదెంచెడినొ యెందు వసించెడివాఁడొ వేరెవో
డం దను మాటలాడఁగ నెడం బొనరించినవాఁడొ చూడఁగన్. 338

వ. అని సముత్సుకలై గోపిక లాతనిం జుట్టుముట్టుకొని హావభావంబులం
గృష్ణసందేశంబు తెచ్చినవానిగం గ్రహించి ప్రశ్రయంబునం జేసి
పరిణామంబు గావించి వ్రీడాహాసవచనరచనల వివిక్తంబున సువ్యక్తం
బుగా నిట్లని ప్రశంసించిరి. 339

* తత్పతికిన్=మృతుఁడైనకంసున కని యభిప్రాయము.

వ. ...గిని మేము నీకు యదుకులేంద్రనిదూతుండనై వ్రజోర్వీకి
...ంచితి విట ననింద్యచరిత్రులు తల్లిదండ్రులే
...దిపక్షి వి...రమునం దేలుచు నుండ్రని వారిం దేర్పని
...గునం ...చ్చి నొంపం...దు తెల్పంగ లేదు స్మరింప నిచ్చటన్.

సీ. ...పుత్రులయెడ స్నేహానుబంధ మెన్న
...స్వ...బగు ముని కైనం దొడరి పెరల
...డిం జేసిన స్నేహ మదేశ నైనం
...ర్యము ప్రధాన మైనదై కానం బడును. 341

తె...ర. ...లయెడలను బురుషులచేతం
బొనరింపం బడినదై పొలిచినమైత్రి
...టులయం బూలప నగుసఖ్య మట్టు
లసమర్థనృపు విడినట్టు లాప్రజలు
...లు నిస్వుం డొవిటు విడనాడు
విధమునం బక్షులు వీతఫల మయి
...లకింప నగు చెట్టుం దెగి వీడినట్లు
తెలియంగ నగుటలు స్థిరం గాన వచ్చు. 342

తే. చదివి విద్యల గురువుల ఛాత్రు లట్లు
దక్షిణం గొని ఋత్విజుల్ దీక్షితు నటు
లతిథి భుజియించి గృహమేధి నపుడ విడిచి
నట్లు వని దీఱ విడిచెద రాండ్రు విటులు. 343

వ. ఇట్లు గోపిక లోపికలు లేక గోవిందగతవాక్కాయమానసలై యెడ
తెలియంగక లోకవ్యవహారంబు లెల్ల విడనాడి శ్రీకృష్ణుని కైశోరబాల్య
వస్థలయందలి క్రీడలం దలంచి తలంచి సిగ్గు విడిచి బిగ్గరగం బాడుచ
వాడుచు నాలోకించుచు శోకించు చుండి రప్పు డొకకాంత కృష్ణ
సంగమం బనుధ్యానించుచు నుద్ధవునిం దాంకున ట్లొ కానొకతుమ్మెద
...చి దానిం బ్రియదూతగా నెంచి యి ట్లని ప్రలాపించె. 344

—• భ్రమరగీతలు •—

ఆ. మధుప ! కితవబంధు ! మాసపత్నీస్తన
మండలాబ్జకుంకుమమునఁ దోఁగు
నీవు మాపదముల ని ట్లంటరాకుమా
మధుపతి వహించుయాదవమానినులను. 345

మ. నినుఁ బోల్ దుష్టుఁడు లేడు లోకమున నెంతే మమ్ము లాలించుచుం
దనియం జేసియు నిల్లు వీడితి లతాంతం బన్యాలన్ భృంగ మ
ట్లు నినున్ నమ్మఁగ రాదు పెద్దలు మునుల్ భూషించి భాషించుటన్
మనమందుం గడు నమ్మి వీడక నినున్ మన్నించు దా నక్కటా. 346

చ. మధుపమ నీవు మాకడను మాధవు పాడకు మాకుఁ గ్రొత్తగా
దధిపతియందు మాగ్రహము లట్టటు వెట్టి యిటున్నఁ మాకు దు
ర్వ్యాధ గలిగింప నో విడువు మా మధురాపురిఁ బోడు మాచెలుల్
సుధవలె నీదుపాట చవిచూచి నిను న్మది మెత్తు రత్తఱిన్. 347

శా. అల్లక్ష్మీజడజాక్షి లేనిఁ గని మోహావిష్టయై వేఁడుచో
ముల్లోకంబులకాంత లాసుమమునిం బొందంగ నాశించుటల్
జెల్లున్ కా దన నేము దీనులము మాచెల్మిం దగం జేసి మ
మ్మిల్లీలన్ వ్యథ పెట్టుటల్ తగునటం చీ వెంచి కీర్తింపుమా. 348

శా. నాపాదంబున నీశిరం బిడకుమా నాకంతయుం దెల్ల మీ
వాపద్మాక్షునిశిక్ష నొంది యిట దౌత్యంబుం బ్రసంగించి పో
నీపట్లం జనుదెంచి తీకపటమా కృత్యంబు చా ల్మేము మీ
గోపాలార్థము సర్వముల్ విడిచి రా గోరాడె మ మ్మారహీన్. 349

మ. మృగయుం బోలె నధర్మపద్ధతిఁ గపిశ్రేష్ఠు న్వధించెన్ స్మరా
శుగపీడం దను వేఁడుచున్న నవలాశోకంబు పాకంబుగాఁ
దెగఁ గోయించెను ముక్కునుం జెవులు నర్థిం జేరి మెట్టెన్ బలిన్
తగునే యట్టిముకుందుసఖ్య మిఁక చా ల్తద్గాథ లిం కేటికిన్ 350

మ. అలశ్రీకృష్ణకథామృతంబు నొకమా టానంగ ద్వంద్వాఘులం
దొలఁగం ద్రోచి మమత్వముం దొలఁచి యేదుఃఖంబులున్ లేక హం

సలు నోలెన్ మునిహంస లెల్లరును సంసారంబు వర్జించి భి
క్షులచర్యం గొని యుండు రీమాయునికియాచొప్పందు మోహంబున మా.

తే. తుమ్మెదా విన్ము కులికశబ్దమ్మువలన
కృష్ణభార్యలు హరిణులు కెలన మెలఁగు
పోల్కి కృష్ణునిపలుకుల మోసపోతి
మింక నతనిజోలి విడి మఱియొకటఁ జనుము. 352

చ. ప్రియసఖ! నీవు మాప్రియునిప్రేరణముం గొని వచ్చి యుంటివో
నయవిద! మాకుఁ బూజ్యుఁడవు నాథునిమిత్రమ వౌట నీకు నే
మయ మొసఁగన్ వరం బిడుదు మయ్య మమున్ గమలాక్షుప్రక్కకే
నియతి మెలంగఁ జేసెదవు నిల్చెదు నచ్చట లచ్చి నిచ్చలున్. 353

తే. మధుకరమ! కృష్ణుఁ డిప్పు డామధుపురమ్ము
నందు నుండెఁ దల్లిఁ దండ్రి బంధులను
గోపకులను దలంచునే గోపబాలుఁ
డెప్పుడేనియు మామాట చెప్పెడుగద. 354

క. మాకథ లాతం డెపుడే
వాకొనునో కొ పరిమళించువాని భుజయుగం
బేకాలమందుఁ గానీ
మాకున్ శిరమందుఁ దాల్చు మాట గలుగునో. 355

వ. అని గోపికలు పలికిన విని యుద్ధవుండు శ్రీకృష్ణదర్శనలాలస లగువారిఁ
బ్రియసందేశంబున నూఱార్చుచు ని ట్లనియె. 356

— ♦ ఉద్ధవుఁడు గోపికల నూఱార్చుచు వారిభక్తిం బ్రశంసించుట ♦ —

తే. కృష్ణభగవానునందు మీహృదయపద్మ
మెప్పుడున్ నిల్చియుండిన హేతువునను
మీరు ధన్యులు మాన్యులు మీసుకృతము
వాకొనన్ శక్య మందు నోవనితలార. 357

సీ. జపము తపంబును స్వాధ్యాయ సంయమం
బులు వ్రతిహోమముల్ మొదలు గాఁగ

నగువిధులంజేసి యగుసుకృతము కంటెఁ
బరమమైన మీకృష్ణభక్తి యొప్ప
మునులకే దుర్లభమును ఘనం బగుభక్తి
సమకూరెను మీ కదృష్టమునఁజేసి
సర్వముఁ విడనాడి సర్వేశ్వరుని మీరు
వరియించుటంజేసి పరమపూజ్య
ఆ. లేను మీప్రభువున కేకాంతమిత్రుఁడఁ
దద్రహస్యవార్తఁ దాల్చి తెత్తు
దాన మీకు సుఖము గానంగ వచ్చు నా
విభునివాక్యములను వేడ్క వినుఁడు. 31
పంచ. చరాచరంబు నైనజీవజాలమందు నెప్పుడుఁ
ధరాజలాగ్ని వాయునాకనామభూతజాతముఁ
గరంబు నిండి యుండు నట్లు గాన వత్తు మీహృదం
తరము నందు నుంటఁ జేసి నావియోగ ముండునే. 3
సీ. ఆత్మమాయాప్రభావాతిశయంబున
భూతేంద్రియగుణాత్మములను జేసి
నను నేనె సృజియించుకొని వానినిం బెంచి
చంపుచునుందు విజ్ఞానమునను
బరమాత్మ శుద్ధుఁడు పరిపూర్ణుఁడును మహా
జ్ఞానస్వరూపుఁ డజ్ఞానరహితుఁ
డాతఁడు వ్యతిరిక్తుఁ డన్నిటికి గుణాన్వ
యుఁడు నైన నిజమాయ నొంద నగుచు
తే. స్వప్నజాగ్రదాదు లునవస్థలను జేసి
విశ్వవిశ్రుతుఁ డగుచుండు వెనుక నిదుర
విడగ స్వప్నమువలె సర్వవిషయములును

తే. ఆపగల కబ్ధి యే గతి యైనయట్లు
త్యాగసాంఖ్యసమామ్నాయయోగములకు
జపతపోవ్రతసత్యాదిసంగతులకు
స్వాంతనిగ్రహమే తుద యౌను దెలియ. 361

క. దూరంబున నుండుటచే
మీరు నను మనమునందు మెలపుచు నెపుడున్
గోరిక ధ్యానించెద రా
కారణమునఁ జెంత నున్నకరణియు కాదే. 362

తే. దూరచరు లగుప్రియులపై నారులకును
బ్రేమ మిక్కిలియై మదిఁ బెఱుఁగునట్లు
చెంతనుండినవానిపైఁ గొంతకొంత
ప్రేమయే చెప్ప వచ్చెడు ప్రేతలార. 363

చ. నెలఁతలు మీరు నాపయిని నిల్పి మనంబు సమస్తమున్ సదా
తలఁచుచు నన్నివృత్తులను దత్పరత న్ననుఁ గొల్చుచుండుటన్
గలుగును మీకు నాదయిన గారవ మింతటిలోన నేను మీ
పొలములు కూటముల్ మఱచి పోయెడువాఁడను గా నొకప్పుడున్. 364

వ. ఇట్లు ప్రియుండు చెప్పిన చొప్పు లెల్ల విని వ్రజకాంతలు సంతసించుచు
నుద్ధవునిదిక్కు మొగంబై. 365

—♦ వ్రజకాంత లుద్ధవునితోఁ దమ పరితాపంబు చెప్పుకొనుట ♦—

తే. యాదవులకు నహితుఁ డగునట్టికంసు
ననుచరులతోడఁ బరిమార్చి యనుదినంబు
నిష్టములఁ దీర్చుహితులతో నెల్ల వేళఁ
గుశలియై కృష్ణుఁ డుండునే కుతుకమునను. 366

సీ. మాస్మితేక్షణముల మన్నింపఁ బడుకృష్ణుఁ
డామధురస్త్రీల ప్రేమ కగునె

మాప్రియుం డగువాఁడు మధురాపురాంగనా
విభ్రమంబులఁ జిక్కి విడువఁడు కద
ప్రోడ లాచేడెలఁ గోడనుండి యెప్పుడేఁ
దనముగ్ధలన్ మమ్ముఁ దలఁచునట్టి
వెన్నెలరేలు మావెంట నారాసోత్స
వము లెన్నఁడేని మనమున నిడునె
తే. తనకు గాఁ దపియించెడుతరుణుల మము
వనుల మేఘోదకంబుల స్వఃపతి బలె
హస్తసంస్పర్శనంబుల నతనుతాప
మార్చి బ్రదికింప నెన్నఁడే నగునె యిటకు. 367

చ. పిలుకురఁ జేసి శాత్రవులఁ బృథ్వితలాధిపుఁడై వివాహముం
జలుపుకొనంగ నున్నహరి చారుపురాంగనలం గ్రహింపఁగాఁ
దలఁచెడుఁ గాని వన్య లగుతన్వుల నెట్లు పరిగ్రహించుఁ బిం
గళ యనువేశ్య యాశ విడ గల్గుట శ్రేయ మటంచుఁ జెప్పదే. 368

క. ఐన న్మాకె న్నినోష్ఠ
మానుగ వచియించియుంట మాకృష్ణునిమే
మేనాఁటి కైనఁ గనుఁగొనఁ
గా నోపుదు మనెడునాశఁ గలిగితి మకటా. 369

శా. మాకృష్ణుండు బలాన్వితుం డగుచు నేమాడ్కిం బ్రవర్తించె న
ద్దాకొండల్ వనులు న్వనంబులును దివ్యాగారముల్ గోవులన్
మాకున్ జ్ఞప్తికిఁ దెచ్చునే మతని నేమాడ్కిన్ మదిన్ విస్మృతిం
గైకోఁ జాలుదుమో యెఱుంగ మిఁక మాకర్మంబె మా కయ్యెడిన్.

ఉ. ఆలలితావలోకనము లామృదుమాధురిమోక్తియుక్తు లా
బాలవిలాసహాసములభావము లాగమనోత్సవంబు లా
యాలఘులాలనప్రతిభ లాచిఱునవ్వులపువ్వు లాకళా
లీలలు మామదిం దగిలె లేమల మేమెటు కృష్ణు పీడుటన్. 371

తే. ఓరమానాథ వ్రజనాథ యోజనార్తి
నాశ ! సంసారసింధుమగ్నంబు గోకు
లంబు సర్వదుఃఖచయంబులఁ వెలార్ప
వేఁడుచున్నార మెప్పుడు నో మురపురుష. 372

వ. అట్లు శ్రీకృష్ణసందేశంబునం జేసి వ్యపేతవిరహజ్వరార్తులై వ్రేత లా
శ్రీకృష్ణునిం బరమాత్మునిగా నెఱింగి తత్ప్రియుం డగునుద్ధవు నిద్ధభక్తిం
బూజించి యుద్ధవుండును గోపికాదుఃఖముం దొలఁగించువాఁడై సంత
తంబు కృష్ణలీల లభివర్ణించి పాడుచు నామసంకీర్తనంబు చేయుచు
గోకులంబు రంజిల్లుచందంబునం బ్రవర్తిల్లుచుఁ గొన్నిమాసంబు లం
దుండి కృష్ణవార్తాశ్రవణప్రచారంబుల నాదినంబులు క్షణప్రాయంబులు
గావించుచు నదులు వనంబులు పర్వతంబులు నిర్ఝరిణులుం బుష్పి
తానోకహంబులు లోనగునవి యెల్ల వ్రజౌకసులకుం జూపుచు నందు
నందుఁ గృష్ణుని సంస్మరింపఁ జేయుచుఁ గృష్ణభక్తిఁ బ్రస్తరింపం జేయు
చుఁ గృష్ణావేశాత్మనిష్ఠ లగుగోపికలం జూచి సంతసించుచు వారి
భక్తిం జేసి వారికి మ్రొక్కుచుం దలంచి. 373

మ. భవభీతిం గలమాను లేని మదిలో భావింపఁగా నెంతురో
భువనంబుల్ సకలంబు తాన యగుచుఁ బొల్పొందు నాదేవునిన్
ధ్రువమై నిశ్చలమైనభక్తిమహిమన్ స్తోత్రంబు గావించుచున్
భువి నీగోపవధూటు లెంతయును సంపూజ్యోద్భవల్ చూడఁగన్.

క. వనచరమై చనునీవ్రజ
వనితాజన మేడ కృష్ణభగవానునిపై
ననువుపడుభక్తి యెక్కడ
కను గొన నంతయును దైవఘటనము గాదే. 375

క. భగవంతుఁడు తను నమ్మిన
యగచరు నేనియును దేవతారాధ్యుని గాఁ
దగఁ జేసి యమృతతుల్యము
లగుశ్రేయసము లెల్ల నతనికిఁ గూర్చున్. 376

తే. వాసుదేవుఁడు రాసోత్సవములయందు
గౌఁగిలింతలఁ గోపికాకాంతలపయి
గలుగఁ జేయు ననుగ్రహ మలఁతి కా దె
డఁద వసించెడుసిరికినై నొదవఁ బోదు.

తే. సర్వము త్యజించి వ్రేతలు సారసాక్షుఁ
గొలిచి పుణ్యాత్మ లైరి వారలు మెలంగు
స్థలములు పవిత్రతమము లై తనరు నచట
గడ్డిపరకకు నే సరి గాను నేను.

మ. సిరియున్ యోగులు బ్రహ్మముఖ్యబుధు లేచిన్మూర్తి పాదాబ్జము
పరిసేవించి కృతార్థులై మనెద రాపాదాబ్జముల్ గోపికల్
నిరతంబుం దమ పేరురంబులపయిన్ నిల్పంగఁ గొంచున్ భజిం
తురు తాపత్రయ మాఱ వారలను జేతోవీథి సేవించెదన్.

వ. అని పరబ్రహ్మనిష్ఠాగరిష్ఠబుద్ధిం జేసి గోపికలపాదపద్మంబుల కభివ
నంబు చేసి దాశార్హుం డగు నుద్ధవుండు గోపికలయు యశోదానం
లయు గోపాలురయు ననుజ్ఞం బడసి ప్రయాణోన్ముఖుం డగ
నతనిం గాంచి నందాదులు నానావిధంబు లగుదరిసెనంబులు
కంట నీరు వెట్టికొనుచు ననురాగంబున.

ఉ. మా మనముల్ ప్రవృత్తులును మాధవపత్కమలాశ్రయంబులై
నేమము నొందు మానుడులు నిచ్చలు నచ్యుతనామచింతయం
దేమఱకుండు మాతనువు లీశనమస్కృతులందు లగ్నమై
భూమి నెసంగు నే మతనిమూర్తి రతిన్ బడియుండు మెప్పుడున్.

వ. ఇట్లు పలుకుచు నుద్ధవు నంపిపుచ్చిన నతండు రథం బధిష్ఠించి మ
మధురాపురంబున కరుదెంచి కృష్ణదర్శనంబు గావించి నమస్కరి
వ్రజౌకసులభక్త్యతిశయం బంతయు నెఱింగించి వా రొసంగిన ఉప
యనంబులు బలరామకృష్ణోగ్రసేనాదుల కొసంగె నంత.

◆ దరిసెనము=కానుక; మాధవపత్కమలము=హరిపాదపద్మము.

— శ్రీకృష్ణుఁ డుద్ధవునితోఁ గుబ్జాగృహంబునకుం జనుట —

సీ. సర్వదర్శనుఁ డయి సర్వేశ్వరుఁడు కృష్ణుఁ
డుద్ధవునిం గూడి శుద్ధహృదయ
సైరంధ్రి యగుకుబ్జ సందర్శన మొనర్ప
దాని గృహముఁ జనెఁ దద్గృహంబు
వివిధోపకరణసంవేద్యము బహువిధ
బంధపటసహస్రపరివృతంబు
ముక్తాఫలస్యూతభూరిపతాకాభి
శోభితము వితానసురుచిరంబు
తే. పరమశయనాసనాదిసంభావితంబు
ధూపదీపశతాధికరూపితంబు
పుష్పమాలాసహస్రసంపూజితంబు
నై వెలుంగుచు నుండె నయ్యవసరమున. 383

వ. కృష్ణుండు నిజగృహసమీపగతుం డగుట కుబ్జ యెఱింగి చెలికత్తెలతో నెదురేగి తోడి తెచ్చి యాసనవిన్యాసనాదుల నభ్యర్చించె నుద్ధవుండును బూజితుండై కృష్ణపరిసరంబున భూతలంబున నాసీనుండై యుండెఁ గొంతలోఁ గృష్ణుండు నానావిధనూతనాలంకారాలంకృతంబగుదానిశయనంబునకుం జనిన నదియు గంధమాల్యతాంబూలాదు లొసంగి సవ్రీడలీలావిలోకనంబులం దేల్చుచుండె నప్పుడు కృష్ణుండు.

ఉ. లేనగ వాననంబునఁ జలించుచునుండగ సిగ్గుఁ జూపున
ద్దానికరంబు పట్టుకొని దగ్గరఁ జేరెడునట్లు చేసి నే
ధానిధి యైనకృష్ణుఁడు ముదంబునఁ గౌఁగిటఁ జేర్చి వుచ్చి యో
మానిని నీమనోరథము మన్మథతాపముతోడఁ దీఱె నే. 385

తే. అనుడుఁ గుబ్జ కృష్ణుని పద మంటె దాని
తనదుహృదయంబుపై మోపుకొని సమస్త
రుజలు తీఱెను గాని నీదుజత వీడ
నుత్సహించుట లేదు నాయుల్ల మధిప. 386

వ. అనినఁ గృష్ణుఁ డాఁ గాత మని దానిమనోరథంబు సఫలం బగునట్లు వరం బొసంగి దాని నభిమంత్రించి యుద్ధవునితో స్వధామంబునకుం జనిం

—• శ్రీకృష్ణుఁడు రామోద్ధవులతో నక్రూరునింటి కరుగుట •—

సీ. రామోద్ధవులఁ గూడి ప్రభువు కించిచ్ఛిక్ష
 ర్షం జేసి యక్రూరసదనమునకుఁ
నరిగె నాతఁడు వారి నరసి యొకింతలో
 నెదు రేగి తోడి తెచ్చి ముదితుఁ డగుచు
వారికి మ్రొక్కి-డి భద్రాసనంబులఁ
 నాసీనులం జేసి యమలవారిఁ
నంఘ్రులం గడిగి తదంబువుల్ తలఁ దాల్చి
 దివ్యాంబరాదులఁ దెలిచి కొలిచి
తే. రామకృష్ణులపాదముల్ ప్రేమ మీఱఁ
దనదుతొడలపై నిడికొని తగినయట్లు
కేల నొత్తుచు వారల లీలఁ గనుచుఁ
బలికె నీరీతి నానందభరితుఁ డగుచు. 388

ఉ. దైవవశంబునన్ ఖలుఁడు దానవరూపుఁడు కంసుఁ డీల్గె లోఁ
కావలి కెంతయేని ముద మావహిలెన్ మునివర్య యాదవుల్
కేవలమృత్యుదుర్ముఖము క్రిందకుఁ జేరకఁ దాఁటఁ గల్గి రో
దేవ జగత్స్వరూపు లను దేవర లీరు పురాణపూరుషుల్. 389

క. భూతములయందు భూతము
లేతీరున వివిధగతుల నెసక మెసఁగు మీ
రాతీరు భూతభౌతిక
జాతములం దాత్మలగుచుఁ జనుచుం దెల్పుదుర్. 390

ఉ. మీరు ప్రధానపూరుషులు మీరఁదఁ జరాచరలోకజాలమున్
సారెకు సృష్టిచేయుచు స్వశక్తులతో నట నుండి సర్వ మీ
రై రహిమించి మంచియును నవ్వల దుంచియు వెల్గుచుండు రి మి
మ్మొరును నేర్పరించి కన సంతయు నేర రవిద్యపెంపునన్ 391

వ. కృష్ణునిదిక్కు మొగంబై. 392

సీ. దేహాద్యుపాధులు దేవరకున్ లేవు
బంధమోక్షాదు లెవ్వాలనఁ గలుగుఁ
గలవను టజ్ఞానకలితభావము నీవు
ధర్మరక్షకు నిట్లు తనరుచుందు
విపుడు రక్షోబాధ లపనయింపఁగ నిట్లు
వసుదేవగృహమున వఱలి తీవు
నీపాదతీర్థముల్ నిఖిలలోకంబుల
నతిపవిత్రములు గా నాచరించు

తే. మాగృహంబులు మేమును మాకులంబు
నీదురాకఁ బవిత్రము లోదయాబ్ధి
నిను భజించినవారికి నిఖిలసౌఖ్య
ములు నొసంగెదుప్రభున వోపురుషమూర్తి. 393

క. నాభాగధేయ మిప్పుడు
శోభావహ మయ్యె సకలసురవందిత యో
భూభారహరణ! మమ్మున్
మాభారము తీర్చి ప్రోవ మానుతు లివియే. 394

వ. ఇట్లు భక్తుం డగునక్రూరుండు స్తుతించి భజించుచుండ శ్రీకృష్ణుండు
మోహపరవశుం గావించుచు సస్మితంబుగా ని ట్లనియె. 395

— శ్రీకృష్ణుఁ డక్రూరు నభినందించుచుఁ గరిపురికిం బుచ్చుట —

క. భవ్యమతి నీవు మాకుఁ బి
తృవ్యుఁ డవుగురుండ వెపుడు ధీవరజనసం
సేవ్యుఁ డవు బాంధవుండవు
నవ్యులమా మమ్ముఁ బొగడ న్యాయ్యం బొకో. 396

ఆ. అనఘ మేము నీకు ననుకంప్యులము రక్ష్యు
లమును సతతపోష్యులమును బుత్రు

లమును బెద్ద చేసి లాతులవిధమున
నిల్లు చూడ నొప్పునే మహాత్మ. 397

క. శ్రేయస్కాములు మానవు
లేయెడలన్ మిమ్ము వంటి యిద్ధాత్మకులన్
బాయనిగతి సాధుమతిం
జేయుచు సేవింప వలయు స్థిరతరభక్తిన్. 398

క. జలమయతీర్థంబులు మృ
చ్ఛిలామయసురప్రతిమలు చిరసేవం బునీ
తులం జేయుం జూచినంత స
కలమొసంగుర్ సజ్జనాళికరుణ జనులకున్. 399

తే. సాధుసజ్జనుం డవు నీవు సాత్వతేయ
నీవు మాముఖ్యమిత్రమ వైవెలయుదు
ముఖ్యబంధువు లగుపాండుపుత్రులకుశ
లమ్మెఱయుపొంటె గజపురి కేమ్మొం జనుము. 400

చ. జనకుండు తమ్ము వీడి సురసంగతి నొందంగ నేగినంతటన్
జననియుం దా రరణ్యమున సాల్వడి దుఃఖము నొందుచుండియున్
జనపతిపిల్పునన్ మఱియు స్వస్థలముం జని నట్లు వింటి మ
య్యానఘులమీందం జీకునకు సక్కటికం బది లేమి నిక్కమే. 401

క. తనయులవశమున నై య
జ్జనపతి సమవర్తి గాక సమవర్తియ యై
చను వారితెఱం గెఱుంగంగం
జని సర్వం బెఱింగి రమ్ము సాత్వతవర్యా. 402

వ. ఇట్లు జగన్నియంత యగుశ్రీకృష్ణుం డక్రూరు నాజ్ఞాపించి బలరామో
ద్ధవులతో స్వభవనంబునకుం జనియె నంత గాందినీసుతుం డగునక్రూ
రుండును సుముహూర్తంబునం గదలి హాస్తినపురంబునకుం జని యచట
భీష్మసహితుం డగునాంబికేయుని విదురుని బృథాదేవిని సపుత్రుం డగు

బాహ్లికుని సగోత్రముం డగుభారద్వాజునిఁ గర్ణసుయోధనాదులను ద్రోణాచార్యపుత్త్రుం డగునశ్వత్థామను ధర్మరాజభీమార్జుననకులసహదేవులను దక్కినసుహృద్వరులనుం జూచి వారివారిమర్యాదలకుం దగునట్లు సంభాషించి బంధుబృందంబుచే సుహృద్వార్తల నెఱింగియుం దాను నడిగి తెలిసికొని ధృతరాష్ట్రునడవడిం దెలియువాఁడై కర్ణదుర్యోధనాదులననుమతంబునం జేసిగొన్ని మాసంబులప్పురంబుననుండి.

సీ. కురుపాండవాదులకుఁ విద్య కలప్పుట
తేజఃప్రతాపముల్ తెలిసికొనుట
దుర్యోధనాదులదుష్టబుద్ధియుఁ బాండ
వులసుబుద్ధియుఁ బ్రజవలన నెఱిఁగి
విషము పెట్టుట లోనివిధము లన్నియుఁ గుంతి
యును విదురుఁడు సెప్ప నోలిఁ దెలిసి
ప్రస్థితుం డయి పోవుభ్రాతను బరికించి
పృథ యిట్టు లని పల్కెఁ బ్రేమ మించి

తే. అన్న మాతలిదండ్రులు నన్నదములు
భగినులును భ్రాతృపుత్త్రులు బందుగులును
సఖులు వే రేనిగాని యేసరణిఁ జేసి
యేని తలఁతురె మ మ్మెప్పు డైనఁ గాని. 404

మ. భగవంతుండును భక్తవత్సలుఁడు మాభ్రాతేయుఁడుఁ భాస్వరుం
డగుశ్రీకృష్ణుఁడు పద్మపత్త్రనయనుం డాశ్రమపాలుండు కా
ర్యగతుల్ గల్గినపట్ల నైన క్షణమాత్రం బైన మాతృష్వసే
యగతిఁ వారు తలంతురో తెలుపు మోయన్నా యథార్థస్థితిన్.

తే. అన్న ! తోడేళ్ళమధ్యమునందు లేడి
పగిదిఁ బగరమధ్యమునందు వగలఁ బొగలు
నన్నునుం దండ్రి లేనినాకన్నబిడ్డ
లను ననునయించునో కృష్ణుఁ డాదరించి. 406

వ. అని యధిగతపరమార్థయై కుంతీదేవి భక్తిభరితస్తోత్రంబున. 4(

తే. కృష్ణ! కృష్ణ! మహాయోగి! కేశవా! త్రి
విష్టపేశ్వర! విశ్వాత్మ! విశ్వభావ
నా! శిశువులతో శ్రమపడుచున్న దీను
రాలి రక్షింపు మోదీనరక్ష! దేవ. 4(

తే. మృత్యుసంసారభీరు లౌనెల్లజనుల
కీశ్వరుఁడ వయి మోక్షము నిచ్చునట్టి
వాఁడ వీ విష్ణు నీపాదపద్మయుగము
కంటె నన్యము శరణము గానఁ బడదు. 4(

తే. కృష్ణ! పరమాత్మ! యోగ! యోగేశ్వరా! మ
హాత్మ! శుద్ధస్వరూప! దేవా! మహేశ!
నీకు వందన మొనరించి నేను నిన్ను
శరణ మొందితి దీననై పరమపురుష. 4

వ. అని కృష్ణు ననుస్మరించుచుం బరితపించి దుఃఖించునాపృథాదేవి నపు
సమసుఖదుఃఖు లగువిదురాక్రూరు లూఱడించుచు నుపశమనో
క్తులెన్నయో పలికి రప్పుడు ప్రయాణోన్ముఖుం డగునక్రూరుండు పు
త్రలాలసుండును విషమబుద్ధియు నగుధృతరాష్ట్రరాజుచెంతకుం జని బలరా
మకృష్ణులును సుహృదులును చెప్పినచొప్పులం జెప్పువాఁడై సుహృన్మ
ధ్యగతుండై యి ట్లనియె. 4

—• అక్రూరుఁడు ధృతరాష్ట్రాదులతోఁ బ్రసంగించి వచ్చుట •—

ఉ. ఓయి విచిత్రవీర్యహృదయోద్భవ! పాండుఁడు స్వర్గభూమికిం
బోయినయంత రాజ్యమును బొందితి ధర్మువు తప్పకుండ భ
ద్రాయితమూర్తివై ప్రజలఁ బ్రస్తుతి కెక్కఁగ నేలుచుంటి నీ
దాయలపట్ల నెప్డు సమతం గొని శాశ్వతకీర్తి నొందుమా. 4

క. ఈకరణిఁ గాక మఱియొక

నీకపయశ మగుటయు గా
కాకడ నిరయంబు లందు నగువెతలు కడున్. 413

క. కావున నీకొడుకులయం
దావలఁ బాండవులయందు ననిశము సమతం
బోవుము విషమగతుల్ మది
కేవేళం దగుల నీయ కేలుము ప్రజలన్. 414

సీ. ఈలోకమున నేఁడు నేనితో నెవ్వఁడుం
గలసి వసించుట కలుగఁ బోదు
జాయాత్మజులతోడ జనునకుఁ గాఁదగ్గ
కార్య మేమియు లేదు కలయ దెల్ల
నొకజంతు వుదయించు నొకఁడు చచ్చు నొం
డొకఁడు దుష్కృతి నొకఁడు పుణ్య
మనుభవించుచునుండు నధిప! న్యాయేతర
గతిసమార్జిత మైన కాంచనంబు

తే. దారపుత్రాదులను బ్రోచు దాని కిడఁగ
నాస సేయుదు రింతె కా కపయశంబు
వచ్చు ననుమాట తలపోయ రిచ్చ నట్టి
వారి కిహపరములఁ జేటు వచ్చు నిజము. 415

వ. అనర్థకోవిదుండు నసిద్ధార్థుఁడును స్వధర్మవిముఖుండు నగునట్టివాఁడు తనంత తాన కిల్బిషమ్ముల సంగ్రహించి దారపుత్రాదిబహిష్కృతుండై పోయి యంధతామిస్రం బను నరకంబునం బ్రవేశించుఁగావున.

మ. కురురాజాగ్రణి! స్వప్నతుల్య మగుచుం గోర్కిం బిసాళించునీ
పరిదృశ్యం బగులోక మంతయును భాస్వద్జ్ఞానదృష్టిం బహి
ష్కరణంబుం బొనరించి శాంతమతివై త్వత్పుత్రులుం బాండుభూ
వరపుత్రుల్ సము లంచు నెంచుచును సద్భావంబునం బ్రోవుమా.

తే. అనుడు ధృతరాష్ట్రుఁ డనియె దానాధినాథ
జడుఁ డమృత మాని తృప్తిసెఁ బడయనట్లు

నాకు నీమాటతృప్తి పొనర్ప దాత్మ
జలవిషయ మాత్మ మెఱుమునా జలవమందు.

ద్విపదము. భూభారహరణార్థమున కేమహాత్ము
డీభూతలంబునఁ గృష్ణుఁడై పుట్టె
నాభగవంతునిదగుమాయ మీఱి
నేభూతములు లేమియే నిక్కవంబు.

తే. ఎవఁడు తనమాయ నీలోక మెల్లఁ జేసి
తా నటఁ బ్రవిష్టుఁడై గుణత్రయవిభాగ
మునను సంసారచక్రముఁ బొనరఁ జేసె
నతనికృష్ణున కేటికో శ్లాచరింతు.

వ. అనిన ధృతరాష్ట్రు నభిప్రాయం బెఱింగి మాధవుండు సుహృదః
తుండై మధురాపురంబునకుం జని తాను పోయి వచ్చినవృత్తా
ఆంతయు బలరామకృష్ణుల కెఱింగించె నని చెప్పిన నైమిశా
వాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును.

ఆశ్వాసాంతము.

మ. కవు లన్నం గవితాప్రభావ మనినం గౌతూహలప్రక్రియన్
వ్యవహారంబు లవన్నియు న్విడిచి తద్వ్యాసంగమం దే మదిం
దవులం జేయుచుఁ దత్ప్రవృద్ధికొఱకే తాత్పర్యముం జేయురా
జవరేణ్యుం డగుసాగిసూర్యుఁడు మహైశ్వర్యంబునం బొల్చుతన్.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమ స్కంధంబున బూర్వభాగంబునఁ
దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

—:0:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## దశమస్కంధము

## ఉత్తరకాండము

## ప్రథమాశ్వాసము

—:o:—

క. శ్రీవేదమాతృకామం
త్రావిష్కారకైకమూలమై మూర్తులు మూ
డై వెలుఁగుసూర్యదేవుఁడు
భూవిభుఁ డగుసాగిసూర్యుఁ బోచుత మెప్పుడున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లుగ్రసేనుండు వచ్చి ధృతరాష్ట్రవిచేష్టితం బెఱింగించినపదంపడిఁ గంసపత్నులగు నస్తిప్రాప్తు లనువారు విగతభర్తృకలై వగచుచుం బితృగృహంబునకుం జని తండ్రి యగుజరాసంధున కంతయు నెఱింగించిన నతండు శోకామర్షరూషితుండై మేదిని నయాదవంబు గావింతు నని పరమోద్యమంబు గావించి యిరువదిమూడక్షౌహిణుల సేనం గూడి పోయి మథురాపురంబు ముట్టడించె నంత. 2

— జరాసంధుఁడు మథురమీఁదికి దండెత్తి వచ్చుట —

ఉ. కారణమానవుం డగుచుఁ గాశ్యపిఁ బుట్టిన మాధవుండు త
ద్వారణవాహపత్తిరథవాహిని సాగర మట్లు పొంగి దు
ర్వారము గా స్వపత్తనము వంకలు నాలుగు ముట్టడింపఁ గా
నారసి దేశకాలముల కైనవిధమ్మున నెమ్మనమ్మునన్. 3

శా. భూభారం బుడిగింతు మాగధునియీభూయిష్ఠసైన్యంబు నీ
భూభృద్వర్గము చూచుచుండఁగ నసంభోకార్చెదన్ వెండియున్

దా భూయిష్ఠముగా వరూథినిని సంధానించి రా మాగధుఁ
నే భంజింపఁ దలంప నిప్పు డనుచున్ జింతించుచుండెన్ మదిన్. 4

ఆ. అపుడు నింగినుండి సపరిచ్ఛదములు స
సూతములు మహాయుధాతతములు
సూర్యనిభము లైనసురుచిరరథములు
రెండు కృష్ణునెదుట నుండె వచ్చి. 5

వ. వానిం జూచి కృష్ణుండు సంకర్షణుం బిలిచి యి ట్లనియె. 6

తే. నీదురక్షణమం దున్న యాదవులకు
వ్యసన మి ట్లిట్లు సంప్రాప్త మయ్యెఁ జూడు
మదిగో నీ కయి సాయుధస్యందనంబు
దివమునందుండి చనుదెంచె దేవ తెలియ. 7

ఉ. ఈరథ మెక్కి దుఃఖమున నెంతయు వంతల నొందుచుండు నీ
వారి సముద్ధరింపుము ప్రభావము పెంపున సాధురక్షకే
ధారుణి జన్మ మెత్తితిమి దాన దురాత్ముల నెల్ల దున్మి భూ
భారము వాపఁగా వలయు బాహుబలంబు ప్రశస్తి కెక్కఁగన్. 8

వ. అనిపలికి రామునితోఁ గృష్ణుండు కవచంబు దొడిగి సాయుధుండై
కతిపయసేనాసమూహంబుతో రథం బధిష్ఠించి పురంబు వెలువడి పర
హృదయకంపంబుగా శంఖంబు పూరించె నాలో మాగధుండును
మాధవుం దరియవచ్చి కుత్సించుచు ని ట్లనియె. 9

శా. ఓరోరీ పురుషాధమాధమ! మహాయుద్ధంబు గావింపఁ జాల్
వీరుండో యన శంఖ మొత్తితి వనిన్ వీక్షించి నన్నీతునన్
బాలుం జాలిఁగనిన్ను మార్కొనఁగ నే స్వాంతంబు గావింపఁ బో
మ్మేరీకారముసేయుచున్ బ్రదుక నెందో యోలమాసించుచున్.

చ. అని బలరాముదిక్కు మొగమై తగునే యిటు కొండిక బుచ్చి నీవిటుల్
కనుఁగొనుచుంటి ధైర్య మది గల్గునయే నొకయింత నీ వనిం
బొనరుప రమ్ము మచ్ఛరసముజ్జ్వలతేజము చూచి పిమ్మటన్
జనియెదు స్వర్గముం గనగఁ జాలినవాఁ డగుదో హలాయుధా. 11

వ. అనిన శ్రీకృష్ణుండు వానిం గని యిట్లనియె. 12

తే. శూరు లగువారు నీవలెఁ బౌరుషంబు
మాటలం జూపఁ బో రెప్పు డేటుల ననిఁ
జూపుదురు గాని చాల నెంచి చొప్పు దప్పి
పలుకు నీపల్కు గణియింపఁ దలఁప మేము. 13

వ. అనిన జరాసంధుండు గర్వాంధుఁడై రథహస్తిపత్తితురగాంచితం బగు
మహాసైన్యంబుతో బలరామకృష్ణులఁ దఱుగనికోపంబున నేపు మిగిలి
వృషదశ్వుండు పరాగపటలంబుచే సూర్యాగ్నులం బలె నరిమి తరుమం
జొచ్చె నయ్యవసరంబున. 14

సీ. మధురాపురస్త్రీలు మాడుగులును మహా
సౌధము లెక్కియు సైన్యమందు
రామకృష్ణులరథరాజంబులం గనఁ
జాలక మిక్కిలి జాలిపడిరి
హరిపరబలముక్తశరవర్షమున మునిం
గిననిజ సేనలఁ గని రయమున
శార్ఙ్గచాపంబును సారించి సారెకు
పూరించి శంఖము పుంఖములుగ

తే. నిశితబాణపరంపర నిగుడఁ జేసి
పరబలంబుల నుగ్గాడుప్రజ్ఞ గలిగి
సమరభూమి నలాతచక్రంబు పగిది
నవిరతంబుగఁ దిరుగాడునట్టిఁ డయ్యె. 15

సీ. కుంజరంబులు భిన్నకుంభంబులై కూలెఁ
దేరులు సర్వముం దెరల నయ్యె
హరు లింతలింతలు సిరములు దెగ వ్రాలెఁ
బడిరి కాల్బంటులు పగులఁ దలలు

సూతులశీర్షముల్ క్షోణిఁ బాతరలాడె
ధ్వజపతాకలు దెగి ధరణిఁ గప్పెఁ
బీనుంగుపెంటలఁ బృథివియంతయు నిండె
రక్తప్రవాహము వ్యక్తమయ్యె
తే. భుజము లనుసీటిపాములు పృష్ఠ లనెడి
కచ్ఛపంబులు హస్తు లనుగ్రాహములును
కేశశైవాలమును మాంసకీర్తి చయము
గలిగి ప్రవహించె నపుడు రక్తస్రవంతి. 16
క. హలము గొని యెల్లశాత్రవ
బలముం దూలించె నపుడు బలరాముఁడు వా
రల యుద్ధముఁ జూచినవా
రల కప్డు మహాభయంకరం బని తోఁచెన్. 17
మ. బలరాముండు మహాబలుండును మహాప్రారంభుఁ డై మాగధున్
గలనన్ గృత్తబలున్ విశీర్ణరథుఁ గాఁ గావించి యొక్కింతలో
పల హర్యక్షము లేటిపిల్లను బలెన్ బాహుద్వయిం బట్టి క
ట్టలుకం గట్టెను బ్రాణి మట్టి చనునో యన్నట్టిచందబునన్. 18
ఉ. వారుణపాశబద్ధుఁ డగుప్రాణి తెఱంగున సంచలించుచున్
బారము నొందనున్నతఱి వచ్చి ముకుందుఁడు కడ్డ మొంచి దే
వారిని వానిఁ జంపవల దంచు హలాయుధు వేఁడి పుచ్చె నా
కూ్రరుఁడు నట్లు ముక్తుఁ డయి కొంచక పోయెను సిగ్గుపెంపునన్. 19
వ. దుర్మనుం డగుజరాసంధుండు మాధురంబులకుఁ జని మఱియుం దఱు
గనిబలంబులం గూర్చుకొని విజయసంతోషితస్వాంతులై యున్న రామ
కృష్ణుల మఱియు మార్కొనం గలఁడై భేరీమృదంగాదినిక్వాణంబు
బోరుగలుగ నానావిధాలంకారాలంకృతం బగుమధురాపురంబునకుం
జని నలుతట్టులు ముట్టడించినంతఁ గృష్ణవైరితు లగువృష్ణులను

దైవ్యంబు నొందించినం గాందిశీకుండై బార్హద్రథుండు మరలి చనియె
నిట్లు పదియేడు పరు లైనంతఁ బదునెనిమిదపర్యాయంబున సంగ్రా
మంబునకుఁ గాఁ దలంచియున్నంతలో నారదప్రేరితుం డగుకాల
యవనుండు మూఁడుకోట్లతురుష్కబలంబుం గూర్చుకొని మధురపై
దండెత్తె నత్తఱి. 20

సీ. సంకర్షణసహాయసముపేతుఁ డగుకృష్ణుఁ
డా కాలయవనుపెం పది యెఱింగి
యిరువురు శాత్రవు లీరీతి మార్కొన
నైరి ప్రజకుఁ గష్టమావహిల్లె
నీనాఁడు వీఁడు రేపో నేఁడొ వాఁడును
రా నుండె మనతోడ రణ మొనర్ప
నది గావునఁ శాత్రవాసాధ్య మగునట్లు
దుర్గ మొకఁడు రిపుదుర్గముగను
తే. ఇపుడు నిర్మించి బాంధవబృందములను
నందు నివసింపఁగాఁ జేసి యవనముఖ్యు
లను యమాలయమున కంప ననువు పడెదు
ననుచుఁ దలపోసి బలరాముననుమతమున. 21

— సముద్రమున ద్వారకాపట్టణము నిర్మించుట —

వ. శిల్పవిద్యావిశారదుం డగుత్వష్టృనిం బిలిచి వానిచే సముద్రమధ్యం
బున ద్వాదశయోజనవిస్తీర్ణం బగునద్భుతదుర్గంబు నిర్మించె నది
వాస్తుశాస్త్రోక్తవిధానవినిర్మితంబును రథ్యాచత్వరవీథీవిరాజితంబును
సురద్రుమలతోద్యానవిచిత్రోపవనాన్వితంబును మహోన్నతహేమ
శృంగవిరాజితంబును స్ఫాటికాట్టాలకగోపురద్వారసమంచితంబును
రాజతారకూటవినిర్మితాశ్వగజశాలాసముపేతంబును హేమకుంభా
లంకృతంబును మహోన్నతసౌధప్రాసాదభాసమానంబును జాతుర్వర్ణ
జనాకీర్ణంబును నై విరాజిల్లుచుండె నట్టికాలంబున. 22

సీ. ఆఁకలి దప్పి మోహాదులం బెడబాప
సభఁ బారిజాతము శక్రుఁ డంపె
శ్యామైకకర్ణము లగుశుక్లహయముల
వేయి యాదఃపతి వేడ్కఁ బంపె
యక్షేశుఁడు నిజోదయము లగునైశ్వర్య
ముల నెన్మిదింటి నిం పలర నంపెఁ
బెరలు దిక్పాలకు లరుదార స్వాధికృ
తధనంబు నంపిరి తగ నెఱింగి

తే. తమకు భగవంతుఁ డిచ్చినసముచితాధి
పత్యమున సముపేతమై వఱలు నట్టి
ధనసమూహ మదంతయు ధరణి నవత
రించినట్టివానికి నిచ్చి రంచితముగ. 23

వ. అంత శ్రీకృష్ణుఁడు విశ్వకర్మనిర్మితం బగునాద్వారకాపురంబున నిజ
యోగప్రభావంబునం దనవారి నెల్లం బొందించి బలరామానుమంత్రి
తుండై వచ్చి నిరాయుధుండు పద్మమాలాలంకృతుండు నై పుర
ద్వారంబునుండి బయలు వెడలుటయును. 24

—♦ శ్రీకృష్ణుఁడు కాలయవనుఁడు వెంట నంటఁ బరువెత్తుట ♦—

మ. ఉదితాజ్ఞం దనఁ జెప్పఁ నొప్పుచు మహోద్యోగంబునన్ శత్రుసే
న దరిం జేరఁగ నిష్క్రమించునటు గాన న్వచ్చె నవ్వచ్చునా
యదువంశోద్భవు దవ్వులన్ యవనుఁ డీహం గాంచి యీతం డెవం
డొ దెసల్ సూచుచు బోవుచుండు ననుచున్ లోలో విచారించుచున్.

తే. శ్యామలాంగము శ్రీవత్సచారువక్ష
మభినవాబ్జారుణేక్షణ మతిమనోహ
రాననము పీతకౌశేయ మరసి యితఁడు
వాసుదేవుఁడు కా నోపు వరుసవలన. 26

క. నారదమునిప్రోక్తగు
ణారంభము లెల్ల వీనియందు స్ఫురించన్
బోరన్ శస్త్రముఁ బట్టక
యీరహిఁ బదచారి యగుచు నేతెంచు నహో. 27

వ. నేనును నిరాయుధుండనై యితని నెదిరించెదం గాక యని పరాఙ్ము
ఖుండై పఱచువాని వెన్నుఁ దన్ని తానునుం బఱవఁ జొచ్చె. 28

తే. శమదమాదిసద్గుణయుతుల్ సంయమీంద్రు
లెవ్వనిం బట్టుకొన లేమి నెవ్వగ కయి
యుందురో వానిఁ బరమాత్ము నందుఁ డగుచుఁ
బట్టుకొన నెంచి వెనువెంటఁ బరువు లెత్తె. 29

చ. అడుగున నడ్డు వేయఁ గలఁడై యవనుండు కదున్ వడిన్ వడి
న్నడచుచు లంగ వేయుచు క్షణంబునఁ బట్టెద నంచు నెంచు లోన్
నెడ మయి దూరదూర మయి యింతటిలో నతిసన్నికృష్టమై
యొడిసి కొనంగ నైనగతి నుండియుఁ గొండొకదవ్వు పాఱియున్. 30

క. చేతికిఁ బట్టఁగ వచ్చెడు
రీతిన్ బ్రతిపదమునందు రేఁచిననడ న
ప్పీతాంబరుండు పఱచుచు
నాతఱి నొకకొండగుహా రయంబునఁ జొచ్చెన్. 31

ఉ. యాదవవంశమందు జని నందిననీ విటు పాఱిపోవుటల్
గా దుచితంబు భీ[illegible]నయి తే మనువారు వీరు లీ
మాదిరి చూచి చా[illegible] మాణవకుండ వటంచు రోయుచున్
గాదన కగ్గుహం జొరగఁ గల్గె స్వగర్వము సగ్గిపోవుటన్. 32

వ. అట్లు పదరుచుఁ గాలయవనుండు గుహాగర్భంబు సొచ్చి యచ్చటఁ
బండుకొని నిద్రించియున్న యన్యపురుషుం గాంచి. 33

శా. ఓరీ నీ విటు నన్నుఁ గన్మొఱఁగి యెంతో దూర మాచోటికిన్
జేరం దెచ్చితి సాధుమూర్తివలె నీ క్షేత్రంబునం బండితే

ఘోరం జాలక పాఱుఁబోతు వయి నిన్ బో నిత్తునే యంచు దై
త్యారిభ్రాంతిని దన్నెఁ బాదమున నిద్రాభిదంబు మార్మ్రోయఁగన్.

మత్త. తన్నినంతన నిద్రితుం డగుతజ్జనుండు రయంబునన్
గన్ను విప్పుచు లేచి దిక్కులు గాంచి ప్రక్క నెసంగునా
పన్నుఁ డాయవనేశ్వరుం డగపడ్డ వానిపయిన్ గ్రుధా
సన్నదృష్టి నిగిడ్చె నంతన చచ్చెఁ గాలి యతం డొడల్. 35

తే. అనఁ బరీక్షితుఁ డిట్లను ననఘమూర్తి
యవను బసుమంబు నేసినయమ్మహాత్ము
డెవ్వఁ డాతని తేజ మదెట్టిదది గు
హాగృహంబున నిద్రితుం డగుట యేమి. 36

వ. చెప్పు మనుగ్రహింపు మనిన శుకుం డిట్లనియె. 37

—♦ ముచుకుందుని వృత్తాంతము ♦—

మ. అతఁ డిక్ష్వాకుకులంబునందు ఘనుఁడై హర్వ్యందుమాంధాతకు
న్సూనుఁ డత్యంతపరాక్రముండు ముచుకుందుం డన్నభూపాలుఁ డు
న్నతవిద్యావిభవుండు దేవతలకున్ సంగ్రామరంగంబులన్
సతమున్ దోడ్పడి దైత్యబాధ లుడిపెన్ సాక్షాత్కుమారుండునాన్.

క. దేవళ్లు వాని కెంతయు
భావంబున మెచ్చి మమ్ము బహువారంబుల్
గావం గల్గితి వసుకుల
యావళ్లవి గాక యుండ నవనీనాథా. 39

మ. నరలోకంబును వీడి వచ్చితి మమున్ గాపాడునిచ్చన్ మహీ
శ్వర నీపుత్రులు మిత్రులున్ సతులు తత్సంపద్విశేషంబులు
న్వరుసం జెల్లెను గాల మెన్న బలవంతం బీశ్వరుం డొక్కఁడే
పరిదృశ్యం బగుచుం బ్రపంచమును ద్రిప్పం జాలుఁ దా నెప్పుడున్.

క. నీకు వరంబు నొసంగుదు

వాఁడొను మిచ్చెద మే మిపు
డాకైవల్యంబె వలయు ననహరియె తగుఁ. 41

చ. అన ముచుకుందుఁ డి ట్లను దివౌకసులార హరిఁ భజించి ము
క్తినిఁ బడయంగ నెంచితి మదిఁ భగవంతునిదర్శనంబు నా
కొనరెడుదాక కొండగుహ నుండి సమస్తము రోసి నిద్రవో
నొనరుపుఁ డీవరం బనిన నో మ్మని రెల్ల సుపర్వు లంతటఁ 42

వ. ముచుకుందుం డప్పటినుండి గుహావిష్టుండై శయనించి నిద్రించుచుండె
నట్లు కాలయవనుండు భస్మసాత్కృతుం డైనపదంపడి సాత్వతర్షభుం
డగు శ్రీకృష్ణుండు ముచుకుందునిసమక్షంబున దర్శనం బిచ్చుటయు
నతండు. 43

సీ. వారిదశ్యాముని వరపీతకౌశేయ
వాసు సుశ్రీవత్సవక్షు దివ్య
కౌస్తుభోరస్కునిఁ గని చతుర్భుజు వైజ
యంతీవిరాజితు ననియె నిట్లు
నీవెవ్వరు మహాత్మ నీరజదళమృదు
పదములం గొండల వనుల మెట్టి
చనుదెంచి తిటకుఁ దేజస్వుల లోన నే
తేజస్వివో యగ్నిదేవుఁ డవొకొ

తే. రవివొ చంద్రుడవో యింద్రుఁడవొ మఱొక్క
లోకపాలుఁడవో చెప్పు మోకృపాళు
మూడుమూర్తుల నీ వొక్కమూర్తి వనుచుఁ
నెంచుచున్నాఁడ నీ తేజ మిట్లు పర్వ. 44

ఆ. చెప్ప నిష్ట మైనఁ జెప్పుమి యవ్వలీ
కముగ నీదుజన్మకర్మగోత్ర
ములను యౌవనాశ్వపుత్రుఁడ నిక్ష్వాకు
వంశభవుఁడ వినుము ప్రభువరేణ్య. 45

తే. ఏను ముచుకుందుఁ డనుపేర నెసఁగువాఁడ
నెవ్వఁడో నన్ను లేపి తా నిట్లు సేసెనదు
పాపమునఁ జేసి భస్మమై పడటఁ గలసె
నవల శ్రీమంతుఁడగునిన్ను నరసినాఁడ. 46

శా. స్వామీ! నీమసహింపరానివర తేజం బేను వీక్షింపఁ గా
నేమాత్రంబును జాల కుంటి. నివు డీవెన్నంగ సర్వేశ్వరుం
డై మాన్యుం డగు దేవదేవుఁ డని నాస్వాంతంబునం దెంతు నా
నామానాథుఁడు నవ్వుచుం బలికె నబ్దారావగంభీరతన్. 47

—♦ ముచుకుందుఁ డెజింగి శ్రీకృష్ణుని స్తుతించుట ♦—

సీ. అనఘ! నాజన్మకర్మాభిధానంబులు
కల వనంతంబులై కానఁ బడుచు
భూరజంబుల లెక్కఁ బోలె నవ్వానిలె
క్కయు నసాధ్యం బయి కానఁ బడును
మూడుకాలములందుఁ బొదలు నాజన్మక
ర్మము లెంచుచు మహర్షు లమరి యుంద్రు
విను మిప్డు ధర్మగుప్తినిఁ బొనర్పఁగ విధి
చేఁ బ్రార్థితుండనై క్షితితలమున

తే. యదుకులంబున వసుదేవసదనమందు
వాసుదేవుఁడనై పుట్టి దోసకారు
లైనకంసాదిదైత్యుల నాహవమునఁ
ద్రెళ్ళనేసి భూభారము తీర్చినాఁడ. 48

ద్విపదము. నీదృష్టిపాతము నిలుచుటఁ జేసి
యాదురాత్ముఁడు కాలయవనుఁడు ద్రెళ్లె
నోదేవ ని న్నేలునూహముం జేసి
యీదెస కే నిటు లే తెంచినాఁడ. 49

మత్త. మున్ను నీవు మహాతపమ్ము సమున్నతిం బొనరింపనై
యున్నవాఁడవు కావున నిను నొయ్యనం గనుఁగొంప నా

నన్నుఁ డైతి వరంబు వేఁడుము సంతసంబున నిచ్చెదన్
నన్నుఁ గొల్చినవారి కెప్డు మనఃపరిభాధు లడంగెడిన్. 50

వ. అనిన ముచుకుందుం డమందానందకందళితాంతరంగుండై సాష్టాంగ వందనంబు గావించి వృద్ధగర్గునివచనం బనుస్మరించుచు నాతని నారాయణదేవునిగా నెఱింగి యి ట్లని ప్రార్థించె. 51

ఉ. స్త్రీపురుషస్వరూప మయి చెప్పఁగఁ జొప్పడునీజనంబు నీ
దై పొలుపొందుమాయ ననయంబు విమోహితమై యనర్థదృ
క్కై పరమాత్మ నిన్ నిను సుమంతయునేఁ దెలియంగ లేక దుః
ఖాపిత మైన గేహమున యం దతివంచితమై చరించెడిన్. 52

తరళము. జనుఁడు దుర్లభ మైనమానవజన్మ మందియు బుద్ధి లే
మిని గృహం బనునంధకూపము నేరలోఁ బశుతుల్యుఁడై
యనిశముం బడియుండి నీదుపదారవిందసమర్చనం
బొనరుపంగ సమర్థతం గొనఁ బోక వ్యర్థుఁడయై చెడున్. 53

సీ. మర్త్యాత్మబుద్ధిచే మహిరాజ్యమత్తుఁడ
నై దారపుత్రధనాదులందుఁ
దగిలినచింతచేఁ దగ నెఱుంగఁగ లేని
నాకాల మఫలమై పోక కయ్యొ
ఘటసన్నిభం బగుకాయమునం దభిమాన
మున రాజు ననుగర్వమును వహించి
నినుఁ గణింపఁగ లేనినిరతదుష్టుఁడ నైతి
నీ వప్రమత్తుఁడ వై వెలయుచు
ఆ. నన్ను వంటిజడుని నారీజనార్థలా
లసునిఁ బశుసమాను వెస గ్రసించి
యాఁకట న్వెలార్చునహి నోర్తెఱచి మూషి
కమును బోలె మ్రింగఁ గలవు తండ్రి. 54

చ. అరదము లేన్గు లశ్వము లనంతము లై తనుఁ గూడియుండఁ గా
నరపతిసంజ్ఞితుం డగుచు నల్గడ మెట్టెడు మేటి యైన దు
స్తర మగు కాలగర్భమున సాళ్వడి విట్క్రిమిభస్మసంజ్ఞిత
స్ఫురణకు నై యెడల్ చెడఁగఁ బొందెడు నారకబాధ లజ్ఞుఁడై. 55

చ. పురుషుఁడు దిక్కులం గెలిచి పూజ్యత నొంది వరాసనస్థుఁడై
నిరత మనంతసంపదల నిచ్చ వధూజనసంగమేచ్ఛ మైఁ
దిరుగుచు నెల్ల గేహములఁ స్త్రీజనకేళి మృగంబు వోలె నై
నిరయము లంది పొందు నవసం బడి యింబరి దుష్టజన్మముల్. 56

ఆ. నిష్ఠ మైఁ దపించి నిహతపాపుం డయి
భోగములఁ ద్యజించి పొందుఁ బరము
కోరికలను బొందఁ గోరి కర్మ మొనర్చి
జనుఁడు బ్రహ్మపదముఁ జనఁగఁ బోఁడు. 57

సీ. సంసారబంధమోక్షము గల్గినంత స
త్పురుషసాంగత్యము పొందఁ గలుగు
దానఁ బరావరుం డైన నీయందు మా
నవునకు దృఢభక్తి నలువు మీఱు
వనిఁ దపించెడు సాధుజనులచేఁ బ్రార్థింపఁ
బడునీవు నాపయి నిడుము కరుణ
నిరభిమానప్రార్థనీయుఁడ వగునీదు
పదసేవయే నాకు వర మొసఁగుము

తే. త్రిగుణబంధము లై చెప్ప నగు మహాశ
లను విడిచి నిర్గుణుఁడు నిరంజనుఁడు పరమ
పురుషుఁ డగు నిన్ను విజ్ఞానపరతఁ జేసి
శరణ మొందుచుఁ నుంటి నోసదమలాత్మ. 58

శా. ఎన్నో పాపము లాచరించి యిహమం దెంతేనిసంతాపముం

కున్నాఁడఁ బరమేశ్వరా! యిపుడు నాయుల్లంబునం దుండి యా
పన్ను న్నన్నుఁ గృపార్ద్రదృష్టికలనన్ బాలింపవే మ్రొక్కెదన్. 59

వ. అనిన శ్రీకృష్ణుం డి ట్లనియె. 60

తే. ఓయి ముచుకుంద వరముల నొందు మనుచు
దేవతలు పల్కినను నీదుధిషణ కోర్కు
లందుఁ దగులొంద కెపుడు నాయందు నిల్పి
యప్రమత్తుఁడవై యుంటి వనఘ నీవు. 61

క. ప్రాణాయామాదులు నా
మానగుయోగములయందు మన మదిచేరం
గా నిలుపునభక్తులకున్
నానావిధకర్మవాసనలు దెగ వెపుడున్. 62

క. మనమున నాపై భక్తిన్
గొని మెలఁగుము భూతలమునఁ గొనకొని యెపుడున్
జననాథ నీకు నాభ
క్తి నివర్తిల్లక లభించి తిరమై యుండున్. 63

తే. క్షత్త్రధర్మస్థితిం జేసి జంతుసమితి
వేటలం గూల్చితివి గాన వృజన మద్ది
వోవ మదుపాశ్రయుండవై భూరితపము
చేసిపుణ్యవంతుఁడ వయి వాసి గనుము. 64

క. దానం జేసి మహీసురుఁ
డై నేలం బుట్టి మరల నతిభూతదయా
స్థానమవై మెలఁగుచు నా
పై నన్నుం బొందఁ గలవు భక్తుఁడ వగుచున్. 65

వ. ఇ ట్లనుగ్రహింపంబడి ముచుకుందుండు ముకుందునకు వందనం బాచ
రించి ప్రదక్షిణపూర్వకంబుగా గుహాగేహద్వారంబునుండి నిష్క్రమించి
స్వల్పప్రమాణంబు లగుమనుష్యపశ్వాదులను వీరుద్వనస్పతులం

గాంచి కలియుగంబు సంప్రాప్తం బయ్యె నని తలంచుచు నుత్త
రాభిముఖుండై నిస్సంగుండును ముక్తసంశయుండు నై కృష్ణభగవాను
నందు భావంబు నిలిపి గంధమాదనంబునకుం జని బదర్యాశ్రమంబున
నరనారాయణాలయంబున హరిధ్యానంబు గావించుచుఁ బరమతపో
నిష్ఠాగరిష్ఠుండయ్యె నయ్యెడఁగృష్ణుండును గాలయవనావృతం బగుమధు
రాపురంబునకు మరలి వచ్చి మ్లేచ్ఛబలంబుల నెల్ల ద్రెళ్లనేసి తత్తద్ధనం
బంతయు ద్వారకానగరంబునకుం బొందుపడం జేయఁ గొని పోవుచుండె
నాసందున జరాసంధుండు వెండియుఁ ద్రయోవింశత్యక్షౌహిణీరక్షి
తుండై తత్క్షణంబున రామకృష్ణుల నెదిరించె నంత. 66

—◆ జరాసంధుఁడు ప్రవర్షణగిరిని దహించుట ◆—

మ. బలుఁడుం గృష్ణుఁడు శత్రుసైన్యములదర్పం బెల్ల నీక్షించి మ
ర్త్యులధర్మంబున భీతి గొన్నవిధముల్ తోఁపంగఁ దొట్రిల్లుచున్
గలగం బాఱినచిత్తవృత్తి గలరై గాఢద్రుతం బేర్పడన్
గలపిత్తం బది యెల్ల వీడి పఱవం గా వైరి భీరుల్ బలెన్. 67

తే. పద్మపత్రనిభంబు లౌ పాదములను
మెట్టుచును బహుయోజనాల్ మేర వడిగ
వడిగఁ బరువెత్తి రత్తఱి వారిఁ జూచి
మాగధుఁడు సేనతో వెంట మూఁగి పఱచె. 68

ఉ. రాముఁడు కృష్ణుఁడున్ వెనుక రాయిడిసేయుచు వచ్చుమాగధుం
దాము నెఱింగి మార్గమున దాపయి యున్నప్రవర్షణాద్రిపై
దీమస మొప్ప నెక్కి యొకతెన్నున డాఁగిరి చెట్లసందునన్
భూమి నెసంగు వారలకుఁ బోల్పఁగ శక్యము గానియట్లుగన్. 69

తే. ఇంద్రుఁ డాపర్వతంబున నెపుడు వర్ష
మును గురియుచుండుఁ గావున భువిఁ బ్రవర్ష
ణాహ్వయంబున నాకొండ యతిశయిల్లెఁ
బొడవు పదునొండుయోజనములకుఁ జాలి. 70

మ. గిరిపై డాగిరి రామకృష్ణు లనుచుఁ గిం చాజరాసంధుఁ డ
గ్గిరి నల్ప్రక్కల మేటిదారుచయముం గీలించి కక్షంబునన్
సురవర్త్మంబును ముట్టున ట్లనలముం జొప్పించి వెల్గించె ద
త్పురుకీలాచయ మెల్లెడన్ విరిసి భీతుం గొల్పెఁ గల్పాగ్ని నాన్. 71

మత్త. మున్ను ధూమము లేచి నల్గడ ముట్టి కన్నులఁ గొట్టఁ బై
నెన్న శక్యము గానిమచ్చున హెచ్చి కీలలు మింటిపై
నున్నవై భయదక్రమంబున నుద్ధతిం గొని వెల్గె నం
దున్న జంతుసమూహ మంతయు నుగ్రభంగి మృతిం గొనెన్. 72

పంచ. కృశానుకీలలన్ మహోగ్రరీతి నట్లు మండుచో
దశైకయోజనోన్నతిం బ్రదర్శనీయ మా ప్రవ
ర్షశైల మందు మీఁదినుండి రామకృష్ణు లత్తఱిన్
విశేషరంహ మేర్పడంగ బిట్టు దూఁకి రుర్వికిన్. 73

ఆ. ఇట్లు దూఁకి రామకృష్ణులు శత్రుల
కంటఁ బడక వెనుకఁ గలుగుదారి
సాగరాంతరమునఁ జనుద్వారకాపురి
కరిగి రండజేంద్రు లనెడురీతి. 74

వ. మాగధుండును మాధవులు మహాగ్నిం జేసి క్రగ్గి మడిసి రని తలంచి
మగధంబులకుం జనియె ననంతరంబ. 75

—◆ రుక్మిణీకల్యాణకథాఘట్టము ◆—

శా. ఆనర్తాధిపుఁ డైన రైవతుఁడు బ్రహ్మప్రేరితుండై శుభా
స్థానంబై జగదేకసుందరియునై తల్లోకత్తు బాలామణిన్
దా నా రేవతిఁ దెచ్చి రామునకుఁ గన్యాదానముం జేసె నం
చే నీకు న్వినిపించితిన్ మును గురూర్వీశాన వింటే వటన్. 76

మ. విను మో కౌరవవంశభూషణమ! గోవిందుండు సాల్వాదులన్
దనుజప్రాయులఁ జైద్యపక్షచరులన్ దండించి లోకుల్ గనన్
వనితారత్నము రుక్మిణీరమణి నుద్వాహంబు గా నొందె మున్
వినతాపుత్రకుఁ డింద్రు నోర్చి సుధన్ జేకొన్న చందంబునన్. 77

తే. అనిన రా జను భీష్మకతనయరుక్మి
ణిని హరించెను రాక్షసంబున ముకుందు
డనుచుఁ జెప్పితి సంక్షేపమునను మఱియు
నది సవిస్తరముగ విన నైతి నిపుడు. 78

మ. భగవంతుం డగువాసుదేవుఁ డెటు లాప్రత్యర్థులన్ సాళ్వులన్
మగధాధీశుల నాహవంబునను గ్రుమ్మం జాలి వైదర్భి నే
తెగువం జేసి గ్రహించి తెచ్చెనొ మునీద్రేంద్ర! తత్సర్వమున్
దగ ని ప్డీవు వచింప నేను వినఁగం దాత్పర్యముం జేసితిన్. 79

చ. శ్రవణసుఖప్రదంబులును సర్వమలాపహముల్ మహో
త్సవములు నిత్యనూత్నములు తామరసాక్షుకథల్ వినన్ విన
జవులు జనించుచుండు నవి చాలు న టంచును దృప్తి నొందఁ గా
నెవఁ డగు వాఁడు వేదు రని యే వచియింపఁగ నయ్యెడుం జుమీ.

సీ. అనిన శుకుం డను నధిప విదర్భదే
శమున భీష్మకుఁ డనుజనపతి యగు
రుక్మి రుక్మరథుండు రుక్మబాహుండును
రుక్మకేశుండును రుక్మమాలి
యనఁగ నేవురు కొమా ళ్ళతనికి రుక్మిణి
యనునొక్కకూఁతురు జనన మంది
రందఱకుం జెల్లె లగురుక్మిణీదేవి
తమయింటి కరుదెంచుధరణీసురులు

తే. ప్రతిదినంబును గృష్ణుపరాక్రమంబు
చక్కఁదనమును శ్రీయును సద్గుణములుఁ
బాడుచుండంగ విని విని స్వాంతమందుఁ
దనకు ననురూపవిభుఁ డాతఁ డని తలంచె. 81

ఉ. అక్కడఁ గృష్ణుఁడున్ నెలఁత నాయమఁ జెప్పఁగ నాలకించి పెం
పెక్కినబుద్ధిలక్షణము నింద్రియసౌష్ఠవమున్ గుణంబులున్

జక్కదనంబునుం దనకుఁ జాలెడు నంచుఁ దలంచి యచ్చెలిన్
మక్కువచేసె భార్యగను మానసమందు గ్రహించినట్టిదై. 82

ఉ. తల్లియుఁ దండ్రియున్ బుధులు దాయలు రుక్మిణి శౌరికీయఁ గా
నుల్లము సేయుచుండ నది యొప్పనివాఁ డయి రుక్మి కృష్ణునిన్
బ్రల్లదముల్ వచించుచు శుభం బది కా దని త్రోసిపుచ్చి సం
పల్లలితుండు చైద్యుఁ డని వానికి సోదరి నీఁ దలంచుచున్. 83

క. జననియు జనకుఁడు బంధువు
లును వానితలంపు మాన్ప లోఁ జాలమి నే
మన కూరకుండి రిట్లని
విని వనితామణి మనమునందు వెతలఁ గుందుచున్. 84

—♦ రుక్మిణీ సందేశము ♦—

శా. ఆప్తున్ బ్రాహ్మణుఁ బిల్వఁ బంచి యొకనిన్ వ్యాఖ్యానముం జేయుచున్
దృప్తుం డైనసహోదరుం దెలిపి సందేశంబు గావించుచున్
వ్యాప్తం బైననిజాశయంబు యదువంశాబ్ధీందుఁ డౌ శౌరికిన్
దృప్తిం బొందగఁ జెప్పఁ బుచ్చె వినతుల్ దీపింపఁగాఁ జేయుచున్.

వ. బ్రాహ్మణుండును ద్వారకాపురంబునకుం జని ప్రతీహారులవలనఁ ద న్నెఱింగించి కాంచనాసనాసీనుం డగువాసుదేవునిం దరియం జేరుట యు నతం డతనిఁ గాంచి నిజాసనంబునుండి దిగి వాని నం దాసీనుం గావించి పూజించి విశ్రాంతిం గాంచినవానిం గాంచి యి ట్లనియె.

సీ. ద్విజవరశ్రేష్ఠ! నీవృద్ధసమ్మితధర్మ
మొప్పుగాఁ గొనసాఁగుచున్న యదియె
నిజధర్మమం దుండి నిరతసంతోషి యౌ
విప్రుఁడు జగతికిఁ బ్రీతికరుఁడు
సంతుష్టి లేకున్న శక్రుఁడైనం జెడుఁ
బేదయుం దుష్టిమై మోద మొందు
సంతుష్టులై భూతసమ్మతులై శాంతు
లగువిప్రులకు మ్రొక్కు లాచరింతుఁ

తే. గుశల మే మీకు మీర లేకువలయేశు
నేలుబడినుండి సుఖముగా నెల్లనాఁడు
ప్రబలుచుందురొ నాకు నారాజవరుఁడు
ప్రేమపాత్రి మటందు నోపృథివిదేవ. 87

శా. ఈ వేకార్యము గోర్కిఁజేసి మది మాయిప్రోలికిన్ వచ్చితో
నావంకం న్నెఱవేఱఁగా నయినచున్నం జెప్పు మోబ్రహ్మవం
శావిర్భూతమణీ! పొనర్చుటకు నే నై యుంటి వాకొమ్ము నా
నావిప్రోత్తముఁ డిట్లు పల్కె సకలం బాఖ్యానముం జేయుచున్. 88

తే. విను విదర్భాధిపతిపుత్రి విమలగాత్రి
ప్రస్తుతోద్వాహమంగళ వారిజగళ
రుక్మిణీదేవి యనుకన్య రూపధన్య
నీకు విన్నప మొనరించె నీరజాక్ష. 89

ద్విపదము. ఆదేవి పంప నే నరుదెంచినాఁడ
నీదుసన్నిధి కిట్లు నీరజనాభ
ఆదిగర్భేశ్వరి యనువచనముల
నాదరంబున విను నట్టిఁడ వగుము. 90

చ. వినియెడువారిలో పలికి పీనులనుండి భవద్గుణావళుల్
చని పరితాప మార్చెడినిఁ జక్కనినీదగురూపుకన్నులం
గనినయి సర్వసౌఖ్యములు గల్గఁ జేసెడి నంచు విన్న నా
మన మిది సిగ్గు వీడి నిను మాటికి నంటగ వచ్చె నచ్యుతా. 91

తరళము. భువనసుందర! సత్కులంబునఁ బుట్టి సుందరినై మహో
త్సవగుణంబుల నొప్పునేచెలి తాను గన్నియనై వివా
హవిధి కైనపు డంతరంగమునందు నన్నిట నీడు జో
డవునినుం బతిఁగా వరింపనియట్టిదె కనుపట్టునే. 92

ఉ. కావున నే నినుం బతిగఁ గాఁగల వంచుఁ దగం దలంచుచున్
భావమునన్ వరించితిని నాదగుదేహము నీకు నర్పితం

బై వటులుం ద్వదీయధన మైననుర్ శిశుపాలుఁ డక్ఖిలుం
డావరసింహభోజ్యబలి నామృగధూర్తము వోలెఁ గోరెడిన్. 93

ఉ. ఏ నఖిలేశ్వరేశ్వరు ననేకవిధంబులఁ గొల్తునేని నా
మానస మెప్పుడున్ సుకృతమార్గమునం దగునేని నన్నెవం
డేనియు నంటకుండఁ బరమేశ్వర వచ్చి మదీయహస్త మా
నా ననఁ గైకొనంగ నిదె ప్రార్థనముం బొనరింతు నెంతయున్. 94

శా. స్వామీ! రేపగుపెండ్లివేళకు విదర్భం జేర సేనాసమా
హామోదంబును గల్గి వచ్చి మగధేశాన్వీతచైద్యాదులన్
స్థేమం బేర్పడ గెల్చి శౌర్యమె జగద్విఖ్యాతశుల్కంబుగాఁ
బ్రేమ న్నన్ను గ్రహించి రాక్షసవిధిన్ శ్రీ లొప్పఁ బెండ్లాడుమా.

సీ. నే నెట్లు పెండ్లాడ నేతు నంతఃపుర
మం దుండురుక్మిణి నందు వేము
తొలినాఁడు కులదేవతలఁ గొల్చునాచార
మగు నందునన్ నేను నగరి వెలుపల
నెసఁగుచండికఁ గొల్వ నేగుదు నంతలోఁ
జనుదెంచి నీవు నన్ గొనఁగఁ నొప్పు
నిట్లు నే వాంఛింతు నిది గాక యుండె నే
వ్రతకృశనై నేను బ్రాణములను

తే. విడిచెదను గాని యొండొకవిధము గా శ
రీరయాత్రను గావింపఁ గోర నూఱు
జన్మముల నెత్తి యేనియు జలజనాభ!
నిన్నె పెండ్లాడఁగా నెంచి యున్నదాన. 96

వ. అని రుక్మిణీదేవిసందేశ మని చెప్పిన బ్రాహ్మణోత్తమునిచేయి చేతం
బట్టుకొని శ్రీకృష్ణుం డిట్లనియె. 97

సీ. నామీఁదిచిత్తమునన్ రుక్మిణీదేవి
యేరీతిఁ గునుకు లే కారటపడు

నేను నారీతి నానీరజాక్షి యెడంద
నిలువ నిద్రాహారములను విడిచి
యుంటి నిక్కము నాదునుద్వాహమున కిష్ట
ప్రతిరోధ మారుక్మి మతి నెఱుఁగుదు
నట్టైన మృధమున నందఱ నిర్జించి
తెత్తు మత్సర యగు తెఱవమిన్న
తే. అనుచు నటఁ బెండ్లిలగ్నము నడిగి తెలిసి
దారుకుం బిల్చి పయనముఁ బేరుకొనుచు
తేరు సిద్ధము సేయగాఁ దెలుపుటయును
సూతుఁ డాతఁ డట్టుల యగుం గాత మనుచు.

—• శ్రీకృష్ణుఁడు విదర్భాపురికిం జని రుక్మిణిం దెచ్చుట •—

వ. సైన్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లను జవనాశ్వంబులం బూ
రథంబు సన్నద్ధంబు చేసి తెచ్చి కృష్ణునగ్రభాగంబున నిలిపిన నత
సందేశహరుం డగుద్విజోత్తము నం దెక్కించుకొని ప్రయాణ
తూర్ణగమనంబున నొక్కరాత్రిలో నానర్తంబులు దాఁటి విద
నగరంబు దరియ నరిగె నంత నక్కడ భీష్మకుండును.

తరువోజ. కొడుకుమాటకు మాఱుకొని వల్క నోడి
కొమరితఁ శిశుపాలకున కీయ నెంచి
వడివడిం గొని పెండ్లిపనులు సేయించి
పత్తనం బంతయుఁ బ్రియముదంబు మీఱఁ
గడు నలంకారము గావించె నపుడు
కలచతుష్పథములఁ గలయంపి చల్లి
తడిపి పన్నీటఁ జిత్రపతాక లెల్ల
తలముల నిలిపిరి తగఁ దోరణములు.

మత్త. పూలదండలు నాల్గుచోటులఁ బొల్పు మీఱఁగ నిల్పిరయ్యె
జాలగట్టులఁ దోరణంబులు చాలఁ గట్టియు నెట్టనక

స్త్రీలు పూరుషు లందు నందును జేరి వేయుచు ధూపముల్
నాలుగుంగడలం దలంకృతులం బొనర్చిరి డంబుగన్. 101

వ. అంత నాభూకాంతుండు పితృదేవతల నారాధించియు విశ్వేదేవుల సేవించియు విప్రులం బూజించియుఁ బుణ్యాహంబు వాచించియు యథాశాస్త్రంబుగ మంగళాచారంబు లెల్ల నిర్వర్తించియు సుస్నాత యగుకన్యారత్నమునకు రక్షాబంధనంబు గావించి యనాహతాంశుక యుగ్మంబు గట్ట నిచ్చి నానావిధాలంకారంబుల నలంకరించె నంత.

తే. ఋగ్యజుస్సామమంత్రము లెసఁగ విప్రు
లింబుమీఱ రక్షాబంధనం బొనర్చి
రపు డథర్వవేత్తలు దొడ్డ మడఁగఁగ గ్రహ
శాంతు లొనరించి వేల్చిరి జ్వలనమందు. 103

తే. విప్రులకు రాజచంద్రుఁడు వివిధదాన
ములు పొనర్చెను దమఘోషభూమిపతియుఁ
గొడుకు శిశుపాలునకు మేలు కూడుపొంటె
స్నాతకవ్రత మెల్ల నెసంగఁ జేసె. 104

సీ. స్నాతకవ్రతుఁ డైనచైద్యుఁడు చతురంగ
బలసమేతుం డయి బలసి వచ్చెఁ
గుండినపురమునకుం భీష్మకుం డెదు
రేగియుఁ దోడితెచ్చి యిచ్చె విడిదఁ
జైద్యపక్షంబున సాళ్వజరాసంధ
దంతవక్త్రవిదూరథప్రముఖులు
రాజన్యు లెందఱో రాణువ లంటి తాఁ
బెండ్లికి వచ్చిరి పెద్ద లగుచు

తే. రామకృష్ణులు వచ్చి రేని రాముఁ గొనఁగ
వారితో బోరి కొట్టించి వారిజాక్షిఁ
దెచ్చి శిశుపాలునకు నిచ్చి తేజ మెసఁగఁ
బెండ్లిచేయుద మని యుండ్రు గొల్లమీఱ. 105

మ. బలభద్రుం డటఁ దమ్ముఁ డొక్కరుఁడె దర్పం బేర్పడం బోయె బం
ధులతోఁ జైద్యుఁ డెదుర్చుఁ బేర్చి రణమందుం గొందఱే దోర్బల
దలపుం జేయక యుంటి నేనియుఁ బ్రమాదం బయ్యెడుం గన్యకా
తిలకంబుం గొనఁ గష్టసాధ్య మని హృద్వీథి న్విచారించుచున్. 106

తే. బహుళసేనాసమేతుఁడై భ్రాతృవత్స
లుఁడు ప్రలంబఘ్నుఁ డచ్యుతునడుగుజాడ
నంటి కుండినపురమున కరిగి వడిగ
ననుజునిం గూడి తోడ్పడి నట్టెఁ డయ్యె. 107

—♦ పెండ్లికూఁతురగు రుక్మిణి కృష్ణుని రాకకై ప్రతీక్షించుట ♦—

తే. వాసుదేవాగమనమును వాంఛఁ జేసి
భీష్మకన్యక పోయినపృథివినుఁడు
మరలి రామిఁ దత్తఱపడి మానసమునఁ
దలఁచె ని ట్లని తెన్నులఁ గలయఁ గనుచు. 108

సుగంధి. మందభాగ్య నైననాదు మానంబు మంటమై
డిందుచుండె నయ్యయో కడిందితాప మిప్పుడే
మందు వేయఁ దీఱఁ దీఱ దందఁ బెండ్లి సేతకున్
సందు మూఁడుజాలె కృష్ణుజాడ గానరా దయో. 109

తరువోజ. సందేశహరుఁ డగుబ్రాహ్మణుఁ డైన
చనుదెంచుచుండెడు జాడయు లేదు
మందబుద్ధి యటంచు మధువైరి నన్ను
మర్షంబునం జూచి మత్పాణిఁ గొనఁగ
సందడింపఁడొ చిత్తజలజంబునందు
సందేహమున నాదుస్వాంత మిత్తఱిని
గొందల మందెడుఁ గొంతలోఁ బ్రొద్దు
గ్రుంకెడు చొప్పు నాకుం దోఁచు నయ్యె. 110

పంచ. అదృష్టహీనురాండ్రలోన నాది లెక్క కైననే
నెదేని పన్ని కృష్ణుఁ దెచ్చి యిచ్చుదాత లేడయో
తదేకచిత్తనై తపించుదాని నన్ దయామతిన్
సదాశివుండు ప్రోవఁ డాదిశక్తి కాదు కావఁగన్. 111

క. సమయము దాఁటినయంతన్
గ్రమ మంతయుఁ దప్పు నాదు కాలం బిపుడే
క్రమమున నున్నదియో స
ర్వము దైవాధీన మెట్లు రా నున్నదియో. 112

మ. అని ధ్యానించుచుఁ బెండ్లికూఁతు రగునయ్యబ్జాక్షి కృష్ణాగమం
బును గాంక్షించుచు నుండ వామనయనంబుం బాహువున్ సక్థియున్
గనుచుండన్ స్ఫురియించె మేల్ దెలుపుచున్ గంజాక్షి కన్పించునం
తన సాక్షాత్కృతుఁ డయ్యె బ్రాహ్మణుఁడు కృష్ణప్రేరితుండై కడన్.

వ. అట్లు సాక్షాత్కరించిన నిజసందేశహారుం డగు బ్రాహ్మణునిముఖవికా
సంబునం జేసి లక్షణాభిజ్ఞయగు రుక్మిణీదేవి శుభంబు శంసించుచు. 114

పున్నాగవృత్తము. వచ్చెనె వాసుఁదేవుడు మహాశుభాగా ననుం బ్రోవ నా
వచ్చె నినుం గ్రహించుకొని పోవన్ బాస గావించె నం
చిచ్చ వచించు భూసురుని నంతే భక్తి భావించుచున్
మెచ్చి నమస్కరించెఁ గరముల్ మోడ్చి రెండుం దగన్. 115

సీ. బలరామకృష్ణులు వఱతెంచి రాత్మజ
పెండ్లి వేడుకఁ జూడఁ బేరిమిఁ జేసి
యని విని భీష్మకుం డల్లంత నెదురేగి
పూజించి తోడితెచ్చి పూజ్యవసతి
వసియింపఁ గాఁ జేసి బలగంబుతో వారి
కాతిథ్య మొసఁగి సంప్రీతిఁ గూర్చి
మిగిలిన రాజులఁ దగునట్లు సత్కార
ముల నాదరించె సత్పురుషుఁ డగుచు

తే. అపుడు రాముఁడు కృష్ణుఁడు నరుగుదెంచి
రంచు విని పౌరు లందఱు హర్షమునను
వచ్చి నేత్రాంజలుల వారివదనపద్మ
ములను గ్రోలుచుఁ దమలోనఁ బలుకుకొనిరి. 11

క. ఈకృష్ణున కారుక్మిణి
గా కేపూర్ణేందుముఖియుఁ గాని తగదు వో
యాకృష్ణవేణి రుక్మిణి
కీకృష్ణుఁడు గాక యితరుఁ డెవ్వఁడు తగఁడు వో. 11

తే. మనము చేసినపుణ్యంబు మంచి దైవ
నీత్రిలోకేడ్యుఁ డగుకృష్ణుఁ డీశ్వరాజ్ఞ
మన విదర్భేశకన్యకామణినిఁ బెండ్లి
యాడుఁ గావుత మానంద మతిశయిల్ల. 11

వ. ఇట్లు పురౌకసులు పలుకుకొనుచుండ రేవకడ నంతఃపురంబునం మాతృకాసహిత యగురుక్మిణీదేవి గౌరీపదపల్లవంబులు సేవింప ముకుందచరణారవిందంబు లనుధ్యానించుచు మౌనవ్రతంబున నల్లనల్ల పదవిన్యాసంబు చేయుచుం బయలు వెడలె నప్పుడు. 11

సీ. ఆలీజనము చుట్టు లీలమైఁ దిరుగాడ
భటులు నల్గడ బరాబరులు సేయ
పటహశంఖమృదంగబహుళవాద్యంబులు
శ్రోత్రపేయంబుగా మ్రోయుచుండ
స్రగ్గంధవస్త్రాభరణములు గైకొని
పుణ్యాంగనలు వెంటఁ బోలుపు మిగుల
వివిధోపహారముల్ వెనువెంటఁ గొని వార
వనితలు ముం దయి చనుచు నుండ

తే. సూతమాగధవందులు స్తుతులు సలుప
గాయకులు మేటిగానము చేయుచుండ

వృద్ధవనితలు దీవనల్ విస్తరింపఁ
బెండ్లికూఁతురు రుక్మిణి పేర్మి నడచె. 120

వ. ఇట్లతివైభవంబున విదర్భరాజతనయ భవానీ మందిరంబునకుం జని ధౌతపాదకరాంబుజయై జలోపస్పర్శనంబు చేసి దేవళంబున భవాన్వితయగు భవానికిఁ షోడశోపచారంబులం బూజించి యి ట్లని ప్రార్థించె.

ఉ. పుట్టకము న్నె నే నెవనిఁ బొంద వినిర్మితి గల్గి యుందునో
యెట్టిమహోదయంబునకు నెప్డు దలంచుచు నుందునో ఘనుం
డట్టిమనోవిభుం డిటకు నాగతుఁ డయ్యెడు వానిపొందు నా
కెట్టు ఘటిల్లఁ జేసెదవొ యే నిను వేఁడుచునుంటి నమ్మరో. 122

క. మనుజులకు నసాధ్యము లగు
పను లవి సాధ్యములు నీకుఁ బరమేశ్వరి ! నా
మనమెఱిఁగి జీవితేశ్వరు
ననుఁ గూర్పుము నీకు వందనం బిదె జననీ. 123

సీ. గౌరీమహాదేవి నీరీతిఁ బ్రార్థించి
విప్రకాంతల కెల్ల వేఱు వేఱఁ
దమలముల్ కంఠసూత్రంబులు బండ్లతి
రసము లపూపము లొసఁగి కొలిచి
వారలు దీవించి వరుస నిర్మాల్యాక్ష
త లొసంగఁ గైకొని తవిలి మ్రొక్కి
చెలికత్తెయ లొసంగఁ జే యూని చండికా
భవనంబు వెలువడి బయట వచ్చెఁ

తే. గడల మూఁగినరాజలోకంబు లెల్లఁ
గర్ణకుండల మండితగండలవనఁ
గుటిలకుంతల రుక్మిణీచటులనయనఁ
గాంచి మోహించె మదనవికారమునను. 124

మ. తనసౌందర్యమునన్ వయోవిభవమున్ దామోదరుం జేర్ప నై

గొని భూపాలురు ఖడ్గముల్ శరములుం గోదండముల్ జాఱి కుం
భినిపైఁ వ్రాల విమూఢచిత్తు లగుచుం బెంపేది రొక్కమ్మెడిన్. 125

ఉ. అంచ తెఱంగునం గరిత నంఘ్రియుగంబును నేల మోఁపుచుం
గొంచెపుఁజూపులం నయనకోణములం వెలి బర్వఁ జేయుచుం
మించినవేడ్కఁ గృష్ణుఁ డెట మెట్టెడునో యని యెత్తి ముంగురుల్
కొంచక రాజులం గనేఁడు కోరిక లేకయ కాంచె నెల్లరన్. 126

—♦ భవానింగొలిచివచ్చు రుక్మిణిని కృష్ణుం డపహరించుట ♦—

క. చూచినచూ పది సార్థక
మై చెల్లఁగ విభుఁడు తనదునభ్యర్ణమునన్
లోచనగోచరుఁ డయ్యెన్
రాచరికపుఠేవ లెల్ల రాణింపంగన్. 127

ఉ. చూచినచూపులోపునన శౌరవరేణ్యుఁడు కృష్ణుఁ డాచెలిన్
దాచినసొమ్మొకో యనఁగఁ దాను గ్రసించి హఠాద్గతిన్ గనన్
జూచుచునుండ శాత్రవులు చుల్కన వారిఁ బరాభవించి పె
ల్లేచినశౌర్యసంపదల నెక్కఁగఁ జేసె రథంబు మీఁదికిన్. 128

భుజంగప్రయాతము. జరాసంధముఖ్యుల్ క్షమాభారభూతుల్
బరీభావ మెంతే ప్రవర్తిల్లినంతన్
ధరాచక్రమందుం దగన్ నిల్వ లేమిన్
గరం బాఱ్ఱితోడన్ గడుం గోప మారన్. 129

ఉ. అంత ననంతకోపమున నందఱు ముందఱిచూపు లేక దై
త్యాంతకు నడ్డగించుటకు నాయతశౌర్యము ధైర్య మేర్పడన్
గొంతటిలో బలంబులనుఁ గూడి రథాదుల నెక్కి హేతులన్
వింతగఁ ద్రిప్పుచుం జనిరి వెంబరవిత్తులు వెన్నుఁ దన్నుచున్. 130

ఉ. యాదవసైనికాగ్రిసరు లాపఱ దెంచెడుశత్రువాహినిన్
మోదముతోడఁ జూచి చలముం బల మేర్పడ నిల్చి పెల్చఁ దా

మాఁదట నాయుధంబులు శరాసములుం గొని రెండు రెండు మా
మీఁదికి మీ రిలం డనెడుమేర బరాబరి యయ్యె నియ్యెడన్. 131

వ. అంతఁ జైద్యబలంబు సన్నికృష్టగతం బై. 132

తే. కత్తిలానులపై గజస్కంధములను
స్యందనంబులపై నిల్చి సారసాక్షు
బలముపై బాణవర్షము పరఁగఁ గురిసె
గిరులపై మేఘములు వాన గురియునట్లు. 133

మ. శరవర్షంబున ఛన్నమై హరిమహాసైన్యంబు దైన్యంబునం
దురపిల్లం బడినట్లు తోఁచుటయుఁ జేతోవీథి భీతిల్లి భూ
వరకన్యామణి రుక్మిణీరమణి లోఁ బర్వంగ మందాక్షమా
హరివంశం గనె బిక్కమోము వడ దేహం బెల్లఁ గంపింపఁగన్. 134

సీ. ఇంగితజ్ఞుఁడు కృష్ణుఁ డెఱిఁగి యి ట్లను నవ్వి
వామలోచన లోన భయము విడుము
కనుచుండు మింతలోఁ గనుకనిం బడి తెగ్గు
యాదవబలము చే నరి బలంబు
లనునంతలో శౌరు లగుగదాదులు రేఁచి
పరగజాశ్వరథాళి బడలువడగ
సలిపి రపుడు కోట్లకొలఁది శిరంబులు
శరములం దెగి తెగి ధరణిఁ గప్పె

తే. నెత్తుటేఱులు ప్రవాహమై నేలఁ బాఱె
హన్యమానబలానీకులై జరాసు
తాదు లాయదువ్యూహబలహతికి నోడి
విముఖులై పాఱి పోయి రవ్వేళ మరలి. 135

వ. అయ్యవసరంబున గతోత్సాహుండును హృతదారుండును శుష్యద్వద
నుండును దీనుండు నగుశిశుపాలుం జేర నరిగి జరాసంధుం డి ట్లనియె.

తే. దౌర్మనస్యంబు విడువు మోధరణినాథ
మనబలంబులు విఱిగి పోయె నని యటంచు

జయ మపజయంబు సుఖదుఃఖసముదయంబు
దైవమునఁ జేసి నరునకు దాపర మగు.

చ. వినుము పదేడువారములు వెన్నునితో నెదిరించి యోడితిన్
ఘన మగునాదుసైన్య మది కన్గవ కానెడునంతలోపలన్
దనరెడు నద్దికోటులకుఁ దగ్గనియుద్ధి నశించెఁ గొంతలోఁ
జని విజయంబు గాంచితిని సంతస మందను దేని కేనియున్.

తరువోజ. వీరాధివీరులు వీరెల్ల నేఁడు
వృష్ణివరులదాడి వేఁడికి నోడి
పాఱి వచ్చిరి నేఁటిబవరంబునందు
పర్యాయకాలము పరికించి మనము
పోరుకో నొప్ప నోపురుషవరేణ్యా!
పోవుద మిండ్లకుఁ బో రీగి యనుఁడు
భీరుఁడై దమఘోషుప్రియనందనుండు
వీరులతోఁ దమపీటికిం బోయె.

వ. తక్కంగలవారు నొకరివంక నొకరు చూడక తమతమపొందుపట్ల
బోయి రంత రుక్మి ద్వేషించుచు నేకాక్షౌహిణీపరిమితసేనాస
హాంబుతోఁ గృష్ణునివెన్నంటి చనుచు విల్లు చేతం బట్టుకొని యె
విన ని ట్లనియె.

— రుక్మి కృష్ణు నెదిరించి పరాజితుఁ డగుట —

ఉ. ఎల్లకు నాలకింప వచియించెద రాక్షసుఁ డట్లు వచ్చి మా
చెల్లెలినిన్ హరించినవిజృంభితపాపుని బాపవంశజున్
బ్రల్లదుఁ జంప కున్న నృపబాలిక రుక్మిణిఁ దేక యున్న నే
నిల్లు గనంగ రాఁ దలఁప నిద్ది నిజం బని బాస చేయుదున్.

చ. అని రథ మెక్కి సారథిని నారసి యి ట్లను నోయి సూత! నా
యనుజను దొంగిలించుకొని యల్లది వోయెడుఁ గొల్లకుఱ్ఱఁ డే

జని వడి వాని త్రుళ్ళడఁగ సల్పి స్వసం గొనివత్తు నిత్తఱిన్
గను మెదలించులో రథము కందరలన్ నడిపింపు మింపునన్. 142

తే. అని యెలుంగెత్తి రుక్మి యోయాలగాప
రీ! నిలుము నిల్వు నే నిదె యేఁగుదెంచు
చుంటి నీరూపు మాఁపెద నొక్కయింత
లో ననుచు వెన్నుదన్ని వి ల్లూని లాఁగి. 143

శా. మూడమ్ముల్ వడి వాసుదేవుని మెయిన్ ముట్టంగ బిట్టేసి నా
తోడంబుట్టువు కాకి హవ్యముబలెన్ దోకొంచుఁ బో నుంటి వో
పేడీ! నీ విఁక నెందుఁ బోదు విదిగో వీరుండు విచ్చేసె నీ
తోడన్ డీకొన నిల్వు మోరి యని తోడ్తో నేసె మూ డమ్ములన్

సీ. నగుచుఁ గృష్ణుఁడు వానిఁ దగువింటి నాఱింటఁ
దుసిగించి వానిపై నెనిమి దైన
వాలమ్ములం జించి నాలుగు తూపుల
వాహనమ్ముల నేలఁ బడఁగ నేసి
యొక్కకాండంబున నొక్కయముం గూల్చి
చక్రరక్షుల దంటఁ జక్కడంచి
రెండుబాణంబులఁ బెండి సూతునితల
మూడుకోలల రథమును బగిల్చె

తే. అపుడు రుక్మి మఱొక్క వి ల్లంది యేను
విశిఖములఁ గృష్ణు నోనేయ వెస నతండు
రుక్మిచాపము రెండుగా రువ్వె మఱియు
నతఁడు మఱియొక్క కోదండ మందుటయును. 145

చ. కని హరి దాని గండ్రికలుగా నొనరించిన గండ్రగొడ్డలిన్
గొని యదివోవ పట్టసము గొంచది చెక్కలుగాఁగ శూలముం
గనుఁగొని నంత ముక్కలుఁగఁ గత్తియు శక్తియుఁ దోమరంబునున్
ఘనతరముద్గరంబుఁ గొన ఖండములై పడఁ జేసె శౌరియున్. 146

ఉ. ఈసునఁ జేసి రుక్మి యొకయింతటిలో దిగి ఖడ్గపాణియై
డాసి హరిన్ వధింతు నని డాపలగాఁ బఱతెంచుచుండఁ బెన్
రోసము రూప మెత్తె నన రోఁజుచుఁ గృష్ణుఁడు పంచపత్రులం
జేసి తదీయఖడ్గమును జెక్కెను ముక్కలు చెక్కలై చెడన్. 147

వ. ఇట్లు కరవాలంబు గడికండలు గావించి గోవిందుండు వానిం జంప వాఁడి గలఖడ్గంబు గొని పైఁబడనున్నసన్న యెఱింగి రుక్మిణి భయంబున భర్తృపాదపద్మంబులంబడి దీనదీనంబు లగువచనంబుల నిట్లనియె.

తే. దేవదేవ ! జగన్నాథ ! దీనవత్స
లా ! మహాభుజ ! నా భ్రాత యైనవీని
జంపు టుడుగుము నన్ గరుణింపు మితఁడు
తప్పు చేసెను క్షమియింపు మిప్పు డనుచు. 149

చ. పదముల వ్రాలి లేవ కొకపల్కును బల్కఁగ లేనియట్టిదై
వదవదలాడుమేనిపయి వ ఱ్ఱయి వ్రాఱగ చెమ్మటల్ గడున్
వదనము వెల్లఁ బాఱ నయనంబులు మూఁతలు లగ్గ నూర్చుచో
సదయుఁడు లేవ నెత్తె సతి సాంత్వనవాక్యల నూఱడించుచున్. 150

తే. క్షణమునం గొంతుఁ గోసెదఁ గాని నీదు
ప్రార్థనంబున మానితి పడఁతిమిన్న
యూరడిల్లు మటంచు నాశౌరి వానిఁ
బట్టి స్యందనమునఁ గట్టి వస్త్రమునను. 151

చ. పఱియలు వాఱ శస్త్రమున వానిశిరంబును శ్మశ్రుకేశముల్
గొఱిగి విరూపుఁ జేసె యదుకుంజరు లప్పుడు వానిసైన్యమున్
విరవిర వోయి పోర్విడిచి వీటికిఁ బోయెడునట్లు చేయుచున్
దరిమిరి శస్త్రము ల్వఱపి తామరసాక్షుఁడు చూచుచుండఁగన్. 152

వ. అంత బలభద్రుం డట వచ్చి విరూపియు హతపాత్రియుండు నగురుక్మిం గాంచి కరుణించి బంధము విడివడం జేసి కృష్ణునిదిక్కు మొగంబై. 153

తే. తమ్ముఁడా! వీని కీరీతిఁ దగినశిక్ష
చేసితివి చాలు వీఁడు శిక్షింప నర్హుఁ
డైన నీశిక్ష చంపినదానికంటె
మిన్న యని నేఁ దలంచుచు నున్నవాఁడ. 154

వ. అని రుక్మిణిం దిలకించి సాంత్వనపూర్వకంబుగా ని ట్లనియె. 155

ఉ. అన్నకు నిట్లు వచ్చె నని యాత్రము లోఁ గొని మాపయిన్ వృథా
కన్నీర సేయఁ బోకుము జగంబున నెవ్వరు గాని స్వీయమై
యెన్నఁగ వచ్చుకర్మమున కేర్పడి యున్నఫలంబు నొందుఁ గా
కన్నము నొందఁబో రొరుల కందునఁ గర్తృత లేదు చూడఁగన్.156

సీ. చంపఁ దగినతప్పు సలిపినన్ బంధువుఁ
జంపఁ జనదు వీడఁ జనును వాఁడు
చచ్చినట్టిఁడ యగు క్షత్రియధర్మ మీ
చందంబునం జెల్లుఁ జంద్రవదన!
యన్న తమ్ముని దమ్ముఁ డన్నను హింసించు
బ్రహ్మనిర్మితపంథ. పరఁగు నిట్లు
సంపన్మదాంధు లిచ్చ సహింప రితరుల
రాజ్యధనాదుల పూజ్యతఁ గని

తే. ఈ వసాధువు లగువారియెడల భద్ర
మును దలంచుచు సాధువు లనెడువారి
యెడ నభద్రము తలఁచితి విపుడు దీన
నీదుబుద్ధి విషమ మయి నెగడుఁ గాదె. 157

తే. పుట్టువును జావు లోనగుబాము లెల్ల
తనువునకె గాని యాత్మకుఁ దలఁప లేవు
చంద్రకళకె నాశము గాని చంద్రమునకు
లేని యట్లాత్మ నాశము లేని దరయ. 158

తే. స్వప్నమునను జనుఁడు భోగ్యవస్తుభోగ
మనుభవించు రీతి నసత్యమైనభవము
ననుభవించెడు నబుధుండు మనమునందు
నెఱిఁగి బుధు డప్రమత్తుఁడై నెఱి వహించు. 159

వ. అందున నీ వజ్ఞానజం బగువ్యసనంబు పరిత్యజించి స్వస్థచిత్తవు గమ్మని నన నమ్మృగువ రామప్రబోధితయై వైమనస్యంబు విడిచి సుమనీషచే మానసంబు చక్కఁ జేసికొనియె నట్లు విడువం బడినరుక్మియు బ్రాణావశేషుండై తనవిరూపకలనంబు ననుస్మరించుచు వితథమనోరథుండై కృష్ణునిం జంపి రుక్మిణిం దే లేనివాఁ డగుటం జేసి ప్రతిజ్ఞకు భంగపాటు వాటిల్లె నని సిగ్గుపెంపునఁ గుండినంబునకుం బోక భోజకటంబనుపురంబునకుం జని కాపురంబుండె నంత నిక్కడ. 160

—♦ శ్రీకృష్ణుఁడు రుక్మిణిం బెండ్లి యాడుట ♦—

మ. వసుదేవాత్మజుఁ డిట్లు భూమిపతులన్ భంజించి వైదర్భితో
వెస ద్వారావతి కేగి యోగ మెసఁగన్ స్త్రీయుల్ నిజభ్రాతలున్
వసుధాధీశులు మంత్రులుం బ్రజలు మే ల్నాఁగన్ విధిప్రోక్తముల్
పొసఁగం బెండిలియాడె నాఁడు త్రిజగద్భూషామణిన్ రుక్మిణిన్. 161

సీ. అపుడు ద్వారకయందు విపులోత్సవము లయ్యెఁ
బ్రతిగృహంబునయందు నతులిముగ
స్త్రీపురుషులు కయిసేసి ముదంబున
నవదంపతులకుఁ గట్నముల నిడిరి
పుర మెల్లఁ దోరణములు జయస్తంభముల్
చిత్రమాల్యాంబరశ్రేణు లెసఁగె
సిక్త మార్గంబులఁ జెలఁగె ముత్యాలము
గ్గు లనంటికంబముల్ నిలుపఁ బడియె

తే. గౌరవులు సృంజయులు లోనివారు బాంధ
వంబు దెలుపుచుఁ జనుదెంచి ద్వారవతిని
నలుగడలు నిండి పెండిలి నాళ్లు మిగుల
సంతసంబు వెలార్చి రాశౌరిఁ గూడి. 162

—♦ ప్రద్యుమ్నోపాఖ్యాన ఘట్టము ♦—

మ. పరఁగుం బశ్చిమసాగరాంతరమునం బ్రాకారశీర్షాగ్రభా
స్వరనానావిధరత్నదీప్తులు దివిన్ జాజ్వల్యమానంబులై
నిరతంబున్ జలియింపకుండునుడుల న్విభ్రాంతిఁ గల్పింపఁ జూ
పరచూడ్కిం బడి ద్వారకాపురము భూభాగైకవైకుంఠమై. 163

మ. సమయంబం దమరావతీపురవరాచ్ఛచ్ఛాయ భవ్యోరుయం
త్రమునం దద్ఘనుఁడు వట్టి నేర్పునమహోదర్శంబునం బెట్టి నా
నమలాంభోనిధిమధ్యభాగమున దివ్యద్భర్మహర్మ్యోత్తర
త్నమరీచు ల్గలయ న్వెలుంగు నలప్రో ల్దర్శింపఁగా నొప్పెడున్. 164

గీ. అలరుఁ బురి సూర్యసోమవీథుల నటు నిటుఁ
దిరగ రథహస్తిపత్తులు దిరుగ వెపుడు
నిలిచి శ్రీపురుషోత్తముల్ నిజబలమున
లీలనాడెడు చతురంగ పాళి యనఁగ. 165

వ. ఇట్లు రుక్మిణీవివాహంబతివైభవంబునం బరివర్తిల్లినపదంపడి కృష్ణుండు
ద్వారకాపురంబున నివసించి యున్న యవసరంబున. 166

సీ. వేయిఁగన్నులవేల్పు వేల్పుమూఁకలతోడ
వేమాఱు జని జేజె వెట్టుచుండఁ
దగనారివేరంపు దబిసి దబుసులతోఁ
బలుమాఱు జని నేలు వలుకుచుండఁ
బుడమిఱేం డ్లెల్లరు గడిమి సర్దార్లతో
బడిబడిఁ జని బరాబరులు సేయ
బాఱురాయలు తొలిపలుకులతోఁ జని
యనయంబు దీవన లాడుచుండఁ

తే. దల్లిదండ్రులతో నన్నదమ్ములతోడ
నాలుబిడ్డలతోడ నల్లారుమేన
బావమఱఁదులతోఁగూడి శేవ మెఱయ
మెఱయుఁ గరివేల్పు దనపొల్పు నెఱపువీట. 167

వ. అక్కాలంబున రుక్మిణీకృష్ణులకు మన్మథాంశంబునఁ బ్రద్యుమ్నుం డనుపరిఖ్యాతనాముఁ డగుపుత్త్రుండు పుట్టె ననినఁ బరీక్షిన్నరేంద్రుం డావృత్తాంతంబు చెప్పు మనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 168

పంచ. అనంగుఁ డప్పు డారతిప్రియాంగనాహృదీశ్వరుం
డనంతవిక్రమక్రమక్రమార్దితాఖిలుండు మా
మనోధినాథసాధుబద్ధమాఃనీసువేషపే
త్వనర్గళప్రచారుఁ డొప్పు నైహికప్రమాణుఁడై. 169

క. అతిని చరిత్రము విన్నఁ
క్షితి నవపుత్త్ర్యావు దొఱంగి శివ మగు నెప్పుడున్
సతికిం బతి కతిహితసం
తతి యగుఁ గౌతూహలప్రతతి వర్ధిల్లున్. 170

వ. దేవతాప్రార్థనంబున మీనకేతనుండు తపంబున్నభూతనాథునిపై నారసంబులు నిగిడించి నొంచిన నతండు చిచ్చఱకంటం జూచి యతని భస్మసాత్కృతుం జేయుటయు నంత రతి పతిభిక్షం బెట్టు మని ప్రార్థించినం బరమేశ్వరుండు. 171

మ. సిరియున్ శౌరియు ద్వారకాపురమునన్ శ్రీరుక్మిణీకృష్ణులై
ధరణిం బ్రోవఁగఁ బొల్తు రప్పుడు భవత్ప్రాణేశ్వరుం డీశ్వరే
శ్వరు లవ్వారికిఁ బుత్త్రుఁడై పొడమెడుం బ్రద్యుమ్న నామంబునం
దరుణీ! నీ కవు డాతనిం గలియుమేల్ దైవంబు సంధించెడిన్. 172

వ. అంతదనుక నీవు విశ్వంభర న్వేఁచియుండు మనిన రతియుం బశుపతి యాజ్ఞం జేసి బుక్షవన్నగరంబున శంబరునియింట మాయావతి యను పేర వంటయింటిపనులకై యుండె న క్కాలంబున నిక్కడ రుక్మిణీదేవి గర్భవతి యై. 173

—◆ ప్రద్యుమ్నజననము ◆—

క. కనియెఁ గుమారున్ మారున్
మునివరసన్నుతున్ సమస్తభువనాధారున్

ఘనరుచిరాకారుఁ డ
జ్జనసుతసుకుమారు ధీరు సాధువిహారుఁ. 174

చ. నెఱిలగనంబునం బొడమి నిద్దపుఁదేజున వెల్గుచున్నయ
చ్చిఱుతను మంత్రిసాని తనచేసురియం దగ బొడ్డుగోసి పో
గరితలు లాలనోసి వెనుకం బొడిఁబోఁ బొగవేసి యుయ్యేలం
బఱచినమెత్తలం దునిచి పాటలు దీటుగఁ బాడి రూఁచుచుఁ. 175

గీ. గాలి దూలి సోఁకి కందు సెడకయుండఁ
జల్లి బూది వ్రేళ్లు వెల్లకులును
నూఱి పొగలు వేసి నోములు నోఁచిరి
పేరటాండ్రు భక్తి పేరుకొనఁగ. 176

క. నందకుమారుం డపు డా
నందంబునఁ బొంది తనకు నందనుఁ డుదయం
బందె నని జాతకర్మవి
ధిం దనిపె ద్విజకోటి దీనారములం. 177

గీ. కొడుకు కల్గి జనించిన గడియయందు
సర్వభవాణి జగం బెల్ల నాలకించు
నటులు ప్రద్యుమ్నుఁ డని పల్కె నదియె నామ
కరణముగఁ జేసెఁ గృష్ణుండు కౌతుకమున. 178

—♦ శంబరుఁడు శిశువగు ప్రద్యుమ్నునిం దెచ్చి సముద్రములోఁ బడవేయుట ♦—

వ. అక్కడ బుక్షవన్నగరంబున నారదప్రేరితుం డగుశంబరాసురుండు.

శా. మాయారూపము దాల్చి తన్నారులు సంభావింప రాకుండఁ దా
నాయాచోఁటుల వింతలం గనుచు నయ్యాకాశమార్గంబునం
రేయిం జిమ్మనుచీఁకటిం దవదునే ద్విమ్యంబు నందంగ సు
శ్రీయుక్తం బగుద్వారకానగరికిం జేరెం బ్రణార్థంబునం. 180

ఉ. పోయిన పోకనే నగరిముంగిటికిం జని నిద్రమబ్బుచే
నాయెడ సొక్కి గోడలకు నానికగాఁ దలవాల్చి కూర్కునా

యాయిభటాలికి న్మాయిక మావహిలం గన రాక లోనికి
న్నాయమెయిం బ్రవేశము నొనర్చె నతం డతిసాహసంబునన్. 181

వ. అం దొక్కచో సూతికాగృహంబునఁ బొత్తిళ్లలోనం బండుకొని యున్నకృష్ణకుమారుం దిగిచి యెత్తుకొని పోయి దారిలోఁ బారావారంబునం బాఱవైచి నిష్కంటకుండ నైతి నని సంతసించుచు స్వపురంబునకుం జనియె ననంతరంబ. 182

చ. పడి పడునంతలో నచటఁ బాఱుతిమింగిలకోటి వానిని
వ్వడిగొని యొండొకం డొడిసి పట్టుచు మిట్టిపడంగ వ్రేయుచున్
గుడుసులు వాఱుచుండఁ గడకు న్మతి యొక్కఁడు మ్రింగె దాని పొ
గడుపునఁ జేరియున్ శిశువు కంద దొకింతయు దైవనిర్మితిన్. 183

వ. ఆసమయంబున. 184

ఉ. జాలరు లేగుదెంచి తమజాతికి నీతియె కానఁ జేపలన్
జాలము లొడ్డి నల్దెసల నల్వురు వాఱుచు గుంపు గూడఁగాఁ
దోలుచు నొక్కమోమయిన దొప్పలు దోరలుగా గ్రహించి పై
నేలను నాటఁబోసి రవి నొక్కని వెండినగంబులో యనన్. 185

వ. అట్లుపట్టినమత్స్యంబులం దుత్తమం లగువాని నేరి మత్స్యఘాతుకులు వాని శంబరునకుం గానుక వెట్టిన వాఁడు వానిఁ దనమహానసంబునకుం బుచ్చె నంత నచ్చట. 186

శా. ఆయామీనుల వంటయింటిచెలు లాయారీతులం గోయుచో
నాయాచోటుల నొక్కదానియుదరం బర్థంబు చీఱంగ నం
దాయుష్మంతుని తేజ మొం డరయఁగా నై యొప్ప వ్రాకుచ్చి రా
మాయావత్యధికారిణిం గనుచు నామై నున్న విడ్డూరమున్. 187

వ. అట్లు విస్మయంపడుచు వారందఱును బరీక్షించి చూచుచు. 188

సీ. రంగారు బంగారు రంగు లీనెడుమాంస
ఖండ మీచేపలోఁ గలుగునొక్కొ
బంగారుభండ మేసంగతినే నిది
యంగిటిలో దిగ మ్రింగె నొక్కొ

కఱకంఠుసెగకంటి కడిఁదికి వెఱచి సి
డఁ బని మరుఁ డిందు డాగె నొక్క—
తెఱనోటితో నది యెఱలకై తిరుగుచో
బడబాగ్ని కడుపులోఁ బడియె నొక్క—
తే. కాకయుండిన కలదె యీకాంతి మీన
జాతిగర్భాంతరంబుల భూతలమున
దయ్యమో భూతమో యిది తరుణులార!
కోసి చూతము కడముట్టఁ జేసి దీని. 189
క. అని మాయావతి యాజ్ఞం
గొని తెఱవలు చుట్టువాఱుకొని చుట్టుఁ దెగం
బనివడి నల్లనఁ గోసిరి
కనఁబడునాసత్త్వదార్ఢ్యకము చెడకుండన్. 190
వ. అంతలో నందు. 191

— ♦ మాయావతి మత్స్యగర్భమునఁ బ్రద్యుమ్నునిం గాంచుట ♦ —

సీ. పాలబుగ్గలవాఁడు పసపునిగ్గులవాఁడు
పున్నమనెలఁ బోలు మోమువాఁడు
వాలుఁగన్నులవాఁడు వ్రేలుచేతులవాఁడు
చుట్లువాఱినలేఁతచుంచువాఁడు
మొలకనవ్వులవాఁడు చిలుకకొల్కులవాఁడు
డం బైనతొగరుగడ్డంబువాఁడు
ముద్దు గుల్కెడువాఁడు ముచ్చటాడెడువాఁడు
ముక్కుపచ్చలఁ దేరు మురువుకాఁడు
తే. కాలుసేతులు గదలించి లీల నాడు
వాఁడు గాలిబొట్టనవ్రేలు వట్టి చేత
నోట నిడికొని చుంబించు నీటుకాఁడు
చెలఁగెఁ జిన్నారిపొన్నారి చిఱుతవాఁడు. 192

ఆ. ఇట్టిసోయగమున నెసఁగెడు మగబిడ్డ
చేపకడుపులోనఁ జేరు టేమొ
చచ్చెఁ జేప లోనఁ జావక యుం టేమొ
దైవచిత్ర మెడఁదఁ దలఁప వశమె. 193

వ. అనుచు నెల్లరు నుల్లంబు రంజిల్ల నచ్చెఱువంది ముచ్చటించుకొనుచు
బాలుం గదిసి పొదివి పట్టుకొను నంతలో మాయావతి తొల్లి తనకు
నారదుం డావృత్తాంతం బంతయు నెఱింగించి యుండుటం జేసి క్షణార్థం
బులో నాసర్వంబును స్మరణంబునకుఁ దెచ్చుకొని ముచ్చటపడి
యచ్చెఱుతం గని మోహపరవశయై శరీరస్మృతి యెఱుంగ కూరక
చిత్తరువ ట్లుండి కొంతవడికి. 194

చ. కొలుకుల హర్షబిందువులు కొల్లలు గా దిగ జాఱ మేనఁ బె
న్బొలకలు గా గగుర్పొడువ మోహము లూరఁగ మాటిమాటికిం
దలఁచుచుఁ బూర్వవృత్తమును దైవవిలాసము సంస్తుతించుచున్
నిలిచినయట్ల నిల్చి యతనిం గనుచుండెను ఱెప్ప వేయకే. 195

వ. ఇట్లు కొంతవడి సంతాపంబు నొంది పొంది సందడింపకుం డని వారి
నందఱం దొలఁగం ద్రోచికొని పోయి కరంబుల వానియంగంబు
స్పృశియించుచుఁ జెలుల కెఱుఁగ రాకుండఁ దనమనంబున. 196

క. నే నెన్నాళ్ళకు మఱి నీ
మేనున్ స్పృశియించినట్టిమిసిమిం గంటిన్
నానోముఫలము నేఁటికి
గా నా కొనఁగూడె శివునికారుణ్యమునన్. 197

— మాయావతి ప్రద్యుమ్ను నెఱిఁగి పెంచుట —

సుగంధి. ప్రాణనాథ! నీవు నన్నుఁ బాసి పోకు పోకు మా
స్థానముఁ డెంత కైనఁ గాని చాలువాఁడు నిన్ను నీ
బాణముం గలంచు నన్నుఁ బాఱి కోలుపోయి నీ
ప్రాణముల్ నను న్విపత్పరంపర న్దహింపవో. 198

శా. ఆకాలీవిభుకంటిమంటల హతుండై నీవు పోఁ బూదె గా
నీకై శోకము పొంది పొంది యిఁక న్దిక్కెవ్వరిం గాన కే
నాకాలంబున శంబరాసురుఁడు భోగార్థంబు రమ్మంచు నన్
వీఁకం బెట్టిన పాట్లు శాత్రవుల కేనిన్ రాకపోఁ గావుతన్. 199

గీ. నిన్నుఁ జూడఁ గంటి నిఖిలార్థములు గొంటి
నున్నతంపుఁబదము నొంద నుంటి
గొదలు దీఱె నంటిఁ బదుగురిలో మంటి
సుఖము లంటి నేఁడు శుభము వింటి. 200

గీ. చచ్చి బసుమ మైనసామి వెండియు జన్మ
మెత్తి తనదు చెంత కేఁగుదెంచె
నింతిసంతసంబు నింతింత యన నౌనె
కాంత కంతకన్నఁ గలదె యొకఁడు. 201

వ. అ ట్లంతరంగంబున సంతసించుచు మాయావతి కొంతవడికిఁ జెలులం
జేరఁ బిలిచి యి ట్లనియె. 202

మత్త. ఈకుమారుఁడు కారణంబుగ నే సమస్తమనోభవ
వ్యాకులత్వ మడంచుకొంచును వారము ల్గడ తేర్చెదన్
నాకుఁ జాలినవారు లే రని నల్వురుం గణియించుకో
లోకమందు యశంబు నొందెద లో ముదంబునఁ జెందెదన్. 203

వ. వీని నాపోషకత్వంబునం దుంచుకొనియెద మీరు వేరికి నీరహస్యంబు
వెల్లడింపకుం డని వానిఁ దనగృహంబునకుం గొనిపోయి యుగ్గునుం
బాలునుం బోసి పెంచుచుం గంటినిన్ ఱెప్పచందంబునం గాచుచుం
బ్రోచుచుండె ననంతరంబ. 204

శా. ఆమాయావతిపోషణంబునను దైత్యారాతిసూనుండు ని
త్యామోదంబున శుక్లపక్షమున నీహారాంశునిం బోలుచున్
క్షేమస్థైర్యములం బ్రవర్ధనమునుం జేకొంచు నానాఁటికిం
దా మించె న్విబుధాతిహర్ష కరుఁడై దర్పోజ్జ్వలాకారుఁడై. 205

ఉ. చక్కనివిల్లు పూవులను సంతన చేసి మధువ్రతంబులం
జిక్కనినారిఁ గూర్చి వికసించినమల్లెల నమ్ము లుంచియుఁ
మిక్కిలికంటిదేవరను మీఁద లిఖించి పరాక్రమంబు పెం
పెక్కఁగఁ దాను ధన్వి యయి యేయుచు నాఁడు నతండు మెండుగన్.

క. అతనిం గనుఁగొని మాయా
వతి తమి దమాతహా జనింప భావములోనన్
సతతముఁ దలపోయుచు నువ్వి
శ్శృతుకుకొనం బెజేఁగి పెద్ద యగు టెవ్వ డనుచున్. 207

శా. నానాటన్ రతిపోష్యుఁడై పెఱుఁగుచుం దా నింతవాఁ డంతవాఁ
డై నే నాయది నీవు నీయది యటం చాయాసమస్తంబునున్
లో నూహించి గ్రహించి వర్తనములన్ లోకంబుతో పాటివాఁ
డై నెక్కొల్పెను మాతృభావమును మాయావత్యభిఖ్యాకపైన్. 208

క. తల్లి యని హరిసుతుండును
వల్లభుఁ డని రతియు లోన భావించుచు న
త్యుల్లాసంబునఁ గాలం
బల్లన వెళ్ళించి రంత నాసమయమునన్. 209

వ. ఒక్కనాఁడు రతి ప్రద్యుమ్నునిచెంతకుం జని విరహమ్మున నైనవిచారం బభినయించుచున్నం గని యతం డామెదిక్కు మొగంబై యూరార్చుచు ని ట్లనియె. 210

—♦ మాయావతి ప్రద్యుమ్నునకుఁ ద న్నెఱింగించుట ♦—

గీ. నీకుమారుఁడ గాన నే వీఁక నైన
నాత్మజాధుల నడఁగించి యరసి పోవఁ
దగు నటంచును బలుకుట దగును గాని
తెగువ వగచుచు నిట్లుంట తగు నె చెపుమ. 211

వ. అనిన మాయావతి యి ట్లనియె. 212

గీ. నామనోభవుఁడవు నాదునాథుఁడవును
నాదునాత్మజుఁడవు నీవు గా దటనను
నాకు మాఁఘుఁడ వీవ యోరాకుమార
నీమహిమ నాత్మజాధుల నోము మంటె. 213

క. తొల్లిట మన్మథుఁడవు నీ
వల్లహరునికంటిమంట నణఁగారి యిటుల్
తెల్లముగ హరికిఁ బుట్టితి
వల్లన నీశంబరాఖ్యు నణఁగింప ధరన్. 214

వ. నీవు నాప్రాణేశ్వరుండ వింక నేమియుం జెప్ప కూరకుండు మని తన
చేతిజలమ్మున వానికన్నులు తుడుచుటయును. 215

ఉత్సాహము. కనులు మూసి విచ్చునంతఁ గాల మెల్ల మాటిన
ట్లును జగంబు తల్లక్రిందు డొల్లినట్లు భూమిమీఁ
దను మెలంగనట్లు తాను దాను గానియట్లు గాఁ
మనసిజుం డొకింతసేపు మనమునం దలంచుచున్. 216

మ. జననాథాగ్రణి యంచు నెంచినయదుస్వామిం దనుం గన్నతం
డ్రినిగా రుక్మిణిఁ దల్లిగా మనుజుఁ డన్ వెల్గొందుఁగందర్పుఁ గా
జననీభావము చేసి రోసినరతిన్ స్వస్త్రీనిఁ గా నెంచి లోఁ
దనజన్మం బలశంబరాసురవధార్థం బంచుఁ దా నెంచుచున్. 217

వ. మాయావతిం దరియ వచ్చి. 218

చ. అరయక తప్పు చేసితి మహావ్యధ దాపర మయ్యె నింక నే
నరగడెకాల మైన నిసుమంతయుఁ దాళఁగ లేను నీమహా
ధరమధురామృతం బొసఁగి దాసుని నన్ గరుణించి ప్రోవవే
తరుణి భవత్పదాబ్జము లుదారత ముట్టి నమస్కరించెదన్ 219

వ. అని తత్తఱంపడునాచిత్తజునిం గని మత్తకాశిని పూర్వోత్తరసందర్భ
గర్భితం బగుచిత్తంబున మెత్తన గా నిట్లనియె. 220

క. తొందర పడఁగా వల దీ
ముందటికార్యంబు దీర్చి ముద మొదఁ బొదలన్
సందేశ మెఱుక పడమిన్
గుందెదుమీవారి చెంతకుం జని యచటన్. 221

క. చుట్టములుఁ బుడమివేల్పులుఁ
జుట్టును వేష్టించి యుండ సూరెలఁ బ్రగడల్
నెట్టికొని యుండఁ బబ్బం
బట్టియెడం జరుగవలయు నార్యా మనకున్. 222

—◆ ప్రద్యుమ్నుఁడు శంబరుని సంహరించుట ◆—

వ. తావత్కాలంబు సహింపు మవల మన మనోరథం బెల్లఁ దీర్చుకొనుటకుం గావలసినంత కాలంబున్న యది యీశంబరాసురుని సంహరించుటకింద్రాదిబృందారకబృందంబులం దెవ్వరికిని శక్యంబు గాదు వీఁడు మాయావిద్యావిశారదుండు పోరుపడినపుడు పగవారిచిత్తంబులం జొచ్చి మొత్తుచుండు మీతండ్రి యగువిష్ణుదేవుండు తొల్లి వీనిం జంప నేగి వాలఖిల్యాదులశాపకారణంబునం జేసి ఋక్షవంతమునకు గరుడుండు పోఁ జాలమి మార్గమధ్యంబునం దాఁగి చక్రం బవక్రవిక్రమంబునం బ్రయోగించె నది వానిమాయంబడి విగతవీర్యం బయ్యె మర్త్యరూపం బెత్తి నరనారాయణులకుం బుత్రుండై పుట్టిననీకుఁ దక్కఁ దక్కొరుల కసాధ్యం డని యెంచి శంకరుండు నిన్నిట్లు రుక్మిణీకృష్ణులకుం బ్రసాదించె నేను నీకారణంబునం జేసి శంకరప్రసాదాసాదితమాయావిద్యాధురీణనై పాతివ్రత్యంబు చెడకుండం గాచుకొనుచు వీనియింట దాసినై మహానసవ్యాపారంబునం బడి యుంటి నీ విపుడు నాకడ నున్న సర్వశత్రుమాయావినాశిని యనుమాయావిద్యం బడసి శంబరాసురుని సంహరింపు మని ప్రయోగోపసంహారంబులతో నుపదేశించి యంపిపుచ్చుటయు నతం డఖండపాండిత్యంబున దండికెక్కి తత్క్షణంబ మాయావతీకల్పిత భిల్లసేనాపరివృతుండై

పోయి తన్నగరద్వారంబు ముట్టడించి రణభేరి వేయించుటయు శంబరాసురుం డాభేరీభాంకారనిక్వాణంబు నాలకించి యిది యేమి విడ్డూరంబురా యని బెదరియుం జెదరక ముల్లోకంబులు భస్మసాత్కృతంబుగం జేయుదుం జూడుం డని దుర్నిరీక్ష్యభీషణరోషానలార్తికషాయితాక్షుండై నిటలతటఘటితకుటిలభ్రూకుటిరై కటంబు లదరం బండ్లు పటపటం గొఱికి మొగంబు బిగియ నోరుడు కఱచి హుం మ్మని బిట్టార్చుచు బెట్టార్చి పేర్చి వీతిహోత్రార్చులం బోనిహేతులం బూనిన రాక్షసప్రవరులం గూడి కొని కల్పానల్పగభీరభైరవుండై మండిపడి తనదోర్దండచండిమంబు చూపువాండై బొందళంబు దొడిగి ధనుర్బాణతూణీరపాణియై గదాదండంబు భుజదండమండితంబుగా సమరించుకొని సర్వసన్నద్ధుండై భేరీధ్వానపూర్వకంబుగా సంగ్రామరంగంబునకుం బోయి పురంబుచుట్టును ముట్టడించిననరవాహినులం జూచి సటాసముత్పాటనామర్షితహర్యక్షాధ్యక్షునిం బోలి కనలి సింహనాదంబు సేసె నంత వారు నవారితశౌర్యగాంభీర్యధైర్యస్థైర్యంబులం బోలి వోక నిలిచి యెదిరించి రప్పు డుభయసైన్యంబు లుభయస్థైర్యంబునం బూర్వాపరపారావారంబులం బోలి తాంకె నట్టిసమయంబున. 228

సీ. [illegible]ఘటాళిగర్జితంబులు సశ్వ
హేషితములు రథఘోషములును
బటుగుణటంకృతిచటులశబ్దంబులు
ఖడ్గఘట్టనము లఖండకింకి
ణీనిక్వాణంబు లహీనఘంటానినా
దంబులు శంఖనాదములు సింహ
నాదముల్ భేర్యాదివాదనంబులు బాణ
పాతధ్వనులు తూర్యవాసితములు

ఈయుద్ధమున భిల్లసేనాకల్పన మమూలకము గ్రంథాంతరసంపాదితము.

తే. బిరుదవాక్యారవంబులు పరిపరివిధ
దుష్ప్రలాపరుతంబులు తోడు గూడి
పెద్దకోలాహల మ్మయి పెఱిగి నింగి
నేలయును బ్రద్దలుగఁ జేయులీల నుండె. 224

వ. ఇ ట్లిరువాఁగును గదిసి తోమర భిండివాల పరశు పట్టిస ముసల ముద్గర గదాసి కుంత కరవాలాదిసాధనంబుల నొక్కపెట్టునం జుట్టుం ముట్టి కేట్లు గట్టినట్లు గొట్టుకొనుచుఁ గేశ లనేకంబులు నాకంబు ముట్ట నట్టహాసంబులు బిట్టడర సర్వాంగంబులును దిలప్రాయంబులుగా నసాధారణవిక్రమక్రమంబునం బోరినపోరు ఘోరం బయ్యె నయ్యెడ.

చ. అలిగి మనోజుఁ డంతఁ బ్రళయాంతకుఁ డట్టిఁడయి కరంబులం
బలుకయు వాలునుం గొని జవంబున వైరుల నెల్ల నూఁచకో
తలుగను గోసి కోసి బలదర్పము సూపిన నంత సోఁకుమూఁ
కలు వెఱగందెఁ గుందె గడుఁ గందెను డిందెను గ్రుందె నెంతయున్.

ఉ. మండుచు శంబరుం డపుడు మార్గణకోటులు పర్వఁ జేయుచున్
గండరగండఁడై ప్రబలుకామునిపైఁ బడఁ ద్రిప్పుచున్ గదా
దండము వైచి నిష్ఠురవిధంబున నార్చె మరుండు నొచ్చుచున్
మండుమహోగ్రకుంతమున మ్రాన్పడఁ జేసెను దాని మారుఁడున్.

ఉ. శాంబరివిద్యఁ బూర్ణుఁ డయిసర్వజగంబులఁ గెల్చినట్టియా
శంబరునిం జయించుటకు సంభవ మందినమన్మథుండు దా
శాంబరి వానిలోఁ జనుచు జంత్రముతీవలవోలె నాంత్రముల్
సంబర మొప్పఁ ద్రుంచి వెడలం సురవైరి పడెన్ గతాసువై. 228

క. మందారపుష్పవర్ష మ
మందముగాఁ గురిసె నెల్లమాఁగాణములం
దుం దెలివి నయ్యె దిక్కులు
మందము మందముగ వీఁచె మరుదంకురముల్. 229

వ. అంతఁ బ్రద్యుమ్నుండు తద్వృత్తాంతంబు మాయావతి కెఱుగం జెప్పి
చుటయు నప్పూఁబోఁడి వేడుక లీడిక లెత్తఁ దత్తరంబునం జనుదెం
మగనిం గీర్తించి ప్రాణేశ్వరా! మన మిట నున్నపని యయ్యె
త్కంటకుం డగుశంబరాసురుండు మడియుటం జేసి జగంబులు నిష్కం
కంబు లయ్యె నింక మనము ద్వారకాపురంబునకుం బోవలయు న
వెండియుచు. 2

— ♦ మాయావతి ప్రద్యుమ్నునితో ద్వారకకు వచ్చుట ♦ —

చ. పురిటిదినంబులంద నినుఁ బోకడపెట్టె మహోర్మిఁ గుంకుసీ
గురువులు నీదురాక కెదఁ గోరుచునుందురు చందురాకరుల్
నిరతము గోరుచున్నతటినీవిభు లట్లయి కావున న్మనో
హర! యిటఁ గాలయాపనము నాచరణీయము గాదు లెమ్మికన్

మ. నినుఁ గోల్పోయిననాఁడు కోలె మిగులన్ నీతల్లి దుఃఖాంబుధిన్
మునుఁగం బాఱుచు ఱొమ్ము గొట్టుకొనుచున్ శోకించునయ్యమ్మకు
గనులం గాయలు గాచిపోవు నురముం గట్టం గదే కంధులన్
మనము న్వేఁగెడు గుండె బ్రద్దలగుఁ బో నాథా! విచారించినన్.

క. లీలం గాంచినక్రేపుం
గోలుం బులివాతఁ బెట్టి కోల్పోయి కదున్
దూలెడుగోవు విధంబున
జాలింబడు నీదుపోక జనయిత్రి కదున్. 23

వ. అనిన నతండు మాతాపితృస్మరణంబునం జేసి యుల్లంబు జల్లు మన
బెల్లుగఁ దల్లడిల్లి డిల్లపడి కొంతవడికి దల్లిదండ్రులం జూడఁ జిత్తంబ
తత్తఱింపడుటయు నత్తన్వి మెత్తనిచిత్తంబున నతనిం దేర్చి మన మిక
డాకాశమార్గంబున నొక్కనిమేషంబునం బోవచ్చు ననిన నంగీకరించ
మగని చెట్ట పట్టుకొని వేడుకకుం బలె కరతలంబునం గన్నుఁదోయి
మూసి గమనం బంగీకరించుటయు నంతమాయాప్రభావంబునఁ గన్ను
మూసి తెఱచునంతలో వారు ద్వారకాపురంబుమీఁదికిం జని రంతలో
నందలివారు వారిం దిలకించి తమలోన. 24

ఉ. జక్కవదంట యో యనుచు సందియ మొందఁగ నేను గాని మేల్
తెక్కలు గల్గుజాడ యది లేదు మొగంబులు గాళ్లు సేతు లా
నెక్కడిసోయగం బరయ ని ట్లురుదెంచిన దేవతాయుగం
బొక్కొ యనంగఁ గాదు గన నొప్పవు తెప్పలు వ్రాల్ప కుండుటల్.

చ. అని బహుభంగుల న్నగరి నందఱు సందియ మందుచుండఁ గ్రొ
న్ననవిలుకాఁడు కార్ష్ణిఁ గుస న్మణిగారుఘనాఘనంబు నాఁ
గనఁబడి కాంతతోడ డిగి క్రన్నన నన్నువ లున్నరాచమే
డను దరియంగఁ జేరె నచటం గలవారు వితాకుఁ జెందఁగన్. 236

సీ. కాలాంబుదశ్యాముఁ గాంతిచ్ఛటాధాము
నాజానుబాహు దివ్యాభ్రదేహు
సంపూర్ణపూర్ణిమాచంద్రవదను గళా
సదను మహావక్షు సారసాక్షు
నీలవక్రాలకు లీలావిశాలకు
వనితాహృదయలోలుఁ గనకచేలు
మందహాసమనోహరుం దులసీధరు
స్థిరవీక్షణాసాధ్యు సింహమధ్యు

తే. వినుతపుంద్రేక్షుకోదండు వనజకాండు
మరుని రాచకొమరుని నమ్మగువ లెల్ల
నరసి యేమఱుపాట నాహరి యటంచు
సిగ్గునం డాఁగి రం దందు శీఘ్రగతిని. 237

ఉ. కొందఱు విష్ణుఁ డందు రటఁ గొందఱు చిహ్నము లున్న వెన్న నా
యందమువాఁడు వీఁ డొకరుఁ డందురు చిన్నెలు కొన్ని కొన్ని వే
రందురు కొంద ఱీతఁ డెవఁడో యని కొంద ఱెదం దలంతు ర
య్యందఱు మారునిం గనినయప్పుడు నివ్వెఱ పాటు వాటిలన్. 238

మ. హరి గా డాతనిఁ బోలువాఁ డొకఁ డితం డాయూనసమస్త్రంబు నేఁ
డరయంగా నగు నంచు నెంచి నవలా లావేళ వేవేగ నా

మరునిఁ జేరఁగ వచ్చి వేఁడ వనుచున్ మాటాడఁగాఁ బోయి యా
హారి వైనం గడు మోస మం చడిగి రన్యోన్యాననేక్షాగతిన్. 239

వ. ఆసమయంబున. 240

గీ. వాసుదేవునిఁ బోలినవాఁ డొకండు
లోనగరిలోని కరుదెంచి మానినులకు
దర్శనం బిచ్చె నని విని తాను వచ్చె
భోజపుత్రిక చూడంగ బోఁటితోడ. 241

క. వచ్చి కుమారునిఁ గని లో
ముచ్చటపడి మేను గగురుపొడువం బులకల్
గ్రుచ్చుకొన నేమఱిల్లి వి
యచ్చర యన ఱెప్ప వ్రాల్ప కరయుచు నిలిచెన్. 242

వ. ఇట్లు కొంతవడి మహాశ్చర్యంబునం జేసినశరీరపారవశ్యంబున నిలిచి చూచుచు రోమోద్గమాదులం గూడి పాలిండ్లఁ బాలు చేఁపు వచ్చుటయు నప్పుడు సంభ్రమసంతోషదైన్యంబు లొక్కమొగిం బిక్కటిల్లఁ దనచెలికత్తియం గాంచి యి ట్లనియె. 243

మ. చెలియా! యీసుకుమారు నీసుగుణి నీచిన్నారిపొన్నారి నే
కులకాంతామణి యేమినోములను లోకు ల్మెచ్చగాఁ జేసి భూ
తలమందుం గనెనో మహాఫలముగాఁ దర్కింప లే నేమియో
తలపం జాలను గాని వీనిఁ గనినంతన్ ప్రేమ నా కయ్యెడిన్. 244

ఉ. సందియ మంద నేమిటికిఁ జానరొ నాసుతునందుఁ బోల్చనీ
చందము నీవిలాసమును సొ రగుమేను స్వరప్రకార మె
న్నం దెలియంగ వచ్చెను గనం గన నీతఁడు కృష్ణుఁ బోలి యు
న్నందుననుం గుమారుఁ డన నాఁ గుతుకం బుదయించె నియ్యెడన్.

మ. అని పుత్రుం డని చేరి చీరుటకుఁ గా నాశించుఁ గాకున్నచోఁ
గనుగొంచున్ సవతుల్ హసింతు రని వెన్కం దీయు భాషింప నా
నని వాయెత్తియు నన్యుఁ డైన దురితం బం చాఁగు నాపుత్రుఁ డే
యని సందేహము వీడు కా దని మదిన్ స్వాంతంబునన్ డొంకెడిన్.

వ. ఇట్లు డోలాయమానమానసయై రుక్మిణీదేవి వితర్కించుచున్న సమయంబున నంతఃపురరక్షకు లావృత్తాంతంబు కృష్ణున కెఱింగించుటయు నతండు నప్పురం బభినయించి దేవకీవసుదేవబలరామసాత్యకిప్రముఖ బంధువర్గపరివృతుండై పఱతెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియుం బలుకక యూరకుండునుం బోలె నుండె నాసమయంబున నారదుం డరుదెంచి సముచితసత్కారసత్కృతుండై విశ్రమించి వచ్చినవాఁడు రతిప్రద్యుమ్ను లనియు శంబరాసురుండు కుమారుం గొనిపోయి సముద్రంబునం బడవైవ నతని నొక్కమత్స్యంబు మ్రింగుటయు జాలరు లామత్స్యంబుం బట్టి శంబరున కిచ్చుటయు నతండు దాని వంటయింటి కనిచిన నీమాయావతీసఖులు దాని విశసించుటయు నందు నీతండు పొడకట్టుటయు మాయావతి యితనిం బెంచుటయు యౌవనప్రాదుర్భావంబున రతి తనవృత్తాంతం బెఱింగించుటయు శంబరాసురసంహారంబును మాయాప్రభావంబున నాకాశమార్గంబున ద్వారకాపురంబునకు వచ్చుటయుం దెలియం జెప్పిన యనంతరంబ. 247

మ. బలరాముండును గృష్ణసాత్యకులు నా పై బంధులుం దల్లిదం
డ్రులు నాపుత్రునిరాకకు న్మిగుల సంతోషంబునం జెంది కో
డలి నగ్గించుచుఁ బుత్రునిం బొదివి వేడ్కన్ మూర్ధముం బుడుకుచుం
జెలిమిం జూపుచు సౌఖ్యముల్ దెలియుచుం జెన్నొందిరన్యోన్యమున్.

ఉ. అంతట రుక్మిణీరమణి యాకథ యంతయు నాలకించి యిం
తింతన రాని సంతసము నీహయు మోహము గారవంబునుం
స్వాంతమునం బెనంగొనఁగఁ జక్కటికిం జని పుత్రుఁ గౌఁగిటన్
సంతతిమున్ ఘటించి కడు సమ్మతి నక్కునఁ జేర్చి యిట్లనున్.

శా. నన్నుం గన్నకుమార! నాధననిధీ! నాతండ్రి! నాప్రాణమా!
కన్నుం గుట్టిన దేమొ రాక్షసుఁడు నిన్ గైకొంచుఁ గ్రౌర్యంబునన్
నిన్నున్ నన్నును బాపి చావు మని మున్నీటం బడన్ వైచి నాఁ
డన్నా! యెట్లును రానితో యెటులు నీ వైతో వెఱం గయ్యెడున్.

వ. అని యనేకవిధంబుల నుపలాలించి కోడలిం బ్రశంసించుచుండె నని
చెప్పి శుకుండు మఱియును. 251

—♦ సత్రాజిత్తు - స్యమంతకమణి ♦—

క. కృతకిల్బిషుఁడై సత్రా
జితుఁ డను రా జాత్మజాతఁ జిరమణితోడన్
హిత మెంచి యిచ్చె హరి కన
నతఁ డేటికి నిచ్చెఁ జెప్పు మని రా జడిగెన్. 252

వ. అనినం జెప్పెద విను మని శుకుం డి ట్లనియె. 253

సీ. సత్రాజితుండు మున్ సప్తాశ్వునకు ముఖ్య
భక్తుఁడై సేవించె సతత మతఁడు
మెచ్చి వానికిఁ బ్రీతి నిచ్చె శ్యమంతక
మనియెడునొకమణి నతఁడు దాని
ధరియించి రెండవతపనుండు నా వెల్గు
చును ద్వారకాపురమునకు వచ్చె
జను లామణీధరుఁ గని దివ్యాలను బ్రకా
శము చేతఁ బోలింపఁ జాల కతని

ఆ. సవితృదేవుఁ డనుచు శంకించి పాచిక
లాడుచున్నకృష్ణు నంతికమున
కఱిగి దేవదేవ యరవిందలోచన
వందనములు గొనుము వాసుదేవ. 254

శా. యాదవవంశమందు మనుజాకృతి నొందిన దేవదేవు దా
మోదరు ని న్భజించుటకు నుల్లము సేయుచు వేఁడిఘృష్టులన్
మా దెసఁ బర్వఁ జేయుచును మాకనులన్ మిరిమిట్లు గొల్పుచున్
మోద మెసంగఁ జేయుచును మ్రొక్కఁల దేవర వచ్చుచుండెడిన్

తే. అంబుజాక్షుఁడు బాలవాక్యములు వినుచు
నవ్వి సూర్యదేవుఁడు కాఁడు నడచివచ్చు

నాతఁడు శ్యమంతకమణీసమేతుఁడై వె
లుంగువాఁడు సత్రాజిత్తుం గనంగ. 256

వ. అనంతరంబ. 257

శా. సత్రాజిత్తుఁ డలంకృతం బయి కడుఀ సంపత్సమృద్ధంబు నై
సుత్రామస్తుతవైభవాంచితము నై సొంపొందుస్వాగారమం
దాత్రిం బేర్పడ నిల్చి దేవభవనంబం దామణిం బెట్టె నా
స్తోత్రార్హం బగురత్న మీను దినముఀ సొన్నంబు పుట్లెన్మిదో.

ఉ. ఆమణి యున్నచో నెప్పుఁడు నాధులు వ్యాధులు నీతిబాధలుఀ
క్షామము డాంబరంబును బిశాచము పీడయు మారి మోసముఀ
నామము నేని లేని వగు నవ్యములై కనుపట్టు సొన్నముల్
వేములు సంస్తుతింప నయి విశ్రుతి కెక్కును రత్న మిద్ధరఀ. 259

మత్త. ఉగ్రసేనుఁడు తత్ప్రభావము నుల్లమందుఁ దలంచుచుఀ
వ్యగ్రతఀ దనకోర్కి కృష్ణున కానతిచ్చిన నాతఁడుఀ
నిగ్రహంబునఁగాక మిక్కిలి నేర్పునఀ మణి నాకు ని
మ్మొగ్రహించెద నన్న నన్నరుఁ డీయఁ జాలఁడు మోహియై. 260

—♦ శ్రీకృష్ణునకు నీలాపనింద వచ్చుట ♦—

సీ. ఆమణి గంఠమునందు ధరించి ప్ర
సేనుఁ డొండొకనాఁడు కాననమున
కేగి నశ్వము నెక్కి మృగయావిహారియై
యాలోన నొకసింహ మరుగు దెంచి
వాహముతో వాని వధియించి వెల్గున
మ్మణి నోటఁ గొనిపోయె మాంసబుద్ధి
గిరిగుహ నున్నయాహర్యక్షముం జంపి
జాంబవంతుఁడు మణి సంగ్రహించి

తే. బిలమునం గలతనయింటఁ జిన్నిపాప
కాటవస్తువుగా దాని నాచరించె
నటఁ బ్రసేను సత్రాజిత్తుఁ డరయ కడలు
గుడిచెఁ దమ్ముని పోకకు నడరు నెడఁద. 261

తే. మణి ధరించి ప్రసేనుఁడు మనికి విడిచి
కానసంబున కేగినకాలమందుఁ
హరి యతనిఁ జంపి రతనంబు నపహరించి
యుండు నంచు సత్రాజిత్తుఁ డొలికె నుడుగు. 262

వ. అది కర్ణాకర్ణిగా నెల్లకడల నలుముకొనియెఁ గృష్ణుండును దుర్యశో లిప్త మగునామాట నాలించి జాలింబడి నీలాపనిందం బాపుకొను వాఁడై పురజనులం గూడి నానాప్రకారంబులఁ బ్రసేనుమార్గం బన్వే షించుచు నొక్కమహారణ్యంబున సింహంబుచేఁ జంపఁబడినసాశ్వుం డగుప్రసేనుండును సింహంబుం జంపినభల్లూకపదంబులుం జూచి తచ్చిహ్న సూచితమార్గంబునం జని చని గుహాముఖంబునం దనవారి నుండఁ జెప్పి తా నందుఁ బ్రవేశించి యం దొక్కచో బాలక్రీడా కందుకంబుగం గట్టినమణిశ్రేష్ఠంబు లోచనగోచరం బగుటయు దానిం గ్రహించు బుద్ధిం జేసి తదర్భకాంతికంబున నల్లన నడుగు వెట్టుటయును.

తే. అచట నుండెడుధాత్రి య ట్లరుగుదెంచు
వాని నెప్పుడు చూడనివానిఁ జూచి
బీతునం బోలెఁ బెల్లార్చె నాతతి బల
వంతుఁ డగు జాంబవంతుఁ డాధ్వానము విని. 264

క. శ్రీకృష్ణుమహిమ మెఱుఁగక
ప్రాకృతపురుషునిగ నతఁడు భావించి మదిన్
వాకొనుచు రోషదూషితుఁ
డై కవిసెఁ గృష్ణుమీఁద వతిరంహముసన్. 265

సీ. అపుడు వారలకు శస్త్రాలాయుధంబులు వెట్లు
బాహువుల్ లోనగువానితోడ
ద్వంద్వయుద్ధము ఘోరదర్శన మయ్యెను
బలలార్థ మయి శ్యేనములకుఁ బోలెఁ

రేఁబవల్ విడకుండ రేఁగి వా రిద్దఱు
పదు నెన్మిది దినంబు లెదిరి పోరి
రట్లుపోరుచునుండు నపుడు కృష్ణునిముష్టి
ఘాతంబులఁ భల్లుకపతి యొడలు

తే. పిండిపిండిగ నగుటయు స్విన్నగాత్రుఁ
డగుచు సత్త్వము చెడ లోన నచ్చెరువడి
యంతలో నంతయు నెఱింగి నట్టేడగుచు
జాంబవంతుఁడు హరిఁ గాంచి పలికె నిట్లు. 266

చ. తెలిసితి నిన్ను భూతముల తేజము ప్రాణము శక్తి శౌర్యముఁ
బలమును నీవ లోకములఁ బాలనముం బొనరించువాఁడవుం
బొలియఁగఁ జేయువాఁడవును బుట్టగఁ జేసెడువాఁడ వీ వహో
సలలితమూర్తి విష్ణుఁడవు సర్వసహిష్ణుఁడ వీవ చూడఁగఁ. 267

—♦ శ్రీకృష్ణుండు జాంబవంతు నోడించి శ్యమంతకము దెచ్చుట ♦—

సీ. నీకోపమునఁ గాదె నీరాశి జంతుసం
తతులతో క్షుభియించి దారి యొసఁగె
నీశౌర్యమునఁ గాదె నిఖిలలంకాపురీ
ప్రాసాదము లవెల్లఁ బదటఁ గలసె
నీప్రతాపమునఁ గాదే ప్రతిరోధ యా
రావణుతల లెల్ల రాల నయ్యె
నీదర్పమునను గాదే దైత్యదానవుల్
భస్మావశిష్టులై బడలు పడిరి

తే. ఏ నెఱుంగుదు రాముఁడ వీవు నేను
నీదుదాసానుదాసుఁడ నోదయాను
యాత్మ! ననుఁ బ్రోవు మోదేవ యనుఁడు శౌరి
కరమునఁ వాని మే నంటి కరుణ-ననియె. 268

శా. భల్లూకేశ్వర నా కకారణముగాఁ బ్రాప్తించె దుష్కీర్తి త
త్సల్లోపంబును దీర్చుపొంటె మణికై ధాత్రీస్థలిఁ రోయుచుఁ

బెల్లారాటముఁ గోడ నీవసతికిం విచ్చేసితి న్నావుడుం
సల్లాపించుచు జాంబవంతుఁడు కడుం సౌహార్ద మేపారఁగన్. 269

వ. తనకూఁతురు జాంబవతి యనుకన్యామణితో శ్యమంతకమణిం దెచ్చి శ్రీకృష్ణున కిచ్చినం బుచ్చుకొని యతండు సంతసించుచు వానికి నిరతిశయముక్తి ననుగ్రహించె నంతలో బిలముఖంబున నున్నజనులు కృష్ణాగమనంబునకై పండ్రెండుదినంబులు వేచి యుండియు వానిరామి నందుచుఁ బురంబునకుం జని దేవకీవసుదేవాదులకుం జెప్పిన వారు దుఃఖించుచు సత్రాజిత్తుం దిట్టుకొనుచు కృష్ణాగమనాభిలాషులై చంద్రభాగ యనుదుర్గాదేవిం బూజించి ప్రార్థించి రంతఁ గొంతలోన దుర్గానుగ్రహంబున సిద్ధార్థుండును సభార్యుండు నగుకృష్ణుండు వచ్చి యెల్లవారి నానందవారిధిం దేల్చె ననంతరంబ. 270

శా. సత్రాజిత్తునుఁ బిల్వనంచి సభకుం సర్వోర్వీనాథుల్ వినన్
మిత్రంబా! విను మీశ్యమంతకమణిం నేఁ గొంటి నం చెంచి తీ
వ్రాత్రం బందుచు నీదుతమ్ముఁ డదిగో హర్యక్ష మవ్వానినిం
ధాత్రిం జంపి గ్రసించె నెల్గుదొర నద్దాసం గొనెం బిమ్మటన్. 271

వ. నేనెల్లకడల నన్వేషించుచుం బోయి వానికడ నీశ్యమంతకం బుంట యెఱింగి పెనంగి తెచ్చితి నిదిగో నీది నీవు గ్రహింపు మని యిచ్చినం బుచ్చుకొని సత్రాజిత్తు తనచేసినతప్పున కనుతప్యమానమానసుండై తల వంచుకొని స్వభవనంబునకుం జని. 272

క. బలవద్వైరము నాకుం
గలిగెను నే నెట్లు బ్రదుకఁ గల నాదోషం
బులఁతి యన రాదు కృష్ణుం
డలరి ననుం గనుట యెట్టు లగునో తెలియన్. 273

చ. ఒకఁడును జూడకుండ నెవఁడో యునున ట్లన నైనవాఁడఁ బా
తకిని ధనాతిలోలుపుఁడఁ దప్పు నొనర్చితి ముప్పు వచ్చె నే

నీకుఁ నెటు చేసి శ్రేయమున నేగెద నంచు నెడం దలంచుచున్
సుకృతముఁ గోరి రత్నమును సూతి యనంజనునూత్నరత్నమున్.

—♦ శ్రీకృష్ణుఁడు జాంబవతీసత్యభామలం బెండ్లియాడుట ♦—

వ. కొనిపోయి కృష్ణున కిచ్చి నిరస్తపాపుండ నయ్యెద నని నిశ్చయించి సత్యభామ యనుకన్యారత్నంబు వెంటఁ బెట్టుకొని పోయి కృష్ణుని హస్తంబునం బెట్టి శ్యమంతమ్ము నరణంబుగా సమర్పించె నంతఁ గృష్ణుండును. 275

మత్త. జాలిఁ జూపుచు వచ్చి యిచ్చినసత్యభామను భామినిన్
శీలరూపదయాన్వితన్ గుణసేవధిన్ సుషమావధిన్
శ్రీ లెసంగ గ్రహించి శాస్త్రప్రణీతసూత్రక్రమపద్ధతిన్
దాలి గట్టెను బాణిపీడనతత్పరత్వ మెసంగఁగన్. 276

వ. ఇట్లు పరిణయోత్సవం బయినపదంపడి కృష్ణుండు. 277

చ. శ్వశురునిఁ గాంచి యి ట్లనియె వామవిలోచన యన్ మహామణిన్
విశదము గాఁగ నిచ్చితివి వేడుకమై నది నే గ్రహించితిన్
నిశలును రేలు నా కెప్పుడు నిట్టల మై వసు విచ్చుదీని నీ
వశమున నుంచుకొ మ్మనుచు వానినిఁ బుచ్చె నొసంగి రత్నమున్.

తరువోజ. అంత నక్కడ హస్తినాఖ్యపురమున
నక్కౌరవులు క్రూరులై లక్కయింటఁ
బంతమునం బెట్టి పంచపాండవుల
వారియంబను గాల్చివైచి రటంచుఁ
జింతాకరశ్రుతిం జేసి కృష్ణుండు
చిత్తమున నెఱింగి చెనఁటినా నొప్పి
సంతసం బఱి. బలసహితుఁడై కుల్య
సంప్రదాయము నడ్పఁ జనె హస్తిపురికి. 279

వ. చని భీష్మ ద్రోణ విదుర గాంధారీ ధృతరాష్ట్రాదులం గాంచి సమాన దుఃఖం బభినయించుచు సమాశ్వాసించుచునుండె నంత నక్కడ. 280

♦ కుల్య=కులసంబంధమ; సూతి=కుమారుడు; కొమరిత;

సీ. అక్రూరకృతవర్మ లప్పు డొక్కనాఁ డల్ల
శతధన్వునిం బిల్చి సత్య నిడుట
లేమి యయ్యెను మణి యేఁ గొందునంటి స
త్రాజిత్తు తలఁప వృథాప్రతిజ్ఞుఁ
డనుజు గతింబొంద నర్హుఁడనఁ శత
ధన్వుఁడు భిన్నచిత్తమ్ము గలిగి
యెడ లెఱుంగని నిద్ర నొందు సత్రాజిత్తు
కుత్తుకం దెగఁగోసి క్రూరుఁ డగుచు
తే. స్త్రీ లనాథలవలె నేడ్పు చేయుచుండఁ
జనియె రత్నము గ్రహియించి సత్యభామ
కన్నవారింటి కరుదెంచి యున్నదగుట
తండ్రి మృతి గాంచి విలపించె ధైర్యము చెడ. 281

వ. ఇట్లు విలపించి విలపించి తండ్రి కళేబరం బొక్క తైలద్రోణిం బెట్టించి
తా నప్పుడ కదలి గజసాహ్వయంబునకుం జని హరిం గని విలపించుచుఁ
దనతండ్రిమరణం బెఱింగించుటయు నతండును బలరామునిం గూడి
మనుష్యధర్మం బనుసరించి కంట నీరు వెట్టుకొనుచు. 282

ఉ. సానుజుఁడుఁ సభార్యుఁ డయి స్యందనవర్యము నెక్కి ద్వారకం
గానఁగ వచ్చి మామకుతికం దెగఁగోసినక్రూరుఁ గోసియుఁ
మానికముఁ గ్రహించుటకు మానసముం బొనరించి మామకుఁ
తా నట నూర్ధ్వదైహిక మొనర్పఁగఁ జేసె ననంతరంబునఁ. 283

క. శతధన్వుఁడు కృష్ణోద్యమ
మతులిత మగుచుంటఁ దెలిసి యారాటమునఁ
గృతవర్మ చెంతకుం జని
బ్రతుకుటకు సహాయపడఁగఁ బ్రార్థించుటయుఁ. 284

క. కృతవర్మ యనియె నయ్యో
మతిమాలినవాఁడ రామమాధవుల కెదం

ప్రతికూల మాచరించిన
బ్రతుకుట యెక్కడిది యెట్టివారల కేనిన్. 285

శా. ఏ నవ్వారికిఁ గీడు సేయుటకుఁ గా నెంచన్ మనంబం దయో
తా నెంతో యనుకొన్న కంసుఁ డొక యింతం ద్రెళ్ళి సాప్తాఘుఁడై
తానే పోటరి నంచు నిక్కపడునాతం డాజరాసంధుఁ డే
మై నిట్టూరుపుపుచ్చుచుండెనొ మదిన్ మట్టాడవే యేరికిన్. 286

వ. అని ప్రత్యాఖ్యానంబు గావించిన నంత శతధన్వుం డక్రూరునికడకుం
జని సాహాయ్యంబు కోరిన నతం డి ట్లనియె. 287

శా. ఓలోలాత్మక! మాధవుం డనఁగ నేరో యంచు భావింతు వో
లీలం జేసి ప్రపంచంబుం జెనిచియున్ లీనంబు గావించియున్
గెలిం దేలెడునాదిపూరుషుఁడు శ్రీకృష్ణుండు జిష్ణుండు లో
కాలోకాఖ్యతభూధరం బుడుపని ట్లావిర్భవించెం జుమీ. 288

ద్విపదము. ఏడేండ్లవాఁ డయి పృథ్వీధరంబు
క్రీడమై చిటికెనవ్రేలిపై నేల
తాడి పువ్వును బోలె ధరియించె నత్తి
వాఁ డొకనరుఁ డన వచ్చునే వెడఁగ. 289

వ. ఆద్యంతవిహీనుఁడు నద్భుతకర్ముండును గూటస్థుండు ననంతుఁడు
నగు శ్రీకృష్ణున కిదే నానమస్కార మని చే యెత్తి మ్రొక్కి మొక్క
లీడా పో పొ మ్మనిన నతండు స్యమంతకం బక్రూరునికడం బాఱవైచి
పారసీకాశ్వంబుపై నెక్కి నూఱుయోజనంబులదూరంబు గలుగునట్లు
పాఱం జొచ్చె నంతలో రామకృష్ణులును జవనాశ్వయోజితంబును
గరుడధ్వజవిరాజితంబు నగురథం బెక్కి శతధన్వునిమార్గం బనుసరించి
వెన్నుఁ దన్ని చని రంతలోన. 290

— శ్రీకృష్ణుండు శతధన్వునిశిరంబు గోయుట —

చ. మిథిలకడన్ మహాశ్వ మది మీఁద గమింపఁగ లేక తూలినన్
వ్యథ శతధన్వుఁ డాహయము నంత రయంబున వీడి కాల్నడన్

పృథివి చలింప గాలికిని వీసరవోవని వేగిరమ్మునన్
పథము నెఱుంగఁ జాలనటు పాఱఁగ జొచ్చెను వెచ్చ నూర్చుచున్.

ఆ. కృష్ణుఁ డనుసరించి క్రిందికిఁ దిగి వాని
నడుగులోనఁ బట్టి యట్టు నిట్టు
కదలకుండఁ జేసి కరసుదర్శనమున
శిరము నఱికె నొక్కచిటికలోన. 292

క. తలయుం గాయము వేఱై
యిలఁ ద్రెళ్ళినపిదపఁ గృష్ణుఁ డేగి యచటికిన్
నిలువెల్ల వెదకె వస్త్రం
బుల మణిఁ గన లేక మరలి పోయి బలునితోన్. 293

మ. వితగాఁ జంపితి పీని వీనికడ నావిఖ్యాతరత్నంబు వ
స్త్రతతిం గానఁగ రాదు నా నఱఁడు కృష్ణా రత్న మొందేని యీ
శతధన్వుం డిడియుండుఁ బత్తనమునన్ సర్వత్ర గాలింత మే
నతిథిత్వంబు వహింతు మైథిలుని గేహంబందు మిత్రంబనై. 294

తే. అనుచు మిథిలాపురంబున కరిగె నాతఁ
డతనిఁ బూజించి తనయింటిముందు కొంత
కాల ముండఁగఁ గోరె నాఁగాత మనుచుఁ
గొన్ని సంవత్సరము లటఁ గుదిరి యుండె. 295

వ. అలో దుర్యోధనుం డట వచ్చి జనకరాజసమ్మానితుండై యుండి బల
రామునికడ గదాయుద్ధంబున శిక్షితుం డయ్యె నక్కడఁ గృష్ణుండును
బలు నంపిపుచ్చి తాను ద్వారకకుం జని శతధన్వునిధనంబును మణి
గానరాకుంటయు సత్యభామ కెఱింగించి మరణించినమామ కుత్తర
లోకక్రియలు చేయించె నపుడు కృతవర్మాక్రూరులు శతధన్వుమర
ణంబు విని బీతు గుడిచి పురంబు విడిచి స్థలాంతరంబునకుం జని రంత.

సీ. అక్రూరుఁ డరుగుట నాద్వారకాపురిఁ
దృష్టింప నయ్యె నరిష్టతతులు

వానలు లేకుండె మానసశారీర
తాపము లుదయించెఁ దప్పని వయి
భౌతిక దైవికోపద్రవంబులు హెచ్చె
గ్రహదోషములు తోఁచె బహుళము లయి
క్షామడాంబరములు గడువడిఁ దలసూపె
విస్ఫోటమారికావిసర మొదవె
తే. ద్వారకావాసు లప్పుడు పౌరుదాహృ
తము నెఱుంగక కృష్ణుండు తనరుచోట
నిటు లరిష్టము లగుటకు నేమి కతమొ
తెలియఁ దగునంచు నెంతయు దేవురపడి. 297

తే. మున్ను మేఘుఁడు వర్షింపఁ బోనియప్పు
కాశిరాజు శ్వఫల్కునిఁ గాంచి తెచ్చి
గాందినీకన్య వానికిఁ గా నొసంగి
నిలుపుకొనె దాన వానలు గలిగె నంట. 298

క. వానిసుతుం డక్రూరుఁడు
తా నంతటివాఁ డతండు తనరినచోటన్
వానలు లేకుండవు కీ
డేనాఁడును లేక యుండు నేవారలకున్. 299

వ. అని వృద్ధజను లాడుకొనుమాట లాలించి జనార్దనుండు దీని కక్రూ రుండు లేమియే కారణంబు గాదు శ్యమంతకంబు లేమియుఁ గారణంబు కానిమ్మని దూతలం బుచ్చి యక్రూరుని రావించి పూజించి ప్రియకథలం జెప్పి ప్రీతునిం జేయుచు నవ్వుమొగంబుతో ని ట్లనియె.

సీ. అక్రూర! శతధన్వుఁ డాశ్యమంతకమణి
నీయొద్దఁ బెట్టుట నేఁ దెలిసితి
తనయులు లేనిసత్రాజిత్తునకు నిప్డు
తనుజాత తనయులే దాయ లగుదు

రవ్వారె పిండదానాదులో నర్ప నౌ
వారలు వారికే వానిధనము
పొందంగ వచ్చెడు బో స్యమంతక మది
పొరుగువారికిఁ జెందఁ బోవ దెపుడు

తే. నీదుకడ నుండె నంటకు నేను వగవఁ
గాని మాయన్న యిది యౌనొ కాదొ యనుచు
సంశయించెడు గావున సకలబంధు
వుల కిపుడు చూపి శాంతిని సలుప వయ్య. 301

క. అవ్వాల నమ్మణివలనం
దెవ్వాని బంగారు గలిగి దీపించుచు నీ
వివ్వసుధ స్వర్ణవేదులు
నివ్వాటిల్లఁ జేయుచుండు నీవధ్వరముల్. 302

వ. అని యిట్లు సామంబునం బోధించి నంత నక్రూరుండు వస్త్రచ్ఛన్నం
బును సూర్యసమప్రభంబు నగుస్యమంతకంబు దెచ్చి కృష్ణున కిచ్చెఁ
గృష్ణుండును దానఁ దనరుజం బాపుకొని జ్ఞాతులకుం జూపి దాని
మఱియు నక్రూరున కిచ్చి పుచ్చె నీయుపాఖ్యానం బాలించినవారికి
దుష్కీర్తిదురితంబు తొలంగు నంత. 303

మ. యుయుధానాదులతోడఁ గూడుకొని యొండొక్కండు నాఁ డచ్యుతుం
డయముం గాంచినపాండవేయులను స్నేహం బేర్పడం జూడ నై
రయ మొప్పన్ రథ మెక్కి రాజగృహ మింద్రప్రస్థముం జేరె నం
తయు సమ్మోదముతో స్వవైభవము నానాదిక్కులం బ్రోవఁగన్.

తే. అట్టు లఖిలేశ్వరుఁడు కృష్ణుఁ డరుగు దేరఁ
నిందప్రపుత్రాదు లగువార లిందియములు
పంచవృత్తి సమేత మహాప్రాణము బలె
చూచి లేచిరి యొక్కమా రేచినతమి. 305

వ. ఎదురేగి గాఢాలింగనంబు గావించుకొని సంతసించి రంతఁ గృష్ణుండు
ధర్మరాజభీములకుఁ బాదాభివందనంబు చేసి వాసవాత్మజునాలింగనంబు

చేసికొని నకులసహదేవులఁ జేరఁ దీసి యాదరించె నపుడు నవోఢ యగు ద్రౌపదీదేవి సిగ్గుపడుచు వచ్చి సింహాసనాసీనుం డగు శ్రీకృష్ణునిపాదంబులకు మ్రొక్కె సాత్యకియు నెల్లవారిచే నభినందితుండై కూరుచుండె నితరులును యథార్హసంభావితులై రనంతరంబ.

—♦ శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట ♦—

ఉ. కుంతి గృహంబునుండి కనుఁగోఁ జనుదెంచినఁ జూచి లేచి సు
స్వాంతుఁడు వాసుదేవుఁడు రయంబున నాయమకాళ్ళ వ్రాలినన్
సంతస మేర్పడన్ గనులఁ జార్చుచు హర్షజలంబు లామెయుం
గొంతటిలోన సందిటను గూడఁగఁ జేయుచుఁ జుంచు దువ్వుచున్.

తే. ప్రేమవైక్లబ్యమునఁ జేసి విరవిరపడి
కనుల నీ ర్నించుచున్ రుద్ధకంఠ యగుచు
తండ్రి! వచ్చితె మముఁ జూచుతత్పరతను
నీదుతల్లియుఁ దండ్రియు నెమ్మి నుండ్రె. 308

తే. నీదు రాకయె కుశలమై మాదెస నగు
స్వపరభేదమునీకు లే దెపుడు గాని
విశ్వబాంధవుఁడవు నిన్ను విశ్వసించి
కొలుచువారల రక్షింపఁ దలఁతు వీవు. 309

వ. అంత యుధిష్ఠిరుండు కృష్ణునిదిక్కు మొగంబై. 310

క. మే మెట్టిపుణ్యలేశం
బేమియుఁ జేసితిమొ యెంత లెంత లెంతలు నేనిన్
నేమమునఁ జూడఁ జాలరు
బ్రేమ న్నముఁ జూడ నిట్లు విచ్చేయు దహా. 311

వ. దేవా! నీ వీవార్షికవాసరంబు లిట నుండి మమ్మును మాపురవాసుల నానందింపఁ జేయు మనిన నతం డౌఁ గాత మని యింద్రప్రస్థపురంబునఁ బాండవులం గూడి యిచ్ఛావిహారంబులం దేలుచుండె నంత నొక్కనాఁడు కృష్ణార్జును లిద్దఱు రథారోహణంబు నేసి వనవిహారంబు

గావింపం జని నానావిధమృగవధంబు గావించి వాని నెల్ల ధర్మరాజు నకుం బుచ్చి తృట్పరిశ్రాంతులై యమునానదికిం బోయి జలోపస్పర్శ నంబు చేసి జలంబులు ద్రావి విశ్రమించి రప్పుడు. 312

—♦ శ్రీకృష్ణుఁడు కాళిందిం బరిగ్రహించుట ♦—

మ. కని రాకృష్ణుఁడు నర్జునుండును జలాగ్రంబందుఁ గన్యామణిన్
వనితాలోక పరిష్టుతాంగసుషమావ్యావిద్ధ విద్యుద్ఘృణిన్
వనజాతాయతలోచనన్ బ్రవిలసత్స్వర్ణ ప్రభారోచనన్
దినరశ్మిప్రోత్తమపుత్రికన్ బ్రవిలసద్ధీహృష్టలోకత్రికన్. 313

వ. అట్లు గాంచి నంతఁ గృష్ణుం డర్జునునిదిక్కు మొగంబై నీవు పోయి యీ ప్రమదారత్న మెవ్వరో విచారించి ర మ్మనిన నతం డామె చెంతకుం జని యి ట్లనియె. 314

పున్నాగవృత్తము. ఎవ్వనిదాన వెవ్వతెవు నీ విక్కేటి కేతెంచితో
జవ్వని నీప్రయత్నము గనన్ స్వాంతంబునన్ భర్తకై
యువ్విళు లూరుచున్నగతి గా నూహింపగా వచ్చె నా
నవ్వనితాశిరోమణియు ని ట్లాడెం గడు న్వేఁడుకన్. 315

సీ. సవితృపుత్రిక నేను సదమలాత్మ్కఁడ విను
పద్మనాభుఁ బతిగాఁ బడయఁ గోరి
తద్దర్శనార్థ మీస్థలమునఁ దపియించు
చుంటిఁ బితాదేశ మొంద నగుచు
హరి గాక నే నన్య నభిలషింపను దండ్రి
కాళిందికడుపులోఁ గట్టె గృహము
నందు వసింతుఁ గాళింది నాఁగ సమాఖ్య
నొంది యుండినదాన నోయి విజయ

తే. అచ్యుతుఁడు వచ్చి ననుఁ బెండ్లియాడు వఱకు
నింద యుండెదఁ దపియించు చిట్లఁ యనుచుఁ
దెలుపుటయు జిష్ణుఁ డాకృష్ణదేవు కడకు
నరిగి సర్వము వచియించె నతని కతఁడు. 316

వ. కృష్ణుండు నా మెఱుంగి యటఁ జని తన్నెఱింగించి మించిన వేడ్కఁ గాళింది రథంబుపై నెక్కించుకొని ధర్మరాజున కది యంతయుం జెప్పి యప్పుడు విశ్వకర్మచేఁ బాండవులకుఁ బత్తననిర్మాణంబు చేయించి తా నటఁ గొంతకాలం బుండి ఖాండవవనం బర్జునునిచే నగ్ని కాహారంబు గావించి వానిచే గాండీవంబును శ్వేతాశ్వరథంబును నక్షయతూణీరంబులును నభేద్యం బగువర్మంబు నతనికిఁ గలిగించి దానవశిల్పిచే నట మహాసభం జేయించి ధర్మజున కొసంగి తదనుజ్ఞాతుండై కాళిందీ సహితుండై సాత్యకిప్రభృతులతో ద్వారకాపురంబునకుం జని శుభ లగ్నంబునఁ గాళిందిం బెండ్లియాడి యనంతరంబ. 317

—◆ శ్రీకృష్ణుఁడు మిత్రవిందా నాగ్నజిత్యాదులం బెండ్లియాడుట ◆—

తే. ధార్తరాష్ట్రవశానుగుల్ ధర్మశూన్యు
లైనవిందానువిందు లన దానవాభు
లాత్మసోదరి మిత్రవిందాభిధాన
నొరుల కీయంగ నెంచుచు నున్నయెడల. 318

వ. వాసుదేవుండును దండ్రితోఁ బుట్టువగు రాజాధిదేవిపుత్త్రికయును దన యం దనురక్త యగునామిత్రవింద నెల్లరాజులుం జూచుచుండ బ్రసభంబునం గొని వచ్చి పరిణయం బయ్యె మఱియును. 319

సీ. ధర్మశీలుఁడు దానతత్పరుండును గోస
లవిభుండు నగ్నజిత్ప్రవరుఁ డొప్పు
నతనికి సత్యాఖ్య నలరు కన్యక నాగ్న
జిత్తి యనంగను జెప్ప నగుచుఁ
బొగ రెక్కి వాడికొమ్ములు గలవయి యేడు
గోవృషంబులు గల వావృషముల
గెలిచినఁ గాని యజ్జలజాక్షి యేరికిఁ
గైకొన శక్యంబు గాని దయ్యెఁ
తే. గృష్ణుఁ డది విని సేనాసమేతుఁ డగుచుఁ
గొసలునిచెంతకుం జని కోరుటయును

సంతసించుచు నతఁ డమసాంత్వనమున
వృషభజయ మనునుంకువ విన్నవించె. 320

ఆ. నాగ్నజిత్తి కృష్ణనామవిక్రమశౌర్య
ధైర్యముల నెఱింగి తనరుచున్న
యదియ కాన నాకు నాహరి పతి గాఁగఁ
గూర్పు మనుచు వేఁడుకొనియె గౌరి. 321

ఉ. రాజును గాంచి కృష్ణుఁ డనురాజబిడౌజ ధరాతలంబులన్
రాజులు యాచ్నకుం దిగగ రా దని శాస్త్రము చెప్పు నైన నే
నీజగజంపు నెయ్యమున నెమ్మది నెమ్మది నొందఁ గోరుదున్
రాజముఖున్ భవత్సుతఁ గరంబు కరం బిడువారమే కటా. 322

ఆ. అనిన నగ్నజిత్తుఁ డనియె నీకంటెను
వరుఁ డొకండు వరుఁడు వఱలఁ బోఁడు
కన్యకార్థ మనుచుఁ గల్పించితిమి పణం
బిట్లు విన్నవింతు నెఱుఁగ వినుము. 323

ఉ. ఏడు మదించినట్టివృషభేశ్వరముల్ గల విందు వాని నె
వ్వాఁడు జయించు నాతనికి వారిజలోచన నాదుకన్నియన్
వేఁడుక నీయ నేఁ బణము వెట్టితి నట్టనఁ బట్టివానినిన్
బోఁడిమిమై జయించి కొని పొమ్ము మదాత్మజ నాగ్నజిత్తినిన్. 324

సీ. అన విని శ్రీకృష్ణుఁ డపు డేడురూపము
లెత్తి మత్తిలినగోవృషభసప్త
కముఁ బట్టి త్రాళ్ళతోఁ గట్టియు బాలుండు
దారు విగ్రహములతీఱున నిలఁ
బడవైచి యీడ్చిన భగ్నదర్పం బయి
పడి మృతప్రాయమై బడలు పడియె
నద్దాన నగ్నజిత్తచ్చెరువడి తన
కూఁతు సత్యం దెచ్చి యాతని కిడి

తే. ధేనుసాహస్రమును యువతీసహస్ర
మును గజసహస్రమును రథములశతంబు
భటశతసహస్రమును సైంధవశతమును
బారిబర్హము గా నిచ్చె భక్తి నపుడు. 325

వ. కృష్ణుండును నాగ్నజిత్తితో నన్నింటిం బరిగ్రహించి పరమానందభరి
తాంతరంగుం డయి శంఖభేరీమృదంగాదివాద్యంబులును బ్రాహ్మణా
శీర్వచనంబులును నభంబున మ్రోయ నప్పుడు సతీసమేతుండై రథం
బధిష్ఠించి మహాసేనాపరివృతుండై ప్రయాణంబు గావించె నాసమ
యంబున గోవృషభములచే భగ్నవీర్యు లగురాజులు కన్యాసహితుం
డై నిర్గమించునతని నడ్డు దగులుటయును. 326

ఉ. కృష్ణునిఁ గూడి కోసలకు నిచ్చ మెయిం జనుదెంచినట్టియా
జిష్ణుఁడు గాండివంబునను జేరఁగవచ్చినవారి శౌర్యవ
ర్ధిష్ణుత నేసి గాసిపడురీతి బొనర్పఁగ వార లెల్లరున్
విష్ణుపదంబు నొంది రొక్రేల్మిడి నబ్బురపాటు వాటిలన్. 327

వ. కృష్ణుండును బరివారపరివృతుండై సత్యయనునామెతో ద్వారకకుం
బోయిన కొన్నినాళ్ళలోన. 328

ఆ. తనకు మేనయత్త యును గేకయేశుస
తి యయినశ్రుతకీర్తి ప్రియసుపుత్రి
భద్ర యనెడుసాధ్వి భ్రాతలు తెచ్చి యీ
నింతి గాఁ బరిగ్రహించె మఱియు. 329

తే. మద్రపతి కన్నకూఁతురు మగువమిన్న
లలిత లక్షణలక్షిత లక్ష్మణ యను
నతివను స్వయంవరంబునయందుఁ బడసె
శూరతం దొల్లి గరుడుండు సుధను బోలె. 330

వ. మఱియు శ్రీకృష్ణుండు నరకాసురుని సంహరించి వానిచే బందీకృతు
లైనచారుదర్శనల ననేకసహస్రము లైనవారి నెల్ల భార్యలుగం

బరిగ్రహించె ననినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి కృష్ణుండు నరకాసురు నేమిటికి వధించె నరకుఁ డాస్త్రీల నేల చెఱం బెట్టె నావృత్తాంత మంతయు సవిస్తరముగఁ జెప్పు మనిన నతం డతని కిట్లనియె. 331

— నరకాసురసంహారాదికము —

సీ. వరుణునిఛత్రము హరియించి తనతల్లి
యదితికుండలముల నపహరించి
మేరువునం గడు మెఱయుస్వస్థానము
నాక్రమించుటఁ జేసి శక్రుఁ డలివి
చేయఁ జాల కొకండు శ్రీకృష్ణుఁ డాసత్య
భామాగృహంబునం బరఁగునపుడు
చనుదెంచి భౌముని ఘనచేష్టితం బెల్ల
విజ్ఞాపన మొనర్చి వేఁడుకొనియె
తే. హరి ఖగేశ్వరు నాహ్వాన మాచరించి
సత్యభామాద్వితీయుఁడై సరభసమున
వానిపై నెక్కి యాకాశవర్త్మమునను
బయన మయ్యెఁ బ్రాగ్జ్యోతిషప్రాంతమునకు. 332

మ. గిరిదుర్గంబులు శస్త్రదుర్గము లపోగ్నిస్పర్శనప్రోన్నతో
త్తరదుర్గంబులు గల్గి దుర్గమము దుస్తారంబు ఘోరంబునై
మురపాశాయుతసంవృతాఖిలదిశాభూభాగమై యొప్పున
ప్పురముం జేరి గదాధరుండు త్రిజగత్పూజ్యప్రతాపోన్నతిన్. 333

మ. గదచేఁ జక్రముచేఁ దదీయగిరిదుర్గశ్రేణులన్ గూల్చి పె
ల్చ దిశాభాగములందుఁ గల్గుమురపాశంబుల్ దెగం గోసి భీ
ప్రదుఁడై యెల్లరుఁ దల్లడిల్లునటు శార్ఙ్గం బూదె నానాద మా
పదియుం దిక్కులు నిండి బెండువడ నల్పం జాలె భూజావళిన్. 334

శా. ఆశంఖధ్వని నీటిలోన నిదురం బ్రాపించి యున్నట్టి దై
త్యేశుం డుగ్రుఁడు పంచశీర్షుఁడు మురుం డెంతేవడి న్వెంచు నా
వేశం బేర్పడ లేచి వచ్చి హరినిన్ వీక్షించి కాలాగ్ని నా
నాశల్ వెల్గఁగఁ జేయుశూలము వడిన్ హస్తంబులం ద్రిప్పుచున్

క. గరుడునిపైఁ బడ వేయుచు
ధరణియు నాకసము నిండి దర్పోద్ధతమై
విరియం బొఱి రవం బది
మురుఁ డార్చెను ముజ్జగంబు మూర్ఛిల్లంగన్.

క. చిచ్చఱపిడుగు తెఱంగున
వచ్చెడుశూలంబు గాంచి వసుదేవసుతుం
డచ్చెఱువడఁగన్ దానిన్
గ్రిచ్చఱ ఖండించె మూఁడుఖండంబులు గన్.

సీ. ముమ్మొనవా లట్లు ముత్తునియలు చేసి
మురదానవేంద్రుని ముఖమునందు
బహుళశస్త్రంబులు పరఁగించి నొంచె నా
తండు గదం ద్రిప్పి తాఁక నేసె
గద దానిఁ గని గదాగ్రజుఁడు గదాహతి
శతధా సహస్రధా చిదుకఁ జేసె
నాలో భుజము లెత్తి లీలఁ బఱచి వచ్చు
నతనితలం జక్రహతినిఁ దఱిగె

తే. వజ్రమునఁ జేసి శృంగముల్ వ్రక్కలైన
పర్వతము రీతి మురసుపర్వద్విషుండు
ప్రాణములు వాసి నేలపైఁ బడియె రావ
మొక్కపరి పదిదిక్కులు పిక్కటిల్ల.

వ. అప్పు డప్పంచజనాదునిపంచత్వంబునకుఁ గించపడుచుం దండ్రి ఋణ
దీర్చుకొనువారై వానిపుత్రులు తామ్రుఁడు నంతరిక్షుఁడు శ్రవణు

విభావసుఁడు వసువు నభస్వంతుఁడు వరుణుఁడు ననునేడ్వురును రోష
కషాయితాక్షులై తత్క్షణంబ యుద్ధసన్నద్ధులై నరకప్రేరితులై పీఠుఁ
డనుసేనానాయకుం బురస్కరించుకొని ధృతాయుధు లగుచు నా
యోధనంబునకు బయలువెడలి కృష్ణునిం దరియ వచ్చి చిచ్చుటఁ
పఱం బరఁగించి మించి గదా శక్తి శూల పరశు పట్టిస పరశ్వధాదులఁ
బ్రయోగించి రంత మురాంతకుండును. 33

—♦ మురాసురసంహారము ♦—

మ. మురదైత్యాత్మజ ముక్తశస్త్రచయముల్ ముత్తునుకలై నేలపైఁ
దొరఁగన్ జేయుచు వజ్రబాణములఁ దద్ఘోటపాదపార్శ్వంబులున్
శిరముల్ వక్షములున్ శరీరములు సంభిన్నంబులై పోవున
ట్లురుశక్తిం బొనరించి పుచ్చె యమసంయోగంబు సిద్ధింపఁగన్. 34

వ. అంత భూపుత్త్రుం డగునరకుండు శ్రీకృష్ణునిచక్రాయుధంబుచే నిహతు
లగుసేనానాయకులం జూచి సహింపం జాలక పారావారసంభవం
లగుమదగజయూథంబులం గూడి కొని యుద్ధసన్నద్ధుండై సంగ
రంగంబునకుం జనుదెంచి సత్యభామాసహితుండై గరుడోపరిస
తుండై మెఱుపుతోఁ గూడినమేఘంబువలె నున్న దేవకీనందనుం గాం
వెఱచఱచి నిలిచి చూచుచుండెఁ గృష్ణుండును. 3

చ. అపుడు శతఘ్ని మోము నరకాశకు సూటిగఁ ద్రిప్పి ప్రేల్చుచున్
వ్యపగతకల్మషంబు లగుబాణములన్ నిగిడించె వేన వేల్
రిపుబలముల్ హతోత్తమహారిద్విపపత్త్రిరథంబులై పడన్
విపుల నసృక్తతుల్ వడిగ నెల్లువయై ప్రవహించె నయ్యెడన్. 3

వ. అయ్యవసరంబున నరకుండు వానియోధులు నాయోధనం బతిదా
క్రమంబునం గావించుచు నానావిధాస్త్రశస్త్రంబు లాగరుడకృష్ణు
నెల్లకడలం జేరి మొల్లంబుగ నేయం జొచ్చి రప్పు డప్పురుషోత్తముం

చ. నరకబలప్రయుక్త మగునారసపంక్తుల మూడు మూడు దు
ర్ధరవిశిఖంబులం దునిమి తాండవకృష్ణుఁ డనంగ వయ్యె న

త్తరుణమునన్ ఖగేశ్వరుఁడు దంతులదండములూఁచి బీకియున్
గరములు వట్టి చించియును గాళుల మట్టియు నేఁచె నెట్టనన్. 344

తే. గరుడిచేఁ గొట్టఁబడినట్టిగజసమూహ
మని మొన న్విడి మూఁవటి లాఁగ నాఁగ
శతిరయంబునఁ బురముమోఁ మగుచుఁ బఱచె
నరకు డత్తఱి వెన్నిక దుర మొనర్చె. 345

— నరకాసుర సంహారము —

శా. ఏశూలంబునఁ దూలఁ బాఱి త్రిదివేశేంద్రాయుధం బేగ ము
న్నా శూలాయుధమున్ గ్రహించి నరకుం డండపభూతేశ్వరున్
లేశంబే కృప లేనియట్టిఁ డగుచున్ లే దింక నీ వంచు నా
వేశం బేర్పడ నేసె వేల్పులు భయోద్విగ్నాత్ములై చూడఁగన్. 346

ఉ. పూఫలదండ పైఁ బడినపోలిక శూలము పడ్డయంతలో
నావినతాసుతుం డొకరవంతయుఁ గాని చలింప కుంటచే
దేవవిరోధి కోపమున దేహ మెఱుంగక వాని వానినిం
జావగఁ నేయువాఁ డగుచు శక్తి మహాస్త్రము పూనెఁ జేతులన్.

సీ. దాని విసర్జించులోనఁ గృష్ణుఁడు చక్ర
ధార గజస్థుఁడై పోరువాని
తల త్రెస్సిపడునట్లు తలఁచి ప్రయోగించె
వరసుదర్శన మతిభయద ముగను
దానఁ గుండలమండితంబును మణికిరీ
టాంచితం బగువాఁని యాఁదల యది
తెగి నేలపైఁ బడె దివ్యర్షులును దివ్యు
లును సహా యని మెచ్చికొనుచు హరిని

తే. పూలదండలు వేయుచుఁ బూజ చేసి
రపుడు భూదేవి వచ్చి మహామణియును
రత్నకుండలములును ఛత్రంబు వైజ
యంతము నొసంగి చేసె సంప్రార్థనంబు. 348

---

సత్యభామ నరకునితో యుద్ధము చేసినట్లు మూలమున లేదు.

తే. దేవ! చక్రిగదాధర దేవదేవ
భక్తవత్సల పరమాత్మ! వాసుదేవ
మత్స్యకూర్మాదిరూప యోమాసనాథ
నీకు వందన మొనరింతు లోకనాథ. 349

తే. నతి యొనర్చెదఁ బంకజనాభ! నీకుఁ
గేలు మోడ్తుఁ బంకజమాలి నీకు
నెమ్మి మ్రొక్కెదఁ బంకజనేత్ర నీకు
నంజలి ఘటింతు నేఁ బంకజాంఘ్రి నీకు. 350

సీ. ఈవు ప్రపంచము సృజియింపఁగా రజో
గుణము ధరింతువు కూల్చఁబోంటెఁ
దామసగుణమును దాల్తువు పెంప స
త్త్వగుణంబు చేకొందు పరమపురుష
పంచభూతములును బంచతన్మాత్రలు
దేవతల్ మనము నింద్రియము లెల్లఁ
గర్తయు భోక్తయుఁ గలచరాచరజంతు
వుల్ఘ నీవె నీయందె కలదు జగము

తే. నీవు గాకొక్కఁటియు లేదు నిఖిలనాథ!
నన్నుఁ గరుణింపు మోదేవ నిన్నుఁ గొలువ
వచ్చె నరకాత్మజుఁడు వీని వత్సలతను
గాచి రక్షింపు మోదేవ కరుణఁ జేసి. 351

— ♦ శ్రీకృష్ణుఁడు పదియాఱువేలకన్నియలం బెండ్లియాడుట ♦ —

వ. ఇట్లు ప్రార్థించినం బ్రసన్నుండై భగవంతుం డభయం బనుగ్రహించి సకలసంపత్సమేతం బగు భౌమగృహంబునం బ్రవేశించి యచ్చట నరకానీత లై నరాజకన్యల నేకశతోత్తరషోడశసహస్రసంఖ్యాక లగు వారిం జూచె వారును వానిం జూచి మోహితాత్మలై దైవోప పాదితపతిగం దలంచి వరించిన వారి నెల్ల నల్లనం గొని పల్లకీల నెక్కించి ద్వారకాపురంబునకుం దెచ్చె మఱియును. 352

సీ. అట ననర్ఘంబులు నాభరణంబులు
నున్నతాశ్వగజాదియూథములును
భారవతాతిశుభ్రములు చతుర్దంత
ములును నైరావతకులభవములు
నైనమదేభము లర్వాదినాలుగు
ద్వారకకుం బుచ్చె భటులతోడ
భార్యతో నింద్రునిభవనంబునకుఁ బోయి
యమరరాట్సత్కృతుండై తలిర్చి

తే. అదితికిం గుండలంబుల హార్దమున నొ
సంగి సతిప్రేరణమ్మున స్వర్గమందుఁ
నమరుల జయించి పారిజాతము గ్రహించి
తార్క్ష్యుపైఁ బెట్టుకొని వచ్చె ద్వారకకును. 853

వ. అట్లు తెచ్చినపారిజాతవృక్షరాజము సత్యభామాగృహోద్యానంబున
నలంకారంబుగఁ బ్రతిష్ఠించె నంత. 854

సీ. ప్రాగ్జ్యోతిషమునుండి పదియాఱువేలనూ
ర్గురఁ గన్యలం దెచ్చుకొని మురారి
వారి కందఱకుం దగువసతులు గల్పించి
వేర్వేర వారలఁ బెండ్లియాడి
దుర్ఘటకార్యముల్ దొడరి చేయఁగఁ జాలు
హరి ప్రతితరుణీగృహమ్మునందు
నెడతెగక వసించి యెల్లర కానంద
మొదవించుచుం దాను ముదముపడుచు

తే. ఇతరు లట్టులు గాక తా నెపుడు గేస్తు
ధర్మముల మగ్నుఁడై జగత్కర్మములను
దవిలి యుండె నత్తరుణు లాధవుని విడక
యెల్లపరిచర్యలుం జేసి రెల్లనాఁడు. 855

మ. ఒకనాఁ డాహరి రుక్మిణీరమణితో నుత్సాహవర్ధిష్ణుపై
సకలాలంకృతిభాసమాన మగుచున్ సౌ రంధ్రపల్యంకమం
దకలంకాగురుధూపధూమములతో హర్మ్యాంమునంతర్గృహాం
తికమందున్ విహరించుచుండె సుఖసందేశంబులం దేల్చుచున్. 356

క. ఆళీహ స్తగతం బగు
వాలవ్యజనంబు భీష్మవరపుత్త్రిక దా
లీలఁ గొని విసరుచున్ గో
పాలుని సేవించుచుండెఁ బరిజన మెన్నన్. 357

సీ. హంసకూజితముల ననుసరింపఁగఁ జాలు
మణినూపురధ్వనుల్ మలయుచుండఁ
బాదాంగుళులయందుఁ బటుహధ్వనులొ నాఁగ
గడుసుమట్టియలచప్పుడు లెసంగ
వలుదనితంబబింబమునందు జాళువా
మొలనూలికింకిణుల్ మొఱయుచుండ
రవలయొడ్డాణంబు రవణి సూపుచుఁ గడు
నసదైననడుమున మిసిమి నెసఁగ

తే. గల్లుగలుమంచుఁ గరములఁ గంకణములు
లయసమన్వితతాళముల్ ప్రస్తరింప
నొరగి యొయ్యారముగ నిల్చి గరిమ మీఱఁ
జామరము వైచె రుక్మిణి శౌరి కపుడు. 358

వ. అట్లు వింజామరన్ వైచుసుందరాంగిం గాంచి మందస్మితసుందరవదనార
విందుండై గోవిందుం డిట్లనియె. 359

— ♦ శ్రీకృష్ణుఁడు రుక్మిణితో విరసోక్తు లాడుట ♦ —

మత్త. రాజపుత్త్రిక నీవు కోమలి రాజరాజులు లోనివా
రోజమై నినుఁ బొంద నర్హత నొందియుందురు సూవె నీ
తేజు రూపము సౌకుమార్యము దివ్యవైభవ ము ప్పిలం
దేజరిల్లెడునట్టు లెందఱొ నిన్నుఁ గోరుచు నుండ్రే. 360

ఉ. కోరెదు చైద్యముఖ్యులను గోమలమూర్తుల దివ్యకీర్తులన్
భూరిపరాక్రమక్రములఁ బూరుషసింహుల సింహసారులన్
ధీరుల భ్రాతృవత్సలుల నీవు వెడంగవు వీడి తక్కటా
యేరహిఁ బోలనట్టిమము నేల వరించితివో తలోదరీ. 361

తే. శత్రురాజులకున్ జంకి సంద్రమందుఁ
గోట్టికం గట్టుకొని యుంటి మెట్టియెడలఁ
గలదు బలవద్విరోధము దొలఁగె మాకు
రాజసింహాసనంబు నో రాజవదన. 362

సీ. శాస్త్రమర్యాదలచక్కనిం బోవక
లోకపథంబునఁ గాక వీఁక
స్త్రీకి స్వాతంత్ర్యము చేకూరనీయని
పురుషులలెక్కలోఁ బోవువార
మిటువంటిమ మాశ్రయించినయేకల
కంతులు సౌఖ్యముం గాంచఁ బోరు
లేనివారము మేము లేనివారలపట్లఁ
బ్రేముడిఁ జూపుదు మేము మమ్ము
తే. నాశ్రయింపకు వేరు నోయతివమిన్న
వయసు నాకారమును గులైశ్వర్యములును
బ్రతిభయు సమత్వముం బొందువారి కైన
దంపతిత్వము పోలు నోజలజనయన. 363

శా. దూరాలోచన లేనిదాన వగుటన్ దోఁపాడుచిత్తంబునన్
సారంబుం దిగద్రావి భిక్షుకజనశ్లాఘాస్పదోత్పత్తికై
యూరుం బేరు గుణంబు లేనిమము నీ వూహింప లే కెంచుకొం
టో రామామణి యిప్పుడైన మఱి నీ వొండొక్కనిం జూడుమా.

తే. నన్ను ద్వేషించి మీయన్న యున్నవాఁ డ
తనికి సాళ్వ జరాసంధ దంతవక్త్ర

చైద్య ముఖ్యులు ముఖ్య రాజులు నన్ను
మన్నిగొన నెంచి యుండి రో మగువమిన్న. 365

ఉ. వీర్యమదాంధు లాఖలులు విశ్వవిరోధులు గర్వమూర్తు లే
శౌర్యము చూపి వారి కసుసర్వము గర్వ మడంచి మించుత
త్క్రౌర్యము మూలముట్టుగ దిగంబడఁ జేసి ప్రతాప మేర్పడన్
ధైర్యము చేసి తెచ్చితిని దామరసానన నిన్నుఁ గ్రన్ననన్. 366

తే. ఏ ముదాసీనులము గేహకృత్యములను
దివ్వెవలె సాక్షిభూతుల మెవ్వలనను
గాముకులము గా మీషణగణమునందు
నాత్మలబ్ధి మెలంగుదు మతివమిన్న. 367

వ. అని యెల్లవారిలో నే నుత్తమవల్లభ ననుకొనురుక్మిణి గరువం బవనయింపం బలికినపలుకులు విని గడగడవడంకుచు మాటలేక గాలిం గూలినయనంటి వోలె నేలం గూలి యొడ లెఱుంగక కంట నీరు గార్చుచుండె నపు డామెం జూచి కరుణారసతరంగితాంతరంగుం డగు కృష్ణుండు పల్యంకంబునుండి డిగి చేతులం బట్టి లేవనెత్తి యశ్రుసమ్మార్జనంబు చేయుచు నక్కునంజేర్చుకొని సేద దేర్చుచు నిట్లనియె.

చ. అలుగకు మో నెలంత నిను నాత్మ నెఱుంగుదు నే నెఱింగి నీ
పలుకుల నాలకించుటకె పల్కితి నిట్టులు నవ్వులాట గాఁ
దెలియుము నీవు నానుడులతియ్యదనం బిల నాల్మగండు ని
ప్పొలుపున నాడుకొంట లవి పోలును గాదె ప్రియానుబంధముల్.

తే. అనుచుఁ గృష్ణుఁడు వైదర్భి ననునయించి
పలుకుటయు నామె పరిహాసవచనము లని
తెలిసి పతి విడనాడు నన్ తలఁకు విడిచి
సిగ్గు గలిగినచిఱునగ వగ్గలింప
ధవునిఁ గడకంటిమాపులఁ దనిపి పలికె. 370

మ. అరవిందాక్ష త్రిలోకవల్లభుఁడ వింద్రాదుల్ నినుం బోల్ప లే
రురుతేజోవిభవాంచితుండ వీశ నేనో జ్ఞానలేశంబు నే

ద్రోహియుం జాలనిదాన నె ట్లెఱిఁగి యుందు నిన్ను సర్వేశ నీ
చరణాబ్జంబులు నమ్మి యున్నననుఁ గాంక్షంజేసి రక్షింపవే. 371
మ. నిను బ్రహ్మాదు లెఱుంగఁ జాల రనుటల్ నిక్కంబు లోకేశ నీ
గనుఁగోఁ గోరియ కాదె శంకరుఁడు బల్ కాకం దపంబుండు నం
చు నుడుల్ సెల్లెడు నిట్టినీకు భయ మంచుం జెప్పువాఁ డుండఁ బో
వు నె చైద్యాదులు లెక్కయే జగములం బుట్టించునీ కోప్రభూ. 372
క. జగదాధారుఁ డనంతుం
డగునిన్నుం బొంది సౌఖ్య మందెడుసతి దు
ష్టగుణొక్కని మర్త్యునిఁ బొం
దగ నెట్టులు మనము సేయఁ దలఁచును జెప్పుమా. 373
ఉ. నీదుకథామృతంబు గొన నెమ్మది సేయనికొమ్మ లిమ్మహిన్
గాదన కెప్డు కుక్కలటు గాడిద లట్లును బిల్లు లట్లు లే
దేదియొ చేయు భృత్యు లయి యుండ్ల మెలంగఁగ నుండుభర్తలన్
మోదముతో గ్రహింపఁ దలపోయుచునుందురు గాదె మాధవా. 374
తరువోజ. వనజాక్ష నీపదాబ్జమరంద మొంద
వల దని విడనెంచువనిత పై చర్మ
మును వెండ్రుకలు మీసములు గోళ్ళు గడ్డ
ములును లోపల మాంసమును రుధిరంబు
ఘనపిత్తవాతముల్ కఫ మమేధ్యమును
ఘనక్రిమిసంఘంబు కడుకల్మషమును
గొనఁ గల్గియుండినకుశరీరపురుషుఁ
గోరి నట్టిద యనఁ గూడెడుఁ గాదె. 375
తే. అధిప! నాపయి ననురాగ మనతిరిక్త
మగుచు నాత్మానురాగ మత్యధిక మైన
నీదుపాదానురాగము నాదుమదికి
నంటు నటుచేయు మది పరమానుకంప. 376

ఉ. అంబుజనాభ ! నీ వనినయట్టుల యా నది కా దనంగఁ బో
నంబకు సాల్వునందు రతి యయ్యె నెఱుంగుదుఁబెండ్లియాడి లో
కంబునఁ బుంశ్చలుల్ మగనిఁ గా దని కోరెడుఁ గ్రొత్తవారి న
వ్యాంబరవిత్తులన్ మగలు వీడుట పోలెదు నంచుఁ జెప్పినన్ 377

ఆ. అనిన వాసుదేవుఁ డనియె నోసతి నీదు
పలుకు వినఁగ నిట్లు పరిహసించి
నాఁడ నీమనంబునం గలశుభములు
నీకుఁ గల వటంచు నే వచించు. 378

మ. నిను గర్వించిన సంచలించినమదిన్ నీ వొండు భావింప కో
కృనిమేషంబును బోఁభక్తిని నడుల్ గావించి ప్రేమించి తో
వనితారత్నమ నీప్రేమయును నీభావంబునుం భక్తియున్
గనుఁగో నయ్యెను దాన నీదయినయోగం బెన్న సామాన్యమే.

తే. అతివ నీయట్టిప్రియయిని యైనగృహిణి
గృహములం గానిపింప దెక్కడనో గాని
పెండ్లి వేళ రాజుల వీడి విప్రవరుని
నన్నుఁ దేఁ బంపవే నేను ని న్నెఱుఁగ నె. 380

తే. అన్న యగురుక్మిని విరూపు నాచరించి
నప్పుడును మామనం బెట్టిలగునో యనెడు
బీతున సహించితివి గాని వేగపాటొ
కింతయును జూపి మాటాడ వెఱుఁగ నొక్కొ. 381

తే. నిమిష మేఁ గనఁబడకున్న నెలఁతమిన్న
జగము మునిఁగిన లెఱుఁగున దగవు దప్పి
నిలువఁ గన్నీరుగారెడు నెఱి వహించి
పరితపింతు వివర్ణనై యెఱుఁగ నొక్కొ. 382

— ♦ శ్రీకృష్ణుని పుత్రపౌత్రి ప్రపౌత్రవర్ణము ♦ —

వ. ఇ ట్లాత్మారాముం డగు రామానుజుండు సౌరతసల్లాపంబుల నరలోక
ధర్మంబు విడంబించుచు రుక్మిణిం గూడియుండియు నతెండు మఱియు

గృహస్థధర్మనిరతుండై యష్టోత్తరశతోత్తరసహస్రసంఖ్యాకు లగునితరసతులగృహంబులందు నెల్లవేళలం దుండి క్రీడించుచుండ నయ్యైవారి కొక్కొకరికిం బదుగురు గాఁ బుత్రులు పుట్టి రందు శ్రీకృష్ణుని యెనమండ్రుపట్టమహాదేవులలో మొట్టమొదటి దగు రుక్మిణీదేవికిఁ బ్రద్యుమ్నుండు చారుదేష్ణుఁడు సుదేష్ణుఁడు చారుదేవుఁడు సుచారుఁడు చారుగుప్తుఁడు భద్రచారుఁడు చారుభద్రుఁడు విచారుఁడు చారుఁడు ననుపదుగురును సత్యభామకు భానుఁడు సుభానుఁడు స్వర్భానుఁడు ప్రభానుఁడు భానుమంతుఁడు చంద్రభానుఁడు బృహద్భానుఁడు గవిభానుఁడు శ్రీభానుఁడు ప్రతిభానుఁడు ననుపదుగురును జాంబవతికి సాంబుఁడు సుమిత్రుఁడు పురుజిత్తు శతజిత్తు సహస్రజిత్తు విజయుఁడు చిత్రకేతుఁడు కీర్తిమంతుఁడు ద్రవిణుఁడు క్రతువు ననుపదుగురును నాగ్నజితికి భానుఁడు చంద్రుఁడు అశ్వసేనుఁడు చిత్రగుఁడు వేగవంతుఁడు వృషుఁడు ఆముఁడు శంకుఁడు వసువు శ్రుతి యనుపదుగురును గాళిందికి శ్రుతుఁడు కవి వృషుఁడు వీరుఁడు సుబాహువు భద్రుఁడు శాంతి దర్శుఁడు పూర్ణమాసుఁడు సోమకుఁడు ననుపదుగురును మాద్రి యనులక్ష్మణకుఁ బ్రఘోషుఁడు గాత్రవంతుఁడు సింహుఁడు బలుఁడు ప్రబలుఁడు ఊర్ధ్వగుఁడు మహాశక్తి సహుఁడు ఓజస్సు అపరాజితుఁడు ననుపదుగురును మిత్రవిందకు వృకుఁడు అర్కుఁడు అనిలుఁడు గృధుఁడు బహ్వన్నుఁడు అన్నాదుఁడు మహాశయుఁడు పావనుఁడు వహ్ని సుధియు ననుపదుగురును భద్రాదేవికి సంగ్రామజిత్తు బృహత్సేనుఁడు శూరుఁడు ప్రహరణుఁడు అరిజిత్తు యజ్ఞుఁడు సుభద్రుఁడు వాముఁడు ఆయువు సత్యకుఁడు ననుపదుగురును బుట్టి రవల బలరామపత్ని యగురోహిణికి దీప్తిమంతుఁడు తామ్రపతప్తుఁడు లోనగువారు పదుగురు పుట్టి రందుఁ బ్రద్యుమ్నునకు భోజకట మనుపురంబున రుక్మిపుత్రిక యగురుక్మవతియందు ననిరుద్ధుండు పుట్టె నిట్టియు శ్రీకృష్ణపుత్రపౌత్రప్రపౌత్రులకుఁ గోటులకొలందిపుత్రులు పుట్టిరనినఁ బరీక్షన్నరేంద్రుండు శుకయోగీంద్రుంగాంచి.

మ. హరికిం జ్యాలకుఁ డైనరుక్మి యపు డయ్యాలంబునం దెంతయే
బరిభావంబును బొంది కృష్ణు మడియింపం జ్ఛిద్రముల్ రోయువాఁ
డరిపుత్రింం డగుమీనకేతనున కెట్లాత్మోద్భవం గట్టె న
ప్పరమోదంతము సర్వముం వినఁగ నే వాంఛింతు వాకీయవే. 384

వ. అనిన శుకుండు రాజున కిట్లనియె. 385

—• ప్రద్యుమ్ని వివాహఘట్టము •—

సీ. అట్లవమానితుండై రుక్మి తద్వైర
మాత్మ నెంచుచు నుండునట్టిఁ డయ్యుఁ
దనచెల్లెలికిఁ బ్రియంబును బొనరింప నై
తనకూఁతు మేనయల్లునకు నిచ్చె
నదియు స్వయంవర మందు రాజుల గెల్చి
ప్రద్యుమ్నుఁ డారుక్మవతినిఁ దెచ్చె
రుక్మిణీతనయుఁ జారుమతినిఁ గృతవర్మ
కొడుకు విశాలాక్షుఁ డడరి కొనియె

తే. రుక్మి దౌహిత్రిఁ డగునసిరుద్ధునకును
బౌత్రి రోచన యనుదానిఁ బత్నిఁ గాఁగ
నిచ్చె స్నేహానుబంధము హెచ్చగుటను
వైర మింతయు నెంచనివాఁడ యగుచు. 386

తరువోజ. ఆజయోత్సవమున కలరి రుక్మిణియు
హరియును బలరాముఁ డాత్మజు లెల్ల
భోజకటమునకుఁ బోయి వివాహ
మును బొనర్చుచునుండు పొద్దుల నచటి
రాజు లక్షముల విరాజిలుచు బల
రామునితో నాడ రాదే యటంచుఁ
దేజుమై రుక్మికిం దెలుపుఁడు నతఁడు
రా రమ్మనుచు నాడ రామునిఁ బిలిచె. 387

మ. అనభిజ్ఞుం డగురాముఁ డక్షములు లోఁగెన్ హస్తంబునం బూని నూ
ఱును వేయిం బదివేలు గాఁ బణము పేర్కొ నొడ్డి యాడంగ నిం
తన విజ్ఞుం డగురుక్మి గెల్చెఁ గొని సంతన్ దంతముల్ దోఁప న
వ్వెను గాళింగుఁడు పక్కనన్, బలుఁడు చెయ్యుం బాసి సట్టిండఱై.

వ. దాన సహింప నోపక లక్షగద్యాణంబులు రోయిగ నొడ్డి పాచికలం బట్టి ఫలకంబునం గొట్టి పందెంబు గెలిచితి ననియె నంతలో రుక్మి కైతవంబున దాని నట్టిట్టు చేసి నేన గెలిచితి నేన గెలిచితి ననె నంతలోన. 889

శా. దానం గోపము దాప మెచ్చ మదిలో దైత్యారి పర్వంబునన్
గాన న్వచ్చెఁ సంద్రమో యనఁగ హుంకారంబుతోఁ బొంగియున్
గానీ యం చోకన్యగ్యవంబు గ్లహమున్ గావించి ర మ్మాద్యు మం
చానొత్తంబును దాని గెల్చె ఘను లాహా యంచు నగ్గింపఁగన్.

క. ఛల మాశ్రయించి రుక్మియు
గెలిచితి నిది నేన యనుచుఁ గేల్గదలిచి మీ
రలు పలుకుఁ డన్న బయ లీ
బలుఁడే యిది గెలిచె ననుచుఁ బలికెం బెలుచన్. 891

సీ. వైదర్భుఁ డాడెడుపలు కసత్యం బని
పలికిననా కాశవాణి సరకు
గొననివాఁడై వాఁడు క్రూరరాజప్రచో
దితుఁడు మృత్యుప్రబోధితుఁడు నగుచు
బలునిదిక్కు మొగంబు నవ్వుచు మీర రక్ష
కోవిదుల్ గారు వో కొండలందు
గోవులఁ గాచెడుగొల్లలు మీరలు
రాక్షేలనంబులు రావు మీకు

తే. అనుచు నే మేమొ వాఁగుచు నాసభ నటు
పరిహాసించుఁడుఁ గృష్ణుఁడై బలుఁడు వానిఁ

బరిఘమునఁ జేసి తెగటార్చి పఱవఁ జొచ్చు
నక్కళింగ రాజుఁబదవ  యదుగునంద. 392

వ. పట్టి పండ్లూడం గొట్టి తక్కినవారి గండ్రగొడ్డంటఁ దలలు వగి
లించియుఁ జేతులు గాళ్లును దెగ నఱకియుఁ జిందువందుఁ గావించి
రుధిరంబు ధరాస్థలం బంతయు వింతగ నిండె నంత హతశేషులు భీరు
వులై పాఱి రాసమయంబునఁ గృష్ణుండు రుక్మిణీబలభద్రుల స్నేహ
భంగభయంబున రుక్మివధంబుమంచి దని కాని చెడ్డ దని కాని పలుక
కూరకుండె నంత వైవాహికోత్సవంబు నిర్వర్తించుకొని దాశార్హులు
నవోఢాసహితుం డగు ననిరుద్ధు రథంబునం బెట్టుకొని భోజకటంబు
నుండి కుశస్థలంబునకుం జని సుఖంబుండి రని చెప్పిన నైమిశారణ్య
వాసు లవ్వలివృత్తాంతంబు చెప్పుమని సూతు నడుగుటయును 393

ఆశ్వాసాంతము.

ఉ. సాహసవిక్రమార్కునకు సాటి యొనర్పఁగ నొప్పియుఁ మహా
మోహనమూర్తిపుత్త్రుఁ డయి పుట్టినసూర్యుఁడు కోరినంత సం
దేహము లేక యర్థికి నెదే నిడు నొం డరయంగఁ బోవ కు
త్సాహముతో వదాన్యుఁ డలక్షత్రియరత్నము పోల్పుఁ గావుతన్.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమస్కంధమునం దుత్తరభాగంబునఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

—:0:—

శ్రీ రస్తు

# శ్రీ కృష్ణ భాగవతము

## దశమస్కంధము

## ఉత్తరభాగము

## ద్వితీయాశ్వాసము

—:o:—

క. శ్రీమద్రామాశ్వాసనసభఁ
దా మెంబరుపదము నొంది తత్తద్గతులన్
హేమించు సాగి సూర్యం
డీమహి ధనధాన్యవృద్ధి నింపలరారున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు రామకృష్ణులు
ప్రవర్తిల్లుచున్నసమయంబున. 2

—♦ బాణాసురుని వృత్తాంతము ♦—

సీ. బలిచక్రవర్తిపుత్రులు నూర్వు రందులోఁ
బ్రథముఁడు సాహసప్రబాహుఁ డైన
బాణాసురుం డనువాఁ డొక్కనాఁడు మేల్
తాండవమందు వాద్యము పొనర్చి
శివుని సంతోషింపఁ జేసిన నాభగ
వానుఁడు భక్తుని వత్సలతను
గని వరం బొసఁగెద మన మగుడానిని
వరియింపు మనిన నాబాణుఁ డతని
తే. నగరరక్షకుఁగాఁ గోరె నగు నటంచు
హరుఁడు తత్పురరక్షకుం డయ్యె నంత
నొక్కపుడు దుర్మదుఁడు తనయొద్ద నున్న
పశుపతినిఁ గాంచి యి ట్లని పలికె నపుడు. 3

మ. నిను సేవించుట దోస్సహాస్ర మిది మున్ నీ విచ్చితో దేవ! యిం
దున భారం బది గాక యొండొకటి యెందుం గానరాకుండె నిం
తనఁగాఁ దీఁటసతీఁట దీఱుచుకొనన్ నాతోడఁ బోరంగ వో
పినవాఁ డెవ్వఁడు లేడు యోధుఁ డొకనీవే గాక లోకేశ్వరా. 4

క. కండూతి కోపఁ జాలక
తిండియు నిద్రయును నాఁక దిగ్గజములతో
భండనము సేయఁ బోయితిఁ
గొండలఁ బిండిగను జేసి కొనుచు రయమునన్. 5

వ. నాభుజదర్పంబున కోప కాదిగ్గజంబులు గీపెట్టుచుం జెట్టొకండుగం బాఱిపోయె ననినఁ గృద్ధుండై మృత్యుంజయుండు. 6

ద్విపదము. ఏ నాఁడు నీ కేతు విలఁ గూలు విఱిగి
యానాఁడు మత్సముం డైనయోధుండు
గానంగ వచ్చు నీగర్వం బడంచుఁ
గాన నందాఁ కిందుఁ గనుపెట్టుకొనుము. 7

వ. అనిన నాదుష్టుండు హృష్టుం డగుచు గిరిజాదేశంబు నిరీక్షించుచు నిజగృహంబునకుం జనియె నంత. 8

—♦ ఉషాకన్య స్వప్న వృత్తాంతము ♦—

సీ. ఆ బాణునకు నుష యనునొక్క కన్యకా
మణి గల దాయమ మణి యనంగఁ
బొలతులలోఁ బేరు వోసినయది త్రిలో
కైకసుందరి కోమలాంగయష్టి
యాయమ యొక్క నాఁ డనిరుద్ధునిన్ స్వప్న
మునఁ గూడి రతిసౌఖ్యమున మునింగి
స్వప్నాంతమున నాయుషాకన్య వచు నందు
నెందునుం గానక కుంది కుంది

తే. నామనోహర యెందుంటి వోమనోజ
రావె నాతాప మార్పవే రాజపుత్త్రి
నేను నినుఁ బాసి నిముసమే నిలువఁ జాలఁ
జాలు పరిహాస మిఁక వచ్చి యేలు నన్ను. 9

వ. అని సఖురాండ్రమొగంబు చూచుచు నెలనెలం బోవుచు సిగ్గు నభినయించుచు దిగ్గున లేచి నలుగడలం గలయఁ బరికించుచు నపస్మారంబు గలదానివలె నొండెఱుంగ కుండె నాసమయంబున బాణాసురునిమంత్రి యగు కుంభాండకునికూఁతురు చిత్రలేఖ చనుదెంచి యుషాకన్యం జూచి యి ట్లనియె. 10

చ. వెదకుచుఁ బిల్చుచుంటి విటు వేవిని నీ కతఁ డెట్లుగాఁ బ్రియుం
డిది తెలియంగఁ జెప్పు మిట నెవ్వరు వచ్చినజాడ లేదు నీ
మది కగు వెఱ్ఱియో భ్రమయొ మానిని యెయ్యది యేని స్వప్నమో
కొమకక సర్వముం దెలుపు కోమలిఁ డెవ్వఁడు లేదు గావునన్. 11

వ. అనిన నుష యి ట్లనియె. 12

తే. కమలలోచనఁ నేఁ డొక్కకమలలోచ
నుండు సాక్షాత్కరించి నన్నుం గవుంగి
లించుకొని పండుకొనె నాదుమంచమందు
స్వప్న మది యంచుఁ జెప్ప నే సంశయింతు. 13

సీ. పున్నమచందురుం బోలుమొగమువాఁడు
కలువల కెనవచ్చుకనులవాఁడు
నూఁగుమీసలవాఁడు నునుపులై మోకాళ్ల
నందు చేతులవాఁడు నందకాఁడు
మెఱయుచామనచాయ మేనుగలాఁడు ప
చ్చనిపట్టుపుట్టము సవుగువాఁడు
రాచిల్క నెక్కుడిరాతుఁ గా దనుసోయ
గమువాఁడు కలుకులఁ గలఁచువాఁడు

తే. చిలుకవగవు లొల్కు వాఁడు రాచిలుక వోలెఁ
బలుకువాఁడు కోయిలవోలెఁ బాడువాఁడు
నెనరు గలవాఁడు తళుకులు నేర్చినాఁడు
రాకొమరుఁ డంచుఁ దోఁచు నాశ్రీకొమరుఁడు. 14

చ. అతఁ డధరామృతంబు తనివారఁగఁ ద్రావఁగ నిచ్చి ముచ్చటల్
గులుక మెలర్పఁ జేయుచును గొంచెము నేఁ గృపలేక కోపన
న్నతగుఁడు వోలె దుఃఖమునయందుఁ బడల్పడఁ జేసి పోకి యే
గతి నెటు వోయెనో యనుచుఁ గాంతుని రోయుచునుంటిఁ గంటివే.

వ. అనినఁ జిత్రలేఖ యి ట్లనియె. 16

క. కనలేదు గాని నీ నా
తనిఁ జెప్పితి వేని నేను దడయక యెందుం
డిన వెదకి తెచ్చి నీమన
మునయం దగువ్యసన మెల్లఁ బోకార్తుఁ జెలీ. 17

తే. ఉష యనియెఁ దల్లి యిందు లేకున్న నెందు
నుండు నని చెప్పఁగా నేతునో యెఱుంగ
నితఁ డితం డనువిజ్ఞాన మేని నాకుఁ
లేదు నావిధి కేమందు నేది దిక్కు. 18

—◆ చిత్రరేఖ చిత్రంబులం జూపి యనిరుద్ధుం దెచ్చి యిచ్చుట ◆—

వ. అనినం జిత్రరేఖ చిత్తంబు మెత్తనగుటం జేసి జాలిపడి బాలా! నే
నెల్లలోకంబు లెఱుఁగుదు వారివారి నెల్లఁ జిత్రించి నీకుఁ జూపుదు నందు
నీమనోహరుని రూపించి చెప్పితి వేని నేను నాతిరస్కరిణీ ప్రభా
వంబున వానిం బట్టి తెచ్చి యిచ్చెద నని దేవ సిద్ధ సాధ్య విద్యాధర
చారణ పన్నగ దైత్య యక్ష రక్షో గంధర్వ కిన్నర పిశాచ గుహ్య
కాదులను వ్రాసి చూపుచు ద్వీపాంతరంబులవారి న కాక జంబూ
ద్వీపంబునం గలవారిం జూపి వృష్ణివరులలో శూర వసుదేవాదులం
జూపి రామకృష్ణులం జూపె నప్పు డుష కృష్ణుని నింతొక్కపరిఁ జూచి

పెదవి విఱిచెఁ జిత్రలేఖయు నవ్వలఁ బ్రద్యుమ్నునిన్ వ్రాసి చూపినం
జూచి చూచి సిగ్గభినయించుచు నించుకలోఁ గాదని సంజ్ఞగాఁ
దలఁద్రిప్పె నప్పుడు ప్రద్యుమ్నాత్మజు ననిరుద్ధు నిద్ధబుద్ధిం జేసి వ్రాసి
చూపినం జూచి లజ్జానంద భయశోకంబు లభినయించుచు నుషాకన్య.

మ. ఇతఁడే నాదుమనోహరుండు జలజాక్షీ ! వీనిఁ బొందంగ లే
నితఱిం బ్రాణము లీలమై విడువఁగా నే నుంటి నా కేమహో
న్నతియుం బొందెడుకోర్కి లే దనవుడున్ దాక్షిణ్యచిత్తంబునన్
దతవిద్యాంచిత యోగినీతిలక మా తన్వంగి తా నిట్లనున్. 20

తే. ద్వారకావాసి కృష్ణునిపౌత్రుఁ డితఁడు
నీమనోహరుఁ డనిరుద్ధ నామధేయుఁ
డే నెఱుంగుదు నాదుయోగేద్ధశక్తిఁ
దెచ్చి నీ కిచ్చెదం జింత దీఱ మనుము. 21

వ. అని పలికి యోగిని యగుచిత్రలేఖ వియన్మార్గంబున నిశాసమయం
బున ద్వారకాపురంబునకుం జని రాజభవనంబున నొక్కపల్యంకంబున
బండి నిద్రించుననిరుద్ధుం గని వాని నొఱు లెఱుంగకుండఁ బట్టికొని
పోయి శోణపురంబున నుషాకాంతాంతఃపురంబునఁ జేర్చి పేర్చినసంత
సంబున నాతనిఁ జెలికత్తియకుం జూపుటయు నామె వానిం జూచి
పరమానందభరితాంతరంగయై చిత్రరేఖం బహూకరించి యంపిపుచ్చె.

ఉ. నిద్రితుఁ డైనవాని వరునిం దనచేతుల నంటి లేపి యో
భద్రమణీ! త్వరపడక వాకులు విన్నవి సర్వవృత్తముల్
మాద్రికి మీఱుచందము న మాటి కెఱుంగఁగఁ జేసి వాసిమై
ఛిద్రమొకింత లే దనుచుఁ జెప్పి మనోహరు నొప్పఁ జేయుచున్. 23

వ. కలియ వచ్చి గాఢాలింగనంబు చేసికొనియె నతండును గన్యాపహృ
తేంద్రియుండును విస్మృతసర్వవ్యాపారుండునై రాత్రియుం బవలు
నా కాకడఁ గన్నెమిన్న తోడం గలసిమెలసి మెలంగుచుండె నంత.

ఉ. కావలివా రుషారమణి కాంతునిఁ గూడినయట్టిచిహ్నముల్
క్రేవలనుండి కాంచి పరికించియు నిశ్చితచిత్తవృత్తులై

దేవవిరోధి బాణునకుఁ దెల్పకువా రయి యేగి మ్రొక్కుచుం
మావలనం దవంతయుఁ గనంబడ దే యుపచార మక్కటా. 25

చ. ఎడతెగ కెల్లకాలము నొకింతయు నేఁ బెడఁబాయ కేము పే
ర్పడుగతి గ్రిద్దు తీసికొనువారమ మై భవదీయకన్య కే
ర్పడినగృహంబు గాచుకొని వర్తిలుచుందుము లోని కిప్పు డె
వ్వఁడో చను దెంచి యుండె నని వాసన వచ్చెడు నేమి చెప్పఁగన్.

వ. అసన మండిపడి బాణాసురుండు దండతాడితభుజంగంబు భంగి రోఁజుచు దుహితృదుశ్చేష్టితంబునకు శంకించుచుఁ గన్నుల నిప్పులు రాలఁ గన్యాంతఃపురంబునకుం జని యం దొక్కచోట. 27

— బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధుం జేయుట —

సీ. భువనైకసుందరమూర్తి విశ్రుతకీర్తి
కాంతామనోహరాకారు వీరు
నీలనీరదగాత్రు నీరదసమనేత్రు
నాజానుబాహు విరాజితేహుఁ
గుండలమండితగండభాగుం స్మిత
పూర్వభాషణు లబ్ధపూర్ణయోగు
వరపీతకౌశేయవాసు లక్ష్మీకటా
క్షావాసు గుణభూషణాఢ్యవేషుఁ

తే. గుంకుమాంకితభుజమధ్యుఁ గోమలీజ
నాభిసాధ్యు సుమాలికాపూతకంఠ
దేశు యాదవవంశేశు దేవవైరి
కాంచె నిజకన్యకాసుముఖాంచలమున. 28

ఉ. వేయి కరంబులుం గలిగి విస్మయముం బొనరించు బాణునిన్
బాయక చూచి మాధవుఁడు బాహుబలంబును జూప నెంచులో
డాయగ వచ్చి తజ్జను లడంగఁగఁ జేయును మంచు మాగఁకో
నాయదువల్లభుండు పరిఘాయుధముం గొని మోదె నల్లరన్. 29

ఆ. దాన బాణుసైన్య మానంద మఱి నొచ్చి
చచ్చి వాని నోర్వఁ జాల కపుడు
తలలు పగిలి యూరువులు బాహువులు తెగి
వెఱచి పఱచి రంతి పురము విడిచి. 30

మ. తనసైన్యంబును బట్టికొట్టు యదుగోత్రప్రోద్భవుం జూచి యే
చినక్రోధంబునఁ గాలకాలుఁ డనుచుం జెప్పంగనై మండుచున్
జని చిన్నారిని వాని హస్తముల నొంచం బట్టియున్ నాగపా
శనిబద్ధాంగునిఁ జేసె నయ్యుష కడున్ సొల్వడ్డదై యేడ్వఁగన్. 31

వ. అంత నక్కడ ననిరుద్ధుండు మాయమైనట్లు కాన రాకున్న నె
న్నన్నియో తెఱంగుల నతనిబంధువు లగుప్రద్యుమ్నాదు లేమియుం
దోఁపక దుఃఖించుచు వార్షికంబు లగునాలుగుమాసములు గడవ నీది
రాసమయంబున. 32

—♦ నారదోపదేశమునఁ గృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తుట ♦—

ఉ. నారదుఁ డేగుదెంచి యదునందనుఁ గన్గొనిమన్మథాత్మజున్
శూరుఁడు బాణుఁ డాత్మపురి సొంపఱఁ గట్టెను నాగపాశముల్
తీరిచివైచి దాన నట దేవుకులాడుచు నుండె మీసుతుం
జేరహిఁ దెత్తురో తెలిసి యే నిట వచ్చితి మీకుఁ దెల్పఁగన్. 33

సీ. అని చెప్పి నారదుం డరిగినపదపడి
బాణపాలిత మగుశోణితపురి
కేగ నెంచిరి బలకృష్ణపాలితు లయి
సాత్యకి ప్రద్యుమ్న సాంబ గదులు
సారణాదులు యదువీరులు నందోప
నందభద్రాదు లనంతశౌర్య
ధైర్యంబు లేర్పడఁ దరలిరి ద్వాదశా
క్షౌహిణీసేనతో సాయుధు లయి
తే. పోయి శోణితపురి నాల్గుమూల లావ
రించి ముట్టడి పెట్టి భర్జించి రెల్ల

పురము గోపురాట్టాలకభూరిసౌధ
సముదయముతోడ సర్వము సమయు నట్లు. 34

ఉ. బాణుఁడు భజ్యమానపురవైభవ మంతయుఁ జూచి క్రోధసం
త్రాణ లెసంగ సైన్యసముదాయసముజ్జ్వలవిక్రమంబునన్
బాణపరంపరాభిహతిఁ బర్వతముల్ బగులింపఁ జాలుసిం
గాణినిఁ బూని పోరుకోవఁగాఁ జనెఁ గాలయముం డొకో యనన్.

వ. అయ్యవసరంబున. 36

తే. భక్తపరతంత్రుఁ డగుభగవానుఁ డుగ్రుఁ
డాత్మజులతోడఁ బ్రమథగణాళితోడ
నందివృషభంబు నెక్కి యానందనంద
నధ్వజినితోడఁ బోరంగ నడచె ననికి. 37

వ. అప్పుడు వామదేవవాసుదేవులును షూరకుమారులును గుంభాండ కూపకర్ణయుగ్మంబుతోఁ బ్రలంభఘ్నుండును బాణపుత్రు లగువిరోచనుండు సాంబుండును బాణునితో యుయుధానుండును దక్కువారితోడం దక్కువారును డీకొని పరస్పర హేతిసంఘట్టనాదులం బోరినపోరు ఘోరం బయ్యె నయ్యెడ బ్రహ్మాదిదేవతాధీశులును సిద్ధచారణవిద్యాధరగంధర్వాదులును మునిబృందంబు నప్సరోజనసముచ్చయంబును విమానంబులతోడం జనుదెంచి వియత్తలంబున నుండి చూచుచుండి రంత. 38

—• వామదేవవాసుదేవుల యుద్ధము •—

సీ. శౌర్యస్వరూపుఁడై శౌరి శార్ఙ్గచ్యుత
తీక్ష్ణాగ్రశరములఁ దీట వోవ
నుగ్రానుచరు లయి యుండుగుహ్యకులతో
భూతబేతాళాదిభూతతతులఁ
గూశ్మాండముఖ్యులఁ గూల నేసె మహాస్త్ర
శస్త్రసంచయములు సాఁగఁ జేసి

శర్వుండును బృథగ్విధోర్వస్త్రముల నేసి
కృష్ణసైన్యంబును గెరల సలిపె
తే. దాన విస్మయ మొందక దానవారి
వార కపుడు ప్రత్యస్త్రముల్ నైచి హరుని
బలసముచ్చయ మెల్లను బడలుపడగఁ
జేసి నొక్కింతలోపలఁ జేవ మెఱసి. 39

సీ. హరుఁడు బ్రహ్మాస్త్రము నడరింపఁ గృష్ణుండు
బ్రహ్మాస్త్రమున దాని ప్రతిభ యుడిపె
నీశుండు వాయవ్య మేసినఁ గంసారి
పార్వతంబున దానిఁబట్టి చెఱచె
శూలి యాగ్నేయముఁ గీలింప మురవైరి
పార్జన్యమున దానిబల మడంచె
మృడుఁడు పాశుపతంబు మెఱయింప హరి దాని
నారాయణాస్త్రమునం దెఱల్చె
తే. జృంభణాస్త్రము సంధించి శ్రీధరుండు
జృంభితుం డగుహరునిసంరంభ మెసఁగ
నేసి మోహితుగాఁ జేసి యెల్ల బాణ
సైన్యమును మోదె వివిధాస్త్రశస్త్రములను. 40

ఉ. మారకుమారు లిద్దఱును మార్కొని పోరుచునున్నయప్పు డా
మారునిశక్తిఁ గైకొని కుమారుఁడు నొంచిన మించి యాతఁడున్
సారశిలీముఖంబులను సాళ్వడఁ జేసెను సర్వసంధులన్
గాఱ నసృక్స్రుతుల్ పఱచె స్కందుఁడు కయ్యము వీడి కేకితోన్. 41

తే. బలునిచే మొత్తఁ బడుచుఁ గుంభాండకుండుఁ
గూపకర్ణుఁడు నేలపైఁ గూలి రపుడు
బాణబల మెల్ల నలుగడం బఱవఁ జొచ్చెఁ
బ్రాణభయమునఁ జేసి యుప్పట్టునందు. 42

చ. తనబల మట్లు వీఁగి నలుతట్టులకున్ వెఱఁ బాఱుచున్నచోఁ
గని బలినందనుండు కినుకం గొని సాత్యకిఁగోడిసంఖ్యమున్
గొనకొన సేయుచున్ విడిచి కొంతటిలో మురవైరిమీఁదికిన్
జని యొకమాత్రఁ బంచశతచాపములం గొని నారి లాఁగుచున్. 43

క. ధనువునకు రెండు రెండుగ
ఘనతర కాండములు తొడిగి కార్ముకవిద్యా
ధనవంతుఁ డైనమాధవు
తనువునఁ బడ నేసె నీసు దళుకొత్తంగన్. 44

చ. అరవది నూర్ల కార్ముకము లంత నొకింతన రెండు రెండు గా
విరిగి పడంగ నేసి హరి విక్రమ మేర్పడ వానిసారథిన్
దురగములన్ రథంబు ధరఁ ద్రుళ్ళి పడం బొనరించి శంఖమున్
గర మ్రోవంగ నొత్తె ధర కంధులతోఁ గులశైలకోటితోన్. 45

వ. ప్రళయకాలకఠోరనిర్ఘాతపాతంబు పోలె నాభీలం బైనశౌరిశంఖనిర్ఘోషంబునం జేసి బెండువడి బాణుం డొం డెఱుంగకుండె నాసమయంబున.

ఉ. బాణునితల్లి కోటర శుభంబ ఱఱి డింబఱి బెగ్గడిల్లి త
త్ప్రాణపరిరక్షఁ జేసి వడి వచ్చ్యఘురాంతకుఁ డున్నచోటికిన్
శోణశిరోరుహంబు లవి చుట్టలు గా విడి వ్రేల నగ్నయై
జాణెత పోలెఁ జూడనయి సంగరరంగమునందు ముందుగన్. 47

తే. నగ్నఁ గనుఁగొన రామి నుద్విగ్నుఁ డగుచుఁ
బెడ మొగము పెట్టి కృష్ణుఁడు వెనుక లరయు
చున్నపుడు సందు గనిపట్టి చూర్ణరథుఁడు
బాణుఁ డొకవ్రేల్మిడిం బాఱె శోణపురికి. 48

— శైవజ్వరము వైష్ణవంబున కోడి కృష్ణునిఁ బ్రస్తుతించుట —

తరువోజ. భగవంతుఁడు శివుండు బాణబలంబు
భయమునం బాఱుడుఁ బరికించి భయద
మగుదాని శైవజ్వరాధిదేవతను
హరు వొప్పు ద్రిశిరస్క యగునట్లు చేసి

తగఁ బుచ్చెఁ గృష్ణునిఁ దాఁకంగ నదియు
దైత్యారిచెంతఁ బ్రత్యక్షంబు చేయ
మొగి దానిఁ గనుఁగొని మురవైరి వేగ
మున వైష్ణవజ్వరమును జేసి పుచ్చె. 49

క. మాహేశ్వరంబు వైష్ణవ
మాహో యన దాఁకి పోర నారంభించెన్
మాహేశ్వరంబు వైష్ణవ
సాహసమున కోడి వగవ సాఁగె భయమునన్. 50

చ. తన కభయం బొసంగఁ గలధన్యుఁ డెవం డని రోసి రోసి యెం
దును గనరామికి న్నిగులఁ ద్రొటిల్లుచున్ మురవైరి యొక్కఁడే
యని విని గాలిమాట సరయంబుగ నంబురుహాక్షుపాలికిన్
జని కయిదోయి మోడ్చి స్తుతి సల్పె నయంబు భయంబు పేర్పడన్.

గీతావృత్తము. నిరంజనున్ సిరీశున్ మహానితాంతహృదయస్థితున్
బరాత్పరున్ బరంజ్యోతిన్ బరబ్రహ్మస్వరూపునిన్
చరాచరజగన్నాథున్ సర్వజ్ఞున్ సర్వదర్శనున్
బరేశుం బావనున్ శాంతుం బ్రస్తుతింతు రమాపతిన్. 52

గీర్వాణవృత్తము. నానారూపంబుల్ దగం దాల్చి నీ వా
నాకద్వేషివ్రాతమున్ గండడంపం
గా నై లోకఖ్యాతధర్మంబు లెల్లన్
గావంగా నై కాన వత్తో మహాత్మా. 53

ద్విపదము. నే నీజ్వరంబున నిలువంగ లేక
మానటి పోతి నోమానాథ నన్ను
నీనిభృతకటాక్ష నిత్యేక్షణముల
నా నెగుల్ దీర్పవే నాఁ బ్రమొక్కు లంది. 54

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 55

తే. ఓశివజ్వరమా వెఱి పుడుగు మీవు
నాభయము నీకుఁ గాదు నీ నాదువాద

మును వినినవాఁడు జ్వరబాధఁ బొందఁ డెప్పు
డని వర మనుగ్రహించె నయ్యవసరమున. 56

వ. అట్లువరం బొసంగిన శివజ్వరంబు శ్రీకృష్ణునకు మ్రొక్కి పోయె నంత బాణుండును వెండియు నొక్కసాంగ్రామికరథంబు సన్నద్ధంబు చేసికొని దానిపై నధిష్ఠించి పరివారపరివృతుండై పరాత్పరునితోడ యుద్ధంబునకు సిద్ధంబై తనసహస్రబాహువుల సహస్రాయుధంబులు ధరించి విరించనజనకుపై విసరుటయు ను వేసటం జెంది శ్రీకృష్ణుండు.

ఉ. సారెకు వేయి వేయిగను సారతరాస్త్రము లేసి యీసునం
బో రొనరించి నొంచుబలిపుత్రుని చేతులు నూర్పడుల్ ధరి
త్రీరుహశాఖలుం బలెను గ్రిందఁ బడం దెగ నేసె దాన దే
వారివరుండు మ్రోడువలె నంతటిలోఁ గన నయ్యె నయ్యనిన్. 58

వ. అట్లు బాణుండు భగ్నబాహుండై పరితపించుచుండ భక్తవత్సలుం డగుభవుండు యదువంశసంభవుం డగుకృష్ణుం గాంచి యిట్లనియె.

—• బాణుని రక్షింపు మని శివుఁడు హరిం బ్రార్థించుట •—

సీ. నీవ పరంజ్యోతి వీవ పరబ్రహ్మ
వీవ ప్రజాపతి వీవ హరివి
నీనాభి నభము నీయానన మగ్ని నీ
శుక్ల మంబువు నీదుశ్రుతులు దెసలు
నీశీర్ష మే నింగి నీయంఘ్రియే యుర్వి
నీమది చంద్రుండు నీదుదృక్కు
తరణి నీదగునాత్మ హరుఁడ నే నీజఠ
రము సముద్రంబు నీభుజము బలారి

తే. నీదురోమము లోషధుల్ నీదుకురులు
వారిదమ్ములు నీబుద్ధి బ్రహ్మ నీవి
సర్గము ప్రజాపతియ నీదుస్వాంత మమల
ధర్మ మీవు పురుషుఁడ వోదైత్యదమన. 60

తే. దేవ నీయవతారము తెలియ ధర్మ
రక్షణముపొంటె మేము నీప్రభుత నుండి
భువనముల నేలుచుందు మోభూరితేజ
యీ వొకండవె కారణ మెల్లరకును. 61

తే. నీదుమాయ మోహితు లయి నిఖిలజనులు
పుత్రదారగృహాదులఁ బొంది కలుష
జలనిధులయందు సతతము మునిఁగి తేలు
చుం డ్రెఱుంగక నిన్ను సర్వోన్నతుండ. 62

క. నేను విధాతయు నిందుఁడు
మానసముల నిన్నెఱింగి మహితాత్ములమై
నీనుడుల నిలిచి మెలఁగుదు
మోనిఖిలాధార నాదు మ్రొక్కిదె కొనుమా. 63

క. నాకుఁ దయితుఁడు బాణుఁడు
వాకొంటిని వీని కే నభయదానంబున్
నీకరుణ వీనిపై నిడు
మాకనకకశిపుతనూజునం దిడినగతిన్. 64

—• శ్రీకృష్ణుఁడు బాణు ననుగ్రహించుట •—

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై కృష్ణభగవానుం డి ట్లనియె. 65

శా. దేవా! నీ వనినట్టులేఁ దలఁచితిన్ దేవారివంశంబునం
దై వీఁ డుండినఁ గాని నేను మును ప్రహ్లాదుం గటాక్షించితిన్
నావాక్యం బగుఁ దత్కులంబు మనుపన్ రక్షించితిన్ బాహువుల్
పోవం జేసితి వీనిదర్ప ముడుగన్ భూభారముం బాపఁగన్. 66

క. నాలుగుచేతులు మాత్రము
చాలెడు నని నిలిపినాఁడ శంకర! యని మా
పాలుఁడు బాణునిఁ గని యిఁక
వేలుపులభయంబు నీకు వెలయదు వింటే. 67

వ. ఇంక నీవు జరామరణవర్జితుండవై పార్షదముఖ్యుండవై యుండఁ గల వని యభయం బొసంగిన బాణుండు పాణిరక్షకుం డగుకృష్ణునకు నమస్కరించి యనిరుద్ధు నుషాకన్యకతో నానావిధాలంకారాలంకృతుం జేసి రత్నాంబరాభరణాదులు దాసదాసీజనంబులు లోనగు నన్నేని కానుకలు వెట్టి తెచ్చి కృష్ణున కిచ్చి రథం బెక్కించి యంపినచోఁ గృష్ణుండును రుద్రానుమోదితుండై పుత్రపౌత్రాదిపరివారపరివృతుండై బహువిధాలంకారాలంకృతం బగునిజరాజధాని యగుద్వారకాపురంబునకుం జనియె ననంతరంబ. 68

— శ్రీకృష్ణుఁ నూతం బడినతొండ నుద్ధరించుట —

సీ. ఒకనాఁడు గదుఁడు ప్రద్యుమ్నుఁడు మఱి చారు
ధ న్వాదు లగుయదుబాలు రెల్ల
వనవిహారము సేయఁ జని యటఁ గ్రీడించి
క్రీడించి దప్పిచే నోడి వాడి
నీటియిక్కల నందు నెమకుచు నొక్కచో
నిర్జలం బగునూతిని గనుగొని
యదిరి నాఁ గృకలాస మం దుంట కచ్చెరు
పడి దానిఁ బైకెత్త నెడ యొసర్చి
తే. పాశముల దానిని గట్టి పట్టి యెత్త
వా రగుచు నోప కంతయు శౌరి కెఱుఁగఁ
జేయ నాతఁ డచ్చోటికిఁ జేర నరిగి
యెడమచేతను లేవంగ నెత్తె దాని. 69

మ. హరి హస్తంబునఁ దాఁకుమాత్రమున నయ్యాకారము న్వీడి యె
ల్లరు నాశ్చర్యము నొంద సుందరతనూల్లాసంబుచే నెల్లరకా
హరుసం బందగఁ జేయుచుం నిలువ దాశార్హుండు వీక్షించి యో
పురుషాగ్రేసర! నీ వెవండవొ జగత్పూజ్యుండ వం చెంచెదన్. 70

ఉ. ఊసరవెల్లి రూపమున నుం టిది యేటికి నీకు వచ్చెనో
యేనుజనాన్వవాయమున నీవు జనించితొ యేరి కెట్టు లే

దోసము చేసితో తెలుపుదో విన నర్హము యైన నావుడున్
భాసురమూర్తి యి ట్లనియెఁ బ్రస్తుతి చేయుచు మ్రొక్కి కృష్ణునిన్.

—♦ నృగమహారాజుచరిత్రము ♦—

శా. ఏ నిక్ష్వాకుతనూజుఁడన్ నృగుఁడ నెన్నే దానముల్ చేసి ము
న్నే నున్నాఁడ నెఱుంగు దీ వయినఁ గానీ యిట్టిచోఁ జెప్పఁగా
నానం జేసితి కానఁ జెప్పెదను నావ్యాహారమందున్ స్తుతుల్
గాన న్వచ్చిన సైఁపు మంచు మును మున్ గాంక్షించి ప్రార్థించెదన్.

సీ. ఇసుకరేణువు లెన్ని యిలఁ గలవో నింగి
నెన్నంగ తారక లెన్ని గలవొ
యన్నిగోదానము లాచరించితి విప్ర
ముఖ్యులకున్ మున్ను పురుషవర్య
మఱియుఁ బయస్వినుల్ మహితరూపము లైన
కపిలల హేమ శృంగములవాని
బహుళదక్షిణలతోఁ బ్రత్యహం బిచ్చితిఁ
గోటానఁగోటులకొలఁది గాను

తే. మఱియు నేన్గులు గుఱ్ఱముల్ మహిషములును
నగ్రహారములు సువర్ణ మాసనములు
కన్యలును గృహంబులు రత్నకంబళములు
రత్నములు వెండి యిచ్చితి బ్రాహ్మణులకు. 73

తే. సప్తసంతానములు పెక్కుసారు లేను
సలిపితిని బూర్తము ల వెన్నొ వెలయఁ జేసి
నాఁడఁ గ్రతువు లసంఖ్యముల్ నాఁడు నాఁట
నాచరించితి నూర్జుగా నంబుజాక్ష. 74

ఉ. మున్నొకనాఁడు నేను ద్విజముఖ్యున కొక్కని కిచ్చినట్టిగో
వెన్నఁడొ తప్పి వచ్చి ద్విజునింటికిఁ బోక మదీయగోచయం
బున్నెడఁ జేరె దాని మఱి యొక్కని కిచ్చితి నే నెఱుంగమిన్
గొన్నద్వితీయుఁ డావుఁ గొని కోరిక మై చనుచుండె నింటికిన్. 75

తే. అరయుచున్ వచ్చి మునుఁ గొన్నయతఁడు తనదు
నావు నడియాలములఁ జేసి యరసి యిద్ది
నాది నృగుఁ డిచ్చె నాకు నీయావు నీవు
గొలుకొనిపోవుచుంటి వి దేలొ ముచ్చ. 76

ఉ. క్రొత్తగఁ గొన్నవిప్రుఁ డనుఁ గోపము చేసెద వేల యోయి వి
ప్రోత్తమ! నన్ను ముచ్చనుచు నుల్లము నేయకు మానృగుప్రభుం
డిత్తఱి నాకు నీమొదవు నిచ్చెను నాయది కాని నీది కా
దుత్తవివాద మేమిటి కయో ద్విజపుంగవ పొమ్ము తిన్నగన్. 77

తే. వివదమానులు వా రిర్వు రనల నాదు
సన్నిధికి వచ్చి తమవాదు విన్నవించి
నీవ నా కిచ్చి తీగోవు నీవ నాకు
నిచ్చి తని వల్కుచున్నంత నేను బెదరి. 78

ఉ. ఆకులపాటు రా మదికి నారట మందుచు నేను వారలన్
జేకొని చెప్పితిన్ గనక చేసితి నిట్టులు దత్తగో వటం
చాఁకఁ గొనంగ లేక వసుధామరులార మదీయదోషమున్
వాకొనఁ బోక మీరు కరుణామతితోఁ గనఁ గోరుచుండితిన్. 79

తే. చిడిపికుఱ్ఱికి దీనికిఁ జెల్లు నట్లు
కామధేనువులం బోలుఘనతరోస్ర
లను సహస్రసహస్రముల్ గొనఁగ నిత్తు
నను ననుగ్రహదృష్టిమైఁ గనుఁడు మీరు. 80

క. ఎఱుఁగని సేవకుఁ డగునను
గరుణించి యనుగ్రహింపఁగాఁ బ్రార్థింతున్
గరుణామయు లారా యని
చరణములన్ వ్రాల వారు సరభస మెసఁగన్. 81

తే. కోటిగోవుల నిచ్చిన నేటి కవ్వి
వలదు నా కిడ్డగోవు నే విడువ ననుచు

మొదటివిప్రుఁడు వెడలెనాపిదప నాద్వి
తీయుఁడును గోవు విడి చనెఁ దెగువఁ జేసి. 82

సీ. ఆలోన యమభటు లరుదెంచి జమునాజ్ఞ
యెఱిఁగించి ననుఁ గొని యేగి రటకు
యముఁడు నన్ గని దాత వగునీకు నీతప్పొ
కింత దాపర మయ్యె నింతలోన
దాని ననుభవించి తరువాతఁ బుణ్యము
ననుభవింతువొ చెప్పు మనుఁడు నేను
స్వల్పదోషఫలంబు ననుభవించెద మును
ము న్నంటి నంతలోపున జముండు
తే. పత పత యటంచుఁ బలికినపలుకులోనఁ
దొండనై భూమిఁ బడితి నాతొంటితెలివి
నన్ను విడకుండె నప్పటినాఁటనుంటి
భవదనుగ్రహకాంక్షినై బడలుపడుచు. 83

ఉ. నన్ను ననుగ్రహింపుము జనార్దన! నీపద మంటి కొల్తు నా
బన్నముఁ బాయఁ జేయుము కృపామతివై నిను నెల్లకాలముల్
గన్నులఁ గట్టికొంచు మునికల్పుఁడనై భజియించుచుంటి నో
పన్నగతల్ప భక్తుఁడను బంపుము నన్నుఁ బరంబు చేరఁగన్. 84

వ. అని ప్రార్థించి పార్థసారథికిఁ బ్రదక్షిణనమస్కారంబు లర్పించి పదంబులు కరంబుల నంటి కన్నుల కద్దు కొనుచు నెల్లరుఁ జూచుచుండ విమానం బెక్కి స్వర్గంబునకు నిర్గమించెఁ గృష్ణుండును బరిజనులం గని యి ట్లనియె. 85

సీ. బ్రహ్మస్వ మింత లోఁ బడిన జీర్ణము గాదు
జఠరాగ్ని హెచ్చున్నజనుల కైన
నేను హాలాహల మెంచ విషంబుగాఁ
బృథివి దానికిఁ బ్రతిక్రియలు గలవు

బ్రహ్మస్వము విషంబు పరికింపఁ దత్ప్రతి
క్రియ యేది లేద యేపృథివియందు
విసము చంపినఁ జంపు మెసవినవాని బ్ర
హ్మస్వాగ్ని గాల్చుఁ దదన్వయముల

తే. మఱియు దశపూర్వులును దశాపరులు నైన
గోత్రజుల నెల్ల బ్రహ్మస్వఘోరవహ్ని
గాల్చివేయును నిరయముల్ గలుగఁ జేసి
యనుచుఁ దెలియంగ వలయు నో మనుజులార. 86

తే. విప్రవరులకుటుంబము విత్తము మొద
లగునవి హరించునట్టివా రర్బుదములు
న్యర్బుదంబులు వర్షముల్ నరకమందుఁ
గుంభిపాకమునం బడి కుందుచుంద్రు. 87

తే. అన్యదత్తమును స్వదత్త మైనబ్రహ్మ
విత్త మేఁడు హరించు నాపృథివిజనుఁడు
షష్టివర్షసహస్రముల్ సతము విష్ఠ
యందుఁ గ్రిమి యయి పుట్టెడు నని యెఱుగుఁడు. 88

ఉ. భూమిసురుండు తిట్టినను మూర్ఖతఁ జూపినఁ గొట్టె నేనియుం
గామకు లైనవా రతని మార్కొని పోర్కొనరా దొకప్పుడున్
స్వామి యటంచుఁ జే మొగిచి సాఁగిలి మ్రొక్కఁగ నొప్పు నట్లుగా
కేమనుజుండు భిన్నుఁ డగు నే నతనిం బొనరింతు దండ్యుగన్. 89

వ. అట్లు భగవంతుండు తనవారికిం గాక ద్వారకాపురంబునం గలవారి
కెల్ల నెఱుంగం జెప్పి నిజనివాసంబునకుం జనియె నంత. 90

—♦ బలభద్రుండు వ్రేపల్లెకుం జనుట ♦—

మ. బలభద్రుం డొకనాఁడు మిత్రజనులుం బంధువ్రజంబుం గనం
గలఁడై స్యందన మెక్కి నందపురి కుత్కంఠం జనెం గాంచి గో
పులు వానిం గవుఁగింటఁ దేర్చి ప్రణయంబుం జూపి పూజించి ర
వ్వల మాతాపితృవందనంబు సలిపెన్ వా ర్చేసి యాశీస్సులన్. 91

క. నీవుం దమ్ముఁడు సుఖులై
భావంబుల మమ్ముఁ దలఁచువా రగుచు నటక్
శ్రీవిలసిల్లఁగ నుండితి
రే వత్సా చెప్పు మనుచు ప్రేమించి రెదన్. 9

సీ. గోపవృద్ధుల కప్డు గోకులానందుఁడై
మ్రొక్కి తక్కటివారి నక్కుఁ జేర్చి
విశ్రమించినవెన్క వివిధవినోదముల్
గోపకుల్ బల్కసితోఁ గూడి సలిపి
రవల నవ్వుచు గోపికాంగనల్ చనుదెంచి
పురజనప్రియుఁ డైనమురహరుండు
సుఖులై వసించునో చుట్టాల మము స్మరిం
పడ యంచు నెంతు మే మెడఁద నెపుడు

తే. తనకు సర్వస్వ మర్పించి తత్పరత్వ
మున మెలంగెడువారినిఁ దలఁపకునికి
తగవు గాదు వారలమైత్రిఁ డాగులమియును
ధర్మ మని మేము దలఁప మోహదైత్యదమన. 9

తే. అపుడు కొందఱు గోపిక లరుగుదెంచి
హరిప్రసంగము లిపు డేల తరుణులార
వానికి సుఖంబుగాఁ గాలపథము కడచు
వీరికిని నెట్లొ కడచెడు విడుఁడు దాని. 9

వ. అని గోపిక లోపికలు లేక గోపాలుని మాటలు నవ్వులు చూపుల
చేష్టలు పరిష్వంగములుం దలంచు కొనుచు పలవించి రపుడు బలర
ముండు హృదయంగమంబు లైనకృష్ణసందేశంబులు తెలుపుచు వా
నూరార్చె నిట్లు గోవిందాగ్రజుండు గోకులానందుండై రెండుమా
సంబులటనుండె నాసమయంబునఁ బూర్ణచంద్రకళామృష్టంబును గౌమ
దీగంధగంధవాహసంసేవితంబు నగుయమునానదీపరిసరోపవనంబు

విహరించుచు వరుణుప్రేరిత యగువారుణీదేవి నిజగంధంబున నిఖిలప్రదేశంబును బరిమళింపఁ జేయుచు నొకవృక్షకోటరంబునుండి వెలి వచ్చె నప్పు డాసుగంధంబు వాయువు తెచ్చి ఘ్రాణతర్పణంబు గావించిన మించినవేడ్కఁ నచ్చటికి సంకర్షణుండు వచ్చి దాని నెల్లర తోడం గూడి సేవించి మధురగానంబు గావించుచు విలాసంబుగ విహరించి విహరించి. 95

క. జలకేళి సేయుతలఁపునఁ
గెలనం గలయమునఁ బిలిచె గికొని దరికిన్
గలయఁగ ర మ్మని దానికిఁ
బలుకక యురకున్నఁ గోపపరివృతుఁ డగుచున్. 96

సీ. హలము సంధించి యోపలుగాకి వాఁక నీ
శతవిధంబులఁ జీలి చనఁ బొనర్తు
ననుచు భర్త్సించిన నడలి యమున కాంత
యై వచ్చి రామునియడుగులఁ బడి
నీపరాక్రమ మెల్ల నే నెఱుంగుదు భూమిఁ
దలలపై మోసెడుదంట వీవు
తప్పు చేసితి నన్ను దయఁ జూడు మన్న నా
హలి దాని విడనాడి యందు జలక

తే. మాడి వెలివచ్చి నీలవర్ణాంబరములు
వరుణసంప్రేషితంబులు గరిమఁ దాల్చి
భూషణంబులు ధరియించి బుధపరివృఢు
మదగజంబన నొప్పె నమ్మాధవుండు. 97

క. బలభద్రవిక్రమంబుం
దెలిపెడు నది యనఁగ యమునఁ దెలియగ నిప్పుడున్
నలుపగుమార్గము గలదై
యిలపై వర్తించు ననఁగ నేర్పడి యుండున్. 98

వ. ఇట్లు వచ్చి యున్నసంకర్షణున కాదినంబు లెల్ల నొక్కదినంబు వలెఁ
జెల్ల నిక్కడ బలుండు వ్రేపల్లెకుం బోయి యున్నప్పుడు కరూశాధి
పతి యైనవాసుదేవుం డనువాఁ డొడ లెఱుంగని తెఱంగునఁ బ్రవర్తిం
చుచు వాసుదేవునికడ కొక్కదూతం బుచ్చె వాఁడు ద్వారకాపురం
బున సభాసీనుఁడై యున్నకృష్ణునికడకు వచ్చి. 99

క. దూతుఁడ నేను గరూశ
క్ష్మాతలనాథునకు వానిసందేశంబుల్
నీతోఁ జెప్పఁగ వచ్చితి
నాతనినుడు లాలకింపు మవధానమునన్. 100

మత్త. వాసుదేవుఁడ నే నొకండన వచ్చినాఁడను భూభరం
బోసరిల్లి చనంగఁ జేయఁగ నుత్తమాంశము పెంపునన్
వాసుదేవుఁడ నంచుఁ బేర్గొని బాలచేష్టల కగ్గమై
వాసి గల్గినవాఁడ నందువు బాలకుండవు బాలిశా. 101

తే. మూర్ఖతం జేసి నాచిహ్నములు ధరించి
నాఁడ వయ్యావి చెల్లవు నాలిముచ్చ
వాని విడి నాదుశరణము భక్తిఁ జేసి
పొంది బ్రదుకుము కాదేని పోర రమ్ము. 102

—◆ శ్రీకృష్ణుఁడు పౌండ్రకవాసుదేవుని సంహరించుట ◆—

వ. అని దూతుం డల్పమేధసుం డగుపౌండ్రకవాసుదేవునివికత్థనవచనంబులు
సభామధ్యంబునం బలికిన నుగ్రసేనాదులు ఫక్కున నవ్వి రప్పు
డవ్వాసుదేవుండు దూతునిం గాంచి కారూశు నుద్దేశించి యి ట్లనియె.

శా. ఓరీ! పౌండ్రక! మూఢచిత్తుఁడ వె వేవో వాఁగుచున్ గర్వివై
రా రమ్మంచు వచించుచుంటి విటు శౌరంమన్యుఁడై దుర్మతీ
ఘోరాజిన్ భవదీయచిహ్నములతోఁ గూడన్ భవజ్జీవితం
బాఱున్ కుక్కలు నక్కలున్ మెసవు జన్యంబందు నీదేహమున్.

వ. అని దూతుం బోఁ దోలి గోపాలుండు రథం బధిష్ఠించి కాశీపురంబు
నకుం జనియెఁ బౌండ్రకుండును దూతముఖంబునఁ గృష్ణచేష్టితంబు

విని తనకు మిత్రుం డగుకాశిరాజునాశ్రయించి మూఁడక్షౌహిణుల
సేనం గూర్చుకొని యుద్ధంబునకు సన్నద్ధుం డయ్యె నయ్యవసరంబున.

సీ. శంఖచక్రంబులు శార్ఙ్గంబు గదయును
వనమాలయును గౌస్తుభమును మఱియు
శ్రీవత్సమును గల్గి శ్రీమించుపీతికా
శేయవాసముఁ దాల్చి చెన్నుమీఱ
మకరకుండలములు మణికిరీటంబును
బర్హిబర్హంబును బరిఘవిల్లుఁ
గరుడికెక్కి యమును హరులు నాల్గును గల
రథము నధిష్ఠించి రమణఁ జనియెఁ

తే. గృత్రిమం బగు వేషము కెరలుపొడువ
వాసుదేవాఖ్యతో రంగవసుధ కపుడు
పౌండ్రకుఁడు వచ్చె నటునిరూపంబు తోప
నెల్లవారల కాశ్చర్య మెసకమెసఁగ. 106

వ. అట్లు వచ్చి చిచ్చుటంపఱ హరిపైఁ బరఁగించుచుండ వానివియుఁ గాశీ
శ్వరునివియు నగుసేనలు శూల ముద్గర కరవాల భిండివాల పరశు
పట్టిస ముసల గదాసి పరిఘ శక్తియష్టి ప్రాస తోమర బాణాదు
లొక్కపెట్ట తెట్టలు గట్టునట్లు పడ వైచుచు హరిం బ్రహరించి రంత.

తే. అతఁడు పౌండ్రక కాశిరాజాతిబలము
నసిగదాచక్రహతులచేఁ గసిమసంగిఁ
నగ్గునూఁచము గావించె బగ్గు మనుచుఁ
బ్రళయకాలానలం బెల్లప్రాణులఁ బలె. 108

తే. తేరు లశ్వము లుష్ట్రముల్ ద్విపచయంబు
పత్తులును గుత్తుకలు దెగ మొత్తము లయి
నేలపైఁ గూల నెత్తురు జాలు వాఱ
హరునియాక్రీడనము పోలె నతిశయిల్లె. 109

ఉ. అప్పుడు శౌరి పౌండ్రకుని నారసి యిట్లను నోరి దూతచేఁ
జెప్పఁగఁ బంచి తెట్టిటులో చెప్పినచొప్పునఁ జేయ వత్తు వే
నిప్పుడ నీమృషాహ్వయము నెల్లకుచిహ్నము లూడిపోవు నీ
గొప్పతనంబు చెప్పుకొనఁ గోరికయే నటు సేయు మింతలోన్. 110

మ. అని నోనాడి శితాస్త్రశస్త్రముల వాహంబుల్ తెగం జేసి సూ
తునిఁ జక్కాడి ధ్వజంబుఁ ద్రుంచి ధనువుల్ ద్రుంగించి తచ్ఛీర్షమున్
ఘనచక్రంబునఁ జేసి త్రెస్సి పడఁగాఁ గావించి కాశీపతిన్
జనునప్పౌండ్రకుఁదోడునీడ యగువీఁకం జేయఁగా నెంచుచున్. 111

తే. అరద మటు త్రోలి కాశిరాజా! నిలు మదె
పోవుచున్నాఁడు చెలికాఁడు నీవు వాని
తోడునీడవు గ మ్మని వాడిములికి
యేసి వానితలం ద్రుంచె నింతలోన. 112

తే. బాణరయమునఁ దల యది వాయువశతఁ
గంజకోశమువలెఁ బోయి కాశిపురము
చత్వరంబునఁ బడె నట్లు చంపి వారి
వాసుదేవుఁడు గమియించె ద్వారకకును. 113

ద్విపదము. నిరతంబు పౌండ్రకనృపతిలకంబు
గురుతరవైరంబు గొనియుండి యైన
హరిని ధ్యానించెడునట్టివాఁ డగుట
హరిచిహ్నములు దాల్చునభిలాషపడుట 114

వ. కర్మబంధంబు లెల్లఁ దెగఁ ద్రెంచుకొని విష్ణుసారూప్యంబు నొంది
వైకుంఠంబునఁ దన్మయుండై నిరంతరసౌఖ్యంబు నొందుచుండె నంత
నిక్కడఁ గాశీపురమధ్యంబునం బడినకుండలాంచితరాజశీర్షంబు గని
పౌరులును రాజబంధువులును బరిపరివిధంబులం బరిదేవనంబు చేసి
రప్పు డతనిసుతుం డగుసుదక్షిణుండు తండ్రి కుత్తరక్రియలు నిర్వర్తించి
పితృహంతకుం జంపి ఋణంబు దీర్చుకొందు నని సోపాధ్యాయుండై
శివు నారాధించిన నతండు ప్రత్యక్షంబై వరంబు వేఁడుకొమ్మనుటయు.

— పౌండ్రకునిసుతుఁడు శ్రీకృష్ణునిచే మృతుఁ డగుట —

సీ. ఆసుదక్షిణుఁడు పితృఘాతకుని వధింప
నగునుపాయము చెప్పు మనుచు నడిగె
హరుఁ డాభిచారికవరవిధానముచేత
నగ్ని నారాధింపు మతఁడు మెచ్చి
నీమనసంకల్పము నెఱవేర్చు వాని న
బ్రహ్మణ్యుపై మహాత్రఁ బంప నొప్పు
దనిచెప్పెఁ జెప్పిన ట్లాతఁడు పొసరించె
నంత నయ్యగ్నిహోత్రాంతరమునఁ

తే. దప్తతామ్రశిఖాశ్మశ్రుదృప్తముఖుఁడు
మిడుఁగుఱుల నీనుకందోయి కడిమివాఁడు
నక్రదంష్ట్రుఁడు సృక్వముల్ నాల్కతోడ
నాఁకుచుండెడువాఁడును నగ్నుఁ డొదవె. 116

ఉ. శూలము ద్రిప్పుకొంచు వడి క్షోణితలం బదువంగ మెట్టుచున్
జ్వాలలు పర్వ మండుచు నభస్థ్సల మంటెడు నున్నతాకృతిన్
నాలుగుమూలలన్ శుచికణంబులు రాల్చుచుఁ బెల్చ ద్వారకన్
గాలుచునో యనంగఁ జనెఁ గల్పదవానల తుల్యమై వడిన్. 117

తరళము. అటులు వచ్చెడు నాభిచారమహాగ్నినిం గని ద్వారకా
కటకమం దగునెల్లరున్ వడిఁ గాల్ప వచ్చెడుదావమున్
దటుకునం గని పాఱులే ళ్లనఁ దత్తఱంపడి పాఱుచున్
గటకటంబడువార లై హరికాళ్లపైఁ బడి మ్రొక్కుచున్. 118

క. సభలోఁ బాచికలాడుచు
సభయుం డగుశౌరిఁ గాంచి హరి వరద యదో
త్రిభువన మేర్చెడునో యన
సభ మంతయు వింత నాల్క నాఁకుచు వచ్చున్. 119

వ. లోకరక్షకా! మమ్ము మా ప్రజల రక్షింపు మనిన నధోక్షజుండు నేం గల వెఱ పుడుగుం డని సకలజగదంతర్యామియు సర్వసాక్షియు సర్వ సమర్థుండు నగు శ్రీకృష్ణుండు మాహేశ్వరం బగుకృత్యం దెలిసి దానికి విఘాతంబు గావింపుమని ప్రక్క నున్న చక్రరాజముం గని యిట్లనియె.

ఉ. చక్రమ నీవు పోయి మనచక్కికి వచ్చెడుకృత్తి నిస్తులా
వక్రపరాక్రమంబునను వమ్ముగఁ జేయుచు రమ్ము పొమ్ము నాఁ
జక్రము కోటిసూర్యు లన శంసను నెక్క ప్రకాశమాన మై
శుక్రముఁ గ్రక్కుచున్ నభము క్షోణియు నిండఁగ మండుచున్ వడిన్.

క. కృత్యగ్నిఁ దాఁకి వీఁకన్
బ్రత్యక్షము చేసి తనదుప్రతిభ యడల్లన్
బ్రత్యర్థి యగుచు నడఁచెన్
మృత్యువునై తనదుబలము మే లని పొగడన్. 122

వ. సుదర్శనచక్రమర్దితం బగుకృత్యానలంబు విభగ్నముఖంబై మరలి వారణాసికిం జని ఋత్విక్పరివారపరివృతుం డగుసుదర్శనుం జుట్టిముట్టి నెట్టన భస్మసాత్కృతుఁ గావించెఁ జక్రాయుధంబును గృత్తి న్వెన్న దన్నకొని పోయి సాట్టసభాలయావరణంబును సగోపురాట్టాలకగోష్ఠ గోకులంబును సకోశహస్త్యశ్వరథాన్న శాలంబు నగు కాశీపట్టణం బంతయుంగాల్చి మరలఁ గృష్ణసాన్నిధ్యంబునకు వచ్చిచేరె ననంతరంబ.

—♦ బలరాముఁడు ద్వివిదుఁ డనువానరుని సంహరించుట ♦—

సీ. నరకసఖుండు వానరుఁడు సుగ్రీవధీ
సచివుఁడు మైందుని సహజుఁ డైన
ద్వివిదుండు నరకునిదెస ఋణంబును దీర్పఁ
దలఁచి భూమికి నుపద్రవము గలుగఁ
గలువవాఁడై పురంబులు పల్లెలుం గాల్చి

హారియుంట వానిచే నానర్థములు చూర్ణ
ములుగఁ జేయు చాకొక్క పుడు జలనిధి

తే. జలము చేతులచే నెత్తి సరసనుండు
దేశములఁ జల్లి ముంచుచు దివ్యమునుల
యాశ్రమవనస్పతులఁ గూల్చి యగ్ను లార్చి
మూత్రమును బురీషము వేసి పోవుచుండు. 124

వ. ఇట్లనేకవిధంబుల దేశంబుల కలజడి గలిగించుచు నొక్కనాఁడు సుల
లితం బగుగీతంబు విని రైవతకంబునకుఁ జని యచ్చటఁ బుష్కర
మాలాధరుండును యదుప్రభుండును దర్శనీయసర్వాంగుండును లలనా
మధ్యగతుండును వారుణీరసాస్వాదనరతుండును మదవిహ్వాలలోచ
నుండును మహోన్నతగానంబు గావించువాఁడు నగుబలరాముం
జూచి చెట్టుకొమ్మమీఁదికి నెక్కి కొమ్మలం గదలించుచుఁ గిలకిలా
రావంబు గావించుచుఁ గాన వచ్చె నప్పుడు. 125

తే. వానిదుష్టత్వమును జూచి వనిత లెల్ల
జాతిచపలలు గాన హాస్యప్రియతను
బరిహాసించిరి నవ్వుచు వనచరుండు
వనిశ మిగిలించుచును గోతిపనులు చేసె. 126

మత్త. క్రుద్ధుఁడై బలభద్రుఁ డప్పుడు కోతి నేసెను ఱాతితో
బద్ధమత్సరుఁడైనకీశుఁడు వారుణీరసపాత్ర మ
త్యుద్ధతిం గొని పోయి రాముని నూఁ యటం చదలించుచుం
దిద్ది మంచుఁ బగల్చెఁ బాత్రము నేల బిట్టుగ నేయుచుం. 127

తే. స్త్రీలు కట్టినపుట్టముల్ చింపి తునుక
తునుకలై పోవఁగాఁ జేసి తోడుతోడ
బలపరాక్రమ మెఱుఁగనివాఁడ యగుచుఁ
బరిభవ మొనర్చె నెన్నియో పనులు చేసి. 128

వ. బలభద్రుండును వానిసముద్ధతి నుడువ నెంచి ముసలహలంబులు
చేకొని యుద్ధసన్నద్ధుం డయ్యె ద్వివిదుండునుం జవసత్త్వంబు లేర్పడ

నొక్కసాలంబు వెఱికి చేతం బట్టుకొని బలునిశిరంబుపైఁ బడ వేఁ
టయు బలభద్రుండును.

చ. అది శిరమందుఁ గొండవలె నట్టె పడం గని దానిఁ రోకట
చిదురుపలై పడఁగ సలిపి చెచ్చెఱ మస్తకమందు మొత్తఁగా
మెదడును నెత్తురుం గలసి మే నది యెల్లను నిండఁ గాఱె న
ట్లదవద లైనఁ గొంక కతఁ డాతనిఁ గొట్టె మఱొక్కచెట్టునన్.

సీ. ఆతఁ డయ్యది శతధా తునుకలై పోవఁ
నొనరించెఁ గ్రోతి యింకొక్కచెట్టు
వేసిన నదియును గోసి వేసె బలుండు
దానికి ద్వివిదుండు తత్తఱపడి
తాళోన్నతం బగుతన బాహువులఁ జేసి
రోహిణీపుత్రుని రొమ్ముఁ మొత్తె
నతఁ డాయుధము వీడి హస్తమున న్వాని
జత్రుదేశంబునఁ జదియ వేసె

తే. దాన నెత్తురు గ్రక్కుచు వానరుండు
భూమిపైఁ గూలెఁ బాటున భూధర మన
గాలిచే నబ్ధి జలియించుకలము నాఁగఁ
గంపమును బొందె నాశ్చర్యకరము గాఁగ. ]

వ. ఇట్లు లోకాపకారకరుం డగుద్వివిదుం జంపి సర్వజనసంస్తూయమానుఁ
హలాయుధుండు నిజపురంబునకు నిర్గమించె నని శుకుండు వెండియ

—♦ సాంబుఁడు స్వయంవరమున దుర్యోధనునికన్యకం గొనుట ♦—

తే. అంత జాంబవతీసుతుం డైనసాంబుఁ
డాసుయోధనుకన్యక యైనలక్ష్మ
ణను స్వయంవరమునయందుఁ గొనియె దాని

మత్త. తన్నుఁ గోరనికన్యకామణిఁ దా బలాత్కృతి గాఁగ నీ
యున్నవారి నధఃకరించుచు నొందు గన్గొనఁ జాల కీ
చిన్నకుఱ్ఱఁడు చేసి యెట్టులొ చేకొనెం గద యిందఱిన్
గన్నుఁ గప్పినయట్టు లయ్యెను గాలకర్మవశంబునన్. 134

సీ. ఈదుర్వినీతునిఁ గాదన కిప్పుడు
పట్టి బంధింపుఁ డెవ్వార లేమి
చేయుదురో చూత మాయదువృష్ణులు
మనయనుగ్రహమున మనెడువారు
నిగ్రహీతుఁ డగువీనినిన్ విని కృష్ణాదు
లేగుదెంచిన దర్ప మేగఁ జేసి
యంపిపుత్త్ర మటంచు నలసుయోధనకర్ణ
శల్యముఖ్యులు వివస్వసు... చేసి
తే. పట్టుటకు రాఁగ సాంబుఁడు పట్టి విల్లు
గర్జిలుచు నిల్చె సింహముకరణి నపుడు
కౌరవులు కర్ణు మునుకొని కాండసమితి
నొలికి ముంచిరి సాంబుని నలుకఁ జేసి. 135

ఉత్సాహము. సరకుగొనక సాంబుఁ డపుడు చాప మూని బాణముల్
పరవఁ జేసి నూర్లు వేలు వారిబాణపంక్తులన్
విఱిగి ముక్క లగుచు నేలఁ బెంటఁ గలియునట్లు గా
గరిమఁ జేసి యెల్లవారి గాడ నేసె నీసునన్. 136

తే. నాల్గునా ల్గమ్ములన్ వాహనముల నొక్కొ
కమ్మున రథసారథుల గాఁ గయ్యమునను
సాంబుఁ డాకౌరవుల నెల్ల సాళ్వడంగ
సలిపె నెల్లరు మెచ్చ రాశౌర్యనిధిని. 137

సీ. అవల యుద్ధసమర్థు లగువారు సాంబుని
చుట్టుముట్టి శరాళినట్టె విడిచి

నాల్గుగుఱ్ఱంబుల నీల్గించి సారథి
తలఁ ద్రుంచి రథము ముక్కలుగఁ జేసి
విరథుని గావించి వింటిని దునిఁగించి
చేయాడకుండగఁ జేసి యొకనిఁ
బడుగు రేకం బయి పట్టి కట్టియుఁ దమ
వీటఁ బెట్టిరి యీ ప్రవృత్తి యెల్ల

తే. నారదుఁడు చెప్ప విని క్రోధపూరితమతు
లుగ్రసేనునిపంపున నుక్కు మిగిలి
వృష్ణు లెల్లరు కురుభూమి కేగి మూఁగి
పోరుకో నెంచుచుండిరి పోటరు లయి.

ఉ. పోరుట కిచ్చ లేమి యదుపుంగవులం బశిమాలువాఁడవై
సీరి నిజాప్తులన్ ద్విజుల శిష్టులఁ దోడ్కొని వారివెంబడిన్
దేరిపయిన్ వశించి కురుదేశముఁ జేరఁగఁ బోయి సంధికై
కౌరవరాజుచెంత కనుగం దగఁ జెప్పుచుఁ బంచె నుద్ధవున్.

వ. అతండు నోయి ధృతరాష్ట్రభీష్మద్రోణబాహ్లిక దుర్యోధనాద
గాంచి రామునిరాక నెఱింగించుటయు వారు రామునిరాక
ప్రీతులై యదుపుంగవుం డగునుద్ధవునిం బూజించి కానుకలు పట్టి
బలు నెదుర్కొలు సేసి యర్ఘ్యపాద్యాంబుల నర్చించిన నతండు
సించుచు నెల్లవారికుశలానామయక్షేమసుఖంబులు వేర్వేఱ నడి
పదంపడి వారివిక్కు మొగంబై మాప్రభువచనంబులం జెప్పుచు
నాలకింపుఁ డని యి ట్లనియె.

చ. పదుగురు మీరు కూడి యొకబాలుని సాంబునిఁ బట్టి కట్టుటల్
సదమలధర్మ మం చనరు సజ్జను లెవ్వరు నైన దయ్యెఁ ద
ప్పదలకు నేము సైఁచెదము పుత్రకు నాతనిఁ దెచ్చి మాకు నీ
మదిఁ బొనరించి బంధుతను మానక పోవక యుండఁ జూడుఁడీ.

—♦ బలరాముఁడు హస్తినాపురముగంగలోఁ ద్రోయఁ బోవుట ♦—

తే. అనిన బలరామవచనము లాలకించి
కోపఘూర్ణితనేత్రులై కురువృషభులు
వీర్యశౌర్యాదులకుఁ దగువిధము గాను
బలికి రాబలభద్రునసభ్యర్ణమందు. 142

తే. ఎంత చిత్రప్రసంగమో యిది య హో హో
కాలమాహాత్మ్య మియ్యది కాళ్ళనుండు
పాదరక్షలు మకుటసంభావిత మగు
నౌదలను నెక్కఁ దలఁచెడు నక్కటకట. 143

సీ. పృథ వివాహంబైన వెనుక సంబంధబాం
ధవములు కలిగిన దాన మాకు
వృష్ణులకుం గులభేదస్మృతులు లేక
కలసి శయ్యాసనాదులను భోజ
నాదుల భేదంబు లే దనునట్టులు
వర్తించుచుంటిమి వారి కేను
చామరవ్యజనముల్ శంఖాతపత్రముల్
మకుటముల్ సింహాసనకలనమును

తే. గలుగఁ జేసితి మేము వార లనుభవము
గలిగి మెలఁగుచు నుండిరి తలఁప వారు
మనయనుగ్రహమునఁ జేసి ఘనత గాంచి
వృద్ధి పొందుచునుండిరి పృథివియందు. 144

ఉత్సాహము. మనసమాశ్రయంబువలన మహి నెసంగుయాదవుల్
మనమునందు గర్వపడుచు మనకు నాజ్ఞ పెట్టువా
రనుచుఁ దెగియ వచ్చు నిప్పు డక్కటకట రాజలాం
ఛనములకును దగరు వారు సత్య మీవచోగతుల్. 145

తే. కౌరవవశంబునం దున్న ఘనపదార్థ
ములను కొంద నసాధ్య మయ్యుగ సేనుఁ

తోడయుఁ డనిపించికొంట కర్హుండు గాఁడు
వానిమాటలు పాటింప వలను లేదు. 146

వ. అని యిట్లు లైశ్వర్యమదాంధు లగుకౌరవులు మదించినచందంబున బలభద్రుఁ డసభ్యంబు లగుసంభాషణంబులం బరాభవించి పురంబునకుం జని రంత నతండు వారిదుష్టత్వంబు చూచియు వారియవాచ్యవచనంబులు వినియుఁ గ్రోధాయణితేక్షణుండును దుష్ప్రేక్షుండునై నవ్వుచు ని ట్లనియె. 147

ఉ. గర్వుల కెంత చెప్పినను గల్గదు శాంతి యొకింత యేనియుం
సర్వము మాయధీన మని శౌర్యము చూపుచు నుండు రీ వారి కీ
యుర్వర దండమే తగు నయో పసికిం లగుడంబు వోలె నీ
దుర్వచనంబులం వినిన దోర్బలశాలులు సైఁచి యుందురే. 148

ఉ. కోపితు లైనయాదవులకుం మది శాంతిగ సాంత్వనంబు లే
నోపిక నేఁ నయో పలికి యుండుఁ డటంచును జెప్పి వచ్చితిం
నాపలుకుల్ గణించి హరి నాగమువోలెను రోజుచుండియుం
గోపము సూపఁ డిట్లు విని కొండల నంటగ లేవ కుందునే. 149

సీ. కలహప్రియులు వీండ్రు పలుగాకు లాయుగ్ర
సేనుని నన్నును జెందనాడి
రే మధికుల మని యె న్నెన్నో పలికిరి
వారి న న్నధముల వాసి నిడిరి
జిష్ణ్వాదుల య్యుగ్రసేనునాజ్ఞకు బద్ధు
లతఁడు సుధర్మాసమన్వితుండు
పారిజాతము వానిపజ్జ గుబాళించు
నధ్యాసనార్హత కతఁడు తగఁడొ

తే. కమలయును లోకపాలురు కంజభవుఁడు
సర్వతీర్థంబులును వేనిచరణయుగము
తల ధరించెదరో మహా దైవతంబు
కృష్ణుఁ డాతఁడు వర్ణింపఁ గేవలుండె. 150

తే. కౌరవు లోసంగుభూములు గలిగి వృష్ణి
వరులు జీవించుచుండిరో ధరణి వారు
పానహంబులు కురువంశభవులశీర్ష
ములఁ గిరీటములై యుండఁ గలుగుదు రొకొ. 151

శా. కాని మ్మిప్పు డకౌరవంబుగ ధరం గావింతు నం చీసునన్
గాన న్వచ్చి హలాయుధంబు గొని గంగఁ గల్పెదన్ హత్తిపో
లీనాఁటం గనుఁ డంచు వప్రముపయిన్ వీక్షించి నాఁగేటికొ
ట్టానం జేయుచు లాఁగె నొడ్డగెడపై నాస్థాన మట్టుటగన్. 152

మ. జల యానం బన గంగలోఁ బడుచు నాశం బొందనై యున్నపోల్
నలుచక్కిం గలవారు తొట్రిలుచు దీనధ్వానముల్ సేయుచున్
బలరాముం డగుచోటి కెల్లొ చని తత్పాదంబులన్ బ్రాలి మా
కుల దైవంబ యనుగ్రహింపఁగదె మాకుం బ్రాణముల్ గల్గఁగన్.

తే. సంఘమరణంబు ప్రాప్తించు చక్కి నెఱిఁగి
చేయునది లేక కౌరవుల్ చేయి మోడ్చి
మ్రొక్కి లక్షణతోడ సాంబునిని దెచ్చి
యిచ్చి యెంతయుఁ బ్రార్థించి రిచ్చ బలుని. 154

తే. బల మెఱుంగనివారము ప్రాకృతులము
దెలియ కాడినపలుకుల కలుకఁ బొడము
నీక మముఁ బ్రోవఁ జూడు మోలోకనాథ
యీవనంతుఁడ వెఱిఁగితి మిపుడు నిన్ను. 155

వ. ఇట్లు కౌరవప్రసాదితుండై సుప్రసన్నుం డగుబలదేవుం డభయం బొసంగి నాఁగలిం దీసి కొనియె దుర్యోధనుండు నుహితృవత్సలుండై షష్టిహాయనవారణంబులు పండ్రెండు వేలును పవమానజవనాజానే యాశ్వంబులు పది వేలును సూర్యప్రభాభాసమానంబు లగుసువర్ణ రథంబు లాఱు వేలును నిష్కకంఠదాసీజనసహస్రంబును బారిబర్హం బొసంగిన బలుండు వాని నెల్లఁ బరిగ్రహించి సుహృదభినందితుండై

కొడలితోఁ గొడుకుం దోడ్కొని పయనంబై ద్వారకాపురంబునకుం
జని సర్వంబు నెఱింగించి యుద్ధసన్నద్ధులై ప్రస్థానంబు సేయనున్నవారి
నెల్ల నివారించి స్వగృహంబునకుం జనియె. 156

క. బలునిపరాక్రమముఁ దెలుపుచుఁ
దల క్రిందుగ నొడ్డగిల్లి దంతిపురం బీ
వలిదెస నున్నతియును నా
వలిదెస నిమ్నతయుఁ గలిగి పరికింప నగుఁ. 157

వ. అనంతరకాలంబున. 158

—♦ నారదుఁడు శ్రీకృష్ణపరిభావ మెఱుంగఁ గోరి సంచరించుట ♦—

సీ. నారదుఁ డొకనాఁడు నరకుని జంపిన
వెన్కఁ బదియాఱువేలసతుల
నొకఁ డెట్లు పెండ్లాడె నొకొ యని విస్మయం
పడి చూచుఁ దిచ్ఛమైఁ బయన మగుచు
వివిధోపవనములు నవకముదోత్పల
కలితసరోవరములు సమున్న
తోన్నతప్రాకారసన్నుతప్రాసాద
ములు గల్గుద్వారకాపురికి వచ్చి
తే. అంతిపురమున వేర్వేఱ హర్మ్యములను
బదియునార్వేలసంఖ్యలఁ బరఁగుకృష్ణ
పత్నులం జూచువాఁ డయి వారి వారి
భవనముల కేగె నాశ్చర్యభరితుఁ డగుచు. 159

సీ. తగుపచ్చఱాకట్టు మగఱాలగోడలు
నీలాలపని నెలఱాలమెట్లు
నపరంజి నెడఁ గూర్చు నద్దాలకిటికీలుఁ
బటికంపు నునుద్వారబంధములును

దమ్మికెంపులఁ జెక్కుతలుపులు వైదూర్య
ముల జిల్గుపని గలవలభితతులు
పసిగల పవడంపు వటుత్రిపకంబముల్
మేలిమిజాళువా దూలములును

తే. మఱియుఁ జిత్రవిచిత్రము ల్మలయుపనులు
గలిగి కన్నులపండువై కనుగొనంగ
నొగి హారంగలరారెడు నొక్కదివ్య
భవనమును గాంచె నారదబ్రహ్మచారి. 160

చ. వలభులయందుఁ జెక్కఁబడి వన్నెలఁ జిన్నెల నెన్న నొ శిఖం
డులు కిటికీలదారిని గడుంగడుగా నగు ధూపధూమముల్
వెలి కరుదెంచి క్రమ్ముకొన విన్నన మబ్బు లటంచు పింఛముల్
వెలయఁగ విప్పి యాడు నన వేడుక గూరిచె నందు హారానికిన్.161

తే. అందు నందందుఁ బ్రతిగృహాభ్యంతరమునఁ
దనకు ననురూప యగుపద్మదళవిశాల
నేత్ర వ్యజనంబు గైకొని నిలిచి విసరు
చుండఁ గన్గొనెఁ గృష్ణుని దండనుండి. 162

వ. కృష్ణుండును వానిం గని లేచి సాంజలియై పాదయుగంబున వ్రాలి మ్రొక్కి తోడితెచ్చి యుచితాసనంబున నుండఁ జేసి పాదప్రక్షాళ నందు గావించి తజ్జలంబు శిరంబునం జల్లుకొని విధివిధానంబునం బూజించి యమృతవాక్కుల నాదరించుచు దేవా! నావలనఁ గాఁ దగినది యేమి కల దనిన నారదుం డి ట్లనియె. 163

చ. జగముల నెల్లఁ జేయుటకు సాఁకుటకున్ బ్రభవించినాఁడ వీ
వగణితసత్త్వభావనిధి వాద్యుఁడ వద్భుతవిక్రముండ వో
జగదధినాథ నిన్నెఱుఁగఁ జాలరు బ్రహ్మముఖాదిదేవతల్
సుగముగ నీకటాక్షమునఁ జూచితి నేను గృతార్థజన్ముఁడన్. 164

వ. ఓయోగేశ్వరేశ్వరా! నీయోగమాయ నెఱుంగం గోరి వచ్చితిఁ బోయి వచ్చెద నని యనుజ్ఞం గొని మఱియొకమందిరంబునకుం జనియె నందును బ్రియాసహితుండై యుద్ధవునితోడ పాచికలాడు కృష్ణునిం గని వానిచేఁ బూజితుండై కుశలప్రశ్నంబు గావించిన దేవమునియు నద్భుతం పడి యొండు పలుకక లేచి మఱొకభవనంబునకుం జనియె నందును జిన్నబుడుతల లాలించుచుఁ గేళిం దేలుగోపబాలుం జూచి వాచించి లేచి వేఱొక్కనెలఁదివిడిదకుం జని యట నభ్యంజనముచేయుకృష్ణుని దర్శించె నవ్వల నొక్కభవనంబున నగ్ని నారాధించుచు నొక్కగృహంబున నతిథుల భుజింపఁ జేయుచు మఱియొక్కనిలయంబున సంధ్య వార్చి బ్రహ్మయజ్ఞంబు సేయుచు నింకొక్కగృహాంగణంబున డాలునుం గత్తియుం గొని సాము చేయుచు మఱియొక్కదిక్కున నశ్వగజాదులతో నాటలాడుచు నింకొక్కచో సంచరించుచు మఱియొక్కచో హంసతూలికాతల్పంబున శయనించి వందిమాగధులచేఁ గొనియాడఁబడుచు నింకొక్కకడ మంత్రులతో మంతనంబు చేయుచు నింకొక్కచో జలక్రీడలం దేలుచు నొక్కచోఁ బౌరవధూజనపరివృతుం డగుచు మఱియొక్కచోట బ్రాహ్మణులకు గోదానంబులు చేయుచు నొక్కచో నితిహాసపురాణంబులు వినుచు నొక్కచోఁ బ్రియురాలితో హాస్యకథాలాపంబు లాచరించుచు నొక్కచో ధర్మార్థంబును మఱియొక్కచోట నర్థంబు నింకొక్కచోటఁ గామంబునుం బలికి సేవించుచు నొక్కచోట నధ్యాత్మతత్త్వంబు విమర్శించి పరాత్పరుని ధ్యానించుచు నొక్కచో గురుశుశ్రూష గావించుచు నొక్కచోఁ బుత్రపౌత్రకళత్రాదులం గూడి విహరించుచు నింకొకచోఁ గన్యకలకు వరులం గూర్చువాఁడు నొక్కచో బలరామునితో విహరించువాఁడును మఱియు ననేకవిధంబుల విహారంబులు సలుపు మహాపురుషు నాదిమధ్యాంతరహితు నవ్యయు నచ్యుతు నఖిలాండకోటిబ్రహ్మాండనాయకు నాదినారాయణు

నాకృష్ణపరబ్రహ్మంబుఁ గని విస్మితుండై నారదుండు హృషీకేశుం
గాంచి యి ట్లనియె. 165

శా. దేవా! దేవరయోగమాయ యిది నీదివ్యాంఘ్రిసేవాగతిన్
నేవిజ్ఞానమునన్ గ్రహించితి నిఁకన్ నీయాజ్ఞఁ గైకొంచు నే
బోవం గా మది చేసితిన్ జగములన్ బూతంబు గావించు నీ
భావాతీతము లైనలీల లఖిలప్రాంతంబులన్ బాడెదన్. 167

వ. అనిన బ్రహ్మణ్యదేవుం డగువాసుదేవుండు దేవమునిం దిలకించి యిట్లనియె.

తే. నేను ధర్మము బోధింతు నే నొనర్తు
నేను మోదింతు నిటు చేసి నీజగంబు
నెఱుఁగ శిక్షింతు నాలీల లెఱిఁగి కొమ్ము
మోహ మొందక మెలఁగు మోమునివరేణ్య. 168

వ. ఇట్లు నారదుండు బోధితుండై యెల్లచోటుల నాభగవంతునిం గని
తద్యోగమాయామహోదయావిర్భావమును మాటిమాటికి సంస్మ
రించుచుఁ బరమాశ్చర్యభరితాంతరంగుండై సంతసించుచు ననుజ్ఞ
వడసి యథాగతకృతగమనుం డయ్యె నిట్లు లోకసంగ్రహార్థము మను
ష్యమార్గ మనుసరించి శ్రీకృష్ణుం డనన్యసాధ్యకార్యంబు లాచరించుచు
నొక్కనిశాసమయంబున నెల్లపల్లవపాణులం గూడి సరససల్లాపంబులం
దేలుచు శయనించె నంతఁ గొంతలోన. 169

క. తొలి వల్లింకలు నయ్యవం
కల బొంకము ఱంకె లిడఁగఁ గలితరుతమునం
దెలవాఱు ననుచుఁ గోకిల
రులయుండ్లం గూసెఁ గొక్కురో కో యనుచున్. 170

ఉ. ఒక్కశరీర మే యనెడునోజ యదూద్వహు కౌఁగిలింతలం
జొక్కెడు కృష్ణపత్నులకు శ్రోత్రయుగంబుల సూదిపోట్లు నాఁ
గొక్కురొకో యటంచు వడిఁ గుక్కుటశబ్దము తాఁకు దేరఁగా
మిక్కిలిపొక్కి కో నయిరి మిక్కుటమైనవియోగవేదనన్. 171

ఆ. కోళ్ళ కేమి వచ్చెఁ గొండ్రపక్కం బండి
నిద్రపోవునరుణు నిగిడి లేపి
మనకు విరహతాప మొనరించెడిఁ బీని
మొఱటుకూఁత మూఁడుముక్కలు గను. 172

శా. మందారంబులనుండి మందగతులన్ మాహ్రాంచు గా వాయువుల్
బృందంబై మధుపవ్రజంబు రొద గావింపంగ నేల్కాంచి తా
మిం దందున్ రొద చేయుచున్ ఖగము లెన్నే వంములం బోలి గో
విందున్ లేపు ఖగత్రిబంధకలనన్ వీరిన్ గడున్ వేపుచున్. 173

తే. ఎల్లజంతుతతికి నింపగునయ్యుషః
కాల మపుడు కృష్ణకామినులకుఁ
బ్రియుకవుంగలింత పెడఁ బాయ నగుటను
వగను గూర్చునట్టి దగుచుఁ దనరె. 174

వ. అంత మధుసూదనుండు బ్రాహ్మముహూర్తంబున నేలుకాంచి జలోపస్పర్శనం జేసి నిర్మలాంతఃకరణుండై తమఃపరిన్వృత్ప్రకాశంబును నిత్యనివృత్తకల్మషంబును సత్యంబును నఖండంబు నవ్యయంబు నగు పరబ్రహ్మతత్త్వంబును ధ్యానించి నిర్మలాంబువులను స్నానంబు గావించి సంధ్యోపాసనాదినిత్యక్రియాకలాపంబు నిర్వర్తించి హుతాశను నర్చించి వాఙ్నియమంబున గాయత్రీమంత్రంబు జపించి యుదితార్కు నుపాసించి దేవర్షిపితృతర్పణంబు గావించి వృద్ధవిప్రుల సేవించి రుక్మశృంగంబులును రౌప్యఖురంబులును మౌక్తికస్రజంబులును సువాసోలంకృతంబులు సవత్సంబులు నగు ధేనువుల నొక్కొక్కరికి నొక్కొక్క • ద్వంద్వంబు గా నిచ్చి సేవించి గోవులను దేవతలను వృద్ధులను గురువులను భూతంబులను నమస్కరించి నిజాంశంబు లగుకపిలాద్యవతారంబుల స్మరించి గంధపుష్పమాలాద్యలంకారాలంకృతుండై దర్ప

• ద్వంద్వము = "ద్వంద్వంచతురశీత్యగ్రసహస్రాణిత్రయోదశ" (అనఁగా
[illegible]

ణంబు నాజ్యంబును దర్శించి గోవృషభాదుల కాహారంబు గల్పించి విప్రులకును బౌరాంతఃపురవాసులకు నిష్టప్రదానంబు గావించి సర్వ వర్ణంబులవారి కానందదాయకంబు లగు దానంబు లొనరించి సుహృన్మిత్రకళత్రాదులకు స్రక్తాంబూలాదు లొసంగి తా నంతఁ దాంబూల చర్వణంబు చేసి దారుకుండు సుగ్రీవాదిరథ్యరంజితం బగురథంబుఁ దెచ్చి నిలుప సాత్యక్యుద్ధవసంయుక్తుండై రథసారథి ముకుళితహస్తమును హస్తమున స్పృశించి పాగ్రిదిం బ్రభాకరుఁడు వోలె రథం బధిష్ఠించి నిజాంతఃపురాంగనలచూపులలోఁ జూపులు గలిపి కన్నుల ననుమతింగొని సకలపరివారపరివృతుండై సుధర్మాసభాభవనంబునకుం జని సింహాసనాసీనుండై బంధుజనపరివృతుం డగునతండు నక్షత్రపరివృతుం డగు చంద్రునిచందంబునం దీపించు చున్నసమయంబున. 175

సీ. నటనర్తకులు మహానాట్యముల్ సలిపిరి
పరిహాసకులు హాస్యఫణితిఁ జనిరి
సూతమాగధవంది లాతతి వివిధవా
ద్యములఁ నాడుచుఁ బాడి రమలకృతులు
కవులు గాయకులును గవితయుఁ గానంబు
శ్రవణసేయంబుగా సలిపి రెలమి
వేదమంత్రార్థముల్ వివరించి విప్రులు
పూర్వరాజచరిత్రములు చదివిరి

తే. అప్పు డెన్నఁడుఁ జూడనియట్టిపురుషుఁ
డొకరుఁ డెతెఁగించి చనుదెంచి సకలలోక
విభునకుఁ గృష్ణునకు మ్రొక్కి వినుతి చేసి
మాగధునిదౌష్ట్య మింతని మాట తెచ్చి. 176

వ. ఆజరాసంధుని సన్నుతింపనియిరువదివేలమంది రాజేంద్రు లాగిరివ్రజ పురంబున బంధితులై యున్నవారు వా రందఱు నాముఖంబున రక్షింపు మని లోకరక్షకుండ వగునిన్ను శరణంబు వేఁడుచున్నవా రని మఱియును. 177

తే. భక్తులకుఁ గర్మపాశముల్ వాపునట్టి
వాఁడ వో దేవ మాగధపాశబద్ధు
ల మయి కారాగృహంబుల లావు చెడఁగ
నున్నవారము ముక్తిమా కొసఁగు మీశ. 178

మ. పులి లేళ్ళం బలె మమ్ముఁ బట్టి యెటకుం బో నీక బంధించె నా
ఖలుఁ డొక్కండగు సారె నాలమున నిర్ గాఱించినాఁ డన్న పేర్
గలఁడై గర్వ మఖర్వమై కలుగుటన్ గన్గాన కున్నాఁడు నీ
యెలమిం జూపుచు వాని నోర్చి దయ మమ్మేలంగదే మాధవా.

వ. అని జరాసంధబంధితు లగు రాజన్యు లెల్లను నీపాదమూలము
లాశ్రయించి యున్నవారు వారికిఁ గర్మమోక్షంబు గావించి రక్షింపఁ
బ్రార్థించుచుంటి ననునంతలోఁ బిశంగజటామండలమండితుం డగు
దేవర్షి నారదుండు సహస్రాంశుండు నాఁ బ్రదేశం బెల్లఁ బ్రకాశింపఁ
జేయుచు సాక్షాత్కరించిన సర్వలోకనియామకుం డగు శ్రీకృష్ణుండు
లేచి సభ్యులతో నెదురు వోయి సాష్టాంగనమస్కారంబు గావించి
తోడి తెచ్చి సుఖాసనవిన్యాసనాదులతో నర్ఘ్యపాద్యంబు లిచ్చి విధివ
దర్చనం గావించి విశ్రమించి యున్నపదంపడి. 180

—• నారదుఁడు ధర్మరాజు రాజసూయము నెఱవేర్పు మనిచెప్పుట •—

ఉ. ఈవు సమస్తలోకముల నెప్పుడు నొప్పుగ మెట్టుచుండు నీ
కీవసుధాస్థలంబున నొకించుక యైన నెఱుంగకుండ నొం
డేవిషయంబు నుండ దని యేను మదిం దలపోయుచుండు నో
దేవమునీంద్ర! తెల్పుదు కదే మనపార్థచికీర్షితంబులన్ 181

వ. అనినం బరమేష్ఠిసంభవుం డి ట్లనియె. 182

చ. తెలియనివాఁడు పల్కినగతిం బలుకం గలవాఁడ వైతి వో
సలలితమూర్తి లోకములు సర్వము నిహృదియంద యుండు నీ
వలపురుషోత్తమాంశమున నైతివి నిత్యము సర్వసాక్షి వీ
పలుకుట భక్తులన్ ననుఁ గృపామతిఁ జూచుట యంచు నెంచెదన్.

తే. అయిన నరలోకసువిడంబ నార్థమైన
తనువు దాల్చిననీకు నోవనజనాభ
చెప్పచుంటిని జైత్రవ్యసేయు లిపుడు
చేయఁ దలఁచినకార్యము చిత్తగింపు. 184

సీ. దేవాదిదేవ నీ తెలియనియది కాదు
వినుము మీమేనత్తతనయు లిపుడు
రాజసూయాధ్వరరాజముం బొనరింప
నెంచి రందు న్నిను నెంచి కొలువ
రాజులే కాదు సురలును విచ్చేయుదు
రీ వట వారలఁ బోషింపఁ గలవు
కాని యప్పాండవాగ్రజునకు మాగధు
విజయంబుదెసఁ గొంత బీతు కలదు

తే. అనుడు శ్రీకృష్ణుఁ డట వారియనుమతిమెయి
నుద్ధవునిఁ గాంచి యిట్లను నోయి నీవు
నాసుహృత్తులలోఁ జాల వాసి గొంటి
ధర్మమంత్రార్థతత్త్వవేత్తవును దలఁప. 185

క. నారదవాక్యము వింటివి
శూరులు పాండవులరాజసూయవిధంబున్
సారమతిఁ దెలిసికొంటివి
ధీరాగ్రణి మనకు నడపు తెఱు వెట్టిదియో. 186

వ. విచారించి విచికిత్స విడిచి చెప్పు మనిన నుద్ధవుం డి ట్లనియె. 187

సీ. మునివరుఁ డానతిచ్చినరీతి ధర్మజు
చే రాజసూయము చెన్నుమీఱఁ
జేయించుటయును రక్షింప వేఁడెడుజరా
సంధబంధితరాజసముదయమ్ముఁ
గాపాడుటయు నొక్కకార్యంబునం దీఱుఁ
గావున నిద్ది జగత్ప్రియంబు

మాకు మేలగు దీన నీకు యశం బగు
నని విన్నవింతు నోయబ్జనాభ.

తే. వాఁడు నాగాయుతబలుండు వానితోడ
సవతువచ్చెడివాఁ డొక్క పవనసుతుఁడు
ద్వంద్వయుద్ధంబునం గాని వాని నోర్వ
నోప రక్షౌహిణులు నూఱు లున్న గాని.  188

వ. ఆజరాసంధుండు బ్రాహ్మణభక్తియుక్తుండు బ్రాహ్మణుండు కోరిన యేని కాదనండు వృకోదరుండు బ్రహ్మవేషధరుండై పోయి కోరికొని ద్వైరథంబున వాని సంహరింప నొప్పు.  189

తే. మాగధునిఁ జంపి చెఱఁ బడ్డమనుజవిభుల
విడిచి పుచ్చిన నీకు నీ పుడమియందుఁ
గంసునిం జంపి జనకులఁ గార నుండి
వెడలుచుట తన్న మిన్నయై పేరు వచ్చు.  190

—• శ్రీకృష్ణుండు సపరివారంబుగా నింద్రప్రస్థంబున కరుగుట •—

వ. ఇట్లుద్ధవుండు పలికిన పలుకులకు నారదుండును యదువృద్ధులును గృష్ణుడు నౌనౌ నని మెచ్చి రప్పు డప్పుండరీకాంక్షుండు గురువుల యనుజ్ఞ వడసి హాస్తిపురప్రయాణంబుసేయ దారుకజైత్రాదుల కాజ్ఞ యిచ్చి పుత్రమిత్రబంధుపరివారపరివృతుండై సాత్యకిబలరామప్రభృ లును దేవకీవసుదేవులును దోడరా దారుకానీతరథారోహణంబు చేసి చతురంగబలసమేతుండై మృదంగభేర్యానక శంఖగోముఖాది నిశ్శాణంబులు రాణ లెసఁగఁ బ్రయాణం బయ్యె నయ్యెడ.  191

మ. యదువంశాభరణాయమాన లగునయ్యంతఃపురస్త్రీలు సం
పదలం జాటువరాంబరాభరణపుష్పద్రవ్యగంధామలక్
ముద మొప్పం ధరియించి సాత్మజలు సంపూర్ణప్రభోపేతలై

మ. చతురంగధ్వజినీసహస్రములు వస్త్రచ్ఛత్రముల్ చామరల్
సితమాలాంచితకేతనంబులు ఖరాసివ్రాతముల్ వాద్యసం
తతులుం గల్గి విధూదయప్రథితమై తళ్కొత్తురత్నాకరో
న్నతియై నా నభివర్ణనీయ మగుచున్ భాసిల్లె నప్పట్టునన్. 193

వ. అట్లు వాసుదేవుండు సపరిచ్ఛదకుటుంబముగ బయలుదేరుటం గాంచి కాంచనగర్భాగ్రజుండు గాంచనాంబరు నామంత్రించి నాకమార్గంబున నిర్గమించె రాజదూతుండును గృష్ణాజ్ఞ వడసి గిరివ్రజపురంబునకుం జని కృష్ణాభయవచనం బెఱింగించి వారి కానందం బాపాదించెఁ గృష్ణుండును గ్రమక్రమంబున నానర్త సౌవీర కురు పాంచాల మత్స్య దేశంబులును గురుక్షేత్రంబు నతిక్రమించి గిరులు వనంబులు నదులును బురగ్రామప్రజాకరంబులునుం దాఁటి దృషద్వతీసరస్వతీనదుల నతిక్రమించి శక్రప్రస్థంబుఁ జేర నరుగుటయును. 194

మత్త. వాసుదేవుఁడు వచ్చుచుండుట పాండవుల్ విని బంధువుల్
భూసురుల్ పరిచారకుల్ తమపొంత రా నెదురేగి సం
తోసమేర్పడఁ గౌఁగిలింతలతోడ మ్రొక్కులతోడ నా
భాసురాంగునిఁ దోడి తెచ్చిరి వారిభూరిజనంబుతోన్. 195

వ. యథోచితాపచితుల నెల్ల వారి నభినందించి ధర్మనందనుండు దానుదమ్ములును ధౌమ్యపురస్సరంబుగాఁ బూజ గావించినపదంపడి సూతమాగధవందిగంధర్వులు మృదంగశంఖపటహవేణువీణాపణవవాద్యంబులతో మధురగానంబు ప్రవర్తిల్లఁ జేసి రిట్లు బహూకృతుం డగు శ్రీకృష్ణుండు పరిమళోదకపరిషిక్త వీథీవిరాజితంబును గనకతోరణధ్వజపతాకాభిశోభితంబును నానావిధాలంకారాలంకృతంబును నగు నింద్రప్రస్థపురంబు లోచనగోచరంబు గావించుకొనియె నప్పుడు. 196

చ. అరదము లేన్గులున్ వరహయంబులు కాల్బలము మూఁగి వెంట రాఁ
దమ్ములతోడఁ గూడికొని తామరసాక్షుఁడు రాజమార్గమం
దరుగుట లాలకించి నగరాంగన లెల్లరు నెల్లకార్యముల్
తొరఁగి గృహోపరిస్థలులఁ దోడ్పడి చూచిరి కృష్ణు మ్రొక్కుచున్.

ఆ. మేడ లెక్కి సతులు మెలఁతలు వీర లీ
ముద్దుకృష్ణునవ్వుమోముఁ గనుచు
మన్ననలను బొందుచున్నదానికి నేమి
నోఁచిరో యటంచుఁ జూచిరి హరి. 198

తే. అచట నచ్చటఁ బుష్పలాజాదులఁ గొని
చని పురంధ్రులు కృష్ణుని వినుతి చేసి
పూజ లొనరించి రాకృష్ణమూర్తి కపుడు
తమజననము లారయఁగ సార్థకము లనుచు. 199

వ. ఇట్లారాజమార్గంబున నెల్లర నానందింపఁ జేయుచు రాజమందిరంబుం బ్రవేశించి మునుమున్న కుంతికడకుం జని పాదాభివందనంబు గావించిన నామె నాకృష్ణు గ్రుచ్చి కౌఁగిలించుకొనియె ద్రౌపదియు సుభద్రయు వినయాభివందనంబు చేసి రంత ధర్మజుండు కృష్ణునిఁ దన గృహమ్మునకు రమ్మని తోడికొని పోయియు ముదంబునఁబూజించుట లెఱుంగనివాఁ డయ్యె నపుడు పృథాప్రేరిత యగుద్రౌపది రుక్మిణీ సత్యభామా భద్రా మిత్రవిందా జాంబవతీ కాళిందీనాగ్నజితులు లో నగుకృష్ణభార్యలనుఁదక్కినస్త్రీలను ప్రసక్చందనాదులం బూజించెఁదక్కి నవా రెల్ల పరిజనులుల నెల్లవిధంబుల నాదరించి రిట్లు గారవింపం బడు కృష్ణుఁడు జిష్ణునితోడం గూడి విహరించుచు ధర్మరాజప్రియచికీర్షం జేసి కొన్నిమాసంబు లాయింద్రప్రస్థపురంబున సర్వజనసమేతుండై యుండె నంత. 200

## —♦ ధర్మరాజు తమ్ముల దిగ్విజయంబు సేయఁ బంపుట ♦—

సీ. ఒకనాఁడుధర్మజుఁ డుర్వీసురులు మునుల్
తమ్ములుఁ రాజులు తన్నుఁ గొలువఁ
గొలువు దీఱినవేళఁ గులవృద్ధులును గురుల్
వినుచుండఁ గృష్ణునిఁ గని వచించెఁ
జేయ నెంచితిరాజసూయము నా కది
సిద్ధింపఁ జేయు మో శ్రీనివాస

నిను నుపాసించినజనులకు నిహపరం
బులు రెండు కరతలామలకము లగు

తే. స్వపరభేదము నీ కెప్డు సంభవింప
దెల్లరును నీకు బంధువు లిందిరేశ
సేవకుల కీవు సంపదల్ చేకురంగఁ
జేయుచుందువు నేను నీసేవకుఁడను. 201

వ. అనినఁ గృష్ణభగవానుండు పాండవాగ్రజున కిట్లనియె. 202

క. నీవు తలంచినకార్యము
దేవతలకు మునుల కెల్ల దేశంబులకున్
భావింప నిష్టదం బై
శ్రీవిజయము కీర్తి నీకుఁ జేకూర్చు విభూ. 203

తే. రాజసూయముఁ బోల్క్రతురాజ మొండు
రాజులకుఁ గానఁ బడ దెందు రాజమాన్య !
శత్రురాజులను జయించి సర్వజగతి
స్వవశమం దిడికొని దాని సలుపు మిపుడు. 204

తే. లోకపాలాంశసంభవుల్ లోఁ దలంప
నీతమ్ములు మఱియును నేను నీకు
లోఁబడినవార మో దేవ ! లోఁగ కెపుఁడ
రాజసూయ మొనర్పు మో రాజచంద్ర. 205

వ. ఇట్లు భగవద్గీతావచనంబు విని ధర్మరాజు దిగ్విజయంబు సేయువాఁడై
సహదేవుండు దక్షిణంబును నకులుండు పశ్చిమంబును సవ్యసాచి
యుత్తరంబును వృకోదరుండు ప్రాచినిన్ జయించి రా నాజ్ఞ యిచ్చిన
వారు న ట్లెల్లచోట్లం జయంబు గాంచి మించినధనంబు తెచ్చి యన్న
కిచ్చి రప్పుడు జరాసంధుండు జయింపఁ బడకుండె నని విచారించు
ధర్మజుం గాంచి కృష్ణుం డుద్ధవుండు చెప్పినచొప్పంతయుం జెప్పె. 206

—♦ శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధు జయింపఁజనుట ♦—

ఉ. తానును వాయుసూనుఁడు శతక్రతుపుత్త్రుఁడు బ్రాహ్మణాకృతుల్
పూని గిరివ్రజంబునకుఁ బోయి బృహద్రథపుత్త్రుఁ జూచి మే
మో నరనాథ యాచకుల ముత్తమదాతవు నీవు దూరదే
శానుగతప్రయాసమునఁ గైతిమి వేఁడుదు మిత్తు వేనియున్. 207

ఆ. ఈయ వచ్చు నిద్ది యీయ రా దిద్ది యను
తలఁపు దాత కెపుడు గలుగఁ బోదు
శత్రుమిత్రు లనెడుస్వాంతము జ్ఞానికి
గలుగఁ బోనియట్లు సలలితాత్మ. 208

తే. రంతిదేవ హరిశ్చంద్ర రాజవరులు
బలియు శిబియును వ్యాధ ముద్గలులు మున్ను
గాఁ గలుగువా రశాశ్వతకాయమునను
శాశ్వతస్వర్గసుఖ మొందఁ జాలిరి కదె. 209

వ. అని పలికిన జరాసంధుండు వారి స్వరాకారప్రకారంబులను జ్యాహత
ప్రకోష్ఠంబులను బ్రాహ్మణవేషధారు లయిన రాజపుత్త్రులుగాను
దృష్టపూర్వులు గానుం దెలిసికొనియు వీరికిఁ గామితార్థం బైనచో
గాయం బైన నిచ్చెదం గాక. 210

చ. బలి మును వామనాకృతిని వచ్చినవానిసి విష్ణుమూర్తిగాఁ
దెలిపినశుక్రవాక్యములదిక్కున నొక్కిసుమంత స్వాంతముం
గలఁగఁగ నీక మేదినిఁ దెగి నాఁ గొని సరే యని దాన మిచ్చి ని
చ్చల మగుకీర్తిఁ గైకొనఁడె శాశ్వతమే తనువిద్ది మాయదే. 211

క. పతమాన దేహమందున
నత మని విశ్వాస ముంచి భూసురకార్యం
బతుకం జేయనిపురుషుఁడు
బ్రతికియునుం జచ్చినట్టివాఁడే తలఁపన్. 212

వ. అని జరాసంధుండు కృష్ణార్జునభీములం జూచి మీఁకోర్కి యేమి
తెలుపుండు మీకు నాశీర్షం బైన నొసంగ నుంటి ననినఁ గృష్ణుం
డి ట్లనియె. 213

తే. ఏము రాజన్యులము మాకు నిత్తువేని
ద్వంద్వయుద్ధము నీతోడఁ దవిలి చేయఁ
గోరుచుంటిమి దానినిఁ గొం డటంచు
మా కొసంగుము మఱియొండు మాకు వలదు. 214

వ. అని మఱియును. 215

ఉ. ఈతఁడు వాయునందనుఁ డహీనపరాక్రమ విక్రమాంచితుం
డీతఁడు పాకవైరి సుతుఁ డేను భవత్ప్రతిపక్షవర్గమం
దైతిని కృష్ణుఁడం దెలియు మా యన ఫక్కున నవ్వి మాగధుం
డాతతకోపఘూర్ణితహృదంతరుఁడై వచియించె నిగ్గతిన్. 216

శా. యుద్ధం బిచ్చెద మీకు న ట్లయిన నోయీ నీవునుం జోదువో
కృద్ధు న్నన్ గని బీతునన్ జలధి దాఁకో వీఁడు గట్టించి యుం
దిద్ధప్రజ్ఞను జాటు భీరుఁడవు కావే నిన్ను మారోర్కఁగ స
న్నద్ధస్వాంతుఁడ గాను చెప్పితిసిఁ గృష్ణా! చాలు నీబీరముల్. 217

ఆ. సవ్యసాచి నాకు సవతు రాడు వయస్సు
నను బలంబునన్ రణం బొనర్పఁ
దగినయోధు నాకుఁ దలఁప భీముం డగు
వానితోడఁ బోర వాంఛ యగును. 218

వ. అని తా నొకగదం గొని భీమసేనునకు వేఱొక్కగద నిచ్చి పుర
బాహ్యప్రదేశంబునకుం జనియె. 219

—♦ భీముఁడు జరాసంధునిఁ జీల్చి చంపుట ♦—

చ. సమఖలమందు నిర్వురును జన్యమొనర్పఁ గడంగి యొండొరుల్
క్రమగతులన్ గదాయుధములం గొని మండలముల్ చరించుచున్
సమముగఁ బోరుకోఁ గదలచప్పుడు లుప్పర మంటె నప్పు రం
గమున నటుల్ బలెం బ్రజకుఁ గానఁగ వచ్చిరి హెచ్చి పేర్పడన్.

తరువోజ. ఒండొరు గదలతో నొయ్యన సేయంగ
నొగి నవ్వి వారిపాదోరుజత్రువులఁ
బిండిగాఁ జేయ్య నై పై లైగసిపడఁ
బిడికిళ్ల వ్రేటులు పిడుగులు వోలె
మెం డయి వినిండ మిసిమింతుఁ డగుచు
మెలఁగుచు నంతలో మెఱయుమాగధుని
నండజకేతనుం డరసి తజ్జన్మ
మాజరాకృతజీవితాదిక మెఱిఁగి. 221

తే. అరివధోపాయమును మరుదాత్మభవుఁడు
తెలిసికొనునట్లు విటపముం బెలుచఁ బట్టి
రెండుగాఁ జీల్చి పడ వైచె పృథ్విమీఁద
నది తనకు సంజ్ఞగా నాతఁ డాత్మ నెఱిఁగి. 222

మ. పిఱుకీ కాల మొనర్చుమాగధుని నాభీముండు భీమాకృతిన్
వెఱ వొప్పం బదముల్ గ్రహించి యిలపై వే వైచి పాదం బొకం
డరకాలన్ వడిఁ ద్రొక్కి పెట్టి వెఱకాల్ హస్తంబులం బట్టి చె
చ్చెఱఁ జీల్చెన్ బెయికెత్తి హత్తి బిసమాజిం జీల్చు చందంబునన్.

ఆ. గుదమునుండి గళముతుదదాకఁ జీల్చిన
చెక్కలందు నొక్కచెవియు నొక్క
కన్ను నొక్కభుజము కా లొక్కడుగ జరా
సంధశవము చూడఁ జనియె నపుడు. 224

క. హాహాకారము లత్తఱి
నోహరి సాహరిగ నయ్యె నొయ్యన జిష్ణుం
డాహరియు భీమసేనుని
బాహువులం జేసి రెత్తి పరిరంభణముల్. 225

ఆజి=క్షణమాత్రి కాలము; ఓహరిసాహరి=తండోపతండముగా;

— శ్రీకృష్ణుఁడు జరాసంధబాధితులగురాజుల విడిచి పుచ్చుట —

సీ. అవల జరాసంధు నాత్మజుం డగుసహ
దేవుని మగధాఖ్య దేశమునకు
నధిపతిగాఁ జేసి యట బంధితుల నిరు
వదివేలు నెనిమిదివంద లైన
రాజుల విడిపించి పూజితుం డై కృష్ణ
భగవానుఁ డప్పుడు వారినరసి
కర్మఫలంబునఁ గలిగె మీ కిట్టులు
చింతింపకుఁడు మీరు చిత్తమందు
తే. నహుష హైహయ రావణ నరక వేను
లట్టు లైశ్వర్యమదమత్తు లై మెలఁగక
నను భజించుచు జన్మముల్ పొనరఁ జేసి
ధర్మతత్పరు లై యుంట తగును మీకు. 226

వ. పోయి రండుఁ బ్రజాపాలనముచేయుచు సుఖంబుండుఁ డని వారి
కభ్యంజనంబులు గావించి సహదేవునిచే నరదేవోచితవస్త్రమాల్యా
లంకారంబుల సపర్యలం జేయించి భోజనభాజనాదులచేఁ బరితుష్టిం
గావించిన వారు పర్వాంతమునఁ జంద్రాదిగ్రహములవలెఁ బ్రకాశిం
చుచు రథాశ్వగజాదుల నధిరోహించి కృష్ణాజ్ఞం గొని తమతమపొందు
పట్లకుం జని రిటఁ గృష్ణుండును సహదేవార్చితుండై సంతసించుచు
భీమసేనార్జునులతోడం గూడిఁ పయనం బై ఖాండవప్రస్థంబునకుం జని
తమవారి కానందంబు గా శంఖంబులు పూరించె నది విని ధర్మ
రాజాదు లింద్రప్రస్థవాసు లానందించి రప్పుడు. 227

తే. కృష్ణభీమార్జునులు వడి గృహముఁ జేరి
ధర్మరాజునకుం బ్రెమొక్కి తమపొనర్చి
నట్టిఘనకార్య మానంద మతిశయిల్ల
విన్నవించిరి సువినయాన్వితు లగుచు. 228

వ. ధర్మనందనుండు జరాసంధునిమరణంబు విని కృష్ణునిసామర్థ్యంబునకు
సంతసించుచు ని ట్లనియె. 229

మ. సనకాదుల్ త్రిజగత్పతుల్ బుధులు నీసారూప్య లోకం బూని నీ
కనుసన్నన్ మెలఁగంగ నై మనుదు రోకంజాక్ష! యిట్టీవు మ
మ్మనుకంపం గనుచుందు వన్నను మదీయానూనభాగ్యంబు చె
ప్ప నసామాన్యము నిన్ను నెన్ని వినుతింపన్ జాలి మే ముందుమే.

తే. అద్వితీయుండ వీ వనాద్యంతుఁడవును
తలఁప నీ తేజు రవి తేజువలె సమస్త
భువనముల వెలింగించు నోపురుషమూర్తి
నేను బ్రాత్రమ నైతిని నీదుకృపకు. 231

—♦ ధర్మరాజు రాజసూయాధ్వరము ♦—

సీ. అని పల్కి మోదితుండై ధర్మజుఁడు యజ్ఞ
మొనరించుటకు నెంచి యుక్తకాల
మందు వసిష్ఠ విశ్వామిత్ర గౌతమ
వ్యాస భరద్వాజ వామదేవ
కణ్వ పరాశర గర్గ వైశంపాయ
నాదిఋత్విక్కుల నాదరించి
వరియించి భీష్ముల గురులఁ గృపుల ధృత
రాష్ట్రవిదురముఖ్యరాజవరులఁ

తే. బిలువ నంచెను ధరఁ గల్గువివిధజనులు
యజ్ఞమును జూడ వచ్చి రనంతరమున
స్వర్ణలాంగూలముల దున్ని వసుధ దేవ
యజన మొనరించి మొదలిడి రధ్వరంబు. 232

తే. అపుడు వరుణునకుం బోలె నుపకరణము
లన్నియును స్వర్ణమున నయ్యె యాజకులకు
భోపహూతుల దేవత లోలి నచ్చి
యజ్ఞభుజు లైరి రాజసూయాధ్వరమున. 233

వ. అట్టిమహారాజసూయాధ్వరంబున బ్రహ్మణ్యుం డగుకృష్ణద్వైపాయ
నుండు బ్రహ్మత్వంబును యాజ్ఞవల్క్యుం డాధ్వర్యవంబును ధౌమ్య

సహితుండును వసుపుత్రుం డగు పైలుండు హౌత్రంబును ధనంజయ
ఋషభుం డగుసుసాముం డౌద్గాత్రంబును వహింప వారిశిష్యగణంబు
ప్రతిప్రస్థాతయుఁ బ్రస్తోతయు మైత్రావరుణుండు నాగ్నీధ్రుండు
నేష్టయు నున్నేతయు బ్రాహ్మణాచ్ఛంసియు గ్రావస్తుతయు నచ్ఛా
వాకుండునుం బోతయుఁ బ్రతిహర్త్రయు నై నారదాది మహర్షులును
భీష్మాదిరాజన్యులును సదస్యులై యుండ షడగ్నిసంయుతంబును
సదక్షిణం బగునాసప్తతంతుక్రియాతంత్రం బధోక్షజరక్షితంబుగా
సకలజనానందకరంబుగా నుపక్రమింపం బడియె నప్పుడు. 234

సీ. ప్రాగ్వంశమున వహ్ని ప్రజ్వరిల్లఁగ వేల్చి
యుత్తరవేద్యగ్ని నొప్పఁ జేసి
వరుణేంద్రసోమాదిసురల కాహుతు లిచ్చి
సంపూర్ణదక్షిణల్ సాఁగఁ జేసి
ధరణీసురుల నన్నదానంబునం దన్పి
ధనధాన్యదానముల్ దనరఁ జేసి
గోభూశతసహస్రకోటులు ప్రజ కిచ్చి
యెల్లధనంబులు కొల్లఁ జేసి
తే. వేల్పుల న్నేలవేల్పులఁ బొల్పుమీఱఁ
దృప్తులం జేసి ధర్మజుఁ డాప్తవర్గ
మనుచు నెల్లర మన్నించె నవనిజనులు
నలరి రి ట్లధ్వరం బొప్ప నయ్యె నంత. 235

వ. సుత్యాహస్సు వచ్చినప్పుడు కురుపితామహుండు ధర్మరాజుం గాంచి
యి ట్లనియె. 236

చ. యజన మొనర్చి వంశజుల కందఱకున్ సుకృతంబుఁ గూర్చి తీ
వజితుఁడ వెన్న నిట్టిసమయంబున నొక్కని కర్ఘ్య మీఁ దగున్
వృజినవిదూర తత్కృతికి ఋత్విజుఁడు న్నృపుఁడున్ గురుండు సం
యుజుఁడును స్నాతకుండును బ్రియుం డనునార్వురు నర్హు లుర్వరన్.

ఇటు భారతముననుసరించి రాజసూయము విపులీకృతము.

క. ఈ రోకవత్సరకాలం
బారయ వ్రతమంది యున్నయట్టిర వలయున్
గౌరవవర నీసభ నగు
పూరుషులం దొకనిఁ జూచి పూజింపఁ దగున్. 238

వ. అప్పుడు సహదేవుం డన్నదిక్కు మొగంబై. 239

— ధర్మరాజు రాజసూయంబునఁ గృష్ణు నర్చించుట —

శా. జ్యోతిర్మధ్యమునం దినేంద్రుఁ డనఁ దేజోదివ్యదోర్జోబల
ఖ్యాతిన్ సభ్యులమధ్యమందు వెలుఁగుం గన్గో హృషీకేశుఁ డే
పూతుం డీవసుదేవనందనుఁడె పో పూజ్యుండు లోకత్రయిన్
జేతశ్శుద్ధిగ నర్ఘ్య మి మ్మితనికిన్ శీతాంశువంశోద్భవా. 240

వ. సర్వభూతాత్మభూతుండును భూతభావనుండు నగువాసుదేవుండు తక్క యొండొక్కరుం డీత్రిభువనంబుల లే డీతఁ డొక్కండు తృప్తుం డయిన నెల్లలోకంబులు తృప్తంబు లగు ననిన ధర్మతనయుండు కరంబు సంతసించి సహదేవోపనీతం బగునర్ఘ్యంబు విధిదృష్టవిధానంబున నర్చనీయుం డగునచ్యుతున కిచ్చి తత్పాదోదకంబు తానును భార్యయుఁ దమ్ములును శిరంబులం జలుకొనిరి కృష్ణుండును ధర్మజుం డిచ్చినవాసోభూషణాదికంబుఁ బరిగ్రహించె నది యంతయుం జూచి సహింప నోపక చేదిదేశాధీశ్వరుం డగు శిశుపాలుం డహంకరించుచు లేచి చే యెత్తి. 241

ఉ. ఇందు మహాత్ము లెందఱు మహీపతు లెందఱు వందనీయులై
యుందురు పార్థిపార్ఘ్యణకు నొప్పి ధరాభరణాయమాన నీ
కిందఱిలోన నెవ్వరిపయిం గుఱి నిల్వక పోయె నిన్ను నే
మందును నందనందనున కర్ఘ్య మొసంగితి వీతఁ డర్హుఁడే. 242

క. వృష్ణికులోద్భవుఁ డగునీ
కృష్ణున కర్హణము సేయఁ గేవలదూష్యం
బుష్ణాంశుతేజ గుణవ
ద్ధిష్ణులు పాండవుల కిట్టికృత్యము తగునే. 243

ఉ. చుట్ట మటంచు నెయ్యమునఁ జూతుర యేనియు గోపసూతికిం
బెట్టెదు పోయుఁ డాదరముఁ బెంచెదు నించెదు సంచితార్థ మె
ప్పట్టున నెవ్వ రేమి యన వత్తురు మెత్తురు గాక యిట్టిచో
నిట్టియనర్హుఁ డర్హుఁ డగునే కొన నర్హణ ధర్మనందనా. 244

సీ. గుణవృద్ధు వృద్ధని కొలువంగ నెంచితే
వసుదేవుఁ డుండ నీవాసుదేవుఁ
బ్రియతముం డని వీనిఁ బిలిచి సేవించితే
మద్రరా జుండ నీమాయకాని
నాచార్యుఁ డని భక్తిఁ జూచి పూజించితే
ఘటజన్ముఁ డుండ నీకుటిలచిత్తు
ఋత్విజుం డని యెంచి యెడఁగ నర్చించితే
వ్యాసు లిం దుండ నీదోసకారి

తే. స్నాతకుం డని కొల్చితే శాస్త్రవిద్యు
రుండు నసఘుఁ డశ్వత్థామ యుండ వీని
రా జని తలంచి కొల్చితే రాజరాజు
ఘనుఁడు దుర్యోధనుం డుండ ఖలుని వీని. 245

తే. కులము వర్ణము నాశ్రయ మొలఁమి విడిచి
స్వైరవృత్తిని విహరించుజాతివాఁడు
మును యయాతి శపించె నీతనికులమ్ము
నట్టియితఁ డెట్టు లర్హుఁ డౌ నర్హణకును, 246

మ. విమలార్ఘ్యగ్రహణార్హలక్షణాలవాన్వీతుండు గా నట్టిదు
ష్టమతిం గృష్ణునిఁ బెద్ద చేసి యిటు యజ్ఞప్రాంగణంబందు న
ర్ఘ్యముఁ గల్పించుటఁ జేసి నీదయినధర్మజ్ఞత్వ మొక్కింతలో
సమసెం దప్పు ఘటిల్లె నిం కిట నినుఁ బ్రమాట్టునా నొప్పునే. 247

సీ. ఇట్లు చేదీశ్వరుం డెన్నెన్ని రీతులఁ
బ్రేలుచుండిన దాని విని మురారి

నక్కకూఁతకు మృగనాథుండు బలె నొందు
భాషింపకుండె నప్పలుకునందు
దుస్సహంబులు వానిత్రొటిలుమాటలు
విన నోప కట నున్నవీరు లెల్ల
శివ శివ యని చెవుల్ చేతఁ గప్పుకొనిరి
కేకయాదులు వానిఁ గెడప లేచి

తే. రస్త్రములు శస్త్రములు పూని యాలమునకు
నపుడు కృష్ణుఁడు వారించి నృపతిశతులఁ
జైద్యుదిక్కు మొగం బయి సాంత్వనములు
పలికి యును శాంతి నొందమి తెలిసి యపుడు. 248

—♦ శ్రీకృష్ణుండు శిశుపాలునిఁ జక్రింబున నుక్కడంచుట ♦—

మ. తలఁచెం గృష్ణుఁడు నెమ్మనమ్మున జగద్రక్షాతిదక్షప్రభా
వలితావక్రము విక్రమాపహృతిభవ్య ద్వేషకృన్నక్రమున్
బలదాంతాసురచక్రమున్ వగమునీట్పాపాటవీశుక్రమున్
విలసద్వైభవబద్ధశక్ర మవితోర్వీచక్రమున్ జక్రమున్. 249

తే. తలఁచునంత నిజప్రభావలి దిగంత
రములు నిండ భయంకరారవము పర్వ
నరుణబింబము పూర్వాద్రి నవతరించు
నట్లు చక్రము కై సేసె హరికరంబు. 250

ఉ. అప్పుడు చక్రహస్తుఁ డగునచ్యుతుఁ డి ట్లను నో మహీక్షితుల్!
చెప్పెద నాలకింపుఁడు మలీమసుఁ డీశిశుపాలుఁ డెన్ని యేఁ
దప్పు లొనర్చె నే నితని తల్లి కొసంగిన బాస పూర్ణమై
యొప్పె సహింప నింకఁ గనుచుండుఁడు మీ రని చూచెఁ జక్రమున్.

ఆ. అదియు భూనభోంతరావకాశము నిండ
మంట లెగయ వచ్చి మానవేంద్రు
లెల్ల నరయుచుండఁ బ్రల్లదుఁ డగుశిశు
పాలుశిరముఁ దునిమెఁ గూలి పడఁగ. 252

వ. అంత నాశిశుపాలుని శరీరంబునుండి మహాతేజం బొండు వెడలి వచ్చి
యెల్లరును వెఱఁగంది చూచుచుండ సకలజగద్రక్షకుం డగుపుండరీ
కాక్షుని శరీరంబునం బ్రవేశించె నాసమయంబున. 253

సీ. ఋత్విక్కులు సదస్యులెల్లరు ముద మంద
వివిధదానంబులు వేడ్కఁ జేసి
దమఘోషసుతుఁడు సాత్వతనాథులో నైక్య
మందినపదపడి యమరగంగ
నవభృథస్నానంబు నాచరింపఁగ నెల్ల
బంధువుల్ భార్యలు బలసి నడువ
వివిధవాదిత్రముల్ విస్తరిల్లుచునుండ
వందులు జయజయధ్వనులు సలుప
తే. నటకు లాడంగ గాయకుల్ చటులగాన
మొనరుపఁగఁ దేరులం దెక్కి యుర్వీపతులు
చిత్రచిత్రధ్వజంబులు చెన్ను మీఱ
ధర్మజునివెంట గంగకుం దరలి చనిరి. 254

తే. ఋత్విజులు బ్రహ్మఘోషమురీతు లెసఁగ
స్తుతులు చేసిరి దేవర్షి పితృగణంబు
పొగడి రంబరముననుండి పుష్పవర్ష
మొలికె దుందుభిధ్వానము తెలియ వచ్చె. 255

సీ. పౌరులు భూషణాంబరగంధ మాల్యముల్
ధరియించి నడచిరి గరిమ మెసఁగ
వారాంగనలు తైలగోరస గంధహా
రిద్రాదులం దాల్చి ప్రీతిఁ జనిరి
పల్లకీల విమానవరములపై నెక్కి
రాచబోటులు స్నానరతినిఁ జనిరి
గంగానదిం జలకము లాడి రెల్ల ర
య్యవభృథసమయమునందుఁ జేరి

తే. అపుడు సౌమ్రాద్రథంబున నధివసించి
ప్రియులతో నొప్పక్రతురాట్టు ప్రియ మెసంగ
ధర్మజుని ద్రౌపదీసహితముగ నవభృ
థమున స్నానముచేయించి రమల గతుల. 256

ఉ. అప్పుడు పూలవాన నభమందుననుండి కనంగ జేసిపెం
దెప్పున దేలగా బడియె దేవతలెల్లరు దుందుభిధ్వనుల్
చొప్పడ జేసి రంత నృపసోముడ డనాహత మహామకూలముల్
జెప్పినరీతి గట్టుకొని చేసె బహూకృతు లెల్లవారికిన్. 257

వ. అంత మహాత్ము లగుఋత్విజులు బ్రహ్మవేత్త లగుసదస్యులు బ్రహ్మ క్షత్రియవిట్ఛూద్రులును దేశాధీశ్వరులును సపరివారంబుగం బూజితులై ధర్మరాజానుమతిం బడసి సంతసించుచు రాజసూయముం బొగడుచు నిజనివాసంబులకు నిర్గమించి రపుడు యుధిష్ఠిరుం డెల్ల సుహృద్బంధువుల నంపిపుచ్చి కృష్ణు నంపిపుచ్చుట కిష్టత లేనివాడై నివేదించినం గృష్ణుండు నతనిం గాదనం జాలక సాంబాదు లగుయదువీరుల నెల్లరం గుశస్థలికిం గూర్చి పంచి తా నొక్కపరివత్సరం బయ్యింద్రప్రస్థపురంబునం దధివసించె నప్పు డొక్కనాడు. 258

—♦ దుర్యోధనుడు మయసభం జూచుచు బరిభావితుం డగుట ♦—

చ. కురువిభు డాసుయోధనుడు క్రూరుడు రాజితరాజసూయ మ
ధ్వరమును జూడ వచ్చి యట దద్విభవం బదియున్ సభామహో
త్తరవిభవంబు సర్వమును దా గని లోన సహింపనట్టిడై
కరము విచారముం గలిగి కన్నుల రాల్చెను బాష్పబిందువుల్. 259

చ. మురహరు డాండ్రతో నచట బొంపిరివోయిన వైభవంబునన్
దిరుగుటయున్ మహేంద్రు డన దేజము దిక్కుల బర్వ జేయుచున్
సురుచిరరుక్మపీఠపయి శోభిలుచుండెడు ధర్మపుత్రునిన్
బరిపరి జూచి సైపకశుభం బతి నట్టిమనోంబుజాతుడై. 260

తే. భ్రాతృపరివృతుఁడై కత్తిఁ బట్టి చేతఁ
గడపకావలివారలఁ గడకుఁ ద్రోచి
మయసభం జూచునిచ్ఛమై మసలు మనము
తోడ లోపలికిం జనెఁ ద్రొట్రుపడుచు. 261

సీ. స్ఫటికసంఘటితస్థలము జలాశయ
మని వస్త్ర మెగఁ ద్రోచికొని గమించె
స్ఫటికాంబుజములఁ బ్రస్ఫుటవాపి గని స్థలం
బని చొచ్చి నీటిలో నార మునిఁగె
సంవృతద్వారదేశము వివృతం బని
చొరఁ దలఁ గొట్టుకోఁ జొక్కి పడియె
వివృతంబు సంవృతం బన్ప్రదేశం బని
వడిఁ జని తలక్రిందు పడి వగర్చె

తే. సమతలం బున్నతం బని చక్కనడచి
యొకని మణిదీప్తిఁ బెక్కర ట్లూహ చేసి
తె న్నెఱుంగక ఖిన్నుడై యున్నఁ గాంచి
నలుగురును నాల్గు తెఱఁగుల నగిరి తగిలి. 262

వ. ఇట్లు రాజసూయాధ్వరంబు జగజ్జేగీయమానం బైనయనంతరంబ.

— సాల్వుఁడు విమానం బెక్కి ద్వారకపై దండెత్తుట —

సీ. సాల్వుండు శిశుపాలసఖుఁడు జరాసంధు
నాత్మబంధువు రుక్మియనుఁగు నెయ్యుఁ
డానాఁడు చేదిరాడనుయాయియై వచ్చి
వాసుదేవుని దెబ్బ పడినదాది
వారిపైఁ బగబట్టి వసుధ నయాదవం
బుఁగ జేయుదు నటంచుఁ బూని ప్రతినఁ
బాంసుముష్టిం దిని పరమేశ్వరునిఁ గొల్చె
నతఁడును వర్షాంతమందుఁ బొలిచి

తే. వరము వేఁడుము నాఁగ నాధరణివిభుఁడు
దేవదానవాళి కభేద్యమై వెలసెడు
కామగవిమాన మొందు ని మ్మో మహాత్మ!
యనుఁడు నౌఁ గాత మని సౌభ మనెడుపేర. 264

వ. పత్తనరూపవిమానంబు వినిర్మించి సాళ్వునకు నొసంగిన నతండు కామగంబును దమోధామంబును దురాసదంబు నగుదానిం బొంది కృష్ణకృతావమానంబును వైరంబును దీర్చుకొనువాఁడై విమానం బెక్కి ద్వారావతికిం జని మహాసేనతోఁ దాని ముట్టడించి యుద్యానంబులుఁ గో దివ్యభవనంబు లెల్ల భంజనంబు గావించి గోపురద్వారప్రాసాదాట్టాలకాదు లెల్ల సౌభంబుమీఁదినుండి శరపరంపరలం బరఁగించుచు విధ్వంసంబు గావించె నప్పుడు. 265

చ. పిడుగులు రాలె ఱాల్గురిసె భీషణమై జడివాన వోలె నె
ప్పుడు విడకుండ బాణములు మొత్తములై పడుచుండెఁ బ్రోలిపై
వడి సుడిగాలి భూరజము పర్వ దిశావలయంబుఁ గప్పె న
ప్పుడమి పరావృతం బగుచుఁ బోల్పఁగ నయ్యె భయానకంబయై. 266

పద్మగంధివృత్తము. ప్రద్యుమ్నుఁ డాసాళ్వవాహిన్యధిక్షిప్త
బాణాహతిం ద్రెళ్లి పాడ్పడువీరుల౯
మాద్యద్భయం బంది మా నేది యున్నట్టి
మర్త్యావళిం గాంచి మా ప్రజలారా
వేద్యంబ నా కెల్లవృత్తాంత మెంతెంతొ
పె౯ వింతగా నింత వీడ్వడ బీ తే
నాద్యుండ నై వీరులం దింతలో లీల
నంతయుఁ జల్లార్తు నాగడ మంచు౯. 267

వ. ధనుర్బాణతూణీరపాణియై రథం బధిష్ఠించి కయ్యంబునకుఁ గట్టాయితం బయ్యె నంత సాత్యకియుఁ జారుధేష్ణుండును సాంబుండు నక్రూరుండు హార్దిక్యుండు భానువిందుండు గదశుకసారణులును లో

నగుధానుష్కులు రథయూథనాథులును సేనానాయకులును గవచం
బులు ధరించి చతురంగబలసమేతులై కదలి చని సాళ్వసైన్యంబులం
దాఁకి నంత వారికి దేవదానవసంగ్రామంబు వలె నాసంగ్రామంబు
భీమం బయ్యె నయ్యెడ రుక్మిణీనందనుం డుక్కుమిగిలి. 268

సీ. సాళ్వుని దివ్యాస్త్రశస్త్రంబులం జేసి
నొంచి తన్మాయలఁ జించి వైచి
ద్యుమణి నైశం బైనతమమునుం బలె నింత
లో నంతయుఁ శాంతి నూనఁ జేసి
స్వర్ణపుంఖము లైనపంచవింశతిబాణ
ముల సాళ్వసేనానిఁ బిలుకుమార్చి
యొకబాణమున సాల్వు నొక్కొక్కతూపున
సైనికులఁ బదేసిసాయకముల

తే. నాయకులను మూఁడేసి మేల్ నారసముల
వాహనంబుల నో నేసి వ్రాఁడి మెఱసె
దాని కుభయబలంబులసైనికులును
మెచ్చి కొనిరి ప్రద్యుమ్ను నమేయబలుని. 269

తే. ఒక్కచో బహురూపము నొక్కచోట
నొక్కరూపము గలిగి యొక్కొక్కమాఱు
కనఁబడియుఁ గానఁబడకుండుఁ గనక సౌభ
మద్ది రిపుజనాసాధ్యమై యరయ నయ్యె. 270

తే. ఒక్కొకప్పుడు నేలపై నొక్కయప్పు
నింగిపై నొక్కయప్పుడు నీళ్లపై నొ
కప్పు డద్రిపయిఁ నిల్చి హద్దు మీఱి
కొఱవి వలె నాల్గుమూలలు తిరుగుచుండె. 271

తే. యాదవప్రేరితములు మహాగ్నిశస్త్ర
ములు వడి న్వచ్చి తాఁకుడు నలుగుడువడి

సాళ్వసైన్యము లన్నియు సాళ్వశివర
యనుచుఁ జెప్పఁగ నయ్యె నయ్యవసరమున. 272

మ. మును ప్రద్యుమ్నునిచేత నేటువడి సంపూర్ణక్రుధావిష్టుఁడై
ఘనుఁ డాసాళ్వనమాత్యశేఖరుఁడు పేర్గల్గ ద్యుమంతుండు చేఁ
గొని భీష్మం బగు పేర్గదం దిగిచి కైగొమ్మంచు నారౌక్మిణే
యునిపై నేయుచు నార్చె నెల్లదిశలం దుచ్చైర్నినాదంబుగన్. 273

తే. అట్లు ప్రద్యుమ్నుఁడు ద్యుమద్గదాభిహతిని
శీర్ణవక్షస్స్థలుం డయి చెన్ను దఱిగి
మూర్ఛ మునిఁగిన దారుకపుత్రుఁ డయిన
సారథి తొలంచె వెలికిఁ బో స్యందనంబు. 274

వ. అంతఁ గొంతవడికి లబ్ధసంజ్ఞుండై ప్రద్యుమ్నుండు సూతుం జూచి యి
ట్లనియె. 275

మ. అని వెన్నిచ్చి పరాఙ్ముఖుండ వగుచున్ హా సౌతి! నీ వేటికి
ట్లనుమానింపక వచ్చి తేమిపని చేయం జొచ్చి తాసాళ్వునిం
గని భీతిల్లితె వృష్ణివీరులకు నీకర్మంబు ధర్మంబు గా
దనుచున్ దారుకనందనుండు పలికెన్ న్యాయానుబంధంబుగన్. 276

శా. ఓజనార్దన మోహముం భయము నా కుల్లంబునం బుట్టునే
రాజన్యాన్వయధర్మ మిట్టిద రథిన్ రక్షింప నో మూర్ఛనో
నాజిన్ సారథి సారథిన్ రథియు నన్యోన్యమ్మునున్ వారికీ
యోజన్ ధర్మము చెల్లుచుండు నని నీ వూహింపు ముల్లంబునన్ 277

వ. అనినఁ బ్రిద్యుమ్నుండు వెండియు. 278

ఉ. మాకులమం దనిం బడినమానిసి చంపును జచ్చుఁ గాని తా
నీకరణిం బరాఙ్ముఖత కెంచఁడు నే మరణింపకుండ నీ
వో కలనం దొలంచు టది యెప్పుడు రాముఁడు కృష్ణసాత్యకుల్
నీ కిది యేమి వచ్చె నని నింద యొనర్చెద రేమి సేయుదున్. 279

వ. అని మీనకేతనుండు జలోపస్పర్శనంబు చేసి యుద్ధసన్నద్ధుండై కార్ష్మ
కంబు ధరించి ద్యుమంతునిదిక్కునకు రథంబు వోవ నిమ్మనిన నతం
డట్లు చేయుటయుఁ బ్రద్యుమ్నుండు. 280

చ. నిలు నిలు మోద్యుమంత! యిదె నే నరుదెంచితి కాచి కొమ్మటం
చలుకమెయిన్ హసించుచు హయంబుల నాలుగువాఁడికోలలన్
బిలుకుటఁ జేసి సూతు నొకభేడిశరంబున నొంచి రెంటఁ దూఁ
పుల ధనువున్ సిడంబుఁ దెగి పోవఁగఁ జేసి యనంతరంబునన్. 281

మ. ఒకవాల్తూపు గ్రహించి చాపగుణమం దొప్పంగ సంధించి కొం
చక శౌర్యంబున నాద్యుమచ్ఛరమునన్ సంరంభశుంభత్క్రియన్
సకలాశల్ వెలుఁగొందఁ జేయుచుఁ బడెన్ జండద్యుతుల్ నిండుకో
సకిరీటం బది త్రెస్సి కూలె నిలకున్ సర్వస్థలుల్ దద్దిరన్ 282

తే. గదుఁడు సాత్యకి సాంబాదు లెదురుకొనఁగ
సౌభపతిసైన్య మంతయు సౌపు చెడియు
దైన్య మందియు నొచ్చియు తలలు దెగియు
సంద్రమునఁ గూలి రక్తఝరి సంఘములుగ. 283

వ. ఇట్లు పరివర్తించు యదుసాళ్వసేనాయుద్ధంబు పరమోగ్రంబై యిరు
వదియొక్కదినంబులు చెల్ల నయ్యె నయ్యవసరంబున నింద్రప్రస్థపురం
బున నున్నకృష్ణుండు కొన్నిదుర్నిమిత్తంబులం జేసి ప్రయాణం బగుటకు
నెంచి పృథాదేవియుఁ బాండవులయు ననుమతిం బడసి ద్వారకా
పురంబునకుం జని బలరామాదులచే సాళ్వునిదురాగతం బంతయు
నాకర్ణించి గోపురంబులు విఱిగి తోరణంబులు తెగి కోటలు గూలి
బాటలు చెడి నిష్ప్రకాశంబై సొంపు చెడియున్నపురంబుం గని వృష్ణి
వీరుల నెల్ల శశ్వత్ప్రకారంబుల నాశ్వాసించి మీ రప్రమత్తులై పురంబు
రక్షించుకొనుచుండు డే నిప్పుడ పోయి సాళ్వుం జంపి కాని పురప్ర
వేశంబు చేయ నని ప్రయాణభేరి వేయించి బ్రాహ్మణకృతస్వస్త్యయ
నుండై శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకయుక్తంబును దారుక

సారథికంబు నగురథం బధిష్ఠించి పాంచజన్యంబు పూరించి చతురంగ బలంబులం గూడి పయనంబై కదలి నానావిధగిరివనప్రదేశంబు లతిక్రమించిమార్తికావతదేశంబు మీఁదుగా సౌభపురంబుచేరుటయును.

—♦ శ్రీకృష్ణుఁడు సాళ్వునితోఁబోరి తెగఁజేయుట ♦—

సీ. సాళ్వుండు తనుఁ బోరఁ జనుదెంచుకృష్ణునిఁ
గని దారుకుని శక్తి గాడ నేసె
మండుచు వచ్చునామహితశక్తిని హరి
శతఖండములు చేసి శితశరముల
షోడశేషువులతోఁ బ్రోడ నాసాళ్వుని
నొంచి పెక్కమ్ముల ముంచె సౌభ
మాసౌభకేశుఁడు వాసుదేవుసవ్య
హస్తముమీఁదఁ దీక్ష్ణాస్త్రము లిఁడె
తే. దాన శార్ఙ్గము పడె కూలి ధరణిమీఁద
నపుడు భూతకోటులకు హాహా జనించె
నరసి సాళ్వుఁడు కృష్ణున కనియె నిట్లు
పరిహసించుచు నెంతయు పంత మెసఁగ. 285
తే. ఓరి! మూఢుఁడ నే మొల్ల నారయుచు స
మీపమున నుండ శిశుపాలభూపతి కిడ
నున్నసతి నీవు హరియించి తెన్న మొన్న
ద్రుంచి తామహనీయునిఁ గ్రూరుఁడ వయి. 286
తే. ఈవు పాటిక యుంటివే నింతలోన
నిశితబాణంబులం జేసి నీకు జముని
వీటికిం దారి చూపుదుఁ బోటరి నయి
యనుడుఁ గృష్ణుఁడు నవ్వుచు ననియె నిట్లు. 287
తే. ప్రజ్ఞలను బెట్టుచుంటి వోమంద వాగ్వ్య
య మ్మిదేటికిఁ గాచు కొ మ్మనుచు గదను

త్రిప్పి సాళ్వునిజత్రుప్రదేశముపయిఁ
గొట్టె నాతఁడు రక్తము నట్టె క్రక్కి. 288

వ. గదాప్రహారము గలిగినపదంపడి సాళ్వుం డంతర్ధానంబు నొందె నం
తలో నొక్కపురుషుండు కృష్ణునికడకు వచ్చి మ్రొక్కి నేను దేవకి
చేతం బంపఁబడినదూతుండ నని దుఃఖించుచు ని ట్లనియె. 289

క. నీతండ్రిఁ గట్టి సాళ్వుఁడు
నీతోఁ బుట్టువులఁ దోలి నీతల్లికిఁ దా
నీతీఱుగ దుఃఖం బిడి
పాతరలాడుచు గమించెఁ బైమార్గమునన్. 290

వ. అని పలికిన నులికిపడి యేమియు నిశ్చయింప నేరక మనుష్యస్వభా
వంబున దుర్మనుండై. 291

మ. బలదేవోద్ధవసాత్యకిప్రభృతు లాద్వారావతిం బ్రాణముల్
గలవారై వసియింతు రేని తలఁపంగా సాళ్వుఁ డేపాటి కొం
డలఁ జెండాడినవజ్రి కైనఁ దరమే నాతండ్రినిం జంపఁ గొం
దలముం బొందెదు డెంద మిందలియఘార్ఘం బెట్టులై యుండునో. 292

వ. ఇట్లు గోవిందుఁడు డోలాయమానమానసుండై యుండునంత
సాల్వుండు పొడచూపి మాయావసుదేవుం బట్టి తెచ్చి కృష్ణు నెదుటం
బెట్టి యోరీ మనుష్యాధమా ! యిదె నీతండ్రిం దెగ నేయుచున్నాను
శక్తిగలవాఁడ వేని రక్షించుకొ మ్మని ఖడ్గంబున నానకదుందుభిశిరంబు
దెగనఱికి దానిం గొని నింగిపైఁ గలసౌభంబుమీఁదికిం జనియె నంత
నొక్కింతలోన మురాంతకుం డది మాయ యని యెఱింగికొని. 293

పంచ. అమోఘవిక్రముండు కృష్ణుఁ డంతఁ గొంతలోన భీ
మముల్ మహాస్త్రశస్త్రముల్ సమంజసుండుగానిసా
ళ్వుమీఁద నేసి వాని చేతఁ బొల్చువిల్లు మేనివ
ర్మముల్ శిరోమణిన్ బగిల్చె రంహ మేర్పడం గడున్. 294

మ. అనలాస్త్రంబు సమంత్రకంబుగ రిపుప్రాణాంతకం బౌవిధిం
గొనయుంబం దమరించి రాక్షసులు యక్షుల్ దైత్యులుం దానవుల్
గనుచుండ న్నశియింత్రు గాత మని దోర్గర్వం బఖర్వంబుగాఁ
గొని తాఁ వైచెను దాన భస్మ మగుచుం గూలంగ నై రెల్లరున్. 295

వ. అంతనపోక కాలాంతకయమోపమం బగుసుదర్శనచక్రం బవక్రవిక్ర
మంబున నభిమంత్రించి సౌభంబుపైఁ బ్రయోగించె. 296

చ. అదియును భూనభోంతర మదంతయు నిండి సురారిగుండియల్
చెదరఁగ మండుచుల్ గదిసి చీల్చెను బెల్చన సౌభమధ్యమం
దదటున దారువుం గ్రకచ మట్లు పురం బట రెండు వ్రయ్యలై
చిదియఁ బడె న్మహేశ్వరుని చేవడి ముస్త్రిపురంబు చాడ్పునన్. 297

తే. అట్లు సౌభము శీర్ణమై యబ్ధిఁ బడిన
భూగతుం డయి గదగొని భూరిబలుఁడు
సిండిగాఁ జేయుదున్ యదునృపభు ననుచుఁ
బరుగుపరుగున మీఁదికి వచ్చుటయును. 298

ఉ. భల్లము చేత నెత్తికొని బాహుబలాఢ్యుఁడు శౌరి ధీరుఁడై
త్రెళ్లఁగ నేసి తత్కరము దీర్ఘగదాసహితంబుగాఁ జగం
బల్లల లాడఁ జేయుటకు నై జ్వలియించు సుదర్శనంబునన్
బ్రల్లిదుఁ డైనవానితల వ్రచ్చెను గ్రచ్చర మెచ్చ వేలుపుల్. 299

—♦ శ్రీకృష్ణుండు దంతవక్త్రవిదూరథాదుల సంహరించుట ♦—

వ. అట్లు సాళ్వుండు డెగుటం గని వానిసఖుండు కారూశాధిపతి యగుదంత
వక్త్రుం డనువాఁడు కోపాటోపంబున శిశుపాల సాల్వ పౌండ్రక జరా
సంధాదులఋణంబు తీర్పకొనువాఁడై రయంబున గదాయుతుండై
యొక్కరుండ యుక్కుమిగిలి పదంబుల నేల చలింప మెట్టుచు గదా
గ్రజునభ్యర్ణంబునం దవతరించి మించినగతి నట్టహాసంబు చేయుచు
ని ట్లనియె. 300

శా. ఓరీ యాదవవంశపాంసనుఁడ యోహో రీ! పరాస్కంది! దై
వారంభంబునఁ జేసి నీ విపుడు నా కగ్గంబవై తెన్న నీ
బారం బందగఁ జేయుచుఁ నిలుము నా బాహాగ తాయోమయ
స్ఫారాత్యుగ్రగదాభిఘాతమున నీపా టంతయుం దీఱఁగన్. 301

వ. ఇట్లు దంతవక్త్రుండు రూక్షాక్షరంబులం జేసి తోత్రంబుల గజేంద్రుం
బోలె నొప్పించుచు నుప్పరంబున కెగసి గదాదండంబుచే గదాగ్రజు
నుత్తమాంగంబున మొత్తి మొత్తంబుగ సింహగర్జనంబు గావించిన
గదాహతుం డగుయదూద్వహుండును. 302

క. కొండొక చలింప కాతని
గుండెలలో దండిపిడుగు గూలెడుగతి గా
మండెడు కౌమోదకి నా
నుండెడుగద విసరి వైచె నురుశబ్దముగన్. 303

క. నిర్భిన్నహృదయుఁ డగుచున్
దుర్భగుఁ డాతండు నోటఁ దొప్పలు దొరల్
దుర్భరముగ నె త్తురలన్
నిర్భరముగ నార్చి చచ్చి నేలం బడుచున్ 304

ఆ. అప్పు డెల్లప్రాణు లరయుచునుండ నా
దంతవక్త్రుఁ డతసితనువునుండి
జ్యోతి యొకఁడు లేచి చొచ్చెఁ గృష్ణునిలోనఁ
దెలియఁ జేదినాథు తేజము వలె. 305

సీ. దంతవక్త్రుం డట్టు లంతము నొందిన
పయి విదూరథుఁ డనువాఁడు వాని
తమ్ముఁడు క్రుద్ధుఁడై దనుజారి నెదిరింప
క్షురనేమిచే వానిశిరము నఱకె
నీవిధంబునఁ గృష్ణుఁ డెగిచి సాళ్వుని దంత
వక్త్రు విదూరథు బహుళసేనఁ

పరాస్కంది=చోరుఁడు, దొంగ;

మనిగించి వేల్పులు కొనియాడ వృష్ణిప్ర
వరులతోఁ ద్వారకాపురికి వచ్చె

తే. అంత నచ్చటఁ గురుపాండవాహవంబు
జరుగ నుండుట విని బలస్వామి వారి
పట్ల మధ్యస్థుఁ డగుట నేవంకఁ జనక
తీర్థయాత్రానిమిషం జేసి తెరువఁ జనియె. 306

—♦ బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట ♦—

దండకము. అంతఁ బ్రభాసంబునం దాడి రాముండు దేవర్షిపిత్రర్చనాదుల్ బోనర్పంగనై విప్రులం దోడుకొంచున్ బ్రతిస్రోత యౌ భారతీవాహినిం జేరి స్నానాదులం దీర్చి మీఁదన్ విశాలంబునన్ బ్రహ్మతీర్థంబునుం జక్రతీర్థంబు మున్నైనతీర్థంబులున్ బ్రాచియం దైన క్షేత్రంబులుం జుట్టి కాళిందినిం గల్గుతీర్థంబులున్ గంగ నౌనెల్లతీర్థంబులు న్మెట్టి సేవించి దేవార్చనల్ సేయుచున్ శౌనకాదుల్ మునుల్ సత్రముం జేయు నానైమిశారణ్యముం జొచ్చినన్ వారాను లాలించి తోడ్తెచ్చి పూజించి రవ్వేళ నాశీనుఁ డా రాముఁ డందొక్కచో నాసనాశీనుఁడై లేచి చే యెత్తి మ్రొక్కంగఁ బోకున్న సూతున్ దమోధర్మజాతున్ మునీంద్రానుకంపాసనేతున్ దగం జూచి కోపించి వారీంద్రులన్ వీఁడు సూతుండు విప్రోత్తముల్ మీరు వీరిన్ గణింపంగఁ బో కిట్లు ధర్మాసనాశీనుఁడై యుండుటల్ పోలదం చెంతు వధ్యుం డటం చాత్మ భావింతు నీతండు దా వ్యాసశిష్యుండు గానీ పురాణేతిహాసాదులన్ విజ్ఞుఁడై యుండనీ ధర్మశాస్త్రంబులన్ దక్షుఁడే గాని దాంతుండు గాకుండుటన్ బండితంమన్యుఁడై గర్వియై దుర్వినీతుండునై యుండెడిన్ దుష్టసంహారముం జేయ నాజన్మ మౌటం గావునన్ వీని శిక్షింతు నిప్డంచుఁ జే నొక్కదర్భాగ్రముం బూని మంత్రించి వేసెం దదాఘాతముం దాఁకుటన్ సూతసూనుండు ప్రాణంబులన్ బాసి భూమిం బడెన్ వారలీక్షించి హాహాకృతుల్ సేయుచుం గుందుచున్

దేవ! సంకర్షణా! నీ వధర్మంబు గావించితే మీమునీశ్వరులకున్ మెచ్చి బ్రహ్మాసనం బిచ్చి యున్నార మీ సూతవధ్యంబునన్ జావరా దీతఁ డిట్లీవు చింతింపనట్టిండవై బ్రహ్మహత్యాసమాఘంబు గావింపనై తక్కటా! నిన్ను లోకేశ్వరుం బల్క లేరెవ్వరున్ దీనికిన్ నిష్కృతిన్ నీవ యోజించుకొ మ్మన్న నే వీనికిన్ దీర్ఘ మాయుష్యమున్ సత్త్వమున్ గల్గఁ గావింతు నా యోగమాయన్ భవత్కాంక్ష చెల్లంగ నం చట్లుగావించి మునీంద్రులారా ననుం గోరుఁ డేదేని మీకిత్తు నన్నన్ మునీంద్రుల్ ఖలుం డిల్వలుం డుండె మున్ వానికిం బుత్రుఁడై పల్వలుం డన్న దైత్యుండు పర్వంబు పర్వంబు నేతెంచి మాసత్ర ఘాతంబు గావించు విణ్మూత్రముల్ వేసియున్ మాంసమున్ మద్యమున్ దెచ్చి మానోళులం గ్రుక్కియున్ మమ్ము వేధించు నో దేవ వానిన్ వధింపన్ మముం బ్రోవ వాంఛింతు మన్నన్ బలుం డట్ల యౌ నంచుఁ బర్వంబునన్ వచ్చి బాధించువానిన్ బృహన్నీల కాయున్ గరాళాననుం గ్రూరదంష్ట్రాముఖున్ బల్వలుం గాంచి దైత్యాంతకం బౌహలంబుం దలంపంగ హస్తంబుఁ గైసేయుదానన్ సురారిన్ వడిన్ ద్రిప్పి నైవంగ వాఁ డుత్తమాంగంబు నిర్భిన్నమై పోవుటన్ గూలి పెల్లార్చుచుం జచ్చె నిచ్చన్ మునుల్ వేల్పులున్ మెచ్చుచున్ వైజయంతీమహామాలయున్ దివ్యవస్త్రంబులున్ భూషలర్పించి రంతన్ బ్రలంబఘ్నుఁ డాజ్ఞాపితుండై ద్విజుల్ వెంటరాఁ గౌశికిం జేరి సుస్నానదానాదులం జేసి వెన్కం బ్రయాగంబునన్ గోమతిన్ గండకిన్ శోణ గంగన్ విపాశన్ గయం గాంచి సేవించి మీఁదన్ మహేంద్రాద్రిపై రామునిన్ మ్రొక్కియున్ సప్తగోదావరిన్ గృష్ణవేణిన్ మహాపంప శ్రీశైలమున్ నాగశైలేంద్రముం గామకోటీపురిం గాంచి కావేరి శ్రీరంగమున్ బై ననద్వ్యాహశైలంబు నాఁపై హరిక్షేత్రమున్ సేతురామేశ్వరంబున్ గనుంగొంచు నానా విధంబుల్ మహాదానముల్ స్నానముల్ పూజలున్ మ్రొక్కులుం

దీర్చియుం దామ్రపర్ణీనదిన్ జందనాద్రిన్ సమీక్షించి యందున్న
కుంభోద్భవున్ మ్రొక్కి సేవించి సాష్టాంగదండప్రణామంబు గావించి
కైకొంచు నమహ్మానియాశీస్సు లంభోనిధిం గాంచి పూజించి తత్తీర
మం దున్నకన్యాఖ్యదుర్గన్ మిళద్భర్గ పాదంబులన్ వ్రాలి పూజించి
శ్రీఫాల్గునిం గాంచి పంచాప్సరస్తీర్థమందున్ జలం బాడి యీరైదు
వేల్ గోవులన్ దానముం జేసి యప్పిమ్మటన్ గేరళంబుల్ గనుం
గొంచు నాసోమగర్తంబులం దాఁటి గోకర్ణమందున్ శివుం గొల్చి
ద్వైపాయనీదేవి. దర్శించి శూర్పారకంబుం బ్రవేశించి తాపిం బయో
ష్ణిన్ జలం బాడి నిర్వింధ్య నీక్షించి ప్రోక్షించు కొంచున్ దగం
దండకం జేరి మాహిష్మతిం దాఁటి రేవానదిం గాంచి స్నానంబు
గావించియు న్వొండి చేరెం బ్రభాసం బొగిన్. 307

సీ. సంకర్షణుఁడు ప్రభాసమునందు విప్రులు
చెప్పుకొనుచునుండఁ జేరి వినియెఁ
గురుపాండవులకుఁ బెందుర మయ్యె ననియును
సర్వరాజన్యులు సమసి రనియు
భీమదుర్యోధనుల్ భీమగతిం గదా
యుద్ధ మొనర్పఁగ నుండి రనియు
నాలించి వారలయాల ముడుప నెంచి
చనియెఁ గురుక్షేత్రమున కతండు

తే. యమసుతుండును గవలు కృష్ణార్జునులు స
మాగతుం డగుబలరాము నరసి వాని
పాదపద్మములకు మ్రొక్కి యేది యెట్లు
పలుకునో యనుభీతునఁ బలుక కైరి. 308

మ. బలదేవుం డపు డిర్వురం గని యనున్ బాహాబలప్రౌఢిమన్
గలనుం జేయఁగ మీరు పూనుకొనినన్ గా దెచ్చునుం గుందుఁ దు

ల్యులు ప్రాణాధికుఁ డొక్కరుండు మఱియొండొక్కండు శిక్షాధికుం
డలఁతుల్ గారు జయాజయంబు లగు నం చాడంగ రా దేరికిన్. 309

వ. కావున మీ రీయుద్ధమును విరమింపుఁ డనిన నవ్వాక్యముం బరస్పర
జయాభిలాషులై బద్ధమత్సరులై యున్నవారు పెడచెవిం బెట్టి రంత
వారు తనవాక్యంబు విననొల్లమిఁ గోపమి రాముండు వారిదిష్టం బను
సరించి కార్యం బగు నని తలంచుచు ద్వారవతికిం బోయి యుగ్ర
సేనాదులం గలసి సుఖంబుండె నిట్లున్నకాలంబున. 310

—• కుచేలోపాఖ్యానము •—

తే. జగతి శ్రీకృష్ణునకు బాల్యసఖుఁడు బ్రహ్మ
వేత్తలం దగ్రగణ్యుఁడు విషయసుఖవి
రక్తుఁడు ప్రశాంతచిత్తుఁడు బ్రాహ్మణుండు
దనరు నతినిస్వుఁడు కుచేలుఁ డనెడువాఁడు. 311

ఉ. ఆతఁ డయాచితం బగుచు నాగత మైనధనంబుతోడ నే
ప్రీతి వహించుఁ బిల్లలును బెండ్లము గల్గి కుటుంబియై కడుం
బ్రోతలు చింపులుం దొడిగి పట్టెడు పొట్టకు లేక లేకియై
చేతన గానిచందమునఁ జేడ్పడి యుండెడి మేన నెప్పుడున్. 312

క. గంపెడుపిల్లలు గల్గియుఁ
గొంపయు గోడియును లేక కూటికిఁ గఱవై
చింపిం గట్టి వసంటుం
బొంపిటితో నుండు నతనిపొలఁతి కలంకన్. 313

సీ. అమ్మ బువ్వ యటంచు నాకటం గటకట
పడుబిడ్డలం గని కడుపు కాన
కనికరంబునఁ బిండి గలిపి నీళ్లిన్ని
త్రావంగ నిచ్చు బ్రత్యహంబు
నివ్వరుల్ చేరెడు నెఱి నేఱికొని వచ్చి
వైశ్వదేవార్థము వండి పెట్టి

నారబట్టల నల్లి నాథుండునుం దాను
దనపిల్లలను గట్టుకొనఁగ నిచ్చుఁ

తే. గొయ్యచెంబులు కుండలు గోలెములును
గుడిసెకు నలంకృతులు రేలు గోగుపుల్ల
వెలుఁగు దీపము పండుకో వెదురుకుక్కి
గలిగి కాపుర మొనరించు గరితమిన్న. 314

తే. గుడిసె కురిసినఁ జేట పై నిడి కొనుచును
జలికిఁ గుంపట్ల ప్రక్కల నిలుపు కొనుచు
గాలికిం దాటిజవరలు గప్పికొనుచుఁ
గాపురము చేయు నాయమ్మ కాటకమున. 315

వ. ఇట్లు దారిద్ర్యభారంబునఁ బారంబు గానఁ జాలక మిక్కిలి పొక్కుచు
నొక్కనాఁడు నిజవల్లభుం గాంచి మెల్లన నిట్లనియె 316

శా. ఏను స్త్రీరు నెట్లైనఁ దాళుకొని యొక్కన్నాళ్లు సైరింతు మ
య్యో యీ వాస్ కసుగందువుల్ క్షుధకు వీం డ్రొక్కంతయుం దాళక
మ్మా నా కించుక బువ్వఁ బెట్టు మని నా ప్రాణంబులం దీయుచుం
డ్రే నిం కెట్లు కుటుంబమున్ మనుతునో యేరీతి వర్తింతునో. 317

ఉ. ఎమ్ములు తోలు గాక మఱి యించుక మాంసము నెత్రు వేరికా
యమ్మునఁ గాన రావు బడుగట్లు గనంబడుచుండి రెల్లరున్
విమ్ము వచింప నేమిటికి మీరును మాటయు నాడ లేనిచం
దమ్మునఁ గాన వచ్చెదరు తాపసవర్య! లనుగ్రహింపుఁడీ. 318

క. దీని కుపాయం బేదే
మానసమున నరసి ప్రజల మనుపఁగ వలయున్
నే నిట్లు చెప్పుటన్ మది
లో నింతయు నలుగ కింతలో గతిఁ గన నో 319

వ. అనినఁ గుచేలుం డి ట్లనియె. 320

మ. గరితా నీ వనునంతయు న్నిజము నేఁ గన్గొంచు నున్నాఁడ నీ
చిఱుతల్ మాటికిఁ బోరువెట్టుట లరయో చెల్వా! యెటుల్ సేయుదుర్
సిరి లేదొడ్డ సమాశ్రయించుటకు నాచిత్తంబు హర్షింప దే
కరణిన్ విత్తము గూర్తు నెట్లు ప్రజలం గాపాడుదుం జెప్పవే. 321

మత్త. నీచవృత్తులు చేయ నోపను నేలతేండ్లను జూడఁ బో
రాచటెక్కున నొక్కమాఱును రమ్ము పొమ్మనఁ బోరు వో
చూచి చూడని యట్టులుందురు క్షుద్రభావులు వారితో
నాచరించుట యెట్లొ పోల ధనంబు గూర్చుట యెట్లొకో. 322

వ. అని పలికినపతిం గాంచి సతి యిట్లనియె. 323

చ. ఒరుల సమాశ్రయింపు మని యొడ్లను సేవఁ బొనర్పఁ బోవుటల్
వరమని నీచవృత్తులఁ బ్రవర్తిలు మం చని నేను జెప్పఁ బో
నురుతరకీర్తి! నీ వగు నొహో యనుదానిన నేను జెప్పెదన్
బరమకృపాసమేతుఁడయి భావము సేయుము దాని నియ్యెడన్. 324

సీ. ఆలకింపుము నీకు నానాఁటిచెలికాఁడు
భగవంతుఁడును రమావల్లభుండు
బ్రహ్మణ్యుఁ డాశ్రితపారిజాతమటి లేదు
పొమ్మని పల్కఁ డెప్పుడును గాని
నీ వాశ్రయించిన నీకష్టము లెఱింగి
యిడు నీకు బహుధనం బడుగ కున్న
నతఁ డిప్పు డాద్వారవతి యందె భక్తిసై
దలఁచిన వేని కేఁ దన్ను నైన

తే. ఇదును భజియింప నుండు మిత్రుఁ డగు నీకు
ఇష్టకామార్థముల నిచ్చు టెంత మాట
సంశయింపక దీని కోసదమలాత్మ
కృష్ణసందర్శన మొనర్చి కీర్తి గనుము. 325

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై శ్రీదాముండు శ్రీకృష్ణదర్శనలాభంబు
కలుగు ననియుం దలంచుచు నేఁబోయి వచ్చెదం గాని రిక్తహస్తంబునఁ
బ్రభుదర్శనంబు సేయ నొప్పదు గావున నేదే నుపాయనం బున్న
ని మ్మనిన నయ్యమ్మ పఱుగుపఱుగునం బొరుగువారియింటికిం బోయి
యాచించి నాలుగుపిడికెళ్ల పృథుకంబులు సంతరించుకొని వచ్చి నాథుని
కుచేలఖండంబునం గట్టి యిదె యుపాయనం బని చెప్పిన నతండు వానిం
బుచ్చుకొని తారాబలచంద్రబలంబులు చూచుకొని పయనంబై
పోవుచు నమార్గమధ్యంబున. 326

ఉ. అప్పటి బాలకృష్ణుఁ డన నైతి యొకింతయు నుండఁ బోదు వో
యిప్పటికృష్ణుఁ డెల్లజగ మేలెడునట్టిఁడు లోనగళ్లలో
నెప్పుడు నుండు వాని నెటు లేను గనుంగొనఁ జాలి యుందునో
చెప్పిన నిన్ను నే నెఱుఁగఁ జెన్నటి పొ మ్మని నన్ను దూఱునో! 327

శా. ఈరూపంబున నున్ననన్ గనుచు నోరీ నీ వెవండో నినున్
మా రామానుజుఁ డాదరించు ననుచున్ స్వాంతంబు గావింతువో
పోరా బిచ్చపుబ్రాహ్మణుండ! నిను రా పొమ్మంచు వాకిచ్చువా
రేరీ యంచు బహిష్కరింతురొ జనుల్ హీనస్థితిన్ జూచుచున్. 328

వ. అని చింతించుచు నాశ్రీదాముఁడు భక్తపరవశుండై మూడుగుల్మంబు
లును మూడుకక్ష్యంబులుం దాఁటి పోయి పిమ్మట. 329

మ. పదియార్వే లగుపత్ను లుండుటకు నౌప్రాసాద మానందసం
పదమేయప్రతిభాంచితుం డగుచు నా బ్రహ్మణ్యుఁ డల్లల్లనన్
బదముల్ వేయుచు దిక్కులం గనుచు రాఁ బల్యంకమం దుండి శ్రీ
పదుఁ డాకృష్ణుఁడు దవ్వులం గని కడుం బ్రజ్ఞాసమగ్రుండు నై. 330

చ. వడివడి లేచి చేతులను బారలు సాఁపుచుఁ బోయి సందిటన్
గడువడిఁ జేర్చి బ్రాహ్మణుని గాఢతరంబుగఁ గౌఁగిలింతలన్
బుడిబుడి మాటలం దనిపి బుజ్జన మాఱఁగ నజ్జ లేయఁగా
నడపుచుఁ దోడుకొంచుఁ జనె నాతుక లుండెడునట్టిచోటికిన్. 331

సీ. ఆహరి ప్రియమిత్రు నంగసంగతి మెయిఁ
ప్రీతుఁడై కందోయి విడిచి జలము
పల్యంకమునయందుఁ బరివసింపగఁ జేసి
తా నె పూజాద్రివ్యతతులఁ దెచ్చి
పాదముల్ కడిగి తత్పావనోదకములు
శీర్షంబున గ్రహించి శ్రీసుగంధ
చందన మలఁది పై సౌరభ్యధూపముల్
దీపముల్ నలుగడఁ దెలియఁ జేసి

తే. పూజ గావించి తాంబూలము విడి గోవు
నప్పనము చేసి స్వాగత మడిగి సాద
రముగఁ బల్కుచుఁ గూర్చుండి రమణ బ్రాహ్మ
ణోత్తమునిపాదపద్మము లొత్తుచుండె. 332

కవిరాజవృత్తము. మలినకుచేలము మలినశరీరము
మానతి వోయిన మంగళముల్
గలిగి నరంబులు గనఁబడఁ గా నయి
కాంతి దొలఁగినకన్నులు క
ల్గులవలెనై కనుఁగొన నయి గోతులు
గోతులు వాఁటినగూనుమెడన్
నిలుపగఁ జాలక నెఱిచెడి యుండియు
నిట్రిలుబాడబునిం గనుచున్. 333

తే. రుక్మిణీదేవి యించుక రోఁతపడక
చామరము చేతఁ గైకొని శౌరిదెసను
నిలిచి వీఁచుచు శుశ్రూష సలుపుచుండె
నాసుదామునిభాగ్య మే మనఁగ వచ్చు, 334

ఉ. అంతిపురంబునం గలుగునంగన లచ్యుతుఁడం ఘురిలొ త్తఁగా
నంతికమందు నిల్చి కమలాలయ వీవన వీఁచుచుండఁగాఁ

వింతగఁ జూచి బ్రాహ్మణుఁడు వీనిపొనర్చినపుణ్యలేశ మెం
తెంతొ వచింప రా దనుచు నెంతయు సంతస మంది రందఱుఀ. 335

చ. బికిరపు బాపనయ్య నడపీనుఁగు నాఁబడువాఁడు దవ్వులం
దోకయుసుమంత దృష్టిపథ మొందినమాత్ర రమావినోదియై
సకలసుఖంబులం గుడుచుసారసనాభుఁడు వీడి పోయి యీ
సుకృతిని దెచ్చి మెచ్చి కృప సుబ్బగఁ జూచెడు నెంత వింతయో. 336

తే. కృష్ణుఁడు సుదాముఁ డొండొరుల్ కేలువట్టి
గురుకులమునందు వా రున్నతఱుణమందు
నెమ్మి నడచినసంభాషణమ్ము లెల్లఁ
ద్రవ్వి తలపోసికొనుచుండి రొవ్వెడు నటు. 337

వ. అప్పుడు భగవానుం డాసుదామునిం గని కరుణారసతరంగితాంతరం
గుండై యి ట్లనియె. 338

ఉ. ఓయి సుదామ! నీ వెచటనుంటివొ యేమి పొనర్చుచుంటివో
యే యెడకైన నే విన నొకింతయు నీ వపు డట్లు దేశికా
జ్ఞాయుతుఁడై గృహంబునకు సాఁగి భవత్సదృశోత్తమాంగనః
బ్రేయసి గా వరించి విధిదృష్టవిధిః గ్రహియించితే సఖా. 339

తే. ఏ నెఱుంగుదు నీచిత్త మెపుడు కామ
హతము కా దని ధనమందు నాస నీకుఁ
గలుగఁ బో దని యిట్టిచోఁ గాల మెట్లు
ద్రోయుచుంటివొ విస్మయ మోయి సఖుఁడ. 340

సీ. కోరిక లేకుండి కొందఱు విషయవా
సనలు లేకుండియు సత్క్రియలను
లోకసంగ్రహమునకై కొని నేఁ జేయు
నట్లు చేయుచునుందు రనుదినంబు
మనగురుకులవాస మును స్మరించెదు కదా
తరియించుటకు గురు చరణమె సుమి

ఒక్కాణు=సరిపడు, తగు; సుబ్బగ=బయటపడఁగ;

కన్న వాఁ డుపనయనౌన్నతి గలిగించి
నతఁడు జ్ఞాన మొసఁగునతఁడు గురులు
తే. వీరిలో జ్ఞాన మిచ్చినవిజ్ఞుఁ డరయ
నుత్తముండు భవార్ణవ ముత్తరించి
ముక్తిఁ బొంద నగునట్టి పురుషవరుని
సేవ యే సర్వసుకృతముల్ సేయు టరయ. 341

మ. గురుశుశ్రూషను దృప్తిఁ బొందునటు లే గుర్విజ్యలన్ దేవతా
పరిచర్యన్ పరివశ్యలన్ దపమునన్ బ్రహ్మవ్రతప్రక్రియన్
బరితృప్తిం గొనఁ బోను నీమనమునన్ బ్రాణ్యాల కెల్లప్పుడున్
గురునిన్ ధ్యానము సేయుచుండు కదవే గోత్రామరగ్రామణీ. 342

సీ. ఒకనాఁ డుపాధ్యాయు నువిద యింధనములు
లేవు తెం డని మనతో వచింప
మన మడవికిఁ బోయి మసలుచున్నప్పుడు
ప్రళయంబుగా గాలివాన వచ్చె
నాలో విభాకరుఁ డస్తంగతుం డయ్యెఁ
గటికచీఁకటి దెసల్ గ్రమ్ముకొనియె
మిట్టపల్లము లేకమట్టమై నీ ర్నిండె
మిన్ను మ న్నెఱుగదు కన్నుఁదోయి
తే. జడమయం బగునక్కారు టడవియందు
ది క్కెఱుంగను లేకుండ దేవుకుపడి
సంభ్రమించుచు మన మొక్కచక్కి నిలిచి
నొండొరుం గట్టుకొని యుంటి మొయ్య నొయ్య. 343

వ. అంతఁ గొంతలో సూర్యోదయసమయంబునకు వాతవర్షంబు శాంతిం
చుటయు నాచార్యుఁడగుసాందీపని తోఁపనివాఁడై నలుగడ నరయుచు
వచ్చి యుచ్చైస్స్వరంబునం బిలుచుచు మన మున్నచో టరసికొనుచు
వచ్చి వలిగొట్టి పడియున్నమనలం జూచి. 344

తే. అకట నాకయి ప్రాణము లాస గొనక
మిక్కిలిగ దుఃఖమున కైతి రిక్కరణిని
దేహ మర్పించితి రిదియే తెలిసికొనఁగ
గురునకుం జేయుశుశ్రూష గురుతరంబు. 345

ఆ. శిష్యులార నేను చిత్తంబునం గడు
సంతసించినాఁడ సత్యము లగు
మీమనోరథములు మీచదు విహపర
సాధనంబ యగుచు సార్థక మగు. 346

వ. అని యుపాధ్యాయుండు మనల నాశీర్వదించె మఱియు నిట్టు లెన్నో
గురుకులంబునం జరిగినవృత్తాంతంబులు కల వనినఁ గుచేలుండు
బ్రహ్మానందభరితాంతరంగుండై దేవా నీకు సహాధ్యాయుండనై
గురుకులవాసముఁ జేసిననాకు సాధింపరానికార్యం బేది యుండుఁ
నీవు పరాత్పరుండవు పరంజ్యోతివి పరమాత్ముండవు నీవు లోకవిడంబ
నార్థ మి ట్లవతరించి విహరింతువు నీ కిదే వందనం బనిన సర్వజ్ఞుం
డగుసర్వేశ్వరుండు నవ్వుచు నతని కి ట్లనియె. 347

చ. ద్విజవర నా కుపాయనము తెచ్చితివే యది కొంచె మైన యే
నిజముగఁ గొండయంత యయి నెమ్మదికిన్ ముదమున్ ఘటించునీ
వజకులదీప భక్తుఁడవు వాప్తుఁడ వుత్తముఁ డౌటఁ జేసి భ
క్తజనుఁడు కానివాఁ డిడినద్రవ్యము మేరువ యైనవ్యర్థమే. 348

తే. భక్తిచే నాకు నెవ్వఁడు పత్ర మైనఁ
బుష్ప మైనను ఫల మైనఁ బుడిసెడుజల
మైన నిచ్చునో ప్రియతాత్ముఁ డైననేను
దాని భుజియింతు నెంతయుఁ దత్పరతను. 349

వ. అని పలికినం గుచేలుండు వ్రీడితుండై శిరంబు వంచుకొని శ్రియఃః
పతికిఁ బృథుకంబు లీఁ జాలక జాలింబడి యున్న సర్వభూతాంత
ర్యామి యగునతం డంతయు నెఱింగి నాకు మిత్రుం డగునితండు
శ్రీకాముఁడై మున్ను నన్ను సేవింపఁ డిప్పుడు పత్నీప్రేరితుండై వచ్చె

వీనికి మనుష్యదుర్లభంబు లగుసంపద లిచ్చెద నని నిశ్చయించి కుచేలా నీచింపిం గల దది యేమి చూత మని యందుం గలపృథుక తండులంబులం గ్రహించి బ్రాహ్మణోత్తమా నీ తెచ్చిన యీపృథు కంబులు పరమప్రీతిఁ ఘటించిన వని యొకగుప్పెడు తీసికొని భక్షించి రెండవగుప్పెడు గ్రహించి భుజింపనుండు నంతలో రుక్మిణీ దేవి సత్వరయై సర్వేశ్వరుని హస్తమును బట్టుకొని వారించుచు ని ట్లనియె. 350

ఉ. తిన్నవి చాలు నీతినుట దేవసమప్రతిభుం డితండు స
ర్వోన్నతసంపదంచితశుభోజ్వలుఁడై బలుఁపొందు నీపయిఁ
గొన్న మెసంగితే నిపుడు కొంపయు గోడును వీడి వీనియిం
ట న్నివసింప వచ్చెడిని నా కని నీ కిటు విన్నవించెదన్. 351

వ. అని ప్రార్థించిన నౌ నని కృష్ణుండు ద్వితీయముష్టిఁ భక్షింపఁ డయ్యె నయ్యెలాదేవుండు నారాత్రి కృష్ణమందిరంబున సుఖభోజనంబు గావించి తన్నుఁ గృతార్థునిగ నెన్నుకొనుచు మరునాఁ డరుణోద యంబున లేచి కాల్యకరణీయంబులం గావించుకొని వాసుదేవునికిం జెప్పి యప్పురుషోత్తమునిచే ననిపించుకొని నిజాలయంబునకు నిర్గమించె.

చ. నడచుచు మార్గమధ్యమున నా కిడఁ జూడఁడు కృష్ణుఁ డర్థమే
నడుగుట కిష్టముల్ సలుప నైతిని ద్రవ్యము మాట కేమి మి
త్రుఁడు జగ దేకవల్లభుఁడు శ్రీయరువాక్షుఁడు నాకు దర్శనం
బిడె నదె చాలు నామదికిఁ దృప్తి ఘటిల్లెను జెల్లె హర్షముల్ 353

సీ. నాభాగ్య మే మందు నన్ను లక్ష్మీనివాస
మైనవక్షస్థలమందుఁ జేర్చి
కటికిదరిద్రుని గాఢపరీరంభ
మొనరించి నాకాళ్ళు లొత్తెఁ దాన
పేదను నే నేడ వేదవేద్యుఁడు విష్ణు
మూర్తి నాపదములఁ మొక్కు టేడ

ప్రియురాలు సేవింప వెలసినపాన్పున
నిలిపి సన్నన్నా గొలిచె నిలిచి

ఆ. తాను గాక తనమతస్వాంగిచేతను
జామరంబు వేయ సలిపె నఖిల
లోకనాథుఁ డఖిలలోకైశ్వర్యం బింత
కెచ్చియుండుభాగ్య మేది కలదు. 354

శా. నాకున్ భక్తుఁ డితండు మోక్షపదమొందన్ జాలు సామ్రాజ్యనే
లోకంబున్ మది నెంచఁ బోక మదమున్ లోఁ బూని సంసారఘో
రాకూపారమునందుఁ గూలు నని నాకర్పింపఁ డర్థంబు సు
శ్లోకుం డాతఁడు నాపయిం గరుణ గల్గుం బ్రాతుసందుం బలెన్. 355

వ. అని నిజాంతరంగంబునఁ జింతించుచు గృహాంతికంబునకుం జనినంత సూర్యానలేందు సంకాశవిమానసహస్రావృతంబును కూజద్ద్విజకులాకలవిచిత్రోపవనోద్యానవిరాజితంబును సముత్ఫుల్లకుముదాంభోజకల్హారవారిపూరసరోవరసముచితంబును నానాలంకారాలంకృతస్త్రీపురుషసేవితంబు నగునిజభవనంబుం గాంచి యిది యెవ్వరిస్థానంబు దీని నేనెప్పుడుం జూచియుండ నని తనలోఁ దా నాలోచించుచు నున్న యంతలోన. 356

—◆ కుచేలుని మహదైశ్వర్యము ◆—

సీ. దేవకాంతలఁ బోలుస్త్రీలును బూరుషుల్
సముచితగీతవాద్యములతోడ
నెదురు గా వచ్చి రయ్యది విని తత్పత్ని
సంతోషసంభ్రమాక్రాంత యగుచు
నాలయంబుననుండి లీల శ్రీదేవి నాఁ
జనుదెంచెఁ బతిఁ జూచుమనముఁ జేసి

హర్షాశ్రులోచనయై భర్తకుఁ జెయిసాఁచి
గాఢపరిరంభకలనఁ దేల్చె

తే. అపుడు శ్రీదాముఁ డమరాంగనావృత యగు
దేవిపోలిక వెలుఁగుపత్నినిఁ గనుఁగొని
స్వర్ణమణిభూషితం బగుసదనముఁ గని
లోన నెఱఁగంది వెలఁదితోఁ లోని కరిగె. 357

వ. ఆదివ్యభవనంబునందు బయఃఫేనని భశయ్యాతలంబులును రుక్మపరిచ్ఛదంబులును రుక్మపర్యంకంబులును హేమదండచామరవ్యజనంబులును హేమాసనంబులును మృదూపస్తరణంబులును ముక్తాదామవిలంబివితానంబులును స్వచ్ఛస్ఫటికకుడ్యంబులును మహామరకతసముంచితంబులును రత్నదీపభ్రాజమానంబులును లలనారత్నసంయుతంబులుం గలిగి సర్వసంపత్సమృద్ధంబు లగుప్రదేశంబులం జూచి కారణం బెఱుంగంజాలక యిది యంతయు యదూద్వహునిదర్శనభాగ్యంబు గాని మఱియొండు గా దతం డడుగకున్న నంతెయు నెఱింగి యిట్లుగా ననుగ్రహించె నని నిశ్చయించుకొని భగవంతునిచరిత్రంబుల కద్భుతంబు నొందుచు నెందు నతిలంపటుండు గాక సుందరాంగిం గూడి సర్వభోగంబు లనుభవించుచుఁ బెద్దకాలంబు జీవించి పిమ్మట. 358

క. భగవత్సేవ్యుఁడుం డగునా
సుగుణాలంకారుఁ డైన క్షోణీసురుఁ డ
ట్లగుసంపదలఁ బొరయుచు
భగవంతుని లోనఁ గలసె భక్తుం డగుటన్. 359

క. ఈపృథుకాఖ్యానము విన
నేపురుషునిచిత్తమందు నిచ్చ దగులు నా
శ్రీపతిభక్తుఁడు ముక్తుం
డై పరమపదంబు నొందు నతిభక్తుండై. 360

వ. అని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని
సూతు నడుగుటయును. 361

## ఆశ్వాసాంతము

ఉ. లే దనృతోక్తి లేదు వెఱ లేదు ఖలత్వము లే దధర్మముం
లేదు పరాపవాదమును లేదు దురూహము లేదు దైన్యముం
లే దన కిచ్చు నర్థులకు లిప్సలొలందిగ సాగి సూర్య భా
తీ్రదయితుండు కర్ణునకు దీ టన వచ్చి సిరిం బ్రివర్ధిలుం. 362

క. నీవాఁడ నన్న వారిఁ
భావంబునఁ గరుణఁ జేసి పరిరక్షణముం
గావించు సాగిసూర్య
క్ష్మావరుఁ డింపొందుఁ గాత కలకాల మిలం. 363

## గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమస్కంధమునం దుత్తరభాగంబున
ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

—:౦:—

శ్రీ ర స్తు

# శ్రీ కృ ష్ణ భా గ వ త ము

## ద శ మ స్కం ధ ము

### ఉ త్త ర భా గ ము

### తృ తీ యా శ్వా స ము

—:0:—

క. శ్రీకృష్ణానుగ్రహమున
శ్రీకృష్ణునిభాగవతము కృతి నొంది శుభ
శ్లోకుం డగుసాగిసూర్య
త్మ్యాకాంతుఁడు చెన్నుమీఱు సంపద్గరిమన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు చెప్పి శుకుం
డనంతరకథావిధానం బిట్లని చెప్పం దొడంగె. 2

—♦ శ్రీకృష్ణుఁడు సపరివారముగా గ్రహణస్నానమునకుఁ బోవుట ♦—

సీ. అలద్వారకాపురమందు సుఖంబున్న
రామకృష్ణులు జగద్రక్షణపరు
లై యుండ నొకకాలమందు సూర్యోపరా
గము ప్రళయం బట్లు గాన వచ్చెఁ
బ్రజలు దాని నెఱింగి భక్తిఁ బుణ్యము సేయు
వా రగుచు స్యమంతపంచకమునఁ
బొనరుకురుక్షేత్రమునకు నేగిరి మున్ను
పరశురాముఁడు క్షత్రవరులఁ దున్మి
తే. వారిరుధిరౌఘమున నటఁ గోరికిమెయి
నేను మడుఁగులు గావించి తా నటఁ బిత్రృ

---

ప్రళయంబట్లు=అనఁగా సర్వగ్రాసగ్రహణమని వ్యాఖ్యానము.

తర్పణంబులు గావించి తత్స్థలమునఁ
గ్రతువు లొనరించెఁ బాపముల్ గడచిపొంగి. 3

వ. తీర్థయాత్రాప్రచణశీలురై భారతీయు లెల్లరు నాసూర్యోపరాగపుణ్య కాలంబున శ్యమంతపంచకంబునకుం బోయి యున్నయవ్వాడు గద ప్రద్యుమ్న సాంబ సుచంద్ర శుక సార ణానిరుద్ధ కృతవర్మాదులు పురరక్షార్థము నియుక్తులై యుండ వసుదేవాక్రూరాహుకప్రభృతు లు రథంబుల హయంబుల గజంబుల నెక్కి పరివారపరివృతులై పయనం బయినవారిం గూడి బలరామకృష్ణులును భార్యాసహితులై శ్యమంత పంచకక్షేత్రంబునకుం జని. 4

సీ. రామహ్రదంబుల రామలతోఁ గూడి
స్నానంబు గావించి సంధ్యవార్చి
వస్త్రండి ద్విజులకు వరధేనురుక్మవ
స్త్రాదిదానంబుల నాచరించి
కృష్ణబోధితు లయి వృష్ణివర్యులు వృక్ష
విటపుల నీడల విశ్రమించి
యటకు సమాగతు లైనసుహృద్బంధు
సందోహమును గాంచి సంతసించి

తే. రండుఁ గోసలకురుసృంజయాదిదేశ
పతులఁ బెక్కుర నందాదిబంధువులను
గోపగోపీజనంబును గూడఁబడుట
నొండొరులు సమ్మదము నొంది రుల్లమందు. 5

మత్త. కుంతిభోజునిపుత్రికామణి కుంతి యక్కల నన్నలన్
సంతతిం గని సంతసించుచు స్వాగతంబులు పల్కుచున్
గొంతలోఁ దనచెంతఁ జేరిన గోపబాలునిఁ గృష్ణునిన్
వింతచూపులఁ జూచె నల్లన వీపుఁ దట్టుచు నల్లునిన్. 6

ఉ. అన్ననుగాంచి యిట్లనియె నార్య! విపత్పతితాత్మబంధులన్
గన్నులఁ జూడకున్న నెటు గా నయితో యనుచుం దలంపఁ బో

వెన్నఁడు దైవవంచితుల నెల్లప్పుడున్ ధరణిన్ సుహృజ్జనం
బన్నలు తమ్ములున్ గనఁగ నైనఁ దలంపరు చుట్ట లెల్లరున్. 7

తే. అనుడు వసుదేవుఁ డనియె నోయమ్మ నీవు
మాపయిం గోపగింపకు లోక మెల్ల
నీశ్వరాధీనమై యుండి యెప్పుడు కాల
గర్భమున నాట లాడించుఁ గాదె తల్లి. 8

— బంధుజను లన్యోన్యకుశలప్రశ్నములు చేసికొనుట —

ఉ. చెల్లెల! లోకకంటకతఁ జేకొని కంసుఁడు హింస పెట్టుటన్
జెల్లనిదిక్కులం దిరిగి జీండ్రము పాలయి క్రిస్సి క్రుస్సి మే
మెల్లర మిప్పు డిప్పుడె కదే తలతెత్తుచు నిండ్లు వాకిళుల్
తల్లులఁ బిల్లలన్ గనఁగ దైవ మొనర్చెను జెప్ప నేటికిన్. 9

వ. అంత వసుదేవోగ్రసేనాదు లాయాదేశపురాజులం బూజించి ద్రోణ
ధృతరాష్ట్రాదులు పుత్రులతోడం గూడినగాంధారియుఁ బాండవ
సహిత యగుకుంతీదేవియు సంజయ విదుర కృప కుంతి భోజ విరాట
భీష్మక నగ్నజి త్పురు ద్రుపద శైబ్య దృష్టకేతు కాశిరాజ దమఘోష
విశాలాక్ష మైథిల మద్ర కేకయ యుధామన్యు సుశర్మాదులును
బాహ్లికాదిరాజేంద్రులును యుధిష్ఠిరు ననువ్రతులైవచ్చినవా రెల్లరు
శ్రీకృష్ణదర్శనం బాచరించి చరితార్థులై వానిపూజలం గొని ప్రీతి
యుక్తులై వారిం బ్రశంసించి పూజించుచుండి రా సమయంబున. 10

సీ. నందుఁ డాగ్రహాణంబునకుఁ గృష్ణముఖ్యులు
వచ్చుట విని తాను వల్లవులును
వనితలతోఁ గూడి వచ్చి యచ్చట వృష్ణి
వరులఁ గన్గొని మేనఁ బ్రాణము లవి
వచ్చిన ట్లగుటను బరిరంభణాదులు
గావించి రొండొరుల్ కౌతుకమున
వసుదేవుఁ డానందు డెసఁ బ్రేముడిం జేసి
పలుదెఱంగు లెసంగఁ బలికికొనియె

తే. రామకృష్ణులు పితరులు వ్రజపతులను
గౌఁగిలించియు మ్రొక్కియు గారవమున
సాశ్రుకంఠులై యుంట నల్కంతే గాని
మాటలాడఁగ నోపనివారు లయిరి. 11

క. నందుఁడును యశోదయు సా
నందంబునఁ గుచ్చి యెత్తి నందనులను వా
రిం దమతొడలం దిడుకొని
సందిటఁ గదియించుకొనిరి సానందముగన్. 12

వ. అంత దేవకీరోహిణు లానంద సుందరి సందిళ్ళం జేర్చి బాష్పకంఠ్యలై
స్నేహమ్మును స్మరించుచు. 13

మత్త. కన్నవారి నెఱుంగ కీరలె కన్నవా రని యున్నయీ
చిన్నబిడ్డల నీవు కన్నటు చేరఁ దీసి సతంబు ని
న్నెన్నో వచ్చిన వాని నన్నియు నోసరిల్లఁగఁ జేయుచున్
గన్న తెప్పవిధంబునం గని కాచి ప్రోచితి వీ వహో. 14

క. గోపికలు కృష్ణదేవునిఁ
జూపుల లోపలికిఁ జేర్చి చొక్కుచు మును ల
క్షై పరిరంభణముల నెం
తో పరవశ లగుచు మోద మొంది రెడందన్. 15

వ. కృష్ణుండు నట్లు బ్రహ్మానందపరవశలైనగోపికల వివిక్తంబునం గౌఁగి
లించుకొని నవ్వుచు ననామయం బడిగి యి ట్లనియె. 16

సీ. పెరచోటులం దుండి పెద్దకాలము మిమ్ము
కలియకుండిన మమ్ముఁ దలఁచు చుండెరి
యకృతజ్ఞు లని మమ్ము నాడిపోయరు గదా
కాలమే ప్రాపును గలుపు జనుల
నెం దున్న నాభక్తియే యున్న ననుఁ బొందఁ
గలిగినవారు గాఁగలరు జనులు

నే నెల్లజనులలో నిలిచియుండుదుఁ బంచ
భూతములట్టు లోపాలఁతులార
తే. అనుచు నధ్యాత్మవిద్యామహాత్మ్యమునను
దెలియఁ బోధింపఁ గోపికల్ తెలివి గలిగి
దేవ నీరూప మెప్డు మాభావములను
గోచరింపఁగఁ జేయు వే కొలుతు మెపుడు. 17
వ. అట్లు గోపికల ననుగ్రహించి శ్రీకృష్ణుండు దన్వాల యుధిష్ఠిరాదులకుశల
ప్రశ్నంబు గావించిన వారును. 18
క. నీపాదసేవచేయుచు
నీపద్యము లాలకించి నిరతము నిన్నే
ప్రార్థించి యుండువారికి
రూపింప నమంగళములు రోయఁగ నగునే 19
తే. అజయుఁ డవ్యయుఁ డచ్యుతుఁ డప్రమేయుఁ
డమలుఁ డాద్యంతశూన్యుఁడ వగుచుఁ బరమ
హంసలకు నిరంతరగతివై వెలుంగు
ఘనునకు న్నీకు మానమస్కారము లివె. 20

—♦ కృష్ణపత్నులు ద్రౌపదికిఁ దమతమ పెండ్లికథలం గథింగించుట ♦—

వ. ఇట్లున్నసమయంబున నంధకకౌరవాంగనలు సంఘమ్ముగాఁ జేరి
త్రిలోకగీతంబు లగు శ్రీకృష్ణునిచరిత్రమ్ము లభివర్ణించుకొనుచుండి
రప్పుడు ద్రౌపది కృష్ణభార్యలం గాంచి యోవైదర్భి! యోభద్ర!
యోజాంబవతి! యోకోసల! యోసత్యభామ! యోకాళింది!
యోమిత్రవింద! యోరోహిణి! యోలక్ష్మి! భగవంతుం డగు
నీవాసుదేవుండు మనుష్యలోకము ననుకరించుచు మిమ్ముఁ బెండ్లి
యాడినవృత్తాంతంబు విన నభిలషింతు వేఱువేఱం జెప్పుఁ డనిన
రుక్మిణి యి ట్లనియె. 21
మ. ననుఁ జైద్యుం డనువాని కిచ్చుటకు నన్నల్ తమ్ములుం దండ్రియున్
ఘనయత్నం బొనరించుచుండ బలు లౌహమ్మవాలు రెంతో బలం

బును గైకొం చెదరింప నందఱును సంస్ఫోటంబునం దోలి నన్
గొని పెండ్లాడినదేవదేవుని హరిన్ గొండాడెదం గొల్చెదన్. 22

వ. సత్యభామ యి ట్లనియె. 23

ఉ. తమ్మునిఁ జంపి మానికము దాఁ గొనె నం చపకీర్తి తండ్రి మో
సమ్మున మోప దానిని విసర్జనముం బొనరించుకోఁగ ఋ
క్షమ్మును గెల్చి రత్నమును గైకొని వచ్చి ముకుందుఁ డీయఁ జి
త్తమ్మున సిగ్గు నొందుచు నతం డిడ నీతఁడు పెండ్లియాడె నన్. 24

వ. జాంబవతి యి ట్లనియె. 25

తే. కృష్ణుఁడే రాముఁ డని తండ్రి యెఱుక లేక
యిర్వదేడుదినంబులు పో రొనరిచి
తుద కెఱింగి నన్ మణితోడ నీయ
నితఁడు నన్ గొనె దాసిఁగా నేలుకొనఁగ. 26

వ. కాళింది యి ట్లనియె. 27

క. తనపాదసేవఁ గోరుచుఁ
ఘనతప మొనరించునన్నుఁ గవ్వడివలనన్
విని నాదుపాణిఁ గొనె నా
తని కే నూడిగ మొనర్చుదానను దల్లీ. 28

వ. భద్ర యి ట్లనియె. 29

తే. న న్నొరున కీయ నెంచెదునన్నధముల
నితరరాజుల నిర్జించి మృగపతి వలె
నను స్వయంవరమునఁ దెచ్చుకొనియె నేను
హరికి నుడిగంపుదాసినే యని వచింతు. 30

వ. సత్య యి ట్లనియె. 31

తే. వరపరీక్ష నొనర్పఁగాఁ బలసినట్టి
యెడ్ల నేడింటి మాతండ్రియెదుట నిలువ

వాని నవలీల గెలిచి యీవాసుదేవుఁ
డందుకొని వచ్చె నన్ను నే నతనిఁ గొలుతు. 32

వ. మిత్రవింద యి ట్లనియె. 33

ఆ. మేనమామపుత్రుఁ డైనకృష్ణునకు నా
తండ్రి న న్నిడంగఁ దలఁచి పిల్చె
సేనతోడ నన్ను వీని కిచ్చెఁ హరి
కేను దాసి నైతి నింతె నిజము. 34

వ. లక్షణ యి ట్లనియె. 35

సీ. ఓదేవి నేను మున్నా దేవముని చెప్పఁ
విని కృష్ణుచరితంబు మనమునందు
వరియించితి దుహితృవత్సలుం డగురాజ
నకుఁడు బృహత్సేననరవిభుండు
వరమత్స్యయంత్రము పన్నె పై కదికనఁ
బడదు నీళులఁ గాన వచ్చుఁ గాన
నెందఱో చనుదెంచి యేయఁ జాలరు దాని
దుర్యోధనాదులుఁ దొలఁగి చనిరి

తే. పార్థుఁ డరుదెంచి జలముల వఱలుమత్స్య
బింబముం జూచి బాణము విడిచెఁ గాని
పైన వ్రేలాడుమత్స్యముఁ బడఁగ నేయఁ
జాలఁడయ్యెఁ బూర్వాభ్యాస సహితుఁ డయ్యు. 36

క. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు
తగ నొక బాణమ్ము వైచి దాని న్నఱకెఁ
తెగి పడియె నంత నే నా
జగదీశునిమెడను బువ్వుసర మిడితి సఖీ. 37

చ. అరదము మీఁద నన్ను నిడి యడ్డము వచ్చినశత్రురాజులన్
దురమున గెల్చి ద్వారకకుఁ దోడ్కొని వచ్చి వివాహ మాడె నో

గిరితనూజను సీసతులు కంజవిలోచనుఁ గొల్చువారమై
నిరతము నూడిగంబులన నిల్చెడువారమ మైతి మమ్మరో. 38

వ. అంత షోడశసహస్రస్త్రీ లి ట్లనిరి. 39

ఉ. భౌముని గెల్చి మే మచట బంధితలై తపియించుచుండఁ గా
నామెయి మమ్మెఱింగి ప్రణయంబునఁ దోడ్కొని వచ్చి ముచ్చటన్
మామొఱ లాలకించియుఁ గ్రమంబునఁ బెండిలియాడె నెల్లరన్
మేము తదీయదాస్యమున మేల్పడయుంగఁ దలంతు మెంతయున్. 40

—◆ నారదాది మహర్షులు శ్రీకృష్ణదర్శనము చేయుట ◆—

వ. అట్లు చెప్పిన విని పృథయు గాంధారియు ద్రౌపదియు భద్రయుం దక్కినరాజపత్నులును గృష్ణస్వామిభక్తురాం డ్రయినగోపికలును గన్నుఁగొలుకుల నానందబాష్పములు గ్రమ్మఁగొననాశ్చర్యమగ్నాంతరంగలై రంగనాథు నంతరంగంబునం గొనియాడుచుండి రాసమయంబున వాసుదేవదర్శనలాలసులై వేదవ్యాస నారద చ్యవన దేవల విశ్వామిత్రాసిత శతానంద భరద్వాజ గౌతమ పరశురామ వసిష్ఠ వామదేవ గాలవ భృగు పులస్త్య పులహాత్రి మార్కండేయ బృహస్పతి ద్విత త్రి తైకత బ్రహ్మపుత్రాంగిరోఽగస్త్య యాజ్ఞవల్క్య ప్రభృతు లెందఱో మహర్షులు హర్షోత్కర్షంబునం జేసి విచ్చేసి రప్పు డాసీనులై యున్నరాజన్యులును బాండవులును రామకృష్ణులును లేచి వారి కెదు రేగి స్వాగతములు పలుకుచుఁ దోడి తెచ్చి సుఖాసనాశీనులం జేసి రంతఁ గృష్ణుండు వారికి నర్ఘ్యపాద్యాదిషోడశోపచారంబులం జేసి బూజించి గంధానులేపనపుష్పమాల్యాలంకారాదు లాచరించి విశ్రమించియున్నవారిం గాంచి వినయంబునఁ జేతులు జోడించుకొని యి ట్లనియె. 41

సీ. మునులార మే మిట్లు జనన మొందినదాని
కిదె మీదుదర్శనమే ఫలంబు

సామాన్యజనులకు స్వల్పతపస్వుల
కరయ మహాముదు లైనవారి
దర్శనస్పర్శనదాస్యార్చనాదులు
ప్రాప్తించు టది మహాఫలము గాదె
పుడమి నమ్మయతీర్థములు శిలామయ దేవ
తలు పెద్దకాలంబు దాఁటినవయిఁ

తే. గాని పూతత్వమును గలుగం బొనర్పఁ
జాల వారయు మిముబోంట్లు సాధుజనము
దర్శనము చేసినంతనే ధాత్రిజనుల
నెంతయుఁ బవిత్రులుగఁ జేయు నింత నిజము. 42

ఉ. చుక్కలు నగ్ని చంద్రుఁడును సూర్యుఁడు నీళ్లును గాలి నేలయున్
వాక్కు మనంబు లోనయినవస్తువు లెల్ల నఘంబు వాప లే
వెక్కువ సేవ చేసిన నొకించుక మాత్ర భజింతు రేనియున్
మిక్కిలి మేలు గూర్చెదరు మీరు మహాత్ము లటంచు నెంచెదన్. 43

ఉ. ఇద్ధము కాని దేహమున నే నను బుద్ధి శిలాది దేవతా
బుద్ధి కళత్రమిత్రవరపుత్రులయందు స్వకీయ మిద్ది యన్
బుద్ధియుఁ గల్గి యెవ్వనికిఁ బూజ్యులయందు సుబుద్ధి కల్గ దో
యిద్ధర గర్దభం బనఁగ నేర్పడి యుండును వాఁడు చూడఁగన్. 44

వ. ఇ ట్లనీశ్వరత్వముం బ్రకటించుచుఁ గృష్ణుండు పలికిన విని శాంతవడి
కలవరంపడి యొం డాడ కూరకుండి లోకసంగ్రహార్థం బగు నావలుకులకు
నవ్వుచు మునులు జగద్గురుం డగునాతనిదిక్కు మొగం బై. 45

తే. ఏము విశ్వసృడాదుల కీశుల మయి
యుండి నీమాయలోఁ బడ నుంటి మకట
మానవత్వమునం జేసి నే నధీశుఁ
డన యుస వచించుచుంటి వోవనజనాభ. 46

తే. ఈవనీశుఁడవై జగ మెన్నగతులఁ
జేసి పెంచి నశింపఁగాఁ జేయుచుందు
చిక్కఁగొన వందు మృద్రూప మొక్కఁడైన
భౌమములు పెక్కు లగునట్లు పరఁగు దీవు. 47

ఆ. వేదరూప మైననీదగుహృదయంబు
స్వచ్ఛ మందుకతన బ్రహ్మకులము
శాస్త్రయోని యనుచుఁ జర్చించి పూజింతు
నీవు బ్రహ్మ మగుదు నీరజాక్ష. 48

తే. అరయ నిశ్శ్రేయసములకుఁ బరము నీవు
నీదుసాంగత్యమున మేము నిరతధన్య
తముల మైతిమి మావిద్య తపము జన్మ
మును సఫలతను గాంచె నో మునిశరణ్య. 49

తే. మాయ యనుయవనిక చేత మాటువడిన
నిన్నుఁ గాలస్వరూపకునిం దెలియఁగఁ
జాల రీ రట్టిపరమాత్మ సర్వశక్తి
యుక్తుఁ గీర్తించి సేవింతు మో ముకుంద. 50

—◆ వసుదేవుఁడు యజ్ఞము జేయింపుఁ డని ఋషులం గోరుట ◆—

వ. అని మును లనేకవిధంబులం బ్రస్తుతించి దాశార్హునియు ధృత రాష్ట్రయుధిష్ఠిరాదులయు ననుజ్ఞం గొని తమతమపొందుపట్లకుం బో మనంబుగావించి రప్పుడు వసుదేవుఁడు ప్రయాణోన్ముఖు లగువారిం జేర నరిగి నమస్కరించి యి ట్లనియె. 51

ఉ. ఓఋషివర్యులార! సకలోన్నతు లీరలు మీ కిదేనమ
స్కార మొనర్తు నానుడులు స్వాంతమునం దిడుఁ డేము కర్మముల్
దీరి పొనచ్చుటల్ మరితనిశ్చమ మెట్లగుఁ దెల్పుఁడీ యనన్
నారదుఁ డిట్లు పల్కు మునినాథులదిక్కు మొగంబు వెట్టుచున్. 52

సీ. సన్నికర్షము ప్రజాసంఘమున కనాద
రమునకు నెన్నఁ గారణమ యగును
గంగగట్టున నుండి గాంగతీర్థము మాని
శుద్ధి కితరతీర్థబుద్ధిఁ దిరుగు
నరునట్టు లీతఁడు పరు నఖిలేశ్వరు
నద్వితీయునిఁ గృష్ణు నవ్యయు నజు
మాయాగుణాన్వితమర్త్యావతారుఁ గా
మబ్బు గప్పినసూర్యమండల మటు
తే. తెలియఁ జాలనివాఁ డయి దిక్కు లరయు
ననుడు మునివర్యు లెల్లరు వినుచునుండ
రామకృష్ణులసన్నిధిఁ బ్రేముడి మెయిఁ
బలికెఁ రానకదుందుభిం బిలిచి యిట్లు. 53

—♦ నారదాదులు వసుదేవునిచే యజ్ఞము చేయించుట ♦—

చ. క్రతువులు చేసి శ్రద్ధమెయి కర్మవిభుం డగువిష్ణుఁ గృష్ణునిన్
వ్రతనియతిన్ భజించినను వానికి సంచితకర్మబంధముల్
చితికి నశించు నంచు శ్రుతి చెప్పెడు నియ్యది మోక్షయోగమై
స్తుతులకు నెక్కు ధర్మ మని సూరివరేణ్యు లొనర్చుచుం డిరిన్ 54
క. ఇది స్వ స్త్యయనపదంబున్
సదమలమతి శుద్ధవిత్తసంకలితం బై
పొదలింపఁ బడిన గృహికిన్
మది సంతస మందు లోకమాన్యుఁడు జగతిన్ 55
తే. యజ్ఞదానాదివిధుల విత్తైషణయును
గృహవిధులఁ జేసి దారపుత్త్రైషణయును
నరుగుటం గాల మాత్మలోకైషణయును
విడువవల యును విబుధుఁ డో పుడమిఱేడ 56

తే. యజ్ఞ మధ్యయనము పుత్త్రుఁ డనెడుమూట
దేవమునిపితృణంబులు దీర్చి వెనుక
గృహము విడ నగు నట్లుగా కెవ్వఁడు ఋణిగ
నేగు వాని కధోగతులే కల వగు. 57

ఉ. ఓవసుదేవ! నేఁస్తు వయి యుండి పితౄణము దేవతాఋణం
♦బోవగఁ దీర్చి నా డవిఁ క నున్నది దేవఋణంబు దానిని
శ్రీవెలయంగ యజ్ఞములచేఁ జన జేసి గృహంబు వీడ నౌ
నీవు మహాపవిభావనిధి వీర్యుఁ గంటివి బొజ్జ పండగన్. 58

వ. అని చెప్పిన మునివచనంబులు విని వసుదేవుండు వారికి వందనం
బాచరించి మీయాజ్ఞం జేసి నే నధ్వరంబు గావించెద మీరు ఋత్వి
క్కులు గానుండ వరించెద ననిన వారును. 59

సీ. వల్లె యంచు స్యమంతపంచకంబున యజ్ఞ
శాలలు వేయించి సవనదీక్ష
వెలయించి రపు డెల్ల వృష్ణులు జల మాడి
ధౌతవస్త్రంబులు దాల్చి రెల్ల
మహిళాజనము గంధమాల్యానులేపన
ములు దాల్చి కానుకల్ వెలయఁ బూని
శాలాప్రవేశముల్ సలిపిరి బహువిధ
వాద్యముల్ మొఱసెను వారసతులు

తే. నాట్యములు సల్పి రుత్తమనాయకులు ప్ర
సన్నగాన మొనర్చి రాసమయమందుఁ
బదియు నెనమండ్రు ఋత్విజుల్ సదమలవిధిఁ
దీర్థమాడించి రా వసుదేవవిభుని. 60

. స్నాతలై పూత తాసాధ్వీమణులతోడ
దీక్షఁ గైకొనె వసుదేవుఁ డపుడు

♦ ఓవఁగ=సరిపడునట్లుగ

కౌశేయవసనముల్ గట్టిరి ఋత్విజుల్
బలకృష్ణు లరుదెంచి నిలిచి రచట
విధివిధంబుగ నగ్ని వేల్చి రగ్నిష్టోమ
సవసంప్రదాయము సాంగ నయ్యె
దక్షిణాకాలసందర్భమునందు గో
భూహిరణ్యాదులు భూసురులకు
తే. ఈయఁ బడె నంతలో నవభృథముఁ జేసి
దీక్షితుఁడు స్నాతుఁడై యెల్ల దేశజులకు
నన్నదానము గావించె నంత నెల్ల
ప్రజలును ననుజ్ఞఁ గైకొని పయన మైరి. 61

వ. అంత ధృతరాష్ట్రాదులును నారదాదిమహర్షులును మఱియుం గల బంధువర్గంబును వారివారి దేశంబులకుం జనిరి నందుండును బలరామ కృష్ణాభినందితుండై సహ బాంధవంబుగా బృందావనంబునకుఁ బయనం బయ్యె నప్పుడు వసుదేవుండును మనోరథమహార్ణవంబు దాఁటి సంత సించుచు బలరామకృష్ణులచేఁ బ్టువఱపంబడు నందునికరంబు పట్టి కొని యి ట్లనియె. 62

చ. జనులకు స్నేహపాశ మది సాంద్రతరం బగు బంధమై కదుల్
వనట నెనంగఁ జేయుచును బాంధవముం బొనరింపఁ జేయు నో
యనుజుఁడ నీకు నాకుఁ గలహార్దము దైవవినిర్మితం బెనం
డను మనలో ఫలం బనఁ గడుంగడు రోతగఁ జూచునే కదా. 63

తే. ఇట్లు వసుదేవుఁడును నందుఁ డెసక మెసఁగు
స్నేహ బాంధవ్యమునఁ జేసి చిత్రవిభ్ర
మంబు గలిగినమచ్చిన మైత్రి నడపి
విడఁవఁ జాలక కొన్నాళ్లు విడిచి రపుడు. 64

క. నందుఁడు రామునకును గో
విందునకును మాఱువలుక వెఱవరి యైనన్

విందగువసుదేవున కే
చందంబును బలుక లేని సఖ్యమువలనన్. 65

వ. సతీజనసహితుండై నాఁటికిఁ బయనంబు నాఁగి నేఁడు రే పనుచు
మూఁడుమాసంబులు వసుదేవు నింట నుండి వసుదేవాక్రూరబలోద్ధవ
కృష్ణప్రభృతు లొసంగినపారిబర్హంబులం గొని విడువలేక వారిని
విడిచి సపరివారంబుగ నిజపురంబునకు నిర్గమించెఁ బాండవులును గుంతీ
సహితులై కృష్ణాదులయనుజ్ఞ వడసి తమజనంబులతో నెల్లరు నింద్ర
ప్రస్థపురంబునకుం జని రనంతరంబ. 66

ఉ. ♦ వార్షికవాసరంబు లవి వచ్చెఁడి నం చని వృష్ణివల్లభుల్
ఘర్షణముం బొనర్చి యట కాపుర మొప్పమి నిశ్చయించి పెం
హర్షముతోఁ బ్రయాణమగు ద్వారకకుం జని రెల్లవారికిన్
తర్షము హెచ్చ నుత్సవవిధానములుం గడు విస్తరిల్లగన్. 67

క. వసుదేవయజ్ఞవిధమును
వసుధాధీశ్వరులు బంధువర్గము సఖులున్
బొసఁగఁగ వచ్చుట లొండొరు
లసదృశముగఁ జెప్పుకొనిరి హర్ష మెసంగన్. 68

మ. వసుదేవుండును దేవకీరమణియున్ వర్తింప నొండొక్కచోఁ
బ్రసమీక్షింపఁగ రామకృష్ణు లటకున్ బచ్చారులై వచ్చి స
త్యసమేతం బగుభక్తిభావమునఁ దత్పాదంబులన్ వ్రాల మే
లెసఁగన్ వారలఁ గౌఁగిటం దనిపి వా రెంతేని హర్షంబునన్. 69

వ. ఉపలాలించుచున్నసమయంబున వసుదేవుండు దేవమునివచనంబులం
జేసి పుత్త్రప్రభావం బెఱింగి యున్నవాఁడు కావున జాతవిస్రంభుండై
వారి కిట్లనియె. 70

—♦ వసుదేవుఁడు రామకృష్ణుల నభినందించుట ♦—

ఉ. మీరు ప్రధానపూరుషు లమేయపరాక్రమవిక్రముల్ మిమున్
నారదముఖ్యమౌనివచనంబులఁ జేసి యెఱింగి కొంటి మో

♦ తర్షము=ఇచ్ఛ; పచ్చారులై=పదచరులై;

భూరితరప్రభావపరిపూర్ణమహత్త్వవిశేషులార! యె
వ్వారిహి నేది సేయఁ దగు నెల్ల నెఱుంగుదు రేమి చెప్పఁగన్. 71

తే. మీకుఁ బరమేశ్వరత్వము లోకవిదిత
మీరు సృష్టిస్థితిలయంబు వేఱుపడఁగఁ
జేయుచుండెడివార లమేయవిక్ర
మక్రియలు మిమ్ము వర్ణింప మాతరంబె. 72

ఉ. మీపరకాంతి సూర్యుఁడయి మెర్మయి చంద్రుఁడు చుక్కలగ్నియై
భూవలయంబు నిండుకొని పొల్పెసలారుచునుండు మానులున్
దేవతలున్ బ్రపంచములు దేవరరూపము మీరు గాక లో
కావిధ మైన లేశము సమీక్షణముం బొనరింప లేదెటన్. 73

ఉ. నే నిది నాది నాసుతుఁడు నెచ్చెలి నాగృహ మంచు నజ్ఞుఁడై
మానవుఁ డాత్మభావమున మాటికి నెంచు నహంకరించెడున్
గాని సమస్త విశ్వేశ్వరుఁడు గాఁ దలపోయఁగ లేక సంసృతిన్
మానక పోవు నస్థిరత మానసముం దెలుగం డొకప్పుడున్. 74

శా. సాక్షాదీశ్వరు లెల్లలోకముల నిచ్చం బ్రోచువా ర్మీరు దు
ష్టక్షత్రక్షపణం బొనర్చి బహుళక్ష్మాభారముం బాపి శి
ష్టక్షేమంకరులై తలిర్చుటకు నాసద్మంబునం బుత్రులై
వీక్షింపం బ్రభవించి నట్టిరు మిమున్ బేర్కొ నెవం డోపెడిన్. 75

మ. అలనూతీగృహమందుఁ జెప్పితివి కావా నే నజుండన్ మహో
జ్జ్వలధర్మంబు సముద్ధరించుటకునై జన్మింతు నాయాయుగం
బుల నం చీవు పరాత్పరుండవు నినుం బోలింప లే కేము బం
ధులసద్రీతిఁ దలంతు మజ్ఞలము మాదుఃఖంబులం బాపవే. 76

వ. అని యనేకవిధంబులం బలికినతండ్రిపలుకు లాలకించి భగవానుం డగు
సాత్వతర్షభుండు నవ్వుచు నముగ్రుండై మృదుమధురంబుగా నిట్లనియె.

ఉ. నీనుడి యొప్పి యున్న దని నేను దలంచెద నయ్య మమ్ము నీ
సూనుల సిట్లు పేర్కొనుచుఁ జొప్పడఁ జెప్పితి తత్త్వసంగతుల్

ఁ నిని నేము మీరు మఱి నీటను గల్గినవారు నందఱుం
గానఁగ నీశ్వరాంశమునఁ గల్గినవా రని చెప్పఁ నొప్పెడిన్. 78

ఆ. ఏక మద్వితీయ మై కానఁబడునాత్మ
తనసృజించినట్టితనువు లెల్లఁ
దాన యగును వహ్నిసన్న కానంగనై ఘటా
ద్యాకృతుల నభిన్న మైనయట్లు. 79

వ. అని దేవదేవుండు సోదాహరణంబుగఁ జెప్పినవసుదేవుండు వినష్ట
మనస్కుండై సంతసించుచు నూరకుండె నంత దేవకీదేవి తనకొమాళ్లు
వారు మృతులైనగురుకుమారుం దెచ్చియిచ్చినవృత్తాంతంబు విని
యున్నది కావునఁ కంసనిహతు లగుతనతనయులు జ్ఞప్తికి వచ్చుటం
జేసి కంట నీరు వెట్టుకొనుచు రామకృష్ణులం బిలిచి యి ట్లనియె. 80

శా. ఓయోగేశ్వర! కృష్ణ! యోహలధరా! యుల్లంబునం దేను మీ
స్థాయత్తేజ మెఱుంగుదున్ సకలవిశ్వప్రాప్తిసంహారముల్
చేయం గర్తలు దుష్టులం దునిమి నీలీలన్ ననుం బ్రోవఁగా
నాయీగర్భమునం జనించితి రిటన్ నాభాగ్య మల్పం బొకో. 81

చ. మిము శరణంబు వేఁడెద నమేయపరాక్రములార! యెప్పుడో
యమసదనంబునన్ మెలఁగునట్టిగురూత్తమపుత్రుఁ దెచ్చి మీ
రమలినభక్తి దేశికున కప్పనముం బొనరించి నట్టి రే
మిము నుతియింప నొప్పదు నె మీరు గణింపఁ బురాణపూరుషుల్.

మత్త. నేను దేశికునట్లు వేఁడెద నీచకంసునరాజికిన్
బ్రాణముల్ విడి పోయి కాలునిపత్తనంబున నున్న నా
సూనులన్ గన నిచ్చఁ జేసితి సూరివన్ద్యులు మేలు నా
మానసాధి యడెల్లఁ దీఱఁగ మాధవా! మధుసూదనా! 83

— రామకృష్ణులు మృతు లైనసోదరులం దెచ్చుట —

సీ. అని తల్లికోరిన నారామకృష్ణులు
యోగమాయంజేసి వేగగతుల

సుతలంబునకుఁ బోవఁ జూచి దైత్యేంద్రుఁడు
బలి యింద్రసేనుఁడు భక్తపరుఁడు
సాన్వయుం డయి లేచి యఖిలేశు లైనవా
రల కెదు రేగి యర్ఘ్యం బొసంగి
♦తోడి తెచ్చి పర మాస మిడి వారిపాదముల్
కడిగి శీర్షమునందుఁ గడకఁ దాల్చి
తే. వస్త్రమాల్యగంధానులేపనము లొసఁగి
ధూపదీపనైవేద్యముల్ తొడరి చేసి
తత్పదాబ్జము భక్తిమైఁ దలను దాల్చి
హృష్టరోమాంచితాంగుఁడై యిట్లు పలికె. 84
తే. సాంఖ్యయోగవితాన కృష్ణ పరమాత్మ
సచ్చిదానందరూప! విశ్వప్రపంచ
ధారణానంతరూప! విద్యాధరా! ప
రాత్పరా! నీ కిదే మ్రొక్కు రామకృష్ణ. 85
తే. యోగిదుష్ప్రాప మైననీభాగవతను
రూపదర్శన మయ్యె నాపాపసమితి
సమసె నంతయు నేధన్యతముఁడ నైతి
నేమి చెప్పుదు నాభాగ్య మింత యనుచు. 86
సీ. సాధువులకుఁ గాక సామాన్యులకు భవ
త్సత్కృతదర్శనము సుదుర్లభంబు
అందు మేము రజస్తమోన్వితులము మాకుఁ
గలుగుట యాదృచ్ఛికంబె తెలియ
దైత్యదానవులు గంధర్వులు సిద్ధవి
ద్యాధరాదులు నీకు నరిత నొంది
సాలోక్యసారూప్యసామీప్యములు గాంచి
ముక్తి నొందిరి నీదురక్తిఁ జేసి

♦ ఆసము=ఆసనము; వితానము=నిరివి;

తే. మఱియు భక్తిఁ గొందఱును గామమునఁ గొంద
ఱును ముముక్షులఁ గాంచి రో వనజనాభ
యోగులు నెఱుంగ లేరు నీయోగమాయ
యే మనఁగ నెంతవార మో యిద్ధతేజ. 87

తే. ననుఁ బ్రసన్నుఁడవై కను నిను భజింప
కంధకూపము నాబడునాలయమును
విడి తరులక్రింద రాలిన వెగడు టాకు
లిన్ని తినుచును నినుఁ గొల్వ నెంతు నెమ్మిఁగ. 88

ఆ. నన్ననుగ్రహింపు మెన్ని నాపాపముల్
పాయఁ జేయు మేఁ బ్రసన్నుఁడ వయి
నిన్నుఁ గొల్చుచుందు నిఖిలలోకేశ్వర
నేను గింకరుండ నీకు దేవ. 89

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 90

క. స్వాయంభువమన్వంతర
మై యుండినయప్పు డూర్ణ యనుసతియందుఁ
శ్రీయుతుఁడు మరీచికి సుతు
లై యాఱ్వురు పుట్టి రట్టియవసరమందుఁ. 91

ఉ. అంబుజసంభవుండు తన కాత్మజ యైనసరస్వతీసతిఁ
ముమ్మర మైనమోహమున ముట్టి రమించుచునుండఁ గాంచి చి
త్రంబున రోసి వార నగిరి దాన విధాత శపించె నందునఁ
డంబతి యూర్ణపుత్రకు లనంత జనించిరి రాక్షసాకృతిఁ. 92

వ. హిరణ్యకశిపుపుత్రు లగునయ్యాఱ్వుర ననంతర కాలంబున యోగ
మాయ దేవకీగర్భంబున నర్భకులై ప్రభవింపం జేసె వారు కంసహింసి
తులై కాలధర్మంబునొంది యిప్పుడు నీలోకంబున నున్నవారు వారికై
వారిం గన్నతల్లి యగుయశోదా దేవి. 93

ఉ. కన్నుల నీరు కాల్వ బయి కాఱఁగ నేడ్చుచు నుండె వారలఁ
గన్నులఁ జూచుకోర్కె మెయిఁ గావున నోబలిరాజ వారి నీఁ

గ్రన్ననఁ గొంచుఁ బోయెదము కల్గెడు వారికి నూర్ధ్వలోకముల్
కన్నమ కాత్మశాంతియును గల్గఁగ నయ్యెడు దాన వింటివే. 94

వ. ఆయార్వు రిపుడు స్మరోద్గీథుఁడు పరిష్వంగుఁడు పతంగుఁడు క్షుద్రభువు
ఘృతి యను పేరులం బరఁగుచున్నవా రాస్మరోద్గీథునకు మున్ను కీర్తి
మంతు డని పేరుకల దని బలికిం జెప్పి యప్పుడు వారిం గొని తల్లికడకు
వచ్చి నివేదించిన నాతల్లియు. 95

ఉ. అల్లన నక్కునం గదియు నట్లుగఁ జేయుచుఁ జుంచు దువ్వుచున్
జల్లనిఁ స్తన్య ముప్పొంగఁ జాల్కొన బిడ్డలనోటఁ బెట్టుచున్
చల్లనిచూపునం గనుచు సారెకు సారెకు ముద్దు గొంచుఁ బ్రే
మోల్లసదంతరంగ యయి యొప్పుచు మెచ్చెను రామకృష్ణులన్. 96

వ. వా రార్వురును గదాధరునికరస్పర్శనంబునం జేసియుఁ దత్కృత శేష
పయోగ్రహణంబునం జేయుచు నంతలో శతానంద శాపమోక్షంబు
నొంది మరీచిపుత్రరూపంబులం బొంది రామకృష్ణులకును దేవకీవసు
దేవులకును నమస్కరించి తదనుజ్ఞం గొని నాకమార్గంబున నెల్లరుం
జూచుచుండ స్వర్గంబునకు నిర్గమించి రంత. 97

తే. దేవకీదేవి యెప్పుడో తెగి మృతించి
నట్టిపుత్త్రిలు వచ్చియు నట్టె దివికిఁ
జనుటయును గాంచి యెంతయు సంతసమును
విస్మయము గాంచి వినుతించె విష్ణుఁ గృష్ణు. 98

—♦ సుభద్రా పరిణయ వృత్తాంతము ♦—

వ. అని చెప్పినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి మునీంద్రా!
నరుండు రామకృష్ణసహోదరి యగుసుభద్రను బెండ్లియాడిన వృత్తాం
తంబు విన నెంచితి నను గ్రహింపు మనిన నతం డతని కి ట్లనియె. 99

ఆ. కారణాంతరమునఁ గవ్వడి యతివేష
మును ధరించి తీర్థము లవి యెల్లఁ
దిరిగి చూచి కొలిచి పదపడిని బ్రభాస
తీర్థమునకు వచ్చెఁ దైర్థికుఁ డయి. 100

చ. సరసిఁ డిలఁ దీర్థయాత్రలఁ బొనర్చుచు వచ్చి ప్రభాసతీర్థభూ
పరిసరమందు మెట్టు నని వార్త నిజాప్తులు సెప్ప ద్వారకా
పురి విని తత్పరత్వమును బొంది జనాగ్రణుఁ డంతఁ బోయి భూ
సురవృతుఁ డైనఫాల్గునునిఁ జూచి ముదంపడి వాని కిట్లనున్. 101

ద్విపదము. తడ వయ్యె నినుఁ జూచి ధర్మావతార
కడుదేశములు చూడఁ గలిగి వచ్చితివె
యెడఁదఁ బ్రియం బయ్యె నిట రాక వించుఁ
దొడికొని పో నిచ్చలో వచ్చినాఁడ. 102

వ. అని యభినందించి పూజితుండై వానిం దోడ్కొని రైవతకాచలమ్ము
నకుం జని నాఁటిరాత్రి యట శయనించి మఱునాఁ డరుణోదయం
బున నతనిచేఁ ద్రిదండియతివేషంబు వేయించి తనరథం బెక్కించు
కొని ద్వారకాపురంబునకు నిర్గమించి తనయింటం బెట్టుకొనియుండె
నంతఁ గొంతకాలంబునకు రైవతకోత్సవంబు ఘోషింపంబడుటయును.

భుజంగప్రయాతము. మృదంగాదితూర్యాళి మిన్నంది మ్రోయన్
విదేశీయు లాబాలవృద్ధంబుగా న
ప్పదస్థు ల్మహోత్సాహవర్తిష్ణులై స
మ్ముదం బొప్ప నం దేగి పూజించి రద్రిన్. 104

వ. మఱియు రేవతీరమణుండు నుగ్రసేనుండును సత్యకుండును సాత్యకియు
హార్దిక్యుండును నుద్ధవుండు నక్రూరుండును బ్రద్యుమ్నుండును సాం
బుండును సారణుండును గదుండును విదూరథుండును జారుదేష్ణుం
డును లోనగుయదువృష్ణిభోజాంధకప్రవరు లెల్ల నవలాలం గూడి
పోయి రైవతకోత్సవంబు ప్రవర్తింపు చుండి రప్పుడు. 105

క. నరనారాయణు లిద్దఱు
పరివారము గొలిచి నడువ బహురత్నమణీ
పరికీలితకాంచనరథ
వరము నధిష్ఠించి చనిరి వైభవ మరయన్. 106

వ. అట్లు చని నలుగడం గలయం గ్రుమ్మరుచున్న సమయంబున. 107

మ. జన మెల్లన్ గిరిపూజ సేయు నెడలం జంద్రాస్యలం గూడి తా
నును భక్తిన్ భజియించు దానిని జగన్మోహాతిసౌందర్య మం
దినదానిన్ రతిఁ బోని కన్య నమరస్త్రీమాన్య ధన్యాకృతిన్
ఘనరేఖోన్నతి సర్వభద్రను సుభద్రం గాంచెఁ బార్థుం డటన్. 108

వ. ఇట్లు గాంచి పంచబాణ బాణపరంపరాపవిద్ధుండై తదేకాగ్రబద్ధ
చిత్తుండై ఱెప్ప వేయక చూచుచున్నన్ గుడాకేశునిం గని నవ్వుచు
హృషీకేశుం డిట్లనియె. 109

చ. అడవుల నాఁకలంబు దినునట్టి వనేచర నీకు నిట్టిచోఁ
బడుచులఁ జూచి మోహపడుభావము వచ్చెను జాలుఁ జాలు నీ
నడవడి మాకునుం దెలిసె నవ్వుదు రెవ్వరు విన్న నిన్నటం
చడరినమందహాసమున హాస్యము సేయుచు నంత వెండియున్. 110

ఆ. ఇది సుభద్ర యనఁగ నెసఁగు సారణునకు
సహజ యగును నాకు సనతిచెల్లె
లగును నీకు దీని యం దనురాగమే
నయ్యు కెఱుఁగఁ జెప్పి యది ఘటింతు. 111

వ. అనిన సంతసిల్లి విజయుం డిట్లనియె. 112

క. గోవిందునకుం జెలియలు
వావికి నామేనమామవరసుత విలస
ద్యౌవనవతి సుందరి నే
భావంబునఁ గోరఁ జనదె బావా! దీనిన్. 113

మ. అనినం గృష్ణుఁడు పల్కు నీవలపు నే నధ్యాత్మ నూహించితిన్
మును మున్నింపుఁ బ్రయత్నముం బొనరుతుం బో కాదయేని న్నయం
బున రాజన్యులకున్ స్వయంవర మనొప్పున్ బల్మిఁ గైకొంటయుం
జనుఁ గానన్ హరియింతు కాని యెటులేఁ జాన! సుఖం బుండుమా.

వ. అయ్యవసరంబున. 115

మ. బలదేవాదులు వచ్చి కొన్నిదినముల్ ద్వారావతి న్నిల్చి పో
వలయున్ మీ రని శాంబరీమునివరుం బ్రార్థించి తోకొంచుఁ బో
యి లలిం గృష్ణునిసమ్మతి న్నగరిలో శృంగారధామంబునన్
నిలువం జేసిరి భద్రి సేవ లిడఁగా నేమించి ప్రేమించుచున్. 116

మ. పరమాన్నంబులు భక్ష్యభోజ్యఫలపుష్పంబుల్ సమర్పించుచున్
బరిచర్య ల్మిగులన్ సుభద్ర పొనరింపన్ రామముఖ్యుల్ నిరం
తరమున్ భక్తి భజింప సర్వజనమిత్రత్వంబు సేకూర న
న్నరుఁ డాద్వారవతీపురంబునను గొన్నాళ్లుండె నెయ్యంబునన్.

ఉ. తీఁగమెఱుంగు పోలె సుదతీనివహంబులలోడ నెప్పుడున్
వీఁగక కూడిమాడి తనవెంట మెలంగుచు సేవసేయుచున్
రాగము రాఁగఁ బల్కు చలరాముసుభద్రను జూడఁ జూడ లో
మూఁగినకూర్మి నన్నరుఁడు మోహము వెంచెను నాఁడునాఁటికిన్.

వ. అని యువ్విళ్ళూరు మానసంబున నతండు తనమనోరథం బీడేర్చుకొను
నంతరం బన్వేషించుచుండె నంత నాసుభద్రయు. 119

సీ. కాలాంబుదశ్యాముఁ గాంతిచ్ఛటాధాము
నాజానుబాహు మహాద్రిదేహు
సంపూర్ణపూర్ణిమాచంద్రవదను గళా
సదను మహావక్షు సారసాక్షు
నీలవక్రాలకు లీలావిశాలకు
వనితాహృదయలోలుఁ గనకచేలు
మందహాసమనోహరుం దులసీధరు
స్థిరవీక్షణాసాధ్యు సింహమధ్యుఁ

తే. గృతకయతిఁ గాంచి వినుకలికతన విజయు
నందుఁ గలహావభావము లతనియందుఁ
బొంది యుండుట సందియ మందుచుండి
మునికి నొకనాఁడు దా నిట్టు లనియెఁ బ్రీతి. 120

ఉ. దేవర మీరు చూడనివి దేశములుం బురముల్ సరంబులున్
లేవు ధరాతలంబున నిలింపపురిప్రోలినిఁ బోలి పాండవ
శ్రీ వెలయింపఁ జేయునగరిం గనుఁగొంటిరె పాండవేయులుం
ద్రోవదియుం బృథాసతియును న్సుఖముండిరె నిందు వేడుకన్. 121

సీ. నీలంపుటాలడా ల్డీలింపఁగాఁ జాలి
మిసిమిమిసిగ్గులఁ దేలు మేనివాఁడు
కందమ్ములం దమ్ములం దమ్ము లనిపించు
నందమ్ము లగుకన్ను లమరువాఁడు
పున్నమజాబిల్లి పోలిక విలసిల్లి
ముద్దు లొల్కాడునగుమోమువాఁడు
మేటిమారునికొల్వుకూటంబునా నొప్పి
డంబైన వెడఁదయురంబువాఁడు

తే. సవురుఁ గను నూఁగునూఁగుమీసములవాఁడు
పిడికిటను బట్ట నిమిడెడునడుమువాఁడు
మేనయత్తకు వరపుత్త్రుఁ డైనవాఁడు
నిర్జితాఖిలదుర్జనుం డర్జునుండు. 122

వ. ఆతండు తీర్థయాత్రాచరణశీలుండై దేశాటనంబు చేయఁబోయె నట!
వానిరాక వినవచ్చుచుండునే యని విచారం బభినయించుచున్నం
గని యించుక నవ్వుచు నర్జునుండు. 123

క. ఏమిది నీ కాతనిపైఁ
బ్రేమము ఘనమైనయట్లు విఖ్యాత మగున్
గామిని కౌతుకమేని
న్నామీఁదం జూప రాదె నరుఁ డేఁ గానే. 124

మ. అన నాకోపన గన్ను లెఱ్ఱఁబడ మాయామానినిం గ్రూరదృ
ష్టిని బొమ్మ ల్ముడివెట్టి చూచుడు మదిం జిట్టాడుమోహంబునన్
వనితారత్నమ డావ నేల విజయుండ న్నన చూవే నినుం
గనునాసం జనుదెంచినాఁడ నిటు న గ్గామించి ప్రేమింపవే. 125

వ. అని పలికి విజయుండు విరాళిం బడి చెనకం జూచిన సుభద్రియు మొగంబు వాంచి మానముద్రిం గాంచి కొంచెంబు గాసిసిగ్గున దిగ్గునం దొలంగి కలంగుచుఁ గన్యాంతఃపురంబునకుం బఱచి మదన వేదనాభరంబునం బరితపించుచుండె నిట నర్జునుండును నితాంతకంతు సంతాపసంతప్తచిత్తుండై తత్తఱంపడుచుండుట లెఱింగి రుక్మిణీసత్య భామ లచ్చెలిం దెచ్చి యిచ్చిన వాసవాత్మజుండు వాసుదేవాభ్య నుజ్ఞాతుండు గావున సుభద్రను గాంధర్వవిధిం బరిగ్రహించి రథం బధిష్ఠించి సతీసమేతుండై యింద్రప్రస్థంబునకుం జని తద్వృత్తాంతం బంతయు ధర్మరాజాదుల కెఱింగించె నంత నక్కడ. 126

చ. చెలియల్ మేనమఱందియుం గలసి వాసిఁ ఖాండవప్రస్థమం
దెలమిం బొందుచు నుండి రంచు విని సంహృష్టామలస్వాంతులై
బలరాముండును గృష్ణసాత్యకులునుఁ బంధువ్రజంబుం భటుల్
గొలువన్ వచ్చి రటన్ శతాంగములతో గోరత్నభూషాళితోన్.

వ. యుధిష్ఠిరుండును వారిరాక విని నిజానుజవర్గంబుతో నెదుర్కొని వారి నెల్ల సంభావించి విడిదల నుంచి పూజించి నగరం బలంకరింపం బంచి పంచశరహితశుభముహూర్తంబున ధౌమ్యయాజకంబుగా సుభద్రా ర్జునులకుఁ బాణిగ్రహణోత్సవంబు నిర్వర్తించె నంత బలభద్రుం డాసుభద్రకు నర్జుననకుం దక్కునుంగలవారికిని నానావిధచీనిచీనాం బరాభరణాదులును రథహస్తిపత్తితురగశతసహస్రంబులును దాస దాసీజనశతంబులును మఱియు ననేకచిత్రవస్తుసముదాయంబులును నరణం బొసంగి విడువనికూరిమిం గొన్నిదినంబు లుండి కృష్ణు నట మఱికొన్నినా ళ్ళుండ నియమించి వారి వీడ్కొని సపరివారుండై ద్వారావతీపురంబునకు నిర్గమించె నంత. 128

— శ్రీకృష్ణుండు ఋషులతో మిథిల కరుగుట —

క. శ్రీకృష్ణునివాత్సల్యము
వాకొన శక్యంబు గాదు భక్తులయెడ నో

భూకాంత వినుము మిథిలఁ
వాఁడొక శ్రుతదేవుఁ డనెడు బాపం డలరుఁ. 129

సీ. కోరిక వచ్చునాహారము దిను దేహ
యాత్ర దీర్చుచుఁ బొంటె ననుదినంబు
ద్వంద్వంబు లెపుడు నాతనిదరి కరుదేవు
భూతదయాళుత్వబుద్ధిఁ గలఁడు
సత్త్వసంపన్నుఁడు సత్య మాతనిసొమ్ము
వచనము లెప్పుడు పలుకఁ బోఁడు
జగము మిథ్య యటంచుఁ దగ నెఱింగినవాఁడు
వైష్ణవభక్తితత్పరుఁడు వరుఁడు

తే. మిథిల నేలెడుపృథులాశ్వపృథివిపతియుఁ
దాను నపు డొక్క-గొంతుగాఁ దనరుచుండ్రు
వీర లిద్దఱు నచ్యుతప్రియులు జ్ఞాన
విజితాహంమాను లార్యాతివినుతయశులు. 130

వ. వా రిరువురుం దనకు భక్తు లగుటం జేసి వారికి దర్శన మీ నెంచి కాంచనాంబరధరుండు దారుకాహృతరథం బధిష్ఠించి నారదవామదేవాత్రికణ్వమైత్రేయచ్యవనాదిమహామునులం గూడి ప్రయాణంబై యెడనెడ మార్గమధ్యంబున సమాగతులై యర్ఘ్యపాద్యంబుల నర్పించుపౌరజానపదుల నాదరించుచు నానర్తధన్వ కురుజాంగల మత్స్యపాంచాల కుంతి మధు కేకయ కోసలాది దేశంబు లతిక్రమించి విదేహంబులకుం జనుటయును. 131

సీ. హరి చనుదెంచుట లాలించి శ్రుతదేవ
సహితుఁడై మైథిలక్ష్మావిభుండు
ద్విజులతో నెదురేగి వివిధసపర్యల
నొనరించి తమతమమనికిపట్ల
కను దేరఁ బ్రార్థింప నచ్యుతు డిరువుర

పలికినట్టు లోనర్చి పరిమనులై వా రిరువు
రర్ఘ్యపాద్యాసనాద్యఖిలపూజ
తే. లాచరించిన శ్రీకృష్ణుఁ డవి గ్రహించె
నపుడు కాళ్లొత్తుచును బహులాశ్వుఁ డీశ్వ
రాస్యమున దృష్టి నిగిడించి యధికభక్తి
భరితహృదయాంతరుం డయి పలికె నిట్లు. 182

ఉ. నీవు చరాచరంబులకు నేతవు త్రాతవు సంవిధాతవున్
నీవె సమస్తసాక్షివి మునిప్రవరార్చితపద్మయుండ వో
దేవ! భవద్దయారసము దెల్ప నశక్యము భక్తకోటికిన్
నీ వమరద్రుమం బవని సత్యహితుం డని నే నెఱుంగుదున్ 183

తే. అనఘ త్రైలోక్యవిజయావహా! ముకుంద
వందనము నీకు శ్రీకృష్ణ వాసుదేవ
యీవు నాయింటఁ గొన్నినా ళ్లిలమి నుండి
ననుఁ బునీతునిగాఁ జేయు మనుచు వేఁడె. 184

మ. శ్రుతదేవుండు నిజాలయంబునకుఁ గృష్ణుం డేగుదే మైథిల
క్షితినాథుండు బలెన్ మునీశ్వరులతో శ్రీకృష్ణునిం గొల్చి సం
తతసంతోషముతోడ దుల్పుచును వస్త్రాంబుల్ బ్రసీదర్భ ల
త్యతిసంప్రీతి సుఖాసనంబు నిడి భార్యాయుక్తుఁడై భక్తిమై. 185

క. పాదప్రక్షాళనమున్
మోదంబునఁ జేసి జలము పొలఁతియుఁ దానున్
మీఁదం జల్లుకొనుట కా
కాదరమునఁ జల్లె గృహమునం దంతటన్. 186

వ. ఆమలకోశీరాదులు యథాసంభవంబు లగుపదార్థంబులు నివేదించి యథోపపన్నసపర్యం గావించి సభార్యుండై సమీపంబుగం గూరుచుండి యి ట్లనియె. 187

ద్విపదము. నీదర్శనం బయ్యె నిఖిలాత్మ నేను
నాదు నన్వయము ధన్యత్వము నొందఁ
గలిగితి మోదేవ! కమలాహృదీశ
పలుకంగ నేల నాపాపంబు లెల్లఁ
బాసె మ్రొక్కెద నీదు పాదాబ్జములకు
దాసునిఁ గృపఁ జూడఁ దలఁపుము నీకు
సాష్టాంగవందన మాచరించెదను
గష్టుని ననుఁ బ్రోవఁగఁ దలంపు మీశ. 138

వ. అని పలికిన విని ప్రణతార్తిహరుం డగుపరమేశ్వరుండు వానిహస్తంబు
హస్తంబునఁ బట్టుకొని యిట్లనియె. 139

సీ. బ్రహ్మణ్య! తెలియ నీబ్రాహ్మణోత్తము లెల్ల
నిట్లు నన్ను ననుగ్రహించుపొంటెఁ
బదరేణువుల విష్టపము పవిత్రము చేయు
నిట్లు నాకోఁ జరియింత్రు వీరు
తీర్థముల్ క్షేత్రముల్ దేవతలును దర్శ
నస్పర్శనవరార్చనములఁ జేసి
యెప్పటికో వీరలప్పుడె జనులఁ బు
నీతులఁగాఁ జేయు రీతిఁగలరు

తే. ప్రాణికోటులలోపల బ్రాహ్మణుండు
జన్మమునఁ జేసి యే మేటి చదువు తపము
తుష్టిమత్కల గలిగినశిష్టు నతనిఁ
జెప్ప నేటికి నాకంటె గొప్ప యతఁడు. 140

ఆ. సర్వవేదమయుఁడు బ్రాహ్మసురుఁడే సర్వ
దేవమయుఁడఁ గానఁ దెలియ నతఁడు
నాకుఁ బ్రియుఁ డటంచు వాకొందు నోవిప్ర
వారిపూజసేయ వలయు నెపుడు. 141

చ. తెలియనివారు విప్రులను దేలిక సేయుచు దూఱుచుం డ్రిలన్
దెలిసినవారు విష్ణు లనుదృష్టినిఁ జేసి భజింతు రోద్విజే
ట్తిలకమ నీవు శ్రద్ధమెయి దివ్యమునీంద్రుల వీరిఁ గొల్వు మి
ట్టుల యగునేని నే నెడఁ గడుంగడుఁ దృప్తి వహింతు నెంతయున్.

వ. అని యాదేశించిన శ్రుతదేవుండు కృష్ణసహితు లగుఋషిసత్తముల నేకాత్మభావంబున నారాధించి చరితార్థుం డయ్యె వాసుదేవుండు నామిథిలానగరంబునఁ గొన్నినా ళ్ళుండి వారి ననుగ్రహించి ఋషులం గూడి మగిడి ద్వారకానగరంబునకుం జనియె ననిన రాజేంద్రుండు మునీంద్రుం గాంచి మహాత్మా! సదసత్పరంబును నిర్గుణంబు ననిర్దేశ్యంబు నగుపరబ్రహ్మమ్మునందు గుణవృత్తు లైనవేదంబు లెట్లు చరించుం జెప్పు మనిన నతం డి ట్లనియె. 143

సీ. ఈశ్వరుఁడు సృజించె నెల్లజీవులకు బు
ద్ధీంద్రియములు ప్రాణ హృదయములును
విషయభోగార్థము విహితకర్మార్థ మా
త్మార్థము మోక్షార్థ మని యెఱుంగు
మిట్లు బోధించు బ్రహ్మమై మహోపనిషత్తుఁ
బడసిరి పూర్వపూర్వజులు మున్న
యెవ్వఁ డాదరమున నివ్విధ మెఱుఁగు న
కించను డతఁడు మే లెంచికొనును

తే. ఇచట నారాయణాన్విత మిద్ధగాథ
గలదు నారదనారాయణులకు వాద
రూప మైనది దాని నిరూపణముగ
నీకు వర్ణించి చెప్పెద నేను వినుము. 144

మ. ఒకకాలంబున నారదుండు ప్రణయం బొప్పార లోకంబులం
దొకరుండై చరియించుచున్ బదరికాఖ్యోదాహృతంబై జగ
త్ప్రకరఖ్యాతమహాశ్రమంబును జనెన్ బ్రస్తుతనారాయణ
ర్షికులాలంకరుణున్ గనుంగొనెను నర్థిం జేసి రాజర్షభా. 145

తే. భరతవర్షంబునం గలప్రజల కెల్ల
క్షేమమును స్వస్తియును గల్గఁ జేయు నిచ్చఁ
గల్ప మాదిగ. ధర్మవిజ్ఞానశమస
మన్వితతపంబుఁ జేయు నారాయణముని. 146

వ. అట్లు తపోనిష్ఠం బూని కలాపగ్రామవాసు లైనఋషులు పరివేష్టింప నాసీనుండై యున్న నారాయణమునిం గాంచి నమస్కరించి యిపుడు నీవు న న్నడిగిన ట్లడిగిన నతం డల్లరు విన ని ట్లనియె. 147

మ. జనలోకంబున ము న్నొకప్పుడు జగచ్ఛ్లాఘ్యంబుగా మానసుల్
సనకాదుల్ తగ బ్రహ్మసత్రమును నిచ్చం జేయుచుండంగ నీ
వనఁనీయర్థము వచ్చె నా ద్విజులకున్ వ్యాఖ్యానముం జేయుచున్
వినిపించెన్ దెలియన్ సనందనుఁడు దాని న్నే నిటం దెల్పెదన్. 148

మ. ప్రలయం బందు స్వశక్తులం గలిగి నిద్రిం బొందున ట్లున్న యీ
శు లనద్వేశునిఁ జేరి వేదములు సంశుద్ధాకృతిన్ బొల్చి వం
దులు ప్రాహ్ణంబున నిద్రితుం డగునృపున్ స్తోత్రంబులం జేసి మే
ల్కొలుపుల్ చేసినయట్లు చేసె వినుతుల్ లోకంబు హర్షింపఁగన్.

—♦ శ్రుతిగీతాసారము ♦—

కవిరాజవిరాజితము:—

జయజయశంకర ! సాధువశంకర ! సర్వచరాచరజంతుసము
చ్ఛ్రియమునకుం గలదోషగృభీత మజం బెడఁ బాపుము నీ వెపుడా
రయ నజితుండవు భూతు లవన్నియు బ్రాప్తము లెల్ల సుశక్తులు నీ
కయి తగ నీవు చరింతువు వేదములన్నియు నెర్గి నినున్ బలుకున్.

ఉత్సాహము. ఉదయలయము లెపుడు నొందుచుండు నీసమస్తమున్
మృదధిగతవికార మట్టు లెంచుచున్ ఋషీశ్వరుల్
మదియు వాక్కు క్రియయు నీదుమహిమమందె నిల్పు చె
య్యదియు నీవయనుచు నెంచు రాశ్రుతిప్రమాణతన్. 151

♦ గృభీతము=గృహీతము; అజము=అవిద్య;

తే. త్ర్యధిపతీ ! పరమేశ ! బుధాగ్రగణ్య
లఖిలలోకమలక్షపణార్థమైన
నీకథామృతాంబుధిలోన నీఁక నీఁది
కలుషదుఃఖాదులం బాసి సలలిత మగు
నీపదము నొంది సుఖయింత్రు నిరత మాధవ. 152

తే. అంధతమసావృతులు వోలె నజ్ఞులగుచు
మహదహంకారయుక్తులై రహిఁ జెడంగ
నిన్ను భజియింప నేరక నిశ్వసించు
చుండ్రు చర్మభస్త్రికవోలె నుర్విజనులు. 153

ఉ. అన్నమయాదులందుఁ గడ నాగతియుం దనురక్తిఁ జైనుం
డెన్నఁడు నే నహంకృతుల కేగక బాధ్యము బోధ్యమైనభ
క్తి న్నతి మీఱుచుఁ హరిగతిం గలఁడై సదసత్పరంబు న
త్యున్నతమైనమోక్షపద మొందు భవత్కృపఁ జేసి రక్షకా. 154

తే. స్థూలదృష్టులు కొందఱు దూర మరయ
కందరగతమణిపూరక మొందుదు రన
ఘులు సుషుమ్నాఖ్య మగుజ్యోతిఁ గలసి బ్రహ్మ
రంధ్రమును దాఁటి యమృతసంప్రాప్తిఁ గొందు. 155

చ. అనలము సర్వదారువులయం దగునట్లు స్వయంకృతంబులై
యొనరెడు నుచ్చనీచ ముఖయోనులయందుఁ జరింతు వీవు ని
న్ననఘులు నిర్మలాత్ము లగునట్టి రెఱింగి పరంగఁ గొల్చి ము
క్తిని బడయంగఁ గల్గుదురు దీనశరణ్యుఁడ వీవు చూడఁగన్ 156

తే. స్వకృతకర్మఫలం బయి వచ్చినట్టి
మేనఁ బురుషు నీయంశము గా నెఱింగి
నిగమచోదితకర్మముల్ తెగడి భక్తి
నిను నుపాసించి నీరూపమున నెసంగు. 157

---

* త్ర్యధిపతి=త్రిగుణాధిపతి, క్షపణము=పోగొట్టునది;

తరళము. తెలియ శక్యము గానితత్త్వముఁ దెల్ప దేహము గొన్ననీ
సలలితాత్మకథామృతాబ్ధిని స్నాన మాడి శ్రమంబు వోఁ
జెలఁగుచుం భవదీయభక్తులచెల్మి సంస్మృతి లీలమై
దొలఁచువా రపవర్గ మేనియుఁ దోసిరా జనుచుం బ్రదెదర్చ. 158

తే. ఈశ! నీ కనుపద మగునీశరీర
మెపుడు నీ దనుబుద్ధితో నెసఁగ కేను
నాది యనుబుద్ధి నెసఁగుచు నడచు వాని
కథమగతు లగు నని చెప్ప నగును గాదె. 159

ఉ. ప్రాణము లింద్రియంబులును స్వాంతము నె ట్టరికట్టి యోగసం
ధానముకల్మి నీదయినతత్త్వ ముపాసన సేయుమానుల
ట్లే నిమిషంబు నిన్ను స్మరియించుచునుండెడు కామినుల్ రిపుల్
నీనిలయంబు నొంది సుఖనిర్భరు లయ్యెద రందు మేమునున్. 160

ఉ. అగ్రసరుండ వైననిను నారయఁ జాలరు తత్త్వదృష్టిమైఁ
♦ బ్రాగ్రయజన్మనాశములు బ్రహ్మముఖామరకోటి కయ్యెడిన్
నిగ్రహ మట్టివారికిని నేర్వనిదే యగుఁ గాన భక్తి యొం
డుగ్రమ మీశ్వరుం దెలుపునద్ది లభించును గీర్తనాదులన్. 161

చ. కనకవికార మెల్లఁ గనకంబు బలెన్ విడనాడ నట్లు స
త్తను త్రిగుణాత్మకం బగునయంతయు నీదగు స్వత్వరూప మై
కన నగుఁ గానఁ దాత్త్వికులు గా దన నోపకసత్త్వ మట్లు గా
మనమున నెంచి సద్గతికి మార్గము గా గణియింతు రోప్రభూ. 162

తే. అఖిలసత్త్వములం దుండునాత్మ వైన
నీపరిచయము గల్గి వేనిని గణింప
కవల మృత్యువు నెత్తిపై నడుగు వెట్టి
పశువులంబోలెఁ దోలు నభక్తసమితి. 163

♦ చర్మభస్త్రిక=కొలిమితిత్తి; నిశ్వసించు=గాలివిడుచు;

♦ రయము=ప్రవాహము, వేగము; అగ్రసరుఁడు=అగ్రేసరుఁడు;

తే. తపములఁ దపింత్రు గాక తీర్థములసేవ
సలుపుదురు గాక శ్రుతులను జదివి యాగ
ముల నొనర్తురు గాక యోగులయిమునీంద్రు
గాక హరిఁ గొల్వ కమృతముఁ గలుగఁ బోదు. 164

తే. పాణిపాదవిహీనుఁడై పరఁగుచుండు
కనులు లేకున్నఁ గనుఁ జెవుల్ గలుగకున్న
వినుఁ దెలియు నెల్లఁ దెలియ రేరును నను శ్రుతు
లట్టిపురుషుఁడ వీవు ని న్నభినుతింతు. 165

తే. అఖిలశక్తిధరుండవై యలరుచుండు
దువు స్వరాట్టువై దాన నాద్రుహిణముఖులు
బలి నొసఁగుచుంద్రు నీ కలంతులు నృపతులు
సార్వభౌమునకుం బలి సలుపునట్లు. 166

సీ. భీతినై వాయువు వీవంగ వెఱచును
భాస్కరుం డుదయింప భయముపడును
వీతిహోత్రుఁడు వెల్గ భీతిల్లు నింద్రుండు
దండంబు వహియింప దద్దఱిల్లు
దండధరుండు దోర్దండంబు కదలింప
జంకను వెలుఁగండు చంద్రముఁడును
మృత్యుదేవత పాఱు నత్యుపద్రవ మగు
ననుభీతునర్క ప్రాణి నంట మాని

తే. సర్వకారణశక్తియు సర్వవిభుఁడు
సర్వలోకేశ్వరుండును సర్వమాన్యుఁ
డగుపరాత్పరు నిన్ను నధ్యాత్మ నిలిపి
కొలుచునతఁడు మహానందకలితుఁ డగును. 167

ఆ. నీదుమాయ నెఱిఁగి నిఖిలవిద్వాంసులు
భవనివృత్తికొఱకు భవుని నిన్ను

శరణు వేఁడికొనుచు సంసారభయ మెల్ల
మాయ భవము లేక మలయు చుండ్రు. 168

తే. ఇంద్రియజయంబు గాంచక నెప్పు డదాంత
మగు మనస్తురగము నాఁగు తెఱువ లేక
గురుచరణసేవ లేమిని గొందలపడు
వనధి కర్ణధారుఁడు లేనివణిజునట్లు. 169

తే. సర్వరసమయుఁ డగునీ వెసంగుచుండ
జనుఁడు పశుదారధనధామజనరతుఁ డయి
మెలఁగ ఫల మేమి యెఱుఁగక ఫలవిరహిత
మిధునసుఖములఁ బడి వాఁడు మిసిమి చెడును. 170

తే. ఆఋషులు నిరహంకారు లగుచు నెపుడు
నీపదము లోన నిడుకొని పాపదూరు
లై చరింతు రెపుడు పుణ్యాహాగము లైన
తానములఁ జేరఁ బోవ కుత్తమతఁ గండ్రు. 171

వ. ఇట్లు శ్రుత్యధిదేవతాప్రస్తూయమానంబును సర్వశ్రుతిపురాణోపనిష
త్సారంబు నగునాత్మానుశాసనం బాకర్ణించి మరీచ్యాదు లాస
నందను నభివందించి రని నారాయముని యెఱిఁగించిన నారదుం
డనుందానందంబునం బొందిన డెందంబున దండప్రణామంబు గావించి
పురాణముని నామంత్రించి నాతండ్రి యగుద్వైపాయనునాశ్రమంబున
కరుదెంచి పూజితుండై నారాయణముఖచ్యుతం బగుశ్రుతిస్మృత్యా
త్మకతత్త్వం బంతయు నభివర్ణించె నంత నతం డది యంతయు నాకు
నుపదేశించె నది నీకు నే నిట్లు బోధించితి దీనం జేసి నీవు నన్నడిగిన
ప్రశ్నకు సమాధానం బగు నని చెప్పిన విని సంతసించుచుఁ బరీక్షిన్న
రేంద్రుండు శుకయోగీంద్రుం గాంచి. 172

—◆ పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవాప్రాశస్త్యముం దెలుపుట ◆—

చ. మనుజులు దేవదానవులు మాధవునిన్ భజియించి తత్కృపన్
ఘనతరసంపదల్ గలిగి క్రాలుచునుండ్రు రమామనోహరున్

వనరుహనాభునిం గొలుచువారు దరిద్రత గాంచుచుందు రే
వినఁగఁ దలంతుఁ గారణము వీనులవిందుగ నాన తీయవే. 173

తే. శక్తియుతుఁ డైనశివుఁడు తైజసము తామ
సమును వైకారికము నాఁగ నమరునట్టి
మూఁ డహంకారముల నొంది పొదలుచుండు
షోడశవికారములు వానిసొమ్ము తలఁప. 174

తే. త్రిగుణయుతుఁడు త్రిలింగుఁ డాదేవుఁ గొలుచు
వానికిఁ విభవమ్ములు వఱలు నిర్గు
ణుఁడు నిరంజనుఁ డగునచ్యుతుఁడు భజించు
వారి రాగరహితు లయి వఱలఁ జేయు. 175

వ. తొల్లి హయమేధాధ్వరంబైనపదంపడి భాగవతధర్మంబు లెల్ల
నాలించుకొనుచు నీపితామహుం డగుయుధిష్ఠిరుం డీయర్థంబ చెప్పు
మని శ్రీకృష్ణు నడుగుటయు జగన్నిశ్శ్రేయసార్థ మవతరించిన నతం
డతని కి ట్లనియె. 176

ఉ. ఏని ననుగ్రహించుటకు నేను దలంతునొ వానివిత్తముల్
మానక సంహరింతు ననుమాన మొకింతయుఁ బూన కందునన్
వానిని దుఃఖదుఃఖితునిఁ బాయుదు రెల్లనిజాత్మబంధువుల్
కానిపనుల్ పొనర్చుటకుఁ గాక మదేకశరణ్యుఁ డై చనున్. 177

తే. అంత నన్యము లన్నియు నవలఁ ద్రోచి
నన్ను సేవించుచుండియు నాదుదయకుఁ
బాత్రమై తుచ్ఛసుఖముల బాఱిఁ బడక
మోక్షసామ్రాజ్యసుఖ మందఁ బోవు నవల. 178

తే. కన్ను గానక ధని యైనకష్టుఁ డెపుడు
దుష్టకార్యము లొనరించి దుర్గతి కగు
వానిపడసినసంపద కైనఫలము
లేనివాఁ డీశ్వరుని నమ్మ హాని యగును. 179

చ. హరియు హరుండు బ్రహ్మయు నిరంతరముం నిజభక్తకోటికిం
వర మిడి ప్రోవ శాప మిడి పాపులఁ బాప సమర్థు లందులో
హరుఁడు నిజం బొకింత మితి నవ్వి ప్రసన్నుఁడు విష్ణుఁ డట్లుగా
కరసి ప్రశ్న దీని కితిహాస మొకం డగు విన్ము చెప్పెదన్. 180

—♦ వృకాసురుని వృత్తాంతము ♦—

సీ. శకునిపుత్రుం డగువృకుఁ డొక్కచో నార
దునిఁ జూచి యి ట్లను మునివరేణ్య
తపియించి వర మొందఁ దలఁచి నే జేసెద
ముమ్మూర్తులందు నేమూర్తి శీఘ్రి
వరదుఁడో చెపు మన్న సురమౌని యి ట్లను
హరుఁ డింతలోఁ దృప్తుఁ డగునతనినిఁ
గొలిచి దశాస్యబాణులు సిద్ధి వడసి రై
శ్వర్య మెంతయు వారి నంట వచ్చె

తే. అని వచించిన వృకదైత్యుఁ డతిరయమునఁ
నరిగి కేదారమున కందు నగ్నిముఖము
నందు వేల్చెను నిజమాంస మభవు నొందు
చందమున నిట్టు లార్నాళ్లు జరిగినంత. 181

తే. సప్తమాహ్నమునం దనస్వధితిచేతఁ
వెస శిరముఁ గోసి వహ్నిలో వేల్వ నున్న
తఱిని బ్రత్యక్షమై శూలధరుఁడు వాని
శిరముఁ గరమునం గీలించి కరుణ ననియె. 182

ఉ. సాహస మాచరింపకుము చాలు నిదే చనుదెంచినాఁడ నీ
దేహము నొమ్మికొమ్ము భవదీయతపంబున కేను మెత్తు నీ
యూహకుఁ బోల నే వరము లీయఁ దలంచితి వేఁడుకొమ్ము నా
వచించె ని ట్లనుచు దేవరకుం దయ వచ్చె నేనియున్. 183

ఉ. నాకర మేసినెత్తిపయి నాఁటగ నిల్పుదు నంతమాత్రిలో
వాఁడొన వేయువ్రయ్యలయి వానిశిరం బది వ్రెస్సి నట్లుగా

నాకు వరం బొసంగఁగ మనం బొనరింపు మనంగ నట్టు లాఁ
గాక యటంచు శూలి వెనుకల్ పరికింపక పల్కెఁ జుల్కనన్. 184

సీ. వర మొసంగినహరువలను గన్గొని వాఁడు
నేను బరీక్షింతు నీతల నిడి
నిలుము శంభూ! యని పలుకుచు వడివడి
పయిఁ బడ రాఁ గని భయముఁ గుడిచి
వెసవెసం బఱువెత్తె వెనుదన్ని దైత్యుండు
కదియ రా హరుఁ డెల్ల కడలు దిరిగి
వెల్లదీవిం గలవిష్ణుధామముఁ జనె
నఱచేతఁ బ్రాణము లవి యిడుకొని

తే. దవ్వులం గాంచి విష్ణుఁ డాదారి నెదురు
వోయి వటువేషమున దైత్యపుంగవుఁ గని
మ్రొక్కి వృత్తాంత మంతయు మొక్కలీఁడు
తెలుపఁగా విని నవ్వుచుఁ బలికె నిట్లు. 185

తే. దక్షశాపమునం జేసి స్థాణు వితఁడు
సౌరు చెడిపోవ ప్రేతపిశాచములకుఁ
బతిగ నయ్యె నీతనిపల్కుబడుల మేము
విశ్వసింపము నీ వెట్లు విశ్వసింతొ. 186

క. నిను మోసచేసి యీగతి
నని నింతయె కాని చేయి నొదల నిడినం
దన ప్రేలి పగులు టెక్కడ
విని యుండము నమ్ము మిట్లు విని కాదేనిన్. 187

క. నాతల నిడు చూతము మఱి
నీతల నిడుకొను మనంగ నెఱి దప్పి యతం
డాతఱిఁ దలపైఁ దడవెన్
జేతన్ స్పృశియించి విశ్వసించినమదిలోన్. 188

వ. అంతలో వజ్రాహతిం జేసి పర్వతంబు పగిలిన చందంబున వృకాసురుని శీర్షంబు వేయిచ్ఛిద్రములై నేలం బడియె నంతరిక్షంబున జయశబ్దంబును నమశ్శబ్దంబును సాధుశబ్దంబు నబ్దధ్వానిం బురుడించెఁ బుష్పవర్షంబు గురిసె దేవర్షి పితృగంధర్వు లమందానందం బొంది రిట్లు సంకటంబు నుండి ముక్తుండయిన శంకరుం గాంచి హరి నీకపచారంబు గావించినవీఁ డీట్లయ్యె నని మఱియు నిట్టిదుష్టాత్ముల కిట్లు వరంబు లిచ్చుటయు నొప్పదని చెప్పి యొప్పించి నిజనివాసంబునకుం బుచ్చె నని పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియును. 189

—♦ భృగుమహర్షి త్రిమూర్తులం బరీక్షించుట ♦—

సీ. మున్నొకప్పుడు మునిముఖ్యులు సత్రయా
గము సరస్వతీపతీరమున సలుప
నై రప్డు మువ్మూర్తులం దెవండు ఘనుండొ
యను విచారము పుట్టె నరయుపొంటె
భృగు నంపి రాతఁడు మొగి బ్రహ్మకడ కేగి
నతియు నుతియు లేక నగుచునుండె
నది చూచి కోపాగ్ని యగుడెంచినఁ దల్లి
కొడు కని శాంతించెఁ గొంతలోన

తే. శంకరునిచోటి కరిగిన సన్మౌని యని
కౌఁగిలింపఁగఁ బోవంగఁ గాదనెను
కంజ వేసినఁ గనలి ఫాలాక్షుఁ డంత
శూలమున వాని నేయంగఁ జూచె నేచి. 190

వ. అది యెఱింగి శాంకరి వారించి పుచ్చె భృగుండును కైలాసంబునుండి వైకుంఠపురంబునకుం జని. 191

మ. సిరితోడం శయనించి యున్న హరినిం జెంతం బ్రబోధించి పే
రురమం దంఘ్రిని దన్నెఁ దన్నిన నతం డొక్కింతలో లేచి త
చ్చరణాబ్జంబుల వ్రాలి తప్పు సయిపం గ్సాంతంబు గావింపు మీ
రరు దేఁ జూడనివాఁడ నైతిఁ గృప నాయందుం బ్రతిష్ఠింపుమా. 192

తే. కర్కశం బైననాదువక్షంబు దాఁకి
పద్మకోమల మగునీదుపాద మకట
నొచ్చెనో యని వగచెద సచ్చరిత్ర
పాదసేవౌషధము చేసి బాధ పుత్తు. 193

వ. అని యనేకవిధంబుల నౌపచారికోక్తులం దేలించి పూజించి పుచ్చిన భృగుమహర్షియు హర్షోత్కరంబున నొండాడనేరక భక్త్యుత్కంఠాశ్రులోచనుండై కన్నుల సనుజ్ఞ వడసి మరలి సత్రవాటికిం జనుదెంచి బ్రహ్మవాదు లగువారికి స్వానుభూతాశేషవిశేషంబు లెల్ల నెఱిఁగించిన వా రమందానందకందళితహృదయారవిందు లై ముక్తసంశయు లై విష్ణుదేవుం బ్రశంసించి వానిమహోన్నతి వేయినోళ్ళం బ్రసంగించుచు సేవించి రని శుకుండు వెండియును. 194

—• శ్రీకృష్ణుఁడు మృతులైన విప్రసుతుల బ్రదికించుట •—

సీ. ఒకనాఁడు ద్వారక నుండువిప్రాంగన
కొడుకునుఁ గనె వాఁడు పుడమిఁ బడిన
యపుడె మృతుం డయ్యె నామృతకుం గొని
తజ్జనకుఁడు రాజుద్వారముకడఁ
బడవైచి విలపింపఁ గడఁగె నాతురుఁ డయి
క్షత్రబంధుండును శఠుఁడు దుష్టి
రాజు పాలించెడురాష్ట్రమునం దిట్లు
కాలమరణములు గలుగుచుండు

తే. రాజదోషమునం జేసి ప్రజల కిట్లు
దుఃఖ మరుదెంచు నం చని దురపిలి దుర
పిల్లి యింటికిఁ జని యట్లు చెల్లినట్టి
రెండవకుమారునిం దెచ్చి క్రింద వైచె. 195

వ. ఇ ట్లేకకాలంబునం బుట్టి చచ్చినయెనమండ్రగు బిడ్డలం దెచ్చి హజారంబు కడం బడవైచి వారవారంబును రాజదోషంబు వెలిబుచ్చుచుఁ

దొమ్మిదవమృతశిశువుం దెచ్చి తొంటియట్లు దుఃఖించుచున్న సమయం
బున నంతకు మున్న కేశవదర్శనార్థ మరుదెంచి యున్న పాండవమధ్య
ముందు పఱతెంచి పరిదేవనంబు చేయు బ్రాహ్మణుం గని. 196

శా. ఏమయ్యా! యిటు లేడ్చుచుంటివి సుతుం డిట్లైన నే కట్ట యీ
గ్రామంబం దొకఁ డైనయిట్టిదొసఁగుల్ గాకుండగాఁ జేయఁడే
గ్రామణ్యాగ్రణి లేకయుండె నఁటె విల్కాఁ డైనరాజన్యుఁడై
యేమందుల్ మఱిబ్రహ్మాస్త్రముల కై క్లైగంగ నాశింతురో. 197

తే. ధనము దారాత్మజులు లేక ధరణిసురులు
వేనిపురమున మిక్కిలి వెతలఁ గుడుతు
రాపురీశులు నటులు నా నసువు లూని
మెలఁగునట్టిర యని నేను దలఁతు నకట. 198

చ వగవకు మేను నీప్రజలు ప్రాణము గల్గి మెలంగునట్లు నా
దగువరశక్తిఁ జేసెద నటంచుఁ బ్రతిజ్ఞ పొనర్చుచుంటి న
ట్లుగఁ బొనరింపకుంటిన కడుంకడు మండెడునగ్నిఁ జొచ్చి నా
కగు దురితంబు వాసెద మహాముని శేఖర నీవు చూడఁగన్. 199

సీ. అనవుడు బ్రాహ్మణుం డను నిట్లు సంకర్ష
ణుండును వాసుదేవుండు మఱియుఁ
బ్రద్యుమ్నుఁ డనిరుద్ధపరివృతు లెందఱో
మానవీయులు చేయ లేనిదానిఁ
జేయుదుననుచుంటి వోయి నీ బాలిశ
త్వము వెల్లడించెదు దాని కగును
గాని కా దన్నట్లు కావింప నీమాట
లే విశ్వసింపఁ బో నిపట విడుము

తే. అనుడు నర్జునుఁ డిట్లను నార్యవర్య
నేను నీవుచెప్పినవారిలోని వాఁడ
గాను పార్థుఁడ నర్జునాఖ్యాకుఁడఁ గర
మందుఁ గాండీవముం దాల్చి యుందు నెపుడు. 200

మ. అవమానింపఁగ నొప్ప దేను బవరంబం దామహాదేవు మె
ప్పు వడం గల్గినవాఁడ మిత్తి నయినం బోకారఁ గావింతు వి
ప్రవరేణ్యా భవదీయనందనులఁ దే భాషింతు నన్నర్ద్విజ
ప్రవరుం డయ్యది విశ్వసించినటు సంభాషించుచున్నంతటన్. 201

వ. మఱియుం గొంతకాలంబునకుఁ దనకాంతకుఁ బ్రసూతిగాలం బాసన్నం బగుట యెఱింగి త్వరితగతిం జని విజయున కెఱింగించి రక్షింపు మని ప్రార్థించిన నతండును జలోపస్పర్శనంబు చేసి శుచియై మహేశ్వరునకు నమస్కరించి గాండీవధన్వంబు సజ్జంబు గావించి నానాస్త్రశస్త్రసంచయంబుతో సూతికాగృహంబు చెంతకుం జని చీమదూరనిచందంబున నటఁ బదిదిక్కులం బర్వునట్లు శరపంజరంబు గట్టి కాచికొనియుంచె నంతలోన. 202

ఉ. భూసురపత్నికిన్ సుతుఁడు పుట్టియుఁ బుట్టినయట్ల నింగికిన్
భాసిలుచున్ మెఱుం గనఁగఁ బాఱె క్షణార్థములోన మేనితో
నాసమయంబునన్ జనులు హా యని మ్రోసిరి బ్రాహ్మణుండు నా
వాసవిఁ గాంచి దూఱుచును బల్కెను గొల్కుల నిప్పు లొల్కుచున్.

సీ. కృష్ణసన్నిధియంద జిష్ణునికడ కేగి
నీక్లీబవాక్యము నేను నమ్మి
మోసపోయితి నోరి మొనగాడ నంటివి
వేఁడు నాకుం జాలి లే దటంటి
కుణప మేఁనియుఁ గనుఁగో రాక యుండె నీ
కలితపరిభావము కలిమిఁ జేసి
నీ నీ యనుచు డాసి రోసిన వాసవి
సిగ్గుపెంపునఁ గడుఁ జిన్నవోయి

తే. తనదువిద్యాప్రభావము దవిలి దాన
సంయమని కేగి మునిసుతుఁ జాడఁ గనక
స్వర్గమున కేగి యుందు నాకస్సురార్భ

వ. ఆగ్నేయ నైరృతి సౌమ్య వాయవ్యాది లోకంబుల నన్వేషించి రసాతలంబు నాకపృష్ఠంబును మఱియుం దక్కిన యెల్ల ప్రదేశంబులును వెదకి వెదకి యెందునుం గానక విఫలప్రతిజ్ఞుండై విషణ్ణవదనంబునన్ వచ్చి వహ్నిప్రవేశంబు సేయ నున్న సమయంబునఁ గృష్ణభగవానుండు దర్శనం బిచ్చి యయస్కరం బగునట్టి కార్యంబు సేయకు మని వారించి నే నాద్విజసూనులం జూపెద ర మ్మని రథం బెక్కించుకొని పశ్చిమ దిఙ్ముఖంబు పట్టి పోవుచుం బోవుచు. 205

దండకము. సప్తాంతదీపంబులున్ సప్తవారాసులున్ సప్తశైలంబులున్ సప్తలోకంబులున్ దాఁటియున్ దాఁటి పైపై మహాధ్వాంత మత్యంతముం గ్రమ్ముకో సైన్యసుగ్రీవముఖ్యాశ్వరాజంబు లొక్కింగయున్వేయ లేకున్న చోఁ గాంచి సర్వేశ్వరేశుండు సాహస్రసూర్యప్రభాభాసమానంబు భాస్వత్సహస్రారచక్రం బవక్రక్రమం బేర్పడన్ ముందుఁ బో నంపి తత్కాంతిధామంబునన్ దారి గానంగ రా దారుకుం డశ్వపుచ్ఛంబు చే ముట్టినంతన్ నిమేషార్ధ నుం దాతమోమార్గముం దాఁటి పోవన్ బరంజ్యోతి పారంబు లేనట్టి తేజంబునన్ నెల్లఁ గన్గొంచు విభ్రాంచ్చుఁ డంతం గనుందోయి హస్తంబులం గప్పికొంచున్ మహోర్మివ్రజం బాకసం బంటికో నెంట ఘూర్ణిల్లు నబ్రాశిపైఁ బోవుచున్ దానిమధ్యంబునన్ దెల్లనై తెల్లమై దీవి చూపట్టి నందున్ మహారత్నవిభ్రాజమానంబు మాణిక్యసంకల్పితస్తంభసంశోభితంబున్ మహాసౌధమందున్ మహాహీంద్రపల్యంకమందున్ మహావైభవం బేర్పడన్ బొల్చి దీపించు సాంద్రాంబుదాభున్ బిశంగప్రభాభాసమానాంశుకున్ సుప్రసన్నాననున్ జారుపద్మాక్షునిన్ దక్షుఁ గేయూరహారాది భూషావిశేషున్ బ్రలంబాష్టబాహున్ మహాకౌస్తుభభ్రాజమానున్ మణీకుండలాంచత్సుగండస్థలున్ శంఖచక్రాయుధోపేతు శ్రీవత్సలక్ష్మున్ సునందాదినందాంచితున్ శ్రీజయాపుష్టితుష్ట్యాదిసంసేవ్యమానున్ మునీంద్రస్తుతున్ విష్ణునిం జూచి కృష్ణుండునుం జిష్ణుఁడున్

ప్రముక్తిఁ జేమోడ్చి సేవించుచుండంగ నారాయణుం డా మునిశ్రేష్ఠులం
గాంచి మీరల్ మదీయాంశజుల్ భూమిభారంబు వాపంగ ని
ట్టైతి రే మిమ్ము నీక్షించు నిచ్ఛం దమునీంద్రాత్మజవ్రాతముం దెచ్చి
తిఁ వీరి కొంపోండు దుష్టాత్ములం ద్రుంచి భూభారముం ద్రెంచి
వే రంపు నాచెంత కం చంచు ఘుఁ వారలుఁ. 206

వ. బ్రాహ్మణపుత్రులం గొని సంప్రహృష్టాంతరంగులై యథాగతంబుగ ద్వారకాపురంబున కరుదెంచి బ్రాహ్మణదంపతుల కాపుత్త్రుల నిచ్చి నం బుచ్చుకొని వా రత్యంతానందంబునం బొంది నరనారాయణులం గీర్తించిరి నరుండును వైష్ణవధామదర్శనంబున సంప్రహృష్టాంతరంగుం డయ్యెఁ గృష్ణుండు నిత్యాద్యనేకాద్భుతకార్యంబు లాచరించి మించిన వేడ్క ననేకాధ్వరంబుల నింద్రాదుల నారాధించుచు దుష్టశిక్షణంబు శిష్టరక్షణంబును గావించుచుండె నని చెప్పి శుకుండు వెండియు. 207

సీ. కృష్ణుండు సంపత్సమృద్ధ మహాద్వారక
నుత్తమస్త్రీలతో నొప్పుమిగిలి
హర్మ్యములం గందుకాది కేళులఁ దేలు
చుపవనంబులయందు నుచితగతుల
విహరించుచుఁ బదాఱువేలపత్నులతోడఁ
గ్రీడించుచును జలకేళులందు
ననురక్తిఁ జూపుచు ఘనవేణువీణాది
గానంబునం బ్రీతిఁ గలిగికొనుచు

తే. నటులయును [illegible] నవ్యవసన
భూషణాదులు దాలిచి వేషము లను
వేసి యాడుచుఁ బాడుచు వేళలందుఁ
వివిధవిలసనములఁ దేలు వేడ్క మీఱ. 208

వ. ఇట్లు గృహమేధిధర్మకర్మస్థితుం డగుసాత్వతేయుం డష్టోత్తరశతాధిక షోడశసహస్రమహిషీమధ్యంబున రుక్మిణ్యాదు లెనమండ్రు పట్టమహా

దేవులం బొంది యందఱకును బదుగురు పదుగురు పుత్రు లుదయించి రొక్కలక్షయు నెనుబదియొక్కవేలు నెనుబదియు నగువారిలోఁ బ్రద్యు మ్నానిరుద్ధ దీప్తిమ ద్భాను సాంబ మిత్ర బృహద్భాను మిత్రవింద వృ కారుణ పుష్కర దేవబాహు శ్రుతదేవ సునందన చిత్రభాను వరూధ కవి న్యగ్రోధు లనుపదునెనమండ్రు నతిరథమహారథోత్తములు త్రివక్రయందుఁ బుట్టినయుపశ్లోకుండు వైష్ణవభక్తుండై నారదశిష్యుండై దివ్యజ్ఞానబోధాత్ముండై స్త్రీశూద్రదాస సంస్కార సంస్కృతంబై స్మరణమాత్ర ముక్తి ననుగ్రహింపఁ గలసాత్వతతంత్రం బగువైష్ణవస్మృతిం గల్పించె. 209

సీ. ఆకృష్ణపుత్రులయందు రుక్మిణి కైన
ప్రద్యుమ్నుఁ డాద్యుఁడై ప్రతిభ గాంచి
మాతులుం డగురుక్మికూతుఁ బెండిలియాడి
కనె ననిరుద్ధుఁ నాగరితయందు
నతఁడు రుక్మికిఁ బౌత్రి యగుసతిం బరిణయ
మై వజ్రునిం గనె నతఁడె మునుల
వాతికి శేషించినయతఁ డాతనికిఁ బ్రతి
బాహుఁ డాతనికి సుబాహుఁ డతఁడు

తే. కనియె నుగ్రసేనుం డనుతనయుఁ డతని
కయ్యె శతసేనుఁ డిల్లగునట్టివార
లల్పబలు లల్ప తేజులు నల్పజీవు
లల్పు లధములు నా నొప్పిరధికు లగుచు. 210

వ. అట్టియదువంశప్రసూతులై విఖ్యాతకర్ము లగువారి లెక్కింపఁ బదివేల వర్షంబులకైన నశక్యంబు వారికి మూడుకోట్ల యెనుబదియెనిమిది వేలపై నొకనూర్గు రాచార్యు లని తెలియ వచ్చె నొక్కయాహుకునకు లక్షాయుతపుత్రు లనినచో నెల్లర లెక్కించుట కేండ్లు పూండ్లు పట్టు దుష్టరాక్షససంహారార్థ మిట్లు శ్రీహరి యదువృష్ణిభోజాంధ

కాదులు నూటయొక్కండు కళలంబులవారి దేవాంశంబునంబుట్టించి తా
నెల్లరకు రక్షకుండై వారితోడం గూడి క్రీడించుచు గర్గాదిఋత్విజన
యాజకత్వంబునం గురుక్షేత్రాదిక్షేత్రంబుల నగ్రిపత్నులతోడ దీక్షి
తుండై లోకసంగ్రహార్థంబు సప్తతంతుతంత్రంబులు నిర్వహించుచు
లోకంబు పవిత్రంబు గావించె నని శుకుండు మఱియు ననేకవిధంబుల
శ్రీకృష్ణుం బ్రశంసించుచుం జెప్పె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు
లాయావృత్తాంతం బంతయు సవిస్తరంబుగం జెప్పు మని సూతు
నడుగుటయును. 211

ఆశ్వాసాంతము

చ. గతమున కెంతమాత్రము నగం బొనరింపంగ బోవం డాత్మలోం
గృతము స్మరించు నెప్పుడు నకించనుం డన్న దయార్ద్రదృష్టి పై
ల్లతుకంగ నాదరించుచుం బ్రియంబునం బ్రోచెడు సాగిసూర్యభూ
పతి నుతియింపంగాం దగడె భాగవతప్రతిపత్తి నచ్చినన్. 212

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
దశమస్కంధమునం దుత్తరభాగంబున సర్వంబును
దృతీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

—:0:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## ఏకాదశస్కంధము

—:o:—

క. శ్రీకలితసాగికులర
త్నాకరజైవాత్రృకుండు హరిపదసేవా
ప్రాకటహృదయుఁడు సూర్య
త్నాకాంతుఁడు సకలసుకవిసన్నుతుఁ డలరున్. 1

వ. అక్కథకుండు శౌనకాదమహామునుల కిట్లనియె నట్లు చెప్పి శుకుండు
మఱియును. 2

మ. ఖలులన్ దైత్యముఖారులం దునిమి లోకంబందు శాంతిస్థితుల్
నెలకొల్పన్ హరి రాముతో జగతికిన్ వేంచేసి దేవాంశముల్
గలరై పుట్టినయాదవప్రజలతో జ్ఞాతిత్వముం గల్గి పో
రులు గల్పించి జగద్భరం బుడిపె శత్రువ్రాతమున్ రాయుచున్. 3

ఉ. కోపితులైనపాండవులకుం గురుముఖ్యులతోడ వైరమున్
రావడఁ జేసి కయ్యమున రాచకులంబులు పెక్కుకోట్లు సే
నాపృతనల్ తెగన్ జలిపి నాలుగుమూలల నేరి యేరి దు
ర్వ్యాపతులన్ వధించి హరి పోకడఁ బెట్టెను భూమిభారమున్. 4

తరువోజ. యదువృష్టిభోజాంధకాదుల ప్రాపు
నందఁగఁ గలఁ డయి యాహరియెల్ల
కదనంబులం దెంచి ఖలులను ద్రుంచి
కాశ్యపీభారంబు కడముట్టఁ జేసి
యెద సంతసింపక యీయదుసైన్య
మిలకు భారము గాదె యెట్టు లిద్దాని

మొదలంటఁ దెగిపోవఁ బొనరించు నెట్లు
పొసఁగువారలు వీరిపొంత రా రాదు. 5

ఉ. ఇంద్రుఁడు నైన వీరి పయి నెత్తి జయింపఁగ నోపఁ డన్యభూ
మీంద్రులఁ జెప్ప నేమిటికి నేనె జయింపఁగఁ బూనుకో నగుఁ
సాంద్రసగోత్రమైత్రము పొసంగుటఁ జెల్లఁగఁ బోవ దద్ది మా
నీంద్రుల శాపశౌర్యమున నిందఱు మ్రందెడునట్లు చేయుదుఁ. 6

వ. మౌనిశాపంబునం జేసి వారి కన్యోన్యకలహంబు పుట్టి వారిలో వారు
పోరాడి వాయుప్రేరితాగ్నిసందర్భంబున వేణువనంబు నోలె వీ రం
దఱు భస్మావశిష్టు లగుదురు గాక యని తలంచి. 7

తే. ఇట్లు భూభార ముడిగించి యెల్లప్రజలు
వ్యాధు లాధులు లేక సౌఖ్యమున మెలఁగు
నట్లు గావించి బలునితో స్వాలయమున
కరిగెద నటంచు నిశ్చితుం డయ్యె శౌరి. 8

—♦ నారదవసిష్ఠాదిమహర్షులు పిండారకతీర్థమునకు వచ్చుట ♦—

తే. అనిన రా జను మునిచంద్ర ఘనులు నిత్య
వృద్ధసేవులు వారి కావిప్రశాప
మెట్లు వచ్చె నేకాత్ముల కెట్లు భేద
మయ్యె నె ట్లీల్గి రొండొరు లరయఁ జెపుమ. 9

సీ. అనిన శుకుం డను నట్లు సంకల్పించి
దామోదరుఁడు నిజధామమందు
సుందరాలంకారశోభితుఁడై నిజ
పత్నులతోఁ గూడి బహువిధముల
విహరించుచును బుణ్యవిహితకర్మంబుల
నాచరించుచు నున్నయవసరమునఁ
గణ్వ విశ్వామిత్ర కాశ్య పాత్రి వసిష్ఠ
భృ గ్వంగి రోసిత విష్ణురాత

తే. నారదాదిమునీంద్రు లాద్వారకకడ
నున్నపిండారకం బనియెన్నఁ బడెడు
తీర్థమున నాడఁ జనుదెంచి తీరభూమి
నధివసించిరి స్వేచ్ఛమై నాడుకొనుచు. 10

వ. అయ్యవసరంబున. 11

ఉ. యాదవనందనుల్ తటమునం దగుసైకతభూస్థలంబునన్
మోదముతోడఁ బెక్కు లగుపోకడలన్ బడి యాటలాడుచున్
గా దనువాఁడు లేక కనుఁ గాననితీఱున సంచరించుచున్
వాదము లాడుకొంచు బహుభంగులఁ గాఁగ వచ్చి రచ్చటన్. 12

క. జాంబవతీసుతుఁ డగునా
సాంబున కాసమయమందు నంతర్వత్నీ
సంబంధం బగు వేషము
సంబరమున వేసి రచ్చు సల్పినరీతిన్. 13

సీ. గుంటలు వడికనుల్ గొనబు దప్పఁగ వెల
వెలఁబాఱు నెమ్మోము వెలయుచుండఁ
గాళ్ళును జేతులు కాడల ట్లయి వ్రేల
నడకల బడలికల్ నలువుమీఱ
మట్టివాసనలతో మట్టుమీఱుచు నూర్పు
లడు గడుగునకుఁ బెల్లడరుచుండఁ
బాలతో నుబ్బినపాలిండ్లపై మొన
లింద్రనీలముతళ్కు లీనుచుండఁ

ఆ. జాకిబానఁ బోలి వ్రేఁకనై యుదరంబు
కాయమెల్లఁ దాను గాఁగ నిండ
నిమ్నతలము లెందునేఁ గానరాక చూ
లాలు గాఁగ నయ్యె సాంబుఁ డపుడు. 14

ఉ. కొంచెతనంబు క్రేళ్లుఱుకఁ గో యని యార్చుచు యాదవార్భకుల్
వెంటన నిండుచూల్ వనిత వేవిలుచు రా మును లున్నచోటికిన్

గెంటసముల్ వచించుచును గెవ్వన నాప్పుచు వచ్చి మ్రొక్కి మేల్
దంటలు మీరు చెప్పుఁడు నెలంతుక కూఁతునో కొడ్కునో కనున్.

ఆ. అడుగ వలయున నెడు నడియాస యగుఁ గాని
సిగ్గు పెంపువలన దగ్గఱి కయి
యడుగఁ జాలకుండె నయ్యా చెప్పుం డని
నవ్వుచుండ మౌనినాథు లపుడు. 16

—♦ మునిశాపంబున సాంబునకు ముసలంబు పుట్టుట ♦—

మత్త. కోపఘూర్ణితనేత్రులై యిటు క్రొవ్వి యుండిరి వీర లీ
యేపు మాపెద మంచు నెంచుచు నిప్పుడే యొకయిన్పదు
డ్డీపెకున్ జనియించుఁ బొం డది యెల్లవంశము వంశమున్
రూపు మాపెడునగ్ని యో యనఁ గ్రూరమై కనిపట్టెడిన్. 17

వ. ♦అని కనలి పలికిన నులికిపడి యదుపుత్రులు సంతప్తచిత్తులై తత్తఱం
పడి జాంబవతీసుతునుదరంబుపైఁ గలవస్త్రంబు లెల్ల విచ్చుచుండు
నంతలో నందు నయస్మయం బగుముసలం బొండు చూపట్టుటయు
నట్టె పడి యడలుచు మనము చేసినదానికి నెల్లరుం గర్హింప కుండ
రని విహ్వలించుచు ముసలముం గొని గృహంబునకుం జని దాని
నుగ్రసేనునకుం జూపి తమపాపంబునకుఁ దల్లడిల్లుచు నెల్లవృత్తాం
తంబు నెఱుంగఁ జెప్పిన నప్పురుషుండును. 18

చ. తవిలెను విప్రశాప మది దైవమ కారణ మెన్న దీని కెం
దెవరును జాలియుండ రగునేనియుఁ జెప్పెద దీని నబ్ధియం
దవునొకటాతఁ జూర్ణ మగునట్టులు చేసి జలాంతరంబునన్
దవులఁగఁ గల్పుఁడీ యనుచుఁ దత్పరతన్ వచియించె నంతటన్. 19

క. వా రట్లు చేసి శేషము
పారావారమ్మునందుఁ బాఱఁగ వేయన్.

---

♦ ఇటఁ బోతనభాగవతమునఁ యదుకుమారులు ముసలవృత్తాంతము కృష్ణునకుఁ జెప్పిన ట్లున్నది. మూలములో నుగ్రసేనునకుఁ జెప్పినట్లును, అతఁడు చెప్పినచొప్పున జేసినట్లు నున్నది.

జేరి చోఱ యూఖిమం బని
యైరకమును మ్రింగె నంత నాచూర్ణంబుల్. 20

వ. అది తరళతరంగపరంపరం జేసి వేలాలగ్నం బయ్యె నంత జాలరు
లామత్స్యంబుం బట్టి దానిగర్భంబునం గలయయస్సయముసలశేషం
బొకలుబ్ధకున కిచ్చిన వాఁడు దాని బాణశల్యంబు గావించుకొనియె
భగవంతుం డిది యంతయు నెఱింగియు నెఱుంగనితెఱంగున మెలం
గుచు లోలో దాని కనుమోదించుచు సమర్థుం డయ్యు విప్రశాపం
బన్యథా పొనర్చుటకుం దలంపఁ డయ్యె ననంతరంబ. 21

—♦ వసుదేవునికడకు నారదుఁడు వచ్చుట ♦—

ఉ. నారదుఁ డొక్కనాఁడు యదునందనుదర్శన మాచరింప గాఁ
గోరి కుశస్థలంబునకుఁ గోరిక లీరిక లెత్త రాఁగ నా
ధీరుని రాకఁ గాంచి వసుదేవుఁడు తోడ్కొని వచ్చి పూజలం
దీరిచి విశ్రమింపఁ గని దేవమునీ! యని మ్రొక్కి యి ట్లనున్. 22

సీ. తల్లిదండ్రులరాక తనయులకుం బలె
నిఖిలభూతములకు నీదు రాక
స్వస్తి కయ్యెడిని మీవంటివా రచ్యుతా
త్ములు దీనవత్సలుల్ తెలియఁ గర్మ
సచివులు సాధువుల్ సజ్జనకోటికిఁ
దర్శించువద మిదుదాత్మమణులు
కావున నడిగెద నేవి ధర్మంబులు
బుధుఁ డేవి కై కొని ముక్తుఁ డగునొ

తే. తెలుపు మే నచ్యుతుం దొల్లి కొలిచి పుత్రుఁ
బొందఁ గోరితి మాయావిమోహితుఁ డయి
నన్ను శిక్షింపు మే నెట్లు నడచి ముక్తి
కాంతసంగతి సుఖ మందఁ గలనొ చెపుమ. 23

వ. అనిన నారదుం డీ వృత్తమోత్తమప్రశ్నంబు గావించితివి విశ్వపావ

బునీతులం జేయు నీ విపుడు పరమకళ్యాణగుణోపేతుం డగునారా యణుని స్మరింపం జేసితి నేను ధన్యుండ నీయడిగినయర్థంబు తేటపడ విదేహర్షభసంవాదరూపంబై తగుపురాతనపుణ్యేతిహాసంబు గలదు చెప్పెద నాకర్ణింపుము. 24

—♦ నారదుండు వసుదేవునకు విదేహర్షభసంవాదము చెప్పుట ♦—

సీ. తనరు స్వాయంభువమనువునకు సుతుండు
ఘనుండు ప్రియవ్రతుం డనెడువాండు
వాని కాగ్నీధ్రుండు సూనుండు వానికిం
దనయుండు నాభి యాతనికి ఋషభుం
డచ్యుతాంశంబున నవతరించె నతండు
శ్రుతిపారగం బగుసుతశతంబుం
గనియె నం దగ్రజుండును జనార్దనపరా
యణుండును భరతాఖ్య నలరువాండు

తే. వానిపేరిట నెసంగె నీభరతవర్ష
మతండు భోగములను విడనాడి వనుల
కరిగి హరిం గూర్చి తపియించి యవల ముందు
జన్మముల నెల్ల నుత్తమస్థాన మందె. 25

క. భరతునకుం దొమ్మండుగు
రరుదారంగ సుతులు వార లాభారతగ
హ్వరిం దొమ్మిదిదీవులకుం
బరివృఢులై యేలి రధికవైభవ మెసంగన్. 26

వ. వారు తొమ్మండుగురికిం దొమ్మండ్రుగా నేకాశీతిపుత్రు లుదయించి కర్మమార్గప్రవర్తకులై బ్రాహ్మణోత్తములై ప్రవర్తించి రందుం గవి హరి యంతరిక్షుండు ప్రబుద్ధుండు పిప్పలాయనుండు ఆవిర్హోత్రుండు ద్రిమిళుండు చమసుండు కరభాజనుండు ననుతొమ్మండుగు రాత్మ విద్యావిశారదులై దిగంబరులై యోగాభ్యాసంబు గావించి ముక్త

లైరి. సుర సిద్ధ సాధ్య విద్యాధర గరుడ గంధర్వ యక్ష కిన్నర
నాగాదిలోకంబుల నవ్యాహతేష్టగమనులై సంచరించుచు నొక్కనాఁ
డజనాభద్వీపంబునఁ బ్రవర్తించుచు నిమిసత్త్రంబునకు యదృచ్ఛాగమ
నంబున వచ్చి రావిదేహుండును నారాయణపరాయణు లగువారిం
దెలిసి భద్రాసనాసీనులం జేసి పూజించి బ్రహ్మపుత్త్రోపములై
ప్రజ్వరిల్లు వారిం గాంచి ప్రశ్రయావనతుండై యి ట్లనియె. 27

సీ. భగవంతునకు మీరు పార్షదు లనఘులు
దైవభక్తులు లోకపావనార్థ
మిట్లు చరింతు రోఋషిజనేశ్వరులార!
జన్మములఁ నరజన్మ మరయ
నత్యంతదుర్లభ మది యీశ్వరప్రియ
దర్శనమై క్షణార్థంబు నైన
జనులకు శేవధి సత్సంగ మగుఁ గాన
నడుగుచుంటిని క్షేమ మగువిధంబు
తే. భాగవతధర్మములు విన వలతుఁ దగుదు
నేని చెప్పుఁడు హరి యాత్మ నైన నిడుఁ బ్రి
సన్నుఁడై ప్రపన్నుల కని జనకుఁ డడుగ
గౌరవించుచు నందఱుఁ గవి వచించె. 28

— కవ్యాదులు విదేహునకుఁ జేయుపరమార్థోపదేశము —

ఆ. తెలియ సత్యరహితదేహాదులఁ సత్య
భావనఁ బొనర్చి వఱలువాని
కగు భయంబు సర్వ మచ్యుతుఁ డని తత్ప
దబ్జసేవ సలుప నడఁగు భయము. 29

తే. మనుముఖులచేత వర్ణాశ్రమముల ధర్మ
ములను జెప్పించి యజ్ఞానమున మునింగి
యున్న వారికి జ్ఞానంబు క్రన్న నబ్బఁ
బలికె ధర్మము లవి భాగవతము లరయ. 30

ఉ. భాగవతార్థధర్మములఁ బట్టి చరించెడునట్టిమానవుం
డేగతినైన విఘ్నముల నెప్పుడు నొందఁడు రెండుకన్నులుం
వీఁగక మూసికొంచుఁ బరువెత్తినఁ గాని కొనండు తొట్రు భూ
భాగమునందుఁ గూలఁ డని వాకొనుచుంటి నరేంద్రచంద్రమా. 31

ఆ. మనసు వాక్కు కాయమును బుద్ధి యాత్మయు
నింద్రియములు లోగ నెల్లకరణ
ముల నొనర్చుకర్మము లవెల్లఁ బరమేశ్వ
రార్పణమ్ముగా నొనర్ప వలయు. 32

సీ. భగవంతుఁ డనఁబడువాఁడు లేడనువాఁడు
తన్మాయచే వానిఁ దవుల లేదు
దేహాదులం దాత్మ నూహించుచు విపర్య
యమున నాతఁడు ద్వైతుఁ డగును నూవె
దానిచేత భయంబు దారొకనుఁ గావున
విద్వాంసుఁ డగువాఁడు విద్యవలన
గురుదేవతాత్ముఁడై పరభక్తియుక్తుఁడై
భజియింపఁ దగు భగవంతు నెడఁద

తే. లేని ద్వైతము నూహించు వాని కెన్న
స్వప్నగతిమనోరథములవలెను దోఁచు
నన్ని కాన సంకల్పసమంచిత మగు
మనము నరికట్ట భయ మది మలఁగి పోవు 33

ఉత్సాహము. భద్రిముల్ రథాంగపాణిభవ్యజన్మకర్మముల్
క్షుద్రతాగుణంబు లేక కోరి వినుచు నెప్డు ని
ర్నిద్రభక్తి సర్వలోకనిత్యగీతముల్ మనో
ముద్రితములు వాని నామములు పఠించుచుండ నౌ. 34

చ. వృతుఁ డయి యిట్లు స్వప్రియము విష్ణుకథామృతనామకీర్తనం
బతులితరీతిఁ జేయుచు సమంచితరాగము గల్గి నున్నతో

న్నతగతి నార్చు నేడ్చు మఱి నవ్వును నృత్య మొనర్చు లోకసం
గతి విడి పిచ్చివానివలెఁ గానఁగ వచ్చి పరిభ్రమించెడున్. 35

శా. ఆకాశంబును వాయు వగ్ని ధర తోయంబుల్ రవీందుగ్రహా
♦నీకంబుల్ భములున్ దిశావలయముల్ వృక్షంబులున్ బక్షులున్
గోకాదుల్ మృగకోటులున్ వనధులున్ గోత్రంబు లేర్లున్ గృముల్
శ్రీకాంతాకృతు లం చనన్యమతిమై సేవించు యుక్తుం డెదన్. 36

మ. హరినింగొల్చిభజించుమానవునకుం బ్రాప్తించెడిన్ భక్తియున్
బరమేశానుభవంబు బుట్టియును నప్పట్లం గడుం దుష్టి గ
ల్గి రహిం గాంచెడు వాఁడు భోలెఁ గనసై కీర్తింపఁగా నొప్పు నా
హరిసంకీర్తనచంద మిట్టి దన శక్యం బౌనె యేవారికిన్. 37

ఆ. అచ్యుతాంఘ్రిభజన మట్లాచరించిన
వానికిన్ విరక్తి భక్తి గలిగి
తత్ప్రసాదగరిమఁ దర్దయు శాంతుఁడై
భాగవతుఁడ యగుచుఁ బరఁగు జనుఁడు. 38

వ. అనిన నిమి మఱియు మునులదిక్కు మొగంబై భాగవతుం డెట్టివాఁడు
వానిధర్మం బెట్టిది యెట్లు చరించు నేయేలింగంబులు గలిగి భగవ
త్ప్రియుం డగుచుండుం జెప్పఁ డనిన హరి యి ట్లనియె. 39

—♦ భాగవతస్వరూపనిరూపణము. ♦—

తే. సర్వభూతములందు సాక్షాదనంత
భావమును జేసి సర్వ మవ్యానియందుఁ
గలిగి యుండెడునట్లు గాఁ దలఁచునతఁడు
పలుక బడుచుండు నుత్తమభాగవతుఁడు. 40

మ. భగవత్త్వమునందుఁ బ్రేమయును దద్భక్తాళిపై మైత్రియున్
దగులుంబాటుల కైనమూఢులపయిం దాత్పర్యమున్ బాయ నై

♦ భములు=నక్షత్రములు. కృములు=పురుగులు;

తగునవ్వారలపై నుపేక్షయును జిత్తంబందుఁ గావించువాఁ
డగు నాభాగవతుండు మధ్యముఁడనన్ వ్యాఖ్యానముం జేయ నా.

తే. విగ్రహారాధనమునందు వేడ్కఁ దగిలి
యితరభక్తాదిపూజల నెపుడు సలుప
భావ మొనరింపకుండెడు పంచజనుఁడు
పరగుచుండును బామరభక్తుఁ డనఁగ. 42

చ. అరయఁగ నింద్రియార్థవిషయంబుల నొందుచు నుండునట్టిఁడై
పురుషుఁడు ద్వేషరాగములఁ బొందక సర్వము నీశ్వరార్పణ
స్థిరమతి నుండెనే నతఁడు చెప్పఁగ నొప్పు ధరాతలంబునన్
దురితవిదూరుఁ డన్నుడిఁ నగు భాగవతప్రధానుఁడై. 43

తే. ఎపుడు దేహేంద్రియప్రాణహృన్మతులకు
జన్మమృత్యుక్షుధాభయ శ్రమగతులను
ముహ్యమానుఁడు గాక యేప్రొద్దు హరినిఁ
దలఁచు గృహి భాగవతముఖ్యతముఁడు సువ్వె. 44

తే. కామకర్మబీజంబులు కలుగ కుండి
వాసుదేవైకనిలయుఁడై వఱలుచుండు
నతఁడు భాగవతోత్తముఁ డనఁగ నొప్పు
ననుచుఁ దెలియంగ వలయు నో మనుజనాథ. 45

చ. జననము కర్మముల్ మఱియు జాతియు వర్ణము నాశ్రమంబు నే
మనుజున కాత్మదేహమున మాటి కహంకృతి గల్గఁ జేయవో
ఘనుఁడు హరిప్రియుం డతఁడు కాంచనకాయములందు నీది నా
దనెడువిభేదముల్ విడిచి నట్టిఁడు భాగవతోత్తముం డగున్. 46

చ. సదమలమూర్తి శ్రీహరిని స్వాంతమున న్నివసింపఁ జేసి త
త్పదనఖరత్నదీధితులఁ దాఁకునఁ బార్వణచంద్రకాంతి భూ
పదమును బోలెఁ దాప మది పాయుటఁ జల్లదనంబు గ్రిమ్మగాఁ
బొదలుచునుండు భక్తుఁడు సముజ్జ్వలభాగవతుండు నాఁబడున్. 47

—♦ విష్ణుమాయాప్రభావము ♦—

వ. అనిన రాజేంద్రుం డో మునీంద్రా! విష్ణుమాయ మాయావులం గూడ మోహింపఁ జేయుచున్నది తద్విధంబు విన మనం బభిలషించు చున్నది గావున నెఱింగింపుము. 48

క. మీవాకునుండి వెడలిన
గోవిందకథామృతంబు గొనకొని సంసా
రావృతసుతాపతప్తుల
కేవేళ మహౌషధముగ నేర్పడుఁ గాదే. 49

వ. అంతరిక్షుం డిట్లనియె. 50

సీ. సత్త్వాదిగుణముల సంబంధ మది లేక
స్వప్రకాశంబునఁ జనెడునాత్మ
యట్టితా గుణవశుండై శరీరంబె తా
నని భ్రమించెడునదియ హరిమాయ
యీశ్వరుం డద్దాన నే వివిధం బగు
జగము సృజింపంగఁ దగిలియుండు
మన మింద్రియంబులు గన నస్థిరంబులై
దేహముల్ దిర మని తిరుగు భ్రమను

తే. స్వప్నములను బాహ్యేంద్రియసంగతిఁ గొన
నట్టియంతఃకరణము స్వప్నాదు లెల్ల
సత్యములును స్థిరము లంచు సంభ్రమించు
దీనినే మాయ యని చెప్ప నొను గాదె. 51

వ. బాహ్యాంతరజ్ఞానశూన్యం బగుసుషుప్తిమందు వాసనాబీజములు మాత్రము శేషించు నదియును బ్రకృతిసంబంధసంజనితమే యిట్టి మూడవస్థలతోఁ గూడినప్రత్యగాత్మ ప్రకృతిపరిణామ మయినదేహ మును విడిచినప్పుడు గలిగినది తుర్యావస్థ యనంబడుచుండు. 52

సీ. జీవస్వరూపముఁ జెప్ప రాగాదుల
వలనఁ గలుషముగాఁ గలరుదానఁ

బరిశుద్ధ మనఁ దగు నరయ నెట్టియవస్థ
లే కుండునది గాన నేకమ యగు
జ్ఞానైకరస మైనదా నట్టు లైన నా
ప్రత్యగాత్మకు దేహబంధము నగు
స్వప్నమం దగువస్తుసముదయ మస్థిర
మది స్థిరంబై తోఁచునట్లు మూఁడ

తే. వస్థలం గూడునింద్రియపంచకంబుఁ
దోడ నంతఃకరణమునఁ దోఁచుచుండు
నిట్లు తోఁచు టనాదులౌకృతుల నైన
ఫల మని యెఱుంగవలయు నోసలలితాత్మ. 53

వ. ఇట్లాత్మయందు మాయాకార్యము లగుమూఁడవస్థలుం గలుగుట నడుమ నైనకర్మఫలంబ కాని స్వాభావికంబు గాఁ దని యెఱుంగునది.

మ. కలలం గన్నసుఖం బనిత్య మగుచుం గానంగ నైనట్టు లి
య్యిలలోఁ గల్గుసుఖంబు లన్ని యనుచుం హృద్వీథిఁ జర్చించినం
దెలియుం గావున క్షుద్రసౌఖ్యములకుం జేతోగతిం గోరికల్
సలుపం బోవక దేహధారి హరినిం సంధింపఁగా నొప్పెడిన్. 55

తే. సకలభూతాంతరాత్ముఁడై స్వామిమాయ
వలన భూతసమష్టిచేఁ బలువిధముల
భూతములసృష్టి చేసి యాభూతజాత
మందుఁ దా నుండి దీపించు ననవరతము. 56

సీ. పురుషార్థసిద్ధికై భూతపంచకము చే
సృజియింపఁ బడినశరీరమందుఁ
బ్రత్యగాత్మ ప్రవేశ మత్యయంబునఁ జేసి
నింద్రియాదులచేత నెల్లనాఁడు
తనదుజ్ఞానము పదియును నొక్కఁ డగువిధ
ముల విభజించి యిమ్ములను విషయ

ములఁ గుడుచు గాని తెలిసి పరాత్పరు
సేవింపఁ దలఁపఁడు చిత్తమందు

తే. జీవుఁ డాభగవంతునిచే సృజింపఁ
బడి శరీరము నాత్మగా బడి నెఱింగి
యింద్రియములచే శబ్దాదు లెల్ల విషయ
ముల ననుభవించు నైహికములను దవిలి. 57

ఉ. జీవుఁడు పూర్వదేహములఁ జేసినకర్మముఁ జేసి పుణ్యపా
పావృతుఁడై చరించుచుఁ దదర్హగతిం జనురూప మెత్తి యీ
భూవలయంబునందు సుఖము న్మఱి దుఃఖము నొందఁ గల్గి యీ
శేవను జచ్చి పుట్టుచు నటించును గల్పము దాఁక వీఁకమై. 58

సీ. ప్రళయకాలమున నీబహుళప్రపంచము
రూపఱి పోవు నీయేపు దక్కి
నూఱేం డ్లనావృష్టి యౌ ఱేయి పవలును
సూర్యుఁ డగ్నియుఁ గాల్పఁ జూతు రవని
స్థల మెల్ల బూదె యౌ జలధరంబులు వెన్క
సర్వంబు జలధిగా సంతరించు
నపుడు తమోమయమై పోవు నంతయు
లయ మగు సర్వము నయము దొరఁగి

తే. ఇట్టు లీశ్వరుమాయచే నేఱుపడును
సృష్టియును గల్గు వెండియు స్రష్టవలస
సత్త్వము రజస్తమంబు లీసంగతులకుఁ
గారణంబగుచుండునో భూరి తేజ. 59

వ. అనిన జితేంద్రియులకును దరింప రానియీభగవన్మాయ మాబోఁటి
మూఢాత్ము లేవిధంబునఁ దరింతు రెఱింగింపు మనినఁ బ్రబుద్ధుం
డి ట్లనియె. 60

—♦ ప్రబుద్ధుఁడు చేసినపరమార్థోపదేశము ♦—

చ. మనుజుఁడు పత్నితోఁ గలసి మానవలోకసుఖంబు లొందఁ గాఁ
బొనరుచుఁ గామ్యకర్మములు మోహవశంబునఁ జేసి సౌఖ్యదం
బనునది దుఃఖదం బగుచు నాతని కెంతయు వంత గూర్పనై
కనఁగొన వచ్చు నందునను గాల మదంతయు రిత్త యయ్యెడున్.

చ. ధనమున సర్వసంపదలు దాపర మౌ నని దానిఁ గూర్పఁ గా
జనుఁడు ప్రయత్నముల్ సలుపు సర్వవిధంబులఁ బ్రాణ మేగు న
న్నను దలఁకంగఁ బోవక మనంబున దాన నతండు దుఃఖ మే
కొసియెడు నట్టివాఁ డగును గొంచెము యేని సుఖంపఁ డెందునన్.

వ. ఇట్లే భార్యాపుత్రమిత్రగృహారామగోహిరణ్యాదు లవి కష్టసాధ్యంబులై సుఖదంబులవలెం గానిపించి తుద కవి యస్థిరంబులై దుఃఖదంబులై యగుచుండు నేతత్సుఖంబువలె స్వర్గలోకసుఖంబు ననిత్యం బిది కర్మఫలంబు నశియించినప్పు డదియును నశించు నిహపరసుఖంబు లిట్టివిగా నుండుం గావున వానియందు విరక్తుండై యుత్తమం బగు శ్రేయస్సు నొంద సాధనంబు సంతరించుకొనవలయు నాకర్ణింపుము. 63

సీ. వేదవేదాంతముల్ విశదంబుగా నేర్చి
బ్రహ్మవిజ్ఞానియై పరఁగువాని
రాగముల్ ద్వేషము రానీక మది కెప్డు
సత్యసంపన్నుఁడై చనెడువాని
గురువు శరణుఁ జొచ్చి కొనకొని తన్మూల
మున భాగవతధర్మముల నెఱింగి
దాన సర్వ మొసంగు దాత్మశిఖామణి
సర్వేశ్వరునిసేవ సలుప వలయు

తే. నతఁడు సంతుష్టుఁడై భక్తుఁ డైనవాని
విడువ కెప్పుడు పరమార్థవితతు లెల్ల
నెట్టులుం జెడకుండెడు నట్టిపగిది
నొసఁగి రక్షించుచుండెడు నోనరేంద్ర. 64

వ. ఆధర్మంబు లెఱింగించెద నాలకింపుము జ్ఞాని యగువాఁడు దేహబంధువులతోడిసంగంబు విడిచి సాధుసజ్జనసహవాసంబు చేయుటయు భూతదయయు దీనజనానుగ్రహంబును నుత్తములం దడఁకువయు బాహ్యాభ్యంతరశౌచంబును నిజవర్ణోచితధర్మానుష్ఠానంబును ద్వంద్వసహనంబును దపంబును వేదాధ్యయనంబును ద్రికరణశుద్ధియు నార్జవంబును బ్రహ్మచర్యంబును భూతద్రోహంబు లేమియు నహింసయు శీత ముష్ణము సుఖము దుఃఖము లోనివానియందు సమత్వంబును సకలచేతనాచేతనసమూహంబులఁ బరమాత్మజ్ఞానంబును బరిగ్రహంబు లేక యేకాకియై యుండుటయు గృహారామక్షేత్రకళత్రాదులందు నిరభిమానంబును శుద్ధవల్కలధారణంబును యథాలాభసంతుష్టియు భగవత్ప్రతిపాదకశాస్త్రాభిమానాదరాతిశయంబును బ్రాణాయామంబున మనంబును మౌనసత్వంబుల వాక్కును సంతరించుకొనుటయు నంతఃకరణ నిగ్రహం బగుశమంబును దమంబునుం గలిగి శ్రీహరిజన్మకర్మగుణాదు లాలకించుటయుఁ గీర్తించుటయు ధ్యానించుటయు యజనంబులు దానధర్మంబులు లోనగుకర్మంబులును బుత్రమిత్రకళత్ర గేహ దేహాదిసర్వం బీశ్వరార్పణంబుగా నివేదించుటయు హరిభక్తపరాయణు లగునరులందు సౌహార్దమును జరాచరభూతంబులందు బహుమతియు మహనీయులవలనం జేరి భగవంతునియశఃకీర్తనంబును బరస్పరానురాగంబును దానంజేసి తుష్టియు దానివలన నాధ్యాత్మికాదితాపత్రయంబు నివర్తింపఁ జేసికొనుటయు లోనగు నుత్తమధర్మంబు లభ్యసించుచుఁ బ్రేమలక్షణం బగుభక్తిని సంపాదింప వలయు. 65

— భ క్తి ల క్ష ణ ము లు —

సీ. భక్తిలక్షణములు పలికెద విను భక్తుఁ
డార్తున ట్లుండు దేహమున గగురు
పాటు గల్గి మెలంగు బాహ్యప్రపంచము
నెఱుఁగకుండు న్నవ్వు నేడ్చు నార్చు

నానందపరవశుండై యేమి యేమి యో
తనలోనఁ దాఁ బల్కుకొనుచునుండు
నాడును బాడును నట్టిట్లు నడచును
గ్రిందు మీఁదును జూచుఁ బొందు విడును

తే. ఈశ్వరస్వరూపాదుల నెపుడు విడక
యుల్లమునఁ బరిశీలించుచుండుటయును
బరమపురుషునితో సుఖస్పర్శసుఖము
గలుగు టివి భాగవతధర్మములు తలంప. 66

క. భాగవతధర్మపరుఁడై
వీఁగఁక సతతంబు మదిని విష్ణునిసేవన్
లోఁ గొనియెడువాఁడా మా
యాగతులఁ దొలంగుఁ దనకు నగుభక్తిమెయిన్. 67

వ. అనిన జనకుండు నాకు నారాయణాఖ్యం బగుపరబ్రహ్మంబు స్వరూప
స్వభావంబులు తెల్లంబుగం దెలుపవలయు మీరు బ్రహ్మవిదులందుఁ
దలమానికంబు లనినఁ బిప్పలాయనుం డి ట్లనియె. 68

— పిప్పలాయనుఁడు చెప్పినబ్రహ్మస్వరూపము —

సీ. సృష్టిస్థితిలయాదిహేతువై జాగర
స్వప్నసుషుప్త్యాద్యవస్థలందు
నఖిలాత్మలందును వ్యాపించియుండెడు
వాఁడు దేహేంద్రియప్రాణబుద్ధి
చిత్తాదులు మెలంగఁ జేయువాఁడుఁ బిపీలి
కాదుల బ్రతికించునట్టివాఁడు
పరమేశ్వరుఁడు పరబ్రహ్మ మంచు నెఱుంగ
వలయు నయ్యది మనోవాగ్గతులను

తే. దెలియ శక్యంబు గానిదై తేజరిల్లుఁ
బ్రాణములు జీవుఁడును నింద్రియార్థములును

తద్గుణంబులు గాన నింతయును దానిఁ
దగిలి వెలిఁగింపఁ జాలవు తథ్యముగను. 69

వ. అవినాశనంబు నవాఙ్మానసగోచరం బగునట్టిపరమేశ్వరునిభక్తిజ్ఞాన
వైరాగ్యాదులు గలిగి యీషణత్రయంబు జయించి రాగద్వేషాదులం
దగులక యింద్రియసమూహంబు లహంకారమమకారాది మనోవ్యా
పారంబు లుడిగి పదంపడి నిరంతరధ్యానయోగంబునం జేసి సమాధి
నిశ్చలుండై యోగి యోగమార్గానుయాయియై సూర్యతేజంబువలెఁ
జూడఁ గలుగు ననిన విదేహుండు నాకు భగవదారాధనరూప మగు
కర్మయోగముం జెప్ప ననుగ్రహింపుఁ డీకర్మయోగము జెప్పఁ దని
తొల్లి మాతండ్రి యిక్ష్వాకుని సమక్షంబున నేను సనకాదుల నడి
గితిం గాని వా రప్పుడ జెప్ప రయిరి. చెప్పకుండుటకుఁ గారణంబును
విన నెంచితి ననిన ననిర్హోత్రుం డి ట్లనియె. 70

—♦ క ర్మ యో గ ని ర్వ చ న ము ♦—

సీ. కర్మ మకర్మ వికర్మ భేదంబులు
గలిగి యుండును గామ్యకర్మ మనియు
వైదిక మనియును వర్ణింపఁ బడు నది
వేదోక్త మగుచును వెలయుచుండు
నందుఁ దెలిసికొనంగ నగువిషయంబులు
పెక్కులు కల వట విజ్ఞజనులు
తడబడుచుందు రోధరణీశ! బాలుఁడ
వని నీకుఁ జెప్ప రాసనకమునులు

తే. శ్రుతిహితాహితములఁ దెల్పుఁ జూడ నందు
"స్వర్గకామో యజేత" యను వాక్య మొప్పు
నది పరోక్షార్థముం దెల్పునట్టి దనుచుఁ
దెలియు టతికష్ట మగుచును దెలుపుచుంటి. 71

ఉ. వైద్యుఁడు కండచక్కెరను బాలున కిచ్చెద నంచుఁ బల్కుచున్
వైద్యము గాఁగ మందు నిడుఁ బక్క నవాంతరభాగ్యభోగ్యముల్

హృద్యము లంచు నాస పడురీతి వచించెదునట్లు యజ్ఞక
ర్మాద్యనఘక్రియల్ సలుపునట్లు వచించెదునట్టి నా శ్రుతుల్. 72

ఆ. చెప్పినట్టిఫలము చేకుఱ నీయక
భక్తియోగమునను బంధక మగు
పుణ్యపాపఫలము పోకాఱఁగా ముక్తి
గలుగు ననుచుఁ జెప్పఁ గలవి యగును. 73

వ. ఇంద్రియాధీనుం డగునజ్ఞుండు వేదవిహితకర్మ మాచరింపక విరుద్ధకర్మం బుల నాచరించుచు ముమూర్షువై మృత్యువునుండి మృత్యువునే పొం దుచుండును గావున వేదోక్తము లగునిత్యనైమిత్తికకామ్యకర్మముల నీశ్వరార్పణబుద్ధిం గావించుచు నవాంతరఫలంబుల సంగంబు లేనివాఁ డెల్లకర్మముల నాచరించుచు జ్ఞానము నొందఁ గలుగు దాన మోక్షంబు సిద్ధించు నింకఁ బూజావిధు లెఱింగించెద నాలకింపుము.

— ఈశ్వరపూజావిధివిధానము —

సీ. గురువు చెప్పినరీతి పురుషుఁడు దేవతా
ప్రతిమ ప్రతిష్ఠించి భక్తి దాని
నభిముఖుంబుగ నాసనాసీనుఁడై యుండి
పొసఁగుప్రాణాయామములను దేహ
పరిశోధనము న్యాసగరిమచే రక్షయుఁ
గావించుకొనుచుఁ దత్కాలమందుఁ
బ్రాప్తసాధనములఁ బరమేశు నర్చింప
నగుఁ దులసీచందనాదుల నిడి

తే. పిదప భూభూతశుద్ధి గావించి వేల్పు
ప్రతిమఁ బంచామృతంబుల వారివలన
శోధనము చేసి నీశ్వరు శుద్ధమూర్తి
నందు నావాహనము సేయ నగును భక్తి. 75

వ. ఆవాహనము, నాసనము పాద్యము నర్ఘ్యము, నాచమనీయము స్నానము వస్త్రము భూషలు, గంధమాల్యాక్షతలు పుష్పదామ ధూప దీప నైవేద్యములు తాంబూల ప్రదక్షిణములు లోనగునుప చారంబుల యథావిధ్యర్చనంబు గావింప వలయు మఱియు నాయా మూర్తులకుం దగునంగోపాంగంబులను సుదర్శనాదులను దత్తన్మూర్తి మంత్రంబుల నర్పింపవలయు నిట్లు పూజ గావించి స్తుతించి నమస్క రించి యమ్మూర్తిం దనయంతరాత్మ నధివసింపం జేసికొని ధ్యానించి పిదపఁ బ్రసాదభక్షణంబు గావించి తులసీపుష్పాదులు శిరస్సున ధరించి దేవున కుద్వాసనంబు చేసి పూజావిధిం దీర్పవలయు నిట్లు సూర్యా గ్నిజలాదుల సర్వాంతర్యామి యగునీశ్వరుని యజించినవాఁ డచిర కాలమున భక్తియోగము నిష్పన్నమై కర్మబంధమునుండి ముక్తుం డగుచున్నాఁ డని చెప్పిన జనకుండు శ్రీమహావిష్ణువు కర్మబద్ధుండు గాక స్వయంవ్యక్తుండై యెందెం దేయేయవతారము లెత్తి యేయే కర్మము లాచరించెనో యేయేకర్మములు చేయుచుండునో యేయే కర్మముల చేయనుండనో చెప్పుఁ డనిన వారిలో ద్రమిళుం డి ట్లనియె.

—♦ ద్రమిళుండు చెప్పిన భగవదవతార విశేషములు ♦—

ఉ. భూవరభూమిరేణువులఁ బోలిచి యిన్నని లెక్కపెట్టఁ గా
నేవలఁ కైన శక్య మగునేమొ వచింపఁగ లేము గాని యా
శ్రీవరుసద్గుణంబులను శేషఫణీంద్రులు వేలు కోట్లు నే
నేవిధి నెంతకాలమున కేనియుఁ జాలరు లెక్కపెట్టఁగన్. 77

తరునోజ. అతఁడు బ్రహ్మాండము లన్నియుం జేసి
యందు నిజాంశము నలరంగఁ జేసి
ప్రతిలేనిమహిమ విరాడ్రూపు డనఁగఁ
బ్రబలి ము న్నున్న వైరాజపూరుషత
సతి తేజమును గూడ నఖిలప్రపంచ
మరయుచుం బ్రోచుచు హర్షించుచుండు

నతఁడు సర్వేశ్వరుం డాదిమమూర్తి
యగుదేవదేవున కంజలి యిడుదు. 78

తే. మొదట నజుఁడై రజోగుణమున సృజించు
నడుమ హరి యయి సత్త్వమునను భరించు
నవల హరుఁ డయి తమముఁ నది హరించు
నిదియె వైరాజపురుషునభ్యుదయ మగును. 79

వ. ఆకర్ణింపు మయ్యాదినారాయణుండు ధర్మునకు దక్షపుత్త్రిక యగు మూర్తి యనునామెయందు నరనారాయణు లన నిరువురుగా నవతరించి జ్ఞానయోగము నారదాదుల కుపదేశించె నిప్పటికిని వారు బదర్యాశ్రమంబునఁ దపించుచున్నవారు. 80

ఉ. వారు తపోమహత్త్వమున వాసవలోకము నాక్రమింపగాఁ
జేరుదురో యటంచు మదిఁ జేర భయం బది తత్తపంబు వో
కారఁ బొనర్ప నచ్చరలఁ గామునితోడుగఁ జేసి పుచ్చ గా
వారు ధరాతలంబునకు వచ్చిరి పెచ్చినయిచ్చపెంపునన్. 81

వ. వార లాబదరికాశ్రమంబున నరనారాయణులచెంతకు రా వారు వారిం దిలకించి యది యింద్రునియుపచారం బని యెఱింగి వారి నెల్ల వంచించువారై రప్పుడు. 82

శా. ఆనారాయణునూరుభాగమునయం దావిర్భవం బంది ల
క్ష్మీనారీమణియో యనంగ గరిమన్ జెల్వారుచున్ మోహినీ
శ్రీ నల్మూలలఁ గ్రుమ్మరించుచు నటన్ స్త్రీరత్న మొక్కర్తు బ్ర
హ్మానందం బెసఁగించె నూర్వశి యనం స్వాఖ్యన్ బ్రబోధించుచున్.

ఉ. అయ్యది యెల్లవారి కెదురై చనియుం జను దెందు రందు మా
యయ్య మిమున్ భజింపు మని యాజ్ఞ యొసంగెను నాకు మీ కిటన్
నెయ్యము లియ్య నేర్పడఁగ నే నిపు డిచ్చెద నాతిథేయమున్
బుత్త్ర్యగ క్షుద్భరంబు తిని పోవగఁ బ్రార్థన మాచరించెదన్. 84

వ. అనిన నెల్లరు నవ్వనితామణికిఁ గని నివ్వెఱపడి సిగ్గున డిగ్గనఁ
దలలు వాంచి మించుబోఁడితో నారాయణమునిసమీపంబునకుం జని
నమస్కరించి యపరాధంబు సైఁపు మని ప్రార్థించుచు. 85

చ. ప్రకృతివిలక్షణుండవు స్వభావవినిర్మలచిత్తవృత్తి వో
సుకృతి! భవన్మహత్త్వమును జూడనివారమమై మనంబునం
దొకనిగ నెంచి వచ్చితి మఱియో యపరాధము చేసినార మో
ర్వక నినుఁ దప్పు సైఁపు మని పాదములం బడి వేఁడి రార్తులై. 86

సీ. అని వేఁడినఁ బ్రసన్నుఁ డగుచు నారాయణ
ముని నన్ను వంచింపఁ బూని పంచెఁ
బాకశాసనుఁడు మి మ్మాకరణిన్ మాకు
నాయనమాయ లవన్ని మదికిఁ
దెలియనియవి కావు దేవాంగనలకంటె
రూపవతులు లేమిఁ జూపుట కిటుఁ
గావించె మాకు వికారము జనియింప
రంభాదులను బుచ్చి రంహాముగను

తే. ఇదిగో నాయూరువున బుట్టె యిగురుఁబోఁడి
యచ్చరల కెచ్చువచ్చెడు నరసి దీని
నే నొసంగెదఁ గొనిపొండు మీనివాస
మున కనుచు నిచ్చి పుచ్చె నమ్ముదిత నపుడు. 87

—• భగవంతుని దివ్యావతారములు •—

శా. ఆనారాయణమౌని వాక్యముల నయ్యబ్జాక్షు లాలించి యెం
తేనిఁ సిగ్గున నొండు పల్కుటకు గా కింతింతలో నూర్వశిం
దో నేతేరఁగఁ గొంచు స్వర్గమునకుం దోట్రిల్లుచుం బోయి వా
కో నింద్రుం డెద విస్మయంపడి మునిం గొండాడె భీతాత్ముఁడై. 88

వ. ఇది నారాయణావతారంబు నంతరంబ హరి జగన్మంగళంబు గావింప
నిజాంశంబునం జేసి హంసస్వరూపుండును దత్తాత్రేయుండును సనంద

నాదులును మాతండ్రి యగుఋషభుండును నై యవతరించి లోకం బునకు జీవాత్మపరమాత్మస్వరూపజ్ఞానయోగ ముపదేశించె మధుసం హారము చేసినమాధవుఁడే హయగ్రీవుండై యవతరించి యపహృతము లగువేదంబులు వెండియుం గొని తెచ్చెఁ బ్రలయకాలంబున మత్స్యా వతారం బెత్తి సత్యవ్రతాదులం బ్రోచె వరాహావతార మెత్తి ప్రళ యజలంబులం బడినభూమిని సముద్ధరించి హిరణ్యాక్షుని సంహరించెఁ గూర్మావతారంబున సంద్రంబుఁ దఱచ్చుచు మందరపర్వతంబు వీఁపునం దాల్చె హరియై శరణాగతుం డగుగజేంద్రుం గాంచె నజుండై వాల ఖిల్యులం గోష్పదంబునుండి లేవనెత్తెఁ గేశవుండై వృత్రాసురునిం జంపి బ్రహ్మహత్యం బొందియున్నయింద్రుని విడిపించె నారసింహుండై హిరణ్యకశిపుని సంహరించి వానిచేఁ జెఱంబడినదేవతలం గొనివచ్చె దైత్యారియై మన్వంతరములందు నాయాయవతారము లెత్తి దైత్యు లం దునుమాడి దేవేంద్రునిం గాచె వామనుండై బలినుండి భూమినిం దెచ్చి యింద్రున కిచ్చెఁ బరశురాముండై హైహయాదుల నుక్కడంచె శ్రీరాముండై లోకవిద్రావణుం డగురావణుని రణంబునం దెగ నేసె యదుకులంబునఁ గృష్ణుండై జన్మించి దేవతలకుం జేయరాని ఘనకార్యంబు లెన్నియో చేసి వాసిం గాంచె బుద్ధుండై దైత్యుల మోహపెట్టెఁ గలియుగాంతమునఁ గల్కిమూర్తియై మ్లేచ్ఛులనెల్ల సంహరించి జగం బుద్ధరింపఁ గలం డాజగన్నాథుండు మహోన్నతుం డతని జన్మకర్మాదులు నవతారంబు లనంతంబులు నమేయంబు లని చెప్పిన నిమి నమస్కరించుచు నాత్మవిత్తములారా! యింద్రియంబుల జయింపం జాలక కామాదు లుడపక యీశ్వరుని సేవింపం బోవక యుండువారై యెందెం దాసక్తియుండు వారికిఁ బ్రాప్య మెట్టిది చెప్పుఁ డనినఁ జ్యవనుం డి ట్లనియె. 89

సీ. వినుము చాతుర్వర్ణ్యమును జ్ఞానమున నీశు
సేవింప నగు నట్లు చేయకున్న

నరకంబులం బడి నవయు నయ్యీశ్వర
జ్ఞానము లేనట్టిజనులకు గతి
గలుగు టెట్లన వారు తెలిసినవారికృ
పకుఁ బాత్రమై ముక్తి పడయఁ గలరు
మొదటిముప్వురు వేదముల జ్ఞానమున కయ్యు
హరి భజింపక మోహాభరితు లగుచు

తే. అర్థకామాదులకు నయి యర్థవాద
ములు పొనర్తురు పెద్దలనలనఁ దెలిసి
రేమ తెలిసినవారము మేమ ఘనుల
మండ్రు మూర్ఖులు వారల కగు నిరయము. 90

తే. శ్రుతులప్రియవాక్యములు విని క్రతుగతులను
నచ్చరలఁ బొందఁ గల మందు రాభిచారి
కము లొనర్పఁగ నెంత్రు లోకమున వారు
నరకభాక్కులు పాపులు నరపశువులు. 91

ఉ. వారలు విష్ణుభక్తు లగువారినిఁ జూచి హసింతు రెప్పుడున్
నారులసేవయే హరి జనార్దనుసేవ యటంచు నెంచుచున్
వారినిఁ గొల్చుచుండెదరు వారిగృహంబుల నొక్కమైథునం
బే రహిఁగాంచు వారిపను లెల్లను స్వార్థపరత్వ మొందెడున్. 92

మ. తమలోఁ దాము మహానుభావులము మా తాతల్ గడుం బూజ్యు లే
ము మహైశ్వర్యము నొంది యుంటి మనుచున్ మూర్ఖాగ్రగణ్యాత్ములై
తమజీవప్రతిపత్తికై క్రతువులన్ దబ్బిబ్బుగాఁ జేసి దో
షము నాఁ కూరక చంపుచుండ్రు పసులన్ సాత్త్వాద్యమప్రాయులై. 93

తే. ధనము ధాన్యము పశువు లుదాత్తగరిమ
బలము రూపము విద్యయు భాగ్యవైభ
వములు గ్రామాధిపత్యము వజిలు మా క
టంచు గర్వితులై వార లాడుచుండ్రు. 94

క. అవమానించుచు నితరుల
భువిఁ దిరుగుచు నాత్మరూపు భువనాధారున్
సవిమర్శముగ నెఱుంగక
భవికము గొనలేక జమునిపాలగుదు రొగిన్. 95

వ. మఱియు స్త్రీసంగమ మాంసభోజన మద్యపానాదులు ప్రాణులకు రాగంబునంజేసి కలుగు నవి వర్జనీయము లట్లయి నను బెండ్లియాడిన స్త్రీతోడి సంగమంబును యజ్ఞాంగుల మాంసభోజనంబును సౌత్రామణ్యాదుల మద్యపానంబును దోషంబు గా దని వేదంబు చెప్పుచున్న దీధర్మం బెఱింగి నరుండు ప్రవర్తించుచుఁ బ్రతిగ్రహాదులచే నయిన ధన మార్జించి భగవత్ప్రీతికరంబు లగుకార్యము లొనర్చుచు విషయ భోగంబులవంకకుం బోక సద్వర్తనంబుగలిగి భగవదారాధనంబు చేయుచుండ వలయు నిట్టి ధర్మం బెఱుంగక యవినీతిం బ్రవర్తించు వారు మృతించి నిరయంబులం బొందుచుందురు. 96

తే. పశువులకుఁ బక్షులకుఁ బ్రాణభయము సలుపు
వారు మరణించి యమలోకవస్తు లయిన
వారి నాపశుపక్షు లవ్వారి గాఁగ
పొడిచి వేధించు నని శాస్త్రభణితి యగును. 97

వ. సకలప్రాణులందు నంతరాత్మం డగునీశ్వరుని విద్వేషించి దూషించు వాఁ డిహంబున శవప్రాయుండై పరంబున నరకకూపంబునం బడి వెతలం గుడుచు జ్ఞానశూన్యుండై మూఢత్వమునఁ ద్రివర్గమే ప్రధానముగా నెంచుచు నించుకంతయు నుపశాంతి లేనివాఁడు తనయాత్మఁ దాను జంపుకొనినవాఁ డగుచు నింతలోన నిజసంపాదితంబు లగు గృహదారధనాదులం దిగ విడిచి కాలధర్మంబు నొంది నిరయంబు లందు ననిన రాజేంద్రుండు మునీంద్రా! భగవంతుఁ డేకాలంబున నెట్టినామముల వ్యవహరింప బడుచుండునో యెఱింగింపు మనిన నమ్మౌని యి ట్లనియె. 98

— యుగభేదముల భగవంతునిరూపభేదములు —

తే. నాల్గుయుగముల శ్రీహరి నాల్గువర్ణ
ములును రూపములుం గొని పలువిధమ్ము
లయినవిధులను బూజింప నగుచు భక్త
పరులఁ బ్రోచెడువాఁ డగు ధరణినాథ. 99

సీ. కృతయుగంబునయందు సితవర్ణకలితుఁడై
నాల్గుచేతులతోడ నలువుమీఱి
యజ్ఞోపవీతకృష్ణాజినములు నక్ష
మాలయు దండకమండలువులు
దాల్చి వడుగు వోలెఁ దనరుచు నుండు న
ప్పుడు శాంతులై జనుల్ నడచుచుండ్రు
హంసుఁడు వైకుంఠు డమలుఁ డీశ్వరుఁడు యో
గీశ్వరుఁ డాదిగా నెసఁగుపేళ్ళ

తే. త్రేత రక్తవర్ణము నాల్గుచేతులును ది్రి
మేఖలయు స్రుక్స్రువమ్ములు మిసిమిఁ దోఁప
యజ్ఞమూర్తి యనం జను హరి భజింతు్రి
బ్రహ్మవాదులు వేదోక్తపద్ధతులను. 100

వ. అపుడు విష్ణువు యజ్ఞుఁడు పృశ్నిగర్భుఁడు సర్వుఁడు దేవుఁడు ఉరు
క్రముఁడు వృషాకపి జయంతుఁడు ఉరుగాయుఁ డనునామములం
బ్రవర్తించు ద్వాపరంబున విష్ణువు పచ్చనివస్త్రము దాల్చి చక్రా
ద్యాయుధంబులు గలిగి శ్రీవత్సాదిచిహ్నములతోఁ గౌస్తుభాదులతోఁ
గూడి యుండు నతనిఁ దత్త్వత్రియజ్ఞానముం గోరి వేదప్రోక్తవిధాన
ములతో మనుజులు సేవించుచుందురపుడు వాసుదేవ సంకర్షణ ప్రద్యు
మ్నానిరుద్ధ నారాయణవిశ్వేశ్వరవిశ్వాదినామంబుల వ్యవహరింపం
బడుచుండు గలియుగంబున శ్రీమహావిష్ణు విందనీలవర్ణముగలిగి కౌస్తు
భాదులు ధరించి సుదర్శనాద్యాయుధంబులఁ జెన్నలరారుచుఁ బార్ష
దులై నందసునందాదులు సేవింప భక్తపాలనాబద్ధకంకణుండై యుండు

నిట్లాయాయుగంబుల కనురూపంబు లైననామరూపంబులతో నను వర్తించుచుండు. 101

తే. కృతయుగాదుల కన్నను గీర్తనీయ
మగుచుఁ గలియుగ మొప్పు నాయుగమునందు
నామసంకీర్తనముచేతనే మనుజుఁడు
పడయు నభిలషితము లెల్లఁ బార్థివేంద్ర. 102

వ. కలియుగంబు భగవదారాధనంబు గావించి ముక్తి నొందుటకును సుకరంబుగా నుండుటం జేసి కృతాదులం దగువారు కలిం బుట్ట నెంచుచుందు రందుఁ దామ్రపర్ణి కృతమాల పయస్విని కావేరి ప్రతీచి సురవర్ణక యనునదులకడం బుట్టు టుత్తమోత్తమము గాఁ దలంతు రని చెప్పిన మిథిలాధిపతి ప్రీతుండై జయంతీదేవిపుత్రు లయిన కవ్యాదిమునులం బూజించి యంపిపుచ్చె రాజు నాధర్మము లనుష్ఠించుచు ముక్తుం డయ్యె నీవు నీభాగవతధర్మంబుల శ్రద్ధ గలిగి దేహాద్యభిమానంబు విడిచి పరమపదంబు నొందఁ గల వోయి వసుదేవా! నీవు నీసతీవతంసంబును ధన్యాత్ములు మీ కీశ్వరుండు పుత్రుఁడై పుట్టె దానం జేసియే మీ రేపూజాదులును లేకయే ముక్తు లగుచున్నారు. అని చెప్పిన దేవకీవసుదేవులు కృష్ణుండు దమకన్నకుమారుం డనుమోహంబు విడిచి సేవించునట్టివారై రీయితిహాసంబు విన్నవారును జదివినవారును బాపపుణ్యాసంబంధంబు లెల్ల విడనాడి పరబ్రహ్మసాధర్మ్యముం బొందఁ గలుగుదు రని శుకుండు వెండియు. 103

—♦ బ్రహ్మాదులు కృష్ణదర్శనము చేసి ప్రార్థించుట ♦—

ద్విపద. సత్యలోకమునందు సనకాదిమునులు
నిత్యము సేవింప నీరజాననుఁడు
వసువు లాదిత్యులు వహ్నియు నంగి
రసులును రుద్రులు క్రతుభుగీశ్వరుఁడు
లోనగు దేవతాలోక మదెల్లఁ

గాన వచ్చినవారిఁ గని బ్రహ్మ మనము
ద్వారకకుం బోయి దాశార్హుఁ గాంచి
వారల సేవించి వత్తము రం డ
టంచు నెల్లరఁ గూడి యబ్జసంభవుఁడు
మించిన వేడ్కఁ నమ్మినవీథినుండి
కృష్ణుఁ డుండిన చోటికిం జని వాని
విష్ణునామములతో వినుతించి కొలిచి
విన్నవించిరి యిట్లు వేవేవిధముల
సన్నుతుల్ సేయుచు సదమలమతుల. 104

సీ. త్రికరణశుద్ధిగా దేవాదిదేవ ! నీ
స్తోత్రము చేయుదు మాత్రయీస్వ
రూప ! మావిన్నప మీపట్ల విని మాప
యిం దగఁ గృప చేయవే మహాత్మ !
యీ వీజగత్తును సృజియించి పెంచి ల
యింపఁగఁ జేయుదు విందిరేశ
యీ పౌనర్చైదుపను లెల్ల లీలలు నీకుఁ
బుణ్యపాపము లంటఁ బోవు నిజము

తే. నీవు జ్ఞానస్వరూపుఁడ వీవిధంబు
నెఱిఁగి కొనుటకు దానధర్మోర్థ కర్మ
ము లెవి గాని చాలవు మునిముఖ్యు లెపుడు
మొనసి భజియింత్రు హృత్పద్మములను నిలిపి. 105

తే. మునులు సంసారమును దాఁటి ముక్తి నొంద
నిను భజింతురు మనముల నునిచి కొనుచుఁ
బాంచరాత్రు లుపాసింతు వైభవంబు
వడయ సవముల యజియింత్రు వైదికు లిల. 106

చ. భగవతి నీదువక్షమునఁ బ్రస్తుతి కెక్కియు నీదు పాదముం
దగుతులసీదళంబునకు వచ్చిన వైభవ మింతయేని పొం

పగఁ దగ నైతి సంచును ముదం బఱి దానికి నోప నర్చనం
దగఁ బొనరింప నో యనఁగ దానిఁ దొలంచి యిడుం గరాబ్జముల్.

వ. బ్రహ్మ యిట్లనియె. 108

మ. ఒకపాదంబున భూతలంబు సకలం బొండొక్కపాదంబునన్
కకుబంతంబులు నొక్కపాదమున నాకాశంబును గొల్చుచున్
సుకలుం బ్రోచెడివేళ నాకసమునన్ సొంపొందుపాదంబు మా
మకపూజం గొని నన్నుఁ బ్రోచినది తన్మాహాత్మ్య మగ్గించెదన్.

తే. కాలమునకు నియంతయుఁ గాలదేహుఁ
డై ప్రకృతిపురుషవిలక్షణాకృతి యగు
దేవదేవుని చరణంబు తెలియ మాకు
దిక్కగుం గాత మెప్పుడు దివ్యపురుష. 110

తే. జంగమస్థావరాత్మక జంతుసహిత
జగమునకు నీ వధీశుఁడ వగుదు గాదె
యఖిలమందును నీ వంతరాత్మ వగుదు
నిను నుతింపఁగ శక్యమే నీరజాక్ష. 111

వ. ఇట్లు బ్రహ్మాదిదేవత లనేకవిధంబుల విన్నవించుచు వినుతించిరి
వియత్తలంబునన యుండి ప్రణమిల్లి బ్రహ్మ మఱియును. 112

సీ. ఓమహాప్రభుపుంగవా మేము తొల్లింట
భూమిభారము దీర్పఁ బోలు ననుచు
విజ్ఞాపనము సేయ విని నీవు సరి యని
చని భార ముడిపితి సత్యసంధు
లందు ధర్మము నిల్పి తధికకీర్తి దిశావ
లయముల వెదజల్లి తయము మెఱయ
యదువంశమునయందు నవతరించిననీదు
రూప మత్యుత్తమ మై పఱఁగెను

తే. నూట యిరువదియే నేండ్లు నేఁటివఱకుఁ
గడచె నీకుఁ జేయఁ గలిగినకార్య మొండు

లేని దగుఁ గాన నీవు నీస్థానమునకు
నరుగుదే నెంచు మనుచు మా ప్రార్థనంబు. 113

వ. అనిన భగవంతుం డగుకృష్ణుండు వారలం గాంచి వేల్పులారా! మీ చెప్పినచొప్పున నావచ్చినకార్యంబు తీఱినది నేనును నాపదంబునకు రాఁ దలంచియె యున్నవాఁడం గాని యాదవకులంబు వీర్యవంతం బది లోకంబుం గబళింప సమర్థంబు నేను దాని మహాసముద్రంబును జెలియలికట్టవోలె నడ్డగించి యుంచితి నిపుడు దాని సంహరింపక వచ్చితినేని లోకద్రోహంబు చేసినవాఁడ నగుదుఁ గావున నక్కార్యంబు దీర్చి వచ్చెద మీరు పొండుం డనిన బ్రహ్మాదులు వానికిం బ్రణమిల్లి నిజస్థానంబులకు నిర్గమించి రంత నాద్వారవతియందు నానావిధోత్పాతంబులు పొడసూపుటయుఁ గృష్ణుండు యదువృద్ధులం జూచి యి ట్లనియె. 114

— శ్రీకృష్ణుండు దుర్నిమిత్తంబులు యాదవుల కెఱింగించుట —

సీ. ఉత్పాతములు తోఁచుచున్నవి నలుగడ
మనకులంబున కింతకును మునుమును
బ్రాహ్మణశాపము భరియింప రానిదై
ప్రభవించియుండె నోబంధులార!
బ్రదుక నెంతుమ యేని వసియింపరా దిట
కదలి యెక్కడికేఁ బోవు టదియ యొప్పు
జాగు సేయక నడ సాఁగింతము ప్రభాస
తీర్థంబునకు నిశాధిపతి మున్ను
తే. దక్షశాపమునం దనతనువున కగు
క్షయముఁ బోఁగొట్టుకొనె నందు జలము ద్రావి
మనము నట స్నానమును దానమును బొనర్చి
జలము ద్రావుద మాస్నానఫలమువలన. 115

శా. గోదానాదుల భూరిదానముల నాకూలంబునం జేయుటన్
భూదేవుల్ పొనరించుశాప మది పోవుం బో యటం చెంతు నా

మీఁదర్ గూరిమిచేసి రం డనఁగ నామిత్రాదిబృందంబు లౌ
నాదారిం బచరింత మంచుఁ బయనం బయ్యేర్ క్షణార్ధంబునన్. 116

వ. పురజను లందఱును రథంబులు వాహనంబులు సిద్ధంబు చేసికొని పయనం బై రప్పుడు కృష్ణున కనువ్రతుండై యుండుననిరుద్ధుండు తండ్రిమాట విని వారిసన్నాహంబు సూచి భయంకరారిష్టములం గాంచి కృష్ణు నేకాంతంబునం గలసి పాదాభివందనంబు గావించి చేదోయి దోయిలించుకొని యి ట్లనియె. 117

—♦ ఉద్ధవుఁడు శ్రీకృష్ణునితో సంభాషించుట ♦—

ఉ. ఓ పురుషోత్తమా! ద్విజవరోన్నతశాపము కాదు పద్మభూ
శాపము నైనఁ బాపుటకుఁ జాలినవాఁడవ యట్లు కాక త
చ్ఛాపము కారణంబునను జంపి సమస్తజనాళి నీవు నీ
రూపము దాల్చి పోవుటకు రూఢి పొనర్చినయట్లు తోఁచెడిన్. 118

ఉ. నీపదపంకజంబు విడి నే నిట నొక్కఁడ లిప్తమాత్ర మే
నోప వసించి యుండుటకు నోపరమేశ్వర నన్ను నిచ్చలుం
ద్రోపడఁ జేసి పోవుటలు దోసము గావున నీదువెంబడిన్
బ్రాపుగఁ గొంచుఁ బొమ్మనుచుఁ బ్రార్థనముం బొనరించి వెండియున్.

మ. నడ గావించెడునప్పు డొక్కకడ విన్నాణంబున నిల్చి న
ప్పుడు కూర్చుండినయప్డు పానుపునఁ బెంపు న్నింపుచుం బండిన
ప్పుడు నీరాడెడునప్డు వార్చునపు డొప్పుం దప్పు చర్చించున
ప్పుడు నీతో విడకుండు వాఁడ నను నేపోల్కిం ద్యజింతో ప్రభూ. 120

క. నా కాత్మ వైన నిను నే
నేకరణిన్ విడిచి యుండ నిపు డే నేతున్
నా కట్లు గాక యుండం
గైకొని పొ మ్మనుచు నిదిగొ కై మోడ్తు నజా. 121

క. నీ వనుభవింప మిగిలిన
పూవులు గంధమును వస్త్రములు ధరియింతున్

నీవెనుక మేనినీడగ
నే వెడలుదు నిట్టినన్ను నెటు వీడుదువో. 122

వ. అని మఱియు ననేకవిధంబులం దనలోనియనుతాపం బెల్లం దెల్లంబు గావించుచు విన్నవించిన భగవంతుం డగుదేవకీనందనుండు తనకే కాంతికప్రియుండును భృత్యుండు నగునుద్ధవుం జూచి యి ట్లనియె.

ఆ. ఈవు చెప్పినట్లు లే నిశ్చయించుకొ
న్నాఁడ వేల్పు లెల్ల నన్ను స్వర్గ
మునకు ర మ్మటంచు మనవిచేయుచు వేఁడు
చుండి రేను బోవ నున్నవాఁడ. 124

మ. నను భూభారము వాప వేఁడుకొన నానాఁ డీధరామండలం
బున నీదేవకికిం జనించితిని నింపుల్ సొంపు పెంపొంద నా
జనికిం జాల ధరాభరం బుడిపితిన్ సర్వంబు సంపూర్ణ మ
య్యెను గానం బని లేదు పోయెద మదీయోద్ధస్థితిం బొందఁగన్. 125

సీ. యదుకులం బెల్ల మహర్షి శాపంబున
నశియింప నున్నది నయము దొరఁగి
నేఁటి కేడవనాఁట మేటిసంద్రము పొంగి
ముంచెడు ద్వారకాపురవరంబు
నే భూతలము వీడి యేగినపిమ్మటఁ
గలి యుగు నీ విందు నిలువఁ దగదు
విషయవిరక్తిమై విడిచి సంగము నన్ను
మనమునం దిడి యుండు మనఘుఁడ వయి

తే. జీవపరమాత్మభేదము భావమునను
జేర నీయక విజ్ఞానచిత్తుఁడ వయి
నన్ను ధ్యానించుచుండుము నన్నుతమతి
వగుచు నద్దాన మోక్షము నందఁ గలవు. 126

వ. ఇట్లు భగవంతుం డానతిచ్చిన భాగవతోత్తముం డగునుద్ధవుండు నాకుఁ దత్త్వోపదేశంబు చేయుము నీవు చెప్పినట్లు పరిత్యాగము సుఖ సాధ్యంబు గాదు దాని నెట్లు సేయవచ్చునో తెలియ నానతి మ్మనిన నతం డతని కి ట్లనియె. 127

— శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బరమార్థోపదేశము చేయుట —

తే. తత్త్వమును విమర్శింపఁగఁ దలఁచువాఁడు
మనము శిక్షితముగఁ జేసికొనియు విషయ
వాసనలవంకఁ బోవక స్వాంతమందు
జగము నశ్వర మని యెన్నఁ దగు ననిశము. 128

తే. ఎవ్వరో కొంద ఱేకాని యెల్లవారు
నన్నుఁ జూడఁగ నోపక ఖిన్ను లగుదు
రిందులకు నొకయితిహాస మే వచింతు
యదువునకు నవధూతకు నైనది యది. 129

మ. అవధూతాకృతిఁ గోడ బ్రాహ్మణుఁ బోలం డభ్యంగనాదిక్రియల్
తవురీతిం బొనరించుకొంచు మిగులం దళ్కొత్తుచుఁ ద్రాగ ధ
ర్మవిదుం డాయదు వాతనిం గని ద్విజేంద్రా! నీవు విద్యాధికుం
డవు నాఁ దోఁచితి వింద్రియార్థవశుఁడై నల్వొందు దేమో కదా.

సీ. చదివి యజ్ఞునివలె సంచరించుచునుంటి
విది నీకు నెం దుండి కదియ నయ్యెఁ
దెలియుమి ననరాదు తెలిసినవారికిఁ
దెలుపఁ జాలినయట్టి తెలివి గలదు
శక్తి చాలమి నిట్లు శంకింతు వనరాదు
నీశరీరము చెప్పు నీదుశక్తి
మితభాషి వగుదువు మెచ్చ మాటాడ నే
రనివాఁడ వన రాదు రమణ గలవు

తే. జడునిపగిది నున్మత్తునిచందమునను
ప్రజము సోఁకినవిధమునఁ గాన వత్తు
వేమిచేయుట కొల్లవు కామలోభ
ములకుఁ గా వేమికారణ మో తెలుపుము. 131

వ. ఇట్లు మేధావియు బ్రహ్మణ్యుండు నగుయదువు వినమ్రుఁడై యడు
గగా మహాభాగుం డగునా బ్రాహ్మణుం డి ట్లనియె. 132

ఉ. పెక్కురు నాగురూత్తములు పేర్మి వహింతురు వారు సర్వదా
చక్కనిమార్గ మిద్ది యని చాటి వచించుచు మంచి వర్తనిన్
నెక్కొనఁ జేయుచుండెదరు నేనును వారు పొనర్చినట్లు గా
నొక్క వచించినట్లుగఁ గనుంగొని క్రుమ్మరుచుందు సమ్మతిన్. 133

—♦ అవధూత యదు సంవాదము ♦—

వ. నాగురువులం జెప్పెద నాలకింపుము భూమియు వాయువు నాకాశం
బును నీళ్ళు నిప్పు చంద్రుఁడు సూర్యుఁడు కపోతము నజగరము
నదియు బతంగము మధుకరము గజము కిరాతుఁడు లేడి చేప
పింగళ కురరము బాలుఁడు బాలిక యయస్కాంతము సర్పము
సాలెపురుగు టుమ్మెద యనునిరువదినాలుగును నాకు గురువులు. 134

ఉ. వీరల నాశ్రయించితిని వీరలు చెప్పినచొప్పు దప్ప కే
నారసి శిక్షితుండ నయి యట్లు పొనర్చుచు నిట్లు నేర్పునన్
ధారుణి సంచరించెదను దద్గుణబోధము లెల్లఁ దెల్లగా
మీరలు కోరుచుంటి రని మీకు వచింపఁగ నుంటి వింటివే. 135

తే. దైవికంబున భూతబాధలు గలిగిన
దారి తప్పి మెలంగక ధీరతమెయి
క్షమను బూని మెలంగుట క్షమను గురువు
గాఁ గొని గ్రహించితిని యదుక్ష్మాతలేంద్ర. 136

వ. మఱియుఁ బర్వతవృక్షాదికలిత మగుభూమివలన నిరంతరపరోపకార
పరతియుఁ బరార్థజన్మంబునుఁ బరాధీనతయు క్షమయు నేర్చుకొంటిఁ

(ప్రాణధారణమునకుం జాలినంతమాత్రి) మాహారము గైకొనుటయు ముని విషయములం జొచ్చియు గాలిచందనాదులతోఁ గాని నిప్పుతోఁ గాని కలసియు వాసితగులంబు లేకుండునట్లు పరమాత్మ్యుండు సమస్త వస్తువులలోపలను వెలుపలను నుండియు దేని నంటకుండు ననియు నెఱింగితి ముని యగువాఁడు జలమువలెఁ దన్ను స్పృశించినవారిఁ బవిత్రులం జేయునట్లును సర్వజీవనాధార మగున ట్లుండవలయు నని దానివలనఁ దెలిసితి యోగియగువాఁ డగ్నివలె దన కేది లభించిన దానిని గుడుచుచు దేవతలకు హవ్యములు వహించునట్లు పరార్థంబులు వహించిపరోపకారముచేయుచుండ వలె నని తెలిసితివెన్నెలకే పెఱుగు తరుగులు కలవు గాని చంద్రునకు లేనియట్లు జీవి పుట్టినదిమొదలు గిట్టువఱకు గలుగువికారములు జీవునకు లే వని గ్రహించితి రవి తన కిరణాళిచే రసాతలమందలిరసమును గ్రహించి మరల దానిని వర్ష రూపమున రసాతలంబున క యిచ్చు నట్లు యోగి కాలోచితోప భోగ్యముల స్వీకరించి యర్థులకొసంగు టొప్పు ననియు నెఱింగితి దేహి దేహబంధుసంగమాదులంజేసి దుఃఖం బనుభవించుఁ గపోతంబు తనపుత్రిమిత్రాద్యుపలాల నాదులంజేసి ప్రేమించి తద్విరహంబు సైఁపనిదై తాను మృతించె నిట నాకథం జెప్పెద నాకర్ణింపుము. 137

—• అ వ ధూ త చె ప్పి న గు వ్వ ల క థ •—

సీ. అడవిలో నొకగువ్వ కడుప్రేముడిం జేసి
తనభార్యయును దాను వనట దక్క
యొకచెట్టుతోఁట్టలో నుండుఁ గాపురముగా
నారెంటినెయ్యము పేరుకొనఁగఁ
నెంతలుం జాల రొకింతసే పైన న
య్యావి పెడఁ బాసి యుండ వొకపుడును
మేనులు వేఱైనఁ గాని ప్రాణం బొక్కఁ
డే యని చెప్ప నొ నిట్టులుండఁ

తే. కొంతకాలమునకు నాడుగువ్వ చూలు
కొనుచు గుడ్లను బెట్టె నాగుడ్లు ముదిరి
పిల్ల లయ్యెను వాని నాపిట్టదోయి
పెంచె నెంతయుఁ బేర్మిఁ గాంచు కొంచు. 138

మ. ఒకనాఁ డాలు మగండు రెండు నవి యెంతో దవ్వులం దున్న కా
నకునై మేతకుఁ బోయి కూనల కెరల్ దాఁ గూర్చుచుండంగ నం
దొకవ్యాధుం డలగువ్వకందువుల నాయుర్బీజముం దుండఁ గొం
కక వాసిం గనిపట్టి పట్టి వలఁ గాంక్షం బెట్టెఁ బెట్టేచుచున్. 139

చ. మగువయు నమ్మగండుఁ గడు మక్కువఁ జేయుచుఁ గన్నబిడ్డలన్
దగిలినప్రేముడిన్ గనెడుతత్పరతన్ దమగూడు చేర వే
గగతినిఁ వచ్చి బిడ్డలను గానక గూటను నల్కలంకులన్
మొగిఁ గనుచుండ నవ్వలను బొందినకందువు లార్చి నార్చినన్. 140

ద్విపదము. తమబిడ్డ లటువలఁ దగులుటఁ గాంచి
క్రమమింతయును లేక కరణిఁ గుయ్యిడుచు
వలకడకుం జని వాపోయి పోయి
వలలోనఁ బడి చచ్చె వ్యాధుండు నంత
పక్షులం గొని వానిపలలంబు దాను
భక్షించి సతితోడ బంధులతోడ
కొన్నాళ్ళు మని వెనుక ఘోరార్తి కగుచు
బన్నంబులకు నయి ప్రాణముల్ విడిచె. 141

వ. సంసారానుబంధంబున వివేకశూన్యం బయినకపోతయుగ్మంబువలె మెలంగుట పాడిగా దని గ్రహించితిని. మఱియు నజగరం బొక్కచోఁ గదలకుండి దైవవశంబునం బడినయల్పించి దాహారముం దినియుఁ దొరకకున్నం బస్తుండియుఁ గాలముం గడపు నట్లు ప్రారబ్ధవశంబున సంప్రాప్త మయినసుఖదుఃఖంబు లనుభవించునది యని నిశ్చయించు కొంటిని. 142

మహాస్ర. ముని వర్షాకాలమందుఁ బెనసిననదులం బొంగునీరంబు చేరన్
ఘనమై గ్రీష్మాదులందుఁ ఘనత చెడి కడుం గ్రాగుట లేక సంద్రం
బనువొందం గల్గునట్లు యునిశమును గభీరాదులుం గల్గి శాంతిం
గొనియుండం బోలు నే నీగుణముఁ గడలిఁ గన్గొంచు నార్జించినాఁడన్.

తే. దీపముం గాంచి మిడుత భ్రాంతి న్వహించి
దానిపైఁ బడి చచ్చుటల్ గానఁ బడుటఁ
దళుకుఁ బెళుకులు గలవస్తుతతులవలపు
విడుచు నాచారము గ్రహింపఁగడగితిఁ గదె. 144

ఆ. పువ్వు నొవ్వకుండఁ బూదేనె లానుచు
నొక్కచోట గుటిగ నుండఁ బోక
మెలఁగుభృంగ మట్లు మెలఁగుచుఁ బీడింప
కొరుల మునివరుండు పరఁగ వలయు. 145

ఆ. పూలనుండి సారమును దేఁటి గ్రహియించు
చక్క సకలశాస్త్రసమితినుండి
సారమెల్ల జ్ఞాని సంతరించుకొనంగ
వలయు ననుచు మదికిఁ దెలియ వచ్చు. 146

మ. ఇది యీవేళకు రాత్రి కిద్ది యిది రేపే తేర నొ నాఁటి కం
చెద సంకల్పము చేసి పెట్టుకొనరా దేవేళ కావేళయే
తుది యంచుఁ దిన నొప్పుఁ బాత్రముగఁ జేదోయిం దగం జేసి కొం
చది గాకుండినఁ దేనెటీఁగ పెఱ యట్లయ్యంతయుం బోయెడిన్.

ఆ. తేనెఁ గూడఁబెట్టి తిన నుండగాఁ దేటి
వనచరుం డొకండు వచ్చి దాని
నపహరించినట్లు లెపుడు లోభి గణించు
ధనము పరులపాలె యనఁగ వచ్చు. 148

ఆ. మ్రానిపడఁతి నైన మఱి చూడఁగ రాదు
చూచె నేని చెడును జుట్టు గడ్డి

కప్పినట్టికోతి కప్పయి నగుబొమ్మ
కరణిఁ జూచి కూలు గజము వోలె. 149

చ. యతి యగువాఁడు గ్రామ్యజనులం దగుగీతము లాలకింపఁగా
మతి యొనరింప రాదు వనమధ్యమునం దగుజింక వేట కా
డతిమధురస్వరం బొనరునట్టులు పాడిన నేమరిల్లు న
స్థతిరయ మేర్పడంగఁ జని యాతఁడు పట్టెడు దాని నెట్టనన్. 150

మ. మృగికిం బుట్టినఋశ్యశృంగుఁడు కడున్ మేధావియై యుండియున్
మృగనేత్రల్ చనుదెంచి గానగరిమన్ నృత్యంబు గావింప నిం
పుగ నాలించి యతండు స్త్రీకి వశుఁడై పోయెన్ దదీయావృతిన్
జగతిన్ గ్రామ్యసుఖంబు లాసపడ నీచందంబునుం బొంద నౌ. 151

ఆ. జిహ్వ చాపలమునఁ జేసి వర్తింప రా
దెట్టివాఁడు దాన నెంతయుఁ జెడు
పొలనుబుద్ధి గాలమును గ్రమింగి మీనము
సాక్ష్య మిచ్చుచుండె చచ్చి తాను. 152

—♦ అవధూతచెప్పిన పింగళియను వేశ్యకథ ♦—

వ. పురుషుం డగువాఁ డింద్రియంబుల జయించి దురాశం బరిత్యజించి కాని సుఖింపఁ డీయర్థంబు తేటపడ నొక్కయితిహాసంబు గలదు విదేహనగరంబునఁ బింగళి యనునొక్క వేశ్య కలదు దానివలన నే నేర్చిన దించుక కల దాకథ చెప్పెద వినుండు. 153

సీ. పింగళి తన కింత విత్త మిచ్చినఁ గాని
పురుషునిఁ బొందనిప్రూన్కి గలుగు
నద్దాన మెలఁగుచు నదియొకనాఁటిసా
యాహ్నము మొదలుగా నాత్మగేహ
మందు గేహళికడ నట్టె నిల్వంబడి
ధన మిచ్చువిటులను దడవుచుండె
నెందఱో వచ్చి రం దెవరు నాయమకోరి
నంతధనం బీయ నట్టె రైరి

తే. నడికి రే యయ్యోఁ బై నయ్యోఁ బడఁతిమిన్న
లోని కరుగుచు వచ్చుచు లోన వగచుఁ
బోయి వచ్చును మఱియునుఁ బోయి వచ్చుఁ
గాని దాసిలోఁ గలకోర్కి కాని దయ్యె 154

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు ప్రతీక్షించి ప్రతీక్షించి విసిగి వేసారి విరక్తిం
జెంది తనమనంబున. 155

ఉ. నామది మోహమగ్న మయి నాకు వివేకముఁ బాయఁ జేసె నే
నీమెయి రిత్తగాఁ జెడఁగ నిట్టిదురర్థము నాసఁ జేసితిన్
గామము ప్రాణికోటులను గాలిచి పుచ్చెడి నక్కటక్కటా
యేమనుజుండొ వచ్చి ధన మిచ్చెదునంచిటు వెఱ్ఱి నైతిఁ బో. 156

క. ఏఁడో వచ్చెడు విత్త
మ్మోడక నా కిచ్చు వాని నొందుదు ననుచున్
గూడనితలంపు చేసితిఁ
వీడనిపతి నెఱుఁగ నైతి వీరిడి నగుచున్. 157

శా. నాలో నెప్పుడు వీడకుండి సతమున్ నాసౌఖ్యముం గోరుచున్
నాలోపంబులు సైఁచునట్టిఁ డగుచున్ నాప్రాణనాథుండు న
న్నాలోకించుచునుండ వాని విడి పాపావిష్టచిత్తంబునన్
గాలంబున్ వృథ చేసితిన్ జముఁడు నన్ గాఱించెడిం గ్రూరుఁడై. 158

సీ. ఇట్టినీచప్రవృత్తి కే నైతి నాబ్రదు
కెంతయు వ్యర్థమై యేగె నకట
నాదేహ మమ్మితిఁ గా దనక ధనాశ
నీచాతినీచుల కీచవులను
సౌఖ్య మన్నను దేహసౌఖ్యమే యనుకొంటి
నిది పాడుకొంప నా నెఱుఁగ నైతి
మలమూత్రముల నిండి మలిన మైనది నవ
ద్వారముల్ దుర్గంధబంధురములు

తే. ఈవిదేహపురంబున నే నొకతెన
యిట్టిదుర్గతి పాలైతి నేమి చేయు
దాన సర్వార్థ మిచ్చెడు మానధనుని
దానవారిని దెలియనిదాన నైతి. 159

వ. అని యనేకవిధంబులం దలంచుచు నిర్వేదంబు గలిగించుకొని దురాశ
లెల్ల దిగఁ ద్రావి భగవదారాధన తత్పరయై చిత్తశాంతి గలిగి శయ్యా
తలంబునకుం జని పరమేశ్వరుని ధ్యానించుచు సుఖనిద్రం గావించె
దీన నిరాశ పరమసుఖం బని తెలిసికొన్నవాఁడ నైతి నని మఱియును.

సీ. ప్రియపరిగ్రహము దుఃఖయుతంబు గావున
నది విడిచిన సుఖ మగును వినుము
కురర మొక్కఁడు నోట నెఱచి గవ్వుకొనంగ
డేగ యొక్కఁడు చూచి వేగ వచ్చి
తన్ను హింసింపఁగా నున్నట్లు కనిపెట్టి
విడనాడెఁ గురరము వడిగఁ బలము
దాన శ్యేనభయంబు దానికి లే దయ్యె
నది నేను నేర్చినయట్టివిద్య

తే. మాన మవమానమును జింత మానవులకు
లేక యుండి పరాత్పరు నే కొలిచిన
మేల యంచు నొకానొక బాలకుండు
క్షితిఁ జరించుచుఁ దెలియఁగఁ జేసె నాకు. 161

వ. ఒక్కచో నొక్క బాలిక రహ్యముగా బియ్యము దంపుచుఁ వాకిటిలోఁ
దన్ను వరింపవచ్చినవా రుండుటం జేసి వారి కాశబ్దము తెలియకుండు
నట్లు చేయ నెంచి తనచేతికడియము లన్నియు నొక్కటొక్కటిగా
నుంచుకొని తక్కినవన్నియు దీసివేసిన దనియు దాన శబ్దము కాలే
దనియుం దెలిసికొని హానియగువాఁడు పదుగురతోడి పొత్తు విడిచి
యేకాకియై యుండ నగు నని నేర్చుకొంటిని మఱియు నయ

స్కంతంబుం గని దానివలనఁ బరమాత్మునితో నంటుకొని పోవు విధం బెఱింగితి సర్పము సర్వదా నొరుకంటం బడక పుట్టలకలుగులం బడియుండు నట్లు ముని సతతంబు గుహాలం దుండి తపంబు చేయు చుండ వలె నని తెలిసితి సాలెపురుగు తనకడుపులో నుండు నూలును నోటినుండి తీసి దానితోఁ గొంత క్రీడించి పిదప దానిని తానే మ్రింగునట్లు పరమేశ్వరుం డేకాకియై మహత్తత్త్వము మొదట సృజించి దానిచేత నే సర్వజగంబును గల్పింపఁ బడి నశింపఁబడుచున్న దని తెలిసికొంటి దేహి యగువాఁడు తనమనస్సు నిశ్చలముగా నుంచి యేయేరూపమును ధ్యానించునో నాయారూపము నొందు నని పేడ పుర్వుం దెచ్చి తనగూఁటిలో నిడి నాదోపదేశము చేసినతుమ్మెద వలనం దెలిసికొంటి నని మఱియు నాదేహము నాకుం దెలిపినవిధం బుం జెప్పెద నాకర్ణింపు మని మఱియును. 162

సీ. ఉత్పత్తి నాశము లొందనై దేహము
ఘనదుఃఖఫలదమై కనఁగ వచ్చుఁ
గావున దీనిపైఁ గలుగువిరక్తియై
నను దీనివలననే కనుఁగొన నగుఁ
బ్రకృతితత్త్వము దానఁ బరఁగు వివేకము
కాన నియ్యది నాకు ఘనగురు వగు
నట్లైన నాది కా దని దీనిపై నభి
మానము చేయక మసలుచుందు

తే. దేహి దేహాభిమానసందీపితుఁ డయి
యాలుబిడ్డలు భృత్యగృహాదివస్తు
సంతతులు గల్గి దానికై సకలకష్ట
ములను బొందుచుఁ దుద వీడి పోవు దీని. 163

ఉ. దేహము వీడి పోయినను దేహసమార్జితకర్మసంగతిన్
దేహి మఱొండుదేహమునఁ దిర్గుచుఁ దత్ఫల మందుచుండు నా

దేహమునందు నింద్రియగతిన్ విషయంబులఁ బొందనై కదుర్
మోహము గల్గి మోక్షమునుబొందఁగఁజాలఁడుమూఢుఁ డైనచోఁ.

తే. ఈశ్వరుఁడు పశుపక్షుల వృక్షములను
సలిపి చింతించి జ్ఞానము గలిగినమను
జులను సృజియించి తనసృష్టి వెలసె ననుచు
ముదము పడెఁ గాన నరుఁ డుత్తముఁడు తలంప. 165

వ. పెక్కుజన్మము లెత్తినపై మనుష్యజన్మం బెత్తి విజ్ఞానంబునంజేసి భగవదారాధనంబు గావించి ముక్తిం బడయు నని తలంచి దేహాను బంధము లగుపుత్రమిత్రకళత్రాదుల సంగంబు వదలి యిట్లు తిమ్మరు చుంటి నని యాబ్రాహ్మణుండు యదుపునకుం జెప్పి పూజితుండై యథాగతకృతగమనుం డయ్యె నంత యదువు నవధూతవచనంబునం జేసి సర్వసంగంబుల రోసి సర్వసముండై ముక్తిం బొందె నని భగ వంతుండు స్వరూపానురూపము లగునర్చనవందనాదిధర్మము లుప దేశించి యుంటి నాకర్ణింపుము. 166

సీ. అధర్మములను నిరంతరంబు పరాకు
పడ కనుష్ఠించెడువాఁడ యగుచు
జ్ఞాని యయ్యు ఫలాభిసంధి సేయక దేహ
మున్నంతవఱకు శాస్త్రమోచితముగ
నాచారముల నెల్ల నాచరించుచు శుద్ధ
బుద్ధియై తత్వంబుపొందుఁ దగిలి
జీవేశ్వరవిచార మేవేళఁ జేయుచు
విషయాభిరక్తిని వెడలనడచి

తే. స్వప్నతుల్యము జగ మని స్వాంతమందు
దలఁచు చేకోర్కికిం గాని తగులు కొనక
పరమపురుషార్థ మగుదాని పట్టు విడక
దేహయాత్రను నడపంగఁ దివుర వలయు. 167

తే. జనుఁడు బ్రహ్మవిచారము నను దలిర్చి
కామ్యకర్మ మస్థిర మని కలతెఱంగె
ఱింగి తద్విధు లంతగా సంగతిఁ గొన
కుండు నని నీ వెఱుంగు మోయుద్ధవ మఱి. 168

—♦ శ్రీకృష్ణుం డుద్ధవున కెఱింగించిన బంధమోక్షతత్త్వము ♦—

సీ. నను బ్రహ్మముగ నెంచుచును సర్వమును మదా
త్మకములుగాఁ గాంచి మసలువాఁడు
దేహాదులం దెప్డు తెలియనిమమకార
మొదవంగ నీయక యుచితభక్తి
గురునందుఁ జేయుచు స్థిరచిత్తుఁడై యసూ
యాదులు విడనాడి నాది యనెడు
బుద్ధి యెందును సల్పఁ బోవక మనుజుండు
పరిత్యాగాత్మ నెఱుంగుపథము తెలిసి
తే. సంతతము నన్ను ధ్యానించి స్వాంతమందు
నన్నుఁ గాఁ ద న్నెఱుంగుచు నున్నవాఁడు
మోక్షసామ్రాజ్యలక్ష్మిని బొంద నెంచు
వాఁ డని యెఱుంగు మోయుద్ధవా మనమున. 169

ద్విపదము. దేహాశ్రయంబున దేహగుణములు
స్నేహంబునం జేసి జీవున కంటు
నింతియ కాక యీయెల్లసంసార
మెంతయు నద్దానసే కల్గికొనుచు
జీవుఁడు చూపట్టి చెల్లు సంసృతినిఁ
బోవఁ జేసెడునది పోలుపఁ బర
మాత్మోపదేశమె యగుఁ గాని యన్య
మాత్మ నెఱింగెడునది లేదు తెలియ. 170

వ. కావున వేదాంతవిచారము చేసి దేహము దేహసంబంధు లగునాలు బిడ్డలు లోనగుసర్వము నుపాదేయుము లను నాబుద్ధి క్రమంబుగా నిరసింపవలయు మఱియు నాచార్యుండు పూర్వారణి శిష్యుం డుత్తరారణి మంథనకాష్ఠ ముపదేశము విద్య సంధి ప్రవచనము సంధానము వానివలనఁ బుట్టినయగ్ని వంటి దది పరమసుఖావహంబు.

సీ. సత్త్వాదిగుణములసంబంధమునఁ జేసి
దేవమనుష్యులై జీవు లుదయ
మందుచుందురు వారియాశయంబులును గు
ణానుగుణంబుగా నలరుచుండు
వారు నానావిధప్రజ్ఞలు గల రయి
వేర్వేఱ రీతుల వెలయుచుండ్రు
కర్మప్రవృత్తులఁ గలిగినదేవాది
దేహసంబంధముల్ తెలియ భావ
తే. వికృతులును దుఃఖశోకముల్ విడక పొందఁ
గలుగుచుండును గలలు గాష్ఠలు ముహూర్త
ములుగఁ గాలము నడచుట తెలియునట్లు
జననమరణంబులఁ వారు గొనుచునుండ్రు. 173

వ. జననమరణంబులు గలుగుచుండుటం జేసి దుఃఖము దొరసివుచ్చ రా కున్నది ప్రవృత్తి పురుషార్థసాధక మైనను రజస్తమోగుణాశ్రయ కర్మబంధంబున సుఖదుఃఖంబు లనుభవించువాఁడై కర్మపరతంత్రుండు చూపట్టు విద్వాంసులైనను గర్మవశ్యులైనను మృత్యువు లేకుండుటకు హేతుభూత మగుమోక్షమార్గ మన్వేషించుటకుఁ జాలకున్నవారు.

ఉ. వారలు పుట్టుచున్నపుడె వారిశరీరముతోడనే కడుం
గ్రూరత మృత్యుదేవతయు క్షోణిపయిం బడి యుండె నద్ది యు
వ్వారిని మ్రింగఁ గాచుకొని పజ్జనె యుండును గామ్యకర్మముల్
వారలఁ గాచిపుచ్చుట కవశ్యము చాల వటంచు నెంచ నా. 174

సీ. సత్కర్మ మొనరించుజనుఁడు స్వర్గముఁ జని
కర్మఫలంబుగాఁ గలుగుభోగ
ములను దేవత లట్లు పొందు నచ్చరలతో
దివ్యయానము లెక్కి తిరుగు దెసల
గంధర్వు లాతనిఁ గదిసి గానము సేయు
చుంద్రు నందనముల నుండఁ గలుగుఁ
దనపుణ్య మంతయుఁ దఱిగి పోయినపయి
నొకనిమేషం బందు నుండ నీరు

తే. తనకుఁ బో నిచ్చ లేకున్న దవిలి పట్టి
నెట్టనం ద్రోయఁగా నాతఁ డట్టె నేలఁ
గూలు జన్మాదికము వెండిఁ గూడ వచ్చు
జననమరణము లీరీతి సహజము లగు. 175

తరువోజ. మఱియు ననిష్టకర్మము లాచరించు
♦మనుజులగతు లిందు మచ్చము గాఁగ
నెఱిఁగింతు వినుము వాఁ డెపుడు నధర్మ
మే శరణంబుగా నిల మెట్టుకొనుచు
నెఱి వీడి యింద్రియనివహంబు దారి
నే పట్టి పోవుచు నెలఁతలఁ దగిలి
కొఱగాని కార్యముల్ కొలఁదికి మీఱఁ
గొని చేయుచు మృతించుఁ గొంచెము లోన. 176

మ. నిరయములందుఁ జేరి తననేరిచి చేసినకర్మసంగతిన్
గురుతరవేదనల్ గుడిచి కొంతటిలో నిజపాపలేశసం
స్ఫురణము గాఁగ దుష్టములు జన్మము లొంది తపించి చచ్చియున్
మరల జనించుఁ జచ్చు నిది మార్గము వారిసుఖంబు నిట్టిదే. 177

---

♦ మచ్చము=గురుతు. నెట్టన=అనివార్యము;

వ. లోకపాలురు లోనగువారు మరణశీలురు గా రందు వే. నాకర్ణింపుము లోకములును లోకపాలురును గల్పము వఱకు జీవించువా రయ్యు నవ్వల భయంబు నొందఁగలవారే వారిమాట కేమి రెండుపరార్ధములు పరమాయుష్యము గలబ్రహ్మాయుఁ గాలాత్మ్కుఁడ నయిన నావలన భయము నొందువాఁ డని తెలియు మనిన నుద్ధవుండు దేవా! జీవుఁడు దేవాదిదేహముల కధిష్ఠాతయు శబ్దాదివిషయములకు భోక్తయుఁ గర్మములందుఁ గర్తయునై వర్తించుఁ గావున గుణబద్ధుండు గాకుండు టెట్లు? సుఖదుఃఖాదులం బొందకుండు టెట్లు? పరమేశ్వరుని వలె స్వయంప్రకాశుండును దృష్టయునై యుండ వానికి బంధము గలుగుటెట్లు? విద్వాంసుఁ డగువాఁ డెట్లుండు నెట్లు ప్రవర్తించుం జెప్ప ననుగ్రహింపు మనిన భగవంతుండు వెండియును. 178

సీ. నానియమనమున లోనయినది మాయ
నే నియామకుఁడ నద్వాని కెపుడు
బంధమోక్షంబులు పరఁగవు నా కెప్డు
పరఁగు జీవుఁడె కర్మబద్ధుఁ డగును
నామాయనే జీవునకు శోకమోహముల్
సుఖదుఃఖములు మేను చూడ నొప్పు
స్వప్నమందలి దేహసంబంధమునఁ జేసి
కలుగుచున్నట్టులు కాన వచ్చు

తే. విద్యయు నవిద్యయును నాకు విగ్రహముల
వలెను నాశధీనము లయి వఱలు దేహి
కవ్వి మోక్షము బంధము నదుకఁ జేయు
వాని నిర్మించితిని నేన లో నెఱుఁగుము. 179

తే. మేనికిఁ బ్రధానభూతుఁడై మెలఁగి నాదు
నంశమగు జీవున కవిద్య యంటుకొనుట
బంధమగు విద్యచే ముక్తి పరఁగుచుండు
ననుచుఁ దెలియంగ వలయు నోయనఘచరిత. 180

వ. ఆజీవేశ్వరు లిరువురును బరస్పరవిరుద్ధధర్మములు గలిగి శరీర వృక్షంబునఁ బక్షులవలెఁ నొండొరు చెలిమిం గలిగి మెలంగుచుండు రందొకండగు జీవుండు ఫలం బనుభవించుచుండు నింకొకండగు నీశ్వరుండు నేఫలానుభవంబునులేక సర్వజ్ఞత్వసర్వశక్తిత్వములు గలిగి బలవంతుఁడై వెలయుచుండు భోక్తయగు నాజీవుఁ డవిద్యాబద్ధుండై యుండు విద్యాయుక్తుం డగు నీశ్వరుండు నిత్యముక్తుండై. విద్వద్వేద్యుఁడైయుండు విద్వాంసుఁడు దేహమం దుండియు వికారవిరహితుండై దేహమునే యాత్మగాఁ దలంప కుండు నవిద్వాంసుఁడగువాఁడు దేహమందుండి తెలియక దేహమే యాత్మగాఁ దలంచుచు బద్ధుండై యుండు మఱియు విద్వాంసుఁడు ప్రకృతిపరిణామ మగు దేహమం దుండియు సుఖదుఃఖాదులచే వికారము నొందక తన బుద్ధిబలముచే సందేహముల నెల్లఁ ద్రెంచుకొని కలగని మేలుకొన్నవాని చందంబున దేవత్వమనుష్యత్వభేదము వీడి దేహాభిమానము జీవేశ్వరభేదము లోనగు నేసందేహమును లేకయుండు నతండు దీని ననుభవింపవలయు దీనిని సంపాదింపవలయు నను నుద్దేశము లేక మానాభిమానముల సమదృష్టిగలిగి తాను దన యాత్మయందే రమించుచు లౌకికకర్మముల వంకం బోక మంచిచెడ్డల నెఱుంగక మననశీలుండై జడునివలె చరించుచుండును. 181

మత్త. పావనంబగు నాచరిత్రము పాడి నాయవతారముల్
భావమందు స్మరించి యెప్పుడు భక్తితత్పరులై జనుల్
నావచోరచనావిశేషమునన్ మనంబు దగిల్చినన్
జీవముక్తులు నా నెఱుంగుము చిత్తమందు యదూద్వహా. 182

సీ. జీవాత్మయం దెప్డు దేవుఁ డని మనుష్యుఁ
డని భ్రమ మొందక స్వాంతమందు
దేహముకంటె లోనూహించి జీవాత్మ
వేఱని యెఱిఁగి యెవ్వేళ విరజ

మై సాత్త్వికంబగునట్టి చిత్తమ్ము నా
యందు నిలిపి భక్తి పొందుపడఁగఁ
గామ్యకర్మముల కేకాలంబునుం బోక
భజియించుచుండు మాభజనమునను
తే. మోక్షలక్ష్మీకటాక్షము పొందఁ గలుగు
నట్లుసేయ నశక్తుఁడ వగుదు వేని
ఫల మపేక్షింప కుచితమై వఱఁగు కర్మ
ములఁ బొనర్పుము ధన్యుఁడై పొలుతు వనఘ. 183
తే. సాధుసంగతివలన నాచక్కిభక్తి
భావము లభింపఁ గలుగు నాభావమునను
నన్ను సేవించుచుండెడునరుఁడు నాదు
స్థానమును బొందఁ గలఁ డని నానుడి యగు. 184
వ. అనిన నుద్ధవుండు దేవా! సాధువులు పెక్కుగతుల నుందు రందు నీ
కభిమతుం డెట్టివాఁడు భక్తియు బహువిధంబులుగ నున్నయ దెట్టి
భక్తికి నీచిత్తం బగు నారదాదు లెట్టిభక్తి నీపట్ల నుపయోగింతురు
చెప్ప ననుగ్రహింపు మనిన భగవంతుం డి ట్లనియె. 185
సీ. దయ గలవాఁడు భూతములకు ద్రోహము
సేయనివాఁ డనసూయకుండు
సమదృష్టి గలవాఁడు సత్యధనుండు ద్వం
ద్వసహుండు సాధువర్తనుఁడు దాంతి
శాంతి శౌచము సత్త్వసంపన్నతయుఁ గల
వాఁడు నాపై భక్తిఁ బరఁపువాఁడు
సాధువు నాఁబడు సర్వభావముల నా
బోధ మరయువాఁడు సాధుతముఁడు
తే. నాస్వరూపస్వభావముల్ నావిభూతు
లెఱిఁగి పలుమాఱు తలఁచుచు హృదయమందు

నితరచింతల విడనాడి యెవఁడు నన్నుఁ
బరముఁ డని యెంచు నాతఁడు భక్తవరుఁడు. 186

వ. ఇంక భక్తియోగలక్షణంబులు చెప్పెద నాకర్ణింపుము. 187

క. నాప్రియము నాదుభక్తులు
నాప్రియగాఁ జూచి మెట్టి నానావిధులన్
సుప్రీతి నర్చ సేయుచు
నేప్రొద్దు భజించువార లే భక్తు లిలన్. 188

సీ. మఱియు నామూర్తి మఱిమఱి మ్రొక్కుట
గుణకర్మములు చెప్పుకొనుట నాదు
కథలు కీర్తించుట గానంబు సేయుట
ధ్యాన మొనర్చుట తవిలి యుంట
వినువారికి న్నన్ను వినుచుట నాజయం
తుల నుత్సవాదులు సలుపుటయును
నృత్తగీతాదులు నెఱపుటయును వాద్య
ములు పొనర్చుట సభల్ సలుపుటయును

తే. బుణ్యభూములకున్ యాత్ర పోవుటయును
పర్వములయందు నాపూజ సర్వబంధు
జనులతోఁ గూడి చేయుట ఘనతరవ్ర
తము లొనర్చుట భక్తికిఁ దానకములు. 189

తే. నాగృహం బూడ్చి కలయంపి నానఁ జల్లి
యలికి ముగ్గులు వెట్టి దీపావళు లిడి
పూలమాలికల న్నలుమూలలం ద
లంకరించుటయును భక్తి కంకము లగు. 190

మ. తనకిష్టం బగునేపదార్థ మయినన్ దాఁ దెచ్చి నాదేవళం
బున నైవేద్య మొనర్చి దాను దనవార్ ముప్రొద్దులున్ మెక్కుచుం
డిన నే నెంతయు వారిభక్తికిఁ గడిందిన్ సంతసం బంది వా
రిని నాత్మీయులు గాఁగ నెంచుచును బేర్మిన్ గూర్తు నెల్లప్పుడున్.

వ. ఉద్ధవా! నీవు నారూపంబుగా నెంచుచు సూర్యుని వేదమంత్రముల చేతను వహ్నిని బురోడాశాదులచేతను బ్రాహ్మణుల నాతిథ్యము చేతను గోవుల యవపిష్టతిలోదకాదులచేతను విష్ణుభక్తుని బంధువువలె సత్కరించుటచేతను హృదయాకాశము ధ్యానముచేతను వాయువును బ్రాణబుద్ధిచేతను స్థండిలభూమిని మూలమంత్రముచేతను హృదయాద్యంగముల మంత్రన్యాసములచేతను దేవమనుష్యాదిసమస్తభూతములను క్షేత్రజ్ఞునిఁగా నెంచుటచేతను రాగద్వేషాదులు మాని సమచిత్తంబున నం బూజింప వలయు. 192

శా. ఆయాస్థానములన్ సమర్చనలు నేయం బూని యున్నప్పుడో
నాయంగంబులసౌష్ఠవంబు మఱియున్ నాదైవ స్త్రంబులున్
స్థాయత్తేజము శంఖచక్రములు భాస్వత్కౌస్తుభం బాదిగా
నై యింపొందెడునాదురూపము నెదన్ ధ్యానింపగా నొప్పెడిన్. 193

వ. ఇట్లు వైదికకర్మములచే స్మార్తకర్మములచే సమాహితచిత్తుండై యెవ్వండు నన్నుఁ బూజించునో వానిభక్తి యపారం బని వాని నే నాత్మభక్తునిగా భావించి గారవింతు నోయి యుద్ధవా! వర్ణాశ్రమధర్మయోగంబులు సాంఖ్యము నహింసారూపధర్మము స్వాధ్యాయము తపము త్యాగము నిష్టాపూర్తము నేకాదశ్యుపవాసాదివ్రతములు పంచమహాయజ్ఞములు మంత్రములు గంగాదితీర్థములు శౌచాచమనాదినియమములు నింద్రియనిగ్రహాదులు లోనగునవి సత్సంగమమున నన్ను వశీకరించుకొనినట్లు వశీకరింపఁ జేసికొనం జాలవుసజ్జనసంబంధము చేతన దైత్యదానవులు పక్షులు మృగములు నాగులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు మనుష్యులు వైశ్యులు శూద్రులు స్త్రీలు నంత్యజులు లోనగువారు రజస్తమఃప్రకృతు లైననాయాయుగంబులఁ బెక్కండ్రు నాపదం బందఁ గలిగిరి వృత్రాసురుఁడు ప్రహ్లాదుఁడు వృషపర్వుఁడు బలియు బాణుండు మయుఁడు విభీషణుండు సుగ్రీవుఁడు హనూమంతుఁడు జాంబవంతుఁడు గజేంద్రుఁడు జటాయువు

తులాధారుఁడు ధర్మవ్యాధుఁడు కుబ్జయు గోపికలును మునిపత్నులును
మఱియు ననేకులు నన్ను సేవించి నాపదంబు నొందిరి వీరు వేదములు
చదివినవారును సాధువుల నుపాసించినవారును వ్రతము లొనర్చిన
వారును దపములు సల్పినవారును గారు కాకున్నను సత్పురుషసంగ
మంబున నన్నుఁ బొందిరి గోపికలు కామబాధచేతను గోపులు నెద్దులు
నజములు మృగములు నన్నుఁ జూచి తాఁకుటచేతను గాలియాదులు
కోపభావమునఁ జూచుటచేతను దమోగుణవంతు లయ్యును సిద్ధి
నొందిరి దానవులు తపోయజ్ఞస్వాధ్యాయసన్యాసాదులచేఁ బొంద
రానినన్ను వీ రెల్లరు నల్లనం బొందఁ గలిగిరి వినుము. 194

సీ. ఏ మధురకుఁ బోవ నెంచినప్పుడు నన్ను
విడ లేనివా రయి వేగిత లెల్ల
వలపుచేఁ జిత్తముల్ పలపల నై పోవ
ప్రాణముల్ చెల్లినవారివ లెను
నెదిరిఁ దమ్మును జగం బెఱుఁగనివా రయి
నాయందె మరు లంది నాస్వరూప
ము నె హృదయములందు నునిచి కొనియు నన్ను
నెఱుఁగనివా రయి యెల్లనాఁడు

తే. రమణునిగ నెంచి వలచి కామమునఁ జేసి
లిప్తమాత్రము విడఁవంగ లేనికూర్మి
నన్ను లోఁ గొని రమియించుచున్న వార
లగుట మోక్షము వారల కంద నయ్యె. 195

వ. నీవు నవ్విధంబున నన్నుఁ బితగాను రక్షకుని గాను నాత్మారాముని
గాను దలంచుచు సర్వభావంబుల శరణుఁ జొరుము దాన నీకు మేలు
గలుగు ననిన యుద్ధవుండు యోగేశ్వరేశ్వరా నీమవాకులంజేసి నా
సందేహము లన్నియుం దీఱినవి కాని యాత్మనుఁ గూర్చినసందే
హంబు తీఱకున్న దనిన శ్రీకృష్ణుం డి ట్లనియె. 196

సీ. ప్రాణవాయూక్త దేహమునందు జీవుఁడు
హృదయగుహం జొచ్చి యొసక మెసఁగు
నక్షికిం దెలియ రానంతసూక్ష్మం బయి
యర్థులూచ్చారణమందుఁ బ్రబలి
యణురూప మగునగ్నియట్లు విస్తృతిఁ గాంచు
నిది నాయధీనమై పొదలుచుండు
నవల సర్వేంద్రియవ్యాపారములు గల్గి
నావ్యక్తి యగును గుణత్రయమునఁ
తే. బారవశ్యత నొంది ప్రపంచమందుఁ
బుట్టుచావులు వృద్ధియుఁ బొంద నగుచు
నెట్టిపరిణామమును లేక యేకరూపుఁ
డయ్యు నిత్యుఁడై యుండుదేహములయందు. 197

వ. దేహాశ్రితుం డగుజీవుం డహంకారమమకారంబులు గలిగి విత్తనంబు క్షేత్రానుగుణంబుగ వృద్ధిక్షయంబు లొందినట్లు దేవుండు మనుష్యుండు లోనగు పెక్కురూపంబు లొందుచు నింద్రియాదులం గూడఁ దంతువుల నల్లంబడినపటంబువలెఁ బెద్దసంసార మగుచు నున్న దీసంసారవృక్ష మనాదియై కర్మాత్మకమై సుఖదుఃఖములం గనుచున్నది.

—♦ శ్రీకృష్ణుండుచేసిన తత్త్వోపదేశము ♦—

సీ. విను మల్ల సంసారవృక్షమునకుఁ బుణ్య
పాపము లన రెండుపరఁగు బీజ
ములు రాగముఖవాసనలు వేయి మూలముల్
ఘనగుణంబులు మూడుకాండము లగుఁ
బంచభూతమ్ములు నెంచ స్కంధంబులు
విషయము లే నందు వెలయురసము
లేకాదశేంద్రియానీకము శాఖలు
ద్విసుపర్ణములకు గూ డెసఁగు నందు

తే. మూఁడు వాతపిత్తశ్లేష్మములను వల్క-
లములు సుఖదుఃఖములను ఫలములు రెండు
వఱలు నది సూర్యమండలవ్యాపి యగుచుఁ
జెప్పనొప్పు విధాతృవిసృష్టియందు. 199

తరునోజ. ఆచెట్టుపండులం దగుదుఃఖరూప
మగునొక్కపండు గ్రామాంతసంచారి
యై చెప్పనొప్పుగృధ్రాళి భుజించు
నవ్వల సుఖరూప మగునన్యఫలముఁ
జూచి వనంబులఁ జొప్పడియుండు
శుద్ధహంసలు భుజించుఁగా దద్విధంబు
భూచక్రమున గురుముఖమున నెర్గి
పొల్పు వేద మెఱుంగుపురుషుఁడు వోలె. 200

ఆ. విద్య నభ్యసించి విద్య యగు వాఁడి ఖ
డ్గమున జీవనంపుఁ గలశరీర
మనెడుచెట్టు నఱికి యప్రమత్తుఁడ వయి
నన్నుఁ బొందఁ దలఁపు మన్న నీవు. 201

వ. సత్త్వరజస్తమంబులు మనోగుణంబులు గాని యాత్మగుణంబులు గావు సత్త్వముం బెంచి దానిచే రజస్తమంబుల నడఁగింప నగు సత్త్వము చేతనే నాభక్తి యనుధర్మము గలుగుచున్నది సత్త్వము సాత్త్వికాహారంబున వృద్ధినొందు దాన నాభక్తియు నహరహంబు నభ్యాసంబున వృద్ధి నొందుఁ గేవలసత్త్వము రజస్తమంబుల నడంపఁ జాలదు సత్త్వమువలన భక్తిరూపధర్మము వృద్ధి నొందు దానంజేసి రజస్తమంబు లడంగు నవి యడంగినఁ బుణ్యపాపంబు లడంగుం గావున సత్త్వవృద్ధి యుత్తమమోక్షోపాయంబు సత్త్వవృద్ధికిఁ గేవలసాత్త్వికో పాసనము కాక భగవద్వైభవప్రకాశకము లైనయాగములు సాధు సజ్జనులును గంగాదిపుణ్యజలంబులును దేశకాలములును ఫలాభిసంధి

లేనికర్మములు నీశ్వరధ్యానమ్మును మంత్రజపంబును బంచవిధసంస్కా-
రంబులును సత్త్వవృద్ధికి సాధనంబులు సత్త్వమువలన నాభక్తి గలుగు
నంటి నాభక్తివలన జ్ఞానోదయం బగు దానివలన నాస్వరూపస్వభా
వంబు తెలియంగినస్మృతి యొదవు దానివలన విషయాంతరస్మృతి
యడంగు ననిన నుద్ధవుండు కృష్ణా! శబ్దాదివిషయము లాపదలకుఁ
బట్టుగొమ్మ లని యెఱింగియు మనుష్యు లావిషయములనే యనుభ
వించుచున్నా రేమి యనినఁ గృష్ణుం డి ట్లనియె. 202

సీ. ఆత్మయందుఁ బ్రమత్తుఁ డగువాఁడు దేహమే
యాత్మగా నెంచి నే నధికుఁడ నని
మది నహంకారము పొదలెడుబుద్ధితోఁ
బాపకార్యంబులపాలఁ బడుచు
మనము రజస్సుతోడను గూడినంత సం
కల్పవికల్పముల్ గలుగుచుండు
హేయముల్ భోగ్యము లే యని దోఁచుట
భోగములం దిచ్ఛ పుట్టుచుండుఁ

తే. గాన దేహాభిమానము గలిగి జీవి
భోగ్యముల తీయఁదనమును మొదలగు గుణ
ములనె తలపోయుఁ గామము తలకు మించి
యుండుటను వాఁడు దుర్గతు లొందుచుండు. 203

— ♦ శ్రీకృష్ణుఁ డెఱింగించిన హంసోపాఖ్యానఘట్టము ♦ —

వ. రజస్తమస్సులచేత బుద్ధి విక్షిప్తమై మూఢముగా నున్నను వివేకి
యగువాఁడు సంకల్పవికల్పములకు వశము గాకుండు నట్లు మనం
బరికట్టి విషయ మాఁపదలకుఁ దానకం బని తలంచి తగుల్పడక
రాగభోగంబుల విడనాడి యప్రమత్తుండై శుభాశ్రితుభూతుఁడ
నగునాయందు మనంబు నెలకొల్పి సమాధినిష్ఠుఁ డగు నిట్లు నేను
హంసరూపుండనై యవతరించినప్పుడు సనకాదుల కెఱింగించితి ననిన

నుద్ధవుండు నీయుపదేశించినవిషయ మంతయు నిపుడు నాకు సవిస్తరం
బుగం జెప్పు మనిన భగవంతుండు వెండియు. 204

తే. బ్రహ్మమానసపుత్రులై ప్రబలినసన
కాదు లొకనాఁడు నిజజనకాంతికమున
కరిగి యేరికిఁ దెలియరానంతసూక్ష్మ
మయినయోగము చెప్పుమం చడిగి రిట్లు. 205

తే. అనఘ శబ్దాదివిషయములందు మనము
భోగ్యము లని ప్రవేశించుఁ బొసఁగ నావి
షయములును మనమునుఁ బ్రవేశము నొనర్చు
నవి యొకటి నొక్కటియు విడనట్టు లుండు. 206

వ. ప్రకృతిబంధ మనర్థ మని దానినుండి ముక్తి నొందుట లతికష్టం బది
యె ట్లనిన బ్రహ్మదేవుఁ డాప్రశ్నంబులకుఁ బ్రతివచనంబు లొసంగ
నేర కాలోచించుచుండ నే నపుడు హంసరూపుండనై పోయి నంత
వారు నన్నుఁ జూచి ప్రత్యుత్థానాభివందనాదు లొనరించి యడుగఁ
దలఁచినదాని నడుగక మీ రెవ్వ రని యడిగిన నే నప్పుడు వారి
దిక్కుమొగంబై. 207

మ. చిదచిద్వస్తువు లెల్ల నాకు నొడలై చెల్వొందుటన్ నేను గా
కెదియున్ లేదు సమస్త మేన యని యూహింపంగ నై యుండ మీ
రెద నూహింపక యెవ్వ రం చడిగినా రీమీరు నాయాత్మకుల్
కద నేనే ననుఁ బ్రశ్న చేసితి ననంగాఁ జెల్లు నిప్పట్టునన్. 208

తే. అడుగువాఁడును జెప్పెడినట్టివాఁడుఁ
జెప్ప వలసినవిషయము చెప్ప నైన
కాలమును సర్వ మే నయి క్రాలుచుండ
నెవ్వ రీ వని యడుగుట లెట్లు పొసఁగు. 209

సీ. సనకాదులార! నే సర్వాంతరాత్ముఁడ
నని యెఱింగినమీర లడుగఁ బొసఁగఁ

దజ్ఞానమునఁ జేసి యన్నచో హంసరూ
పమున నే ని ట్లయి వచ్చినాఁడ
మనముచే వాక్కుచేతను దృక్కుచేఁ దక్కు
నింద్రియములచేత నే నొకడన
గ్రహియింపఁ బడుచుందుఁ గాని నాకంటె వే
ఱొకఁడు లేడను టొప్పి యుండు

తే. అనఘులార మదాత్మకుఁ డైనజీవు
నకు శరీరసంబంధ మున్నపుడు మనసు
విషయములయందు మనమందు విషయములును
జొచ్చుచున్నవి విడకుండు నిచ్చఁ జేసి. 210

వ. దానికి దేహసంబంధ మే నిమిత్త మాసంబంధంబున మనోవిషయము
లట్లు సంబంధించుచున్నవి. 211

తే. పూర్వసంబంధమునఁ జేసి మొనసి విషయ
ములును మనమును విడువక కలసి మెలసి
యుండు మన్మూర్తి చింతన ముండె నేని
రెండు నొండొంటి విడనాడుచుండుఁ గాదె. 212

వ. నాదుధ్యానంబున మనోవిషయబంధంబు గాక దేహబంధంబునుం దెగు
నాకర్ణింపుఁడు. 213

శా. జాగ్రత్స్వప్నసుషుప్తు లన్నవి యవస్థల్ మూఁడు దేహంబునం
దగ్రస్థానము నొందెడుఁ బ్రకృతికిన్ వ్యాపారహేతుత్వ మ
త్యగ్రీయస్థితిఁ గాంచి జీవుఁడు సమస్తార్థాళికిన్ సాక్షియై
వ్యగ్రుండై విషయంబులం గలమనోవ్యాపారబంధంబునన్. 214

క. ప్రకృతి విరక్తుండు మదా
త్మకుఁ డగుజీవునకు లేవు తదవస్థలు మూఁ
డకలంకుఁ డగును దానన్
సకలానందములు పొందఁ జాలెడుఁ దెలియన్. 215

వ. అనాది యగునహంకారముచే నాత్మకు బంధంబు ప్రాప్తించు దానఁ బురుషార్థము విఘాతం బగు ని ట్లెఱింగి సంసారబంధంబునుండి విడివడి జాగరాదుల నతిక్రమించి యున్నయాత్మస్వరూపం బెఱుంగ వచ్చెడు దాన ముక్తి కరతలామలకం బగు నని మఱియును. 216

చ. కలఁ గనువాని కద్ది కల గాదగు జాగర మందు బుద్ధికిన్
దలఁ పగునట్టు లాత్మ వివిధం బగురీతుల భేదబుద్ధిఁ దోఁ
దలఁచెడునంత మేల్కొనియుఁ దా నిదురించెడువానిపోలికన్
మెలఁగుచు మూఢభావమున నేల్లనఁ జాలఁ డొకప్డు డేనియున్.

సీ. యోగి సమాధియం దుండి నన్ జూచుచు
నితరంబు లెవ్వియు నెఱుఁగ కుండుఁ
దాను లేచుటగాని ధరణిపైఁ గూర్చుంట
గాని చరించుట గాని తెలియఁ
డాత్మస్వరూపము సాక్షాత్కరించెడు
పట్ల మేని నెఱుంగుపని గలుగదు
ప్రారబ్ధకర్మ మున్నంతవఱకుఁ బ్రాణ
ధారణ మొనరించుఁ దద్విధమున

తే. జ్ఞాని స్వప్నమువలె న నిత్యాన్నృత మగు
దేహమును బంధువుల నెంచి యూహ లేక
సంచరించుచు నీశ్వరసత్య మెంచి
ముక్తి సాధించినట్టిఁడై పోవు నవల. 218

వ. విప్రులారా! సాంఖ్యయోగంబులం దతిగుహ్యం బైనమోక్షధర్మము మీ కెఱింగించితి నేను యజ్ఞనిర్వాహకం డగువిష్ణుండను మీకడ కిట్లు వచ్చితి సాంఖ్యమునకు యోగమునకు సత్యమునకుఁ బుణ్యమునకుఁ దేజమునకు శ్రీకిని గీర్తికిని శమమునకు దమమునకు నేన యాశ్రయంబు నేన ప్రవర్తకుండ స్వార్థాపేక్ష లేనిపరమోత్తములకు నేఁ బ్రియుండ నన్ను నానందము లొసగు కళ్యాణగుణంబు లాశ్ర

యించు నని సనకాదులకుం జెప్పి వారిచే నారాధింపంబడి వారు
నానావిధస్తోత్రంబులు పచరించుచుండ బ్రహ్మాదులకుం జెప్పి నా
సదనంబునకుం బోయితి ననిన నుద్ధవుండు దేవా! వేదవేత్తలు ధర్మార్థ
కామమోక్షము లాదిగా శ్రేయము లెన్నో పేర్కొందురు నీవు
ఫలాపేక్ష లేనిభక్తియోగ మొక్కటియే మోక్షసాధన మంటి విం
దేదేని స్వీకరింప నొప్పునో చెప్పు మనిన భగవంతుం డిట్లనియె. 219

సీ. ప్రాకృతప్రలయము వచ్చినప్పుడు శ్రుతుల్
నశియించినట్టినై ననువు దప్పె
నపుడు నే నాశ్రుతు లపురూపముగ నల్వ
కెఱిఁగించితి నతండు గరిమ మీఱ
మనువునకుం జెప్పె మనువు సప్తర్షులు
భృగువు లోనగువారి కెఱుఁగఁ జేసె
వారలవలన దేవతలు దానవులును
మనుజు లాదిగ నేర్చుకొనిరి వాని

తే. వారల స్వభావము లనేకభంగుల నగు
దానమతములు భేదిల్లె ధర్మకర్మ
ములును నానావిధంబులై వెలయ నయ్యె
వానికి విరుద్ధధర్మముల్ గాన వచ్చె. 220

తే. వారివారికి ననుగుణపద్ధతులను
గర్మము లొనర్చి పెక్కు లౌధర్మములను
శ్రేయములు గాఁగఁ జెప్పుచు క్షితితలమున
వ్యవహరించుచునుండి రవ్వానివలన. 221

వ. అందుఁ గొందఱు ధర్మము కొందఱు యశము కొందఱు కామాదులు
కొందఱు సత్యదమశమాదులు కొందఱు భోజనభాజనాదులు కొంద
ఱిష్టాపూర్తములుం గొందఱు యజ్ఞతపోదానశౌచాదులు పురుషార్థ
ములు గా చెప్పుదురు మోహపర్యవసితంబు లగువీనిఫలంబు

లాద్యంతంబులం గూడి యుండుఁ గర్మసంపాదితము కర్మము నశ్వరంబు దుఃఖప్రదంబును గావున సివియు నశ్వరంబు లనుట నిశ్చయంబు గావున నిత్యనిరతిశయానందస్వరూపుఁడ నగునాయందుఁ జిత్తంబు నిలిపి క్షుద్రఫలాపేక్ష లేక యున్నభక్తవరునకు శాశ్వతానంద సుఖంబు సంపాదితం బగు నట్టివాఁడు బ్రహ్మాధిపత్యము గాని మహేంద్రపదవి గాని సమస్తభూమండలాధిపత్యము గాని తుదకు మోక్షము గాని యొల్లండు నాకు నాదేహము గాని నాపుత్రులగుబ్రహ్మాదులు గాని శ్రీదేవి గాని మఱి యెవ్వరుం గాని నిన్నుం బోటిభక్తుండు బలెఁ బ్రియులు గారు వినుము. 222

—♦ ఈ శ్వ ర ధ్యా న ల క్ష ణ ము ♦—

శా. నన్నుం దప్ప మఱొక్కనిం గనక లో నానామరూపంబులే
యెన్నం జాలి ప్రశాంతుఁడై మనమునన్ హేరాళ పరాభక్తిమై
యెన్నండు న్విషమంబు గానిగతికై హేమించునాభక్తునిన్
నన్నుం బోలెఁ గనుంగొనంగ నగుచున్ నాపాప్రు గల్పించెదన్.

ఉ. నాపయి భక్తి గల్గిన జనప్రవరుం డగువాఁడు విజ్ఞుఁడై
పైపయిపూత లట్లు కనవచ్చెడుకర్మము లెవ్వి గాని లో
నోపఁడు కైకొనంగ నను నుల్లమునం దిడికొంచు శాంతుఁడై
నాపదసేవ చేయు నొకనాఁటికి మానక న్ప్రియంబుగన్. 224

తే. దయయు ధర్మము సత్యము దవిలి యున్న
విద్యయుఁ దపంబు మిక్కిలి పెఱిగియున్న
నాదయినభక్తి యొక్కటి లేద యేని
వాఁడు పరిశుద్ధుఁ డని చెప్ప వలనుపడదు. 225

వ. అని చెప్పిన నుద్ధవుండు ని న్నేరూపంబున నెట్లు ధ్యానింప వలయుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 226

సీ. సమతలంబున స్వస్తికము గాని పద్మము
గాని యాసనమును గలిగికొనుచు

నాసీనుఁడై దేహ మక్కజంబుగ నిగి
డించి యూరువులపై నుంచి కేలు
నాసాగ్రమునఁ జూపు నలువొందగాఁ జేసి
పూరక రేచకంబులును గుంభ
కమును గావించి చక్కఁగ నిడాపింగళా
నాడిరూపంబునఁ బోడిమిఁ గను

తే. ప్రాణవాయుసంచారమార్గమ్ము సుపరి
శుద్ధముగఁ జేసి యింద్రియస్తోమము నరి
కట్టు టభ్యసించుచు లోన ఘంట మ్రోఁగు
నట్లు నాదము వెలువడునవసరమున. 227

శా. సంకల్పం బెది లేనిచందమున నిశ్వాసంబు నుఛ్వాసముం
బొంకం బేర్పడఁ దూటిదారమువలెన్ బోలింపఁగా సన్నమై
యోంకారం బది వెల్వడంగ హృదియం దుండంగ సంధించి య
ద్యోంకారంబును ధ్యానమున్ సలుపఁగా నొప్పున్ బుధుండాదటన్.

వ. ఇట్లు ప్రాణవాయుసంధానంబుగాఁ బ్రాణాయామము త్రిసంధ్యల
దశవారంబులు సేయుచుఁ బ్రాణసంయమనం బభ్యసించి ప్రాణ
వాయువును జయించి. 229

సీ. అవ్వల నిజహృదయమునం దదోముఖ
మున వేలుపంకేజముకుళము గని
దాని నూర్ధ్వముఖంబుగా నధోనాళము
గా నెన్మిదిదళంబులై నెఱి గొని
వికసించి యుండినవిధమున ధ్యానించి
దానిలో సూర్యసోమానలముల
మండలంబులు గూడి యుండిన ట్లందులో
విభ్రాజమానమై వెలయుచుండు

తే. ధ్యానమునకు శుభాశ్రయ మైననాదు
దివ్యరూపముఁ గనుఁగొని దిక్కు లరయఁ
బోక నిశ్చలచిత్తుఁడై బూమె విడిచి
చెప్ప వేయక చూడంగ నొప్పు ననఘ. 280

సీ. నీలమేఘచ్ఛాయ నెఱి మీఱుమేనివాఁ
డబ్జముంబోలునక్షియుగము
వాఁడు చక్కనిమోమువాఁడు మేలగునాల్గు
భుజములు కలవాఁడు బూమెలాడు
కంబుకంఠమువాఁడు కమనీయకుండల
గండస్థలమువాఁడు దండికెక్కు
వక్షస్థలమువాఁడు బంగారుదువ్వల్వ
వలెవాటుగాఁ దాల్చి వఱలువాఁడు

తే. కౌస్తుభము లక్ష్మి యురమునఁ గలుగువాఁడు
శంఖచక్రగదాఖడ్గజలజమాల
లను ధరించినవాఁడు మేల్మణికిరీట
కటకకేయూరములవాఁడు గ్రాలుచుండు. 281

ఉ. వానిని నన్నుఁ గా నెఱిఁగి భక్తి ప్రపత్తియు విస్తరిల్లఁగా
ధ్యానపురస్సరంబుగను దత్పదపద్మము లాది మీఁదుగాఁ
గానఁగవచ్చునంగములు గాటముగా మది నిల్పి కొల్చుచుం
ధీనిధి యైనవాఁ డవల దివ్యముఖంబున దృష్టి నిల్పనౌ. 282

వ. ఇట్లు సమాహితచిత్తుండై నన్ను ధ్యానించుచుండువాఁ డితరధ్యానంబుల వంకఁ బోక నిశ్చలమనస్కుండై నన్నుఁ దన్నుఁగాఁ దలంచుచుండువాఁడు ముక్తుండగు నని భగవంతుండు వెండియు బాహ్యేంద్రియములను బ్రాణములను జయించి స్థిరచిత్తుండై నాయందుఁ జిత్తంబు హత్తించి యున్నవాని కెల్లసిద్ధు లుపస్థితము లగుచున్న వనిన నుద్ధవుం డచ్యుతా! సిద్ధు లెన్ని? యేధారణమున నెట్టిసిద్ధి సాధ్యంబగు నీవు సిద్ధిప్రదుండవు గావున నా కింతయు నెఱింగింపు మనిన నతం డిట్లనియె.

—♦ శ్రీకృష్ణుఁ డణిమాదిసిద్ధు లెఱింగించుట ♦—

సీ. పదియు నెన్మిది యయి పరఁగును సిద్ధు లం
దెనిమిది నాప్రాప్తియే ప్రయోజ
నముగాఁ గలవి యయి యమరుఁ దక్కినపది
విషయోపభోగసువిశ్రుతమ్ము
లణిమయు మహిమయు నలగరిమయు లఘి
మయుఁ బ్రాప్తి ప్రాకామ్య మయినవెనుక
నీశిత్వము వశిత్వ మీయెనిమిది సిద్ధు
లును యోగి కొప్పెడు నని తెలియుము
తే. ఈయెనిమిదియుఁ దెలియ మదీయమూర్తి
దర్శన స్పర్శన ధ్యాన ధారణాదు
లకు నుపకరించు నని యోగులకు నెఱుంగ
వచ్చుట న్వానిఁ గైకొన వలదు రెడఁద. 234

వ. మఱియు ననూర్మిమత్త్వంబును దూరశ్రవణదూరదర్శనంబులును మనోజవంబును గామరూపంబును బరకాయప్రవేశంబును స్వచ్ఛందమృత్యువును సర్వదేవానుక్రీడనంబును సంకల్పసిద్ధియు నిరంకుశాజ్ఞాగతులును త్రికాలజ్ఞతయు నద్వంద్వంబును (ద్వంద్వభీతి లేకుండుట) బరచిత్తాభిజ్ఞతయు నగ్న్యర్కాంబువిషాది ప్రతిబంధనంబును నపరాజయంబు నివి యోగధారణసిద్ధు లివి యేవి యేధారణంబునం జేసి సిద్ధించునో వానిం జెప్పెద వినుము భూతములందలి నాదేహసూక్ష్మత నుపాశించువాఁ డణిమను బొందు మహత్తత్త్వము గల నాయందు మనంబు నిలిపి మహిమ నొందు కాలసూక్ష్మార్థత నెఱింగినయోగి లఘిమను బొందు వైకారికాహంకారోపాధి గల

♦ అణిమ=దేహ మణుత్వ మొందుట; మహిమ=మహత్త్వము గలుగుట; గరిమ=గొప్పతనము; లఘిమ=లఘుత్వ మొందుట; ప్రాప్తి=సంబంధము నొందుట; ప్రాకామ్యము=సమస్తము నతిశయించి యుండునది; ఈశిత్వము=సమస్తస్వామిత్వములం గూర్చునది; వశిత్వము=సర్వవశ్యము గలిగించునది;

నన్ను ధ్యానించి సమస్తప్రాణేంద్రియాదులఁ బ్రాపించుశక్తి గలప్రాప్తినిఁ బొందు మహత్త్వము శరీరముగా గలనన్ను ధారణము చేయువాఁడు దృష్టాదృష్టఫలజ్ఞానము గలప్రాకామ్యమును బొందును సృష్టిస్థితిలయవ్యాపారనిర్వాహకుం డగు నన్ను ధారణచేయువాఁడు ఈశిత్వమును బొందు. అవస్థాత్రయంబున కవలిదై తురీయ మగుపరిశుద్ధజీవాత్మస్వరూపుఁడ నగునన్ను ధ్యానించువాఁడు వశిత్వము నొందు.

సీ. నిర్గుణబ్రహ్మమై నెగడొందునాయందు
మది నిల్పి యానందమగ్నుఁ డగుచు
శుద్ధసత్త్వాత్మ న స్నిద్ధభక్తిం గొల్చి
యాఱూర్ము లెడల శుద్ధాత్ముఁ డగును
ఆకాశరూపుఁడ నగునన్నుఁ జింతించి
నింగివాకు లెఱుంగ నేర్చుకొనుచు
సూర్యాత్మక మగు చక్షువునందు నన్నుఁ జూచు
నతఁడు విశ్వంబెల్ల నరయు దృష్టి

తే. మనము దేహము సంయుక్త మొనరఁ జేసి
నన్ను యోగమునం గాంచుచున్నయతఁడు
తనదుమన మెట కేగునో తనదుమేను
నచటి కేగెడుశక్తియై నలరుచుండు. 286

తే. నెమ్మనము నాదుమూర్తిపై నిలిపి లోన
నెట్టిరూపము నొందఁ దా నెంచుకొనునో
నాదుయోగబలంబున లోఁ దనరెడు
నట్టిరూపము నొందెడు నంతలోన. 287

తే. తాను బరకాయమును జేరఁ దలఁపు జేసి
ప్రాణవాయువు తనమేనివలన వెలికి
వచ్చునట్టులు గావించి బాహ్యవాయు
కలిత మగుదానిఁ జొన్పంగ వలయు నచట. 288

వ. మఱియు స్వచ్ఛందమరణముం గోరువాడు పార్ష్ణిచే గుదస్థానము
నదిమిపట్టి ప్రాణముం గ్రమముగా హృదయమునందు ఱొమ్మునందు
కంఠమునందు మూర్ధమునందుం జేర్చి పిదప బ్రహ్మరంధ్రంబు పగి
లించుకొని బ్రహ్మమును బొందించి మేను విడువ వలయు నవల
శుద్ధసత్త్వమున విహరించునాపురుషునికడకు దేవతాస్త్రీలు విమా
నంబు లెక్కి వత్తు రపుడు వాఁడు వానిసంకల్పమున కనురూప మగు
దానిం బొందుచున్నాఁడు. వశిత్వాదులు గలవాఁడు నన్ను ధ్యానించి
విపత్తుం గాంచఁడు నాయాజ్ఞవలె వానియాజ్ఞయుం జెల్లుచుండు
నాభక్తిభావంబుననే యోగి కాలత్రయజ్ఞానంబు గలవాఁ డగు వాని
దేహము యోగప్రచురమై యుండును గావున నది యగ్న్యాదులచే
నాశనంబు నొందు వాని నే స్తంభింపఁ జేయుశక్తి గలిగియుండు
నిట్లు యోగధారణచే నన్నుపాసించువాని కెల్లసిద్ధులును సాధ్యంబు
లగు జలజంతువులకు జలస్తంభనము పక్షుల కాకాశగమనముం బలె
జన్మముచేతనే కొన్నిసిద్ధులు సంప్రాప్తంబు లగు మఱియు మణి
మంత్రతంత్రౌషధాదులచేతఁ గొన్నిసిద్ధులు సాధ్యములు వీనికన్నింటికి
నేను బ్రాపకుండ నింతియ కాదుపాసనరూపసాంఖ్యయోగములకు
బ్రహ్మవాదులకును యజ్ఞాదికర్మములకును నేన యధిష్ఠాన మగు
చుండు నాకుఁ బరిచ్ఛేదము లేదు నేను దేవమనుష్యాదిభూతము
లందు నాకాశాభిభూతములందు నిండి యున్నవాఁడ నని యెఱుంగు
మని చెప్పిన నుద్ధవుండు నీవు సాక్షాత్పరబ్రహ్మమవు నీ కుత్పత్తి
వినాశంబులు లేవు ప్రపంచోత్పత్తిస్థితిలయంబు లాచరింతువు నీవు
సర్వప్రవృత్తులకు హేతుభూతుండ వని యెఱింగి వేదాంతవాదు
లుపాసించుచున్నారు పరమర్షులు నిన్ను విభూతిరూపునిగా
నెఱుంగుచున్నారు కావున నో దేవా! నీవిభూతియోగంబు నాకుఁ
జెప్ప ననుగ్రహింపుము నీ కిదె నమస్కార మనిన భగవంతుండు

మున్ను కురుక్షేత్రమున నర్జునుండు నన్నడిగిన ట్లిపుడు నీవు నడిగితివి
చెప్పెద నవహితుండ వగుము. 239

—♦ శ్రీకృష్ణుడు చెప్పిన విభూతియోగము ♦—

సీ. భూతములకు నాత్మభూతుఁడఁ గావున
నే నీశ్వరుండ సుహృదుఁడ నూవె
యఖిలభూతములు మదాత్మకంబులు గాన
నవి యెల్ల నే నయి యలరుచుండు
సృష్టిస్థితిలయమాదు లేన చేయుచునుండు
నేమఱిపాటొకయింత లేక
యణువులలోపల నణువునై నే మహ
త్తులలో మహత్తునై వెలయుచుండు
తే. నే హిరణ్యగర్భుండను నేను మంత్ర
ములను మూడక్షరంబుల మొనయు ప్రణవ
మంత్రమును నేన గాయత్రిమంత్ర మేన
యింద్రుఁడను నేన వహ్నియు నేన తెలియ. 240
సీ. ఆదిత్యులందు మహావిష్ణు వేను రు
ద్రులలోపల మహేశ్వరుండ నేన
బ్రహ్మర్షులందును బ్రబలుఁ భృగువు నేన
ఘనరాజఋషులందు మనువు నేన
యలరు దేవర్షులయందు నారదుఁ డేన
ధేనువులం గామధేను వేన
సిద్ధులలోపలఁ జెలఁగుకపిలుఁ డేన
యండజంబుల గరుడుండ నేన
తే. పితరులం దర్యముఁడ ప్రజాపతులలోన
నాదిదక్షుఁడ దైత్యులయందు నసుర
విభుఁడు. ఘనుఁడు ప్రహ్లాదుఁడ వెలుఁగులందు
వెలయుచంద్రుఁడ నే నని తెలియు మనఘ. 241

వ. మఱియు యక్షులలోఁ గుబేరుండ వేదండంబులలో నైరావతంబ జలాధిపతులందు వరుణుండ ద్యుతిమంతులలోన సూర్యుండ మనుష్యులలో భూమీశ్వరుండ హయంబుల నుచ్చైశ్శ్రవంబను ధాతువుల సువర్ణంబను దండధరులలో యముండను సర్పములలో వాసుకిని సహస్రఫణంబులు గలవానిలో ననంతుండ మృగంబులలో హర్యక్షుండ నాశ్రమంబుల సన్న్యాసాశ్రమంబను వర్ణముల బ్రాహ్మణుండను దీర్థరాజంబులలో గంగను జలాశయంబులలో సముద్రంబను నాయుధంబుల వజ్రంబను ధనుర్ధరులలోఁ ద్రిపురాంతకుండఁ బర్వతంబులలో మేరువును దుర్గమంబుల హిమాలయంబను వృక్షములలో నశ్వత్థమను బురోహితులలో వసిష్ఠుండ వేదనిష్ఠులలో బృహస్పతిని సేనానులలోఁ గార్తికేయుండ సన్మార్గప్రవర్తకులలో బ్రహ్మదేవుఁడను యజ్ఞములయందు బ్రహ్మయజ్ఞంబను వ్రతములం దహింసావ్రతమును బరిశుద్ధపదార్థములలో వాయ్వగ్నిసూర్యజలాకాశరూపుండ యోగముల సమాధియోగంబను జయోపాయంబుల నీతిని వివేకాదినైపుణ్యంబులలో నాన్వీక్షకిని దార్కికవాదులలో వికల్పమను స్త్రీలయందు శతరూపను బుషులందు స్వాయంభువమనువును మునులలో నారాయణమునిని బ్రహ్మచారులలో సనత్కుమారుఁడను ధర్మములలో నుత్తమధర్మ మగునాత్మవిక్షేపమను క్షేమములలోఁ బ్రత్యగాత్మస్వరూపసంధానమను గుహ్యములలో మౌనమను మిథునములలోఁ బ్రజాపతిని సంవత్సరములలో వత్సరంబను బుతువుల వసంతమును మాసములలో మార్గశీర్షమును నక్షత్రములలో నభిజిత్తును యుగములలో గృతంబును ద్వంద్వసహులలో నసితుం డగు దేవలుండను వేదవిభాగదక్షులలో వ్యాసుండను గవులలోఁ గావ్యుండ జ్ఞానైశ్వర్యసంపన్నులలో వాసుదేవుండ భాగవతులలో నుద్ధవుండ కింపూరుషులలో హనూమంతుండ విద్యాధరులలో సుదర్శనుండ రత్నములఁ బద్మరాగంబను సుందరపదార్థములలోఁ బద్మంబను దృణ

జాతులఁ గుశమును బురోడాశాదులలో హయ్యంగవీనంబును ధనిక వర్గంబున లక్ష్మిని నోర్పుగలవారిలో నోర్పును సత్వవంతులలో సత్వంబును ఓజస్వులలో నోజస్సును బలులలో బలమును భాగవతులలో భాగవతుఁడ మత్స్యాద్యవతారములలో నాదిమూర్తిని గంధర్వులలో విశ్వావసువును నప్సరసలలోఁ బూర్వచిత్తిని నేన పర్వతములందు గలస్థైర్యము నేన భూమికింగలగంధము నేన జలంబులకుం గలరసంబు నేన తేజస్సు గలసూర్యునిలోని తేజస్సు నేన సూర్యచంద్ర తారకాదులం గలప్రభ నేన యింద్రియవిషయంబుల నుత్తమం బైనస్పర్శంబు నేన బ్రహ్మణ్యు లగువారిలో బలిని నేన వీరులం దర్జునుండ నేన భూతముల సృష్టిస్థితిలయంబులు నేన కర్మేంద్రియ జ్ఞానేంద్రియవ్యాపారంబు నేన యింద్రియములకు నిర్వాహకుండ నేన యింద్రియంబులు నేన పృథివ్యప్తేజోవాయురాకాశములు నేన సత్వరజస్తమోగుణంబులు నేన సర్వవస్తుస్వరూపస్వభావాదుల నెఱుంగఁ జాలినజ్ఞానంబు నేన దేహాంతర్గతం బగునీశ్వరుఁడు జీవుఁడును నేన సమిష్టి వ్యష్టి రూపము లైనసర్వకార్యగుణంబులు నేన చిదచిదాత్మక మైనసర్వప్రపంచంబు నే నయి యుందును నేను గొంతకాలమునకేని భూగతాణువుల గణింప నేతుం గాని నావిభూతుల గణింప నేర నాసృజించినబ్రహ్మాండంబులు కోటానంగోట్లు కాంతి వర్చస్సు కీర్తి సంపత్తులు లజ్జయు సత్పాత్రదానము సౌందర్య భాగ్యములు వీర్యము సహనము వస్తుతత్వవిజ్ఞానము హితాహిత కార్యాలోచనము నెందుఁ గల వవి యన్నియు నావిభూతు లీసర్వమును వేదము వక్కాణించుచున్నది నీవు నీవాక్కు మనస్సు ప్రాణము నింద్రియవర్గము నాత్మ నిగ్రహింపు మిట్లు చేసినఁ నీకు భవబంధమోక్షం బగు రాగాదుల నిగ్రహింప నేరనివాఁడు వ్రతిష్ఠై నను యతి యైనను దహోదానరతుఁ డైనను గర్భబద్ధుం డయి సంసారాంధువునం గూలు ననిన నుద్ధవుండు వర్ణాశ్రమధర్మంబు లెట్లనుష్ఠించిన నీభక్తి గలుగునో చెప్పు మనుచు ని ట్లనియె. 242

—• వర్ణాశ్రమ ధర్మ నిర్వచనము •—

సీ. హంసరూపమున బ్రహ్మాదులకును సన
    కాదులకుం జెప్పినట్టిధర్మ
మిపుడు వెండియు నాకు నెఱింగింపు మయ్యాని
    కలకాల మగుటచేఁ గన్నుఁ మాసి
జగతిపై విచ్ఛిన్న మగుట సాజము దాని
    మఱియొక్కరుఁడు చెప్ప మాకు లేదు
నీవు భూతల మీఁగి పోవుదువే ధర్మ
    మదియుఁ బోయినదియే యగును గాదె
తే. అట్టిధర్మమునకు నీవె యగుదు రక్ష
    కుఁడును గర్తయు వక్తయుఁ గోవిదుఁడవు
    కరుణతో నాకు నెఱిఁగింపు కమలనాథ
    యనుచుఁ బ్రార్థింపఁ జెప్పె ని ట్లనుచు శౌరి. 243

తరువోజ. ఆదిని కృతయుగ మందు మర్త్యులకు
    హంసవర్ణం బొక్కఁ డగు వెన్క శ్రుతి
యాదివర్ణము లెవి యైన లేకున్న
    యప్పుడు కృతకృత్యులై ప్రజ లుండి
రాదినంబులు కృత మనుపేర నొప్పె
    నప్పుడు ప్రణవ మత్యర్థంబ యైన
వేదమై యొప్పె నవ్వేళ ధర్మంబు
    వృషమై చతుష్పద విహితమై నడచె. 244

సీ. అపుడు క్రియారూప మగుయజ్ఞములు లేవు
    యోగనిష్ఠులు జను లొప్పుచుండ్రు
హంసస్వరూపుఁడ నగుచు న్నుపాసించి
    యంహోరహితు లగుచు హంసు లైరి
పిదపఁ ద్రేతాయుగ మది వచ్చె నపుడు నా
    హృదిఁ గలప్రణవంబు మొదలు గాఁగ

ఋగ్యజుస్సామము లేర్పడె వేదముల్
మూఁ డవయవముల మొనయ నగుచు

తే. అత్రయీవిద్యవలన యజ్ఞాదు లయ్యె
హోత యనఁగ నధ్వర్యుఁ డుద్గాత యనఁగ
ఋత్విజులు పొల్చి యజ్ఞము లేను గాఁగఁ
దలఁచి భజియించి రల్లమంత్రములఁ జేసి. 245

వ. అక్కాలంబున విరాట్టనంబడునసిరుద్ధునివలనఁ బుట్టినచతుర్ముఖుని ముఖంబునుండి బ్రాహ్మణులు బాహువులనుండి క్షత్రియులు నూరువులనుండి వైశ్యులు పాదములనుండి శూద్రులుంబుట్టి రప్పుడు మఱియు వాని జఘనమునుండి గృహస్థాశ్రమమును హృదయమునుండి బ్రహ్మచర్యమును వక్షస్థలమునుండి వానప్రస్థంబును బుట్టెను శిరస్సును సన్యాస మాశ్రయించె నీచోత్తమజన్మదేశంబులం జేసి వర్ణములు రీతులు నీచోత్తమసంజ్ఞ గలవయ్యె శమము దమము తపము శౌచము సంతోషము క్షమ యార్జవము భక్తి దయ సత్యము ననునివి బ్రాహ్మణధర్మములు తేజము బలము ధృతి శౌర్యము తితిక్ష యౌదార్యము ఉద్యమము స్థైర్యముఁ బ్రహ్మణ్యా మైశ్వర్యము నను నివి క్షత్రధర్మమ్ములు ఆస్తిక్యము దాననిష్ఠ దంభము లేమి విప్రసేవనము ధనార్జనము ననునివి వైశ్యధర్మంబులు ద్విజులకు గోవులకు దేవతలకు శుశ్రూష చేయుట దైవలబ్ధమున కానందించుట శూద్రధర్మంబులు. అబద్ధము చౌర్యము నాస్తిక్యము కలహము కామము క్రోధము తృష్ణ లోనగునవి చండాలలక్షణంబులు. అహింస సత్యము అస్తేయము కామక్రోధలోభాదిరాహిత్యము భూతహితము ప్రియవచనము నివి సర్వవర్ణసమానధర్మంబు లని మఱియును. 246

సీ. ద్విజుఁడు గర్భాధానవిధి మొద లైనసం
స్కారముల్ క్రమముగాఁ గలిగి కొనుచు

నుపనయనం బన నొప్పు రెండవజన్మ
మును బొంది గురుకులమునకుఁ బోయి
చదివి వేదము నిజాశ్రమమున కగునట్లు
నియమితుఁడై వ్రతనిష్ఠలందు
నజినముఁ దండము నక్షసూత్రము మౌంజి
యజ్ఞోపవీతము నరుతఁ దాల్చి
తే. మఱియు స్నానభుక్తి జపహోమములయందు
పరఁగి మౌనవ్రతుం డయి బ్రహ్మచర్య
మున మెలంగుచు శుచి యయి మూడుసంధ్య
లందు వేల్వంగ వలయు నయ్యగ్నిహోత్రు. 247
మ. రవి నాచార్యుని గోవు విప్రు గురువుల్ బ్రార్థించి సేవించియుల్
దినిమస్నాథులపూజ సల్పి యవలల్ వృద్ధార్యులం గొల్చి మౌ
నవిధిన్ వాఱిచి వేదమాతృజపము న్గావించి భూతాళికిన్
భవికం బేర్పడ బ్రహ్మచారి ఘృణియై వర్తింపఁగా నొప్పెడిన్. 248
ద్విపదము. ఆచార్యు సామాన్యుఁ డని యెంచఁ బోక
చూచుచు నన్నుఁగా శోచ్యార్హ మైన
నవమానదృష్టిమై నదలింప రాదు
పవలు రేయియు వాని భక్తి సేవించి
భిక్షితాన్నము తెచ్చి పెట్టి యాతండు
భక్షించినంతఁ దా భక్షింప వలయు
దాసుఁడై శుశ్రూష తవిలి చేయంగ
నీ సభిమానము నెద నొంద రాదు
పోవుచుండ నతండు పోవలె వెంట
నేవేళ నే మన్న నే మన రాదు
కూరుచుండినఁ జెంతఁ గూరుచు నుండి
దారి వట్టినఁ దాను దారినిం బట్టి

చేతులు మోడిచి చిత్తం బెఱింగి
నేరిచి నది చెప్ప నింతలోఁ జేసి
నియమవ్రతంబున నిలిచి యధ్యయన
మురియుచు సంధిల్లఁగ నభ్యాసవిధులు
దవిలి చేయుచు నేర్పుఁ దగుఁ బూర్తి యైన
యువలఁ దదాజ్ఞనై నరుగంగ వలయు. 349

— ఆశ్రమవిధిప్రసంగము —

వ. అట్లు గుర్వనుజ్ఞం గొని గురుదక్షిణ యొసంగి గృహంబునకుం జని సమావర్తనంబు గావించుకొని స్నాతకుండై గృహస్థాశ్రమంబు స్వీకరింప వలయుఁ గాదేని వానప్రస్థసన్యాసాశ్రమంబు లైన స్వీకరింప నొప్పుం గాని యనాశ్రమంబున నుండ రాదు యజనము నధ్యయనము దానము ద్విజన్ము లందఱకు సామాన్యధర్మంబులు ప్రతిగ్రహము యాజన మధ్యాపనము బ్రాహ్మణున కొక్కనికి మాత్రమే కలిగి యుండు నతండు వానిం దొడంగి కుటుంబపోషణంబు చేసికొనుచుండ నొప్పు నదియుం దనకిష్టంబు కానినాఁ డుంఛవృత్తిం జేసి జీవింప నొప్పు నిట్లు చేయఁ జాలనినాఁడు వైశ్యవృత్తిం దగిలి లవణమాంసాదులుగాక తృణకాష్ఠాదివస్తువిక్రయము చేసియు దోషి గా నేరఁడు విహితాచారుండై యుత్తరుండైన బ్రాహ్మణుండు నాకును వందనీయుం డట్టివాని నే ననుసరించి యుందు రా జైనవాఁడు నిజ ధర్మనిష్ణాతుండై ప్రవర్తించుచు న్యాయమార్గంబునఁ బ్రజాపాలనంబు చేయుచుఁ దండ్రి బిడ్డలం బోలెఁ బ్రజల రక్షింప వలయు నట్టిరా జిందు నందు సుఖంబు లందు నింద్రుండు వాని నాదరించు రాజన్యుఁ డాపదలందు వైశ్యవృత్తిం గాని బ్రాహ్మణవృత్తిం గాని స్వీకరించి జీవింప నొప్పు వైశ్యుఁడు బ్రహ్మక్షత్రియులవలెఁ గులోచితంబుగ యజ్ఞకర్మము లాచరించుచు నాపద్ధర్మంబుగా శూద్రవృత్తిం బ్రవర్తింప వచ్చు శూద్రుండు తంతువాయధర్మంబు గాని రథకారధర్మంబు గాని సేవా

ధర్మంబును గాని చేసి కొనవచ్చును ద్విజు లగువార లుత్తమార్జిత ధనంబు నాకుఁ బ్రీతిగా యజ్ఞముల న న్నారాధింపవలె నెవ్వఁడు గాని యీ దేహము తనది తాను దికుండ ననుకొనక తత్త్వ మెఱింగి స్వర్గాదిలోకము లెల్ల నశ్వరంబు లని తలంచి నిస్సంగుండై యహంకార మమకారంబుల వంకం బోవక గృహంబునఁ గులాలకీటన్యాయం బనుసరించి ప్రవర్తించుచు నుండి యజ్ఞాదులచే న న్నారాధించుచు భక్తిజ్ఞాన వైరాగ్యవంతుండై ముక్తుండు కావచ్చు నవ్వల వాన ప్రస్థాశ్రమంబునందును బదంపడి సన్యాసాశ్రమంబునందు నుండి తపించి పరమపదము నొంద వచ్చు. 250

ఉ. వృద్ధులు తల్లిదండ్రులును బిడ్డలు భార్యలు నన్నుఁ బాసి తా
రిద్దర నెట్టు లుండఁ గల రే నిటు వోయినపై నటంచు లో
నుద్ధతిఁ గాంచు వారికయి యుల్లము పల్లటిలంగ వారిపై
బద్ధమనోవ్యథం బడెడు వాని కధోగతు లేగుదెంచెదుర్. 251

సీ. జగతి వానప్రస్థుఁ డగువాఁడు భార్య గృ
హంబున నిడికాని యామెతోడఁ
గాని వనికి నేగి కందమూలాదుల
నాహరించుచు వల్కలాదులు తోడి
వలు దోమ కెప్పుడు వపనకర్మము లేక
మగువ గల్గిన సంగమంబు విడిచి
త్రిషవనస్నానంబు దేవార్చనంబును
భూతలశయనంబు బోలుఁ సేయు

తే. మండువేసవిఁ బంచాగ్నిమధ్యమందు
వానకాలున జడివాన పడెడుచోట
సీతున హిమాంబువులయందు శిరముబంటి
ములుగ నుండి తపింపఁగ వలయు. నిష్ఠ. 252

తే. పౌర్ణమాసి నమావాస్యఁ బర్వదినము
లందుఁ బాశుకహోమము లవలఁ జెట్టి
పైష్టికంబుల నిష్టులు పరఁగఁ జేసి
కొలువవలయు వనస్థుఁడై కోరి నన్ను. 253

శా. వానప్రస్థుఁడు నిర్ణయింపఁబడి విశ్వశ్రేయముం గూర్చి ని
త్యానూనక్రియలం బొనర్చుటకుఁ గా నట్టిండునై వృద్ధుఁడై
తా నున్నప్పుడు వహ్ని వేల్చుట కశక్తత్వత్వంబు ప్రాపించి న
ష్టా నిత్యాగ్నుల నాత్మమంత్రములతో నారోపముం జేయ నౌ. 254

వ. అవలఁ బ్రాజాపత్యేష్టిం గావించి సర్వ మగ్న్యధీనము చేసి భార్యం
బరిత్యజించి ప్రవ్రజితుండుగా నోపు. 255

సీ. ప్రవ్రజితుం డగువాఁడు కౌపీనము
దాల్చి కమండలుదండములును
గైఁ బూని శుచి యైనకాననాదులయందుఁ
గాలు వెట్టుచు వడిఁగట్టి నీరు
ద్రావుచు ఫలపత్రతతులు భక్షించుచు
మౌనవ్రతంబున మహిఁ దిరుగుచు
నొక్కదినంబుగా నెక్కడ నుండక
యెత్తుచు బికిర మేఁడిండ్లయందు

తే. తగులములు లేక యేకాకి యగుచు శమము
దమమునుం గల్గి ప్రణవనాదంబు వినుచుఁ
బుణ్యభూముల మెట్టుచుఁ బూతుఁ డగుచు
నొడలు విడనాడి మోక్షము నొందఁ గలఁడు. 256

సీ. అట్టివాఁడు వివేకి యైనను బాలుని
చందమునం గ్రీడ సలుప వలయు
నెట్టి యెత్తినవానివిధమునఁ బలుకంగ
వలయుఁ బశువు వోలె మెలఁగ వలయు

పాషండి గారాదు వాదులాడఁగ రాదు
తర్కనిష్ఠుండు గాఁ దగ దొకప్డు
రచ్చ కేగగ రాదు ముచ్చటాడఁగ రాదు
భయపెట్టరా దెట్టివారి నేని
తే. భూతదేహములందు సంభూత మగుచుఁ
గానఁ బడు(బహ్మ్యాగాత్మను మానసమున
నన్నుఁ గా నెంచి నాదుధ్యానంబునందు
నలరునేని జీవన్ముక్తుఁ డగు నతండు. 257
తే. ఇట్లు వర్ణాశ్రమాచారహేతు వైన
ధర్మమునయందు వర్తించి కర్మములను
ఫల మపేక్షింప కొనరించుభక్తునకును
వచ్చు నున్నతగతు లని వలయు నెఱుఁగ. 258
వ. అని భగవంతుం డగువాసుదేవుండు వెండియును. 259
ఉ. జ్ఞానికిఁ బ్రాప్య మేన యని శాస్త్రము చెప్పెదుఁ గాన వానికిన్
నేను బ్రియుండఁ బ్రాపకుఁడ నే నగుదున్ మఱి సమ్మతుండ నై
వానిసమస్త మే నగుదు వాఁడును నన్నుఁ బ్రియప్రభుండు నా
ప్రాణ మటంచు నెంచి ననుఁ బాయక యుండును నేను నట్టులే.
వ. జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడ వగునీవు నాయందుఁ బ్రేముడించి జ్ఞానవిజ్ఞానము లగుయజ్ఞములచేత సర్వయజ్ఞనిర్వాహకుండ నగున న్నారాధింపుము న న్నారాధించి మును లెందఱో ముక్తిం గాంచి రనిన సంతుష్టుండై దేవా! జ్ఞాను లగువా రెంతో విజ్ఞానంబునం గాని నీదుభక్తిం దెలియఁ జాల రజ్ఞుండ నగుననుఁబోంట్ల కసాధ్యంబు గావున నాకుం దెలియునట్లు వెండియు నీభక్తియోగమును విస్తరించి చెప్పు మనిన భగవంతుం డుద్ధవా! నీవు న న్నడిగినట్లు తొల్లి యుధిష్ఠిరుండు దేవవ్రతు నడిగెనతండతనికిఁ జెప్పినచొప్పున నే నిపుడు నీకుఁ జెప్పుచుంటి నాకర్ణింపుము దేవమనుష్యాది దేహములందు

శబ్దస్పర్శరూపరసగంధంబులును విసర్గము శిల్పము గతి యుక్తి యను తొమ్మిదియుఁ బదునొకండింద్రియములును బంచమహాభూతంబులును సత్త్వాదిగుణములు మూఁడునుం గూడి జ్ఞానైకాకార మయినయాత్మ వస్తువుం గాంచుట జ్ఞాన మనియుఁ బ్రకృతిపురుషవిలక్షణుం డగు నొక్కనన్నుఁ దెలిసి నాస్వరూపము నొందవలయు ననుట విజ్ఞాన మనియు నెఱుంగునది శ్రుతియుఁ బ్రమాణము నైతిహ్యము నను మానము నను నీనాలుగింటిచేఁ దెలియఁ దగు కర్మఫలములందుఁ బూర్వోక్తజ్ఞానము గలవాఁడు విరక్తుం డగు నిదియె వైరాగ్యము నాఁబడు నని చెప్పి నీకు భక్తియోగము మున్న చెప్పితి నిప్పుడు భక్తియోగకారణములలో ముఖ్య మగువానిం జెప్పెదనాకర్ణింపుము.

—♦ భ క్తి యో గ ము ఖ్య కా ర ణ ము లు ♦—

సీ. నాకథలను వింట నాగుణస్తుతియును
నాపయి నాదృతి నాభజనము
నాపయి నాసక్తి నాజన్మకర్మప్ర
వచనమం దిచ్ఛాస్వభావగతియు
నామందిరం బూడ్చి నాకు దీపారాధ
నము చేసి ధూపము నాకు వైచి
నామచర్యలయందు నాదరంబును నాకు
సర్వాంగవందన నిర్వహణము
తే. నాదు భక్తులపైఁ బ్రేమ నాపయి మది
నాటుకొలుపుట నాకై ధనవ్యయంబు
నాకొఱకె యజ్ఞములును దానము లొనర్చు
టాదిగా నివి భక్తిసంపాదకములు. 262

ఆ. అట్టిభక్తి యోగ మలవడునేనియుఁ
బురుషునకుఁ గొఱంత పుడమియందు
నేమి యుండు నాతఁ డేపురుషార్థము
నంటఁ జాలకుండు నింతు నంతు. 263

వ. అనిన నుద్ధవుండు కృష్ణా! యమనియమము లనేమి యవి యెన్ని విధములు మఱియు ధృతి తితిక్ష దానము తపము శౌర్యము సత్యము ఋతము త్యాగము ధనము చేష్ట యజ్ఞము దక్షిణ యివి యేవి? వానిస్వరూపస్వభావము లెట్టివి పురుషునకు బల మెద్ది? దయ యన్న లాభ మన్న నేమి? విద్య హ్రీ శ్రీ సుఖము దుఃఖము నేవి? పండితుఁ డెవఁడు? మూర్ఖుఁ డెవండు మంచిమార్గ మెద్ది చెడ్డమార్గ మెద్ది? స్వర్గనరకము లన నేమి? బంధు వెవఁడు గృహ మన నెద్ది సంపన్నుఁ డెవఁడు దరిద్రుఁ డెవ్వఁడు కృపణుఁ డెవ్వఁడు ప్రభు వెవ్వఁడు చెప్పు మనిన భగవంతుం డి ట్లనియె. 264

—♦ య మ ని య మా ది ని ర్వ చ న ము ♦—

సీ. అనృత మహింసయు నస్తేయము నసంగ
మును హ్రీయు నాస్తిక్యమును దమమును
బ్రహ్మచర్యమును స్థైర్యము మానమును క్షమ
భయ మనునివి యెన్న యమము లగును
జపమును దపమును శ్రద్ధయు హోమము
నాతిథ్య మిడుట మదర్చనంబు
తీర్థాటనము తుష్టి యర్థిసేవించుట
యాచార్యవర్యసమర్చనంబు
తే. ఇవ్వి నియమంబు లన నొప్పు నెపుడు వీని
మానవులు దా రుపాసించి రేని వారి
కోరిక లవెల్ల నిరతంబు కొనలు సాగి
తీరుచుండు నటంచునుఁ దెలియు మనఘ. 265

వ. శమ మంతరింద్రియనిగ్రహము దమము బాహ్యేంద్రియనిగ్రహము తితిక్ష దుఃఖములు సహించుట ధృతి జిహ్వాదులం గెలుచుట దానము భూతదయ గలుగుట తపము భోగ మపేక్షింపకుండుట శౌర్యము ప్రకృతిస్వభావమునకు లోఁగకుండుట సత్యము సర్వము బ్రహ్మాత్మక

మని గ్రహించుట ఋతము కన్నదానిం గనిపట్టి చెప్పుట శౌచము కర్మములందుఁ గర్తృత్వము గల దని తలంపకుండుట త్యాగము కర్మ ఫలము త్యజించుట ధనము మద్భక్తిని సంపాదించుకొనుట యజ్ఞము నన్ను సేవించుట దక్షిణ జ్ఞానోపదేశము చేయుట బలము ప్రాణా యామము చేయుట లాభము నాయందలిభక్తి గలుగుట విద్య దేవ మనుష్యాదిభేదభావ ముడుగుట హ్రీ నిషిద్ధకర్మములను రోయుట యలంకారము తృప్తి లోనగుగుణసముదాయము గలుగుట సుఖము దుఃఖమిశ్రసంబంధము తొలఁగుట దుఃఖము విషయసుఖ మపే క్షించుట పండితుఁడు బంధమోక్షకారణము తెలిసినవాఁ డగుట మూర్ఖుఁడు దేహాదులు దన్నుగాఁ దలంచువాఁడు మార్గము జ్ఞానము సంపాదించుట స్వర్గము సత్త్వగుణాభివృద్ధి నరకము తమోభివృద్ధి బంధువు గురుండు గృహము మనుష్యశరీరము సంపన్నుఁడు సద్గుణ శాలి దరిద్రుఁడు తృప్తిలేనివాఁడు కృపణుఁడు ఇంద్రియముల జయింపని వాఁడు సుఖదుఃఖముల రెంటిని విసర్జించుటయె గుణం బని చెప్పి.

ఉ. రేలుఁ బగళ్ళు నాయువును ద్రెంచుట చూచి మనుష్యుఁ డెంతయే
జాలి వహించి భీతునను సంగము వీడి విలక్షణుండు నై
క్రాలెడున న్నఱింగికొని గాటపుభక్తిని సేవ చేయుచున్
బోలుపనై సుఖంచెడిని బుట్టుట గిట్టుట లేనియట్టిఁడై. 267

ఉత్సాహము. ఈమనుష్యదేహ మెన్న నెల్ల ఫలము లీయు నై
భూమిఁ జెప్ప నొప్పు నెప్డు భూరితపము చేసినన్
హోమముల్ పొనర్చినన్ విశుద్ధదానతత్పరుం
డై మెలంగినన్ లభింపనట్టి దంచు నెంచుమా. 268

సీ. మానవదేహము జ్ఞానభక్తులచేతఁ
గైవల్యమోక్షముల్ గలిగికొనఁగ
సాధనం బగుచుండు స్వర్గస్థులును నిర
యస్థులునుం దాని నంద నెంతు

రది వడయ నసాధ్య మయిన నీకు లభించె
నన్ని సాధనముల కర్థ మద్ది
సంసృతి నాఁబడు సాగరముఁ దరింపఁ
దేప వంటిది నరదేహ మరయ

తే. గురుఁడు మాలిమి నే ననుకూలవాయు
వై నడపుచుండు నిట్టియనర్ఘసాధ
నము లెటస్థించినన్ సాగరము దరింప
నట్టిఁ డాత్మనాశము చేసినట్టిఁ డగును. 269

తరువోజ. యోగి యోగాదుల నుల్లంబునందు
నోజ నభ్యాసము నొనరింప వలయు
నేగతిఁ జేసినయే నది విషయ
హేతువులంజేసి యింతయు నిలక
వేగఁ జలించెడు వినువీథి మెఱపు
విధమున నప్పుడు విసువక దాని
తోఁ గూడఁ బోవుచుఁ దొడరి నేర్పునను
దోకొనివచ్చి నాతోఁ గూర్ప వలయు. 270

తే. ప్రాణముల నింద్రియంబుల వడి జయించి
సాత్వికాహారముల నైన సత్త్వమునను
శుద్ధ మగుబుద్ధిచేతను జూచి దాని
నల్లనం దనవశముగా నాఁగ వలయు. 271

మ. నను ధ్యానించుచు నాదుభక్తుఁ డగుచున్ జ్ఞానంబునం బొల్చిన
మ్మనుజుం డే నిదె పుచ్చుకొమ్మనుచుఁ బ్రేమం జేసి కైవల్య మి
చ్చినఁ గైకో నిరసించుఁ గా దనుచు నన్ జిత్తంబున న్నిల్పి క
న్గొను టే మోక్ష మటంచు నెంచు నెపుడున్ దుఃఖంబు లేనట్టిఁడై.

క. నే ని ట్లుపదేశించిన
మానసబోధంబు తెలిసి మానవుఁడు కడుం

బూనికమెయి ననుఁ గనుఁగొన
గా నుండిన నాపదంబు గనఁ గలఁ డనఘా. 273

తే. అఖిలజీవుల దేహములందు విడక
పంచభూతము లను ధాతుసంచయంబు
గలవు నే వానితోఁ గూడి మెలఁగుచుండుఁ
గనినవారికి నాస్థాన మొసఁగ నిచ్చి. 274

వ. మఱియుం గొన్ని విశేషంబు లెఱింగించెద వినుము శబ్దాదివిషయములు గుణముగా నెంచుచుండువానికి వానియందు మరల మరల సంగమము గలుగుచుండును సంగమమువలనఁ గామ ముదయించును గామమువలనఁ గలహము గలుగును గలహమువలనఁ గ్రోధము జనించును గ్రోధమున మోహ ముదయించును మోహమున ధర్మజ్ఞానము సంకుచిత మగును జ్ఞానసంకుచితత్వమువలన జీవుఁ డసత్ప్రాయుఁ డగును అసత్ప్రాయుఁడై శూన్యత్వమును బొందును దానంజేసి మూర్ఛితుండై మృతుం డయినవానివలె విషయాసక్తుఁడు స్వార్థపరుండై విభ్రంశమునొందు నట్టివాఁడు తన్నుఁ దా నెఱుంగఁడు వివేకము లేక వృక్షాదులవలె జీవించును వాని కిహపరంబులు రెండును సున్న యగు నిట్లు జనుఁడు జన్మాదిగా బంధహేతువు లగు కామాదులం దగిలి శ్రేయ మెఱుంగక దుఃఖావహ మగుసంసారమార్గంబున సంచరించుచుఁ దమఃపతితుఁడై నరకభాజియై జన్మపరంపరలం బొందు నట్టిం దగువిషయాసక్తిం బడునట్టివాఁడు యాగమను నెపంబున వృథగాఁ బశుహింస గావించువాఁడు నాస్తికుండు వాఁడు మృతించినపదంపడి తాను హింసించిన పశువులే బరలోకంబున వానిం బట్టి హింసించెడు నట్టి వగుచుండు. 275

మ. సిరులం గోరెడువారు స్వర్గసుఖముం జేకొంచు దివ్యాంగనా
సురతక్రీడలఁ దేలుచుందు ననుచున్ సోమాదికామ్యక్రియల్
ధరణిం జేయుదు రట్టివారు తమతంత్రప్రక్రియన్ స్వర్గసౌ
ఖ్యరతిం దేలియు వెండి భూమిఁ బడి వేడ్క న్వేగుచున్నా రహో.

వ. వేదము కర్మకాండము దేవకాండము జ్ఞానకాండము నని మూఁడు
కాండములుగా రూపింపం బడు నవి యన్నియు సమస్తాంతరాత్మ
భూతుం డగుపరబ్రహ్మము నే చెప్పుచుండు నట్టి వగుచుండినను వాని తాత్పర్య
మెఱుంగక ఫలైకానుభవపరు లన్యార్థములం గల్పించి చర్చించు
చుందురు వేదస్వరూపము దురవగాహము సముద్రమువంటిది దానికిఁ
గొలఁది లే దది ఛందోమయంబై దేహేంద్రియాదిధారణపరమై
శబ్దబ్రహ్మాత్మక మగువాక్కును సృజించుచున్నది యోంకారవ్యంజి
తము లగుస్పర్శస్వరోష్మాంతస్థంబుల భూషితంబై యుండు నా వేద
మేమి విధించుచున్నదియో దానితత్త్వమును నేను గాక యొకం
డొక్కఁ డెఱుంగ నేరండు వేదము నన్నే సమాశ్రయించి సర్వ
తత్త్వవిలక్షణునిగాఁ బ్రతిపాదించుచున్న దిది వేదతాత్పర్య మనిన
నుద్ధవుండు దేవా! తత్త్వము లెన్ని? కొందఱు తొమ్మి దనియుఁ
గొందఱు పదునొకం డనియుఁ గొందఱు కొన్ని యనియు నందఱు
నన్నివిధంబులఁ జెప్పుచున్నా రిట్లు చెప్పుటకుఁ గతం బేమియో చెప్ప
ననుగ్రహింపు మనిన భగవంతుండు. 277

—• తత్త్వనిర్ణయము చేయుట •—

సీ. ఋషులు చెప్పినలెక్క లెల్ల యుక్తంబుల
యగు నాప్రకృతియొక్కఁ డైనతత్త్వ
ములు గల దని దక్కువలు గల దనియుఁ జె
ప్పిన విరోధము లేమి ఘనులు తెలిసి
పలికి రారీతి శక్తు లొకండు నొకటి యం
దంతర్భవించి యిరవలవుకతన
తత్త్వసంఖ్యావిభేదతను బొందె శమదమా
దులు గిల్గ నీభేదములు నశించు

తే. శమదమాదులు గలిగినసజ్జనుండు
చిదచిదాత్మక మగుజగత్ప్రధ మిదెల్ల

నాతనువుగాఁగ నెంచుచున్నాఁడు గాన
వాదము వికల్పమును రెండు వఱలఁ బోవు. 278

వ. అనిన నుద్ధవుండు దేవా! ప్రకృతియుఁ బురుషుండు నిరువురు విలక్షణ రూపులు వారొకరి నొకరు విడిచి యుండ రద్దానంజేసి భేదంబు తెలియకున్నయది సర్వజ్ఞుండ వగునీవు నిర్ణయించి చెప్పు మనిన భగవంతుం డోయీ! యదుకులాభరణా! ప్రకృతిపురుషులు రెండును భిన్నములే కాని యొక్కటికావం దధిభూత మాదిగా సృజింపఁబడినవి యెల్ల నహంకారముచేత నైనయవి యొకదానిగుణములు మఱియొకదానివి గాఁ గన్పట్టుట లహంకారస్వభావము దానివలన దేహాత్మికగుణంబులు గలసి భేదము తెలియనట్లు చేయుట కాక యాత్మ దేవుఁ డనియు మనుష్యుఁ డనియు స్వతంత్రుఁ డనియు భేదబుద్ధులు కలిగించుచున్న వధ్యాత్మ మధిదైవ మధిభూత మనుమూఁడును వైకారికసర్గ మనంబడుఁ గన్నుఅధ్యాత్మము రూప మధిభూతము రవికిరణంబధిదైవము కంటిరంధ్రమం దీమూఁడునుం గలసి జ్ఞానమును బుట్టించుచున్నవి పరస్పరము గలియుటంజేసి స్వష్టి జనించినట్లు త్వక్కు, శ్రవణము జిహ్వా నాశిక లోనగునవి. కలుగుచున్న వివి మనస్సుతోడం గూడినప్పుడే కార్య మొనరింపం గలుగుచున్న విదంతయు నహంకారసృష్టి యహంకారము సత్త్వరజస్తమస్సులవిషమంబున నైనవికార మిదియే దేహాత్మభేదమును గలిగించునది యిది వైకారికమైంద్రియము తామస మని త్రివిధంబు. ఆత్మజ్ఞానస్వరూప మయినది దేహము జడ మైన దని చెప్పిన నుద్ధవుండు వెండియు. 279

శా. నీపై బుద్ధిమరల్పఁజాలని జను లెంతే కర్మబంధంబునన్
రూపం బుచ్చము నీచ మొట్లు గయికొందుర్ దాని నేరీతి గా
నాపై నీడుదురో యెఱింగెడుగతి న్నా కీవు వా కీయవే
నీపాదాబ్జము లంటి మ్రొక్కెదను మానివ్రాతసంసేవితా. 280

వ. అనిన భగవంతుం డిట్లనియె. 281

సీ. కర్మవాసనలతోఁ గలసినదై మది
జ్ఞానేంద్రియములు సూక్ష్మములు భూత
ములు కూడి రా వీడి పూర్వదేహము మఱి
యన్యదేహము నొంద నరుగుచుండుఁ
దద్భిన్న మగునాత్మ దాని ననుసరించి
తరలుచుండును వేఱు తనువులకును
మన మప్డు కర్మవాసనకు వశమ్మయి
వెనుకఁ దాఁ గని విన్న విషయములను
తే. తలఁచి హర్షించుచుండును గలిగి నప్డు
కలుగకుండిన దుఃఖంచుఁ గలుగు మఱపు
ప్రకృతజన్మమునందు యన్వాలనఁ గలుగు
జన్మకర్మము లేరీతి జ్ఞప్తి కగును. 282

వ. అని యనేకవిధంబుల నాత్మపరమాత్మభేదంబును తత్త్వవిశేషంబును మఱియు మఱియు నెఱింగించిన విని యుద్ధవుండు కృష్ణా! నాకాత్మ పరమాత్మలభేదంబు కలరూపున నెఱుంగునట్లు గా మఱియుం దెలుపు మనిన ముకుందుండు వానిం గౌరవించుచు ని ట్లనియె. 283

తే. ఈవు నన్నడిగినప్రశ్న కేను వెనుకఁ
జెప్పెదను సమాధానము నిప్పు డిట్లు
వినుము దుష్టులు తిట్టిన విని సహించు
సాధుపురుషులు దుర్లభు లీధరిత్రి. 284

చ. ఖలు లగుదుర్జనుల్ పలుకుశారులు మర్మములందుఁ దాఁకి మి
క్కిలివెత గూర్చెదుర్ సుగుణికిన్ వడి మర్మములందు వాడి యా
ములుకులు దాఁకి న ట్లగుచుఁ బొల్లలు వోవ నిముట్టినె యతం
డలువము గానియట్లు మనసుం దొగిఁ గుండెను డిందెదుర్ గదుర్.

వ. ఈయుద్ధంబునఁ దార్కాణంబుగా నొక్కయితిహాసంబు గల దాక
ర్ణింపుము. 286

తే. భిక్షుకుఁ డొకండు వానిఁ బృథివిజనులు
దుష్టు లవమాన మొనరించి దూరి రందు
వలన నాతఁడు దిట చెడి వగవఁ బోవ
కంతకును గర్మమే హేతు వని తలంచి. 287

వ. ఎల్లరు విన ని ట్లనియె. 288

— లోభియగు నొకబ్రాహ్మణుని వృత్తాంతము —

పంచ. అవంతిదేశమందు భూసురాన్వవాయుఁ డొక్కఁ డా
ర్జవంబు కానియట్లు తా నెసంగికొంచుఁ బొంగి సే
వ్యవర్తకంబులుం గుసీద మాదికార్యముల్ కడుం
బ్రవీణతం బొనర్చి కూర్చె ద్రవ్య మెంతయేనియుం. 289

క. ధనకాముఁ డతం డెవరె
ట్లనిన సరకుగొన కొకింత యైన మనమునం
బను లెవ్వియేని చేయుచు
ఘనతరముగఁ గూడఁబెట్టెఁ గాఁగులు నిండన్. 290

మత్త. చింపిగుడ్డలు గట్టి పొట్టకుఁ జెప్ప నొప్పెడు భోజనం
బింపుమీఱ భుజింపఁ డెప్పుడు నేవగొల్పెడు నన్నమే
కంపు గొట్టెడునట్టిదేనియు కాదు నాక గ్రహించెడుం
గొంపగోడియు నైనఁ జూచుటకున్ సుఖం బిడకుండెడున్. 291

సీ. అర్థకాముఁడు లుబ్ధుఁ డతికోపి పాపస్వ
భావుఁడు బిడ్డలు భార్య యేని
కడుపు నిండం దినఁ గాంచి సైఁపంగ లే
డతిథు లర్థులు రాఁగ నాడి పోయు
చిచ్చుగాఁ డేఁగుదేఁ బిడికెడు పెట్టక
తిట్టు నిట్టన నిల్వ నెట్టివైచు
దుష్టవర్తనుఁడు బుత్రులను బందుగులను
ద్రోహము సేయఁగ సాహసించు

తే. కూఁతులును భృత్యులును భార్య కూడియుండ
నిచ్చగింపమి వార లానెచ్చుకాని
వెగడుగుడుచుచు నుందురు ప్రియము సేయ
రెల్లనాఁడును వారిపో రెచ్చి యుండు. 292

క. గంగాళంబులు గాబులు
బంగారముతోడ నిండి బాపనిగృహముం
దుం గాలు వెట్టఁ జోటట
నుం గలుగనియట్లు గాఁ గనుం గొన నయ్యెన్. 293

సీ. కవిలెకట్టలు విప్పి గడియ గడియ చూచుఁ
ఖాతులపైఁ బూలు పత్రి వెట్టు
గాబులయింటిలోఁ గస్సుచుంచుం దాఁచు
నడయాడుచున్నది నలుగడలను
బోరా దనుచు నింటివారితోఁ బలుకును
దినవెచ్చ మొనరింపఁ దిగులు గుడుచు
తోటాకు గొని తెచ్చు మేటిశాకం బంచు
నెఱుఁగ రాద్యంతము లింటివారు

తే. భూతవేతాళపూజలు ప్రీతిఁ జేయుఁ
గుఱ్ఱలను బెంచుఁ బవలు రేల్ కొంపఁ గాయుఁ
దనదు క న్నెప్డు ధనమంద తవుల నిలిపి
రేబవల్ దాని రక్షించు దేబె వాఁడు. 294

తే. పొట్టకుఁ దినండు పసులకుఁ బెట్టఁ డెపుడు
ధర్మకామము లవి లేనిదాన బాపఁ
డుభయలోకములకుఁ గాక యుత్త యగుచు
వసుధకుం భారమై కాన వచ్చు వాఁడు. 295

క. పంచమహాయజ్ఞము లే
పంచలనో పట్టె వాసిపథ మెఱుఁగఁడు వా

డించంగఁ బిసిడి యెంగిలి
కొంచెము గలచేతఁ గాకిఁ గొట్టం డెపుడున్. 296

తే. యజ్ఞభాగము లెవ్వ డమ్మాజ్ఞునింట
దొరకకుండుట దేవళ్లు ధరణిసురులు
క్రుద్ధులై రోయుదురు వానికొంపదరికిఁ
గాకులును కుక్కలును రావు కన్న దప్పి. 297

ఉ. ఊడ్చిననింటిలోనఁ బడియుండెడుభూరజ మెందుఁ బోవునో
నడ్చినకాళ్ళకోడ నది నడ్చెడునో యని చూచుచుండి లో
నేడ్చెడు నూరివారలకు నెల్లరకుం బగవాఁడై యతం డెటో
కుడ్చుచు జీవయాత్ర కయికొంచుఁ జరించును గించునా నిలన్.

ఆ. ఇట్లు నడికిఁ గాల మేగినయంతట
వానిభాగధేయ వైపరీత్య
మునను గూడఁబెట్టుకొనియున్న లిబ్బికిఁ
గాళ్ళు వచ్చె నయ్యొ కాలమహిమ. 299

సీ. ఏతంటలో పెట్టె జ్ఞాతులు సామంతు
లపుడు నప్పుడు కొంత యపహరించి
రవనీశ్వరుఁడు వానియైశ్వర్యమును విని
సాఁబాలు తె మ్మన సాహసించె
దొంగలు పడి యింట దొరికినమణిభూష
ణములు ధనము దోఁచి రమితముగను
నిలుగాలుటం జేసి కలిగినకవిలెలు
పత్రిముల్ జ్వాలనునిపాలఁ బడియె

తే. పాతు లన్నియు భూదేవి పదటఁ గలిపె
ద్వీపవతివానియిల్ తనలోపలఁ బడఁ
జేసికొనె నిట్లు నాద్విజువాసి యెల్లఁ
జెల్లె విపరీతదైవము చెయ్యివలన. 300

ఉ. పిల్లలుఁ జెల్లలుర్ హితులు పెండ్లము భృత్యులు బంధుసంతతుల్
చెల్లినవాని వానిఁ గసి చెంపలవేసెదు నట్లు తిట్టుచున్
సల్లపనంబు లొక్కఁపుడు సల్ప కనల్పనుపాపవృత్తాత్ముఁడవై
రిల్లును నిల్లునుం జనియె హీనుఁ డతండు మహోక్షుధార్తుఁడై. 301

తే. కలిమినాఁడు నీవు కడుపునిండం దిన
విపుడు తిండి కేడ్తు వెవరు నీకు
జాలి కలిగి పెట్టఁ జాలరు హో హొమ్మ
పిసినిగొట్ట! నీకు బికిర మటర. 302

ఉ. పెట్టము హొమ్మ నీ కిపుడు పిడ్కెఁడునన్నము నైన నీ విటుల్
పొట్టకు లేక కస్తిపడుపూటలు చూడఁగ లోక మంతయున్
గట్టడ చేసికొన్నయది కష్టుఁడ! యెంగిలిచేతఁ గాకినేఁ
గొట్టినజాఁడఁ బోయితివె క్రూరుఁడు గాడె జముండు నీపయిన్.

తే. అనుచు వేయింటి కేగిన ననఁగ రాని
యప్పు లాడుచు నింతైనయశన మతని
జోలి వేసినవారు కా రాలతాంగు
లకట యీరీతిఁ జూపట్టునవని లోభి. 304

వ. అట్లు నిరాకృతుండై యశనంబు దైవంబు చెయిది కెద్దియుఁ జేయ జాలక
జాలిం బడి తాను జేసిన చేఁతకుం జేతమునం దనుదాన దూరు
కొనుచు విరక్తుండై. 305

సీ. పడరాని పాటులు పడి గణించితి సొమ్ము
తదుపయోగము నొందఁ దలఁప నైతి
ధర్మకామములకు దమ్మిడీ యైనను
వెచ్చింప నైతి నేవేళ నైనఁ
గడుపు నిండం గూడు గుడువ నైతిని పెర
లకుఁ బెట్ట నైతి యాచకులు రాఁగ
లేదు పొ మ్మంటి నే వేదార్థములకు నేఁ
గాచ మిచ్చినజాడ గాంచ నైతి

తే. అతిథు లభ్యాగతులు వచ్చి యన్న మడుగఁ
దిట్టి దగపాలఁ బోసి పో నెట్టి యుంటి
బిడ్డలకు నేని తృప్తిగాఁ బెట్ట నైతి
నక్కటక్కట దుష్టధనాశఁ జేసి. 306

చ. ధనము గణించుటల్ జనుఁడు దాన సుఖించుచుఁ గీర్తిఁ నొంది పెం
పునఁ జనుచుంటకే యనుట పోల దతండు వ్యయించి నారకా
ధినిఁ బడి యెంతయేనియును దేవుగు పుట్టఁగ బెట్టు దుఃఖముల్
గొనుటకె యంచు నియ్యెడలఁ గొంచెము గొంచక నే వచించెదన్.

తే. కీర్తనీయున కెంతయుఁ గీర్తి యున్న
శ్లాఘ్యగుణము లవెన్నొ పొసంగియున్న
నందగానిశరీరము నందు శ్విత
కుష్ఠముం బోలె లోభము కూల్చు నెల్ల. 308

మ. ధనసంపాదన మాదిఁ గష్ట మగు నంతం దానిసంరక్షణం
బును గష్టం బగు దానినాశన మ దెన్నం గష్టమే కాను దుః
ఖనితాంతాంబుధి ముగ్నఁ జేసి నరునిన్ గాయంబునం బ్రాణముల్
గనుఁగో నుండగఁ జంపినట్టిదగుచున్ గారించెడిన్ దా నయో. 309

మ. ధన మార్జించెడువట్ల దొంగతనమున్ దంభం బబద్ధంబు స
జ్జనహింసాకరకార్యముల్ మదము మాత్సర్యంబు కామంబు బం
ధునరద్రోహము జూదముం గలహమున్ దుష్టత్వముం గల్గి నే
జనవిద్వేషముఁ బూని కూర్చితి నిటుల్ సర్వంబు వోయెం గటా.

ఆ. అనుభవింప లేద యర్థుల కిడ లేద
ధర్మకార్యములకుఁ దాఁప లేధ
యష్టకష్టములకు నయి కూర్చినధనంబు
నాశ మయ్యె నురక నన్నుఁ జంపి. 311

పంచ. అనర్థకారణం బటంచు నార్య లందు రర్థమున్
కనుంగొనం దదుక్తి సార్థకంబ యయ్యె నాయెడన్

ఘనుం డటంచుఁ బెద్దపేరు గల్గినట్టి నే నయో
జనాళిలోఁ దృణంబు కన్నఁ జాలఁ జుల్కనైతిఁ గా. 312

ఉ. దంధన మైనయట్టి ధనధర్మము కర్మము నాశ్రయించి నే
బంధులఁ బుత్రమిత్రముల భార్యను బిడ్డలఁ దల్లిదండ్రులన్
బంధుత వోఁ ద్యజించినటువంటిఁడ నైతిని శత్రు లైరి వా
రంధుఁడనై చరించితి సమస్తము నస్తము నొంద నయ్యెడిన్. 313

సీ. దేవతలకును నర్థింప నైనమనుష్య
జన్మమునందు ద్విజత్వ మొంది
దానఁ బొందఁగ నైనధర్మముల్ శ్రేయముల్
పాటింపఁ బోవక పామరుఁ డయి
ధనతృష్ణ గలఁ డయి తనయాత్మహితమును
దలఁపక నావలె మెలఁగినట్టి
మనుజుండు సర్వనాశనము గా నిహపర
ములకుఁ గానట్టిఁడై పోడవడంగు

తే. ధనము గలిగిన దేవతలను ఋషులను
బితరులను భూతముల బంధుతతుల నెల్ల
దృప్తులుగఁ జేసి తాఁ దిని తేజరిల్ల
కుండు నాతఁ డధోగతి నొందు నిజము. 314

తే. దేహబల మర్థబలము దీపించు నాఁడు
కన్ను గానని వాఁడనై యున్న వాఁడ
నిప్పు డాబలములు రెండు చప్పఁబడియె
వార్ధకము వచ్చె నే నెట్లు బ్రదుకఁ గలనొ. 315

క. అర్థ మనర్థము నాజని
వ్యర్థంబై పోయె దానివలనం గట్టా
నిర్ధనుఁడ నైన నే నిఁక
సార్థక మగుదారి నరయ నయ్యెదఁ దెలివిన్. 316

ఆ. సర్వదేవమయుఁడు సర్వేశ్వరుఁడు న న్ను
నుగ్రహించె నాదునుగ్ర మయిన
గ్రహముఁ బోలుధనముఁ గడ తేర్చి యిట్లు ని
ర్వేద మొదవఁ జేసె నాదరించి. 317

ఉ. జీవితశేష మీశ్వరునిసేవ యొనర్చుతపంబు సేయుచున్
నావలనం గణింపఁబడునారకబాధలు నాదు చెంతకున్
రా వనునట్టిజ్ఞానమునఁ గ్రాలుచు నెప్పుడు నీశ్వరేశ్వరున్
భావమునందు నిల్పుకొని భక్తి భజించెద రోసి సర్వమున్. 318

ఆ. నాప్రవర్తనంబునకు న న్నెఱింగిన
లోకు లెట్టు లున్న లోకరక్ష
కుం డనుగ్రహింపకుండఁడు నాయప
రాధమున్ సహించి రమణఁ గాంచి. 319

వ. ఇట్లాబ్రాహ్మణుండు తలంచి తనలోనిరాగద్వేషాదులం బరిహరించి సన్న్యాసియై యింద్రియంబుల జయించి యిల యెల్లం దిరుగాడుచు గ్రామంబుల భిక్షాటనంబు సేయుచు నవధూతయై యుండె నపుడు కొందఱు దుష్టు లడియాలంబుల నెఱింగి దర్పితులై వానిం జుట్టిముట్టి.

సీ. లాగికొనిరి వాని లాతాముఁగోడఁ దిరి
దండకమండలుల్ గొండఁ మిగిలి
కొంద ఱాతనినారగుడ్డలు బొంతయు
నక్షసూత్రము గోచి యపహరించి
రిఁకఁ గొంద ఱానరు నింటికి ర మ్మని
పిలిచి పొ మ్మని రల్క దులకరింప.
భిక్షించి తెచ్చినభిక్షుట తినుచుండ
నందు నిష్ఠీవన మాచరించి

తే. రతఁడు పలుకక యుండిన నట్టె గిల్లి
పలుకరించిరి కొంద ఱీపలువ దొంగ

మాయ సన్యాసి వేష మీమాడ్కి వేసె
పట్టి కొట్టుఁ డటంచును బలికి రపుడు. 321

ద్విపదము. వీఁడు విరాగినా వేషము వేసి
నాఁడు మోస పొసర్చి వాడలయందు
బిక్షర మెత్తుచు నిట్లు వేరిసా మ్మెనఁ
గకవికలంబడఁ గడ తేర్చి పోవు
వీఁడు పిసిడివాఁడు వీనిసా మ్మెల్ల
బూడిదపా లయ్యెఁ బొలుపటి యెట్లు
నుం జేయఁజాల కనూనవిధంబు
నం జేసి యీరీతి నడయాడుచుండె. 322

వ. ఇట్లనేకప్రకారంబుల ములుకులవంటిపలుకుల నొప్పించి పలుకుచు నట్టాఁకలం బెట్టి బొమ్మ నాడించిన ట్లాడింపం జొచ్చి రప్పు డప్పురుషుండు దుర్జనులవలన నగుభౌతికదుఃఖంబులును శీతోష్ణాదులవలన నగుదైవికదుఃఖంబులును జరాదులవలన నగుదేహదుఃఖంబులును సహించుచు నవి నిజకర్మప్రాప్తము లని నిశ్చయించి వికారవిరహితుండై పరులవలన నగునవమానంబుల కోర్చి సత్త్వగుణప్రేరితం బగు ధృతిం బూని తనమనంబున సుఖదుఃఖములు గలుగుటకు నిజకర్మబలంబు హేతువు గాని ప్రజలు హేతువులు గారనియు మనస్సు ముఖ్యకారణం బనియు సంసారచక్రమును ద్రిప్పునది మనస్సె యనియు రాగద్వేషాదులం బుట్టించుచున్నదనియు మనస్సునుండి రాగద్వేషాదులు వానివలన కర్మములును గర్మములవలన జన్మములును వానినుండి సుఖదుఃఖములు గలుగుచున్నవి మన స్సెట్లు సంకల్పవికల్పములు చేయుచున్నను బరమపురుషుం డహంకారమమకారంబులు లేక యుండు ననియుఁ దలంచి యుపవాసాదివివిధవ్రతంబు లాచరించుచు విషయాంతరములనుండి మనస్సు నాకర్షించి పరమాత్మ యందు నిలిపి సమాధిస్థుండై పరం బగుయోగంబు ననుసంధించి

బ్రహ్మనిష్ఠుండై దేహంబు చాలించి మోక్షలక్ష్మీసామ్రాజ్యపట్ట
భద్రుం డయ్యె నుద్ధవా! నీ కిప్పుడు సాంఖ్యము నుపదేశించెద నిది
పూర్వు లగుమహర్షులచేత గ్రహింపఁబడినది దీని నెఱింగినయెడల
వీఁడు వాఁ డనుభేదబుద్ధి గలిగించు దేహాత్మభేదభ్రమము పొందకుండు
నాకర్ణింపుము. 323

— సాంఖ్యయోగోపదేశము —

సీ. మొదటియుగంబునఁ జిదచిదీశ్వరులను
నెంచి బ్రహ్మము నుపాసించువారు
బ్రహ్మ మయ్యది గుణవైషమ్యములు లేక
తనరుఁ గేవల మయి దాని నెఱుఁగఁ
దరము గా దది కల్పదశయందుఁ బ్రకృతియుఁ
బురుషుఁడు నా రెండు తెఱఁగుల నగుఁ
బ్రకృతికార్యమును గారణ మని ద్వివిధ మా
దానికిఁ ద్రిగుణముల్ తనరుచుండుఁ

తే. బురుషునకు దేహ మింద్రియముల నొసంగి
నే ననుగ్రహించుట జేసి దానివలన
సూత్ర మనెడిమహత్తయ్యెఁ జూడ నద్ది
కార్యమణులందు స్యూతమై కానఁ బడియె. 324

వ. దానివలన నహంకారము పుట్టినది యహంకారము వైకారికము
తైజసము తామస మని త్రివిధం బది తన్మాత్రలకును నింద్రియంబు
లకును మనస్సునకును గారణ మైనది. శబ్దాదితన్మాత్రలకుఁ గారణ
మైనతామసాహంకారమువలన భూతపంచకము పుట్టినది. రాజస
సాత్వికాహంకారములవలన నింద్రియములు పుట్టినవి నే నంతరాత్మనై
ప్రేరేపింప మహత్తు లోనగునవి యొకటిగాఁ గూడి సమర్థములై
యండమును బుట్టించిన వది నా కుత్తమస్థానము నానాభియందు
జగత్తనుపద్మము పుట్టె దానియందు రజస్సునం జేసి చతుర్ముఖుండు

పుట్టె నతండు నాయనుగ్రహంబున భూలోక భువర్లోక సువర్లోకము లను లోకపాలురను సృజించె. స్వర్లోకము దేవతలకు నంతరిక్షము భూతములకు భూలోకము మనుష్యులకు నిలయంబు లయ్యె భృగ్వాది సిద్ధుల కీలోకములకు భిన్నము లైన మహర్లోక జనలోకములు స్థానము లయ్యె నాగుల కునికిపట్టు గా సుతలాదిలోకములు సృజింపఁ బడియె. నీలోకము లన్నియు బ్రహ్మాండగర్భితములు యోగమునకు సన్న్యాసాశ్రమమునకును మహస్సుజనస్సుతపస్సను సాత్వికలోకములు సంప్రాప్తంబు లగు నాదగుభక్తియోగమునకు మద్గతి యగుపరమ పదము లభించు నట్టిబ్రహ్మాండమును గాలస్వరూపుండ నై నేను లయంబు నొందించుచున్నాఁడను సర్వము పంచత్వము నొందు చున్నది శరీర మన్నమందు నన్నము ధాన్యమందు ధాన్యము భూమి యందు భూమి గంధమందు గంధము జలమందు జలము రసమందు రసము జ్యోతిస్సునందు జ్యోతిస్సు రూపమునందు రూపము వాయువు నందు వాయువు స్పర్శమునందు స్పర్శ మాకాశమందు నాకాశము శబ్దమందు శబ్దము భూతాతియందు భూతాది మహత్తునందు మహత్తు సత్వాదిగుణములందు గుణము లవ్యక్తమునందు నవ్యక్తము కాల మందుఁ గాలము ప్రకృతితోఁ గూడినజీవునందు జీవుఁ డంతరాత్ముఁడ నైననాయందు లయించుచున్నది నేను నాయందే నెలకొందును గాన నాకు శరీరభేదము గలుగుట గాని పోవుట గాని లేకుండు నుత్పత్తి వినాశనంబులు నన్ను ముట్టవిత్యాదులే సాంఖ్యము నాఁబడు దీన హృదయగ్రంథు లెల్ల విడివడుచుండు నని చెప్పి యింక సత్వాది గుణలక్షణంబులు చెప్పెద వినుము శమము దమము తితిక్ష యీక్ష తపము సత్యము దయ స్మృతి తుష్టి త్యాగము వైరాగ్యము శ్రద్ధ హ్రీదానము నార్జవము వినయము లోనగునవి సాత్వికగుణములు కామము నీహ మదము తృష్ణ స్తంభము గర్వము నాశ వైదుష్యము సుఖము నుత్సాహము స్తోత్రప్రియత్వము వీర్యము నిత్యాదులు

రాజసగుణంబులు క్రోధము లోభము నస్పృహము హింస ద్రోహము యాచన దంభము శ్రమము కలహము శోకము మోహము దుఃఖము దైన్యము నపేక్ష భయము జాడ్యము నిత్యాదులు తామసగుణంబు లీగుణంబులంజేసియే పురుషుఁడు సాత్వికుఁ డనియు రాజసుఁ డనియుఁ దామసుం డనియు వ్యవహరింపఁ బడుచుండును.

సీ. ఫల మపేక్షింపక వర్ణాశ్రమములకుఁ
దగినకర్మములను దా నొనర్చి
భక్తి నన్ను భజించువాఁడు సాత్వికుఁ డని
ఫల మపేక్షించుచుఁ గులమునకును
దగినకర్మములను దవిలి చేసెడువాఁడు
రాజసుం డనఁబడుఁ బ్రకృతివలన
శత్రుసంహారము సలుపుటాదిగ హింస
బొసగించువాఁడు తామసుఁ డనఁ బడు

తే. ఈగుణంబులు జీవునకే పరిబంధ
నములు కాని యీశుఁడ నగు నాకుఁ గావు
వీనిసంబంధమునఁ జేసి విషయములను
జిక్కి జీవుఁడు మిక్కిలి చిక్కువడును. 326

ఆ. వీని నడఁచి పుచ్చె నేని చిత్తము ప్రతి
బంధకములయందుఁ గాక కలుష
ములను బడక యున్న పురుషుఁడు జ్ఞాని యై
శమము దమము గలిగి సంతసించు. 327

పంచ. శివంకరుల్ ననుం గనంగఁ జెల్లు మర్త్యదేహముల్
ధ్రువంబు గాఁగ నొందు నన్నరుం డొకప్పు డేనియుల్
బ్రవృత్తిధర్మ మొందఁ బోక నన్నుఁ గొల్చునట్టిఁడై
నివృత్తిధర్మ మొంది ముక్తి నిం గొనంగఁ బోయెడిన్. 328

సీ. త్రిగుణమయంబు లౌ దేవాది దేహము
లందు జీవాత్మల కగుస్వరూప
ములను బరిస్ఫుటముగాఁ దెలియుటవల్లను
నేను నా దనునభిమాన మెడలి
నట్టిఁడు ప్రకృతికార్యము లగుశబ్దాది
విషయముల ననుభవించుచున్న
ననుబంధు లగువానిఁ దనవిగా నెంచు చు
న్నను గాని బద్ధుఁడు నాఁగఁ బడఁడు
తే. కాని శిశ్నోదరపరాయణానుబంధ
మెన్నఁడును జేయరా దని యెఱుఁగ వలయుఁ
జేసినను గ్రుడ్డివానినిఁ జేరి నడిచి
గ్రుడ్డివాఁ డంధువునఁ బోలెఁ గూలి పోవు. 329

— ♦ పురూరవుఁడు విరక్తుం డైనకథ ♦ —

ఉ. తొల్లి పురూరవుం డనెడుదోర్బలవంతుఁడు సార్వభౌముఁడై
మొల్లముగా యశంబుఁ గొని మోహనవిగ్రహుఁ డౌట నూర్వశీ
పల్లవపాణిపైఁ దగులఁ బాఱువిరాళి మెలంగు చెన్నొ నా
ళ్ళల్లన వెళ్ళఁబుచ్చె నది యాతఁ డెఱుంగనివాఁడ యయ్యెఁ బో
వ. ఇట్లు నీచము లగువిషయంబులం దగిలి తృప్తి లేనిచందంబున నానం
దం బనుభవించుచునుండ నొక్కనాఁ డక్కలికి తన్ను విడిచి పో
ఖిన్నుం డై యతండు దానివెంట నంటి దిగంబరుం డై వెఱ్ఱివానిచందం
బున నఱ్ఱాడుచు. 331

ఉ. ఎంత దురాత్మురాలవె చెలీ విరహార్తుఁడ నన్నుఁ బెట్టి నీ
వింతటిలోనఁ బోయెదవె యే నెటు తాళి నిలంగ నేతు నా
కంతునిబాఱి కగ్గ మయి కారియ నొందుచు నుంటి నయ్యయో
కొంత దయారసంబు గయికొమ్ము మనమ్మున నెమ్మిఁ గొమ్మరో.
వ. అట్లూర్వశిం బెడబాయుటంజేసి మిగుల వగలం బొగలుచుఁ గొం
తలో విషయసుఖంబు లనర్థదాయకంబులని తలంచి వైరాగ్యంబునొంది.

సీ. కామముచే మది కశ్మలమై పోయె
నా వివేకం బెల్ల నడఁచె దివికి
నా గౌరవం బెల్ల నట్టేటఁ బడియెను
జక్రవర్తి నైతి నక్రమగతిఁ
గొమ్మకు సీహామృగమ్మనై చెడితి స
మ్రాట్పదం బది యెల్ల మ్రానుపడియె
దిసమొలతో నిట్లు దిక్కుమాలినరీతి
వెఱ్ఱినాఁ దిరుగాడ వెడలితి నయొ

ఆ. ఆడుదాని వెంట గాడిద వలె నన్నుఁ
గాలఁ దన్నుచున్నఁ గాని వెంటఁ
బడితిఁ జెడితి నాదుబ్రదుకు కీట్టివితమున
సమ్యక్ స్నేహమసర్తు సత్కీ యటు 334

తే. స్త్రీలచే నపహృత మగుచిత్తము గల
వానికిఁ దపంబుచేతను దానమునను
మౌనమున నధ్యయనమునఁ గాని నిష్కృ
తులు లభింప వటంచుఁ బెద్దలు వచింత్రు. 335

వ. నేను భూమీశ్వరత్వంబు నొందియు నొకానొక వెలయాలిచేతిలోని కీలుబొమ్మనై బాలిశుండనై పాలుమాలితిం గటా! నాది యొక బ్రదుకా నే నొక మనుష్యుండనా యని నిర్వేదించుచు నింద్రియవృత్తులకు లోఁబడక సర్వనిర్వాహకుం డగు సర్వేశ్వరుండు తప్ప నిప్పట్ల న న్నుద్ధరింప మఱియెవ్వండును లే డని నిశ్చయించి తనయాత్మయందున్న పరమాత్ము నుపాసించి యుపాసనారూపక మగుజ్ఞానంబున దేహాభిమానరూపమోహముక్తుం డయ్యెఁ గావున నోయీ! శ్రేయస్సుం గోరువాఁడు దుష్టసంపర్కమును వీడి సజ్జన సహవాసముం జేయ వలయును సజ్జనులు సర్వసంగపరిత్యాగంబుఁ జేసి రాగాదులు లేక యహంకారమమకారంబులు విడిచి ద్వంద్వం

బులం దగులుకొనక నాయందె మనంబు నిలిపి నన్నె ధ్యానించుచుం
దురు నాకథలఁ బాడుచుందు రట్టిసజ్జను లగుభక్తులకు నే నెప్పుడుం
దోడునీడ నై యుండు వారి కెల్లభయంబులుం బాపువాఁడ నగుదు
వారు నా కాత్మ వారికి నే నాత్మ నేనే వారు వారే నేను వారు
నావలె సర్వలోకోపాస్యు లనిన నుద్ధవుండు మాధవా! నీయారాధనం
బెట్లు సేయ వలయుం జెప్పుమనుటయు భగవంతుండు వెండియును.

—♦ ఈశ్వరారాధనవిధానము ♦—

సీ. బోధింతు నాదునారాధనక్రమ మెల్ల
నది బహువిధముల నతిశయిల్లుఁ
గలరూపు సంక్షేపగతి నీకు నెఱిఁగింతు
నను యజించెదరు యజ్ఞములఁ జేసి
కలయజ్ఞములు వైదికములు తాంత్రికములు
మిశ్రము లని త్రివిధాశ్రయములు
వీనియం దిష్టవిధానంబునఁ నన్ను
యజియింప వచ్చు నుర్వీజనమందుఁ
తే. దనదునధికారమునకును దగినయట్లు
వేదచోదితమంత్రముల్ విస్తరిల్ల
ఫల మపేక్షింప కెంతయు భక్తితోడ
శుచిముఖంబున ననుఁ గొల్చి శుభముఁ గాంచు. 337

వ. మఱియు విగ్రహారాధనవిధంబు చెప్పెద వినుము ప్రతిమ స్థండిలము
నగ్ని రవి జలములు హృదయము బ్రాహ్మణుఁడు మొదలగు నుత్తమ
పదార్థములందు నన్ను గంధకుసుమాక్షతాదిద్రవ్యంబుల నావాహ
నాదిషోడశోపచారంబుల నర్చింపం దగుఁ దత్క్రమం బెఱింగించెద
సావధానుండ వగుము. 338

సీ. పలుదోమి మంత్రసంకలితముగా నఘ
మర్షణస్నానసమాహితుఁ డయి

సంధ్య వారిచి వెన్క సావిత్రి జపియించి
నిత్యకర్మము లెల్ల నెఱపి పిదప
ఫల మపేక్షింపనిఫక్కి సంకల్పించి
దారులోహమృదాదు లై రహించు
ప్రతిమలయందు నాప్రతిబింబ మావాహ
నము చేసి పంచామృతములు చల్లి

తే. పీఠమందు సంస్థాపించి వేదవిధుల
నుత్తమద్రవ్యములచేత నుచితరీతి
పురుషసూక్తవిధానము పోహళించి
నన్ను యజియింపవలయు నోసన్నుతాత్మ. 339

వ. భక్తుఁ డగువాఁ డిట్లు బాహ్యవస్తుపూజ గాని సర్వవస్తునిస్తులంబుగ మానసికపూజగాని కావించి న న్నారాధింప నొప్పు నర్చయందు నాకు స్నానాలంకరణంబులు ప్రియంబులు స్థండిలంబున నధిదేవతా ప్రత్యధిదేవతల నాయాస్థలంబులఁ బ్రతిష్ఠించునది యగ్నిహోత్రమునం దాజ్యము ప్రభాకరునందు స్తోత్రము జలమున గంధపుష్పాక్షతాదులు శ్రేష్ఠతమంబులై నాకుఁ బ్రియంబు లగు నింకఁ బూజాక్రమంబు ననేకవిధంబులఁ గథితం బగు నాయావిధంబులం బూజించి పిదప సుదర్శన పాంచజన్య గ దా ఖడ్గేషు శార్ఙ్గ హల ముసల కౌస్తుభ వనమాలికా శ్రీవత్సంబులఁ బూజించి తదనంతరంబ పార్షదు లగు నందసునంద గరుడులను బ్రచండుని జండుని మహాబలుని బలునిఁ గుముదునిఁ గుముదేక్షణుఁ బూజించి నాకభిముఖంబుగా దుర్గను వినాయకుని వ్యాసుని విష్వక్సేనుని గురువుల నింద్రాదిదేవతలను సూర్యాదిగ్రహంబులను బూజింప వలయు నిట్లు పూజావసానంబున హృదయపద్మంబున జ్ఞానస్వరూపుఁడు నణుప్రమాణుండు నదాత్మకుం డగుజీవుండు దేహేంద్రియవిలక్షణుండు నగు పరమాత్మం బ్రణవ రూపంబున ధ్యానంబు గావింప వలయు. 340

సీ. కలవాఁడు నాకుఁ జక్కనిమందిరమ్ము గట్టి
నాదుప్రతిష్ఠఁ బొనర్ప వలయుఁ
బూలతోటంబు జుట్టు పొందింప వలయును
నిత్యోత్సవంబులు నెరప వలయుఁ
బూజారులకు క్షేత్రముల నొసంగ వలయు
స్వస్తివాచకుల నేర్పరుప వలయు
ననుఁ బ్రతిష్ఠించిన నాకాధిపతి నోట
ఘనవైభవంబునఁ గ్రాలఁ గలఁడు
తే. మందిరము గట్టి సార్వభౌమపద మొందు
మూడుదేవళ్ళగుళ్ళ నెవ్వాఁడు గట్టు
వాఁడు నాదుసాధర్మ్యము వడయ నుండు
ఫలము గోరక సేవించి పడయు ముక్తి. 341
వ. అని చెప్పి మఱియు. 342
తే. ప్రకృతిపురుషులతోఁ గూడి ప్రబలుసీవ్ర
పంచ మెల్ల నాకు శరీరభాగ మనుచు
నెవఁ డెఱుంగునో వాఁడు నాదవుకటాక్ష
మునకుఁ బాత్రము యని కనుఁగొనుము నీవు. 343
వ. దేహమునకంటె నాత్మ వే అని తెలియమింజేసి దేహమే యాత్మ యని భ్రమించుచుండువారు భ్రష్టు లగుదురు. దేహాదులను వాని కలరూపు గ్రహింపఁ జాలక యాత్మ యని భ్రమించినయెడల నది ప్రళయము గాక సంసృతిభయంబు గలిగించుచున్నవి. ప్రపంచమే పరమాత్మ దానిని విశ్వాత్ముఁ డగునీశ్వరుఁడు సృజించి పెంచి సంహరించు నని యెఱుంగ నగు సర్వప్రపంచ మీశ్వరుఁడే కావున నేవస్తువును గాని నిందించుట పాపహేతుక మగుచున్నది. ప్రకృతిపురుషులొండొరులు విలక్షణు లనియుఁ బరమపురుషుఁ డారెంటికి విలక్షణుఁ డనియు నెఱింగినజ్ఞాని దేనిని నిందింపఁడు స్తుతింపఁడు గుణదోషములు పాటింపక ప్రవర్తించుచుండును. 344

తే. బ్రహ్మ మొదలుగఁ గీటము వఱకుఁ గలుగు
దేహసముదాయ మంతయుఁ దెలియ జన్మ
మరణములు గల వని యనుమానమునను
శ్రుతులవలనను దెలియంగఁ జొప్పడుఁ జుమి. 345

వ. అనిన నుద్ధవుండు దేహాత్మలు రెండును బరస్పరవిలక్షణము లగుటం జేసి యందు దేనికి సంసారము కలదు దేనికి లేదు సుఖదుఃఖానుభవము ప్రత్యక్షము గావున సంసారము లే దన నొప్ప దాత్మ స్వయంప్రకాశమానుఁడు కర్మము లాతని నావరింపవు జననమరణాదు లాతని నాశ్రయింపవు కావున నాయడిగినసంసారవిషయము దెలుపు మనిన నతం డతని కి ట్లనియె. 346

తే. ఆత్మకుఁ దేహసంబంధ మలరుచుండు
వఱకు దేహాదిరూపభావంబు లేక
పోయినం గాని యున్నట్లు పోల్చుకొనుట
గలుగుచుండును సుఖదుఃఖములు గల వని. 347

వ. ఆత్మకు దేవమనుష్యాదిరూపములు లేకున్నను వీరు నాబిడ్డలు వీరు నా కనుకూలురు వీరు నాకుఁ బ్రతికూలు రని విషయములు చింతించువారికి సంసారము నివర్తింప దాత్మకు దేవాదిరూపములు లేకున్న నున్నట్లు విషయములను జింతించుటం జేసి సంసారము విడక యనుభవింపవలసివచ్చుచున్నది. దుఃఖశోకభయహర్షాదులు ప్రకృతి పరిణామమై కాని దాని నాత్మగా భ్రమింపఁ జేయునహంకారము వలనఁ గలిగినవే కాని యాత్మకు స్వభావసిద్ధములు కావు. 348

—♦ యో గ సా ధ న సం ప త్తి ♦—

ఉ. యోగ మొనర్చుచున్నపుడు యోగికి యోగ మపక్వ మైనచో
రోగము లుద్భవించి ప్రతిరోధము గల్గఁ జేయు నప్పు డా
రోగ నివారణార్థము గురుల్ వరియించుచు వాయుధారణా
యోగముతోడ నాసనము లొప్పుగఁ జేయఁగ నొప్పు నందునన్.

సీ. వాతాదిరోగముల్ వదలి పోయెడు మంత్ర
తంత్రౌషధాదులఁ దాపములును
గ్రహబాధలును బన్నగప్రముఖోపద్ర
వములు వాపుకొనంగ వలయు నవల
నన్ను ధ్యానించుచు నాకీర్తనము చేయఁ
గామాధిబాధలు గదలి పోవు
నాచార్యు లగువారి ననుసరించుటచేత
దంభాదిదోషముల్ తరలి పోవు
తే. అట్లు సులభము లగునుపాయములచేత
సర్వవిఘ్నోపశాంతులు సమకుఱంగ
సలుపుకొనుచు శుభంబులు గలిగికొనుచు
యోగ నిష్పన్నతనుఁ జేసికోఁగ నొప్పు. 350

క. కొందఱు ముదిసిన దేహము
నం దగుమంత్రౌషధాదినూత్నోపాయ
స్పందములఁ బటుతరం బగు
చందమునన్ జేసికొనఁగఁ సాధ్యంబ యగున్. 351

తే. కాయసిద్ధికొఱకుఁ బరకాయసుప్ర
వేశములకు యోగాదు లవిజ్ఞు లాచ
రింతు్రు విజ్ఞులు వాని గర్హింతు్రు నేను
దిర మనెడువాండ్రపా ట్లని తెలిసి కొనుచు. 352

ఉ. ఎన్నఁటికైన నాశనము నే కొన నుండినమేని కిట్లు గా
నెన్నియొపాట్లు పొందుచు న దెంతయొ కాలము రిత్త సేయువాం
డెన్న వివేకులం జెవఁడు నేని తలంపగఁ బోవఁ డట్టికా
లోన్నతి యోగమంద విని యోగము చేసిన భాసురం బగున్. 353

తే. యోగు లీరీతికిం గాక యోగచర్య
లంద కాలముపుచ్చుచు ననవరతము

నన్నె శరణముగాఁ గొని యెన్నియేని
సిద్ధు లడుగెంచినం గొనఁ జేయరు మది. 354

వ. అనిన నుద్ధవుండు దేవా! యనాత్మయగువానికి నీయోగచర్య దుర్లభము గావున జనులు సులభముగా సిద్ధి నొందుమార్గము చెప్పు మనిన నప్పురుషోత్తముం డి ట్లనియె. 355

సీ. ఓమహాభాగుఁడా! నామహిమం దెల్పు
ధర్మముల్ తెల్పెదఁ దత్పరతను
వాని ననుష్ఠించువారికి మృత్యురూ
ప మగుసంసారదుఃఖము నశించు
వర్ణాశ్రమోచితవరకర్మము లొనర్చి
న న్ననుసంధించి నరుఁడు నాదు
ధర్మములం బొందఁ దనమనోవృత్తుల
నొప్పుగాఁ జెల్లించుచుండ వలయుఁ

తే. బుడమి నాభక్తు లుండెడుపుణ్యదేశ
ములను సేవింపవలయు వేల్పులును నరులు
నసురు లైనను నాభక్తు లైనవార
లెల్ల వారికి సేవ్యులం చెఱుఁగు మీవు. 356

తే. నృత్తగీతవాద్యంబులు నెఱపుకొనుచు
జనులు పదుగురు రాజోపచారములు మ
హోత్సవము లొప్ప యాత్రల నొనరుపంగ
వలయు నాప్రీతిఁ గోరినవార లయిన. 357

శా. ఆకాశంబు సమస్తభాగములలో వ్యాపించి యున్నట్లు న
న్నే కాలంబును సర్వభూతములలో నింపొందుచున్వాఁడ నే
నేకా కింతయు లేదు సర్వజగముం దే నంతరాత్ముండ నై
వాకో నొప్పుదుఁ గాన జంతుతతి సంభావింపఁగా నొప్పెడిన్. 358

వ. మఱియు విప్రునియందు విప్రస్వమపహరించినవానియందుఁ బుల్కసునియందునుం బాపయందును భూతహితరతునియందును మిడుం

గుఱునందును భూతద్రోహియందును శునియందును గోవునందును హస్తియందును నెక్కువతక్కువలు తలంపక సమదర్శి యైనవాఁడే పండితుఁ డని యెన్నంబడుచుండు. 359

చ. అతఁ డవమానముం గలహ మాగ్రహముం బరదూషణం బస
హ్యాతఁ గొనఁ బోవఁ డెప్పుడుసమస్తమునన్నుఁగ నెంచి మ్రొక్కుచుఁ
క్షితిఁ గలయెల్లవారికిని గింకరుఁ డే నని సంస్మరించుచుఁ
సతతము సత్యసంపదఁ బ్రసంసకు నెక్కు మదీయుఁ డయ్యెడిఁ. 360

తే. ఆత్మ దేహమ? లేక దేహమునకంటె
భిన్నమా ? జీవుఁడు స్వతంత్రుఁ డన్నఁ దగునొ
యస్వతంత్రుఁడు పరమాత్ముఁ డన్న నగునొ !
యనుచు సంశయ మందఁ డయ్యనఘుఁ డెలరు. 361

క. సర్వము బ్రహ్మాత్మకముగ
నిర్వహణముతోఁ దలంచి నిత్యము నన్నుఁ
ధూర్వహుఁ డయి సేవించిన
నిర్వాణము నొందు నతఁడు నిశ్చయ మరయఁ. 362

తే. భక్తిచేఁ గాని వైరమువలనఁ గాని
రక్తిచేఁ గాని పరిహాసరతులఁ గాని
నాపయిం జిత్తమును నిల్పి నన్నుఁ దలఁచు
వాఁడు మోక్షము నొందినవాఁడ యగును. 363

వ. అది యెట్టు లంటివే నాకగ్గింపుము కంసుండు తన్ను నేఁ జంపుదు నను భయముచేతను గోపికలు నన్నుఁ బొందుననురాగముచేతను శిశుపాలుఁడు నన్నుఁ జంపువిద్వేషముచేతను శాశ్వతానందసౌఖ్యంబు లనుభవించినవా రయి రని చెప్ప నొప్పుం గదా! మఱియు ననిత్యుఁ డగుమనుష్యుఁడు నిత్యుఁడు నిర్వికారుఁడు నగునన్నుఁ బొందుటకుఁ బ్రయత్నించుట బుద్ధిమల్లక్షణం బిదియె వివేకమిదియె విజ్ఞాన మిది దేవతలకుం బొందరానిద్ది తత్త్వము దీనిని నీకు విస్తరంబుగను సంగ్ర

హంబుగను సర్వంబు నెఱింగించితిని నీవు కలరూపునం దెలిసి ప్రవ
ర్తింపుము దీన నీకు సర్వార్థసిద్ధులుం జేకూరు నీకుఁ జేసినయీయాత్మో
పదేశము నెవం డెఱింగికొనునో వాఁడు విజ్ఞానదీపమునఁ బ్రతిబంధ
కంబు లెల్లఁ బటాపంచ లగునట్లు జేసి నన్నుఁ దెలిసి నాయందు
లగ్న మైనవాఁ డగుచున్నాఁడు. 364

సీ. నాయుపదేశమున న్నీకు బ్రహ్మము
తెలిసిన సాధనంబులను గూడి
దేహాత్మవిభ్రమమోహము సమసెనా?
తాపత్రయాజ్ఞానరూప మయిన
శోక మెల్లను దూలెనే కద యుద్ధవా!
నీవు దాంభికునకు నీచునకును
నాస్తికునకు మూర్ఖునకు దుర్వినీతున
కెఱిఁగింప వలవ దీయిద్ధతత్త్వ

తే. ముత్తములకు నితరులకు నుపకరించు
వారి కెఱిఁగింప వచ్చును వనితకైనఁ
దెలిసికొనుచిత్త మైనను దెలుప వచ్చు
నేమఱకు మీరహస్యము నెల్లనాఁడు. 365

క. దీనినిఁ దెలిసినవారికిఁ
దేనినిఁ దెలియంగ నిచ్చ దివురద యమృతం
బానినసోటికి మఱి యే
దేనియు నానంగ నిచ్చ యింతే నగునే. 366

వ. మఱియుఁ గర్మజ్ఞానయోగంబులందును దండధారణాదులందును ధర్మా
ర్థకామమోక్షంబులను పురుషార్థములందును దపోదానధర్మాదులందు
నెట్టిఫలంబు గలదో నాయందు నట్టిఫలంబును దాని కెచ్చిన ఫలంబు
నుం గలదు భక్తవత్సలుండ నగునే నట్టిభక్తుని సముద్ధరింతు నీవు
నాకుఁ బరమభక్తుండవు నీయాత్మ నాకు సమర్పించితివి నీభారంబు

నామీఁదన యున్నయది నీకు మత్సాధర్మ్య మొసంగ నుంటి నని భగవంతుం డగువాసుదేవుండు న్యాసోపాసనారూపం బగుజ్ఞాన యోగం బెల్ల ననంటిపం డొలిచి చేతి కిచ్చినట్లిచ్చినం బుచ్చుకొని హర్షించుచు నుద్ధవుం డానందాశ్రువులు రాలఁ జేతులు మోడ్చి నిలిచి కొంతసే పేమియుం బలుకఁ జాలక కొంతవడి కల్లనం దెప్పిఱిల్లి నట్లు ధైర్యంబు తెచ్చుకొని కుదురుపడి తన్నుఁ గృతకృత్యునిఁ గాఁ దలంచుచుఁ దనశిరంబు యదుపుంగవుని పాదారవిందంబులం దగిలించి లేచి ప్రణయంబున నవనతగాత్రుండై యి ట్లనియె. 367

— ♦ ఉద్ధవుఁడు కృష్ణుని వీడ్కొని పోవుట ♦ —

సీ. న న్నాశ్రయించిన నామోహ మనునంధ
కారము దరలనై కడల నంటె
నరుకసన్నిధిని శీతాంధతమసములు
నిలువంగ నేర్చునే నీరజాక్ష
విజ్ఞానదీప మీయజ్ఞునకు నొసంగి
జ్ఞానసంపన్నునిఁ గా నొనరిచి
తేను ధన్యుఁడ నైతి నితరచింత లవెల్ల
నెంచ నింతన పటాపంచ లయ్యె
తే. నీవు నారాయణుండవు దేవదేవ
ధర్మసంరక్షణార్థ మీధరణితలము
నందు దాశార్హుఁడై పుట్టి నందనంద
నుఁడవు నైతివి నీమాయ నుడువ నగునె. 368

వ. నీకు సంబంధుఁడ నైన న న్నాదరించి నాబంధంబు లెల్లం ద్రెంచి నా కిట్లు జ్ఞానోపదేశంబు గావించితి నీ కిదె నమస్కారము నిన్ను శరణుఁ జొచ్చితి నీచరణారవిందభక్తి నా కెన్నఁడును బాయకుండు నట్లు వరం బనుగ్రహింపు మనిన వైకుంఠుం డుద్ధవా! నీ విపుడు నాయాజ్ఞం జేసి నాయాశ్రమం బగుబదరికావనంబునకు నేగు మట నాపాదతీర్థ

మగు గంగానది స్నానాదులం జేసి నీపాపపంకిలం బడంచిపుచ్చుచు వల్కలధారివై వనంబునందలి కందమూలాదుల నాహరించుచు నాత్మానుభవంబునం జేసి శీతోష్ణాదులు సహించి యింద్రియంబుల నడంచి బ్రహ్మోపాసనంబు గావించుచు నన్ను స్మరింపుము కీర్తింపు మారాధింపుము సేవింపు మర్చింపు మవ్వలఁ బ్రకృతిమండలంబుల కవ్వల నిత్యముక్తులచే ననుభవింపఁబడుచుండు నన్నుఁ బొందఁగలవనిన నుద్ధవుం డతనికిఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించి విడువ లేక విడువ లేక కన్నుల ననుజ్ఞఁ గొని బాష్పకణంబులు రాలఁ గదలి తిరిగి తిరిగి చూచుచు నమస్కరించి వెడలిపోయి పురుషోత్తముఁడు చెప్పినచొప్పునం బ్రవర్తించి కొంతకాలంబునకుఁ బరంధామంబునొందె నని చెప్పినవిని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనియిట్లనియె.

ఉ. ఉద్ధవుఁ డగ్గతిన్ బదరికోర్వికిఁ బోయిన భూతభావనుం
డిద్ధచరిత్రుఁ డైనపరమేశ్వరుఁ డాహరి ద్వారకాపురిన్
సిద్ధమునీంద్రశాపమునఁ జేసి యదూద్వహు లెల్లఁ ద్రెళ్లిపో
బుద్ధి నెఱింగి తా నపుడు పోయినపోకడ లెల్లఁ దెల్పుమా. 370

క. మునిశాపంబునఁ దానుం
దనలోకముఁ జనెడునట్టితఱుణమునందున్
దనమేను విడిచి చనెనో
తనవెంటం గొంచుఁ జనెనో తాత్పర్యమునన్. 371

సీ. వేత్ర లెవ్వనిమేను వీక్షించి మరుబాఱి
కగ్గమై వలవంత నందుకొనిరొ
మౌను లెవ్వనిరూపు మానసాబ్జములందు
నిలిపి విడువ లేక నెగులుపడిరొ
యని నరురథ మెక్కి నపు డేనిఁ గని రిపుల్
హతు లయి తద్రూప మంద నైరొ
భువనమం దక్రూరుఁ డెవనిమేన్ గని మోహ
పరవశుఁడై జ్ఞానపరతఁ జనెనొ

తే. ఇంద్రనీలముతళ్కుల నీనుచుండు
నట్టిశ్రీకృష్ణవరమూర్తి యఖిలలోక
పావనము సర్వమోహనమై నెలసెడు
నట్టి దేమయి పోయెనో యకట కట్ట. 372

వ. అనిన శుకుండు. 373

చ. భువి దివి నంతరిక్షమునఁ బుట్టినదుశ్శకునంబులం గడున్
నవయుచు నున్నయాదవుల నందకపాణి భయంబు గొల్పుచున్
సవసవ గాఁగ నిట్లనియె నాప్రియబంధువులార నాశహే
తువు లివె కానవచ్చెడినిఁ దోరముగా మనద్వారకాపురిన్. 374

ఆ. ఒకముహూర్తకాల మిఁక నీపురంబున
నుండరాదు బాలు రువిద లిపుడ
కదలి చనఁగ వలయుఁ గలసి శంఖోద్ధార
మునకు ననుచు దెలిపె మురహరుండు. 375

క. మనము ప్రభాసంబునకున్
జని యుత్పాతముల శాంతి సలుపుద మచటన్
దనరు సరస్వతి ప్రత్య
క్కనకుం జను నట్టిదగుచుఁ గోవిదులారా. 376

ఆ. అచటఁ దానమాడి యభిషేచనములను
బుష్పపత్రములను బూజచేసి
దేవతలను మనము భావించుచుందము
దానధర్మములను దగ నొనర్చి. 377

వ. అని కృష్ణుఁడు చెప్పిన యదుపుంగవు లెల్లరు వల్లె యని చెప్పిన చొప్పున స్త్రీల నంపిపుచ్చి తారు తేరు లెక్కి ప్రభాసతీర్థంబునకుం జని స్నానదానాదు లొనరించి భగవంతు నారాధించుచు దైవము ప్రేరేపించుటం జేసి పిన్నలు పెద్దలు నా కెల్లరు మైరేయకమధ్యముం గ్రోలి రంత. 378

—♦ యాదవులు ప్రభాసతీర్థంబున నొండొరులు పోరి చచ్చుట ♦—

సీ. మైరేయకము ద్రావ మైమఱపుదయించె
సర్వాంగములకుఁ జంచలత వొడమె
త్రోసివేసెడునట్లు తూలు జనించెను
నుడికారములకు దుందుడుకు పుట్టె
నామ్రేడితము మాటలందు మాటికి నయ్యె
నంతలో ఘోషణ యతిశయిల్లె
వారిని వీరినిఁ బేరుకొనుచు వడి
వడిఁ బ్రలాపంబులు వాఁగ నొదవె
తే. స్వపరవిజ్ఞాన మంతయుఁ బదటఁ గలసెఁ
గంటఁ బడినట్టివారితోఁ గలహ మయ్యెఁ
నర్ధచంద్రప్రయోగము లదపు లంతఁ
జఱపులుఁ ముష్టిఘాతముల్ సంభవించె. 379

వ. ఇట్లు చిలికి చిలికి గాలివానయైనట్లు వారిలో వారికిం బెద్దపోరై
సముద్రతీరంబున నొకరి నొకరు చంపం బూని పెంపరం బగు క్రోధం
బున విజృంభించి కత్తులీటెలు విండ్లు బల్లెంబులు గుదెలు గదలు
దోమరంబులు భిందివాలంబులు కరవాలంబులు లోనగునాయుధంబు
లతో రథగజాశ్వాదులతో నొండొరుం దాఁకి వీఁకం బోరి పోరి
రపుడు ప్రద్యుమ్న సాంబాక్రూర భోజ సాత్యకి సుభద్ర గద సం
గ్రామజి త్సుమిత్ర సురథాదులు పెచ్చుపెఱిగినమచ్చరంబునం విచ్చ
లవిడిఁ గ్రచ్చుకొని పరస్పరప్రహారంబులు గావించుకొనుచు
మార్కొని పేర్కొని దాశార్హులు వృష్ణులు నంధకులు భోజులు
సాత్వతులు మధువులు నర్బుదులు మాగధులు శూరసేనులు విసర్జ
నులు కుకురులు కుంతులు లోనగుయాదవవీరు లందఱుం దలఁపడి
పుత్రులు మిత్రులు నన్నలు దమ్ములు దండ్రులు తాతలు గూఁతు
లుం గొడుకులు నొకరి నొకరు నొప్పు తప్పెఱుఁగక మాయా

మోహితులై యేటులాడుచు నాయుధంబులన్నియు వ్యయంబు లైనంత సముద్రప్రాంతంబున మొలచియున్న ముసలసముద్భవంబు లగు నేరక లం బెఱికి ప్రయోగించుకొని రవి వజ్రంబులై వారి హతంబుగావించె నిట్లు కొంతవడి కొండును మిగులనిచక్కి నక్క య్యంబు పరిస మాప్తం బయ్యె నయ్యెడ. 380

తే. నిజకులం బిట్లు మాయమై స్వజనుల నొగి
స్వజనులే చంపుకొనునట్టివార లగుచు
నాశనము నందె నపుడు కృష్ణప్రభుండు
తా నొకఁడు మాత్రి మిగిలె నాదారుణాజి. 381

—♦ బలరామకృష్ణులు వైకుంఠంబున కరుగుట ♦—

మ. బలరాముండు సముద్రతీరమున సంబద్ధాసనస్థుండు యో
గలసన్మూర్తియు ధ్యాననిశ్చలుఁడునై కన్పట్టె యొక్కింతలో
పల సంకర్షణమూర్తి తా నగుట నేవంరూపమర్త్యాకృతిన్
దొలఁగం ద్రోయుచునైజతేజమునయందుం జేర నేగె న్వడిన్.

ఉ. రాముఁడు దేహమున్ విడి విరాజిలుచున్ వినువీథినుండి తే
జోమహితస్వరూపమునఁ జూచుచు నుండ గమించుటల్ యదు
గ్రామణి కృష్ణుఁ డారసి కరంబు మనంబున సంతసించుచున్
సామములన్ బఠించుచు విశాలతలంబున సంచరించుచున్. 383

క. ఒకమఱ్ఱిచెట్టుక్రిందన్
సకలము మదిలోనఁ గొన్న సర్వేశ్వరుఁ డ
ట్లొకమానవాకృతిం గొని
యొకరుఁడ కూర్చుండె పూని యోగ యనురీతిన్. 384

సీ. పొగ లేనియగ్నినా దగదగ మని వెల్గు
దేహకాంతుల కడన్ దేజరిల్లఁ
బసపునిగ్గులఁ దేలుపసిడిపుట్టము మేన
వలెవాటుగా వ్రేలి వన్నె లీనఁ

ఎల్లతామర లట్లు తేజు మీఱినకన్ను
గవ మిఱుమిట్లను గనుచు నుండ
మకరకుండలకాంతి చకచకలాడుచు
గండభాగములందు గంతు లిడగ
తే. మణికిరీటము శిరమున మలయుచుండ
నాల్గుచేతులు గలఁ డయి నలిననాభుఁ
డెడమకా లుక్కుడితొడమీఁద నిడుకొని మఱి
చెట్టుక్రిందను గూర్చుండెఁ జేష్ట లుడిగి. 385

చ. జర యనువేటకాఁ డపుడు శౌరిని దూరమునంద చూచి చేఁ
దిర మటు లెఱ్ఱనై పయికిఁ దేరి కనంబడువామపాదమున్
జిఱుమెక మన్ భ్రమన్ ముసలశేషము ముల్కి నెసంగునమ్మునన్
గర మనురాగ మేరుపడఁ గాఁడఁగ నేసె రయం బెసంగఁగన్. 386

వ. అ ట్లేసి వాఁ డతిరయంబున నటకుం బఱచి వచ్చి చతుర్భుజంబులతో
నున్న భగవంతుం డగు వాసుదేవునిం జూచి తనచేసినయపచారమ్ము
నకుఁ దాన తనలోనం దహతహంపడుచుఁ బాదంబులం బడి ప్రాంజ
లియై యి ట్లనియె. 387

మ. అపరాధం బొనరించినాఁడను మహాత్మా! లేడి యన్ భ్రాంతి నే
నపమార్గంబున నుండి లోకజనకుం డైయున్నని న్నిట్లు పా
పపరీతాత్ముఁడనై యెఱుంగక వధింపం జాలితిన్ వ్యాధుఁడన్
గృప దళ్కొత్త ననుగ్రహింప వలె నన్ శ్రీవాసుదేవా! హరీ. 388

క. నిను స్మరియించినమాత్రన్
జనులకు నగుపాపసమితి సమయుఁ గదె జనా
ర్దన ని న్నెఱుంగఁ జాలక
యొనరించితిఁ బాప మిట్లు ప్రోవవె నన్నున్. 389

మ. ననుఁ బ్రోవం దలపోత నీమనమునన్ వర్తించునే నిట్లు త
ప్పు నిఁకన్ వేరికిఁ జేయకుండు నటు లేఁ బుణ్యంబునం బొందున

ట్లానరం జంపవె నన్ను నీకరుణ నేనో చచ్చి స్వర్లోకముం
గానఁ బోదుఁ భరియింపం జాల నిఁక నీగోదుఁ జగద్వల్లభా. 390

వ. భగవంతుం డాతని లేవ నెత్తి యి ట్లనియె. 391

పంచ. జరా! భయంపడంగఁ బోకు స్వాంతమందు శాంతి చే
కురంగఁ జేసి కొమ్ము నన్నుఁ గొట్టి తీ వటంచు నిఁ
గరంబు నల్గఁ జూతు నంచుఁ గాకు మిట్లు భీతి నీ
శరంబు నాదు నాజ్ఞ వచ్చి చావఁ జేసె న న్నిటుల్. 392

వ. దేవోపకృతిం గావించిననీ విపుడ నాయాజ్ఞంజేసి స్వర్గంబునకు నిర్గమింపు మనిన నతం డతని పాదారవిందములకుం బ్రణమిల్లి ప్రదక్షిణంబు గావించునంతలో నంతరిక్షంబునుండి దేవయానంబు వచ్చినం గని కిరాతుండు కృష్ణానుజ్ఞాతుండై విమానం బెక్కి దేవలోకంబునకుం జనియె నంతలోఁ గృష్ణసారథి యగుదారుకుండు పొలంబు లెల్ల నన్వేషించుచు వాడిపోయినతులసివాసనలం గూడినవాయువుం బట్టి కృష్ణుఁ డున్నచో టెఱింగి మఱ్ఱిచెట్టుక్రిందం గూర్చున్నమాధవుం గని రథంబు డిగ్గున డిగ్గ నుఱికి కన్నుల నశ్రువులు వెల్లువలై ప్రవహింప వడి వడి వచ్చి యడుగుఁదమ్ములు వ్రాలి యి ట్లనియె. 393

ఉ. నీచరణారవిందములు నేఁ గనకుండుట నాదుచూపు ల
య్యో చెడిపోయె గ్రుడ్డి నయి యుంటి నొకింతయు దిక్కు లేనియ
ట్లై చరియించుచుంటి మదియం దిపు డూఱట లేక యుండెడిఁ
జూచి కృపారసంబునను జూపుము నాకొకదిక్కు మాధవా. 394

ద్విపదము. అనుచున్నయంతలో నాదారుకుండు
కనుచుండ రథమును గరుడధ్వజంబు
మేఘపుష్పాదులు మెఱయునాయుధను
లాఘనశంఖచక్రాదులు దివ్వ
రని శబ్ద ముదయింప నాకస మంటె
చనెఁ గాంచి సూతుఁ డాశ్చర్యము పడఁగ. 395

వ. అంతలో శ్రీకృష్ణుండు దారుకుం బిలిచి సూతా ! నీ విటం దడయక ద్వారకకుం బోయి యదుపుంగవు లొండొరుం బోరి యెల్లరుం దెగిప్డుటయుబలరామనిర్యాణంబును నాస్థితియు బంధువులకెఱింగించి.

సీ. మీరు ద్వారక నింక మీఁద నుండగ రాదు
మునుఁగు సాగరజలములను నద్ది
దేవకియును వసుదేవుఁడు నాంధ్రుడును
నర్జునరక్షితు లగుచుఁ గదలి
పోవుఁ డింద్రప్రస్థపురమున కని చెప్పు
మీవు భాగవతార్థ మెలమిఁ దాల్చి
మద్భక్తియోగ మేమఱక రాగాదుల
యందు విరక్తుఁడై యుండు మనుచు

తే. నానతిచ్చిన దారుకుఁ డతనిని వల
గొనుచు మాటికి మ్రొక్కుచుఁ గనుల నీరు
నించు చెట్టకేలకు నిర్గమించె మ్రొక్కి
ద్వారకాపురమార్గము వట్టె యపుడు. 397

వ. అంత నక్కడకుఁ బార్వతీపరమేశ్వరులును బ్రహ్మయు నిందాదు లును బ్రజాపతులును బితృదేవతలును సిద్ధసాధ్యవిద్యాధరాదులును యక్షరక్షోగణంబులునుగిన్నరకింపురుషాదులునప్సరసలునుగృష్ణదర్శన లాలసులై తన్నిర్యాణంబు నిరీక్షించునిచ్ఛంజేసి విమానంబు లెక్కి వచ్చి వియత్తలంబున నాడుచుం బాడుచుఁ బూలు వర్షించుచు దుం దుభులు మ్రోగించుచు యోగేశ్వరుం డగువాసుదేవుం గీర్తించు చుండి రప్పుడు భగవంతుం డగుశ్రీకృష్ణుండు కన్నులు మూసికొని యోగం బనుసంధించి యోగాగ్నిచే నిజదేహంబు దహింపక దాని తోడన నెల్లరుం గనుచుండ మెఱపు మెఱసినతెఱంగున మెఱసి తన దివ్యధామం బగువైకుంఠంబున కకుంఠగతిం జనియె నపుడు పుష్ప వర్షంబు గురిసె దుందుభులు మ్రోసె వాసుదేవు ననుసరించి సత్యము ధర్మము ధృతియుఁ గీర్తియుభూమింబెడఁ బాసి చనియె నది యంతయుం

గనుచున్న దేవత లచ్చెరువడి మెచ్చుచు వచ్చినదారిం బట్టిచని
రని చెప్పి శుకుండు రాజుదిక్కు మొగం బై. 398

క. లీలామానుషవిగ్రహుఁ
డీలీల నటుండువోలె నిటు వేషంబుం
దాలిచి కర్జము దీఱిన
పై లలి విచ్చేసెఁ గాదె పార్థివముఖ్యా. 399

వ. ఆహా కృష్ణావతారప్రభావము. !! 400

సీ. మనుజుఁడై యమలోకమునకుఁ బోయినగురు
సుతునిఁ గైకొనివచ్చి యతని కిచ్చె
బ్రహ్మాస్త్రదగ్ధుని బ్రదికించె నినుఁ దల్లి
గర్భమునం దున్న కాలమందు
కాలకాలుం డైన కాలకంఠు జయించె
బాణాసురుని తోడి బవరమందు
వేఁటకానిం జరు వేఁడినంతన స్వర్గ
పురి కంచె మేనితోఁ గరుణఁ జేసి

తే. అట్టిభగవంతుఁ డగుకృష్ణుఁ డన్యు లెఱుఁగ
కుండఁ దనమేనితో మెర్మొకో యనంగ
మెఱసి పోవుట లబ్రనే మేదినీశ
వానిఁ గీర్తించువారికి వచ్చు ముక్తి. 401

వ. ఆకర్ణింపు మట్లు దారుకుండు ద్వారకకుం బోయి వసుదేవోగ్ర
సేనులపాదంబులం బడి బడిబడి యడలుచు రామకృష్ణులమరణం
బెఱింగించిన వారు శోకమూర్ఛితులై కృష్ణవియోగంబునకు విరవిరం
బోయి కొట్టుకొనుచు మఱ్ఱిచెట్టుకడకుం జనిరి దేవకీదేవియు రోహి
ణియు వసుదేవుడును రామకృష్ణదర్శనాభావంబున భావంబు చెడి
ప్రాణంబులు విడిరి. వృష్ణిసతులు తమతమపతులం గట్టుకొని చితుల
నారోహించి ప్రాణంబులు విడిచిరి. రుక్మిణి లోనగుకృష్ణభార్యలు
కృష్ణసంకీర్తనంబు చేయుచు గాలిం గలసిపోయి రర్జునుండు వచ్చి

కృష్ణవిరహంబు సైఁపలేక కొంతవడి దుఃఖితుండై గీతాశాస్త్రం బెఱింగినవాఁడు కావునఁ దన్నుఁ దా నూరార్చుకొని మృతు లైన వారి కెల్ల నుదకదానాదు లొసంగి హతశేషు లగువృద్ధస్త్రీలను దక్కనుంగలవారిం దోడ్కొని యింద్రప్రస్థంబునకుం జని యగ్రజున కంతయు నెఱింగించి తదనుమతంబున వజ్రుఁ డనువానికిఁ బట్టాభి షేకంబు చేసెఁ బదఁపడి నీపితామహు లైనధర్మరాజాదులు నిన్ను వంశోద్ధారకునిగా నిలిపి మహాప్రస్థానంబునకుం జనిరి శ్రీకృష్ణునిదివ్యావ తారకథలు వినినవారును బఠించినవారును గీర్తించినవారును బరమే శ్వరసాక్షాత్కారంబు గలిగి పరమపదంబు నొందుదు రని చెప్పిన శౌనకాదు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును.

ఏ కా ద శ స్కం ధాం త ము

మ. వసుదేవాత్మజుఁడై జనించియును వేపల్లెం యశోదాసతీ
ప్రసవం బో యన నై ప్రవర్ధిలి జగత్ప్రఖ్యాతి కై గోపికా
ప్రసవాస్త్రం డన నైనకృష్ణుఁడు కృపం బాలించి రక్షించు ను
ల్లసదాచారుని సాగిరాజజననాలంకారునిఁ సూరునిఁ. 403

మాలిని. సకలసుజనగేయుఁ సత్యసంస్పృష్టకాయున్
సుకలగుణవిభూషుఁ క్షోణిభృద్వంశభూషుఁ
సుకృతకృతసమాఖ్యుఁ సూర్యనారాయణాఖ్యుఁ
సకలశుభము లెచ్చఁ సాఁకు శ్రీకృష్ణుఁ డిచ్చఁ. 404

గ ద్య ము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు
ఏకాదశ స్కంధము.

శ్రీ శ్రీ శ్రీ

—:o:—

శ్రీరస్తు

# శ్రీకృష్ణభాగవతము

## ద్వాదశస్కంధము

—:o:—

క. శ్రీపదుఁడు కృష్ణుఁ డాత్మ
వ్యాపారేశ్వరుఁడు గాన నాతనిభక్తిన్
శ్రీపదునిఁ గృష్ణు దెలిచెడు
భూపతి నారాయణుండు పోలుపొందు నిలన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు యదువంశవిభూషణం బగుశ్రీకృష్ణుండు విష్ణుండై నిజధామంబు నొందినపదంపడి యేరాజవంశంబు వసుమతిం బాలించెం జెప్పు మనిన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

### —భవిష్యద్రాజాదులవృత్తాంతము—

సీ. వినుము బృహద్రథతనయుఁ డైనపురంజ
యుఁడు రాజ్య మేలుచునున్నయపుడు
శునకుండు మంత్రియై క్షుద్రితం బ్రభువును
మడియించి రాజ్యముఁ బడసి తనదు
కొడుకు ప్రద్యోతున కిడియె నతం డేలి
తనసుతుఁ డగుపాలకునకు నిడియె
పాలకుం డేలినపదపడి తత్సుతుం
డు విశాఖయూపుఁ డుర్విభుఁ డగును
తే. వానిపుత్రుఁడు జనకుఁ డవ్వానిసుతుఁడు
నందివర్ధనుఁ డుర్వికి నాథు లగుచు
నూటముప్పదియెన్మిదేం డ్లోటు లేక
శాశ్వపీభారము వహింత్రు కలియుగాది. 3

వ. అనంతరంబ శిశునాభుండు రా జగు నాతనికిఁ గాకవర్ణుండు పుట్టుఁ గాకవర్ణునకు క్షేమధన్వుం డతనికి క్షేత్రజ్ఞుఁడు వానికి విధిసారుఁడు వాని కజాతశత్రుఁడు వానిసుతుండు దర్భకుండు దర్భకునకు నజయుఁ డజయునకు నందివర్ధనుండు వానికి మహానంది సుతుండు శైశునాభాదు లగువీరు మున్నూటయఱువదివర్షంబు లీభారతవర్షం బేలుదురు. 4

దండకము. అంతన్ మహానందికిన్ శూద్రిగర్భంబునందున్ మహాపద్మపత్యాఖ్యనందుండు తా నందనుండై జనించుం దదాదిన్ నృపుల్ శూద్రతుల్యప్రచారుల్ ఖలుల్ ధర్మబాహ్యుల్ గన న్వృత్తు రుర్విన్మహాపద్ముఁ డాభార్గవుం బోలి శాసించెడిన్ వాని కష్టపుత్రుల్ సుమాల్యాదు లుర్విం బ్రపాలింత్రు నూఱేడు లీనందులన్ వారిఁ దొమ్మండ్రు భూమీసురుం డొక్కరుం డంత మొందించెడిన్ వారికిం బిమ్మటన్ మౌర్యు లీభూమిఁ బాలింతు రందాది నై చంద్రగుప్తుండు చాణక్యగుప్తుండు నై భాసిలున్. 5

సీ. ఆచంద్రగుప్తున కౌరసుఁడై వారి
సారుఁడు దీపించు క్ష్మాతలమున
వరుఁ డాతని కశోకవర్ధనుండు సుతుండు
వానికి సుయశుండు వరతనయుఁడు
సుయశస్సుతుం డయి సొంపొందు సంయుతుం
డతనికి శాలిశూకాహ్వయుండు
సుయశస్కుఁ డతనికి సోమశర్మ సుతుండు
శతధన్వుఁ డతనికి సుతుఁ డతనికి

తే. వరబృహద్రథుఁ డనియెడివాఁడు వీరు
పదుగురును మౌర్యు లీభూమి ప్రభువు లగుచు
నూటముప్పది యేడేండ్లు మేటివిభవ
మంది కలిలోనఁ బాలింతు రవనిజనుల. 6

తే. ఆబృహద్రథునిం జంపి యతనిసైన్య
విభుఁడు పుష్యమిత్రుం డనవెలయుశుంగు

డవనిఁ గైకొని యేలెడు నతనితనయుఁ
డగ్నిమిత్రుఁడు సుజ్యేష్ఠుఁ డతనిసుతుఁడు. 7

వ. సుజ్యేష్ఠునకు వసుమిత్రుఁ డతనికి భద్రకుఁడు వానికిఁ గళిందుఁడు వానికి ఘోషుఁడు వానికి వజ్రమిత్రుఁడు వానికి భాగవతుఁడు వానికి దేవభూతి వీరు శుంగులు పదుగురు నూటుపండ్రెండు వత్సరంబులు ధరం బాలింతు రంత శుంగుఁ డగు దేవభూతిం జంపి కణ్వవంశీయుఁడు నమాత్యుండు నైన వసుదేవుండు రాజ్యపాలనంబు గావించు నంత నతని పుత్రుం డగుభూమిత్రుఁడు వానిపుత్రుఁడు నారాయణుఁడు కణ్వాయను లగువీరు మున్నూటనలువదియైదు హాయనంబు లవని యేలుదురు. పిమ్మట కాణ్వుం డైనసుశర్మునిం జంపి వానిభృత్యుండు నాంధ్రజాతీయుండునగువృషలుండు నైన బలియనువాఁడు రాజ్య మేలు నవల నతనిభ్రాత యగుకృష్ణనాముఁ డధిపతి యగు వానిసుతుఁడు శాతకర్ణుఁడు పృథివీపతి యగు నవ్వల వానిపుత్రుఁడు పౌర్ణమాసుఁడు వానిసుతుఁడు లంబోదరుఁడు వానిసుతుఁడు శిబిలకుఁడు శిబిలకుని పుత్రుఁడు దండమానుఁడు వానిసుతుఁ డరిష్టమేఘస్వాతి వానికి దండమానుఁడు వానికి హాలేయుఁడు వానికి నరిష్టకర్మ వానికిఁ దిలకుండు వానికిఁ బురీషసేనుండు వానికి సునందనుండు వానికి వృకుండు వానికి సుదర్శనుండు చకోరుఁడు వానికి శివస్వాతి వానికి గోమతి వానికిఁ బురీమంతుఁడు వానికి వేదశిరుఁడు వానికి స్కందుఁడు వానికి యజ్ఞశీలుఁడు వానికి శితుఁడు నశితుఁడు శ్రుతస్కంధుఁడు యజ్ఞశత్రువు ననువారును యజ్ఞశత్రువునకు విజయుఁడు విజయునకు భావ్యుఁడు చంద్రబీజుఁడు సులోముఁడు ననువారు నీముప్పండ్రుదునృపతులు నన్నూటయేబదియాఱు హాయనంబులు భూమిం బాలించెద రంత. 8

సీ. ఆభీరు లేడ్వు రనంతరమున గర్ద
భులు పదుగురు కంకకులజులు పదు
నార్వుఱు పదపడి యవనులు నెనమండ్రు
బర్బరు లంతటఁ బదునలువురు

పిదప మురుండులు పదుమూవురును మౌను
లనువారు పదునొకండ్రును ధరిత్రి
పదినూర్లమీఁదఁ దొంబదితొమ్మి దేండ్లును
మౌనులు మున్నూటిపైన మూఁడు
తే. వత్సరములు కిలింకిలాపత్తనమున
ప్రభుతఁ గైకొని పాలింత్రు వసుధ భూత
నందుఁడును యమహారశిశునందులు మఱి
వానిభ్రాత యశోనంది ప్రభువు లపుడు. 9

ద్విపదము. వీరు నూఱేడులు వెనుక నాఱేండ్లు
వారికిం బుత్రులు పదముగుర్ బాహ్లీ
కులు పుష్యమిత్రుఁడు కోమరొంది వెనుక
మెలఁగు నాతనికి దుర్మిత్రుండు సుతుఁడు. 10

—◆ కలికాలధర్మప్రకాశిక ◆—

వ. మఱియు నేకకాలంబున సప్తాంధ్రులు సప్తకోసలులు వైదూర్యభావ్య నైషధమాగధాదిదేశంబుల కధిపతులైరి మగధాధినాథుం డైనవిశ్వస్ఫూర్జుఁ డనువిశ్వమూర్తి యపరపురంజయుం డనుప్రసిద్ధి గాంచి బ్రహ్మక్షత్రవైశ్య శూద్రవర్ణంబులఁ బుళిందయదుమద్రకాదిమ్లేచ్ఛప్రాయులం గావించి పద్మవతీపురియందు గంగాద్వారము మొదలు ప్రయాగంబువఱకుం గలమేదినిం బాలించు ననంతరంబ సౌరాష్ట్రవంత్య శాభీ రార్బుద మాళవాది రాజన్యులు శూద్రప్రాయులు నుపనయనరహితులై వ్రాత్యులై వర్తింతు రని మఱియును దయాధర్మసత్యవిహీనులై క్రోధమాత్సర్యంబులు గలిగి స్త్రీబాలగోద్విజాదుల వధింపం దలంకక పరధనపరస్త్రీపరులై రజస్తమోగుణగరిష్ఠులై యల్పబలు లల్పజీవులై యన్యోన్యవైరానుబంధబంధురులై దురంబులం గావించి హతు లగుదురు. అప్పుడు ప్రజలును బ్రభువులవేషభాషాదులఁ బ్రవర్తించుచుందురు. 11

సీ. కలిలోన విత్తమే కారణం బగు జన్మ
గుణకర్మముల గొప్పఁ గూర్చుటకును
బలమె ముఖ్యం బగు తెలియ ధర్మన్యాయ
ముఖ్యవ్యవస్థలు పొసఁగుపట్ల
నభిరుచియే హేతు వగు దంపతిత్వాగ
రిమకుఁ గులాదిధర్మములు కావు
వాక్చాతుర్యమే నేటి వ్యావహారికముల
సూత్రమే విప్రత్వపాత్రతకును
తే. చిహ్నమే యగు నాశ్రమసిద్ధి పెక్కు
వాక్యములు వెలిగ్రుమ్ముటే పాండితి యగు
స్వార్థపరతయె పురుషార్థ మనఁగ నగును
నిజకుటుంబావనమె దాతృ నిభృతగుణము. 12

తరువోజ. బలవంతుఁడగువాఁడు ప్రభు వయి ప్రజలఁ
బాలించుచుండుఁ బాపస్వాంతుఁ డగుచు
ఖలు లయి బ్రహ్మవిట్క్షత్రియశూద్ర
గణములప్రజలెల్ల కలుషాత్మ లగుచు
నిల మెట్టుచుం దిన నింతయు లేక
యెంతయు వంతల నేపఱి యుండ్రు
కలుగవు వానలు కాటకములును
గలుగుచునుండును క్ష్మాతలమందు. 13

మ. జ్వరబాధల్ మఱి దస్యుబాధలును క్షుద్బాధల్ మహావ్యాధులున్
ధరణీమండల మెల్ల నిండుకొని నిత్యక్షామమే భూప్రజన్
బరిపాలించును ముప్పదేండ్లు పురుషప్రాప్తాయువై యుండు నీ
శ్వరుఁ డన్నన్ గురుఁ డన్న భక్తి యెపుడున్ బ్రాపింప దెవ్వానికిన్.
సీ. కలిదోషమున నల్పకాయులై ప్రభవించి
వర్ణాశ్రమాచారపథము విడిచి

వేదధర్మంబుల విడనాడి పాషండ
ధర్మనిష్ఠాతులై ధరణిజనులు
చౌర్యపండితులు నసత్యప్రవీణులు
హింసారతులు మహాహేయకృతులు
నీచాతినీచము లై చనువృత్తుల
మెలఁగుచుఁ గుక్షింభరులు నగుదురు
తే. ఆలు మేకలఁ బోలెడు నాశ్రమములు
గేస్తుల గృహంబు లట్లగు నిస్తుశావ
ధులు తృణప్రాయము లగు మబ్బులు మెఱుములు
కలవి యగు రిత్తలై సద్మములు తలిర్చు. 15

—◆ కల్క్యవతారము ◆—

మ. కలి నీరీతి సమస్తముం జెడినదై కన్పట్టు నప్పట్టునన్
విలసత్సత్త్వగుణంబునన్ ధరపయి న్నిల్పంగ ధర్మంబు శి
ష్టుల రక్షింపఁగ దుష్టులం దునుమ విష్ణుం డిష్టవర్ధిష్ణుఁడై
వెలయున్ భూతలమందు శంబలము నా వెల్గొందుగ్రామంబునన్. 16

తే. విష్ణుయశుఁ డను బ్రాహ్మణవృషభునకును
గల్కిమూర్తి యనం బేరు గ్రాల నుదయ
మంది సురదత్త మాశుగహయము నెక్కి
ఖడ్గమునఁ దున్మి ధర నున్నఖలుల నెల్ల. 17

తరళము. అఖిలదస్యులు కూలిపోయినయంత భూప్రజ లెల్ల రా
సుఖద వైష్ణవదేహగంధముఁ జాఱిలాడి సమీరుఁ డా
నిఖిలభూతల మెల్ల నించుట నిర్గతేనసులై మహా
మఖ మొనర్చినయట్ల పీధ్రితమైఁ దలిర్తురు నల్గడన్. 18

క. అది మొదలు మరలఁ గృతయుగ
సదమలధర్మంబు సకలజగమునయందున్
బొదలెడుఁ బ్రజాప్రసూతియు
నది సాత్త్వికి యగుచు నయ్యెనంతటిమీఁదన్. 19

వ. ఇంకఁ గల్క్యవతారకాలోపలక్షణం బెఱిగించెద నవధరింపు మని మఱియును బుష్యనక్షత్రంబునఁ జంద్రసూర్యబృహస్పతు లేకపంక్తి గతులై యుండినంతఁ గృతయుగం బగు నీ కతీతానాగతవర్తమాను లగు చంద్రసూర్యవంశభవులగు భూభుజుల సంక్షేపంబుగం జెప్పెదం గాండవేయా! నీజన్మంబు మొదలుకొని రాజభోవునందాభిషేకంబు వఱకు నిఱువదియాఱువందలవర్షంబులు వినుము సప్తర్షులు నూఱేసి సంవత్సరంబు లొక్కొకనక్షత్రమున నుందు రిప్పుడు నీకాలంబున మఘ నాశ్రయించి యున్నారు మఘ నాశ్రయించియున్నప్పుడే భారతయుద్ధమును గృష్ణనిర్యాణమును జరిగినవి. కృష్ణనిర్యాణ మైననాఁడే కలిప్రవేశము నయ్యెను గలిప్రమాణము పంద్రెండువందల దివ్యవత్సరంబు లనఁగా నాలుగులక్షల ముప్పదిరెండువేల మానవ వత్సరంబు లగును. 20

సీ. నందాదిగాఁ గలి నాఁడు నాఁ డభివృద్ధి
గొని మహాఘోరమై కనఁగ వచ్చు
బ్రాహ్మణవైశ్యశూద్రకులంబు లారాజ
కులమువలెఁ ధర్మములను విడుచు
నక్కలి వేయిదివ్యాబ్దముల్ కడచిన
ప్పుడు కృతయుగచిహ్నములు దలిర్పఁ
బ్రథితవంశంబులవారు నశించినఁ
ఘనులపేరులు మాత్రి కాలుచుండు
తే. శంతనునియన్న దేవాపి చంద్రవంశ
భవుఁడు మఱియు నిక్ష్వాకువంశవరుఁ డైన
మరువు వీరిద్దఱును గలి వఱలునప్పు
డుందు రలకలాపగ్రామమందు నిచ్చ. 21

క. భగవత్ప్రేరితులై వా
రగు నసఁ గలి నైన కృతమునం దధిపతులై

మొగి ధర్మము లన్నిలువుచుఁ
దగ నేలుదు రెల్లభూమి దైవబలమునన్. 22

క. కలిలోనఁ గృతయుగాదులు
తలసూపుచునుండు నల్పతరములు గాన
వ్వలఁ గలియు నేఁగు నిట్టులు
లలిఁ గాలం బరుగు నోయిలాతలనాథా. 23

ఉ. రాఁ గలకీడుఁ జూచుకొన రా రిది నా దని కొట్టుకొంచు భూ
భాగము మాది మేము ప్రభువర్యుల మంచు జరింత్రు కాన రా
భోగశరీరముల్ తుదకుఁ బుర్వులు పర్వగ విట్టు బూదియై
బా గతిఁ బోవు నింతటన పార్థివతల్లజ! పల్కనేటికిన్. 24

శా. ఏతన్మాత్ర నశించిపోవ నగుచర్మ నీక్షింప నా మేనిపై
భూతద్రోహము చేసి యొద్దఫలముం బోఁగొట్టి సర్వంబు నా
దే తర్వాతను నాతనూజునిదె యం చెంతెంతొ చింతింత్రు స్వ
ప్నాతీతం బిదికా దటం చెఱుఁగ రారా! చెప్పఁగా నేటికిన్. 25

ఆ. స్వప్నతుల్య మంచు సర్వముం దలఁచుచు
నాత్మతత్త్వ మెఱిఁగి యఖిల మీశ్వ
రేచ్ఛ నైనమాయయే దీనిపై మోహ
మూను టొప్ప దంచు జ్ఞాని తలఁచు. 26

ఉ. ఎత్తఱి మాకు నే మె పురుఁ డెవ్వఁడు లే డని గర్వితాత్ములై
మత్తిలి యొద్దతో ననికి మార్కొని పోరుచు నుంద్రు నాకుఁ గా
మిత్తికి నాటబొమ్మ లని మీఁదు లెఱుంగ రటంచు భూమి తా
నత్తఱి నవ్వుచుండె మది నజ్ఞుల వారలఁ జూచి వింటివే. 27

మ. అరిషడ్వర్గ మ దింటిలోనికలహం బట్లుండ నీఁ దేశముల్
మఱి యా దేశము గెల్చి సర్వధరణిన్ మా బాహుపీఠంబునన్
ధరియింపఁ గల మంచు నెంచెదరు లోభస్వాంతు లవ్వా రయో
పరివర్తించెడు మృత్యువుం గెలనఁ బోల్పం జాల రేమందుఁ బో. 28

మ. మనువుం బుత్రులు తొట్టివారు మును ప్రేమం బొందియుం బాసి పో
యినభూమిం గొని యేలునాసకొయి దుష్టేహుల్ ఖలుల్ దానికై
తనతండ్రిం దనతమ్ముఁ గుజ్ఞు నయినం దండించి కైకో మనం
బునఁ బోరుల్ పచరించుచుం దొడుట నై పోర్మిత్రి నెంచం దయో.

వ. తొల్లి పృథువు పురూరవుఁడు మాంధాత సగరుఁడు గాధి భరతుఁడు నహుషుఁడు కార్తవీర్యార్జునుఁడు రాముఁడు ఖట్వాంగుఁడు దుందుభుఁడు రఘువు తృణబిందువు యయాతి శర్యాతి శంతనుఁడు గయుఁడు భగీరథుఁడు కువలయాశ్వుఁడు కకుత్థ్సుఁడు నలుఁడు నృగుఁడు హిరణ్యకశిపుఁడు వృత్రుఁడు రావణుఁడు నముచి శంబరుఁడు నరకుఁడు హిరణ్యాక్షుఁడు లోనగువా రెందఱో రాజాధిరాజులై భూమండలాఖండలులై సర్వముం ద్యజించి పోయి రని యెఱింగియు నశ్వరంబగు ప్రపంచమున మమత్వాభిమానములు గలిగి కన్నుం గానక యవిద్వాంసు లిట్లు ప్రవర్తించుట శోచనీయం బనినఁ బరీక్షితుండు.

—♦ కృతాది యుగధర్మ నిర్వచనము ♦—

ద్విపదము. కలియందుఁ బెంపొందఁ గలదోషములను
వెలలించుకొనుటకు వేనికి నేని
యలరునే సామర్థ్య మది యెట్టు లెట్లు
సలుపంగ వలయు నో సన్మునినాథ!
ప్రలయకల్పంబులపరిమాణములును
గలియుగాదుల కెన్నఁ గలప్రమాణములు
దెలియంగ నెంచితిఁ దెలుపు మనంగఁ
దెలిపె శుకుఁడు తేటతెల్లంబు గాను. 81

వ. కృతయుగంబున సత్యము దయ తపస్సు దానము నని ధర్మము నాలుగుపాదముల నడచు నప్పుడు సంతోషము కరుణ మైత్రి శాంతి దాంతి తితిక్ష ఆత్మధ్యానము సమదృష్టి యివి గలవారు కృతయుగంబున నుందురు త్రేతాయుగంబున నన్పృతము హింస యసంతోషము

విగ్రహము ననునధర్మపాదములచే సత్యదయాదిధర్మపాదములలో నాల్గవవంతు నశించును సత్య మసత్యముచేత దయ హింసచేతఁ దప స్ససంతుష్టిచేత దానము కలహముచేత నని యెఱుంగునది. అట్టి త్రేతాయుగంబునఁ బ్రజలు క్రియాతపోనిష్ఠులు నతిహింస లేనివారు నతిలంపటులు కానివారు ధర్మార్థకామము లను త్రివర్గము కోరువారు నగుదు రత్తఱి బ్రాహ్మణాధిక్య మించుక తగ్గును ద్వాపరయుగంబు నందు నధర్మపాదములచే ధర్మపాదములు నాలుగింటియందును సగము సగముగా క్షయించును. అందుఁ గీర్తికాములు మహాశీలురు స్వాధ్యాయాధ్యయనపరులు నాఢ్యులు కుటుంబవంతులు దృప్తులు బ్రహ్మక్షత్రియప్రధానులు నగుదురు కలియుగంబునం దధర్మపాద ములచే ధర్మపాదంబులు నాల్గవవంతుగ శేషించుఁ దుదకు క్షయించు నని మఱియును. 32

సీ. ఆయుగమందు దురాచారులును నిర్ద
యులు శూద్రదాసోత్తములును శుష్క
వైరులు లుబ్ధులై ప్రజ లుండెదరు రజ
స్తమములు తద్గుణక్రమము లరయఁ
గాలచోదితు లయి కానుచుందురు సత్వ
గుణ మాదియుగమున గణుతి కెక్కఁ
జేత రజోగుణోద్రేకము గల రయి
ప్రజ లొప్పుదురు ద్వాపరమున రజము

తే. తమము మిశ్రిత మయి యుండు దంభమాన
మత్సరాదులు కలరయి మహిఁ జరింత్రు
కలియుగంబునఁ దమమే ప్రబలమ యగుచు
దస్యుధర్మమునం బ్రజల్ తనరుచుంద్రు. 33

తే. దస్యుధర్మమున జనపదములు పేదలు
శ్రుతులు సతతపాషండదూషితము లగుచుఁ

ప్రజల భక్షింత్రు శిశ్నోదరపరు లగుచుఁ
గలియుగంబున రాజులై కడఁగువారు. 34

సీ. వటు లవ్రతులు శౌచవర్జితుల్ గృహమేధు
లరయ భిక్షాటనపరులు తాప
సులు సదా గ్రామవాసులు యతుల్ ధనలోలు
పు లయి యుండెద రట్టి కలియుగమున
హ్రస్వకాయులు మహాహారులు కటుకభా
షిణులు చౌర్యము మాయ ప్రణుతసాహ
సము గలవారు లజ్జ యనంగ నెట్టిదో
యెఱుఁగనివారు స్త్రీ లెసఁగుచుండ్రు

తే. మోసమునఁ గ్రయవిక్రయములు కిరాటు
లాచరింతు రెల్లరు నీచ మైనవృత్తి
మెలఁగుదురు నిర్ధనునిఁ బతి మెలఁత లిడుచు
భృత్యుఁ డుత్తమప్రభువును విడిచిపెట్టు. 35

ఉ. *తల్లినిఁ దండ్రినిన్ హితులఁ దమ్ముల నన్నల నక్కఁ జెల్లెనిన్
జెల్లెడుజ్ఞాతులన్ దెరలఁ జేయుచు సౌరతసౌహృదంబునన్
దెల్లముగాఁ ననాందలను దెల్పుచు స్యాలకులన్ గణించుచున్
గల్లలె జీవనంబుగను గ్రాలుచు నుండ్రు జనుల్ మహాకలిన్. 36

మత్త. సత్తపోజనవేషముం గొని సాధువుల్ బలె మెట్టు చ
త్యుత్తమాసన మెక్కి ప్రక్కల నుండ శిష్యు లధర్మవి
త్సత్తముల్ పరమోత్తమంబులు ధర్మముల్ వచియించుచున్
మొత్తముల్ ధనముల్ గ్రహింతురు పూరుషోత్తము లీయగన్. 37

తే. కఱవులం గర్శితు లయి మెక్కంగ లేక
గ్రాసవాసోవిభూషలు గైకొనంగ

---

* సౌరతసౌహృదంబు = సురతనిమిత్తస్నేహము; ననాంద = భార్యాభగిని; స్యాలకులు = భార్యాభ్రాతలు; అధర్మవిత్ = అధర్మము లెఱిఁగినవాఁడు.

లేక నడపీనుఁగులు పోలె లోకమందు.
జనులు వర్తింతు రక్కలిసమయమందు. 38

మ. ఒకకాచంబున కాసఁ జేసి తమము న్నన్నట్టిసద్భావ మిం
చుకయుం గొంచక త్రెంచి వైచి ప్రియులం జుట్టంబులన్ సూనులన్
సఖులన్ వృద్ధులఁ దల్లిదండ్రులను లేశం బైనఁ జింతింపఁ బో
వక చంపం గడకట్టియుందురు జనుల్ పాపిష్ఠ మౌనకలిన్. 39

చ. మరణము నొందువేళ నొకమాఱు దలంచిన మాత్రఁ బ్రాణికిన్
దురితము వాపి సద్గతులు తోఁపఁగఁ జేయుజగద్గురున్ మహో
త్తరవిభవాభిశోభితు సుదర్శనచక్రధరున్ రమామనో
హరు భగవంతు నచ్యుతు ననంతు భజింపఁడు పాపుఁ డక్కలిన్. 40

సీ. అఘములు ద్రవ్యదేశాత్మసంభవములు
కలికృతంబు లవెల్లఁ గడియలోనఁ
జిత్తస్థుఁ డగుపురుషోత్తముఁడు హరించుఁ
దలఁచినఁ గొలిచినఁ దగిలి వినిన
స్వర్ణమాలిన్యము వహ్ని తెఱంగున
హృదయస్థహరి వాపు నెల్లరుజలు
లో నున్నహరి శుద్ధి పూని చేసినయట్లు
జపతపంబులు చేయఁ జాల వెపుడు

తే. కాన సర్వవిధంబుల నోనరేంద్ర
హృదయకుహరంబునన్ హరిఁ బొదలఁ జేసి
కొనుము చా నుంటి వింతలోపునన నీకు
సర్వదోషము లుడుగు మోక్షమును గలుగు. 41

తే. కృతయుగంబున ధ్యానము త్రేతయందు
యజనపూజనముల ద్వాపరావసరము
నందుఁ బరిచర్యఁ గలియుగమందు విష్ణు
కీర్తనంబున సిద్ధించుఁ బూర్తము లవి. 42

—• యుగాదిప్రిమాణకథనము •—

వ. అని శుకుండు వెండియు నోపాండవేయా! నీకుఁ బరమాణ్వాది కాలంబు వక్కాణించితి నింక యుగమానంబులును గల్పలయము లుం దెల్పెద నవహితుండ వగుము చతుర్యుగసహస్రము బ్రహ్మ కొక్కదినం బగు నదియు కల్పము నందు సంకల్పసంభవు లై పదు నల్వురు మనువులు వారియనంతరంబున పగలు సెల్లి విధికి రాత్రి యగు నది దినప్రళయం బిదియు నంతియ పరిమాణంబు గలది యగు నీప్రళయంబున లోకంబులు విలయంబు నొందు నిది నైమిత్తికప్రళ యంబు నీప్రలయంబున విశ్వస్రష్టు శేషశయ్యం బవళించుఁ బరమేష్ఠికి రెండుపరార్ధములు కడచినంత సప్తప్రకృతులు లయంబు నొందు నిది ప్రాకృతలయ మిందు విఘాతము గలిగినంతఁ బ్రకృతివికార మగు నండకోశము నశించుఁ బర్జన్యుఁడు భూమిఁ నూఱేండ్లు వర్షింపఁ డపుడు ప్రజ లన్నము లేక యొకరి నొకరు భక్షించుచుఁ గాలప్రభా వంబున నుపద్రవంబులం జేసి క్షీణింతు రపుడు ద్వాదశాదిత్యులు సముద్రాదులం గలరసం బంతయు హరింతు రంతఁ బ్రలయవహ్ని సంకర్షణునిముఖంబునుండి పుట్టి మారుతసంయోగంబునఁ జెచ్చెపెఱిగి క్రిందు మీఁ దయినపాతాళాదిలోకంబు లెల్ల దహించుచు సూర్యా గ్నులప్రతాపంబున బ్రహ్మాండంబు లెల్ల భస్మావశేషం బగు నంతఁ బ్రళయవాయువు నూఱేండ్లకాలము సుడిగొట్టుచు బెట్టువీఁచు నాలో నాకాశమంతయు ధూమ్రమయం బగు నాపైఁ బుష్కలావర్తకంబులు నుఱుములతో మెఱుములతో నూరేండ్లు వర్షించు నపుడు బ్రహ్మాండ వివర మంతయు జలమయంబై యేకార్ణవం బగు ని ట్లుండ భూగుణం బగుగంధము నప్పులు గ్రసింప భూమి జలమందు లయించుఁ బిదప నపోగుణమగురసమును దేజస్సు గ్రసింప నారసము తేజస్సునందు లయించు నవలఁ దేజోగుణ మగురూపమును వాయువు గ్రసింప రూపగుణము లేని తేజస్సు వాయువునందు లయించు నంత వాయు గుణ మగుస్పర్శమును నాకాశము గ్రసింప స్పర్శము లేనివాయు

వాకాశమున లయించుఁ బిదప నాకాశగుణ మగుశబ్దమును భూతాది యనంబడుతామసాహంకారము గ్రసింప నది లయించు రాజసాహంకారము గ్రసింప నది లయించు రాజసాహంకారముతోఁ గూడిన సాత్త్వికాహంకారము జ్ఞానేంద్రియములను వానివృత్తులను గ్రసించు నిట్లుగ నహంకారత్రయమును మహత్తు గ్రసించు మహత్తు సత్త్వాదు లగుమూడుగుణములను గ్రసించుఁ గాలప్రేరిత మగునవ్యాకృతప్రధానము గుణములఁ గ్రసించు నపుడు కాలలయాదులఁ బరిణామము నొంద కుండు నదియు నింద్రియాదుల కవ్యక్తముగా నుండు నదియు నవ్యయంబును సత్త్వరజస్తమోగుణశూన్యంబును మహదాదివిరహితంబును జ్ఞానేంద్రియకర్మేంద్రియశూన్యంబును జీవులకుం బోలె స్వప్నజాగ్రదాద్యవస్థలు లేనిదియుఁ బంచభూతములు సూర్యుండు గాక యోగనిద్రం బొందు చందంబున నుండి లోకములలోపలను వెలుపల నుండి వికారములకు లోను గాక యాకసమువలె సర్వవ్యాపి యగు నదియు నగుఁ బరమాత్మస్వరూప మిట్టి దని వితర్కింప శక్యము కానిది జ్ఞానశబ్దవాచ్య మాద్యంతశూన్యమింద్రియాగోచర మవ్యక్తంబు నిత్యంబు జగత్కారణం బవ్యయంబు నగు నట్టిమహాతేజంబునందు సమస్తశక్తులు పరవశంబై లయించుచున్నవి యిది యాత్యంతికప్రలయంబు పరంతపా! ప్రలయంబులు నిత్యము నైమిత్తికము ప్రాకృతిక మాత్యంతికము నని చెప్పఁబడు నీభాగవతసంహిత యంతయు నవ్యయుం డగునారాయణుండు నారదునకుం జెప్పె నారదుండు కృష్ణద్వైపాయనునకుం జెప్పె నతండు నాకుఁ జెప్పె నేను నీకుఁ జెప్పితి దీని నవ్వల సూతుండు శౌనకాదులకుం జెప్పు నని శుకుండు పరీక్షిత్తు వంకం దిలకించుచు ని ట్లనియె. 43

—♦ శుకుండు రాజునకుఁ జావులేమి నెఱింగించుట ♦—

మ. అవనీనాథ! తలంప నీకు మరణం బాసన్నమై యున్నదం
చు వనంటం బడి యున్నవాఁడ వనుచుం జూపట్టుచున్నాఁడ వి
ట్లవునే నే ననునాత్మ యెల్లపుడు నిత్యం బౌట నద్దానికిం
దవునే చావు ఘటిల్లు నంచుఁ దలపోతల్ భ్రాంతి గా కింతయున్. 44

సీ. ఏను జచ్చెద ననునీయవివేకము
దిగవిడువుము నీకు దేహ మిద్ది
మొట్టమొదట లేదు చిట్టచివర లేదు
నడుమ వచ్చిన దిది నడుమన చను
నీకుఁ జావును బుట్టు లేకుండె ననుబుద్ధి
లేకుంట నీరీతి వీఁకఁ గుడుతు
కట్టెయం దగునగ్ని కన వే అయినయట్లు
మెయికంటె నీవు వే అయితి వెన్న
తే. నీవు నీశిరచ్ఛేదము నెఱుఁగుదు కల
నట్లె నీచావునుం జూతు నవల నీవె
దీన నీవును మేను వే ఱైనయట్లు
స్పష్టతరముగఁ దెలియంగ వచ్చుఁ గాదె. 45
క. మేను నశించినదానఁ
దానం గలయాత్మ కెపుడు నాశన మనుటల్
గానంగ లేనిమాటలు
గానంబడు నొందుమేను గడ కున్నది యై. 46
క. కావున నాత్మకుఁ బుట్టువు
చావును లే దనుచు నెఱుఁగఁ జను ఘటజలముం
దావృత మాకాశము తద
భావంబున నింగి గాన వచ్చుట లేదే. 47
ఉ. దేహమునందుఁ బొందుపడి తేజము గల్గి వెలుంగుజీవుఁ డా
దేహము వోవ వేఱొకఁడు దేహము నొందు ననశ్వరంబ సం
దేహము లే దొకింతయును దేహి నశింపఁడు పుణ్యభాజియై
శ్రీహరిలోనఁ జొచ్చు నని చిత్తమున న్వగ వీఁగి యుండుమా. 48
తే. మనము జీవునకుఁ గుణమయము దేహ
మును సృజించి దానికి హేతుభూతము లగు

పుణ్యపాపములం గర్మమును విమోహా
మును సృజించెడి బుధులును మోసపడఁగ. 49

తే. మాయచే మనోదేహకర్మములచేత
జీవునకుఁ గల్గుసంసార మీవిధమున
వానిసంపర్క మెడలినదాన జీవుఁ
డలరు నిష్కళంకుండయి యవనినాథ 50

చ. చమురును వత్తి పాత్రము కృశానుఁడు గల్గిన వెల్గు దీప మా
సముదయ మాఁగినన్ వెలుఁగఁ జాలదు సంసృతి యింద్రియార్థక
ర్మము లగునంతకాలమున మానకయుండెడు జీవు నంటి సం
గమ మది వోయినన్ వెలుఁగ గాఁ గలఁ డాతఁడు నిర్వికారుఁడై.

తే. మూడుగుణముల సంసర్గమునను జనన
మరణముల నొందుచుండెడు మానకాత్మ
యవి స్వతస్సిద్ధముగ దాని కలరఁ బోవు
దీని నెఱిఁగినమనుజుండు దిగులు పడఁడు. 52

తే. వ్యక్త మగుమేని కవ్యక్త మైనప్రకృతి
కది విజాతీయ మైనద ట్లగుటఁ దా స్వ
యంప్రకాశక మగుచు దేహంబుకంటె
భిన్న మై యవికార మై వెలయుచుండు. 53

చ. ప్రభువర! నీదుదేహమున భాసిలునాత్మను నాత్మచేతనే
పరిభవ మెసంగ లోఁ దెలియువాఁ డవు గ మ్మటు చేసి తేని నీ
కభయము గల్గుఁ దక్షకవిషానలకీలలు నీదునాత్మకున్
శుభము దొలంపఁ జాల వని శోభనమూర్తికి నీక తోఁచెడిన్. 54

శా. నేనే బ్రహ్మపదంబు బ్రహ్మమును నేనే యంచు నయ్యాత్మ సం
ధానంబుం బొనరించి ధ్యానపరత న్వర్తింతువే నంతలో
జ్ఞానానందమయుండవై కఱవఁగా జాజ్వల్యమానానలం
బై నాల్కన్ గదు క్రోయుచున్నఁ గనఁబో వాతక్షకుం గిక్షకున్.

వ. ఈశ్వరధ్యానానందపరుం డవగునీకు నుత్తమలోకంబులు సంప్రాప్తంబు
లగు నోరాజా! నీవు న న్నడిగినసర్వవిషయంబులు సావధానంబుగం
జెప్పితి మఱియు నేమి విన నెంచుచుంటివో చెప్పు మనినఁ బరీక్షిత్తు
శుకుండు చెప్పినభాగవతార్థసారంబు సర్వంబును విని తత్పాదమూలం
బునం బడి నమస్కరించి యి ట్లనియె. 56

సీ. ఈవు మహాత్ముఁడ వెఱిఁగించితివి నాకు
భగవంతునిం దెల్పుభాగవతము
నెంతయేని యనుగ్రహించితి సిద్ధార్థుఁ
డైతి నచ్యుతరూపుఁ డైననీవు
నాపాలిభాగ్యమై నన్ను రక్షించితి
నాపాపములవెల్ల రూపు మాసె
నానందమయుని బ్రహ్మము నీవు చూపఁగాఁ
జూచి చొచ్చితి నందుఁ జూడ కివియుఁ

తే. దక్షకునిభీతి నాలోనఁ దరలి పోయెఁ
జిత్తమీశ్వరునందు వసింపఁ జేసి
కామవాసనలం గోసి కంజనేత్రు
నందుఁ జిత్తము నిల్పి నే నుందు నింక. 57

క. నీనుడులఁ జేసి నాయ
జ్ఞానము సకలంబు వాసె జ్ఞానోపేతుం
డై నేను భగవదంఘ్రుల
మానసమున నిల్పుకొంటి మాన్యచరిత్రా. 58

వ. అనిన శుకుండు సంతసించుచు రాజుచే ననుజ్ఞాతుండై మునులంగూడి
యథేచ్ఛం జనియె రాజర్షి యగు పరీక్షితుండు పరమాత్మయందుఁ
దనయాత్మం బదిలంబు గావించి ధ్యానించుచు గంగాతీరంబునఁ బ్రాగగ్ర
దర్భలపై నుత్తరాభిముఖుండై కూరుచుండి సకలేంద్రియవ్యాపారంబు
లును నమయఁ జేసి దేహాభిమానముతో సర్వాభిమానములును

విడిచి మహాసమాధిస్థితుండై పరిశుద్ధముక్తావస్థం బొంది నిశ్చలుండై
యుండె నాసమయంబున. 59

—• పరీక్షిత్తు తక్షకదష్టుండై మృతి నొందుట •—

ఉ. శృంగివచఃప్రబోధితుఁ డశేషశరీరిభయంకరుండు దు
స్సంగుఁడు తక్షకుండు నృపచంద్రునిఁ జంపఁ దలంచి కార్యమే
సంగతిమై ఫలించు నని స్వాంతమునం దలపోయువాఁడమై
యుంగద నొందుచుం జనియె హాస్తిపురీవరమార్గగామియై. 60

వ. అయ్యవసంబునం గాశ్యపగోత్రజుం డగునొక్కవిప్రుండు నామంత్రప్రభావంబునఁ దక్షకాపవిద్ధుం డగుపరీక్షిన్నరేంద్రునిం బ్రదికింతు దానంజేసి నా కధికధనంబు సంప్రాప్తం బగు నని హాస్తినాపురంబునకుం బయనం బయి వచ్చువాని వృద్ధబ్రాహ్మణరూపుం డగుతక్షకుం డెదురుకొని నీ వెవ్వఁడ వెందుల కెందు వోవుచుంటి వనినఁ గాశ్యపుం డి ట్లనియె. 61

మ. విషవైద్యుం డను దక్షకుం డనువిషాన్వీతుండు నేఁ డిమ్మహా
విషయం బేలుపరీక్షితుం గఱచు నావిద్యాప్రభావంబునన్
విష మెల్లన్ హరియించి కాతు నలపృథ్వీనాథునిం దాన నా
తృషదీఱన్ లభియించు విత్త మనుబుద్ధిం జేసి నేఁ బోవుదున్. 62

వ. అనిన నతండునుం దనవృత్తాంతం బంతయుం జెప్పి తత్క్షణంబ తక్షకుండై.

క. ఎందులకుఁ బోవు దీనీ
మందులు మాంత్రికులును యంత్రమంత్రంబులు నా
యం దేమిసేయ నోపెదు
మందుఁడ వెనుకంజ వేయుమా కాదేనిన్. 64

క. ఈవటముఁ గఱచి నావిష
పావకఘోరార్చివలన భస్మ మొనర్తున్
దేవుఁడవై చాలితి వే
నావల బ్రదికింపు దీని నని కినుక మెయిన్. 65

వ. తక్షకుం డమ్మహావృక్షంబుఁ గఱచిపుచ్చుటయు నదియు నాక్షణంబు
నంద కాలి భస్మం బయ్యె నంతఁ గాశ్యపుండును. 66

ద్వి. ఆభస్మచయమంత నంతంతఁ జేర్చి
లోఁ భి నావరశక్తి లో నెంచు మంచు
నాభాను నెఱఁగి మంత్రానంతశక్తి
నాభద్రవృక్షంబు నట్లె పుట్టించె. 67

వ. తక్షకుం డతివిస్మితుండై మునీంద్రా నీమంత్రప్రభావం బత్యంతస్తోత్ర
పాత్రం బిది యెటనేర్చితని వాని నగ్గించుచు నాసరీసృపేశ్వరుండు తన
నీతికౌశలంబున నాతనితో సఖ్యంబు చేసి పరీక్షితుం డిచ్చుధనంబు
కంటె నేఁ గొన్నిమడుంగు లెక్కువ యిత్తుం గొనిపొమ్ము పరీక్షితుం
డమోఘ విప్రశాపవినిహతుండు గావున నట్లు కావలయు ననినం
గాశ్యపుండు ధనలోభంబునం జేసి వానివలనం బెద్దమొత్తంబు విత్తంబు
పుచ్చుకొని క్రమ్మఱి చనియె నంత నాతక్షకుండు నాగకుమారులఁ
గొందఱం బిలిచి మీరు తాపసులై పరీక్షితునికడకు ఫలంబులుఁ
బుష్పంబులుం గొనిపోయి యుండు నేను మీకొనిపోవుఫలంబులలో
నిమిడియుండెద ననినఁ గామచారు లగువా రట్లు గావింపఁ దక్షకుండు
చెప్పినట్లుచేసి ఫలంబునుండి వయికి వచ్చి పామై పరీక్షితుం గఱచి
పుచ్చె నంతలో నతం డాఘోరవిషానలంబునం గాలి భస్మావశేషుం
డయ్యె నది విని జనమేజయుండు దుఃఖించుచు మంత్రులమంతనంబున
ఋత్విజులం బిలువనంచి తనమనోరథం బెఱింగించుటయు ఋత్విజులు.

—♦ జనమేజయుండు సర్పయాగము చేయుట ♦—

క. నీకై దేవవినిర్మిత
మై కల దధ్వరవిధాన మది యొరు లేరుం
గైకొన లేదు పురాణము
లీకరణిం బలుకుఁ గాన నిది నీక తగుఁగా. 69

వ. అని సర్పసత్రవిధానంబు గల దని విన్నవించిన జనమేజయుం డది యట్టిదయేని యజ్ఞాయతనంబు నిర్మింపు డని యజ్ఞసంకల్పంబుగావించి సప్తతంతుతంత్రంబు నిర్వర్తించుచు స్వాహాస్వధావషట్కారంబు లెసంగ సర్పంబుల నాహ్వానంబు సేయుటయు నమ్మంత్రప్రభావంబున ధృతరాష్ట్రాదినానాకులప్రభూతు లైననాగకుమారులు ద్విత్రిదశశతశీర్షులు ద్విత్రియోజనప్రమాణాయామ్ములు పర్వతకాయులును బ్రహ్మాదండని పీడితు లై వేలు లక్షలు కోటులు నర్బుదంబులు న్యర్బుదంబులు ఖర్వంబులు మహాఖర్వంబులు కట్టలు గట్టుకొని బిట్టడరుచు నయ్యగ్నికుండంబులం గుప్పంగూలి రప్పుడు భయకంపితస్వాంతుం డై తక్షకుండు దేవేంద్రునిశరణుంజొచ్చిన నతం డతని కభయం బొసంగె. 70

శా. ఆలో హోత వచించుం దక్షకుఁడు రా డయ్యేఁ సురేంద్రేష్టుఁ డై
కా లూఁదెం దివమందు వాఁ డిలకు రాకం జేయఁడే నధ్వరం
బీలో నాఁ గెడు నా నరేంద్రుఁ డను నేమీ యింద్రుఁ డాజాల్మునిం
బాలింపన్ సమకట్టెనా మఱియు నాహ్వానంబు గావింపుఁడీ. 71

మ. మనకుం దక్షకుఁ డొక్కఁడే పగతుఁ డై మాతండ్రి ము న్నిగ్గొన
ర్చినవాఁ డాతని మంత్రశక్తి కలిమిన్ శీఘ్రంబ రప్పింపుఁ డిం
ద్రునితోఁ గూడ నతండు దుష్టునకు నండం దావు దా నిచ్చె నం
చని మీవల్కుట శిక్ష కర్హుఁ డనుచున్ స్వాంతంబునం దెంచితిన్. 72

మ. అనినన్ హోత సహేంద్రతక్షకముగా నాహ్వాన మంత్రం బొగిన్
ఘన తేజఃప్రథితప్రభావమున నాకర్షించి ఘూర్ణించుచు
న్వినియోగించిన నింద్రుఁ డాసనముతో విత్రస్తుఁ డై తక్షకుం
గొని యేతెంచి దివి న్మెలంగుచుఁ గనుంగొంచు న్నవం బార్తుఁ డై.

వ. ఉన్నసమయంబున బృహస్పతి రాజుతో నరేంద్రా! నీతండ్రిని దక్షకుండు కఱచి చంపె నని కోపంబున సర్వసర్పనాశనంబు సేయనొప్పదు వినుము. 74

తే. ఒకని నొక్కఁడు చంపంగ నోపు నొక్క
కర్మమునఁ జేసి సర్వముం గలుగుచుండు
తక్షకుఁడు కాటు వేయుటఁ దండ్రి చచ్చె
నని తలంచుట తగ దని యందు నేను. 75

ఉ. పుట్టినయప్డ మృత్యువును బుట్టిన దే యగుఁ బ్రాణికోటికిం
జెట్టఁ దొకండు చేయుటకుఁ జేయక యుంటకుఁ గర్త యా నటే
కట్ట కటా పరీక్షితుఁడు కాలము మూఁడుటఁ జచ్చెఁ ద్రాఁచు మేఁ
ముట్టుటఁ జచ్చె నంచుఁ దలపోయుట వెఱ్ఱితనంబు గాదొకో. 76

వ. కావున నింక నైన సర్పాధ్వరం బుడిగి శేషసర్పసంతతుల సంరక్షింపు మని చెప్ప జనమేజయుఁ డమ్మహర్షి వాక్యంబు విశ్వసించి సవసమాప్తి గావించె నక్కటా బ్రాహ్మణునికోపంబునఁ బరీక్షితునకును జనమేజయునికోపంబున సర్పంబులకు విపత్తు సంభవించినది లోకంబున నుత్తమత్వంబు నొంద నెంచినపూరుషుండు. 77

సీ. పరుసము లెవ రేని పలికిన సైఁచుకొ
నఁగ వలయును గాని తగదు దూర
నెవరిని నవమానదృష్టిఁ జూడఁగ రాదు
తనయవమానము దలఁప జనదు
ప్రాణికోటులు భగవంతుఁడే గావున
వేరితో వైరము వెంప రాదు
తా నోపినకొలంది మానవులకు నుప
చారముల్ సలుపుట సత్క్రమంబు

తే. వేదవాక్యము లీరీతి విస్తరించు
ననిన శౌనకుఁ డిట్లను వ్యాసశిష్య
వేద మెన్ని తెఱంగుల భేదములుగ
వ్యాసశిష్యు లొనర్చిరో పలుకు మనఘ 78

వ. అనిన సూతుం డి ట్లనియె. 79

తే. వినుము విధిహృదయాకాశమునను బొడమి
ప్రాణఘోషం బయిననాద మలర నయ్యె
నది శ్రవణరంధ్రములు మూయ నాలకింప
వచ్చు దాని నుపాసింప వచ్చు ముక్తి. 80

వ. దాని నుపాసించుటంజేసి యోగుల దేహేంద్రియాది మలంబెల్లఁ
జెల్లి జ్ఞానోదయంబై మోక్షసాధనం బగునాకర్ణింపుఁడు. 81

సీ. ఆనాదముననుండి యష్టకారోకార
ములు మకారంబును బుట్టె మూఁటి
సంయోగమునఁజేసి చనియె నోంకార మ
య్యాది యోగులకుఁ దెలియంగ వచ్చు
భగవంతుఁడును బ్రహ్మ మగుపరమాత్మున
కది వాచకం బయి యతిశయిల్లు
నెవఁ డీప్రణవనాద మేర్పడ వినునో వాఁ
డా దేవునియనుగ్రహమున కగును

తే. దాన వైదికలౌకిక మైనశబ్ద
రాసి సువ్యక్త మగు నది బ్రహ్మమునకుఁ
వేదవేదాంతముల కాది బీజ నుగుచు
నలరుచుండు సనాతనమై మునీంద్ర. 82

వ. అయ్యోంకారాక్షరమ్ములు మూఁటిచే మూఁడర్థములు ప్రకాశిల్లె
నక్షరత్రయంబును మూర్థములు ప్రకాశింపఁ జేయఁ బడు మఱియుఁ
బ్రాహ్మత్వ(వ్యాపక)త్వాదిగుణములంబ్రతిపాదించు నారాయణాదినామ
ములు తెలియం బడుచున్నవి భగవంతుఁ డాప్రణవమునుండి యక్షర
సమామ్నాయము సృజించె. 83

—♦ సూతుండు శౌనకాదులకుం జెప్పిన వేదభాగక్రమము ♦—

సీ. అయ్యాది దీర్ఘముల్ హ్రస్వము లంతస్థ
ములు నూష్మములు స్వరంబులును స్పర్శ

ములు నని యొప్పు నప్పుడు దేవుఁ డట్టియ
స్వరసమామ్నాయసంసర్గమునను
క్రతువుల వెలయింపఁ గలతలంపునఁ జేసి
వ్యాహృతుల్ సప్రణవంబు గాఁగ
నలర నాలుగువేదములు నాల్గుముఖముల
వెలలింపఁ జేసి యవ్వేదములను

తే. కొడుకులు మరీచిముఖ్యులకు న్వచించె
వైదికాచారనిరతులు వారు కశ్య
పాదులకుఁ బుత్రులకుఁ జెప్పి రామునులును
జెప్పి రపుడు శిష్యులకుఁ బ్రశిష్యులకును. 84

వ. ఇట్లావేదంబులు వారు వారు వారికి వారికి నుపదేశించుచు రాను రాను బ్రతియుగంబునందు ననుక్రమతంబుగా వచ్చుచు నవి ప్రసిద్ధిం గాంచె నప్పుడు ద్వాపరాదియందు. 85

సీ. క్షీణాయువుల్ జనుల్ క్షీణసత్త్వులు నతి
క్షీణబుద్ధులు నయి చెలఁగుచుంటఁ
బరమేశ్వరుఁడు వారిఁ గరుణ ననుగ్రహిం
పగ నెంచి ధర్మ మోమముగఁ దలంచి
సత్యవతీపరాశరులకు నంశాంశ
మునఁ జేసి వ్యాసుఁడై పుట్టి వేద
ములు యజు స్సామ ఋక్కులు నథర్వము నను
నాలుగు విధముల ననువుపఱిచెఁ

తే. తనదు శిష్యులఁ జదివించె ఘనులు వార
లవనిఁ బైల వైశంపాయ నాహ్వాయముల
జైమిని సుమంతు లనియెడినామములను
జెలఁగుచుండిరి లోకప్రసిద్ధి గాంచి. 86

వ. వారిలో బైలుండు బహ్వృచం బనుఋక్సంహిత వైశంపాయనుండు నిగదం బనుయజుస్సంహిత జైమిని ఛాందోగ్యం బనుసామసంహిత

సుమంతుఁ డథర్వాంగిరసం బనుబుక్సంహిత నభ్యసించి రందుఁ
బైలుండు తనసంహితను రెండుగావిభజించి తనపుత్రుఁ డయినయింద్ర
ప్రమితికిని శిష్యుఁ డైనబాష్కలునకుం జెప్పె బాష్కలుఁడు తన
సంహితను నాల్గుగా విభజించి శిష్యు లైనబోధ్య యాజ్ఞవల్క్య
పరాశ రాగ్నిమిత్రుల కొసంగె నింద్రప్రమితి తనసంహితను బుత్రుం
డగుమండూకేయున కుపదేశించె నతండు తనశిష్యుఁ డగువేదమిత్రున
కిచ్చెఁ వేదమిత్రుఁడు సౌభరి లోనగుశిష్యుల కుపదేశించె మండూ
కేయునిపుత్రుఁడు శాకల్యుఁడు తనసంహిత నైదుభాగములుగా విభ
సించి వాత్స్యుఁడు ముద్గలుఁడు శాలీయుఁడు గోబిల్యుఁడు శిశిరుం
డను నేవురచేతం జదివించె శాకల్యునిశిష్యుఁడు జాతుకర్ణుఁడు తనసంహి
తను దాని నిరుక్తమును నాల్గుగా విభజించి బలాకుఁడు పైంగుఁడు
వైతాలుఁడు విరజుఁడు ననువారి కిచ్చె బాష్కలునిపుత్రుఁడు
బాష్కలి యాయాశాఖలనుండి సంగ్రహించి వాలఖిల్య మనుసంహితం
జేసె బాలాయనుఁడు గార్గి కాసారుఁ డను వాలఖిల్య మధ్యయనము
చేసిరి బహ్వృచసంహితలు బ్రహ్మర్షులు వహించి రీఛందోవిభాగము
వినిన సర్వపాపంబులు సమయుచున్నవి. 87

—♦ యాజ్ఞవల్క్యుని చరిత్రము ♦—

సీ. ఘనుఁడు వైశంపాయనమునిశిష్యు లగుచర
కాధ్వర్యు లనువార లాదరమున
నధ్వర్యుశాఖను నధ్యయన మొనర్చి
రందున నధ్వర్యు లయిరి వారు
గురుబ్రహ్మహత్య వోఁ జరియించుటం జేసి
చరకు లై రాశిష్యవరులు వారిఁ
గాదని యాజ్ఞవల్క్యచ్ఛాత్రుఁ డటఁ బల్క
మ [illegible]
తే. [illegible]
నీ కొసంగినవిద్యను నా కిడు మనఁ

గ్రక్కున చనె విద్య నాతఁ డాకక్కున దినిరి
వారలందఱుఁ దిత్తిరిపక్షు లగుచు. 88

వ. దానం జేసి యజుర్వేదంబు తైత్తరీయంబు నాఁబడె యాజ్ఞవల్క్యుం
డట్లు చేసి గురునిల్లు విడిచి తపోవనంబునకుం జని సూర్యు నారాధించి
సూర్యాభిముఖంబుగ నిలిచి చేతులు జోడించుకొని యి ట్లని
ప్రార్థించె. 89

శ్లో. మహామాయామగ్నం జగదధికతేజఃప్రతిభయా
సముద్ధర్తుం దివ్యం ఖరకరసహస్రం వహసి భోః
త్రయీమూర్తే! నిత్యం త్రిదశవరసంసేవితపద!
ప్రభో! ప్రద్న! త్వం మా మవ వరద! వందారుసులభ. 90

దండకం. శ్రీపద్మినీప్రాణబంధో! త్రిలోకైకబంధో! కృపాపారసింధో!
త్రిమూర్తిస్వరూప! త్రయీమాతృకామంత్రరూప ప్రభో! సత్ప్ర
భాజాలదూరీకృతాజ్ఞానతామిస్ర! భాస్వత్సహస్రోష్ణభానో! భవ
ద్భాసమానప్రభావేణ భాతి ప్రపంచ స్సదా కాలరూపిన్! భవద్ద
ర్శనాభావతో దుర్దినం దర్శనా త్సర్వపాపప్రణాశో భవ త్యేవ దేవాది
దేవ! త్వయా భాతి చంద్ర స్త్వయా భాతి తారా స్త్వ యేదం సమ
స్తం సముద్భాతి నే త్యేవ తే బ్రహ్మవిష్ణ్వాదయో యాంతి పారం
పరం త్వద్గతా స్త వ్యజస్రం మునీంద్రా రమంతే సురేంద్రాది
దిక్పాలకా స్సేవకా స్సప్తనామాశ్వ! తే వ్యోమ్ని దుర్గే నిరాలంబ
మార్గే సదా సంచరన్ రక్ష నీమాన్ త్రిలోకాన్ సువృష్టిం విర
చ్యాంశుభి ర్య స్త్వమే వాసి ధాతా త్వమే వాసి విష్ణు స్త్వమే వాసి
రుద్ర స్త్వమేవాసి గోప్తా త్వమేవాసి శక్తి స్త్వమేవాసి సర్వం త్వమే
వాసి మే సద్గతి ర్బ్రహ్మనిష్ఠం భవద్దాసదాసానుదాసం భజ న్తం భజ
స్వాద్య మాం ద్వాదశాత్మ న్నమ స్తే నమ స్తే నమః. 91

సీ. నీబొజ్జపెట్టెలో నిఖిలవిద్యార్థముల్
భద్రంబులై యుండుఁ బరమపురుష!

నీమండలంబున నే మూఁడుమూర్తులు
నిలిచి సృష్ట్యాదుల నెఱపుచుండ్రు
నీ తేజమునఁ జేసియే తారకాగ్రహ
ములు ప్రకాశించెడు సలలితాత్మ!
నీయుదయంబుననే కదె కాలము
బ్రహ్మస్వరూపమై ప్రబలుచుండు

తే. నీదు సాక్షిత్వమే లేక నీదుపొడుపు
లేకయుండినఁ గర్మముల్ లేకపోవు
నీవు ప్రత్యక్షదైవమ వీవె సర్వ
రక్షకుండవు ని న్నెంతు నీక్షణమున. 92

వ. ఇట్లు స్తుతింప నశ్వరూపధరుండై ప్రభాకరుండు ప్రత్యక్షంబై య యాతయామంబు లనుయజుస్సంహిత లతని కిచ్చి చనియె నంత నతండు దానిం బుచ్చుకొని పదునైదుశాఖలు గా నొనరించి వానికి శతపథబ్రాహ్మణంబు గావించె వాజసనన్యస్తంబులు గావున నవి వాజసనేయంబు లయ్యె వానినిఁ గాణ్వ మాధ్యందిన ప్రభృతులు వాజసనేయశిష్యులు వారివారిపేళ్ళతో నధ్యయనంబు చేసిరి సామగుం గైనజైమిని పుత్రుఁ డగుసుమంతునకును బౌత్రుఁ డగుసుతన్వునకును నాసంహితలం జెప్పె సామవేదధరుం డైనసుమంతుఁడు తనవేదమునకు సహస్రశాఖలు నిర్మించి శిష్యు లైనహిరణ్యనాభి పౌష్టింజయులకును బ్రహ్మవిత్తముఁ డైనయావంత్యునకుం జెప్పి వారు ముగురకు నేనూ ర్గురు శిష్యులు వా రుదీచ్యులు ప్రాచ్యులు నాఁబడుచుండిరి పౌష్టింజయశిష్యులలో లోకాక్షి, జాగలి, కల్య, కుక్షి యనువారు చెఱి నూఱేసిసంహితలం గ్రహించిరి హిరణ్యనాభునిశిష్యుఁ డగుకృతుం డిరువదినాలుగు సంహితలను దనశిష్యుల కుపదేశించెఁ దక్షిణశాఖల నావంత్యుఁడు తనశిష్యులకుం జెప్పె నథర్వవిత్తగుసు మంతుండు తనసంహితను శిష్యుఁ డగుకబంధునిచేతం జదివించె

నతండు దాని రెండుగా విభజించి పథ్యుఁడు వేదదర్శి యనువారి కుపదేశించె నతండు శౌల్కాయని బ్రహ్మబలి మాద్గలుఁడు పిప్పలాయనుఁడు ననుశిష్యులకుం జెప్పె పథ్యునిశిష్యు లగుకుముద శునక జాజలి యతనిశిష్యులు బభ్రువు నాంగిరసుఁడు సైంధవాయనుఁడు ననెడిశౌనకునిశిష్యు లిరువురు నా రెండుసంహితల నధ్యనము చేసిరి వారిశిష్యు లగుసావర్ణ్యుఁడు లోనగువా రా రెంటి నధిగమించిరి మఱియు నక్షత్రకల్పుఁడు శాంతి కాశ్యపులు నాంగిరసులు నధర్వవేద శాఖను విభజించి వానిని బ్రవర్తింపఁ జేసె యధర్వణాచార్యు లని పేరు పొంది రింకఁ బౌరాణికులం జెప్పెద వినుండు త్రైయారుణి కశ్యపుఁడు సావర్ణి యకృతవ్రణుఁడు వైశంపాయనుఁడు హారీతుఁడు ననువీ యార్వురును వ్యాసశిష్యుఁ డగునాతండ్రి రోమహర్షణునివలనఁ బురాణసంహితల నధిగమించిరి. నేను పీ గందఱకు శిష్యుండనై యన్నియు నధిగమించితిని గాశ్యపుడు నేనును సావర్ణియుఁ బరశురామునిశిష్యుం డైనయకృతవ్రణుఁడును శుకునివలన మూలసంహితల నాల్గింటి నధిగమించితి మింక ఋషినిరూపితంబు లగు బురాణలక్షణంబులం జెప్పెద నవి. 93

— పురాణనామసంఖ్యాపరిగణనము —

సీ. సర్గము వృత్తి విసర్గము రక్షయు
వంశానుచరితము వంశ మంత
రమ్ము హేతువు నపాశ్రయమును సంస్థయు
ననిలక్షణమ్ము లీరైదు గలుగు
నందులోఁ గొన్ని మహాపురాణంబులు
కొన్ని యల్పము లగు నెన్న నందు
వంశము సర్గము వంశానుచరితము
బ్రతిసర్గమన్వంతరములు నాఁగఁ

తే. బంచలక్షణములు గల్గి యెంచఁ బడుచు
వేదవేదాంగవిధులను వివిధగతులఁ
దెలుపుఁ దల్లక్షము లెల్లఁ దేటతెల్ల
ముగ వచింతు వినుఁడి మహాపురుషులార. 94

సీ. ప్రకృతిగుణంబులై పరఁగుసత్త్వరజస్త
మములు మహత్తు నా నమరు నామ
హత్తుననుండి యహంకారమును దాని
వలన మహాభూతములును వాని
గుణము లింద్రియములు గణుతింపఁ బుట్టెడు
నాపుట్టుకయె సర్గ మనఁగ నొప్పు
మహదాదితత్త్వసమాహారమునఁ జేసి
జగ మగు నది య విసర్గమగును

తే. గామచోదనఁజేసి యీభూమి భూత
ములకు భూతము లాహారముగ నెసంగు
నట్టు లీశ్వరుఁడే వృత్తి యట్లు చేసె
నది విసర్గ మనంగ నాఖ్యను వహించు. 95

తే. యుగయుగమునందు శ్రీహరి జగములందుఁ
దిర్యగాదులు మర్త్యులు దేవతలు మ
హర్షు లాదిగ నావానియందుఁ బుట్టి
రక్షణము సేయుటే యొప్పు రక్ష యనఁగ. 96

వ. మనువు మనుపుత్రులు దేవతలు నింద్రులు ఋషులు హరియంశావ
తారములు గలది మన్వంతరము కాలత్రయమునం గలరాజులచరిత్రం
జెప్పుట వంశము వారివారివంశముల నిర్వహించువారిచరిత్రములం
జెప్పుట వంశానుచరితము విశ్వమునకు నిత్యము నైమిత్తికము ప్రాకృ
తికము నాత్యంతికము నను చతుర్విధ మగులయము సంస్థ యనంబడు
జీవులకర్మానుభవంబునకై పుణ్యాపుణ్యకర్మములు హేతువులు గా

సృష్టించుచుండె హేతువు నాఁబడు జీవుఁడు కర్మవాసనలతోఁ గూడి యున్నవాఁ డనియు నామరూపములు లేనివాఁ డనియుఁ జెప్పఁ జను నాశ్రయము లేకుండుబ్రహ్మమే సర్వాధార మనుటం జేసి యపాశ్రయము నాఁబడు నని వెండియు. 97

శా. ఏతాదృగ్విధలక్షణాన్వితము లై హేమించు నాయాపురా
ణాతిశ్రేష్ఠమహామణుల్ శ్రుతుల ముఖ్యార్థంబులం గల్గి నా
నాతత్త్వార్థసుబోధకంబు లగుచుఁ భాసిల్లు నంచుఁ బుధ
వ్రాతంబుల్ వచియించుచుండు జగతిం బ్రఖ్యాతపూర్వంబుగన్. 98

వ. ఆపురాణంబులు బ్రాహ్మము పాద్మము వైష్ణవము శైవము లైంగము గారుడము నారదీయము భాగవత మాగ్నేయము స్కాందము భవిష్యము బ్రహ్మకైవర్తము మార్కండేయము వామనము వారాహము మాత్స్యము కౌర్మము బ్రహ్మాండ మని పదునెనిమిది మఱియు నిన్ని యుపపురాణంబులుం గల యీపురాణసంహితల నాకర్ణించువారికి బ్రహ్మతేజోవివర్ధనం బగు ననిన శౌనకుండు సూతుం జూచి మృకండునికొడుకగుమార్కండేయునిఁ గల్పాంతమునందు నుండు నని చెప్పుదు రతం డేకార్ణవం బయి యున్నయప్పుడు మఱ్ఱి యాకునందుండి యున్నచిన్నిబాలునిం గాంచె నట తద్వృత్తాంతం బంతయు సవిస్తరముగఁ జెప్పు మనిన నతం డతని కిట్లనియె. 99

—♦ మార్కండేయమహాముని చరిత్రము ♦—

చ. కలఁడు మృకండుఁ డన్ముని జగంబున నాతనికిన్ సుశీల నాఁ
బొలఁతుక వార లిద్దఱునుఁ బుత్రులు లేమిని గంగచెంత ను
జ్జ్వలముగ శంకరుం గురిచి సాధుతపం బొనరించి సత్తమున్
సలలితకీర్తిఁ గాంచి రతిశాంతమతిం జిరజీవిఁ బుత్త్రునిన్. 100

క. కని సుతు మార్కండేయుం
డను పేరునఁ బిలుచుకొనుచు నతికుతుకమునన్
బెనుచుచు రా నాతండున్
దినదినమును దెల్లతెక్కె నెల నా నలరెన్. 101

వ. ఆమార్కండేయుండును బాల్యప్రభృతిశివభక్తిపరాయణుండు గావున నుపనయనానంతరంబునం బిత్రగ్నిశుశ్రూషాపరతుండును శివపూజా తత్పరుండునై వర్ణాశ్రమోచితతపస్స్వాధ్యాయసంపన్నుండై నైష్ఠిక బ్రహ్మచర్యవ్రతముం బూని జటిలుండును వల్కలధరుండునై వాఙ్ని యమంబునం బ్రవర్తించుచుండఁ బదునేను వర్షంబులు నిండ వచ్చె నప్పు డొకనాఁ డాకాశవాణి నీకుఁ బదియాఱవయే డరుగుదెంచు నాఁడు మరణం బగు నని పలికిన నతండు దానికి జడియక తండ్రి యనుమతంబున గౌతమ్యుత్తరతీరంబున నగుపుష్పగిరి కేగి యట నొకశివలింగంబు ప్రతిష్ఠించి నిష్ఠాగరిష్ఠుండై పరమతపంబు గావించు చుండె నాసమయంబున. 102

మ. గళగర్తప్రతిపాదితాస్యవివరోద్గాంతోగ్రనిధ్వాన ని
స్తులశబ్దీకృతరోదసీకుహరుఁ డస్తోకాగ్నిభీముగ్గదా
చలితప్రస్ఫుటహస్తుఁ డత్యధికదుష్టభ్రూయుగుం డుజ్వల
జ్జ్వలనజ్వాలనిభాభనేత్రముఖుఁ డావైవస్వతుం డుగ్రుఁడై. 103

తే. వచ్చి లింగంబు చెంగటఁ బెచ్చుపెఱుగు
భక్తిఁ దపియించునమ్మునిపట్టి నరసి
కంఠమందునఁ బాశంబు గట్టి దిగిచె
మునియుఁ గనువిచ్చి యట్టె గన్గొనియె నతని. 104

వ. కనుంగొని యధికసాధ్వసకంప్యమానకాయుండై గడగడలాడుచుం జడియక మృడుని నెడఁద నిడుకొని యి ట్లని ప్రార్థించె. 105

ఉ. ఎక్కడ నుంటివోయి పరమేశ్వర! గ్రక్కున రాగదోయి వీ
డెక్కడివాఁడొ కాని యొక డేఁకటిచీఁకటు లీను మేనివాఁ
డెక్కటిదున్న నెక్కొని యిక్కడకుం జనుదెంచి కంట నిన్
గ్రుక్కియ యున్న నన్ దిగిచెఁ గుత్తుకకుం దగిలించి పాశముల్. 106

♦ పుష్పగిరి=ఇది రాజమహేంద్రవరమున గోదావరీతీరమునందుఁ గల యొక చిన్నకొండ. దానిక్రింద నమృతకుండము గలదని పురాణములు చెప్పుచున్నవి.

వ. అని యనేకవిధంబు లగునుపనిషద్వచనంబులం బ్రస్తుతించి ప్రార్థించుచు.

తే. హర మహాదేవ శంభో యటంచు భక్తి
గదుర శివలింగమునఁ బడి కౌఁగిలించి
నెమ్మన మ్మీశునందు లీయమ్ము చేసి
హర మహాదేవ శంభో యటంచు నుండె. 108

వ. అప్పు డాశివలింగంబునుండి పరమేశ్వరుండు ప్రత్యక్షంబై పక్కనున్నపరేతరాట్టుం బాఱఁద్రోలి చావులేనివరం బొసంగి మార్కండేయు ననుగ్రహించి శివుం డంతర్ధానంబు నొందె నది మొదలా లింగంబు మార్కండేయేశ్వరనామంబునం బొలుపొంది సేవకుల కభీష్టంబు లొసంగుచుండు నపమృత్యుపరిహారం బగునామార్కండేయతీర్థంబున కొక్కింతదూరంబున గోదావరి యేడుపాయలై సాగరసంగంబు నొందె నిట్లు శివానుగ్రహంబు వడసి చిరంజీవి యయినయతండు తపఃస్వాధ్యాయసంపన్నుండై వేలకోలఁదివర్షంబులు వాసుదేవు నారాధించుచు మృత్యుంజయుండై నైష్ఠికబ్రహ్మచర్యంబు దాల్చి మహాయోగియై యోగేశ్వరుం డగులక్ష్మీశ్వరు నారాధించుచు నాఱుమన్వంతరములకాలము గడపె నంత నేడవమన్వంతరమున. 109

ఉ. తా. హాము. ఇంద్రుఁ డతనియోగనిష్ఠ నెఱిఁగి తత్త్వంబునన్
సాంద్రభీతి నొంది తనదుస్వఃపదంబు నొంది తా
నింద్రుఁ డగుట నిచ్చగించు నితఁ డటంచు పూనిరా
ట్చంద్రుఁ డామృకండుసూతిసత్త్వంబు గూల్పఁగన్ 110

వ. వానిచెంత కప్సరసలను గంతువసంతాదులం బుచ్చిన వా రతని యాశ్రమంబునకుం జని వానికురంగట లీలాపరిభ్రమణంబు గావించుచు నాడుచుఁ బాడుచు వివిధవిలాసంబులం దేలి రప్పుడు పుంజికస్థలి యనునచ్చరమచ్చెకంటికందుకకేళిం దేలుచుండ దానిపాలిండ్లవ్రేఁగున సన్ననినెన్నడుము వసియాడుచుండ దానికురులనుండి జలజలపూలు రాలె నప్పు డావన్నెలాడిచెఱుఁకుబేడిసలం బోలుకన్నుఁదోయి క్రీగంటి

పరిసారము లామునిపైఁ బాఱఁజేయుచు బంతివెంటఁ బరువు లెత్తు
టంజేసి యయ్యుర్వరుపడి మొలనూలు తెగి దానిసన్ననివలివంపుదువ్వలువ
వాయువశంబునం దొలంగినదయ్యె నయ్యెడ మదనుండు పదునుశరంబు
లామునిపయి నిగిడించె నిట్లు వారె న్నిన్ని తెఱంగుల తెఱంగు దప్పిన
చెయ్వులు చేసిన నవి వాని నింతయుఁ గదలింపఁ జాలనివయ్యె
నయ్యెడం జేయునది లేక వా రందఱుం వచ్చినమచ్చునం బోయి
యింద్రునకుం జెప్పిన నతండు విస్మితుండై తపోనిధిమహాత్త్వంబున
కచ్చెరువడి మెచ్చుకొనియె నక్కడ మార్కండేయుండు నిందురిని
చెర్యుకిం గినుక వహింపక తనలో నించుక మందహాసంబు గావించె
నిట్లుండ నొక్కనాఁడు. 111

——♦ మార్కండేయునకు నరనారాయణులు దర్శన మిచ్చుట ♦——

సువర్ణవృత్తము. నరనారాయణు లిద్దఱు నాలుగుచేతులతోఁ దగ
వరనీలామలమూర్తులు వన్నెలు చిన్నెలు గ్రాలఁగ
పరమానందకరాజిన వల్కలముల్ దొడి కొంగా
మరలం బోలినకన్నుల మాటికిఁ జూచుచు మానిగ. 112

తే. అరుత యజ్ఞోపవీతము లమర వేణు
దండము కమండలువులును దర్భముష్టి
పొలుపుమీఱఁగ మెయికాంతి పొలమునిండఁ
జేయుచును వచ్చి రమ్మునిరాయు కడకు. 113

వ. మార్కండేయుండును సాక్షాత్పుండరీకాక్షులం బోలె నున్నవారల
దప్పులం జూచి లేచి యెదురేగి దండప్రణామంబు గావించి నమస్క
రించి తోడితెచ్చి కృష్ణాజినాసనాసీనులం గావించి పూజించి తత్సం
దర్శనసంజనితానందకందళితహృదయారవిందుండై మేను గఱుపాఱఁ
గన్నుల నానందబాష్పములు గార చేతులు దోయిలించుకొని వినయ
వినమితగాత్రుండై తనపై నత్యాదరముం జూపు నారాయణుం
గాంచి గద్గదస్వరంబున ని ట్లనియె. 114

మ. నిను వర్ణింపఁగ నేర నీవు త్రిజగన్నిర్మాణముం జేయ వా
నినిఁ బెంపన్ విదళింపఁ జాలెదవు నీనిర్నిద్రశక్తిన్ జగ
జ్జను లెల్లం బ్రచరింతు రీ సత్త్వసుమనస్సందోహముల్ బ్రహ్మయున్
నిను సేవించి మెలంగుచుందురు జగన్నేతా నిన్నుఁ బ్రమోక్తాదన్.

క. ముల్లోకంబుల తాపము
లెల్లం దీర్చుటకు మీర లిద్దఱు జగమం
దిల్లిల నవతరించితి
రుల్లాసము వెల్లివిరియ నున్నతరీతిన్. 116

సీ. ఉదయస్థితిలయంబు లొనరింతు బ్రహ్మాచ్యు
తేశాఖ్యలం దాల్చి యిద్ధతేజ
సత్త్వరజస్తమస్సంభూతములు సర్వ
భూతముల్ నీమాయఁ బొదలుచుండు
నీలీల లీరీతిఁ గ్రాలు నీమూర్తిని
భజియించి ముక్తినిఁ బడయు జగము
విశ్వగురుండవు విశ్వేశ్వరుఁడవు నా
రాయణుండవు నీకు నంజలి యిడె

తే. ఈవు ప్రాణములందును హృదయమందు
దృగ్విషయముల నన్నింటఁ దెలియ నిండి
యుండినను నిన్నెఱుఁగ లేకయుండు జనుఁడు
నీదుమాయావిమోహితుఁడై దెస చెడి. 117

క. నినుఁ బరమాత్ముని గాఁ గను
గొనఁ జేయ నుపాయమగుచుఁ గొమరొందు శ్రుతుల్
మునివంద్య ! పుట్టె నయ్యవి
మనమున నీ వట్టె తలఁచుమాత్రనఁ దెలియన్. 118

తే. యోగసాంఖ్యతంత్ర ప్రముఖోద్యమముల
నిను హిరణ్యగర్భకపిల నిఖిలబుధులు

నరయఁ దబ్బిబ్బువడుచుండు రట్టి నీకు
వందనము చేయు చుంటి నోయిందిరేశ. 119

వ. మార్కండేయుం డిట్లు స్తుతింప నరసఖుం డగునారాయణుండు. 120

తరువోజ. నీతపస్స్వాధ్యాయ నియమసమాధి
సధ్యానభక్తి నిర్నిద్రవిజ్ఞాన
రీతుల కెంతయుఁ దృప్తిఁ గొంటి ముని
శ్రేష్ఠ ! మెచ్చితి నే గరిష్ఠుఁడ నగుటఁ
జేతమున నీకుఁ జెలువాఱుచుండి
చెప్ప నోవర మొండు చేకొను మిత్తు
మోతండ్రి యన మృకండూర్భవుఁ డప్పు
డోమ్మని యేటికో ళ్ళనరిచి యనియె. 121

ఆ. నాకు నీవు దర్శన మొసంగితివి చాలు
నింతకన్న వరము నేను గోర
నైన బ్రహ్మముఖుల నట్టిటు పడఁ జేయు
నీదుమాయఁ జూడ నేను వలతు. 122

వ. అని పల్క నారాయణుండు నవ్వుచు నట్ల యగుం గావుత మని నరునితో బదర్యాశ్రమంబునకుం జనియె మునియు విష్ణుమాయాదర్శన లాలసుండై నిజాశ్రమంబునందె యుండి సూర్యసోమాగ్నిజలభూవాయ్వాకాశాదులందు హరిస్వరూపంబు ధ్యానించుచు మానసికపూజ గావించుచుండె నిట్లుండి యొక్కనాఁడు భక్తిరసప్రవాహనిమగ్నుండై మానసికపూజ మఱచి భద్రానదీతీరంబునఁ గూరుచుండె నప్పుడు సంధ్యాకాలం బగుటయు. 123

—• మార్కండేయుండు ప్రళయార్ణవంబున విహరించుట •—

సీ. హోరుమంచును శబ్ద ముదయింపఁగఁ బ్రచండ
గతి గాలి పుట్టె దిక్తతు లవియఁగ
దానివెంటన నింగి దట్టమై నల్లని
మేఘసమూహంబు మేఱ మీఱెఁ

దఱు చయ్యె నుఱుములు మెఱుములు భయదమై
పొడకట్టె బిట్టుగాఁ బడియె వాన
కుండపోఁతలు గాఁగఁ గుతల మంతయు నిండ
వర్ష జలం బేచి వఱ్ఱువాఱె

తే. వాయువేగమునఁ నాల్గువార్ధు లపుడు
పెద్దపెద్దకరళ్ళతో భీషణమ్ము
లగుచు రోదసి యంతయు నావరించి
భూతముల నెల్ల మ్రింగెడుపోల్కి నుండె. 124

వ. ఇట్లు భూమి యంతయు జలమయ మగుటం జూచి భయంపడి మార్కండేయుండు చూచుచుండగా సముద్ర మల్లకల్లోలమై వాన వెల్లువం బొంగి పొరలి ద్వీపములు వర్షములు పర్వతంబులు లోనగు సర్వంబును ముంచి మాయించె నప్పుడు నింగియు నేలయు దిక్కులు విదిక్కులు నేమియుఁ గానరాని దయ్యె నయ్యెడ మార్కండేయుండు.

మ. విరియం బాఱ జటాకలాపము భయావిష్టుండు కష్టుండు నై
పరివేష్టించిననీరపూరములలో బభ్రామ్యమానుండుగా
కరిదిక్ భూరితిమింగిలంబులు మహాగ్రాహంబులుం బట్టుకోఁ
దెరువుం దెన్నును దోఁప కార్తుఁ డయి వర్తించెఁ భయభ్రాంతిమై.

తే. ఇట్లతఁడు మోహమును దుఃఖ మెక్కటిభయ
మొందుచుఁ జచ్చినట్టు లాయుదధిజలము
లందు మునుఁగుచుఁ దేలుచు నాత్రిపడుచు
నుండఁ బదివేలవర్షము లోలిఁ గడచె. 127

వ. ఇట్లుండ నొకప్పు డొక్కమిట్టుభూమియు దానిపై నొక్కమఱ్ఱివృక్షంబును దానిపై నీశాన్యభాగమందలి శాఖపై నొకపత్రంబుమీఁద శయనించినశిశువు తనదేహకాంతులఁ జీకట్ల విరియం జేయుచు లోచనగోచరుం డయ్యె నయ్యెడ నచ్చెన్నిపాపండు. 128

సీ. మరకత మట్లు శ్యామలవర్ణ మగుమేను
తామరపూవునాఁ దనరుమోము

సంకువునకు సరిసాటి యాకంఠము
సొగసైనముక్కును సోగకనులు
మోముపై నల్లాడుముంగుఱుగుఱులును
శ్రీకారములఁ బోలుచిన్నిచెవులు
పగడంబునకు సాటి యగుచిట్టిపెదవియు
సొగసైనపోగులు తొగరునవ్వు

తే. గలిగి చేతులచే నొక్కకాలు నోటఁ
బెట్టుకొని చీకుచుండె నప్పటునందుఁ
దనదుబడలిక లన్నియుఁ దరలిపోవ
నొడలు పొంగఁగ మునివాని కడకు నేగె. 129

క. అచ్చెరువడి ముని గనుచో
నచ్చెలుతనియూర్పుగాలి యది వచ్చి మునిన్
గ్రిచ్చుకొని దోమనుం బలెఁ
జెచ్చెర నాశిశువు నోటఁ జేరిచె నంతన్. 130

సీ. కడుపులోపలఁ జేరి కనియె మఱొక్కని
మఱ్ఱిచెట్టునఁ బండుమాణవకుని
వెలుపలఁ గాంచినజలధిలో నగునవి
గానరా విస్మయకలితుఁ డయ్యె
మఱియు నాతం డందు క్ష్మాతలంబును నింగి
చుక్కలు ద్వీపముల్ పక్కనములు
పత్తనంబులు వనుల్ పర్వతంబులు జనుల్
కనరాఁగ నాశ్చర్యకలితుఁ డగుచు

తే. నంతలో హిమవంతమునందుఁ దనదు
నాశ్రమంబును గనుచుండు నంతలోన
బాలునూరుపుగాలిచే బయట వచ్చి
తొంటిమఱ్ఱిని బాలునిఁ గంటఁ జూచె. 131

వ. కాంచి యాబాలునిఁ గౌఁగిలించుకొన నెంచి సమీపించునంతలోన నతండు సర్వాంతరాత్ముండు గావున నింతలో నంతర్ధానంబు నొందె

మార్కండేయుండును బ్రిలయార్ణవంబును మఱియు మటుమాయమై
తాను దనయాశ్రిమంబున నెప్పటివలె నొప్పుచున్నవాఁడై నారాయ
ణునిమాయ నెఱింగి యంతరంగంబున నతని శరణుఁ జొచ్చి ప్రార్థిం
చుచు సమాహితచిత్తుండై యుండె నాసమయంబున. 132

— మార్కండేయునకుఁ బార్వతీపరమేశ్వరులు దర్శన మిచ్చుట —

ద్విపదము. పరమేశ్వరుఁడు శూలి పార్వతితోడ
పరివారసహితుఁడై వరనంది నెక్కి
గగనమం దేగుచుఁ గాంచె నమ్మౌని
నగజయుఁ గని భక్తి ననియె నో దేవ
ప్రలయజలంబుల వటపత్రశయనుఁ
దిలకించివచ్చిన ధీశాలి యీతఁ
డితనిఁ గనిపోవ నెంతు నే ననుడు
నాతఁ డల్లా నని యవనిపై మునుల
ముత్తాత యగువానిపొంతకు రాఁగ
నత్తఱి గనుమూసి ధ్యానించుచుండు
వాఁడు గాన నతండు వానినిఁ గంటఁ
జూడకుండినయంత సోమశేఖరుఁడు
యోగంబున వానియుల్లంబు సొచ్చి
యోగిదృష్టికిఁ జూడ నొప్పె మెఱ్ఱనఁగ
మూఁడుకన్నుల వాని ముమ్మొనవాలు
వేడుకమెయిఁ దాల్చువిశ్వేశ్వరుని స
మీక్షణము పొనర్చి మిక్కిలి వెఱఁగు
నాక్షణంబున నొంది యంత సమాధి
విరమించి కన్నులు విప్పి లోకైక
గురుని విశ్వేశ్వరుఁ గొంతలోఁ జూచి
పార్వతీసహితుఁ డాపరమేశ్వరునకు
సర్వభావంబుల సాష్టాంగవంద

న మొనర్చి కృష్ణాజినంబున నిల్పి
క్రమ మొప్ప నర్చనల్ గావించి పలికె. 133

తే. నీవు లోకైకవేద్యుఁడ వీవె ఘనుఁడ
వీవె సర్వేశ్వరుండవు దేవదేవ
జగము లూఱటఁ బొందెడు స్వామ్యమునను
వందన మొనర్తు నీకు నే వామదేవ. 134

వ. ఇట్లు పరిస్తుతించినం బ్రసన్నుండై పన్నగాభరణుండు. 135

సీ. మూర్తిత్రియం బనఁ బొలుచుమువ్వుర మేము
వరదుల మీవు మావలన వరము
లందుము మాకు నేకాంతభక్తులు సను
దర్శను లగువారు దమశమాది
ధర్మముల్ గలవారు దామసవిరహితు
లగువారు తా మెప్పు డన్యు లైన
జనులు భిన్నుల మని మనమునఁ దలఁపరు
స్వీయులుగా నెంత్రు చిత్తమందు

తే. మేము మిమ్ము భజింతుము మీరు సాధు
జను లగుటఁ జేసి దర్శనమునఁ బునీతు
లుగ నొనర్తురు జనుల నోసుగుణధామ
మ్రొక్కుచుందుము మే మట్టిపూరుషులకు. 136

వ. ఇట్లు చంద్రశేఖరుండు ప్రసన్నుండై పలికిన మార్కండేయుండు వాని పాదారవిందంబులం బడి దేవా! లోకవిడంబనార్థము భగవంతులు మీ రిట్లు కావించుటయుం బలుకుటయు నుచితంబ ననుఁబోటివానికి మీపాదరేణువునకుం గలపాటి మేటితనంబునుం గలుగనేరదు మహాత్మా! నీవు లోకగురుండవు లోకేశ్వరుండవు బ్రహ్మమూర్తివి నీకిదే నమస్కారము. మహేశ్వరా! నాకు వరం బిత్తునంటివి భగవంతుఁడ వగునీదర్శనం బగుటకంటె మఱివరం బేమి కావలయు నయినను బూర్ణకామము వర్షించుచున్ననీవలన వరంబు వేఁడుచున్న

వాఁడ భగవంతు లగునీయందును నచ్యుతునియందును నిరంతరానంతి భక్తి గలిగియుండు నట్లు వరం బనుగ్రహింపు మనిన నచ్యుతుం డగు నారాయణుండు మహర్షీ ! నీకు నధోక్షజునియందును నాయందు ననంతం బగుభక్తి యగుం గాక. కల్పాంతము వఱకు నీవు ముదిమియు మరణము లేకుండుదువు గాక త్రికాలజ్ఞానమును బ్రహ్మస్వరూప జ్ఞానము నీకుఁ గలుగుఁ గాక బ్రహ్మవర్చసుల కీ వాచార్యుండ వగు దువు గాక యని వరంబు లొసంగి పరమేశ్వరుండు పార్వతీసహి తుండై యతండు భగవన్మాయను దర్శించినకథం జెప్పుకొనుచు నిజ స్థానంబునకు నిర్గమించె నిది మార్కండేయునిమహాప్రభావము. దీని నాకర్ణించినవారికి నిహపరంబులు కరతలామలకంబు లగు ననిన శౌన కుండు సూతుంగాంచి యి ట్లనియె. 137

—♦ సూతుఁడు పంచరాత్రాగమాదిక మెఱింగించుట ♦—

తే. పంచరాత్రాదితంత్రముల్ పరమతత్త్వ
ముల నెఱింగినవాఁడవు లలితమతివి
ని న్నడుగుచుంటిఁ జెప్పుము నీరజాక్షు
నవయవము లెట్లు ధ్యానింతు రది తెలుపుము. 138

వ. అనిన సూతుండు నేను గురునమస్కారంబు గావించి దేవదేవు నం గాదిదేవతల విభూతుల నారదాద్యాచార్యులవలనను బంచరాత్రా గమములవలనను దెలిసినచందంబునఁ జెప్పెద నాకర్ణింపుఁడు ప్రకృతి మహత్తు నహంకారము భూతపంచకము కాలము ననెడి తొమ్మిది తత్త్వములచేతను వీనివికారము లగు నేకాదశేంద్రియములచేతను బంచతన్మాత్రలచేతను బ్రహ్మాండము నిర్మింపఁ బడిన దని తెలియం దగు నందు ముజ్జగంబులు గలవు జగత్కర్త యగునప్పరమేశ్వరునకుఁ దలాతలాదులతోఁ గూడినభూతలంబు పాదములు దివి శీర్ష మాకా శము నాభి దివాకరుండు నేత్రంబులు దిశలు కర్ణములు పవనంబు నాశిక భుజములు లోకపాలురు మనస్సు చంద్రముఁడు భ్రూయుగంబు యముండుదంతములువెన్నెలలు రోమములు వృక్షములు శిరోజములు

వలాహకంబు లిట్టియవయవసంపత్తి గలభగవంతుఁడు కౌస్తుభరూప మగునాత్మజ్యోతినిఁ దాల్చుచున్నాఁడు జీవునిప్రభ యగుజ్ఞానమును శ్రీవత్సముగా ధరించును సత్త్వాదిగుణమయ మగుప్రకృతి యే వనమాల ఛందోమయంబు పీతవస్త్రంబు ప్రణవంబు బ్రహ్మసూత్రము సాంఖ్యయోగములు వేదములు మకరకుండలములు బ్రహ్మలోకము కిరీట మనంతుఁ డాసనంబు ధర్మజ్ఞానయుక్తం బగుసత్త్వము పద్మము ఓజోబలయుతం బగుమహాతత్త్వము గద జలతత్త్వము శంఖము తేజస్తత్త్వము సుదర్శనము గగనతత్త్వము ఖడ్గము తమస్సు చర్మము కాలము శార్ఙ్గము కర్మ మమ్ములపొంది యింద్రియమ్ము లమ్ములు మనమ్ము స్యందన మింద్రియవ్యాపారములు క్రియలు సూర్యమండలం బతనిదేవయజనంబు దీక్షాసంస్కారము పరిచర్య జ్ఞానాదిషాడ్గుణ్యము లీలాకమలము ధరించుధర్మము యశమును చామరవ్యజనములు వైకుంఠ మాతపత్రము ఋగ్యజుస్సామరూప మైనవేదము యజ్ఞరూపుం డగునతనివాహనము శ్రీదేవి మహాశక్తి విష్వక్సేనుఁడు సేనాపతి ద్వారపాలు రగునందాదు లణిమాదిసిద్ధులు తానే యయిన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు జాగ్రత్స్వప్నసుషుప్తిముక్తులీవాసుదేవాదిరూపంబు లందినభగవంతుం డగుహరి పరమేశ్వరుండు సృష్టిస్థితిలయమోక్షములఁ గలిగించుచుండు నిజమాయచే బ్రహ్మరుద్రాదిరూపములు దాల్చి సృష్టిస్థితిసంహారములు చేయుచున్నాఁడు కృష్ణ ! కృష్ణసఖ ! వృష్ణివృషభా ! భూద్రోహరాజవంశదహనా ! అపవర్గవీర్య ! గోవిందా ! గోబ్రాహ్మణార్తిహరా ! తీర్థశ్రవా ! శ్రవణమంగళ ! రక్షింపు మని ప్రాతఃకాలమున నీప్రకరణముం బఠించినవాఁడు బ్రహ్మజ్ఞాని యగు ననిన శౌనకుండు సూతుంజూచి.

—♦ ఆదిత్యాధిదేవతాప్రత్యధిదేవతాకథనము ♦—

సీ. శుకుఁడు పరీక్షిత్తునకుఁ జెప్పె రవిగొల్చు
గణము లే డనుచును గణన చేసి

ప్రతిమాస మెన్నో కర్మములను జేయించు
నని చెప్పె సూర్యాత్మకుని ముకుందుఁ
గాలిచెడిగణములకుం గలనామము
లవ్వారు చేయుకార్యములను వినఁ
నభిలషించుచు నుంటి మవి మాకుఁ జెప్పవే
యనిన సూతుఁడు వారి కనియె నిట్లు

తే. ఆదివిష్ణు వనాదియై యలరుప్రకృతి
చేత లోకపవిత్రకుండై తలిర్చు
సూర్యు నిర్మించెఁ గాన నాసూర్యుఁ డెల్ల
జగములఁ బరిభ్రమించెడు చక్షు వగుచు. 140

తరువోజ. అతఁడు లోకములందు నద్వితీయుండు
నాదికర్తయును సర్వాంతరాత్ముండు
హరి సూర్యదేహుఁడై యలరుచుండియు స
మస్తముల్ వేదక్రియల మూలమగుచు
వరపరాశరముఖ ప్రముఖులచేతఁ
బండ్రెండుగతు లైనవాఁడుగాఁ జెప్పఁ
బరఁగుచు నున్నాఁడు ద్వాదశాత్ముండు
తద్విధం బంతయుఁ దగ నెఱింగింతు. 141

వ. కాలము దేశము క్రియ కర్త కరణము కార్యము ఆగమము ద్రవ్యము ఫలము నని తొమ్మిదివిధంబుల హరి చెప్పఁబడునట్లు కాలరూపధరుం డగుసూర్యుండు చైత్రాదు లైనపండ్రెండుమాసములందు మాసమున కొక్కొక్కగణముగా లోకయాత్రార్థము సంచరించెడిని ధాత కృతస్థలి హేతి వాసుకి రథకృత్తు పులస్త్యుఁడు తుంబురుఁడు ననువారు చైత్రమునందు అర్యముఁడు పులహుఁడు నథౌజుఁడు ప్రహేతి పుంజికస్థలి నారదుఁడు కంజనీరుఁడు ననువీరు వైశాఖమాసమునందును మిత్రుఁడు అత్రి పౌరుషేయుఁడు తక్షకుఁడు మేనక హాహా రథస్వనుఁడు ననువారు జ్యేష్ఠంబునందును వరుణుఁడు వసిష్ఠుఁడు రంభ

సహజన్యుఁడు హూహూ శుకుఁడు చిత్రస్వనుఁడు ననువీ రాషాఢ మునందును ఇంద్రుఁడు విశ్వావసువు శ్రోత ఏలాపుత్రుఁడు అంగిర సుఁడు ప్రమ్లోచ చర్యుఁడు ననువీరు శ్రావణమునందును వివస్వం తుఁడు ఉగ్రసేనుఁడు వ్యాఘ్రుఁడు ఆసారణుఁడు భృగువు అను మ్లోచ శంఖపాలుఁడు ననువీరు భాద్రపదమునందును పూష ధనం జయుఁడు వాతుఁడు సుషేణుఁడు సురుచి ఘృతాచి గౌతముఁడు మాఘమునందును వర్జన్యుఁడు ఋతువర్చసుఁడు భరద్వాజుఁడు సేనజిత్తు విష్వుఁడు ఐరావతుఁడు ననువీరు ఫాల్గుణమునందును అంశుమంతుఁడు కశ్యపుండు తార్క్ష్యుఁడు ఋతుసేనుఁడు ఊర్వశి విద్యుచ్ఛత్రువు మహాశంఖుఁడు ననువీరు మార్గశీర్షమునందును భగుఁడు స్ఫూర్జుఁడు అరిష్టనేమి ఊర్ణుఁడు ఆయువు కర్కోటకుఁడు పూర్వచిత్తి యనువారు పుష్యమందును త్వష్ట జమదగ్ని కంబలా శ్వుఁడు తిలోత్తమ బ్రహ్మోపేతుఁడు ఋతజిత్తు ధృతరాష్ట్రుఁడు ఇషంభరుఁడు ననువా రాశ్వయుజమందును విష్ణువు అశ్వతరుఁడు రంభ సూర్యవర్చసుఁడు సత్యజిత్తు విశ్వామిత్రుఁడు మహాపేతుఁడు ననువారు కార్తికమునందు సూర్యు ననుసరింతు రివి యాదిత్యరూపుం డయినవిష్ణునివిభూతులు. 142

క. ఇవి సంధ్యలఁ బ్రతిదినముఁ
బ్రవిమలమతితోఁ బఠించువారిదురితముల్
సవిత వినాశనమై పోఁ
దవిలి పొనర్చెడిని భక్తతతిమీఁదికృపన్. 143

సీ. ఆదిత్యునిఁ మూఁడువేదంబుల స్తుతింతు
ఋషులు తల్లింగము లెసక మెసఁగ
గంధర్వు లాతని గానంబును బొనర్తు
రచ్చర లాడుదు రతనిమోల

నాఁగు లాతనిరథం బేగ దృఢంబుగాఁ
గట్టుదు రొగి వారికాయములను
యక్షులు నడపింతు రాతనిరథమును
వాలఖిల్యులు వానివలన నగుదు

తే. రిట్టు లాద్యంతరహితుఁడై యెసక మెసఁగు
విష్ణు వాదిత్యరూపుఁడై విష్టపములఁ
గల్పకల్పమునందు నిక్కరణి ద్వాద
శాత్ముఁడై ప్రోచుచుండెడు నని తెలియుఁడు. 144

—◆ భాగవతకథానుక్రమణిక ◆—

వ. అని సూతుండు వెండియు నీగ్రంథమం దుపదేశరూపము గం జెప్పం బడినధర్మములు లోనగునవి మఱియు నిట సంగ్రహంబుగఁ జెప్పు చున్నాఁడ నాకర్ణింపుఁ డిందు భగవంతుం డగుశ్రీకృష్ణుండు కీర్తింపం బడుచున్నాఁ డతఁడు సృష్టిస్థితిసంహారకారణభూతుం డగుపరబ్రహ్మ మీభాగవతమున వర్ణింపఁబడియె నిం దనేకోపాఖ్యానములు జ్ఞాన విజ్ఞానములను భక్తియోగమును బరీక్షిత్తుకథయు నారదవృత్తాంతం బును బరీక్షిత్తుశాపంబును బ్రాయోపవేశంబును బ్రాణత్యాగంబును బ్రహ్మనారదసంవాదంబును నవతారకథనంబును బ్రాకృత మగు మహదాదితత్త్వసృష్టియు విదురోద్ధవమైత్రేయసంవాదంబును బ్రలయ స్థితియు మహదాదిప్రపంచసృష్టియు బ్రహ్మపుట్టుటయుఁ గాలగతియు హిరణ్యాక్షవధమును స్వాయంభువ మనుచరిత్రంబునుశతరూపకథయుఁ గర్దమప్రజాపతికథయుఁ గపిలునియవతారంబును గపిలదేవహూతీ సంవాదంబును నవబ్రహ్మోత్పత్తియు దక్షయజ్ఞవినాశనము ధ్రువచరి త్రము పృథునిచరిత్రము భరతచరిత్రము ద్వీపసముద్రాదివర్ణనము పాతాలనరకస్థితియు దక్షదక్షపుత్రికలస్థితియు దేవదానవాదిజననం బును వృత్రాసురునివృత్తాంతమును హిరణ్యాక్షహిరణ్యకశిపులవధ యును బ్రహ్లాదునిచరిత్రంబును మన్వంతరములచరిత్రంబును గజేంద్ర

మోక్షంబును హయగ్రీవావతారంబును గూర్మమత్స్యనరసింహ వామనావతారంబులును క్షీరసాగరమథనంబును దేవాసురయుద్ధం బును రాజవంశకీర్తనంబు నిక్ష్వాకునిజన్మంబును నిలోపాఖ్యానమును సూర్యవంశకథనంబును సుకన్యావృత్తాంతంబును శర్యాతి కకుస్థ ఖట్వాంగ మాంధాతృ సౌభరి సగరులచరిత్రంబులును శ్రీరామచరి త్రంబును జనకులవృత్తాంతమును బరశురామునిచరిత్రమును దుష్యంత భరతవృత్తాంతమును శంతనునిచరిత్రమును యయాతికథయు యదు వంశంబును శ్రీకృష్ణావతారంబును గోకులప్రవేశంబును గృష్ణునిబాల క్రీడలు పూతనాదులయు శకటాసురతృణావర్తాదులయు సంహారం బును గాళియమర్దనంబును గోవర్ధనపర్వతోద్ధరణంబును గోపికాగీత లును అక్రూరాగమనంబును మధురాపురప్రవేశంబును గంసాదినిధనం బును గాలయవనసంహారంబును పారిజాతాపహరణంబును రుక్మిణీ కళ్యాణంబును బాణాసుర నరకాసుర శిశుపాల పౌండ్రక సాళ్వ దంత వక్త్రశంబరాదిసంహారంబును బ్రాహ్మణశాపంబును ముసలోత్పత్తియు వాసుదేవోద్ధవసంవాదంబును శ్రీకృష్ణనిర్యాణంబును యుగలక్షణంబు లును బ్రలయప్రకారంబును బరీక్షిత్తుదేహత్యాగంబును మార్కండేయచరిత్రంబును సూర్యగణవిభాగంబును లోనగుకథ లిందుఁ బొందుపఱుపఁబడియున్న యీమహాభాగవతపురాణంబు. 145

—♦ భాగవతఫలశ్రుతి ♦—

చ. పతితుఁడు మూర్ఖుఁడై చెలఁగువాఁడును గాని దురాత్ముఁడైన గా
నతగుఁడు గాని పాపి యగునాతఁడు గాని హరే నమోనమో
కరితురభుగధీశ! యంచు మతి గల్గి రమారమణుం భజించుచుం
సతము పఠించినం సకలసౌఖ్యము లాతని కబ్బు నిబ్బువిన్. 146

మ. భగవద్వైభవముం గనుంగొనినఁ జెప్ప న్విన్న సేవించినం
దగనారాధన మాచరించినను జిత్తస్థైర్యముం గల్గి పెం

పుగఁ బారాయణ మాచరించినఁ దమంబుల్ భానుబింబప్రభన్
దెగిపోఁ జొచ్చినయట్లు భక్తునఘముల్ తెల్లంబుగాఁ ద్రెళ్లెడున్.

క. హరినామకీర్తనంబులఁ
బరఁగనిగ్రంథంబు ప్రాణవాయువు లోనన్
బరఁగని దేహము కైవడి
ధరణిన్ వ్యర్థంబ యనుచుఁ దలఁపఁగ వలయున్. 148

మ. భువి నే సర్వపురాణసంహితలలోఁ బొల్పొందుమాహాత్మ్య మె
ల్ల వగం జూడ నొకెత్తు విష్ణుమహిమాలాపాంచితం బైనభా
గవతం బొక్కఁ డొకెత్త టంచెవఁడు వేడ్కం జేసి కీర్తించునో
నిమిషస్తుత్యుఁ డతండు పుణ్యగతులం దీపించు నెల్లప్పుడున్. 149

చ. యమకము చిత్రముల్ మఱియు నక్షరసాంఖ్యము పెక్కునీమముల్
క్రమమును గల్గి యుండియును గంజవిలోచనుఁ జెప్పకున్న గ్రం
థము లవి గాకిమూకకు ముదం బగుచుండెడు గాని యుత్తమో
త్తము లగు రాజహంసల కెద న్ముద మావహిలంగఁ జేయునే. 150

మ. నరపాత్రుం డగురాజచంద్రునకు ముల్ వ్యాసాత్మజుం డాశుకుం
డారిమం జెప్పినభక్తియోగమును బెంపొందంగ నెప్పట్టునన్
మరలన్ సంస్మరణం బొనర్చుటకు నీమాన్యప్రబంధంబు స
ద్గురువై సంసృతిబంధముల్ దొలఁచి కీర్తుల్ పూర్తముల్ గూర్చెడిన్.

సీ. ఎవ్వాని బ్రహ్మరుద్రేంద్రాదు లెల్లప్డు
స్తుతియించుచుందురో శ్రుతులఁ జేసి
యెవ్వాని సామగు లేవేళ సామగా
నంబునఁ గొల్తురో నయ మెసంగ
నెవ్వానిఁ గీర్తించు నేప్రొద్దు నుపనిష
త్తులతోడి వేదముల్ దొరముగను
నెవ్వాని యోగులు హృదయంబునం దిడి
కొని కొల్చుచుందురో కన కెదియును

తే. అట్టిసర్వేశుఁడు సురాసురార్చితుండు
దర్శనం బిచ్చు నేమహి దర్శనమున
నట్టిభాగవతంబు మహాపురాణ
మనుచుఁ గొలుచువారలకు సర్వార్థ మొదఁగు. 152

వ. ఇద్ది భాగవతప్రభావము మీఁ కింక మహాపురాణగ్రంథసంఖ్యయుఁ బ్రయోజనమును మాహాత్మ్యమును జెప్పెదను వినుండు బ్రాహ్మపురాణము పదివేలగ్రంథము గలది పాద్మ మేబదియైదువేలు వైష్ణవ మిరువదిమూఁడువేలు శైవ మిరువదినాలుగువేలు మహాభాగవతము పదునెనిమిదివేలు నారదీయ మిరువదియైదువేలు మార్కండేయము తొమ్మిదివే లాగ్నేయము పదియైదువేలనన్నూఱు భవిష్య మిరువది నాలుగువేలయేనూఱు బ్రహ్మకైవర్తము పదివేల యెనమన్నూరు లైంగ్యము పదునొకండువేలు వారాహ మిరువదినాలుగువేలు స్కాందము నూటయొక్కవేలు వామనము పదివేలు కౌర్మము పదియేడువేలు మాత్స్యము పదునాలుగువేలు గారుడము పందొమ్మిది వేలు బ్రహ్మాండము పన్నెండువే లిట్లు పురాణసమూహము నాలుగు లక్షల గ్రంథపరిమితి గలిగి యున్నది మహాభారత మితిహాసము రామాయణము కావ్యమై పురాణంబులఁ బరిగణింపం బడకుండె నీభాగవతసంహిత భగవంతుండు భవభీతుండై నిజనాభికమలమం దున్న నలువకుఁ బ్రసాదింపఁబడిన దిం దాదిమధ్యావసానము లెఱు వైరాగ్యాఖ్యానసంయుతంబును హరిలీలాకథామృతనిష్యందియుఁ గైవల్యైకప్రయోజనంబునై సర్వపాపంబుల సమయించునట్టి దగుచున్నది.

క. అని శుకుఁడు పరీక్షిత్తున
కును జెప్పినరీతి శౌనకుఁడు లోనగున
మ్మునులకు సూతుఁడు చెప్పెఁ
విన నీభాగవత మెల్ల వృజినము లుడుగుఁ. 154

స్కంధాంతము.

శా. లీలామానుషవిగ్రహుం డగుచు వేల్పుల్ తన్ను సేవింప నీ
భూలోకంబున నుద్భవించి దురితంబుల్ దూలిపోఁ జేసి వి
ద్యాలక్ష్మీవిభవాభిరాముఁ డగుచున్ దక్షోత్తుకృష్ణుం డిలన్
శ్రీ) మెచ్చం గరుణించి ప్రోచు నెపుడున్ శ్రీసాగిసూర్యప్రభున్. 156

మాలిని. కవిజనకృతిగేయున్ గావ్యకృద్భాగధేయున్
రవికులజనిసక్తున్ రామభద్రేష్టభక్తున్
సువిమలసదభిఖ్యున్ సూర్యనారాయణాఖ్యున్
భవిక మెసఁగ నేలున్ బాలకృష్ణుండు లీలన్. 157

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ప్రభుత్వాస్థానకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన శ్రీకృష్ణ భాగవతంబునందు సర్వంబును
ద్వాదశ స్కంధము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ






మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి:—1952.